రహస్య

# అనుపాన - వైద్య సర్వస్వం

(అనేక ఔషధాలు - విభిన్న అనుపానాలతో...)




- లోల్ల రామచంద్రరావు (రామ్‌జీ)

రహస్య

# అనుపాన - వైద్యసర్వస్వం

(అనేక ఔషధాలు - విభిన్న అనుపానాలతో...)

వైద్యశ్రీ **లొల్ల రామచంద్రరావు** (రామ్‌జి)
కాకినాడ వారిచే రచించబడి, ప్రకటించబడినది.




ప్రకాశకులు
రామ్‌జీ ఆయుష్ కమొడిటీస్
రామ్‌జీ ఆయుర్వేద
జగన్నాథపురం, కాకినాడ - 2
0884-2357788

email : lollaramji@gamil.com
web : www.ramjeeaayurveda.com

రహస్య
# అనుపాన - వైద్యసర్వస్వం
(అనేక ఔషధాలు - విభిన్న అనుపానాలతో...)

**వైద్యశ్రీ లొల్ల రామచంద్రరావు** (రామ్‌జి)
కాకినాడ.



ముద్రణ : 2017

వెల : 450/-

డి.టి.పి. & సెట్టింగ్ :
శ్రీసాయి విజన్ గ్రాఫిక్స్, కాకినాడ

ప్రకాశకులు
రామ్‌జీ ఆయుష్ కమొడిటీస్
రామ్‌జీ ఆయుర్వేద
మెయిన్‌రోడ్, జగన్నాధపురం,
కాకినాడ - 533 002
ఫోన్ : 0884-2357788

# ముందుమాట

బియ్యం ఒక్కటే ఏ విధముగా అన్నము, పులిహోర, దద్దోజనం, చక్ర పొంగలి తయారు చేసుకుని తిన్న తర్వాత ఏ విధంగా రంగు,రుచి, వాసన మొదలైనవి ఒకేరకంగా ఉండవో అదే విధముగా ఒక ఔషధం / మందు తీసుకొన్న వివిధ అనుపానాలు (తేనె, నెయ్యి, కషాయం మొ॥లగు)తో వివిధ రోగాలు తగ్గించుటయే ఈ అనుపాన వైద్యముఖ్యోద్దేశ్యము. ఈ అనుపానాలను అనేకమంది భిషక్ (ఆయుర్వేద వైద్యుల)ల అనుభవములని మరువరాదు. అలాగే శాస్త్రకారులు కొన్ని రకాల అనుపానాలను కూడా సూచించారు. అందువల్ల ఈ వైద్యం అనుభవ పూర్వక వైద్యశాస్త్రమని మరువ వద్దు. ఇది అన్ని రకాల వైద్యముల యందు కన్పించును. ఇప్పటి ఈ వైద్యం ఆయుర్వేద ఉపాంగ భాగముగా, ఆయుర్వేద శాస్త్ర విభాగముగా భావించాలి.

ఎందరో మహానుభావులు, ఆయుర్వేదోద్ధారకులు, మహాత్ములు, రచయి తలు, గ్రంధకర్తలు, ఫార్మాశీవారు, సమిష్టిగా సాంప్రదాయ వైద్యశాస్త్రమును ఇప్పటికీ వారి శాయశక్తులా ఆయుర్వేదమునకు ఇతోధికంగా సేవచేస్తూ ఆయుర్వేద వైద్య పురోభివృద్ధిలో పాలు పంచుకున్న, పాలుపంచుకొంటున్న ప్రతి ఒక్కరికీ పేరు పేరునా కృతజ్ఞుడను. ఎందువలనంటే నా యీ రచనకు వారు (ఇది వరకు) చేసిన సేవను గ్రంథస్తం చేసి నేటి మా తరానికి అందించిన వారవటం వారిని గూర్చి ఎంతరాసినా తక్కువే. అనుపానము గురించి చాలా తక్కువగా రాస్తూ చిన్న చిన్న క్యాటులాగులు, మెడికల్ ధెరప్యూటిక్ ఇండెక్సు ఇస్తూ ఎన్నో ఆయుర్వేద ఫార్మశీలు ఉన్నాయి. గొప్పగా మంచి సేవచేసిన కొన్ని ఫార్మాశీల జాడే లేకుండా పోయింది. ఇలా ఫార్మాశీల వారు కేవలం శాస్త్రీయ మందులను తయారుచేసి వాటిని ఎలా ప్రయోగిం చాలో ప్రయోగించటంవల్ల ఉపయోగ / హానిని, పథ్యా పథ్యాలు, మోతాదు, అనుపానాలు గురించి వారు ప్రచురించిన క్యాటలాగులు చూసినప్పుడల్లా నాకు కొంత అసహనం, కోపం, వచ్చింది. ఎందుకంటే ఒక కంపెనీవారు చేసిన మందు, వేరొక కంపెనీ వారు చేసిన మందు అనుపాన, వ్యాధులలో తేడా. ఇలా నేను 1911 నుంచి నేటివరకూ గల దాదాపు అన్ని కంపెనీల క్యాట లాగులు ఒకచోట రాస్తే బాగుండును కదా అనుకున్నాను. కాని ఆ విషయ మును ఆయా కంపెనీల వారు కొన్ని మందులు వారి స్వంత అనుభవ యోగాలను కూడా వ్రాసుకున్నారు. కొందరైతే ఏ గ్రంథములోనిదో కనీసం

వ్రాయలేదు. మందు ఎలా తయారు చేసారో తెలియకుండా మందును ఏవిధంగా, ఏ అనుపానముతో వాడాలి? అని ఆలోచించి శాస్త్రీయ గ్రంథము లలో ఉన్న ఔషధాలు దానికి సంబంధించిన అనుపానాలు పథ్యాపథ్యాలను గూర్చి కూర్చి వ్రాయటానికి చాలా శ్రమపడ్డాను. చివరకు సర్వేశ్వరుని కృపవల్ల నేటికి నా ప్రయత్నం నెరవేరింది.

ఇక ఈ గ్రంథములో అనుపానము గూర్చి వ్యాసాలు, ద్రవ్య విజ్ఞానం, భైషజకల్పం, పరిభాష, లాంటి అనేక విషయాలు ఇందు చర్చించటం జరి గింది. ఈ పుస్తకం వైద్యులకు మంచి గురువులా ఉపయోగపడుతుందని నా ఆశ. ఇందులో మాకు(నాకు) సంబంధించిన అనుభవ అనుపానాలు మొదలై నవి చేర్చాను. అంతేగాక, రోగానుసారం, ఔషధానుసారం అనుపాన పథ్యా పత్యాలు ఇవ్వటం వల్ల గ్రంథాన్ని పూర్తిగా చదివితేగాని పూర్తి నిర్ణయం తీసుకోరాదని నా మనవి. అంతేగాక వైద్యేతరులు ఈ పుస్తకములోని యోగ ములను, అనుపానాలను పెద్దలను సంప్రదించివాడుట మంచిది. ఎందుకనగా ఇందు భస్మాలు, రసౌషధాలు, విష, ఉపవిషాలు కలసిన అనేక మందులను గూర్చి ప్రస్తావన రావటమే. కావున వైద్యునకు అత్యూహం పనికిరాదు. నిదానం అవసరము. నిదానంగా వ్యాధినిర్ధారణ చేసి సరైన అనుపానం, పథ్యాపథ్యం మోతాదును నిర్ణయించుకో గలిగితే ప్రతీ వైద్యుడు ధన్వంతరియే.

ఈ నా చిరు ప్రయత్నంలో అన్నిరకాలుగా రచనా సహకారం అందించిన **డా॥హేమ గుడివాడ** బి.ఎ.ఎమ్.ఎస్. వారికి, **గౌ॥శ్రీ డా॥ జి.పి. ప్రసాద్** (విజయవాడ) గార్కి, **గౌ॥ వైద్య పమ్మి సత్యనారాయణ శాస్త్రి** (విజయవాడ) గార్కి , **గౌ॥ డా॥ సుబోష్** (ఆర్.ఆర్.ఐ. విజయవాడ) గార్కి, మిత్రులు **గౌ॥ శ్రీ పి.వి. చరణ్ దాస్** (విశాఖపట్నం) గార్కి, పబ్లిషర్ మిత్రులకు, ఫార్మశీలవారికి, ఈ పుస్తకంను డి.టి.పి చేసిన **శ్రీసాయి విజన్ గ్రాఫిక్స్** వారికి, మిత్రులకు కృతజ్ఞుడను.

నా రచనలను ఆదరిస్తున్న మీరు ఈ రచననూ ఆదరిస్తారని ఆశిస్తూ న్నాను. ఇందు ఏమైనా పొరపాట్లు దొర్లినా, నా దృష్టికి తీసుకువస్తే మలి ముద్రణలో సవరించగలను. అనుమతి లేకుండా మందులు వాడి అపాయం కొని తెచ్చుకోరాదని, ఇందుకు రచయిత, పబ్లిషర్స్‌కు ఎట్టి సంబంధం లేదని నా మనవి. పురాతన శాస్త్రాలు అంతరించకూడదనే నా ప్రయత్నాన్ని ఆశీర్వదిస్తాని ఆశిస్తూ...

– **రామ్‌జీ...**

## సంప్రదించిన గ్రంథాలు

1. అష్టాంగ హృదయం
2. అష్టాంగ సంగ్రహం
3. భావప్రకాశిక
4. భేళ సంహిత
5. చక్రదత్త
6. చరక సంహిత
7. హరిత సంహిత
8. కశ్యప సంహిత
9. రసరత్న సముచ్ఛయము
10. శార్ఙ్గధర సంహిత
11. సుశృత సంహిత
12. వంగసేన సంహిత
13. అనుపాన కల్పవల్లి
14. అనుపాన తరంగిణి
15. అనుపాన ఫలదీపిక
16. అనుపాన మంజరి
17. అనుపాన కల్పతరు
18. అనుపాన దర్పణమ్
19. అనుపాన చింతామణి
20. అనుపాన రత్నాకరము
21. భైషజ్య రత్నావళి
22. బసవరాజీయము
23. సిద్ధయోగ సంగ్రహ

24. సహస్ర యోగము
25. వైద్య యోగరత్నావళి
26. వైద్య చింతామణి
27. గద నిగ్రహము
28. రసతరంగిణి
29. ఆయుర్వేదౌషధ గుణరత్నాకరం
30. అనుపాన పద్యమంజరి
31. అగ్నివేశ తంత్రము
32. రహస్య సిద్ధ వైద్యసారం
33. రహస్య యునానీ వైద్యసారం
34. మాధవనిధానం
35. కైయిదేవ నిఘంటు
36. కళ్యాణ కారక
37. యోగరత్నాకరం
38. వంగసేన
39. మదనపాల నిఘంటువు
40. రాజ నిఘంటువు
41. ఆయుర్వేద ప్రకాశిక
42. రసజలనిధి
43. అనుపాన విధి
44. శబ్ద కల్ప ద్రుమమ్
45. లోలంబరాజీయము

ఇంకా అనేక ఆయుర్వేద, సిద్ధ, యునాని గ్రంథాలను పరిశీలించి వ్రాయడం జరిగింది.

# అంకితం



## కీ॥శే॥ డా॥శ్రీ దూబగుంట రాధాకృష్ణమూర్తిగారు

మన్‌ఫార్మా వ్యవస్థాపకులు (విజయవాడ)

అనేక సంవత్సరాలుగా ఇతోధికంగా ఇంకాఫ్స్ నందు, దేశీయ ఆయుర్వేదమునందు మరియు సొంతముగా ఆయుర్వేద ఫార్మశీ స్థాపించి ఆయుర్వేద ఇంజక్షనుల పద్ధతిని మన ప్రాంతములో ప్రవేశపెట్టడంలో వీరు, వీరి కుమార్డు గౌ॥ **డా॥ శ్రీ దూబగుంట శ్రీనివాస్ గారి** కృషి అనిర్వచనీయం. గత సంవత్సరం కీ॥శే॥ డా॥ **శ్రీ దూబగుంట రాధాకృష్ణమూర్తిగారు** తుదిశ్వాస విడవటం జరిగింది. ఆయన లేకపోయినా ఆయనస్ఫూర్తిని ఆయుర్వేద చరిత్రయందు ఉంచాలని భావించి ఈ కృతిని మనస్ఫూర్తిగా అంకితమిస్తున్నాను. నాకు అత్యంత పూజ్యనీయులైన రాధాకృష్ణమూర్తిగార్కి సహృదయంతో అంకితమిస్తూ....

**రామ్‌జీ** – కాకినాడ

# జీవిత అంశములు



## కీ॥శే॥డా॥ దూబగుంట రాధాకృష్ణమూర్తి గారు

**తల్లితండ్రులు** : 1937 వ సంవత్సరములో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం, కృష్ణాజిల్లా, విజయవాడ పట్టణమునందు, ప్రముఖ ఆయుర్వేద వైద్యులు, ప్రముఖ ఆయుర్వేద సంస్థ "ఇండియన్ మెడిసిన్ హౌస్"నకు వ్యవస్థాపకులైన వైద్యశ్రీ దూబగుంట సుబ్రహ్మణ్యం మరియు రాష్ట్ర ప్రముఖ ఆయుర్వేద వైద్యులు మరియు తెలుగు రాష్ట్రాలలోనే ప్రఖ్యాతిగాంచిన, ప్రముఖ ఆయుర్వేద ఫార్మసీ పి.సి.ఏ అండ్‌కో వ్యవస్థాపకులయైన శ్రీ పిడూరి చినఅయ్యవారప్పయ్య గారి కుమార్తె శ్రీమతి దూబగుంట రాజ్యలక్ష్మమ్మ గార్ల ద్వితీయ పుత్రుడుగా జన్మించినారు.

**విద్యార్హతలు** : ఆంధ్రాయుర్వేద పరిషత్ నుండి వైద్యవిధ్వాన్ మరియు అఖిలభారత విద్యాపీఠ్ నుండి "వైద్యాచార్య" అను విలువైన ఆయుర్వేద పట్టాలను పొందినారు. ఆంధ్రాయూనివర్శిటీ నుండి బి.ఎస్సీ (కెమిస్ట్రి) డిగ్రీ యందు ఉతీర్ణులయినారు.

**ఆవిష్కరణలు** : భస్మములు మరియు సింధూరములను ప్రత్యేక పద్దతిన వనమూలికలతో మిశ్రణ చేసి అసాధ్యమైన రోగములను నివారించగల ఔషధములను ప్రప్రధముగా ఆవిష్కరించిరి. దక్షిణభారతదేశంలోనే మొట్టమొదటిసారిగా, వనమూలికలతో తయారైన ఇంజెక్షన్లను, ప్రవేశపెట్టి, తయారుచేయుటకు, మొట్టమొదటి లైసెన్స్ పొందినారు.

**సాదించిన విజయాలు మరియు అందించిన సేవలు** : "సెంట్రల్ కౌన్సిల్ ఆఫ్ ఇండియన్ మెడిసిన్" అను జాతీయ ప్రభుత్వసంస్థకు మెంబరుగా తెలుగు రాష్ట్రాలనుండి అత్యధిక మెజారిటీతో గెలుపొందారు. దక్షిణ భారతదేశంలోని ప్రముఖ ఆయుర్వేద వైద్యులచే స్థాపించబడిన మరియు దేశంలోనే ప్రఖ్యాతిగాంచిన ఇంప్‌కాప్స్ యొక్క సంస్థ ఎన్నికలలో ఆయుర్వేద వైద్యులచే అఖండ విజయంతో ఎన్నిక కాబడి, వైస్ ప్రెసిడెంటు హోదాను దక్కించుకొని మూసివేయబడ్డ విజయవాడ ఇంప్‌కాప్స్ సంస్థను తిరిగి ప్రారంభించినారు.

ఆంధ్రాయుర్వేద బోర్డునకు వైస్‌ప్రెసిడెంటుగా నియమింపబడి, వైద్యులయొక్క సమస్యల పరిష్కారమునకు ఎంతగానో కృషిచేసినారు. ఫార్మసీ రిజిస్ట్రేషన్ కమిటి యందు నియమింపబడి, ఆయుర్వేద ఫార్మసీల యొక్క లైసెన్స్ విధానములను, సులభతరముగా చేయుటయే కాక వివిధ సమస్యలను పరిష్కరించినారు.

## ఆగండి...ఒకమాట

ఈ ప్రపంచము పంచభూతాల కలయికతో ఏర్పడినది. అందు ప్రతీ భూతము వివిధ నిష్పత్తులు కలయిక వల్ల దోషాలు, దూష్యములు ఏర్పడుచున్నవి. అయితే ప్రతీ దోషమునకు ఏక, ద్వి, త్రి (సన్నిపాతములు)గా ఏడురకాలుగా మానవ శరీరమును నిలబెట్టుచూ, పోషించుచున్నవి. ఇందు పంచభూత, దోష తత్వములు తెలియ కుండా వైద్యము చేస్తే అది వికటించి అపాయము కలుగును. అందునా శరీరమునకు ఆహార రసము ప్రాణము, ఆ ప్రాణము రస సంయోగమువల్ల రోగోత్పత్తి కల్గును. కావున ఆరు రుచులు గురించి తెలుసుకోవాలి. అంతేగాక అనుపానం తెలియకుండా ఎంత గొప్పగా వైద్యం చేసినా ఆ ప్రయత్నం నిష్ఫలము. అనుపానం, పద్యా పద్యాలు, రోగికి మేలు కలిగించే అంశాలు. కావున ఎల్లవేళలా దోషం, పథ్యం, అనుపానం కాలములను గ్రహించి వైద్యం చేసిన ఆరోగ్యం లేకపోతే అనారోగ్యం కలుగగలవు.

అనుపానం అనేది వ్యాధి, కాలం రోగి పరిస్థితి అనుసరించి మాత్రా ప్రమాణంగా అప్పటికప్పుడు నిర్ధారించుకోవాలి. ఎంత గొప్ప వైద్యుడైనా పై విషయాల యందు అనుభవం లేకపోతే అతని వైద్యం దుఃఖమును కల్గించును. చాలామంది ఈ మధ్య అనేకరకములైన కొత్త మందులు సృష్టిస్తున్నారు. కొందరికైతే ద్రవ్యం యొక్క విజ్ఞానం తెలియకుండా మాత్రా ప్రమాణం తెలుసుకోకుండా మందులు వాడుతున్నవారెందరో.

ఉదాహరణకు మధుమేహమునకు సంబంధించిన మందును మనం తీసుకున్నట్లయితే అందులో కలిపే ద్రవ్యాలు విరుద్ధ స్వభావ లక్షణాలున్నవి చాలా ఉన్నాయి. అయితే మధునాశిని ఔషధాలను మొత్తం కలిపి మందుగా ఇస్తూ వెస్టన్ మెడిసన్ సిస్టంను ఈ దోష వైద్యంలోకి చొప్పిస్తున్నారు. దీనివల్ల తాత్కాలికంగా రోగం తగ్గినా ఆ తర్వాత రోగం ముదిరి పరిస్థితి తీవ్రమై తగ్గని రోగంగా మనమే మార్చుతున్నాము. కంటి నొప్పికి కాలినొప్పికి వెస్టన్ మెడిసిన్ (వైరూప్యవైద్యం అల్లోపతి) కావచ్చు గాని మన ఆయుర్వేదములో మాత్రం స్వతంత్ర మందులున్నవని గమనించండి.

ప్రపంచ వైద్యశాస్త్రములో వ్యక్తిని బట్టి, వ్యక్తికి తగ్గట్టు వైద్యం (ఇండివిడ్యువల్ మెడిసిన్) ఆయుర్వేదమే అని గుర్తించండి. అందునా మందుతోపాటు వాడే అను పానంకూడా మారుతుందని మరువవద్దు. మందుయొక్క సమస్త ద్రవ్యగుణం తెలిసిన తర్వాత అనుపానం గుర్తెరిగి వైద్యంచేస్తే ఆ వైద్యునికి తిరుగుండదు. అంతేగాక మోతాదు విషయం కూడా ఇక్కడ చర్చించాలి. ఒకవ్యక్తి బరువు, రోగం పరిస్థితి ఆధారంగా మోతాదు ఇస్తాం అన్ని వైద్యాలలో కేవలం మూలికలతో వైద్యంచేస్తున్న పుడు కనీసం 500 మి.గ్రా. లేకుండా వైద్యం చేస్తే ఆ రోగం, రోగి ఉపశమనం దొరుకుతుందా ? ఇలా ఉపశమనం కేవలం అనుపానం తీసుకోవటం వల్లే దొరుకుతుందంటే ఆశ్చర్యం కలుగక మానదు. అంతేగాక ఔషధమూలికలను కలిపే టప్పుడు వీర్య, విపాకాలను

గుర్తించి కలపాలి తప్ప అన్నీ ఒకసారి వేసి దంచి మందులు తయారు చెయ్యరాదు. చాలా కంపెనీల వారు ఔషధం గుణాన్ని వ్రాసే టప్పుడు ఏకమూలిక ద్రవ్యగుణం రాస్తున్నారే గాని ఔషధం తయారైన తర్వాత దాని రసగుణ వీర్య విపాకాలు వ్రాయటం లేదు. దానివల్ల ఆరోగ్య రక్షణ పూర్తిగా జరుగ దని గుర్తించండి. ఉదాహరణకు–

హైడ్రోజన్ వాయువు, ఆక్సిజన్ వాయువు ఈ రెండూ కలవటం వల్ల ఏర్పడేది నీరు. ఇది ద్రవము దీనికి హైడ్రొజన్,ఆక్సిజన్ గుణాలేవీ లేవని గమనించండి. మొక్క ద్రవ్యగుణంతో పాటు ఔషధ ద్రవ్యగుణం తెలుసుకుంటేనే శాస్త్రీయంగా ఆరోగ్యాన్ని కల్గించగలరు. కాని ఏకమూలికా ద్రవ్యగుణం బహుమూలికా సంయోగం వల్ల కలిగిన గుణం, ప్రభావం ఒకటికాదని మరచిపోవద్దు. రెండు మూలికలు కలిస్తే మూడవ గుణం కలిగిన పదార్థం ఏర్పడుతుంది. ఆ పదార్థ గుణలక్షణాలు చెపితే ఎందులో ఆ మందుపనిచేస్తుందో తెలుస్తుంది. అంతేగాని ఇవి ఫలానా రోగాన్ని తగ్గిస్తాయని చెప్తే అన్నీ కలిపి తయారు చేసిన మందు ఖచ్చితంగా ఆ వ్యాధిని తగ్గి స్తుందా? ఆలోచించండి. అలా అయితే రసశాస్త్రం ఎందుకు? ఉదా : సాధారణంగా వాడే ఉప్పు సోడియం క్లోరైడ్ అందు మొదటిది సోడియం లోహము క్లోరైడ్ వాయువు వీటి సంయోగంలో ఏర్పడిన ఉప్పుకు పై రెండింటి లక్షణాలు, గుణాలు లేనట్లే రెండు మూలికల సంయోగంచేత ఏర్పడిన మూడవ పదార్థం వ్యాధిలో ఎలా ఉపయోగపడుతుందో దానిని పంచభూత విజ్ఞానం ద్రవ్యగుణ విజ్ఞానం, ఓషధీగుణ భాషీ పంచతత్వం ద్వారా తెలుసుకుంటారని ఆశిస్తూన్నాను. ఈ పుస్తకము చివర సిద్ధ, యునాని గ్రంధాలలోని మందులు, అనుపానాలు చేర్చాను వాటి వివరాలకోసం నాచే రచించబడిన “రహస్య యునానీ వైద్యసారం, రహస్య సిద్ధ వైద్య సారం” గ్రంధాలు సంప్రదించగలరు. ఇందుగల కొన్ని అనుపాన విషయములు, మందులు గూర్చి నాచే రచించబడిన ‘ నాటు వైద్యమును’ గ్రంధమును సంప్రదించగలరు. గ్రంధ విస్తరణ భీతిచే, పునరుక్తి దోషం లేకూడదనే మీ మాంసతో కొన్నిటిని ఇందుపొందు పరచలేదు. గమనించగలరు.

ఈ పుస్తకం నందు అనేక రస విషపాణాములకు అనుపానాలు, విరుగుడులు వ్రాసాను. ఇవి ఆయా పరిస్థితులలో మారవచ్చు. పెద్దలను సంప్రదించి వాడుకోగలరు. ఈ పుస్తకమును కూర్చుటలో కొన్ని తప్పులు దొర్లి ఉండవచ్చు. వాటిని నాకు తెలియపర్చిన మలి ముద్రణలో సవరించగలవాడను ఇది వైద్యుల ఉపయోగార్థం వ్రాసాను. కావున వైద్యేతరులు, అనుభవం లేనివారు, అనుమతి లేకుండా స్వయంగా మందులు వాడుకున్నచో కలిగే ఉపద్రవములకు రచయిత, పబ్లిషర్స్‌కు ఎట్టి సంబంధము లేదని హెచ్చరిస్తున్నాను.

మీ

**రామ్‌జీ**

## ద్రవ్యమానము

| | |
|---|---|
| 1తులము | 12 గ్రా. |
| అర్థతులము | 6గ్రా. |
| పావుతులము | 3గ్రా. |
| బేడెత్తు | 2గ్రా. |
| గురివిందగింజెత్తు | 125గ్రా. |
| 1టీస్పూను / చెంచా | 5మి.లీ. |
| 1 ఔన్సు | 30 మి.లీ |
| 1శేరు | 1లీటరు |
| చిన్నము | అర్థగ్రాము |
| 6 గుంజలు/రత్తీలు | 1మాష = 1గ్రా. |
| 12 మాషలు | 1కర్షము = 12 గ్రా. |
| 2 కర్షములు | 1 శుక్తి = 24 గ్రా. |
| 2 శుక్తులు | 1 పలము = 48 గ్రా. |
| 2 పలములు | 1 ప్రశృతి = 96 గ్రా. |
| 2 ప్రశృతులు | 1 కుడవము = 192 గ్రా. |
| 2 కుడవములు | 1మానికం = 384 గ్రా. |
| 2 మానికములు | 1 ప్రస్థము = 768గ్రా. |
| 4 ప్రస్థములు | 1 ఆడకము = 3 కి.గ్రా. 73గ్రా. |
| 4 ఆడకలు | 1 ద్రోణము=12కి.గ్రా. 288 గ్రా. |
| 2 ద్రోణములు | 1 శూర్పము =24కి.గ్రా.576గ్రా |
| 2 శూర్పములు | 1ద్రోణి = 49కేజి. 152గ్రా. |
| 4 ద్రోణీలు | 1 కారీ = 196 కేజి. 608గ్రా. |
| 1పలము | 48గ్రా. |
| 100 పలములు | 4కేజిలు 800గ్రా. |
| 20 తోలములు | 1బారము = 96కేజి. |
| అంగుళము | 3/4 1.95 సెం. |
| 1ముహూర్తము | 48 నిమిషములు |
| 30 ముహూర్తములు | 1 అహోరాత్రము = 24 గంటలు |
| 15 అహోరాత్రములు | 1పక్షము=15 రోజులు |

| | |
|---|---|
| 2 పక్షములు | 1 మాసము=30 దినములు |
| 2 మాసములు | 1 ఋతువు = 60 దినములు |
| 3 ఋతువులు | 1 ఆయనము = 6 నెలలు/మాసములు |
| 2 ఆయనములు | 1 సంవత్సరము = 12 మాసములు |

## తూనికలు

మాస పరిభాష

(వైద్యయోగ రత్నావళి పట్టికకు మెట్రిక్ తూనికలు చేర్చబడినవి.)

| | | |
|---|---|---|
| 30 పరమాణువులు | 1 త్రసరేణువు లేక వంశీ | 0.0347 మి.గ్రా. |
| 6 వంశులు | 1 మరీచి | 0.208 మి.గ్రా. |
| 6 మరీచులు | 1 రాజిక | 1.25 మి.గ్రా. |
| 3 రాజికలు | 1 ఆవగింజ | 3.75 మి.గ్రా. |
| 8 ఆవగింజలు | 1 యవ (అరగ్రైను) | 30 మి.గ్రా. |
| 4 యవగింజలు | 1 గురిగింజ (2గ్రైనులు) | 120 మి.గ్రా. |
| 6 గురిగింజలు(రతులు) | 1 మాసము (1/16తులము) | 720మి.గ్రా. |
| 4 మాషములు | 1 శాణము (ధరణము,టంకం)1/4తు | 2.884 గ్రా. |
| 2 శాణములు | 1 కోలము (అరతులం) | 5.768 గ్రా. |
| 2 కోలములు | 1 కర్షము (1తులం) | 11.536 గ్రా. |
| 2 కర్షములు | 1అర్ధసలము (శుక్తి2తు॥) | 23.072గ్రా. |
| 2 పలములు | 1 ప్రసృతి-ప్రసృతము (8తు॥) | 92.288 గ్రా. |
| 2 ప్రసృతులు | 1 కుడనము-అంజలి (16తు॥) | 182.5 గ్రా. |
| 2 కుడువములు | 1 శరావము (32తు॥) | 365 గ్రా. |
| 2 శరావములు | 1 ప్రస్థము (64తు॥) | 730గ్రా. |
| 4 ప్రస్థములు | 1 ఆఢకము (256తు॥) | 2.898గ్రా. |
| 4 ఆఢకములు | 1 ద్రోణము (1024తు॥) | |
| | కొలతకు 25 1/2పౌన్లు,408 ఔన్సులు | 1.591కి.గ్రా |
| 2 ద్రోణములు | 1 శూర్పము (2048తు॥ 50 పౌన్లు, 816 ఔన్సులు | 26.364 కి.గ్రా |
| | 100పౌన్లు, 816 ఔన్సులు | 23.182 కి.గ్రా. |
| 2 శూర్పములు | 1ద్రోణి (4096 తు॥ 100పౌన్లు,1632ఔన్సులు) | 26.364 కి.గ్రా. |
| 4 ద్రోణీలు(ద్రోణులు) | 1ఖారీ916384తు॥400పౌన్లు,6258ఔన్సులు) | 105.456కి.గ్రా. |

| | | |
|---|---|---|
| తులా | 100 పలములు అనగా 400తు॥ | |
| పల్లము | మూడు గురిగింజలయెత్తు | 360 మి.గ్రా. |
| నిష్కము లేకమాడ | ఏడున్నర చిన్నముల యెత్తు | 2753 గ్రా. |
| రెండున్నర తులములు | 1ఔన్సు | 28.41 మి.లీ. |
| 16 ఔన్సులు | 1పౌను | |

## ప్రమాణములు

| | | | |
|---|---|---|---|
| 1 | ద్రోణము | 11,567 కి.గ్రాములు | = 25 1/2 పౌన్లు |
| 1 | ప్రస్థము | 746.483 గ్రాములు | = 64 తులములు |
| 1 | తులము | 11,664 గ్రాములు | |
| 1/2 | తులము | 5,832 గ్రాములు | |
| 1/4 | తులము | 2,916 గ్రాములు | |
| 1/8 | తులము | 1,458 గ్రాములు | |
| 1/16 | తులము | 0.721 గ్రాములు | |
| 1/32 | తులము | 0.364 గ్రాములు | |
| 1/64 | తులము | 0.182 గ్రాములు | |

## కొలతలు

| | | | |
|---|---|---|---|
| 1 | ద్రోణము | 11,475 లీటర్లు | = 25 1/2 పౌన్లు |
| 1 | ప్రస్థము | 730 మి.లీ. | |
| 1 | కుడువము | 186 మి.లీ. | |
| 1 | పలము | 46 మి.లీ. | |

## ఆంధ్రప్రదేశ్ మానము

మాడ=అరవరహా = 1 సువర్ణము=20 రూకలు=80 గురిగింజలు=8 గ్రాములు

రూక = చిన్నం = 467 లేక 400 మి.గ్రా.

అడ్డిగ = రూకలో సగం = అరచిన్నం = 200 మి.గ్రా.

రెండున్నర చిన్నాలు = 1 గ్రా = అణా ఎత్తు

5 చిన్నాలు = 2 గ్రా. = బేడెత్తు

10 చిన్నాలు = 4 గ్రా. = అరకాసు

ఛటాకు = 5 తులములు

16 చటాకులు=1శేరు=80 తు॥=913 మి.లీ.=933 గ్రాములు

(శేరు=మానిక=కుడవము)

ఆఢకం : 4 ప్రస్థాలు = 2.92 లీటర్లు

ఏబులము = సవాశేరు = 30 తులములు = 350 గ్రాములు

రెండు ఏబులములు = అరవీశ=పడలము = 700 గ్రాములు

రెండు అరవీశలు = 1 వీశ = 1400 గ్రాములు

8 వీశలు = 1 మణుగు = 11,200 కిలోలు

కరమద్యం = కర్షం = రెండు తులాలు (వైశసి)

అంజలి = 80–90 మి.లీ. (ఆర్యవైద్యన్ పత్రిక ఆధారంగా)

weight and Measures

(Extract from the Ayurvedic Pharmacopoeia of india

- Part 1, Volume 1v, Aappendix 5)

Approximate equivalents of Doses in Indian system and Metric system

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | Ratti or gunja | = | 1 masa | = | 125 mg |
| 8 | Rattis or Gunjas | = | 1 masa | = | 1 g |
| 12 | Masa | = | 1 Karsa (Tola) | = | 12 g |
| 2 | Karsas (Tolas) | = | 1 Sukti | = | 24 g |
| 2 | Sukti(4Karsas or Tolas) | = | 1 Pal | = | 48 g |
| 2 | Palas | = | 1 Prasrti | = | 96 g |
| 2 | Prasrtis | = | 1 Kudava | = | 192 g |
| 2 | Kudava | = | 1 Manika | = | 384 g |
| 2 | Manikas | = | 1 Prastha | = | 768 g |
| 4 | Prastha | = | 1 Adhaka | = | 3.073 kg |
| 2 | Dronas | = | 1 Droni(vahi) | = | 49.152 kg |
| 4 | Surpas | = | 1 Khari | = | 196.608 kg |
| 100 | Palas | = | 1 Tula | = | 4.800 kg |
| 20 | Tulas | = | 1 Bhara | = | 96 kg |

**LINEAR MEASURES**

| | | | | |
|---|---|---|---|---|
| Yavodara | = | 1/8 of 3/4 inch | = | 0.24 cm |
| Bitahasti | = | 9 inches | = | 22.86 cm |
| Hasta | = | 18 inches | = | 45.72 cm |
| Nrpahasta | = | Rajahasta 22 inches | = | 55.88 cm |
| Vyama | = | 72 inches | = | 182.88 cm |
| Angula | = | 3/4 inches | = | 1.95 cm |
| Aratni | = | 10.5 inches | = | 41.91 cm |

**MEASUREMENT OF TIME**

| | | |
|---|---|---|
| 2 Ksana | = | 1 Lava |
| 2 Lavas | = | nimesa |
| 3 Nimesas | = | 1Kastha = 4.66 second |
| 1 Ghati | = | 24 minutes |
| 30 Kasthas | = | 1 kala = 2 minutes 20 seconds |
| 20 kala+3 kashthas | = | 1 muhurtha = 28 minutes |
| 30 Muhurtas | = | 1 Ahoratra = 24 hours |
| 15 Ahoratras | = | 1 Paksha - 15 days |
| 2 Pakshas | = | 1 masa=30 days / one month |
| 2 Masas | = | 1 Rtu = 60 days / 2 months |
| 2 Rtu | = | 1 ayana = 6 months |
| 2 Ayanas | = | 1 samvatsra = 12 months/one year |
| 5 Samvatsaras | = | 1 yuga = 5 years |
| 1 Ahoratra of Devas | = | 1 year |
| 1 Ahoratra of pitaras | = | 1 month. |

the above table of metric equivalents of weights & Measures, linear measures and meajurement of time used in the ayurvedic classics have been approved by the Ayurvedic pharmacopoeia committee in consultation with Indian stan

## మాన పరిభాష

మానము : దేని ద్వారా ద్రవ్యము కొలవబడునో దానిని మానము అందురు. మానము లేకుండా చికిత్సలందు భేషజ ప్రయోగము జరుగదు. వ్యాధి బలము,రోగి,బలము, అగ్ని, వయస్సు, కోష్ఠము మొదలగునవి విచా రించి విభిన్న మాత్రలలో కల్పనలను చేయవలసి వుండును. ఔషధ యోగము లందు వివిధ ద్రవ్యముల సంయోగము ఒక ప్రత్యేక మానానుసారము చేయవలెను. సుశ్రుతాచార్యులు శుష్క ద్రవ్యములకు మానమును వివరిం చుచూ, ఆర్ద్ర ద్రవ్యములు మృదు వీర్యములుగా నుండుటచేత ఈ మానము ద్విగుణ ప్రమాణములో ఉపయోగించవలెనని పేర్కొనెను. గుడూచీ, శతావరీ, ప్రసారణి వంటి ద్రవ్యములు ఆర్ద్రావస్థ యందే ప్రయోగించవలెను. వీటిని మాత్రము ద్విగుణ ప్రమాణముగా గ్రహించరాదని శారంగధరాచార్యులు పేర్కొనెను.

మానము పాతవ, ద్రువయ, పాయ్యా అను మూడు విధములుగా వివరింపబడినది. ప్రాచీన గ్రంథములందు ఆయుర్వేద సంహితలందు కాలింగము మరియు మాగద యను రెండు మానములు పేర్కొనబడినవి.

కాలింగ మానము కంటే మాగధ మానము శ్రేష్టమైనదిగా మానపండితులు పరిగణించునట్లు చరకాచార్యులు పేర్కొనెను.

**మాగధ మానము**

30 పరమాణువులు - 1 వంశీ

6 వంశీలు - 1 మరీచి

6 మరీచీలు - 1 రాజికా

3 రాజికాలు - 1 సర్షపము

8 సర్షపములు - 1 యవ

4 యవలు - 1 గుంజా

6 గుంజాలు - 1 మాషకుడు

4 మాషకములు - 1 శాణము

2 శాణములు - 1 కోలము

2 కోలములు - 1 కర్షము (1తులం)

2 కర్షములు - 1 శుక్తి

2 శుక్తిలు - 1 పలము

2 పలములు- 1 ప్రవృతి

2 ప్రవృతిలు-1 కుడపము

(16తులములు)

2 కుడపములు - 1మానికా

2 మానికలు - 1 ప్రస్థము

(64 తులములు)

4 ప్రస్థములు- 1 ఆరకము

4 ఆరకములు-1 ద్రోణము

2 ద్రోణములు - 1 శూర్పము

2 శూర్పములు - 1 ద్రోణీ

4 ద్రోణీలు - 1 భారీ

2000పలములు - 1 భార

100 పలములు – 1 తులా

ఆయుర్వేద శాస్త్రమున వర్ణింపబడిన మాన ప్రమాణములకు ఆయుర్వే దిక్ ఫార్మకోపియా కమిటివారు సూచించిన మెట్రిక్ పద్ధతిలో గ్రహించవలసిన ద్రవ్య ప్రమాణముల వివరణ –

| | | |
|---|---|---|
| 1 రత్తి లేదా గుంజా | = | 125 మి.గ్రా. |
| 8 రత్తి లేదా గుంజాతో(1మాష) | = | 1 గ్రా. |
| 12మాషలు (1కర్షములేదా తులము) | = | 12 గ్రా. |
| 2 కర్షములు (1 శుక్తి) | = | 24 గ్రా. |
| 2 శుక్తిలు (పలము) | = | 28 గ్రా. |
| 2 పలములు (ప్రసృతి) | = | 96 గ్రా. |
| 2 ప్రవృతులు (కుడవము) | = | 192 గ్రా. |
| 2 కుడవములు (మానిక) | = | 384 గ్రా. |
| 2 మానికలు (ప్రస్థము) | = | 768 గ్రా. |
| 4 ప్రస్థములు (ఆఢము) | = | 3 కేజి 73గ్రా. |
| 4 ఆఢకములు(ద్రోణము) | = | 1.2కేజి. 288గ్రా. |
| 2 ద్రోణములు (శూర్పము) | = | 2.4 కేజి. 576గ్రా. |
| 2 శూర్పములు (ద్రోణీ) | = | 19 కేజి.152 గ్రా. |
| 4 ద్రోణీలు (భారీ) | = | 196 కేజి. 608గ్రా. |
| 100 పలములు (తులా) | = | 4 కేజి. 800గ్రా. |

### ద్రవ్యగణపరిభాషా :

ఔషధ యోగకల్పనలందు త్రిఫలము, త్రికటు వంటి కొన్ని గుణములను పేర్కొనడమైనది. అటువంటి కొన్ని గణముల పరిభాష వివరింపబడుచున్నది.

**త్రిఫల :** హరీతకీ, విభీతకీ, ఆమ్లకీలను కలిపి త్రిఫల ఫలత్రికము ఉత్తమా వరా అని కూడా అందురు. కొందరు వీటిని సమభాగములుగా తీసుకొనవలెననియు, మరికొందరు ఒక హరీతకీ, రెండు విభీతకఫలములు నాలుగు అమలక ఫలములుగా గ్రహించవలెనని పేర్కొనిరి.

కఫపిత్తహరము, దీపనీయము చక్షుష్యము విషమజ్వరము, ప్రమేహము, కుష్ఠహరమును కర్మలు కలిగి ఉండును.

**త్రికటు :** శుంఠి, పిప్పలీ, మరిచమును కలిపి త్రికటు, కటుత్రికము, త్రూషణము లేదా వోషమని అందురు. దీపనీయ, శ్వాస, కాస, గుల్మ,

మేద, శ్లీపద ప్రమేహ, పీనసహర కర్మలు, గల్గియుండును.

చతురూషణ : శుంఠీ, పిప్పలీ, మరిచము, పిప్పలీ మూలములను కలిపి చతురూషణము లందురు.

త్రిమద : విడంగ, ముస్తా, చిత్రకములు త్రిమదములని పేర్కొనబడినవి. గ్రాహి, లేఖనీయ, కృమి, అతిసార, అర్శస్సు, గ్రహణీహర, కర్మలు గల్గి యుండును.

త్రిసమ : హరితకీ శుంఠీ మరియు గుడము సమపరిమాణములో కలిపిన సమత్రిసయ లేదా 'త్రిసమ' అందురు. దీపనము, జ్వర, శ్వాస, కాస, అర్శోహర కర్మలు గల్గి యుండును.

త్రికర్షిక : శుంఠీ, అతివిషా, ముస్తాలను ఒక్కొక్క కర్ష ప్రమాణములో కలిపిన త్రికర్షికములనబడును. గ్రాహి, దీపన, పాచన, జ్వర, అతిసార హరకర్మలు గల్గియుండును.

చాతుర్భద్ర : త్రికార్షికములను గుడూచీ, కలిపిన చాతుర్భద్ర మన బడును. పాచన, గ్రాహి, అతిసార, ప్రమేహ, జ్వరహర కర్మలు గల్గియుండును.

త్రిజాతక్ : త్వక్, ఏలా, పత్రకములను కలిపి త్రిజాతకములందురు. వీటికి నాగకేసరములను కలిపినచో చాతుర్ధాతకము అందురు. ఈ రెండు గణాలు కఫవాతశామకము, దీపనము, వర్జ్యము, విషఘ్న, ముఖశోధన కర్మలు గల్గియుండును. హిక్కా, చర్ది,గుల్మ, అనువ్యాధులందు ఉపయోగ కరముగా నుండును.

చతుర్భీజము : మేథికా, చంద్రశూర, కాలాజీర, యవానీ యొక్క బీజములను చతుర్భీజములందురు. వాతశమన, పార్శ్వశూల, త్రికశూల, అజీర్ణ, ఆధ్మానహర కర్మలు గల్గియుండును.

పంచకోలము : పిప్పలీ, పిప్పలీమూలము, చవ్య, చిత్రక, శుంఠీ కలిపి పంచకోలములందురు. వీనినే పంచభూషణ అని కూడా అందురు. ఈ గణానికి మరిచము కలిసిన "షడూషణము" అందురు. పాచన దీపన, విషఘ్న, గుల్మ, ప్లీహ, ఉదర, ఆమవాత, శూలహర కర్మలు గల్గియుండును.

పంచవల్కల : వట, ఉదుంబర, అశ్వత్థ, పారీష, ప్లక్ష వీటిని పంచక్షీరీ వృక్షములందురు. వీనియొక్క వల్కములు (పట్ట)ను గ్రహించుటచే పంచవల్క ములు అనికూడా అందురు. గ్రాహి, వ్రణశోధ, విసర్ప, యోని రోగహర కర్మలు గల్గియుండును.

పంచతిక్త : గుడూచీ, నింబమూలత్వక్, వాసా, కంటకారీ, పటోలపత్ర మును అయిందిని పంచతిక్తము లందురు. పిత్తశమనము, అగ్నిమాంద్య, జ్వర, కుష్ఠ, కాస, శ్వాస, కామలాహర కర్మలు గలిగియుండును.

ఆమ్లపంచక : ఆమ్లవేతసము, జంబీర,మాతులుంగ,నారంగ, నింబుక ములను పంచామ్ల లేదా ఆమ్లపంచకము లంటారు. దీపన, పాచన, హృద్రోగ శూల, గ్రహణీహర కర్మలు గలిగియుండును.

బృహత్పంచమూల : బిల్వ, అగ్నిమంద, శ్యోనాక, పాటలా, గంభారీ అను అయిదింటినీ కలిపి బృహత్పంచమూలములని అందురు.

లఘుపంచమూల : శాలపర్ణి, వృశ్చపర్ణి, బృహతీ, కంటకారీ, గోక్షుర అనువానిని కలిపి లఘుపంచమూలము అందురు.

దశమూల : బృహత్ పంచమూల మూలములను, లఘు పంచమూలములను కలిపిన దశమూలములందురు. ఈ గణము త్రిదోష హరము, శ్వాస, కాస, శిరోరుజ, శోథ, జ్వర, తంద్రా, అనాహ, పార్శ్వ పీడహర అను కర్మలను కలిగియుండును.

కంటక పంచమూలములు : కరమర్ద, గోక్షుర, సైరేయక, శతావరీ, హింస్రా అను అయిదింటినీ కంటక పంచమూలములు అందురు.

వల్లీపంచమూలములు : విదారీ, సారిబా, గుడూచీ, మంజిష్ఠా, మేషశృంగీ వీనిని వల్లీపంచమూలములు అందురు.

వల్లీ పంచమూలములు కఫశామక, రక్తపిత్త శుక్రదోష నాశకములుగా పనిచేయును.

తృణ పంచమూలములు : కుశ, కాశ, సల, దర్భ, ఇక్షు- ఈ అయిందిటినీ తృణపంచమూలములు అందురు. ఇవి మూత్రదోష వికారములందు, రక్తపిత్తం నందు క్షీరంతో ప్రయోగించిన మంచి ఫలితముల నిచ్చును.

సుశ్రుతాచార్యులు బృహత్, లఘు, కంటక, వల్లీ, తృణ పంచ మూలములను పంచ పంచమూలములుగా పరిగణించెను.

మధ్యమ పంచమూలములు : బలా, పునర్నవ, ఏరండ, ముద్గపర్ణీ, మాషపర్ణీ అను అయిదింటినీ మధ్యమ పంచమూలములందురు. ఇవి కఫ, వాతహరంగా పనిచేయును.

జీవన పంచమూలములు : మేధా, మహామేధా, జీవన్తీ జీవక,

ఋషభక వీనిని జీవన పంచమూలములు అందురు. ఇవి చక్షుష్య వృష్యం, పిత్తవాతహరంగా పనిచేయును.

పిత్తపంచకము : మత్స్య, గో, అశ్వ, మయూర, మనుష్య పిత్తములను పిత్త పంచకమని అందురు ఇవి దీపన, పాచన కర్మలను చేయును.

లవణ పంచకము : సైంధవ, సౌవర్చల, విడ,సాముద్ర, శాంబర లవణములను లవణ పంచకము అందురు. ఇవి దీపనము, పాచనము, గుల్మ, అజీర్ణహరము.

క్షారద్వయము : సర్జక్షారము, యవక్షారములను కలిపి క్షారద్వయం అందురు.

క్షారత్రయం : యవక్షారము, సర్జక్షారము, టంకణములను క్షారత్రయం అందురు.

క్షారాష్టకము : పలాశ, సేహుండ, అపామార్గ, చించా, అర్క తిలనాల క్షారములు మరియు యవక్షారము, సర్జక్షారములను కలిపి క్షారాష్టకము అందురు.

బలా చతుష్టయము : బలా, అతిబలా, మహాబలా, నాగబలా, వీనిని బలాచతుష్టయము అందురు. బలాచతుష్టయము శ్విత్రము, మధురము, బల్యము, గ్రాహిగుణమును కలిగి వాత, రక్తపిత్త, రక్తదోష క్షతములను పోగొట్టును.

శుష్క- ఆర్ద్ర ద్రవ్యముల సంగ్రహణ నియమము :

వాయు విడంగములు, పిప్పళ్ళు, బెల్లము, ధనియములు, నెయ్యి, తేనె, వీనిని విడిచి సర్వయోగంబులందును క్రొత్త వస్తువులనే చేర్చవలెను. పై వస్తువులు మాత్రము పాతవిగా చేర్చిన శ్రేష్ఠంబులై వుండును.

తిప్పతీగె,కొడిసపాలపట్ట, అడ్డసరము, బూడిద గుమ్మడు, పిల్లిపీచర, పెన్నేరుగడ్డ, ములుగోరింట, పెద్దసదాప గొంతెమగోరు వీనిని ఎప్పుడును పచ్చివిగానే ఉపయోగింపదగును. ఇట్టి వానిని ప్రయోగించునపుడు పచ్చివి గనే ప్రయోగింపవలెనను నియమముండుటచేత ద్విగుణంబుగా ప్రయోగింప రాదు.

పైనచెప్పిన తిప్పతీగె మొదలగు ద్రవ్యములు గాక ఇతర ద్రవ్యములను ఎండించిన వానిని క్రొత్తవిగా ప్రయోగింపవచ్చును. విడంగ మొ॥ ద్రవ్యము లను మాత్రము పచ్చివిగా ప్రయోగింపవలసినచో రెండింతలు ప్రయోగింప వలెను.

సిద్ధమగు ఔషధము సేవించుకాలము చెప్పబడకుండిన అచ్చట ప్రాంతః కాలమున సేవింపదగును. ఓషధి గ్రహించునపుడు వేరుపట్ట, ఆకు మొదలగు వాని భేదకము చెప్పనపుడు మూలములను గ్రహింపవలెను. వస్తువుల పరిమాణము చెప్పకుండిన సమభాగములుగా తీసుకొనవలెను. ఔషధపాత్రను చెప్పకుండిన మట్టిపాత్రను ఉపయోగింపవలెను. ద్రవపదార్థములను నిర్దేశింపకుండిన నీటిని పోయదగును. ఏ నూనెయో చెప్పకుండిన నువ్వుల నూనె వేయవలెను. ఏ ఔషధయోగంబునైన ఒక ద్రవ్యమును రెండుసార్లు చెప్పియుండిన దానిని రెండింతలు ప్రయోగింప వలెనని గ్రహించవలెను. చూర్ణములు, ఘృతములు, తైలములు, ఆసనములు, లేహ్యములు –వీనియందు గంధమును జేర్చునపుడు శ్వేత చందనంబును, కషాయము, లేపనము వీనియందు రక్తచందనమును జేర్చదగును.

ఏ ఔషధ గణంబునందైన చెప్పబడిన ద్రవ్యము ప్రకృత రోగమునకు ప్రయుక్తమైనచో అట్టి ద్రవ్యమును త్యజింపవలెను. చెప్పబడకుండినను యోగ్యమగు ద్రవ్యమును గ్రహింపవలయును.

వింద్యాది పర్వత ప్రాంతములు ఉష్ణవంతంబులై వుండుటచేత యందుండు ద్రవ్యములు ఉష్ణవీర్యంబులుగను, విషువత్ పర్వతము శీతవంత మగుటచే అందలి పదార్థములు శీతవీర్యముగను వుండును. మరియు ఏ దేశమున ఏ పదార్థము పుట్టునో ఆ దేశగుణమును గలిగి వుండును.

# వైద్య చరిత్రలో అనుపానం

**వేదకాలం (క్రీ.పూ. 2000–క్రీ.పూ. 1000)**

మన ప్రాచీన జ్ఞాన బాండాగారాలు వేదాలు. ఇందులో లేనిది ఎక్కడా ఉండదని ఆర్యులమాట. వేదభాగమైన చాంద్యోపనిషత్ నందు ద్రవ్యగుణం, అనుపానం గూర్చి హితాహితాల గురించి అనుపాన విధిని నిర్ణయించారు.

**సంహితల కాలం (క్రీ.పూ. 1000–క్రీ.శ. 500)**

**1.చరక సంహిత :** చరకాచార్యులవారు అనుపాన విధిని గూర్చి సూత్ర స్థానమందు చెప్పారు. ఆహారమునందు యుక్తా యుక్త అనుపాన విధిని చెప్పటమేకాకుండా స్థౌల్య, తంద్ర, అల్పాగ్ని యందు ఖచ్చితమైన ఆహార అనుపాన విధిని వ్రాసారు. అంతేగాక 84 ఆసవాలు, పేయములను గూర్చి చరకుడు అనుపాన విధిని చెప్పారు.

**2. సుశృత సంహిత :** కృతన్న వర్గయందు మండ పేయాది కల్పముల యందు, భక్ష్య వర్గమునందు అనుపాన విధి చెప్పబడినది. మందు, దోషం, అనుపాన ఉపయోగం గూర్చి విపులంగా ఆయా వర్గలయందు చెప్పబడినది.

**3. కశ్యప సంహిత :** అనుపాన విధిని ప్రత్యేకించి చెప్పనప్పటికీ సూత్ర స్థానమందు స్నేహధ్యాయములో స్నేహవర్గ (ఘృతం, తైలం, వస, మజ్జ) ఉష్ణోదక, యూష, మండములను గూర్చి చెప్పబడినది.

**4. భేళ సంహిత :** అనుపానం గూర్చి గొప్పగా చెప్పిన గ్రంథమిదే. ఆహారం, ఆహార ద్రవ్యములు, మాంస, ధాన్య, పండ్లు, స్నేహ గుణాలను వివరించబడ్డాయి. ఆహారమునందు అనుపాన గుణ,కర్మలు పాచన, రోచన, ప్రాయశ్చితం చెప్పబడినవి.

**సంగ్రహ కాలం (క్రీ.శ. 500 – క్రీ.శ. 1700)**

1. అష్టాంగ హృదయము : సూత్ర స్థానమందు ఆహార విధానం,భోజన వ్యాశిష్టం, భోజ్యపదార్థాలు, అనుపాన ప్రమాణాలు, సామాన్య అనుపానాలు, అనుపాన లక్ష్యాలను గూర్చి, దోష,రోగ, ఔషధములను గూర్చి, రోగమందు అనుపానం గూర్చి చాలా వివరాలున్నాయి.

2. అష్టాంగ సంగ్రహ : సూత్ర స్థానంలో ఆహార కల్పము నందు ఆహార విధి, భోజనవిధితోపాటు అనుపానం భోజనానంతర కర్తవ్యము.

రోగానికి అనుపానాలు, రోగి, దోషం, కల్పన, రస, కాల, వయస్సులాంటి విషయాలు ఇందులో వ్రాయబడ్డాయి. మాధవ నిదానమునందు మాధవుడు ద్రవ్య నిఘంటువులోని 28వ అధ్యాయంలో అనుపాన విధి గూర్చి వ్రాసారు. అనుపానాలుగా తోయము, ఆసవ, యూషములు వాడకం గూర్చి వ్రాసారు. చక్రపాణి దత్త అనుపానంగూర్చి ఒక వర్గములో చర్చించారు. అనుపాన యుక్తాయుక్తములు దోషాలు మోతాదులను ఇందు చర్చించారు.

కైయిదేవ నిఘంటునందు విహారవర్గమునందు అనుపానం గూర్చి వ్రాసారు అయితే ఇవి సుశృతములో నుండి తీసుకుని వ్రాసారు. మదనపాల నిఘంటువు నందు మిశ్రక వర్గమందు అనుపానముల విషయములగూర్చి వ్రాసారు.

కళ్యాణకారక నందు అనుపానాధికరణమునందు అనుపానం గూర్చి వ్రాసారు. ఇందు రసాయన యోగములందు రసాయనములకు క్వాథము లను తయారుచేసి అనుపానములుగా వాడటం చెప్పాడు.

'శారంగధర' మధ్యమ ఖండమునందు చూర్ణకల్పములో అనుపానం, మోతాదు, నిరుక్తి, పరిభాష, ఎందుకు పని చేస్తుందో కూడా వివరాలు గలవు.

అలాగే భావమిశ్రుడు భేషజ విధాన ప్రకరణమునందు సారంగధరుని ఆలోచన ప్రకారం అనుపానాన్ని నిర్వచించారు.

రాజ నిఘంటువునందు నరహరి పండితులు 2 రకాల అనుపానాలు చెప్పాడు. అవి 1. క్రామణ 2. పాచన అనుపానం ఇక ఎందులోనూ అను పానం గూర్చి ప్రత్యేకించి వ్రాయలేదు.

## ఆధునిక కాలం (1700 క్రీ.శ)

యోగరత్నాకరమునందు చివరి అంశమునందు రసాయనాధికార ములో అనుపానం గూర్చి రచయిత చర్చించారు. అనుపానాలుగా కిరాత, ముస్తలు, పర్పాటకము, జ్వరచికిత్సలో వ్రాసారు. స్వర్ణమును గర చికిత్స (విష చికిత్స) యందు అనుపానంగాను, వాత వ్యాధికి గుగ్గులు అనుపానంగాను అను పానాలు చెప్పారు. ఉదర రోగమునందు విరేచనం, అజీర్ణము నిద్రలేకుండుట వల్ల అరుచి, ఊర్థ్వ జత్రురోగములకు నశ్యకర్మ, మూర్ఛరోగానికి శీతవిధి, విద్రదికి రక్తమోక్షణ లాంటి చికిత్స అనుపానాలు ఇందు ప్రత్యేకించి వ్రాయ బడ్డాయి.

భైషజ్యరత్నావళి, వంగసేన, గదనిగ్రహముల యందు ప్రత్యేకముగా ప్రత్యేక లక్షణ అనుపానాలు వ్రాసారు.

రసశాస్త్రానికి సంబంధించిన అనుపానాలు ఆయుర్వేద ప్రకాశిక నందు మొదటిగా మనకు కన్పిస్తాయి.

ఉదా:- రస సింధూరం మందుగా వాడేటప్పుడు అనుపానాలుగా చిత్ర మూలం, పంచదారలను కఫ, పిత్తరోగాలలోను వాడేవారు రసతరం గిణికారుడు అనుపానం ఎలా శరీరమునందు ఉపయోగపడుతుందో తెల్పాడు. రోగగణభైషజ్యము అనునది అనుపాన పర్యాయపదము. రసజల నిధి నందు గంధక అనుపానములను వివిధ అనుపానములను, పథ్యాపథ్యాలను చెప్పారు. అయితే కొన్ని కొన్నిచోట్ల కొన్ని రసౌధాల అనుపానాలను చెప్పారు. అనుపాన మంజరి, అనుపాన తరంగిణి, అనేక శాస్త్రీయ ఔషధ పార్మశీల వారి క్యాటలాగులోను, అనుపాన కల్పతరు, అనుపానవిధి, అనుపాన దర్పణమ్‌లాంటి పుస్తకములయందు అనుపానాల గూర్చి రోగానుపానములు, మోతాదులు చర్చించారు ఆయా గ్రంథకర్తలు.

మోనియర్ విలియమ్స్ మరియు స్టేడ్ మన్స్ మెడికల్ డిక్షనరీనందు అనుపానమును వాహకముగా, తినేదానిగా ప్రధాన పదార్థం యొక్క చర్యను క్రమబద్ధీకరించేదిగా వ్యాధిని హరింపచేసి, శక్తిని ఇచ్చేదిగా వ్రాసారు.

ఆధునిక వైద్యపారిభాషిక పుస్తకాలలో అనుపానం గూర్చి చెప్పినదే మనగా ఒక మందును శరీరము, వ్యాధి, ఉపయోగములను అనుసరించి మందు సవ్యంగా పనిచేయుటకు అనుగుణమైన పదార్థమే అనుపానము. అనుపానమును చికిత్సయందు రోగమందు, శారీరక, మానసిక పరిస్థితులను అనుసరించి కాలానుగుణంగా వాడాలి.

# అనుపానం

ఆయుర్వేదంలో పరిపూర్ణంగా జీవించుటకు తగిన ఆహార పదార్థాలు, పోషకాలు, పానాలను గూర్చి చెప్పారు. అందు అనుపానం గూర్చి విశేషమైన ప్రాధాన్యత వైద్యశాస్త్రంలో గలదు. ఆహారంతోపాటు తీసుకొనే పానీయమును బట్టి ఆహార గుణలక్షణాలు ఎలామారతాయో తెలిపే అపూర్వ విజ్ఞానమే ఈ అనుపాన వైద్యం.

అసలు అనుపానం అంటే–

**"అనుసహ పశ్చాత్ వా పీయతే ఇతి అనుపాన"** ఆహారంతో లేదా మందుతో ఏదైతే కలుపుకొని లోనికి తీసుకొంటున్నామో దానినే అనుపానం అంటారు. అంతేగాక–

**"తద్వత్ రోగజ్ఞాన భేషజమ్ భేషజస్యానుపీయతే యచ్చ**
**సహాయకారీ స్యాద్ అనుపానమ్ తద్ ఉచ్యతే।**

ఏ రోగమందు ఏది అవసరమో ఏది అనవసరమో నిర్ణయించి వ్యాధి నిర్మూలనకు అవసరమైన యుక్తపానీయమే అనుపానం అని చెప్పబడును.

సంహితలలో –

1. అనుపానం గూర్చి బృహత్రయ గ్రంథాలలో వివరించారు.
2. సుశృతంలో అనుపాన వర్గం గూర్చి సూత్రస్థానంలో చెప్పారు.
3. చరకం సూత్ర స్థానంలో ఆసవారిష్టాల అనుపానం చెప్పారు.
4. రస తరంగిణి మొదలైన గ్రంథాలలో రసౌషధములకు అనుపానాలు విసృతంగా చెప్పారు. అష్టాంగ సంగ్రహం, అష్టాంగ హృదయం, శారంగధర సంహితలలో అనుపాన విశేషాలు చాలాఉన్నాయి.

లోనికి తీసుకొనే పానాలు 3 రకాలు.

1. పానం 2. సహపానం 3. అనుపానం

**1. పానం :** "యద్నియత కాలమ్ రుచివశాత్ పీయతే తత్ పానమ్"
(అష్టాంగ హృదయం)

కాలనియమం లేకుండా రుచికోసం లోనికి తీసుకునేది పానం.

**2. సహపానం :** "యద్ యోగేన రసదినమ్ విభక్త పరమాణవః ధృతమ్.
అగ్నేషు సర్వత్ని సహపానమ్ తద్ ఉచ్యతే ( రసతరంగిణి)

ధాతువులన్నింటిలోకి వేగముగా ఏదైతే పంపిణీ చేయగలదో దానినే సహపానమని పిలుస్తారు.

**3. అనుపానం :** "యద్ నియతకాలమ్ విధివశాత్ పీయతే తత్ అనుపానమ్" (అష్టాంగ హృదయం)

ఖచ్చితమైన కాలం, నియమం, నిర్ణయం ఉండే పానమునకు అనుపానమని పేరు.

## అనుపానం ఎలా నిర్ణయిస్తాం

1. ఆహారానికి విరుద్ధ లక్షణాలు గల దానిని అనుపానంగా వాడాలి.

ఉదా: 1. రూక్షణ అనుపానాన్ని స్నిగ్ధ ఆహారానికి అనుపానంగా వాడాలి.

2. ఆమ్లరస అనుపానాన్ని మధుర రస ఆహారానికి అనుపానంగా వాడాలి.

3. శీత అనుపానాన్ని ఉష్ణ ఆహారానికి వాడాలి. ఇది ఆ ధాతువునకు సహాయకారిగా ఉండాలేకాని వ్యతిరేకంగా ఉన్న అనుపానాన్ని వాడరాదు.

**మంచి అనుపానం ఏమిటి ?**

**"సర్వేపానమ్ అనుపానానామ్ మహేంద్రమ్ తోయముత్తమమ్"**

వర్షపునీరే మంచి అనుపానం నీరు అంటే వర్షపునీరని అర్థము, దానినే మంచి నీరని పిలుస్తారు.

**అనుపాన మోతాదు ఎంత ఇవ్వాలి ?**

అనుపాన మోతాదు అనేది దోషాల మీద ఆధారపడి ఉంటుంది. కావున దోషాన్ని అనుసరించి అనుపానమోతాదు నిర్ణయించాలి. సాధారణంగా...

వాతరోగాలలో 1 ఫలం దాదాపు 50 గ్రా. (48గ్రా.)

పిత్త రోగాలలో 2 ఫలాలు దాదాపు 100 గ్రా. (96గ్రా.)

కఫరోగాలలో 3 ఫలాలు దాదాపు 150 గ్రా. (144గ్రా.)

**దోషాలకు సాధారణంగా ఇచ్చే అనుపానాలు**

**1. వాతదోషం :** సుర, సౌవీరక, తుషోదక, మేదక, ధాన్యామ్లా, ఫలామ్లా వీటిని అనుపానంగా వాడాలి.

**2. పిత్తదోషం :** మృద్విక స్వరస, ఆమ్లకిస్వరస, పరుషక స్వరసాలు వాడాలి.

**3. కఫ దోషం :** మధు, గోమూత్ర, క్వాథములు వాడాలి.

**అనుపానములు వాడే కాల నిర్ణయం.**

1. ఇది చాలా ముఖ్యవిషయం ఎందువల్లనంటే కాలము అనేది అను పానాన్ని విధిని విశదీకరిస్తుంది. అనగా మందు పనిచేయటం, పనిచేయక పోవటం అనుపాన కాలంమీద ఆధారపడి ఉంటుంది.

ఉదా:- 1. ఆహారం తీసుకొన్న తర్వాత బృంహణ అనుపానాన్ని మందును వాడాలి.

2. ఆహారం తీసుకోకముందు కార్శ్య అనుపానాన్ని

3. ఆహారంతోబాటు స్థిరత అనుపానాన్ని వాడాలి.

**అనుపానం - మార్పులు**

1. ధాతువులు సరిగ్గా పనిచేయటానికి

2. ఆహారమందు రుచిని పొందే విధంగాను

3. మానసిక శాంతి, భౌతిక శాంతి కల్గుటకు

4. ఆహారం పూర్తిగా జీర్ణమవుటకు

5. శారీరక వృద్ధి కల్గుటకు

6. శారీరక, మానసిక వికారాలు తొలగుటకు

7. శరీర కాంతికి అనుపానం వాహకంగా ఉత్ప్రేరకంగా, అనుపానం ఉపయోగపడుతుంది.

**ఒకే మందును వివిధ అనుపానాలతో ఎలా ఇవ్వవచ్చును ?**

ఉదా:-1. కైశోర గుగ్గులు, (గుటిక యోగం)

1. నేత్రరోగం - వాసా కషాయం

2. గుల్మ రోగం - వరుణాదికషాయం

3. వ్రణ, కుష్ఠ - ఖదిర కషాయం

4. వాతరక్త - మంజిష్టాది కషాయం అలాగే-

ఉదా:- 2. నారాయణ చూర్ణం

1. ఉదర రోగం – తక్రం
2. గుల్మ రోగం – బదర కషాయం
3. విబంధ – సురా
4. వాతరోగము – ప్రసన్న
5. ఆర్మ – దాడిమా కషాయం
6. అజీర్ణం– వేడినీరు

**అనుపానాన్ని ఎలా ఎన్నుకోవాలి / ఎంచుకోవాలి?**

1. దోష 2 దేశ 3 రోగ 4 ఆహార 5 ఔషధము 6 రోగి 7 కాల అనే విషయాలు గుర్తించి అనుపానాన్ని ఎంచు కోవాలి.

1. దోషం : వాతదోషం – స్నిగ్ధ మరియు ఉష్ణ
2. పిత్తదోషం – మధుర మరియు శీత
3. కఫదోషం – రూక్ష మరియు ఉష్ణ
4. రక్త దోషం – క్షీర మరియు ఇక్షు రస

2. దేశ : ఏదేశమువారి యొక్క ప్రాంతాన్ని అనుసరించి అనుపానం మారవచ్చు.
3. రోగం : పాలురక్త పిత్తమందు, ఆర్ధక స్వరసం జ్వరమునందు
4. ఆహారం : పధ్యాహారము, రోగిని బట్టి మారవచ్చు
5. ఔషధం : నెయ్యి తర్వాత వేడినీరు సేవనం లాంటివి
6. రోగి రోగం అనుసరించి రోగి పరిస్థితిని బట్టి అనుపానం

**కాలం** : ఋతువునుబట్టి అనుపానం మారుతుంది.

1. శిశిర ఋతువు – పిప్పలి
2. వసంత ఋతువు – మధు
3. గ్రీష్మ ఋతువు – గుడము
4. వర్ష ఋతువు – లవణం
5. శరత్ ఋతువు – శీతజలం
6. హేమంత ఋతువు – శొంఠి

**వాగ్భటాచార్యుడు చెప్పిన అనుపానాలు, రోగాలు**

1. శూల - హింగు+ఘృత
2. జీర్ణజ్వర-పిప్పలి+మధు
3. వాతవ్యాధి - రాస్నా +ఘృత
4. శ్వాస - త్రికటు+మధు
5. శీత (రొంప) - తాంబూల+మరీచ
6. ప్రమేహ - త్రిఫల+శిలాజిత్తు
7. సన్నిపాత - ఆర్ద్రక స్వరస + తేనె
8. గ్రహణి - తక్ర
9. విష- స్వర్ణ
10. వమన - లాజ
11. అతిసారం - కుటజ
12. రక్తపిత్త-వాసా
13. అర్శ - చిత్రక
14. క్రిమి-విడంగ
15. అజీర్ణ-వేడినీరు
16. క్షయ-పాలు, మాంసరసం
17. పాండు - పునర్ణవా
18. కాస - వాసా

**అనుపానాన్ని ఎలా నిర్ణయించాలి ?**

1. దోషం 2. రోగం 3. ఔషధం 4. ఆహారం

1. దోషాన్ని అనుసరించి
   1. వాత దోషంలో - స్నిగ్ధ, ఉష్ణ
   2. పిత్త దోషంలో - మధుర, శీత
   3. కఫ దోషంలో - రూక్ష, ఉష్ణ
2. రోగాన్ని అనుసరించి
   1. రక్తపిత్త-చక్కెర రసం,పాలు
   2. విష - అర్క, శిరీష, ఆసవాలు
3. మందులు

1. ఔషధ నిర్మాణం 2. ఏక మూలికా యోగాలు

ఔషధ నిర్మాణాలు : కల్కం, చూర్ణం, కషాయం, స్నేహ, రసౌషధాలు, కల్కమునకు అనుపానాలు : 1 తేనె, నెయ్యి, నూనె ఇవి ద్విగుణమాత్రా పరిమాణం. ఇవికాక మిగతా ద్రవ ద్రవ్యాలు (నాలుగు భాగాలు)

రసోనకల్కం – తిల తైలం

నింబకల్కం – జలం

**చూర్ణమునకు అనుపానాలు :** లేహ్యాల కొరకు నెయ్యిను రెండింతలు, పానం కొరకు నాలుగింతలు నెయ్యి వాడాలి.

**హింగ్వాష్టకచూర్ణం :** ఘృతం అనుపానం

**శీతోఫలాది చూర్ణం :** నెయ్యి, తేనె

**కషాయములో అనుపానం :**

1. మహారాస్నాది క్వాద – ఆముదము
2. దశమూల కటుత్రయంలో – తేనె
3. సప్త సౌరం క్వాధలో – నెయ్యి అనుపానాలు

రసౌషధాలలో అనుపానం ఉపయోగమేమి ?

1. రసౌషధాలను అనుపానంతోనే ఇవ్వాలి. ఇలా ఇవ్వటం వల్ల అనేక చర్యలు జరుగును.

ఉదా:– 1. రసౌషధములోని విషాన్ని తగ్గించటానికి / తీసివేయటానికి
2. శరీరానికి సరిపడే తత్వాన్ని మందుకు కల్పించటానికి
3. నిదానంగా మందు పనిచేయడానికి.

ఉదా: అగ్నికుమార రసం

1. ఆమజ్వరం – తేనెతో
2. కఫజ్వరం – అల్లం స్వరసంతో
3. పీనస – అల్లం స్వరసంతో
4. అగ్నిమాంద్య – లవంగకషాయంతో
5. శోఫ – దశమూల కషాయంతో
6. గ్రహణి – శొంఠి కషాయంతో
7. అతిసారం – తుంగముస్తల కషాయంతో
8. సన్నిపాతజ్వరం – పిప్పళ్ళ కషాయంతో

9. శ్వాస – నువ్వుల నూనెతో

10. కాస – కంటకారీ కషాయం. ఈ విధంగా అనుపానం మారితే రసౌషధాల గుణం మారును. కావున అనుపానాన్ని జాగ్రత్తగా ఎంచు కోవాలి

**ఏకమూలికా యోగాలలో అనుపానం ?**

ఏకమూలికా యోగంలో అనుపానాన్ని ఋతువును బట్టి మార్చాలి. ఉదా:– హరీతకి (కరక్కాయ)

1. గ్రీష్మ – బెల్లం; 2. వర్ష – లవణం; 3. శరత్ – సిత; 4. హేమంత–నాగర; 5. శిశిర – పిప్పళి; 6. వసంత–తేనెలతో ఆయా రోగాలలో వాడాలి.

## ద్రవ్య వర్గాలు - రసగుణ వీర్య విపాక ప్రభావాలు

## శుకధాన్య వర్గం

**శాలి (వరి) :** మధురరసం, కషాయరసం, లఘు, స్నిగ్ధ గుణం, మధుర విపాకం. అల్పవాతకర, పిత్తనాశక, అల్పకఫహర, బల్య,రుచ్య, బృంహణీయ, సప్తధాతు, వర్ధక, వృష్య.

**రక్తశాలి (ఎర్రబియ్యం) :** త్రిదోష హర, బల్య,వర్ణ్య, చక్షుష్య, మూత్రల, శుక్రలా, జ్వరభంగ, దీపన, విష, వ్రణ, శ్వాస, కాస, దాహ.

**షష్టిక :** మధురరస, శీతవీర్య, స్నిగ్ధ, లఘు, మధుర విపాక, త్రిదోష హర, బృంహణ, స్థిరకర, వర్చకర.

**వ్రీహి :** మధుర, కషాయరస, గురు గుణ మధుర విపాక, పిత్తవర్ధక సప్తధాతు వర్దక, అభిష్యంది

**గోధుమ :** మధురరస, గురు స్నిగ్ధ, సర, శీతవీర్య, వాతనాశక, పిత్త నాశక, కఫకర, రుచిప్రద, స్థిర్యకర, సంధానకర, జీవనీయ, వర్ణ్య, వృష్య,బృంహణ.

**యవ (బార్లీ):** మధుర, కషాయరస, గురు, రుష్య, మృదు, శీతవీర్య, బహు వాతకర, పిత్తనాశక, కఫనాశక, స్థలవిలేఖన, మేదానాశక, వృష్యకాంత రోగ హర, కాసహర, శ్వాసహర, పీనాసహర, స్థైర్యహర, వ్రణకర.

**శ్యామక, కోద్రవ, నీవార :** మధుర, కషాయరస, లఘురుక్ష, ఉష్ణ వీర్య కటుమధుర విపాక, వాతల, పిత్తహర, కఫహర, సంగ్రాహి, ధాతు శోషణ, లేఖన, బద్ధవిట్.

**ముద్గ (పెసలు):** కషాయం, మధుర రస రుక్ష్య,లఘు,విషద, శీతవీర్య, కటు విపాక, వాతకర, పిత్తనాశక, కఫఘ్న, చక్ష్యుష్య, జ్వరఘ్న, అద్మానకర, బద్దపురుష, మూత్ర.

**మాష (మినుములు):** మధుర రస, గురు ఉష్ణ, స్నిగ్ధ,మధుర విపాక, వాతనాశక, కఫహర, బహుమలకర, మూత్రలా, రుచ్య, పిత్తశూలహర, సంతర్పక, స్తన్యహర, బృంహణ, బల్య, మేదోవర్ధక, శుక్రవర్దక.

**మసూర (లెంటిల్స్) :** మధుర, కషాయరస, లఘుశీతవీర్య, మధుర విపాక, పిత్తహర, కఫహర, వాతల, సంగ్రాహి, అద్మానక్ర, జ్వరనాశనం, రూక్షణం.

**రాజహంస :** మధుర, కషాయరస, గురువిషాద, రూక్ష, మధుర విపాక, వాతకర, కఫహర, రుచ్య, బల్య, స్తన్యజన, సంతర్పణ, పురుషభేది, అమృతల

**కులత్థ (ఉలవలు):** కషాయరస లఘు ఉష్ణవీర్య కటు లేదా ఆమ్ల విపాక రక్త దుష్టికర, మేదానాశక, శుక్రనాశక, విదాహి, పీనసహర, కృమిహర, అర్శహర.

**మకుష్ఠ (కిడ్నీబీన్):** లఘు,రూక్ష, శీత వీర్య, మధుర విపాక, వాతల, పిత్తకర, కఫఘ్న, గ్రాహీ, దీపన, జ్వరహర, రక్తపిత్తహర, కృమిహర.

**సర్షప (ఆవాలు) :** కటు, తిక్తరస, స్నిగ్ధ, ఉష్ణ తీక్ష్ణ కటు విపాక వాతఘ్న పిత్తకర, కఫఘ్న, అగ్నివర్ధక, అక్షోహర, కండుహర, కుష్టహర, కోష్టక్రిమి హర.

**రాజిక (ఇండియన్ ఆవాలు) :** తీక్ష్ణ, ఉష్ణ, కఫి పిత్తహర, రక్తపిత్త, వర్ధక, కండుకుష్ఠి, కోష్ట క్రిమిహర.

**అడకి (రెడ్‌గ్రామ్) :** మధుర, కషాయరస, లఘురుక్ష, శీతవీర్య, మధురవిపాక, వాతకర, పిత్తనాశక, కఫనాశక, గ్రాహి, వర్ణ అవృష్య

**కలాయ(పిగ్నియాన్) :** మధుర, కషాయరస, లఘురూక్ష, శీతవీర్య, మధుర విపాక, వాతకర, పిత్తహర, కఫహర, రూక్షణ, మలబందకర

**నిష్పావ ( ప్లాట్‌బీన్) :** మధుర, కషాయ, రస, గురు రూక్షసార ఉష్ణవిర్య, అమ్లవిపాక, వాతకర, పిత్తకర, కఫహర, రక్తకర, శుక్రహర, విదాహి, స్తన్యకర, శోధహర, దృష్టిహర.

**చణక (బెంగాలి గ్రామ్) :** కషాయం మధురరస, రుక్షణలఘు, శీతవీర్య, వాతకర, పిత్తనాశక, కఫనాశక, విష్ఠంబి, జ్వరనాశక, పుంసత్వనాశక, రూక్షణ

**తిల (నువ్వులు) :** మధుర, తిక్త, కషాయరస, గురుస్నిగ్ధ, ఉష్ణవీర్య, మధుర మరియు కటువిపాక, వాతఘ్ను పిత్తకర, కఫహర, అగ్నినాశక, మేదోకృత్ బల్య, త్వచ్య సన్ప, వర్ణన, గ్రాహి కేశ్య స్తన్య వర్ధన.

**అతసీ (లిన్‌సీడ్) :** మధుర, తిక్తరస, గురుస్నిగ్ధ, ఉష్ణవీర్య, కటువిపాక, వాతఘ్ను, పిత్తకర, కఫనాశక, శుక్రనాశక.

## శాకవర్గ (కూరగాయలు)

**అలూక (యామ్) :** మధురరస, రూక్ష్య గురుశీత మధురవిపాక, వాత కర, కఫకర, విష్ఠంబి, రక్తపిత్తకర, సృష్ఠ, విట్, మూత్ర.

**ఆర్ద్రక (జింజర్) :** కటురస, గురుతీక్ష్ణ రూక్ష్య ఉష్ణవీర్య మధురవిపాక, వాతనాశక, కఫనాశక, దీపన, బేధన, రూక్ష్య, జిహ్వాకంఠ, విశోధన.

**శిగ్రు (మునగ) :** మధుర, కషాయరస, లఘురూక్ష, తీక్ష్ణ శీతవీర్య, మధురవిపాక వాతహర, మేదోహర, శుక్రవర్ధక, క్రిమిహర, బృంహణ, చక్షుష్య, ప్లీహఘ్ని, విషఘ్ను.

**చుక్రిక (బ్లాడర్ డక్) :** ఆమ్లు, స్వాధు లఘు, వాతఘ్ను, రుచ్య, రోచనీ.

**ధాన్యక (ధనియాలు):** మధుర, కటుతిక్త, కషాయరస, లఘుస్నిగ్ధ ఉష్ణవీర్య, మధురవిపాక త్రిదోషశ్యామక, దీపన పాచన గ్రాహి, మూత్రల, హృద్య చక్షుష

**ఏల(ఏలకులు) :** కటు,మధురరస, లఘురూక్ష్ణ, శీతవీర్య, కటువిపాక, వాతనాశక, కఫనాశక, పుంసత్వఘ్ను, హృద్య, దీపన, రోచన

**ఏర్వారుక (కుకుంబర్) :** మధురరస, గురురూక్ష శీతల, మధురవిపాక, వాతకర, కఫహర, భేది, గ్రాహి, విష్ఠంబి, రుచ్య, మూత్రల దీపన.

**హింగు (అసఫ్‌పోటిడ-ఇంగువ) :** కటురస, తీక్ష్ణ ఉష్ణవీర్య కటువిపాక, వాతకఫప్రసమణ, రుచ్య, దీపన, పాచన అనులోమన క్రిమిఘ్న, హృద్య, శూలహర, ఆర్తవజననా

**కారవేల్లిక (బిట్టర్ గౌట్) :** లఘు, తిక్త, శీత, కటువిపాక, వాతకర, పిత్తనాశక, కఫ నాశక, దీపన, రోచన, పాండుహర, క్రిమిహర, ప్రమేహహర, జ్వరహర.

**కూష్మాండ (బూడిద గుమ్మడి) :** మధుర, గురు స్నిగ్ధ, శీత మధురవిపాక పిత్తనాశక, కఫ నాశక, ధాతు పుష్టికర వృష్య

**కర్కోటక (టెస్‌ల్లే గౌటు) :** తిక్తరస, లఘు ఉష్ణ వీర్య, కటువిపాక, పిత్తహర, కఫహర, వాతల, రోచన దీపన కాసఘ్న, శ్వాసఘ్న, జ్వరఘ్న, కుష్ఠనాశన

**లశున (వెల్లుల్లి) :** కటు, మధుర, స్నిగ్ధ, గురు తీక్ష్ణసర, ఉష్ణవీర్య, మధుర విపాక, వాతనాశక, కఫనాశక పిత్తవర్ధక, క్రిమిఘ్న, గుల్మనాశన, రుచికర, విబందగ్న, పాచన, కుక్షిశూలహర, కుష్టఘ్న, జీర్ణజ్వరహర, చక్షుష, రసాయన, వృష్య.

**మూలక (రాడిస్):** కటు, తిక్త, లఘు, ఉష్ణవీర్య, సర్వదోషహర, రోచన, గలరోగ హర, స్వరరోగహర, పాచన, హృద్య, ఉదావర్తఘ్న, శ్వాసహర, కాస హర, క్షయహర, వ్రణహర, జ్వరనాశన.

**మేధిక (పినుగ్రీక్):** తిక్తరస, స్నిగ్ధ, ఉష్ణవీర్య కటువిపాక, వాతశమన, పిత్తకర, కఫఘ్న, దీపన, రుచ్య, జ్వరహర, కృమిఘ్న

**పటోల (పార్వల్):** తిక్త లఘు ఉష్ణమధుర, పిత్తహర, కఫహర, వాతల, త్రిదోష హర, రోచక, దీపన, పాచన, కాసహర, హృద్య, రక్తవికారహర, జ్వరహర.

**పలాండు (నీరుల్లి) :** కటు మధుర, ఉష్ణ, గురుస్నిగ్ధ ఇషట్ ఉష్ణ మధుర విపాక, వాతనాశక, పిత్తశమక, శ్లేష్మం, రోచక, అగ్నివర్ధక, బల్యవీర్యకర.

**పలఖ్య(స్పినచ్) :** మధురరస, గురురూక్ష, శీతవీర్య మధుర విపాక, వాతల, పిత్తహర, కఫహర, పురీషబేదిని, విష్ఠంబి, మేదోహర, శ్వాసహర, మదోపహ.

**పత్ర :** మధుర, కటురస, లఘు, తీక్ష్ణ, పిచ్ఛల, ఉష్ణవీర్య, కఫవాత

హర, రుచ్య, ఆర్శోఘ్న, హృల్లాస, అరుచి, పీనస.

**పోతకి :** శీత, స్నిగ్ధ, పిచ్ఛల, వాతపిత్తహర, కఫకర, బల్య, రుచ్య, శుక్రల, నిద్రజనక, భృంహణ, పత్య, తృప్తికర.

**తండులీయక (తోటకూర):** మధురరస, లఘు, స్నిగ్ధ శీతవీర్య మధురవిపాక, పిత్త హర, కఫహర, రక్తవికారహర, దీపన, సృష్టమల పృష్ఠమూత్ర రుచ్య, విషఘ్న

**కపుస (కుకుంబర్) :** మధుర, రూక్ష, గురు, లఘు, శీతవీర్య, పిత్తనాశక, ముఖప్రియ, రక్తపిత్తహర, దాహజిత్, మూత్రల విష్ఠంభి.

**త్వక్ (దాల్చిన) :** కటుమధుర, తిక్త, రస, లఘు తీక్ష్ణ, రూక్ష, ఉష్ణవీర్య, కటువిపాక, వాతనాశక, కఫనాశక, రుచ్య, విషఘ్న, కాంతి శుద్ధికర, శుక్రవర్ధక వర్ణ్య గ్రాహి.

**ఉపకుంచిక (ఇండియన్ దిల్‌ఫ్రూట్) :** కటుతిక్త రస, లఘురూక్ష ఉష్ణ, వీర్య కటువిపాక, వాతనాశక, పిత్తకర, కఫనాశక, రుచ్యగ్రాహి, చక్షుష్య గర్భశయవిశోదన, దీపన పాచన మేద్య, హృద్య

**ఉపోదికా :** మధురరస, గురుపిచ్ఛల లఘు సిగ్ధ, శీత, వాతహర, పిత్తహర, కఫవాత, వర్ధిక, పృష్య, బేధన, బల్య, బృంహణ.

**వార్తాక** (బ్రింజల్) : తిక్త, కటు, మధుర, లఘు, తీక్ష్ణ, ఉష్ణవీర్య మధురవిపాక కఫహర, వాతనాశక, దీపన, రోచన, హృద్య, క్షీరజనన, జ్వరఘ్న.

**వాస్తుక :** మధుర, లఘుసర, కటు, విపాక, త్రిదోషహర, దీపన,పాచన, రుచ్య శుక్రల, కృమిఘ్న గ్రాహి, ప్లీహపహ, ఆర్శోఘ్న

**వరాహి (పోటాటోయామ్) :** మధుర లఘు తిక్తరసం, వాతహర, కఫహర, పిత్త వర్ధక, వీర్యవర్ధక, వర్ణ్య, దీపన, కుష్ఠఘ్న.

## మాంసవర్గ

**అజా (గోట్) :** మధురరస, స్నిగ్ధ, నాటిగురు నాటిశీత వీర్య మధురవిపాక, త్రిదోష నాశక, వీర్యవర్దన, సృతికర, బృంహణ, బల్య, రుచ్య, పినసనాశన

**అవి (గొర్రె) :** మధురరస, గురు స్నిగ్ధ, శీతవీర్య, పిత్తకర, కఫకర, అభిష్యంది వృష్య, బృంహణ.

**కుక్కుట (కోడి) :** కషాయరస, స్నిగ్ధ, గురు ఉష్ణవీర్య, వాతహర, కఫకారక, వృష్య స్వేదజనన బల్య బృంహణ,క్షయనాశన, విషమజ్వరనాశన, చక్షుష్మ

**వరాహ(పంది) :** గురు, ఉష్ణ, స్నిగ్ధ, వాతనాశక, పిత్తకర, కఫకర, స్థౌల్యకర, దద్రుకర, వృష్య, రోచన

**ఈన (డీర్) :** మధుర, కషాయ,రస, లఘుశీతవీర్య, మధుర విపాక, త్రిదోష విపాక, త్రిదోషశమన, రక్తదోషనాశక, బల్యరోచన, జ్వరహర, హృద్రోఘహర

**శశ (కుందేలు) :** కషాయరస, లఘురూక్ష, విషద, శీతవీర్య, కటు మధురవిపాక, అల్పవాతకర పిత్తనాశక, దీపన, శ్వాసహర, అతిసారహర, గ్రాహి, జ్వరహర, శోధహర.

**మయూర (నెమలి) :** మధుర, లవణ కషాయ, స్నిగ్ధ, ఉష్ణవీర్య, మధురవిపాక, వాతహర, బల్యశుక్రల శౌర్య శ్రోతోహిత, రుచికర అగ్నిహిత వర్ణ్య.

**లావక (బటన్ క్వయిల్) :** కషాయ మధురరస, లఘుస్నిగ్ధ, కటువిపాక త్రిదోషహర, గ్రాహి, అగ్నిదీపన

**గోదా( ఇంగ్వన) :** కషాయ, కటుతిక్త, వాతపిత్తహర, బల్య బృంహణ

**కపోత (పావురం) :** కషాయరస, విషద, గురు స్నిగ్ధ, శీతవీర్య, మధురవిపాక, వాతహర, కఫహత హర గ్రాహి

**తిత్తిర :** మధురరస, గురు ఉష్ణవీర్య, త్రిదోషహర, వాతహర, వృష్య, గ్రాహి, హిక్కాపహ, కాసహర, శ్వాసహర, మేదోవర్ధన వర్ణ్య జ్వరహర.

**శూక్ర (చిలుక) :** లఘు, రూక్ష్య, కషాయి, శీత, పిత్తహర, గ్రాహి, శోషహర

**చటక (పిచుక) :** స్నిగ్ధ, మధుర, వాతహర, శుక్రవర్దన, బల్య

**మత్స్య (చేపలు):** మధురరస, గురుస్నిగ్ధ మధురవిపాక, వాతఘ్న, పిత్తకర, కఫకర, వృష్య దీపన, రోచక, బృంహణ, అల్పవర్చసకర

**రోహితమత్స్య :** కషాయ, మధుర రస, లఘు వాతహర, అల్ప పిత్తకర, దీపనీయ శుక్రలా, బల్య, అర్జిత వాతం.

**అనూప :** స్నిగ్ధ, గురు, పిచ్ఛలి, అభిష్యంది మధుర, కఫకర, అత్యతమాంస పుష్ఠికర

**జాంగల :** మధుర, కషాయరస, లఘు, అల్పవాతకర, పిత్తహర, కఫహర వృష్య బల్య వస్తిశోధనక

**గ్రామ్య :** మధుర రస, వాతహర, కఫపిత్తకర, బల్య, బృంహణ.

**అండ (గుడ్లు) :** కొంచెం స్నిగ్ధ, గురు, మధుర, మధురవిపాక, వాతనాశక, అతి శుక్రల సద్యోబలకర

## జలవర్గ

**ధారజల (వేడినీరు):** లఘు, శీత, అవ్యక్తరస, త్రిదోషనాశక, బల్య, బృంహణ, రసాయన

**న్నాదేయజల (నదినీరు) :** రూక్ష, లఘ అభిష్యంది కటు వాతకర, పిత్తహర, కఫహర

**సారసజల(చెఱువునీరు) :** మధుర కషాయ కటువిపాక, పిత్తహర, కఫహర

## దుగ్ధ వర్గ (పాలువర్గం)

**గోక్షీర (ఆవుపాలు):** మధురరస, గురుస్నిగ్ధ, మృధుసర శీతవీర్య, మధురవిపాక, వాతనాశక, పిత్తనాశక, బల్య రసాయన, వీర్య వృద్ధికర మేద్య,స్తన్యకర శ్రమ నాశక, కాసనాశక, శ్వాసనాశక, జీర్ణజ్వర నాశక.

**మహిసాక్షి క్షీర (గేదెపాలు) :** మధురరస స్నిగ్ధ, గురు శీతవీర్య, వాతకర, కఫకర, శుక్రకర, మహబిష్యంది నిద్రాకర, క్షుదాదిక్యహర

**అజాక్షీర (మేకపాలు) :** మధుర, కషాయరస, లఘు, శీతవీర్య, త్రిదోషఘ్ని, గ్రాహి, రక్తపిత్తఘ్ను, అతిసారఘ్ను దీపన కాసఘ్ను శ్వాసజిత్ క్షయపహ.

**ఆవికక్షీర (గొర్రెపాలు) :** మధుర, లవణరస, గురు స్నిగ్ధ, ఉష్ణవీర్య, పిత్త కఫవర్ధక, వృష్య, తర్పణ, శ్వాసహర, హిక్కాహర, కేశ్య

**ఉష్ట్రక్షీర (ఒంటెపాలు) :** మధుర లవణరస, రూక్ష ఉష్ణ లఘు సర వాత కఫహర, దీపన, క్రిమిహర, కుష్ఠఘ్ను అనాహహర, ఉదరఘ్ను

**హస్తిక్షీర (ఏనుగుపాలు) :** మధుర, కషాయరస, గురు స్నిగ్ధ, శీత

పిత్త కఫహర, వృష్య బల్య బృంహణ, చక్షుష్య స్థైర్యకర

**నారిక్షీర (స్త్రీ పాలు) :** మధుర, స్నిగ్ధ, త్రిదోషహర, జీవనీయ, బృంహణ, దీపన, చక్షుష్య, శూలఘ్ని, నస్యములకు మంచిది, అస్యోచటన.

**ధారోష్ణక్షీర (వేడిపాలు):** లఘు, శీత, త్రిదోషఘ్ను, సుధాశమ, దీపన,

## దధి, తక్ర నవనీతవర్గ

**దధి (పెరుగు) :** మధుర, ఆమ్ల రస, స్నిగ్ధ ఉష్ణ గురు మధురవిపాక, వాతహర, పిత్తకర, కఫకర, రుచ్య, దీపన, హృద్య పుష్ఠికర బల్య.

**మస్తు :** మధుర, ఆమ్ల కషాయ, స్రోతాది శోధన, తీక్ష్ణహర, బల్య, క్రిమిహర, అవృష్య, క్లామహర, ప్రీనన.

**తక్ర** (మజ్జిగ-1/4 నీరు కలిపినది) : మధుర, ఆమ్ల, కషాయ, లఘు, రూక్ష, ఉష్ణ వీర్య, మధుర విపాక, వాతహర, కఫహర, గ్రాహి, మేధోహర, గ్రహణీహర, ఆర్శోహర, పాండుహర, దీపన, ఉదరహర, గుల్మహర, తృష్ణహర, అతిసారహర, శూలహర, స్నేహవ్యాపదహర, మూత్రకృచ్ఛహర, ప్రీనన.

**గోల :** వాత పిత్తహర, హృద్య

**మతీత (చిలికిన పెరుగు) :** కఫపిత్తహర

**ఉదాశ్విత్ (1/2 నీరు వేసిన పెరుగు) :** కఫకర, బల్య, ఆమఘ్ను

**చచ్ఛికా (ఎక్కువ నీరు కలిపిన పెరుగు) :** లఘు, శీతల, పిత్తహర, శ్రమహర, తృష్ణహర, దీపన,

**గోనవనిత :** మధుర, కషాయ, ఆమ్లరస, లఘు శీతవీర్య, వాతనాశక, పిత్తనాశక, వృష్య, గ్రాహి, దీపన, అర్శోవికారఘ్ను, గ్రహినీఘ్ను, మేద్య అర్ధితనాశన, హృద్య, వ్రణ శోఫహ.

**మహిషనవీత :** గురు, వాతకర, పిత్తనాశక, కఫకర, మేధోవర్దన, వృష్య దాహహర శ్రమహర.

**గోఘృత :** గురు,స్నిగ్ధ, శీత మధురవిపాక, త్రిదోషనాశక, వృష్య, ఓజోకర, నిర్వాపణ, చక్షుష్య, దీపన, బల్య, కాంతికర, రక్షోఘ్ను, రసాయన

**మహిషఘృత :** మధురరస, గురుశీత మధురవిపాక, వాతప్రశమణ,

పిత్త ప్రశమణ, కఫకర, వృష్య రక్తపిత్తఘ్ను

**అజీఘృత :** లఘు, కటువిపాక, అగ్నిదీపన, చక్షుష్య, బల్య, కాసహర, క్షయహర, శ్వాసహర

**పురాణఘృత :** త్రిదోషహర, ముత్రకృచ్ఛ, కుష్ఠ, విష, ఉన్మాద, అపస్మార, తిమిర

**నవీన తఘృత :** తర్పణ, బల్య, శ్రమహర, కామల, పాండు, నేత్రరోగం.

## తైల వర్గ (నూనెలు)

**తిలతైల (నువ్వుల) :** మధురరస, కషాయ అనురస, మధురవిపాక, గురు, వ్యవాయి, వికాశి, విశద, ఉష్ణ, తీక్ష్ణ సుక్ష్మ, వాతనాశక, పిత్తకర, కఫవర్దన, బల్య వృష్ణ వర్ణ్య గర్భాశయ, శోదన, స్థైర్యకర, త్వచ్చ, చక్షుష్య, లేఖన, యోనిశూల ప్రశమణ, శౌరశూల ప్రసమణ, కేశ్య

**సర్షపతైల (ఆవాలనూనె):** కటు, రస, లఘు, ఉష్ణ, తీక్ష్ణ కటువిపాక, వాతనాశక, పిత్తకర, కఫనాశక, రక్తదూషక, మేదోనాశక, క్రిమిఘ్న, దీపన కండువినాశన, కుష్ఠపహ, లేఖన

**ఏరండతైల (ఆముదం):** మధుర, తిక్త, కటుకషాయఅనురస, తీక్ష్ణ , ఉష్ణ, పిచ్చల, గురు, సూక్ష్మ, నిశ్ర, మధురవిపాక, వాతహర, కఫవర్ధిన, వయస్థాపన, శూలహర, వృష్య అదోభగదోశోధన, గుల్మహర, దీపన, స్రోతషేహర్, అనాహన్న, ఆమఘ్న, త్వచ్య

**అతసితైల (లీన్ సీడ్ ఆయిల్) :** మధుర, గురుస్నిగ్ధ ఉష్ణవీర్య కటువిపాక, వాతహర, పిత్తకర, కఫకర, బల్య, చక్షుష్య త్వచ్య

**కుసుంబ (సొఫొవర్ ఆయిల్) :** ఆమ్లరస, ఉష్ణవీర్య గురు తీక్ష్ణ కటువిపాక సర్వదోష ప్రకోపణ, విదాహి, బల్య, రక్తపిత్తకృత్.

## మద్యవర్గ

**నవీనమద్య :** సర,గురు,విశద, దుర్గంధి, త్రిదోషకర, అభిష్యంది, బృంహణ, అహృద్య

**పురాణమద్య :** లఘు, సుగంధి, వికాశి, ఆమ్ల, ఉష్ణ, వాతనాశక, పిత్తకర, కఫనాశక,రసాయన, రుచ్య, కృమిహర, శ్రోతోవిశోధన

**సుర :** గురు, వాతఘ్న,కఫకర, స్తన్యజనన, బల్య, మేదోకర, గుల్మహర, గ్రహణిహర, శోధహర, ముత్రకృచ్ఛహర

**మదిర :** వాతహర

**మైరేయ :** మధుర, గురు

## మధు వర్గ

**మధు (తేనె) :** మధుర, కషాయరస, శతవీర్య, లఘు రూక్ష, సుక్ష్మి, యోగవాహి అల్పవాతకర, పిత్తనాశక, కఫనాశక, మేద నాశక, హృర్య, సంధానశకర, రక్తవికారహర, గ్రాహి, వృష్య, తృష్ణ ప్రశమణ, శ్వేర్య స్రోతోవిశోదన, రోపన, మేదోకర, వర్ణ్య క్షయహర, విషప్రశమణ, సూక్ష్మమార్గానుసారి

**ఇక్షు (చెఱకు) :** మధుర, గురు స్నిగ్ధ, శీత, మధురవిపాక, కఫకర, పిత్తనాశక,వాతహర అవిదాహి, పృష్య, తృష్ణఘ్న, బృంహణ, దాహఘ్న.

**ఇక్షురస :** శీత, స్నిగ్ధ, మధుర, వాతనాశక, పిత్రనాశక, తర్పణ, ప్రీనస, జీవన, బృంహణ, వృష్య

**పాణీత :** మధుర, గురు, రూక్ష, కషాయవిపాక, త్రిదోషకర, అభిష్యంది బృంహణ, శ్రమఘ్న, వస్తివిశోధన.

**శర్కర (పటికబెల్లం) :** మధుర, స్నిగ్ధ, శీత, వాతపిత్తశామక, శు క్రల, వృష్య, దాహఘ్న జ్వరఘ్న

**గుడ (బెల్లం) :** మధుర, స్నిగ్ధ, గురు, నాటి శీత, వాతహర, కఫకర, రక్తప్రశమణ, ముత్రల, వృష్య, క్రిమికర, బల్య

## ఫల వర్గ

**ద్రాక్ష :** మధుర, ఆమ్ల, కషాయరస, శీతవీర్య, స్నిగ్ధ, గురుసర, మధుర విపాక, వాతనాశక, పిత్తనాశక, బృంహణ, పౌష్ఠిక, వృష్య, రక్తదోషహర, తృష్ణహర, కామలహర, చక్షుష్య, దాత్యాయహర, దాహహర, శ్రమహర, జ్వరహర క్షయహర

**కదలీ (అరటి):** మధుర , కషాయరస, గురు, స్నిగ్ధ, శీతవీర్య, మధురవిపాక, పిత్తనాశక, కఫకర, రక్తదోషఘ్న, వృష్య, విష్ఠంబకర బృంహణ, తృష్ణఘ్న, క్షయహర

**దాడిమ :** మధుర, కషాయరస, లఘు, స్నిగ్ధ, శీత, త్రిదోషఘ్న.

సంతర్పక, శుక్రల, తృష్ణహర, జ్వరహర, దాహహర, గ్రాహి, రుచ్య, మేదోకర, దీపన

**చించ (చింత):** గురు, ఉష్ణ, ఆమ్లరస, వాతనాశక, పిత్తహర, కఫకర, రక్త దుష్టికర

**చించ :** రూక్ష, సర, ఉష్ణ, కఫకర, హతహర, దీపన

**కోల (జుజుబే) :** ఆమ్ల కషాయ, కొంచెం మధురం, వాతనాశక, పిత్తకర, కఫకర, శుక్రల, బల్య, తృష్ణ, హర, దాహహర

**ఆమ్ల (మామిడి):** కషాయ, ఆమ్లరస, వాతకర, పిత్తకర, రుచ్య

**ఆమ్ల :** మధుర, కషాయరస, అనురస,స్నిగ్ధ, గురు, శీతల వాతహర, కఫవర్దక, హృద్య, వృష్య, బల్య, వర్ణ్య దీపన

**పనస :** మధురరస, శీత స్నిగ్ధ, వాతహర, పిత్తహర, కఫవర్ధక, తర్పణ, బృంహణ, మాంసల, బల్య శుక్రల, రక్తపిత్తహర

**లకుచ (మంకీజాక్):** మధుర, ఆమ్ల, ఉష్ణవీర్య గురు, త్రిదోషవర్ధక, శుక్రహర, అచక్షుస్య, అగ్నినాశన.

**గువక (బెటెల్‌నట్):** కషాయ, శీత, గురు, రూక్ష, కఫహర, పిత్తహర, మోహన దీపన

**తౌల(తాటిచెట్టు) :** మధుర, స్నిగ్ధ, గురు, సర, శీత వీర్య, పిత్తకర, కఫకర, మూత్రల, అభిష్యంది, తంద్రల, శుక్రల.

**ఖర్జూర :** మధుర, స్నిగ్ధ, గురు శీతవీర్య వాతకఫపవా, రుచ్య, హృద్య, క్షయహర, తర్పణ, శుక్రల, రక్తపిత్తఘ్ను, బల్య, జ్వర, అతిసార, తృష్ణ, కాస, శ్వాస, మద, మూర్ఛ

**బీజపుర (సిట్రాన్):** ఆమ్ల, మధురరస, లఘు, ఉష్ణ, వీర్య, వాతహర, కఫహర, దీపన, రక్తపిత్తహర, కంఠ జిహ్వా, హృద్య, శోధన, శ్వాసహర, కాసహర, అరుచిహర, తృష్ణహర

**జంబీర (నిమ్మ):** ఆమ్లరస, ఉష్ణ, వీర్య, గురు వాతహర, కఫహర, విబంద హర, శులఘ్ను, కాసఘ్ను, తృష్ణఘ్ను, ఆమదోషహర, దీపన, ఆస్యవైరస్య హర, క్రిమిహర

## లవణవర్గ

**సైంధవలవణం :** లఘు, శీత, త్రిదోషహర, రుచ్యదీపన, ఆమపాచన శూలఘ్న, వృష్య నేత్ర్య

**సువర్చల లవణం :** లఘు, విశద సుక్ష్మ పిత్తకర, మలభేదన, దాపన, రుచ్య, ఆమపాచన, ఉద్గార, శోధన

**విడాలవణ :** లఘు, ఉష్ణ, రూక్ష, క్షార, తీక్ష్ణ వ్యావాహి, విబంధహర, దీపన, రుచ్య, శూలహర,ఊర్ధ్వ, అథోభాగహర

**ఔద్భిదలవణ :** కటురస, క్షార, స్నిగ్ధ,శీత వాతహర

**సముద్రలవణ :** మధుర, తిక్త, గురు, కొంచెం ఉష్ణవీర్య మధురవిపాక, వాతహర, కఫకర, దీపన అవిదాహి

## మూత్రవర్గ

**అవిమూత్ర (గొఱ్ఱె):** తిక్తరస, స్నిగ్ధ, అవిరోదితోపిత్త

**అజామూత్ర (మేక):** కషాయ, మధుర, త్రిదోషహర

**గోమూత్ర (ఆవు):** కటు,లఘు, తీక్ష్ణ ఉష్ణ, తిక్త కషాయ, త్రిదోషఘ్న, మేదోహర, దీపన, శూలహర, గుల్మహర, కాసహర, శ్వాసహర, కిలాసహర, కుష్ఠఘ్న, ఉదర రోగహర, క్రిమిహర, శోధఘ్న

**మాహిషమూత్ర (గేదె):** క్షార, సర, ఆర్శోఘ్న, శోఫహర, ఉదరాఘ్న

**ఉష్ట్రమూత్ర (ఒంటె) :** తిక్త రస, కాసఘ్న, శ్వాసహర, ఆర్శోహర

**హయమూత్ర (గుఱ్ఱం):** తిక్త, కటురస కుష్ఠఘ్న, వ్రణహర, విషఘ్న

**ఖరమూత్ర (గాడిద):** అపస్మార, ఉన్మాద, గ్రహరోగనాశక

## అనుపాన ఉపయోగమేమిటి ?

వైద్యునికి అనుపానవిధి గొప్ప శాస్త్రీయతను, జ్ఞానాన్ని పెంచుతుంది. చికిత్సలో అనుపానం ఖచ్చితంగా ఉంటే వ్యాధి తగ్గును. రోగలక్షణాలనుబట్టి సరైన వ్యాధి నిర్ణయమగును. ఆ వ్యాధియందు సరైన మందు, అనుపానం వల్ల ఖచ్చితంగా / శాశ్వతంగా వ్యాధి కుదురును. ఆనందంగా ఆరోగ్యంగా బ్రతకాలనేది ప్రతి ఒక్కరి ఆలోచన అయితే ప్రకృతిని అనుసరించి ఆరోగ్య విధానం ఉన్నపుడు ఎవరికీ అనారోగ్యం కలుగదు. ప్రకృతిలోని మూలికలు, ధాతువులు, లోహాలు, జంతువుల వల్లనే పరిపూర్ణ ఆరోగ్యం కలుగును.

పూర్వకాలం నుంచి అనుపానం ఆయుర్వేద, వైద్యములో ఒక భాగమై పోయింది. అనుపానం అనేది వ్యాధిని కుదిర్చేది, వ్యాధి పెరగకుండా చేసేది వ్యాధి రాకుండా చేసేది, వ్యాధినుంచి రక్షించేదిగా ఉంటుంది.

ఇపుడు అనేక రకాల క్రూర, కృత్రిమ రోగాలతో ప్రజలు బాధలు అనుభవిస్తున్నారు.

1. అనుపానం గూర్చి ఒకసారి చూస్తే ( అను+పాన )

అను = తర్వాత, దానితో, దీనితో, దగ్గరగా చేర్చే

పాన = తాగేది, రక్షణకవచం, నిర్ధేశించేదిగా యుత్పత్తి చెప్పుకోవచ్చు.

2.నిరుక్తి = అనుపానమనేది ఆహారము లేదా ఔషధముతో పాటు తీసుకునే పదార్థం / పానీయము.

3. పరిభాష = ఏదైతే మందు తీసుకున్న వెంటనే పానము చేస్తామో దాన్ని అనుపానమనవచ్చు. ఇది మందులో భాగముగా లేదా ఔషధ నిర్మాణ ములో ఒక భాగముగా కూడా ఉండవచ్చు.

4. పర్యాయ పదాలు : 1. సహపానము 2. రోగజ్ఞాన భైషజ్యము (ఆపానం కాదు ఆపానం అనగా పంచవాయువులలో గుదము నుండి అధోముఖముగా విడిచే వాయువుగా చెప్పాలి.)

5. అనుపాన స్వరూపం : ఇది వివిధ రకాలుగా ఉంటుంది. ఉదా: జలము, పాలు, స్వరసము, తక్రము, నెయ్యి, తేనెలు, చూర్ణ, క్వాధములుగా ఉండును.

**1. ఆహారము - అనుపానము**

చరకుడు, సుశృతుడు, వాగ్భటుడు అనుపాన స్వరూపాన్ని అనుపానంలో ఆహారం యొక్క మార్పును చెప్పటమే కాకుండా విరుద్ధాహారము, పథ్యా పథ్యాలను, వాటివల్ల ధాతువికారాలను చెప్తూ ప్రశస్థ అనుపానంగూర్చి చర్చించారు.

**2. ఔషధము - అనుపానము**

చరకుని తర్వాత యోగరత్నాకరము నందు కేవలం ఆహార అనుపాన ములే కాకుండా ఔషధ అనుపానములు విస్తృతంగా వ్రాయబడ్డాయి. అంతే గాక బలం, రోగ అవస్థ, రోగం, రోగి గూర్చి కూడా ఔషధాను పానములు వ్రాసారు.

**3. అనుపానమును 2 రకాలుగా విభజించవచ్చు అవి**

1. క్రామణ 2. పాచన అనుపానం

## 4. అనుపానం - మోతాదు

అనుపాన మోతాదు అనేది దోషం, ద్రవ్యముపై ఆధారపడి ఉంటుంది.

ఉదా : చూర్ణములు, లేహ్యములు, గుటికలు, కల్కములుగా అనుపానం ఇవ్వవలసిన వచ్చినపుడు వాతజ వికారమైతే - 3 ఫలాలు (120మి.లీ) పిత్తజ వికారమైతే - 2 ఫలాలు (80మి.లీ.) కఫజ వికారమైతే 1 ఫలం (40 మి.లీ) మోతాదుగా ఇవ్వాలి.

## 5. అనుపాన కాలం

చక్రపాణి దత్తుని అనుసరించి అనుపానం 3 రకాలుగా తీసుకోవచ్చు.

1. ఆది-కార్శనార్థం 2. మధ్య-స్థాపనార్థం 3. అంత్య-బృంహణార్థం అనుపానం కాలము నెరింగి వాడుకోవాలి.

## 6. అనుపాన అయోగ్యం

మానవులు (రోగి) ఉదావర్త వాతములో అనగా చెవి, ముక్కు, గొంతు సమస్యలతో, ఎక్కిళ్ళు, కాస (దగ్గు), శ్వాస (ఊపిరిరోగం) ఉరః క్షత (ఛాతి రోగాలు), అక్షి (కండ్లరోగాలు), గళరోగాలు (గొంతు సమస్యలు), ఎక్కువ పాడటం, అరవటం, అధ్యనం చేయటం (చదవటం) వీరు తప్పక అనుపానం వాడాలి.

**నిషిద్ధ అనుపానం :** ఏ వస్తువుతో (మందుతో) ఏది తీసుకోకూడదో తెలుపు అనుపాన విషయం.

ఉదా: భల్లాతకి లోనికి వాడునపుడు జలమును వాడుకోవటం మధ్యమం, నెయ్యితో ఉత్తమం, వేడినీటితో నిషిద్ధం (వాడరాదు).

**శ్రేష్ట అనుపానం**: వాగ్భటుని ప్రకారం నీరు ఉత్తమ అనుపానం. అది ఆరోగ్యమును కాపాడును. రోగికి రోగం నుంచి కోలుకునేలా చేయును.

1. అనుపాన గుణ కర్మలు ఈ విషయం 4 రకాలుగా ఉంటుంది.

**1.ఆహారముపై అనుపాన ప్రభావం :** భుక్తం అవసాదయతి, సంఘటితం భిన్నతి, క్లేద్యయతి, మార్ధవటం అపాదయతి, సుఖం పరిణామయతి, జారయతిగా అనుపానం ఉపయోగపడుతుంది.

**2. మందు (ఔషధము)పై అనుపాన ప్రభావం :** భైషజ్యయం క్షణనేవ అగ్నేషు ప్రసర్పతి, ఔషధ గుణకరం, రసాధీనం పరమాణువహా విభాజతి, రసాధినం ధ్రుతం ప్రసర్పటి, భేషజ్యం పరిభ్రమయతి ఇవి ఔషధంపై అను పానం ప్రభావం.

**3. రోగముపై (వికారము) అనుపాన ప్రభావం :** దోష సమాన, దోష సంగతభేదన, పిపసహర ఆమహర, శ్రమహర, క్లేమహర, రోగఘ్ను భేషజం సహకారి, రోగిబలా గుణవతి.

**4. స్వస్థము (ఆరోగ్యము)పై అనుపాన ప్రభావం :** తర్పణ, ప్రీణన, ఉర్జకర, బృంహణ, ఆయు, జీవన, బలం, ద్రుదంగత, సుఖస్వస్థ్య, రోచన, దీపన, వృష్య, వర్ణ్యలుపై అనుపాన ప్రభావం ఉంటుంది.

పురాతనకాలంలో ద్విజోత్తముడైన అగస్త్యముని వాతాపి రాక్షసుడుని తిన్న తర్వాత ఆయనకూడా అనుపానాన్ని తీసుకోవటం చేతనే ఆ రాక్షసుడు సంహరింపబడ్డాడు.

## ఆహారము - ఔషధము - అనుపానము

ప్రపంచములో అత్యంత పురాతన వైద్యం ఆయుర్వేదమని తెలియని వారుండరు. అయితే ఆయుర్వేదానికి ఉన్న ఒక గొప్పతనం ఏమిటంటే వ్యక్తిగత మందు, అనుపానం, ఆహారం (ఇండివిద్యువల్ మెడిసిన్, డైట్) ఇది ఏ ఇతర వైద్యమునందు కనిపించని ప్రత్యేక వైద్యవిధానం. కంటినొప్పి, కాలునొప్పులకు ఒకే ఔషధాన్ని వాడే రోజులు వచ్చాయి. కాని పూర్వపు రోజులలో కంటినొప్పి, కాలి నొప్పులకు వివిధ ఔషధాలు, అనుపానాలు, ఆహార విహారాదులు మన ఆయుర్వేద వైద్యమందే చెప్పబడ్డాయంటే ఈ శాస్త్రం ఎంత అభివృద్ధి చెందిన విజ్ఞానమోకదా ! ప్రత్యేక చికిత్స, వ్యక్తి గత చికిత్స సూక్ష్మ, స్థూల పద్ధతుల ద్వారా దోష జ్ఞానం, పదార్థ విజ్ఞానం మొదలైన వాటితో స్వస్థత చేకూర్చే అపూర్వ విజ్ఞాన భాండాగారం ఆయుర్వేద వైద్యశాస్త్రం. ఆయుర్వేదమునందు అనుపానం జీవన విధానంలో ఒక భాగము. అంతేగాక ఔషధానికి అనుపానం ఒక శాస్త్రీయ కోణము. ఇది ద్రవరూపంలో వుండి మందు / ఔషధమును / ఆహారమును సవ్యముగా, సక్రమముగా, ఖచ్చితంగా మన భావనకు అనుగుణంగా మందును చొప్పించి సమర్థవంతంగా ఔషధాన్ని పనిచేయించుటకు, జీర్ణకారిగా సహాయపడును.

ఆయుర్వేద వైద్యశాస్త్రంలో అనేక రోగాలు అనేక మందులు గలవు. రోగానికి మూలం దోషాలు, దోషాన్ని సరైన స్థితిలో ఉంచటానికి 2 రకాల చికిత్సలు చెప్పబడ్డాయి. 1 ఊర్జక్షర 2 రోగనుత్. రోగనుత్ 2 రకాలు శోధనం, శమనంగా చెప్పబడ్డాయి. అనుపానం ఆహారం తర్వాత, మందు తర్వాత వాడేదని మరువరాదు. అనుపాన ద్రవ్యము ఔషధము రుచిని

పెంచును. చెడును తొలగించును ఖచ్చితమైన ప్రదేశమునకు మందును తీసు కొనిపోవును. అనుపాన నిర్వచనాలు శబ్ద కల్పద్రువమ్, సుశ్రుత సూత్ర స్థానం 46/419 చరకం సూత్రస్థానం 27/319, అష్టాంగ సంగ్రహ మధ్యమ భాగం 6/4-5 లలో చెప్పారు. అనుపానాలు 2 రకాలు 1. ఆహారోప యోగము 2. ఔషదోపయోగము.

**ఆహారోపయోగము :** ఈ విషయం ఆహార సేవనం అనే విషయం దగ్గర చర్చించారు. దీన్ని 3 భాగాలుగా విభజించారు. అధిపాన, మధ్యపాన, అంత్యపాన.

**1. అధిపాన :** భోజనానికి ముందు తీసుకునే అనుపానం. సాధారణం గా ఈ అనుపానాన్ని స్థౌల్య, మేదోవృద్ధి సంబంధిత రోగాలలో వాడాలి. (సుశ్రుత సూత్రస్థానం 46/420)

**2. మధ్యపాన :** అనుపానాన్ని మధ్యలో సేవించుట. దీనివల్ల ఆరోగ్య కరమైన శరీరం ఏర్పడును. (సు.సూ. 46/420). ఇది మధ్యపానం అనగా ఆల్కహాలును సేవించటం కాదు సుమా !

**3. అంత్యపాన :** భోజనానంతరం అనుపానాన్ని సేవించుట. ఇది బృంహణంకలిగించును. కార్శ్యరోగులను ఇది మంచిది.

(సు.సూ. 46/420)

అనుపాన యోగాలు : దీనిగూర్చి ద్రవ్యగుణంను పరిపూర్ణంగా తెలుసు కోవాలి. ఆచార్యులు అనుపానం గూర్చి.

1. తర్పయతి (నూతనత్వం) 2. ప్రీణయతి (మనశ్శాంతి)

3. ఉర్జయతి (శక్తినిచ్చునది) 4. బృంహయతి (పోషించునది) 5. పర్యాప్తిమభిని వటియాతి భూకతమవసాదయతి తృప్తి (ఆహారం సేవన తృప్తి) 6 అన్న సంఘటి భిన్నయతి (ఆహారం చిన్న చిన్న ముక్కలుగా చేయుట. 7 మార్ధవ మపాదయతి (ఆహారం మెత్తగా అగుట) 8. కేద్లయతి (జిగురుగా చేయుట.) 9. జారయతి (పరిపూర్ణముగా జీర్ణమవుట) 10. సుఖ పరిణామ యతి (సమానము చేయుట) 11. ఆషువ్యావయతి (ఆహారలేమి) 12. ఆహారస్య ఉపజన్యయతి (నరాలలోకి పక్వాహార పంపిణీ) 13.రోచన (ఆహార రుచినిపెంచును) 14. వృష్య (శక్తినిపెంచును) 15. శ్రమహరము (బడలికను దూరం చేయును) 16. దీపనము (వేడిపుట్టించును) 17. దోష శమనము (చెడు దోషమును తొలగించును) 18. పిపాసచ్ఛేదనము (దాహాన్ని అరికట్టును) 19. వర్ణకరము (రంగును

కల్గించును, సుఖమును కల్గించును) 20. తృప్తికరము (సుఖమును, హాయిని కల్గించును) చ.సూ 27/325-26, సు.సూ 46/443.

అనుపానం విరుద్ధమైతే కలిగే చెడు లక్షణాలు : వీటి గురించి పురాతన ఆయుర్వేద గ్రంథాలు ఏనాడో చెప్పాయి (సు.సూ. 46/447)

1. ఊపిరి సరిగా తీసుకోలేక పోవడం 2. దగ్గు 3. చాతిలో ఇబ్బంది. 4. చాతికి గాయమవటం 5. మాటలో స్పష్టత లేకపోవటం 6. వ్యాధిని ఉధృతం చేసినట్టు కనబడినా ఈ పరిస్థితులలో అనుపానం వాడరాదు. ఒక వేళ వాడినా ఆస్య దుష్టి (నోరు పాడవుతుంది) అవుతుంది. అపుడు వమనం జరుగును. (అ.సం.సూ 10/56)

1. ప్రయాణాలలో 2. వ్యాయాలలో 3.విపరీత చదువు 4. విపరీతంగా మాట్లాడుట 5. ఎక్కువ నిద్ర 6. ఎక్కువ పాడుట. (సు.సూ.46/447) లలో అనుపానం మంచిదికాదు.

**అనుపానం తీసుకోకపోతే :** అనుపానం లేకుండ గట్టి ఆహారము తీసుకుంటే ఆహారం చలన రహితముగా, అపక్వముగా ఉండి అపక్వ దోషజ ఆహర తిన్న లక్షణాలను కల్గించును.

**ఔషదోపయోగ అనుపానం :** అనుపానమును మందుతోపాటు వాడటం వల్ల మందు తేలికగా లోనికి ప్రవేశించును. మందుకు మంచి రుచిని కల్గించును, వ్యాధి తగ్గటానికి సహాయకారిగా ఉండును, మందు చెడు గుణాలు కల్గించకుండా అనుపానం కాపాడును. ఖచ్చిత అనుపానం త్వరగాను, సమర్థవంతముగాను శరీరంలోకి మందును చేరేటట్లు ఉపయోగ పడును. వ్యాధిపై ఖచ్చితంగా పనిచేయు పరిస్థితిని కల్పించును.

**దోషాన్ని అనుసరించి అనుపానం :**

**1. వాతరోగికి అనుపానం :** స్నిగ్ధ, ఉష్ణపదార్థాలను అనుపానంగా వాడాలి. ఎందుకంటే వాతము రూక్షణము, శీతమునుకల్గి ఉండుటచేత (చ.సూ.27/321, సు.సూ 46/435, చ.సూ 1/59)

**2. పిత్తరోగికి అనుపానం :** మధుర, శీతల పదార్థాలను అనుపానంగా వాడాలి. ఎందుకంటే పిత్తము ఆమ్ల, ఉష్ణ గుణాలను కల్గి ఉంటుంది. (చ.సూ 27/321)సు.సూ 46/435, చ.సూ 1/60)

**కఫరోగి అనుపానము :** రూక్షణము, ఉష్ణము కలిగినఅనుపానం ఇవ్వాలి. ఎందుకంటే స్నిగ్ధ, శీతగుణాలను కలిగి ఉండుటచేత (చ.సూ 27/321,సు.సూ 46/435; చ.సూ 1/61)

## కొన్ని ప్రత్యేక వ్యాధులకు అనుపానాలు

| వ్యాధిపేరు | అనుపానము |
|---|---|
| **అజీర్ణము**<br>1.సాధారణ ఉప యోగం కొరకు | ఆమలకి, ఆర్ద్రక, చిత్రక, చూర్ణోదక ధాన్యక, నింబుస్వరస పిప్పలి, ముస్తక, యవాని, లవంగ, శతపుష్ప, సైంధవ, సౌవర్చల, హరీతకి. |
| **ప్రత్యేక అజీర్ణాలు**<br>1. ఆమాజీర్ణము | ఉష్ణోదక, ఆర్ద్రక, శొంఠి, పిప్పలి, యవాని, చిత్రక,మస్తక |
| 2. విదాగ్ధజీర్ణము | నింబుస్వరసం, చూర్ణోదకం, భృష్ట (వేయించిన) జీరక, యవానీ, హరీతకి, ఆమలకి, లవంగ. |
| 3. విష్ఠబ్ధాజీర్ణము | ధాన్యక, తండులోదక, సైంధవ, సౌవర్చల, శతపుష్ప,హరీతకి, విభీతకి |
| 4. విసూచిక | నింబుస్వరస, భృష్ఠజీరక, హింగు,యవానిచూర్ణ, మధు |
| **అతిసార-గ్రహణి**<br>సాధారణ ఉప యోగం కొరకు | మేధికా, మస్తక, లాక్ష, అతివిష, ఇంద్రయవ, ఉష్ణోదక, దధిమస్తు, దాడిమఆకు, మారేడు కాయ గుజ్జు |
| ప్రత్యేక స్థితిననుసరించి<br>**1.అతిసారము** | ముస్తకచూర్ణ, ఇంద్రయవ చూర్ణ, భృష్ట (వేయించిన) జీలకర్ర అతివిష, భృష్ఠ (వేయించిన) వాము, మధు (తేనె) |
| **2.అమాతిసారము** | భృష్ఠజీరక, ఇంద్రయవ |
| **3.జ్వరాతీసారము** | భృష్టజీరక, మధు, తండులోదక |
| **4.గ్రహణి** | తండులోదక, మధు, భృష్ఠజీరక, ముస్తక చూర్ణ, దాడిమపత్ర స్వరస దధి మస్తు, బిల్వ మజ్జా (మారేడుకాయ గుజ్జు) |
| **5.రక్తాతిసారము** | దాడిమ పత్రస్వరసం, మేడిచెక్క కషాయం, లాక్షా కషాయం, తేనె, మస్తక, గోక్షుర. |
| **ఉదరరోగము,కృమి మరియు శోథ:** | హరితకి, బిల్వపత్ర స్వరసం, పునర్నవా, గోమూత్ర, పిప్పిలి ఉష్ణోదక,నింబపత్ర స్వరసం, పలాశబీజములు, ఖర్జూర పత్రస్వరసం |

| వ్యాధిపేరు | అనుపానము |
|---|---|
| **ఉన్మాద,అపస్మార** | ఇక్షురస,అరటిబోదె,పురాణ ఘృతము, దాడిమ, శంఖపుష్పి, సర్పగంధ,తండులోదక, పటోలపత్ర, వచా,త్రిఫలా,తాళ, మధు, నారికేళోదక. |
| **కాస:** సాధారణ ఉపయోగంకొరకు | కంటకారి,కర్కాటక శృంగి, ఘృత, మధుయష్టి, వంశలోచన, విభీతకి. |
| ప్రత్యేక స్థితులలో **వాతజ కాస** | శర్కరోదక, వాసాస్వరస, ఆర్ద్రక, ఘృత, మధు |
| **పిత్తశ్లేష్మజ కాస** | కర్కాటశృంగి,పిప్పలి,విభీతకి,వంశలోచన, కంటకారి, మధుయష్టి |
| **క్షతజ,క్షయజ కాస** | ఘృత,పిప్పలిచూర్ణ, మధుయష్టికుష్ఠ, వార్తాక, ఫిరంగ,మసూరిక ఆమలకి, ఖదిర, గుడూచి, దారుహరిద్ర, ద్వీపాంతరవచా, నింబత్వక్, మంజిష్ఠ, మాంసి, ముండీతక, మూషికవర్ణి, యష్టి సారివ, హరిద్రా, విడంగ. |
| **జ్వర** సాధారణ ఉపయోగంకొరకు | ఆర్ద్రక,కారవేల్లక, పత్రము, గుడూచి, తాంబూలము (తమలపాకు), తులసి,ద్రాక్ష,నారికేలోదక(కొబ్బరినీళ్ళు) నిర్గుండి పత్రము, పర్పట, పిప్పలి,బిల్వపత్రరసం,భృష్టజీరక |
| ప్రత్యేక స్థితులు **వాతిక జ్వరము** | పిప్పలిచూర్ణం, ఆర్ద్రక స్వరసం, మధు |
| **పైత్తిక జ్వరము** | పర్పాటకక్వాథము, రక్తచందన జలము, శర్కరోదకము |
| **శ్లేష్మక జ్వరము** | శుంఠి చూర్ణం,తేనె |
| **ప్రతిష్యాయముతో కూడిన జ్వరము** | తాంబూల స్వరసం, తేనె |
| **అజీర్ణయుక్తజ్వరము** | ఆర్ద్రక స్వరసము, తేనె |
| **వాతపైత్తికజ్వరము** | శర్కరోదకము |
| **వాతశ్లేష్మికజ్వరము** | ఆర్ద్రక స్వరసము, తేనె |
| **పిత్తశ్లేష్మకజ్వరము** | ఆర్ద్రక స్వరసము, తేనె, తాంబూల స్వరసం. |
| **విషమ జ్వరము** | తులసి పత్రము, త్రికటు, శర్కరోదకము, పారిజాత పత్రము, నిర్గుండి పత్ర స్వరసము, తేనె, కాల మేఘ స్వరసము. |

| వ్యాధిపేరు | అనుపానము |
|---|---|
| **సన్నిపాతవాతోల్బణ జ్వరము** | నారికేళోదక, తాల జటాక్వాథము, తాంబూల స్వరసము, దశమూల క్వాథము, జటామాంసీక్వాథము, ఆర్ద్రకస్వరస. |
| **సన్నిపాతపిత్తోల్బణ జ్వరము** | భృంగరాజ స్వరసము, మధు, ఆర్ద్రక స్వరసం, తేనె, మరియు భృష్ఠజీరక. |
| **సన్నిపాతశ్లేష్మోల్బణ జ్వరము** | ఆర్ద్రక స్వరసం, మధు,పిప్పలి చూర్ణ, కంటకారి క్వాథ తాంబూల స్వర |
| **అన్నిరకాల సన్నిపాత జ్వరాలు** | బిల్వపత్ర రసం, గుడూచీ స్వరసం, శుంఠి, మరియు తేనె |
| **తృష్ణా(దప్పిక)** | ఆమ్రపత్రరసం, అరటిబొదె రసం, గుడూచీ స్వరసం, జంబు (నేరేడు) ఆకురసం, బంబీరస్వరసం, తండులోదక, దాడిమ పత్రరసం, ఉదుంబర (మేడిపండురసం) మాంసరసం, శతావరి స్వరసం, ధాన్యాదక, నారికేళోదక, పటోలపత్ర, లాజోదక. |
| **పాండు** | ఆమలకి, కోకిలాక్ష, గోఘృత, తిక్త, నింబత్వక్,హరిద్రా,హరీతకి |
| **కామలా** | ఇక్షుస్వరస, మూలకస్వరస, హరీతకి, శర్కరోదక, నింబుస్వరస, గుడ, శర్కర. |
| **ప్రమేహ,మధుమేహ** 1.సాధారణ | అశ్వగంధ,ఆమలకి, ఉదుంబర పత్రరసం, అరటిపండు, కరంజపత్రము, కోకిలాక్ష,గుడూచీ సత్త్వం, గోక్షుర, తండులోదక, తృణపంచమూల, దూర్వా, నారికేళోదక, నిర్మలి, పాషాణభేద, పునర్నవా, బింబిపత్ర, మంజిష్ఠ, ముసలి,మాంసి. |
| ప్రత్యేక స్థితులు **ఉదక మేహము** | బింబిపత్రము, పునర్నవా, ఉదుంబర, కరంజఫలం, నిర్మలి |
| **పిష్టమేహ,లసీకామేము హరిద్రామేహము, వసామేహము** | పునర్నవా,కోకిలాక్ష,గోక్షుర, |
| **శుక్రమేహము** | అశ్వగంధ,శతావరి, బలామూల, ముసలి, మంజిష్ఠ |
| **రక్తమేహము** | విశల్యకర్ణి, శ్వేతదూర్వా, వాసా పత్రము. |
| **ప్రమేహము** (సాధారణ) | త్రిఫలా,పిప్పలి, ఆమలకి, గుడూచి, హరిద్ర,మాంసి,బలా. |
| **ఔపసర్గికమేహము** | కదలి,శర్కరాయుక్త దధిమంథ,శ్వేతచందన,హిమము,కంకోల, గోక్షుర |
| **మూత్రకృఛ్రము** | ఆమ్లకి, తండులోదక, నారికేలోదక, హరిద్రా,శతావరి, పాషాణభేద, దూర్వా, తృణపంచ మూలములు. |

| వ్యాధిపేరు | అనుపానము |
|---|---|
| **యక్ష్మ** సాధారణ ఉప యోగం కొరకు | అజాదుగ్ధ, పిప్పలి, మధుయష్టి, వాసా, వంశలోచన, తాలీసపత్రి |
| ప్రత్యేకస్థితులు **సాధారణయక్ష్మ** | అజాదుగ్ధ,పిప్పలి,మధుయష్టి, దూర్వా, వాసా |
| **సరక్త యక్ష్మ** | ఉదుంబర,విశల్యకరణి,ఖర్జూర,ద్రాక్ష,దూర్వా |
| **రక్తపిత్త** | ఖర్జూర,ఉదుంబర, ద్రాక్ష,దూర్వా,వాసాపత్రములు,విశల్యకరణి లాక్షదక |
| **వాతవ్యాధి, ఆమవాత** | అశ్వగంధ, ఏరండతైలము,ఏరండమూలము,గుగ్గులు, పురాణఘృతము, బలా,బిల్వత్వక్,మరీచ,రసూనా,రాస్నా,శిగ్రు |
| **వమనము** (వాంతులు) | ఆమలకి, ఉష్ణోదక, దాడిమ,నారికేలోదక, పటోలపత్ర, పర్పాటక, పిప్పలి,శుద్ధజలము, పూదీనార్కజలము, మధు జలము, యవాస్యర్కము, రక్తచందనము, శతపుష్పార్కము యష్టి, స్థూల ఏలా, త్వక్ (దాల్చిని.) |
| **శ్వాస** | ఉష్ణోదక,పురాణ గుడము (పాతబెల్లం), విభీతకమజ్జా, స్త్రీదుగ్దము, తులసీపత్రము, హింగు, కర్పూర,స్థూల, ఏలా, శృంగి, వాసామూల త్వక్. |
| **హిక్కా** | కులుత్థ, వచా, ఘృతము, మధు, మధుయష్టి, కంటకారీ |
| **శూల, అరోచక ఉద్వర్తము** | అమలకి, ఆయపత్రము, ఆమ్లవేతస, చించాఫలము, త్రిఫల దాడిమ (ఆమ్ల), నారికేళ లవణము, పటోలపత్రము,బిల్వ పత్రము, యవానీ, సైందవలవణము, శతావరి, హరీతకి శతపుష్పా. |
| **హృద్రోగము** | అర్జునత్వక్, దాడిమ ఫలము యొక్క రసం, బల, మాంసి, మధు, జటామాంసి కషాయము. |

| విరుద్ధాహార, విహారముల గుణములు | |
|---|---|
| ద్రవ్యము | విరుద్ధ ద్రవ్యములు / ఆహారములు |
| **ఆమ్లరసము** | లవణ,కటు, తిక్త, కషాయరసములు |
| **ఆలస్యము**(మజ్జాతసము) | కఫకారక ఆహారము మరియు అతినిద్ర |
| **ఆహారము** | సరిగ్గా వండని / ఉడకని ఆహారము<br>సరియైన ఇంధనము వాడకుండా తయారు చేయబడిన ఆహారము, బాగా పండని అతిగా పండిన లేదా విపరీతమైన మార్పులతో ప్రభావితమైన ఆహారము.<br>బాగా జన సమ్మర్దము కలిగిన ప్రదేశములోభుజించుట, మాంసము, సర్షప శాఖము(ఆవాల ఆకులు) మరియు గొర్రెపాలు కలపడము విరుద్ధము |
| **ఆనూపమాంసము** (ఉభయచరజంతువుల మాంసము) | తేనె,నువ్వులు, బెల్లము, పాలు,మినుములు,ముల్లంగి,కమల నాళములు, అంకురితధాన్యము(మొలకెత్తిన ధాన్యము),వసా (జంతువుల క్రొవ్వు) |
| **ఇక్షు వికారము** (చెరుకువుత్పత్తులు) | చేపలు, చరక (పిచ్చుక), మయూర (నెమలి), లావక, తిత్తిర కపింజల, గొధామాంసము (ఉడుము మాంసం)<br>ఏరండ లేదా<br>ఏరండతైలపాక<br>ద్రవ్యములు |
| **ఔదక మాంసము** (నీటిలో ఉండు జీవులమాంసము) | తేనె,నువ్వులు,గుడము (బెల్లము), దుగ్ధ (పాలు) మాష (మినుములు),మూలక (ముల్లంగి) కమలనాళము,అంకురిత ధాన్యము, వసా (కొవ్వు) |
| **క్రవ్య లేదా ఆమ మాంసము**(వండని పచ్చిమాంసము) | పిత్తము లేదా సురా (మద్యము) |
| **కదళీఫలము** (అరటి) | మాష (మినములు), ద్విదళ (పప్పుధాన్యములు) కషాయము |
| **కటురసము** | తిక్త, కషాయ రసములు |

| ద్రవ్యము | విరుద్ధ ద్రవ్యములు / ఆహారములు |
|---|---|
| కటు,ఉష్ణ,ఔషధ ములు/ఆహార ద్రవ్యములు | గ్రీష్మఋతువు, మధురసములు అసాత్మ్యములు |
| **క్రూరకోష్ఠము** (దీర్ఘకాలమలబద్ధత) | మృదువీర్యము (మృదువిరేచక ద్రవ్యము) |
| **కుసుంభ** | మద్యము, మైరేయ (మాదకపేయము) మధు |
| **గ్రామ్యమాంసము** (పెంపుడు,పశు వుల మాంసము) | తేనె,నువ్వులు,బెల్లము,మినుములు,ముల్లంగి కమలనాళములు, మొలకెత్తిన ధాన్యము వసా (కొవ్వు) |
| **బెల్లము** | ముల్లంగి, సూకరమాంస (పందిమాంసము) |
| **నెయ్యి లేదా బాగా చమురుకల్గిన పదార్థములు** | పదిరోజులు లేదా ఆపై కంచుపాత్రలో నెయ్యిని భద్రపరచుట విరుద్ధము |
| **తాల ఫలము** | అరటిపండు (కదలిఫలము) |
| **తిక్త రసము** | కషాయ రసము |
| **తక్రము(మజ్జిగ)** | కంపిల్లక, కదలి (అరటి) పెరుగలో కలిపిన అరటిపండు |
| **తిలకల్కము** | ఉపోదికా శాకము (బచ్చలి) |
| **దుగ్ధము (పాలు)** | ఆమ్లరసము, లవణరసము, మత్స్య (చేపలు),గ్రామ్య అనూప, ఔదకమాంసము, ముల్లంగి, వెల్లుల్లి, శిగ్రు (మునగ) అర్జున, సురసా (తులసి) మధు (తేనె),నాడీశాకము,వంశ పత్రము, లకుచ, ఆమ్ర, అమ్రాతక, బీజాపుర, కరమర్ద, కదలి, దంతశఠ (పెద్దనిమ్మ),బదర (రేగు), కోశామ్ర,జంబూ కపిత్థ(వెలగ), చించా, అక్షోట, పనస, నారికేళ,ఆమ్ల,దాడిమ ఆమలకీ, కంగునీ, మకుష్ఠ,కులత్థ,మాష (మినుములు), నిష్పావ,రోహిణీశాకము,కూష్మాండ, ఛత్రక, వంశ అంకురణ తిలపిణ్యాక(నువ్వులపిండి), దధి (పెరుగు), తైలము (నూనె) అంకురితధాన్యము, పిష్టమయ పదార్థాలు (పిండివంటలు) శుష్కశాఖములు, అజా (గొర్రె), గోధ (ఉడుము) సూకర మాంసము (పందిమాంసము), శశక (కుందేలుమాంసము) పారావత మాంసము (పావురాయిమాంసము) మద్యము. |

| ద్రవ్యము | విరుద్ధ ద్రవ్యములు / ఆహారములు |
|---|---|
| **మధుర రసము** | లవణ (ఉప్పు), ఆమ్ల (పులుపు), కటు (కారము) తిక్త (చేదు),కషాయ (వగరు) రసములు. |
| **మృదుకోష్ఠము** | గురుద్రవ్యము, గురుద్రవ్యము యొక్క ఆధిక్యత |
| **తేనె** | ఉష్ణద్రవ్యములు, స్నేహద్రవ్యములు (నెయ్యి,నూనె, క్రొవ్వు), వసా (క్రొవ్వు), మజ్జ (మూలుగ) పాలు నాడీ శాకము, వంశపత్ర, లకుచ, వేడిగా ఉన్న తేనె, తేనె నెయ్యి సమభాగములో సేవించుట, తేనే వర్షపు నీరు (తార్క్ష్య జలము) సమభాగములో సేవించుట, తేనె, పుష్కరబీజములు సమభాగములో సేవించుట, తేనెతో వేడినీరు, ముల్లంగి,నీరు, రోహిణీశాకము, పందిమాంసము కలిపి సేవించుట,సన్నిపాత జ్వరములో తేనె సేవించుట విరుద్ధము. |
| **రూక్ష ద్రవ్యము** | శీతాకాలము |
| **రాత్రి** | నక్తు ప్రయోగము |
| **లవణరసము** | కటు, తిక్త, కషాయ రసము |
| **సూకరమాంసము** | పంది మాంసము |
| **స్నేహద్రవ్యము** కొవ్వుపదార్ధములు | అంతరిక్ష జలము (వర్షజలము) |
| **సర్షప తైలము** (ఆవాలనూనె) | నాడీశాకము, ఆవాలనూనెతో చేయబడ్డశాకము కమలమూలము, పుష్కరమూలము,గంభారీ, పాలు,తేనె కలిపివాడుట, హారిలమాంసము, కపోత మాంసము |
| **స్నిగ్ధ,శీతల ఔషధ ములు,ద్రవ్యములు** | అనూపదేశము, శీతాకాలము |
| **హారిద్రమాంసము** | బార్‌బెర్జి కర్జతోవండినమాంసము, పసుపు, తేనె. |

**అనుపానం ఎంత మోతాదు వాడాలి ?**

ఈ విషయం గూర్చి శారంగధర సంహిత యందు అనుపానం చూర్ణం, లేహ్యం, గుటికలుగా ఉపయోగించేటప్పుడు

వాతరోగాలలో 3 ఫలాలు (120 మి.లీ.), పిత్తరోగాలలో 2 ఫలాలు (80మి.లీ.), కఫరోగాలలో 1 ఫలము (40 మి.లీ.) అనుపానంగా వాడాలి. (శా.సం.మ. 6/4)

వివిధ కోణాలలో వివిధ అనుపానములు : బృహత్ త్రయమునందు ముఖ్య ఔషధమునకు వివిధరకాల అనుపానములు సూచించారు. వాటిని పట్టికలో పొందుపరుస్తున్నాను.

**రోగాలు - సాధారణ అనుపానాలు**

**1. అజీర్ణం**: ఉసిరి, అల్లం, చిత్రక, చూర్ణోదక, ధాన్యక, నింబుస్వరస, పిప్పలి, ముస్తక యవాని, లవంగ, శతపుష్ప, సైంధవలణ సౌవర్చలలవణ, హరీతకీ.

**ఆమాజీర్ణం :** ఉష్ణోదకము, ఆర్ద్రక, శొంఠి, పిప్పలి, యవాని, చిత్రక, ముస్తక

**విదగ్ధాజీర్ణం :** నింబూస్వరసం, చూర్ణోదక, వేయించిన జీరక, యవాని, హరీతకీ ఆమ్లకి, లవంగ

**విష్టబ్ధాజీర్ణం :** ధాన్యక, తండూలోదక, సైంధవలవణ, సౌవర్చలవణ, శతపుష్ప, హరీతకి, విభీతకి

**2. అతిసారం :** అతివిష, ఇంద్రయవ, ఉష్ణోదక, దదిమస్తు, దానిమ్మ, బిల్వ, మేదిక, ముస్తా, లాక్షా

**అతిసారం :** ముస్తకచూర్ణం, ఇంద్రయవచూర్ణం, వేయించిన జీరక, అతివిష, వేయించిన యవాని, మధు

**ఆమాతిసారం :** వేయించిన జీరక, ఇంద్రయవ

**జ్వరాతిసారం :** వేయించిన జీరక మధు, తండులోదక

**రక్తాతిసారం :** దాడిమ చిగుళ్ళరసం, ఉదుంబర కషాయం, లాక్షా, మధు, ముస్తా చూర్ణం, గోక్షుర

**3. అలసక :** నింబుస్వరసం, హింగు, మధు, వేయించిన జీరక, యవానిచూర్ణం

**4. అపస్మార,ఉన్మాద :** ఇక్షురస, కదలీకాండం, పురాణఘృతం, దాడిమ, శంఖపుష్పి, సర్పగంధా, తండూలోదక, పటోలపత్ర, వచ, త్రిఫల, తాళపత్ర, మధు,నారికేళజలము.

**5. ఛర్ది :** ఆమ్లకి, ఉష్ణోదక, దాడిమ, నారికేళోదక, పటోలపత్ర, పర్పాటుక, శుద్ధ జల, పిప్పలి, పుదీనార్క, మధు+జల, యవాని అర్క రక్తచందన, యష్టి, శతపుష్ప, త్వక్

**6. గ్రహణి :** తండూలోదక, మధు, వేయించిన జీరక, ముస్తక, దదిమస్తు, దాడిమ, బిల్వ

**7. హిక్కా :** కులత్థ, పిప్పలి, దేవదారు, ఆర్ద్రక స్వరసం, మధు, కులాంజన, వచ, నెయ్యి, యష్టి, కంటకారి

**8. హృద్రోగ :** జఠామాంశి కషాయం, అర్జున, మధు, బలా, దానిమ్మ ఆకుల కషాయం

**9. జ్వర :** ఆర్ద్రక, కారవేళ్ళక, గుడూచి, తంబూల, ద్రాక్ష, తులసి, నారికేళ, నిర్గుండి, పటోలపత్ర, పిప్పలి, పర్పాటకము. బిల్వ పత్ర స్వరసం. మధు, వేయించిన జీరక, మరీచ శర్కరోదక

**వాతికజ్వర :** పిప్పలీ చూర్ణం, మధు, ఆర్ద్రక స్వరసం

**పిత్తజ్వర :** పర్పాటకక్వాథ, రక్తచందన జలం, శర్కరోదక

**శ్లేష్మక జ్వర :** శౌంఠిచూర్ణ,మధు

**ప్రతిశ్యాయయుక్త :** తంబూలస్వరస, మధు

**అజర్ణయుక్త :** ఆర్ద్రక స్వరస, మధు

**వాత, కఫజ్వర :** ఆర్ద్రక స్వరస, మధు, తంబూల స్వరసం

**విషమజ్వర :** తులసీపత్ర, త్రికటు, శర్కరోదక, పారిజాత, నిర్గుండి, మధు, కాల మేఘస్వరసం

**వాతోల్బన సన్నిపాత :** నారికేళజలం, తంబూల స్వరసం, దశమూల క్వాథ, జటా మాంశి క్వాథ, ఆర్ద్రక స్వరసం

**పిత్తోల్బన సన్నిపాత :** భృంగరాజ స్వరసం, మధు, ఆర్ద్ర, స్వరసం, వేయించిన జీలకర్ర

**కఫోల్బన సన్నిపాత :** ఆర్ద్రక స్వరసం, మధు, పిప్పలి, కంటకారీ క్వాధ, తాంబూల స్వరసం

**అన్నిరకాల సన్నిపాత జ్వరాలు :** బిల్వదళాలు, గుడూచి సత్వ, శొంఠి, మధు

**10. కామల :** ఇక్షుస్వరసం, ములకస్వరసం, హరీతకీ, శర్కరోదక, నింబుస్వరసం, గుడ, శర్కర

**11. కాస :** కంటకారి, కర్కాటక శృంగి, ఘృత, యష్టిమధు, వంశలోచన, విభీతకి

**వాతజకాస :** శర్కరోదక, వాసాస్వరసం, ఆర్ద్రక, ఘృతం, మధు

**పిత్తకఫజ :** కర్కాటకశృంగి, పిప్పలి, విభీతకి, వంశలోచన, కంటకారి, యష్టిమధు

**క్షతజరిక్షయజ :** ఘృత, పిప్పలి చూర్ణ, యష్టిమధు

**12. కృమి,ఉదరశోధ :** హరీతకి, బిల్వపత్ర, పునర్ణవా, గోమూత్ర, పిప్పలి, ఉష్ణో దక, నింబపత్ర, విడంగ, పలాశ బీజ, ఖర్జూరపత్ర

**13. కుష్ఠ, వాతరక్త,ఫిరంగ, మసూరిక :** ఆమ్లకి, ఖదిర, గుడూచి, దారు హరిద్రా ద్వీపాంతరవచ, నింబత్వక్, మంజిష్ట, జటామాంశి, మధు, మూషికాకర్ణి, యష్టిమధు, సారిబా, హరిద్రా, విడంగ

**14. పాండు :** ఆమ్లకి, కోకిలాక్ష, గోఘృతం, తిక్త, నింబత్వక్, హరిద్రా, హరీతకి

**15. ప్రమేహ& మధుమేహ :** అశ్వగంధ, ఆమ్లకి, ఉదుంబర, కదళీ,కరంజ, కోకి లాక్ష, గుడూచి, గోక్షుర, తండూలోదక, తృణపంచమూల, దూర్వా, నారికేళోదక, నిర్మలీ పాషాణబేధ, పునర్ణవా, చించపత్ర) మంజిష్ట, ముసలి, జటామాంశి.

**ప్రమేహ : ఉదకమేహ :** బింబీపత్ర, పునర్ణవా, ఉదుంబర, కరంజ, నిర్మలి

**పిష్ట లశిక, హరిద్రా, వసా :** పునర్ణవా, కోకిలాక్ష, రోక్షుర, జటామాంశి

**శుక్రమేహ :** అశ్వగంధా, శతావరి, బలామాల, ముసలి, హరిద్రా, మంజిష్టా

**రక్తమేహ :** విశల్యకరణి, వస, శ్వేత దూర్వా

**ప్రమేహ :** త్రిఫల, పిప్పలి, ఆమ్లకి, గుడూచి, హరిద్రా, బలా, మాంశి

**ఔపసర్గికమేహ :** కదళి, శర్కరయుక్తదది, కంకోల, గోక్షుర, శ్వేతచందన

**మూత్రకృచ్ఛ :** ఆమ్లకి, తండూలోదక, నారికేళోదక, హరిద్రా శతావరి, పాషాణబేధ, దూర్వా, తృణ పంచమూలములు.

**16. రక్తపిత్తం :** ఖర్జూర, ఉదుంబర, ద్రాక్షా, దూర్వా, వాసా, విసల్యకరణి, లాక్షోదక

**17. శూల, అరోచక, ఉదావర్త :** ఆమ్లకి, ఆమ్రపత్ర, ఆమ్లవేతస, చించాఫల, త్రిఫల, దాడిమ, నారికేళలవణ పటోలపత్ర, బిల్వపత్ర, యవాని, సైంధవ లవణ, శతావరి, హరీతకి, శతపుష్పి

**18. స్వరభంగ :** కుళాంజన, వచ, ఘృత, మధు,కంటకాది, యష్టిమధు

**19. శ్వాస :** ఉష్ణోదక, పురాణగుడ, విభీతకి, మజ్జ, స్త్రీ దుగ్ధ, శృంగి, తులశి, హింగు, కర్పూర

**20. త్రీక్షణ (ఉష్ణం) :** ఆమ్రపత్ర స్వరసం, కదలీకాండం, గూడూచి స్వరసం, జంబూపత్ర స్వరసం, జంబీరస్వరసం, దాడిమపత్ర స్వరసం, ఉదుంబర ఫలరసం, తండూలోదక, మాంసరసం, శతావరి స్వరసం, ధాన్యోదక, నారికేళోదక, పలోటపత్ర

**21. వాత వ్యాధి మరియు ఆమవాత :** అశ్వగంధ, ఏరండతైల ఏరండమూల, గుగ్గులు, పురాణ ఘృతం, బలా, బిల్వ, త్వక్ మరీచ, రసోన, రాస్నా, శిగ్రు

**22. యక్ష్మ :** అజదుగ్ధ, పిప్పలి, మధుయష్టి, ద్రాక్షా, ఖర్జూర, తాళిసపత్ర, దూర్వా వంశలోచన, వాసా

**సరక్త :** ఉదుంబర, విశల్యకరణి, ద్రాక్షా, దూర్వా, వాసా

**23. అర్మలు :** భల్లాతకి, చిత్రక

**24. ప్లీహరోగం :** పిప్పలి చూర్ణం

**25. విష :** శిరీషత్వక్, శిరీష ఫలచూర్ణం

**26. ఉదర :** విరేచన ద్రవ్య

**27. గరళదోషం :** స్వర్ణభస్మం

**28. వాతరక్తం :** గుడూచి స్వరసం

**29. ఆర్థిత :** మాషా (ష)

**30. మేదోరోగం :** తేనె+వేడినీరు

**31. ప్రదర :** లోద్రాత్వక్

**32. అరుచి :** గుగ్గులు

**33. ఆమ్లపిత్త :** ద్రాక్షా

**34. శోక :** మధ్యము

**35. ఆమ్లపిత్త :** ద్రాక్షా

**36. మూత్రకృచ్ఛ :** కూష్మాండ స్వరసం, శతావరి క్వాధ

**37. నేత్రరోగ :** త్రిఫలక్వాధ, త్రిఫల హిమ కషాయ, త్రిఫల పాంట

**38. కుష్ఠ :** ఖదిరక్వాద, శారిబాక్వాధ

**39. నిద్రాక్షయ :** గేదెపాలులో పంచదార కలిపి

**40. శ్విత్ర :** బాకుచి విత్తనాలు

**41. వమనం :** లాజమాండ+తేనె

**42. ఊర్ధ్వశూల :** తీక్ష్ణ ఔషధాలు ఉదా : కట్పల

**43. పార్శ్వశూల :** పుష్కర మూలం

**44. మూర్ఛ :** బ్రహ్మి, శంఖపుష్పి, వచ

**45. కార్శ్మ :** మాంసరసం+నెయ్యి

**46. అశ్మరీ :** కులుత్థ, పాషాణభేద

**47. గుల్మ :** శిగ్రుమూలత్వక్

**48. విద్రధి :** రక్తమోక్షణ

**49. హిక్కా :** లాక్షరసంతో నశ్యము

**50. దాహ :** శీతల ద్రవ్య

**51. భగంధర :** కుక్క ఎముకలను గాడిదరక్తంతో కుమ్మి పైకి వేయాలి.

**52. స్వరభేధ :** పుష్కరమూలం+తేనె, ఉష్ణజలం+లవణం

**53. భల్లాతక మరియు తువరక స్నేహపానం :** చల్లని నీరు

**54. పెరుగు, తేనె, పాలు :** కాచి చల్లార్చిన నీరు

## అనుపానాన్ని ఎలా ఎన్నుకోవాలి / ఎంచుకోవాలి?

1. దోష 2 దేశ 3 రోగ 4 ఆహార 5 ఔషధము 6 రోగి 7 కాల అనే విషయాలు గుర్తించి అనుపానాన్ని ఎంచు కోవాలి.

1. దోషం : వాతదోషం - స్నిగ్ధ మరియు ఉష్ణ
2. పిత్తదోషం - మధుర మరియు శీత
3. కఫదోషం - రూక్ష మరియు ఉష్ణ
4. రక్త దోషం - క్షీర మరియు ఇక్షు రస

2. దేశ : ఏదేశమువారి యొక్క ప్రాంతాన్ని అనుసరించి అనుపానం మారవచ్చు.

3. రోగం : పాలురక్త పిత్తమందు, ఆర్ద్రక స్వరసం జ్వరమునందు

4. ఆహారం : పథ్యాహారము, రోగిని బట్టి మారవచ్చు

5. ఔషధం : నెయ్యి తర్వాత వేడినీరు సేవనం లాంటివి

6. రోగి రోగం అనుసరించి రోగి పరిస్థితిని బట్టి అనుపానం

**కాలం** : ఋతువునుబట్టి అనుపానం మారుతుంది.

1. శిశిర ఋతువు - పిప్పలి
2. వసంత ఋతువు - మధు
3. గ్రీష్మ ఋతువు - గుడము
4. వర్ష ఋతువు - లవణం
5. శరత్ ఋతువు - శీతజలం
6. హేమంత ఋతువు - శొంఠి

**వాగ్బటాచార్యుడు చెప్పిన అనుపానాలు, రోగాలు**

1. శూల - హింగు+ఘృత
2. జీర్ణజ్వర-పిప్పలి+మధు
3. వాతవ్యాధి - రాస్నా +ఘృత
4. శ్వాస - త్రికటు+మధు
5. శీత (రొంప) - తాంబూల+మరీచ
6. ప్రమేహ - త్రిఫల+శిలాజిత్తు

7. సన్నిపాత – ఆర్ద్రక స్వరస + తేనె
8. గ్రహణి – తక్ర
9. విష– స్వర్ణ
10. వమన – లాజ
11. అతిసారం – కుటజ
12. రక్తపిత్త–వాసా
13. అర్మ – చిత్రక
14. క్రిమి–విడంగ
15. అజీర్ణ–వేడినీరు
16. క్షయ–పాలు, మాంసరసం
17. పాండు – పునర్ణవా
18. కాస – వాసా

## వేదకాలంనాటి మూలికలు / మందులు

**ఋగ్వేదము** : 1 కింశుక 2 ఖదిర 3 దూర్వా 4 కామల 5 సోమలా 6 పిప్పలి 7 ఆమ్లకి 8 కరంజా

**యుజర్వేదము** : 1 సక్తు 2 పారివస 3 మధు 4 గోధుమ 5 మసుర 6 ముగ్ధ 7 మాష 8 తిల 9 ప్రియంగు

**అధర్వణ వేదం** : 1 అపామార్గ 2 అర్క 3 అశ్వర్థ 4 అర్జున 5 ఖదిర 6 తిల 7 యవ 8 పిప్పలి 9 పృశ్చిపర్ణి 10 బిల్వ 11 ఉదుంబర 12 ఇక్షు 13 లాక్షా 14 సహదేవ 15 సోమ 16 గుగ్గులు 17. ముంజా

అలాగే తయారీ విధానాలు పూర్వకాలం (వేదకాలం అనుసరించి)

1 స్వరసము 2 క్షీరపాకము 3 అరిష్టా 4 సంధాన 5 దధి 6 ఆసవ 7 తక్ర 8 నవనీతం 9 ఆజ్య (ఘృతసర్పి, అగుట) 10 లాజ 11 ఓదన 12 ఫాంటా 13 లేహ్యం 14 నశ్య 15 యవాగు 16 మైత్రావరుణి 17 వాజిన 18 అమిక్ష 19 మస్తు 20 తైల 21 అన్న 22 శక్తు 23 మధు 24 బక్కస 25 కిణ్వ 26 అంకురిత కృహి 27 పేయ

పైవాటిని అనుపానముగా ఎలా వాడతారో ఈ గ్రంథమునందు వ్రాసాను. అయితే పై వానిలో కొన్నిటిపేర్లు మార్పు జరిగినవి అంతేగాక కొన్నిటిని ఇపుడు తయారు చెయ్య లేని పరిస్థితి కావున నేటికాలాను గుణంగా మనకు అవసరమైన / ఉపయోగమైన / వాడుకలో ఉన్న వాటిలనే ఈ గ్రంథమందు వ్రాయుట జరిగింది.

**రసగుణ వీర్య విపాకాలు గూర్చి మనకు ఆధునిక పద్ధతి ప్రకారం** రుచులు నాలుగు.

1. తీపి 2. చేదు 3. లవణం 4. పులుపు ఈ నాలుగు రుచులను నాలుక గుర్తించ గలదు.

1. తీపి – నాలుక చివర
2. లవణం – నాలుకంతా
3. పులుపు – ప్రక్కలు
4. చేదు – నాలుక వెనుకభాగమందు బాగా తెలుస్తుంది.

రసం (రుచి) ఏ విధంగా మారుతుందో పూర్వులు చెప్పిన సిద్ధాంతం (పంచభూతాలను అనుసరించి)

| రసం | చరకుడు | సుశ్రుతుడు | వాక్భటుడు | నాగార్జునుడు |
|---|---|---|---|---|
| 1. మధుర | నీరు+పృధ్వీ | పృధ్వీ+నీరు | పృధ్వీ+నీరు | పృధ్వీ+నీరు |
| 2. ఆమ్ల | పృధ్వీ+అగ్ని | నీరు+అగ్ని | పృధ్వీ+అగ్ని | నీర+అగ్ని |
| 3. లవణం | నీరు+అగ్ని | పృధ్వీ+అగ్ని | నీరు+అగ్ని | అగ్ని+నీరు |
| 4. కటు | వాయు+అగ్ని | వాయు+అగ్ని | వాయు+అగ్ని | అగ్ని+వాయువు |
| 5. తిక్త | వాయు+ఆకాశ | వాయు+ఆకాశ | వాయు+ఆకాశ | ఆకాశ+వాయు |
| 6. కషాయ | వాయు+పృధ్వీ | పృధ్వీ+వాయు | వాయు+పృధ్వీ | అగ్ని+వాయు |

## రసము – వివిధ ఋతువులలో

| | ఋతువు | రసము | పాంచభౌతికమిళితము |
|---|---|---|---|
| 1. | శిశిర | తిక్త | వాయు + ఆకాశ |
| 2. | వసంత | కషాయ | వాయు + పృధ్వీ |
| 3. | గ్రీష్మ | కటు | వాయు + అగ్ని |
| 4. | వర్ష | ఆమ్ల | పృధ్వి + అగ్ని |
| 5. | శరత్ | లవణం | నీరు + అగ్ని |
| 6. | హేమంత | మధుర | పృధ్వి + నీరు |

## రసము వాటి వివిధ స్వరూపాలు, దోషాలు

**1. మధురము**

(ఎ) దోషముపై ప్రభావము వాతపిత్త, శమక, కఫ వర్ధకము

(బి) కర్మ (చర్య) : ధాతువర్ధన, ఓజో వర్ధనము, ఆయుష్యము, ఇంద్రియ ప్రసా దన, బల్య, వర్ణ్య, విషహర, తీక్ష్ణ ప్రశమన, దాహప్రశమన, కేశ్య, కంటివర్ధక, జీవనీయ, బృంహణీయ, సందానకర, స్థన్యజన్య.

(సి) ఎక్కువ వాడితే కలిగే రోగాలు / వ్యాధులు : స్థౌల్య, మార్ధవకర, అలస్య గౌరవ, అరుచి, అగ్నిమాంద్య, అతినిద్ర, అస్య, కాంత, మాంసవృద్ధి, శ్వాస, కాస, ప్రతి శ్యాయ అలసక, శీతజ్వరము, అస్య మాధుర్య, చర్ధి, అలస శీతజ్వరము, అస్యమాధుర్య, చర్ధి, సంజ్ఞనాస, స్వరభంగ, గళగండ, గండమాల, శ్లీపద, శోఫ, వస్థిరోగ, ధామనిలేప, నేత్రరోగ, కఫ వికార.

తగిన వ్యాధులు : వాతరోగం, అస్థిభంగ, మూర్ఛ, క్షతఃక్షీణ, రక్తపిత్త తగిన వ్యాధులు.

**2. లవణం :**

(ఎ) దోషముపై ప్రభావము : వాతశామక, పిత్త, కఫవర్ధక

(బి) కర్మ : పాచన క్లేదన, దీపన, ఛేదన, భేదన వికసి, స్రోతో శోధక, శరీర మార్ధనకర, సంశోధన, ధాతు శైధిల్యకర, రుచ్య.

(సి) ఎక్కువ వాడటం వల్ల కలిగే రోగం : పిత్తవృద్ధి, రక్తవికార, తీక్ష్ణ, మూర్ఛ, సంతాప, మాంసగత, కుష్ఠ, శోధ, దంతచలన, నపుంసకత్వ, వలి, పలిత్య, ఖాలిత్య, రక్తపిత్త, ఆమ్లపిత్త, విసర్పి, వాతరక్త విసర్చిక.

తగిన వ్యాధులు : వాతరోగ, అగ్నిమాంద్య, శూల, మధుమేహ, శ్వాస

**3. ఆమ్లరసం**

(ఎ) దోషముపై ప్రభావం : పిత్త, కఫ వర్ధక, వాతానులోమన

(బి) కర్మ : దీపన, పాచన, బృంహణ, హృద్య, కోష్ఠ విదాహి వ్యవహి.

(సి) ఎక్కువ వాడటం వల్ల కలిగే వ్యాధులు / రోగాలు : దంతహర్ష, తీక్ష, రోమ హర్షణ, పిత్తవృద్ధి, రక్తవికార, మాంస విదాహ, శరీర శైధిల్యం, శోధ, హృదయదాహ, కంఠదాహ, సర్వాంగ దాహ

(డి) తగిన వ్యాధులు : హృద్రోగ, అగ్నిమాంద్య, వాతరోగము.

**4. కటురసం**

(ఎ) దోషముపై ప్రభావం కఫ శామక, వాతపిత్త వర్ధక

(బి) కర్మ : ముఖశోధన, అగ్నిదీపన, ఇంద్రియ దౌర్బల్య, కండూహర, వ్రణరోపణ, క్రిమిహర, మాంసలేఖన, శ్రోత వివరణ.

(సి) ఎక్కువ వాడటం వల్ల కలిగే వ్యాధులు / రోగాలు నపుంసకత్వ, మూర్ఛగ్లాని, కృశత్వం, భ్రమ, దాహ, తీక్ష్ణ, కంప, సర్వాంగశూల, వాతరోగం

(డి) తగిన వ్యాధులు – కండు, వ్రణ, గ్రహణి, అగ్నిమాంద్యము, కఫ వికార

**5. తిక్తరసం**

(ఎ) దోషముపై ప్రభావం – పిత్త కఫశామక, వాతవర్ధక

(బి) కర్మ : విషహర, క్రిమిహర, కండూహర, దాహప్రశమన,

తీక్ష్ణ, ప్రశమన, లేఖన, స్థన్య శోధన, ధాతు శోషణ

(సి) ఎక్కువవాడటం వల్ల కలిగే వ్యాధులు / రోగాలు : రూక్షత్వం, విషలక్షణ, ధాతు క్షయ, ఓజోక్షయ, శ్రోతోక్షరత్వ గ్లాని, మోహ, భ్రమ, ముఖశోష, శరీర శోష, దౌర్బల్యం మొ॥వి

ముఖ్యవ్యాధులు : ఆమ్లపిత్త, ఆమవాత, కుష్ఠ, క్రిమిరోగం, మేదో రోగం.

**6. కషాయ రసం**

(ఎ) దోషముపై ప్రభావం– పిత్త, కఫహర, వాతవర్ధక

(బి) కర్మ : శంశమన, సంగ్రహి, సంధానకర, రోపణ, శోషణ, స్థంభన, రక్తప్రశమణ, లేఖన, త్వచ్య, విష్ఠంబి, జ్వరహర, ఛేదన మొ॥నవి.

(సి) ఎక్కువవాడటం వల్ల కలిగే వ్యాధులు / రోగాలు : ముఖ శోధ, హృత్పీడ, అధ్మాన, వక్రహస్రోతో రోధ, నీలపురంగు మచ్చలు, జీర్ణశక్తిమారుట, నపుంసక లక్షణం, మూత్రవేగం తగ్గుట, మలబద్దకం, కృశత్వం, పక్షాఘాత, అర్ధిత, ఆపతనకన మొ॥నవి.

(డి) తగినవ్యాధులు : అతిసారం, గ్రహణి, త్వక్ వికార, మేదోరోగ

## రస ప్రభావం దోషము - దూష్యము

| రసం | ప్రకోపం | ప్రశమనం | ధాతువుపై ప్రభావం |
|---|---|---|---|
| 1. మధుర | కఫ | వాత,పిత్త | ధాతువృద్ధి |
| 2. ఆమ్ల | కఫ,పిత్త | వాత | హృద్య |
| 3. లవణం | కఫ,పిత్త | వాత | శుక్రక్షయ |
| 4. కటు | పిత్త, వాత | కఫ | ధాతుక్షయ |
| 5. తిక్త | వాత | కఫ, పిత్త | ధాతుక్షయ |
| 6. కషాయ | వాత | కఫ, పిత్త | ధాతుక్షయ |

## రసము - ఆహార ఔషధాలలో ఉపయోగం

**1. ఆహారంలో**

1. ప్రధమావస్థయందు - మధురరసం
2. మధ్యమావస్థ యందు - ఆమ్ల మరియు లవణ రసం
3. అంత్యావస్థ యందు తిక్త, కటు, కషాయ రసాలు

భావమిశ్రుని ఆలోచన ప్రకారం మధురరసం చివర ఇవ్వాలని చెప్పారు.

## దోషము- ఔషధమునందు రసం వాడకం / ఉపయోగం.

1. కఫ ప్రకోపం / లోపం–కటు–కషాయరసం
2. పిత్త ప్రకోపం / లోపం - తిక్త - మధుర కషాయం
3. వాత ప్రకోపం / లోపం–లవణ–ఆమ్ల–మధురరసాలు.

గుణం : గుణమనేది ద్రవ్యం యొక్క ముఖ్య లక్షణం ఇది. ద్రవ్యం యొక్క చేష్టను చెపుతుంది. ప్రత్యేక లక్షణములు తెల్పును. ఈ గుణాలు ఆయుర్వేద వేత్తలు చెప్పినవి 41 కలవు.

1. ఆధ్యాత్మిక గుణాలు 6; 2. గుర్వాది గుణాలు –20; 3. పారాది గుణాలు 10; 4. విశిష్ఠగుణాలు 5 = 41 యోగేంద్రనాథ్ మనస్సు చేర్చి 42 గుణాలు ప్రతిపాదన చేసారు.

1) వైశేషిక గుణాలు (ఖచ్చితగుణాలు / లక్షణాలు)

2) సామాన్య గుణాలు (సాధారణ గుణాలు/లక్షణాలు)

3) ఆత్మగుణాలు (ఆత్మగుణాలు /లక్షణాలు)

మరలా సామాన్య గుణాలు 2 రకాలు

1. గుర్వాది గుణాలు 2. పరాది గుణాలు

గుర్వాది గుణాలు (20)

1 గురు (Heviness) 2 లఘు (Light) 3 శీత (Cold) 4 ఉష్ణ (Hot) 5 స్నిగ్ధ (Unctuous) 6 రూక్ష (Dryness) 7 మందగుణ (Mild) 8 తీక్ష్ణ (Sharp) 9. స్థిర (Immobility) 10. చర (Mobility) 11 మృదు (Softness)12 కఠిన (Hardness) 13 విషాద (Clearness) 14 పిచ్ఛిల (Stickness) 15 శ్లాక్షణ (Smoothness) 16 క్షార 17 సూక్ష్మ (fineness) 18 స్థూల (Biliness) 19 సంద్ర (Torbidity) 20 ద్రవ Fuidity)

పరాది గుణాలు (10)

1 పర్వత (Priority / superiority) 2 అపర్వత (inferiority posteriority 3 యుక్తి (Logic) 4 సంఖ్య (Numbering) 5 సంయోగ (Intergration) 6 విభాగ (Disintergration) 7 పృతక్వత (Severality) 8 పరిమాణ (Dimension) 9 సంస్కార (Transformation) 10 అభ్యాస (Regularuse)

ఆత్మగుణాలు (6)

1 ఇచ్ఛ 2 ద్వేష 3 సుఖ 4 దుఃఖ 5 ప్రయత్న 6 బుద్ధి

విశేషగుణాలు (5)

1 శబ్ద 2 స్పర్శ 3 రూప 4 రస 5 గంధ

వీర్యము : శక్తివంతమైనది. ద్రవ్యము యొక్క శక్తి దీని గురించి ఆయుర్వేదములో విస్తృతంగా చెప్పారు. ఇవి 2 రకాలు స్థూలంగా ఉష్ణ, శీత వీర్యాలు. ఇవి ద్రవ్య, గుణ, కర్మలచే వికృతి పొంది 10 రకాలుగా ఉన్నాయి.

1. గుణ వీర్య వాద (శక్తిమాత్ర పరిభాషిక)

2. కర్మవీర్యవాద

3. ద్రవ్య వీర్యవాద (చింత్యా-అచింత్య)

## వీర్యము దాని ప్రభావము

| వీర్యం | పంచభూతాలు | దోషముపై ప్రభావం | శరీరములో/జీవిపై ప్రభావం |
|---|---|---|---|
| 1. ఉష్ణ | అగ్ని | వాత,కఫహర పిత్తవర్ధక | దీపన,పాచన,దాహజనన,మూర్ఛ వమన, విరేచన,విలాయన,భ్రమ తీక్ష్ణ జనన, అసుపాక, అవృిష్య |
| 2. శీత | జల | పిత్త,హర, వాత,కఫవర్ధక | ప్రహ్లాదన, విష్యంధన,స్థిరీకరణ ప్రసాదన,క్లేదన,జీవనీయ, స్తంభన, రక్తప్రసాదన, బల్య |
| 3. స్నిగ్ధ | జల | వాతహర,కఫ వర్ధక | స్నేహన, బృంహణ, సంతర్పణ, వాజీకరణ, వయఃస్థాపన |
| 4. రూక్ష | వాయు | వాతవర్ధక కఫ,పిత్తహర | సంగ్రహణ, పీడన, విరుక్షణ రోపణ |
| 5. గురు | జల | కఫవర్ధక, వాతహర | ఉపలేపన, బృంహణ, బల్య |
| 6. లఘు | అగ్ని,ఆకాశ వాయు | కఫహర వాతవర్ధక | లేఖన, లంఘన, ధాతు, క్షయ |
| 7. మృదు | జల+ఆకాశ | పిత్తహర | రక్తప్రసాదన, మాంసప్రసాదన |
| 8. తీక్ష్ణ | అగ్ని | కఫహర | సంగ్రహి, అచూషణ,అవద్ధరణ శ్రవణ |
| 9. విషాద | పృధ్వి+వాయు | కఫహర | క్లేదచూషణ,విరూక్షణ,ఉపరోహణ |
| 10. పిచ్ఛల | జల | కఫవర్ధక | ఉపలేపన, పూరణ, బృంహణ, వాజీ కణ, సంశ్లేషహరణ |

## విపాకము

పదార్థము / ద్రవ్యము / మూలికా జీర్ణమైన తర్వాత శరీరములో దాని స్థితిని విపాకమని పిలుస్తారు. ఇది రసము యొక్క జీవిస్థితికి ఆఖరిది అనగా ఈ స్థితిలో భౌతిక స్థితి పూర్తిగా కోల్పోయి శరీరములోనికి కలుస్తున్న / కలిసే దశ. అనగా జీర్ణముపూరై జఠరాగ్నితో పచనమైన తర్వాత ద్రవ్య స్థితి ఇది శరీరము లోపల రెండు రకాలుగా ఉండును.

### రసము మరియు విపాకముల మధ్య భేదాలు

| రసం | – | విపాకం |
|---|---|---|
| 1. ఇంద్రియముల ద్వారా తెలుసుకుంటాం | | 1. చివరిస్థితిలో తెలుసుకుంటాం |
| 2. త్వరగా ప్రభావం కన్పించును | | 2. మెల్లగా ప్రభావంకన్పించును |
| 3. బయట ప్రభావం కన్పించును | | 3. లోపల ప్రభావం కన్పించును |
| 4. స్వయంగా తెలుసుకోవచ్చు | | 4. స్వయంగా తెలుసుకోలేము |

| విపాకం | పంచభూత కలయిక | గుణాలు పంచభూత | దోషముపై ప్రభావం | ధాతువుపై ప్రభావం | మలముపై ప్రభావం |
|---|---|---|---|---|---|
| మధుర | స్నిగ్ధ,గురు | పృధ్వి+నీరు | కఫం పెంచును వాత,పిత్తం తగ్గించును. | శుక్రలము ధాతువు లనువృద్ధి | మలమూత్రం ఎక్కువచేయును |
| ఆమ్ల | స్నిగ్ధలఘు | వాయు+అగ్ని ఆకాశం | పిత్తమము పెంచును వాతంతగ్గించును | శుక్రనాశనం చేయును | పైవలె |
| కటు | రూక్ష లఘు | అగ్ని+ వాయు | వాతం పెంచును కఫంతగ్గించును | శుక్రహర | మలమూత్ర ములను తగ్గించును |

## వివిధ మందులు ఎవరెవరికి ఎంత వాడాలి

| ఔషధము | నెల | రోజుకు 1-54 | మోతాదు 6-154 | 15సం॥ పైబడి |
|---|---|---|---|---|
| స్వరసం | 1-3చుక్కలు | 5-15చుక్కలు | 2-5మి.లీ | 7-14మి.లీ |
| కల్కము | 130మి.గ్రా | 2-2గ్రా. | 2-5గ్రా | 6-12గ్రా |
| చూర్ణము | 130మి.గ్రా | 1-2గ్రా. | 2-3గ్రా | 3-6గ్రా |
| శీతకషాయ | 1-5చుక్కలు | 5-15చుక్కలు | 2-5మిలీ | 14-28మిలీ |
| వటి | 16-30మిగ్రా | 30-130మిగ్రా. | 130-250మిగ్రా | 250-500మి.గ్రా |
| భస్మం | 8-16మిగ్రా | 30-130మిగ్రా. | 130-250మిగ్రా | 250-500మిగ్రా |
| ఆసవాలుఅరిష్టాలు | | 1-5చుక్కలు | 5-15చుక్కలు | 2-5 మి.లీ 14-28మి.లీ |
| అవలేహము | 120మిగ్రా | 1-2గ్రా | 2-5గ్రా | 12-24 గ్రా |
| పానకము | 1-5చుక్కలు | 5-15చుక్కలు | 2-5గ్రా | 14-28గ్రా |
| ఘృతం | 1-5చుక్కలు | 5-15చుక్కలు | 2-5గ్రా | 12-24 గ్రా |
| సిద్ధదుగ్ధ | 5-10చుక్కలు | 1-20మిగ్రా | 100-200మిలీ | 10-250మి.లీ |
| సుధా/గైరిక టంకణ/స్పటిక | 65-130మిగ్రా | 130-250మిగ్రా | 250-500మిగ్రా | 500-1000మిగ్రా |

1 నుండి 6 నెలలోపు వారికి వటులను చూర్ణ రూపంలో ఇవ్వాలి.
తల్లిపాలు లేదా తేనె అనుపానంగా వాడాలి.

## ప్రభావము

ప్రభావమును ద్రవ్యము / ఔషధము యొక్క ఖచ్చితమైన చర్య దీనికి వివిధ రకములైన పర్యాయ నామములు గలవు. అవి

1 శక్తి 2 విచిత్ర ప్రత్యయరాబ్ధత్వ 3 వికృతి విషమసమవేద

4 అచింత్యవీర్య 5 అనవధారనీయ 6 స్వాభవ

1 ద్రవ్య ప్రభావం 2 గుణ ప్రభావం 3 ద్రవ్య–గుణ ప్రభావం

## మాత్ర ఎంత వాడాలి ? డోసు ఎవరికి ఎంత ?

పిల్లలకు మాత్ర నిర్ణయం

యంగ్స్‌రూల్ = $\frac{\text{వయస్సు (సంవత్సరాలలో)}}{\text{వయసు +12}}$ × పెద్దవారి మాత్ర

డిల్లింగ్ రూల్ = $\frac{\text{వయస్సు సంవత్సరాలలో}}{20}$ × పెద్దవారి మాత్ర

ఫ్రైడ్ రూల్ = $\frac{\text{వయస్సు నెలల్లో}}{150}$ × పెద్దవారి మాత్ర

క్లార్క్స్ రూల్ = $\frac{\text{బరువు lbs (పిల్లవాని)}}{150}$ × పెద్దవారి మాత్ర

కౌలింగ్‌రూల్ = $\frac{\text{తర్వాత పుట్టినరోజుకు వయస్సు}}{24}$ × పెద్దవారి మాత్ర

బస్టెడో రూల్ = $\frac{\text{వయస్సు సం॥రాలలో+3}}{30}$ × పెద్దవారి మాత్ర

---

## మాన పరిభాషను తేలికగా గుర్తుంచుకొను మార్గము

| | | |
|---|---|---|
| 4 | మాషములు | 1 టంకము |
| 4 | టంకములు | 1 అకము – కర్షము |
| 4 | అకములు | 1 పలము |
| 4 | పలములు | 1 కుడువము |
| 4 | కుడువములు | 1 ప్రస్థము |
| 4 | ప్రస్థములు | 1 ఆఢకము |
| 4 | ఆడకములు | 1 ద్రోణము |
| 4 | ద్రోణములు | 1 ద్రోణి |
| 4 | ద్రోణీలు | 1 ఖారీ |

## నాడు - నేడు

| | పూర్వకాలంలో | భైషజ్యకల్పన ప్రకారం | ఆధునిక కాలంలో |
|---|---|---|---|
| 1. | సోమరసం | స్వరసం | మొత్తం రసం |
| 2. | అభయవాడకం రంగు/చర్మరోగాలు | కల్కం | పేస్టు |
| 3. | పాలలో ఉడికించటం | క్షీరపాక | మెడికేటెడ్ మిల్క్ |
| 4. | అరిష్టా | సంధాన కల్పన | ఫెర్మంటేషన్ |
| 5. | మధ్య | సంధాన కల్పన | ఆల్కహాలిక్ ప్రిపరేషన్ |
| 6. | ఆసవి | ఆసవా | ఫెర్మెంటేషన్ |
| 7. | దధి | దధి | కర్డ్స్ |
| 8. | తక్రం | తక్రం | వెన్నతీసిన పాలు |
| 9. | నవనీతం | నవనీతం | వెన్న (బట్టర్) |
| 10. | ఘృతం,సర్పి ఆజ్య, అగుట | ఘృతం | నెయ్యి (గీ) |
| 11. | మైత్రావరుణి | పయస్థా | క్లాటెడ్ మిల్క్ |
| 12. | పయస్థా | పయస్థా | చీస్ |
| 13. | వజిన | మస్థు | వై |
| 14. | అమిక్షా | చేనా | బాయిల్డ్ & క్లాటెడ్‌మిల్క్ |
| 15. | మస్థు | మస్థు | వై |
| 16. | పీవస్పాక్ | తైలకల్పన | మెడికేటెడ్ ఆయిల్స్ |
| 17. | ధాన | భూర్జితఅన్నం | రోస్టెడ్/ఫ్రైడ్‌రైస్ |
| 18. | కరంబా | అన్న-మాంద | గ్రూయల్ |
| 19. | సక్తు | సక్తు | ఫ్లోర్ఆఫ్ రోస్టెడ్‌ఫుడ్‌గ్రెయిన్ |
| 20. | పారివప | చెబెన | రోస్టెడ్ ఫుడ్ గ్రెయిన్ |
| 21. | మధు | మధు | తేనె/హనీ |
| 22. | లాజ | లాజ | రోస్టెడ్ అండ్ పాక్డ్‌పాడీ |
| 23. | నాగ్నహు | కిణ్వ | ఫెర్మంట్ / ఈస్ట్ |
| 24. | తాక్మా | అంకురితవ్రిహి | స్ప్రౌట్స్ |
| 25. | పరిశ్రిత | మద్యకల్పన | ఎ కైండ్ ఆఫ్ లిక్కర్ |
| 26. | సర్పిప | గాస్ కీ బాలి | గ్రాస్ బ్లేడ్ |
| 27. | వాజ్‌పేయ | శక్తివర్ధక పేయ | ఎనర్జింగ్ డ్రింక్ |
| 28. | ఓదన | భక్త/ఓదన | కుక్‌డ్‌రైస్/వండినబియ్యం |

## వ్యాధులు - సాధారణ అనుపానాలు

| క్రమసంఖ్య | రోగం | అనుపానం |
|---|---|---|
| 1. | స్థూల (కడుపు పెరుగుట) | ఇంగువ మరియు నెయ్యి |
| 2. | శీత | తంబూలం మరియు మిరియాలు |
| 3. | పురాణజ్వరములు | తేనె మరియు పిప్పళ్ళు |
| 4. | ప్రమేహ (మూత్రగతరోగాలు) | త్రిఫల మరియు పంచదార |
| 5. | వాత వ్యాధి | రసోన మరియు నెయ్యి |
| 6. | సన్నిపాతము | ఆర్ద్రక మరియు తేనె |
| 7. | శ్వాస | త్రికటు మరియు తేనె |
| 8. | జ్వర పీతపాపడ | నాగరమోద మరియు |
| 9. | గ్రహణీ | తక్ర |
| 10. | ఆర్మ | చిత్రకమూలం |
| 11. | విష | స్వర్ణపత్రాలు |
| 12. | క్రిమి | విడంగ |
| 13. | వమనము | లజ |
| 14. | అజీర్ణము | ఉష్ణోదకము |
| 15. | అతిసారం | కుటజ |
| 16. | క్షయ | క్షీర మరియు మాంసరసము |
| 17. | రక్తపిత్తము | వాసా |
| 18. | కాస | వాసా |
| 19. | పాండు | పునర్ణవా |

ఇలా అనేక వ్యాధుల ముఖ్య అనుపానాలు. ఆయా రోగి దోషమును బట్టి మారవచ్చు. కాని రోగానికి అనుపానం మాత్రం పైన చెప్పినవే.కావున రోగం–ఔషధం–అనుపానం, దోషం – ఔషధం – అనుపానం, శారీర – మానసిక స్థితి – ఔషధం – అనుపానం, కాలం–ఔషధం–అనుపానం పథ్యం–ఔషధం– అనుపానం అనే విషయాలు పరిగణలోనికి తీసుకుంటే వైద్యుడు ఎప్పటికీ తన వైద్యకర్మయందు ఓటమి పొందజాలడు.

| క్రమసంఖ్య | శ్రోతస్ | వ్యాధి | ముఖ్యఔషధం | అనుపానం |
|---|---|---|---|---|
| 1. ప్రాణవహ | కాస | 1. పిప్పల్యాదిఘృతం | 1. పేయము/మంద(చ.చి18/37) | |
| | | | 2. విడంగాదిచూర్ణం | 2. ఘృతం (చచి. 18/147) |
| | | | 3. దుస్పర్శాదలేహ్యము | 3. పురాణగుడ/నువ్వులనూనె (చ.చి18/51) |
| | | | 4. జీవంత్యాది లేహ్యము | 4. మధుసర్పి (చ చి 18/179) |
| | | శ్వాస | 1. హింగ్వాది చూర్ణం | 1. నీబోరస/కాంజికము (చ.చి17/108) |
| | | | 2. సౌవర్చలాది చూర్ణం | 2. ఉష్ణాంబు (చ.చి17/109) |
| | | | 3. ముక్తాది చూర్ణం | 3. మధుసర్పి (చ.చి 17/127) |
| | | రాజయక్ష్మ | 1. పాఠాది చూర్ణం | 1. తక్రము (చ.చి 8/126) |
| | | హిమ | 2. శీతోఫలాది చూర్ణం | 2. మధుసర్పి (చ.చి 8/103) |
| | | హృద్రోగము | 1. పిప్పల్యాది చూర్ణం | కాంజికం, మద్య, దధి (సు.ఉ.43/13) |
| 2. రసావహ | జ్వరము | | ఉష్ణజలం (చ.చి 3/194) | |
| | | | | పిత్తజ్వరాలయందు వాడరాదు(చ.చి వె3/40) |
| | పాండు | | 1. హరీతకీ చూర్ణం | 1. గోమూత్రం (చ.చి 16/168) |
| | | | 2. గోమూత్ర భవితఅయోరజ | 2. దుగ్ధ (చ.చి 16/169) |
| | | | 3. నవయాస చూర్ణం | 3. మధుసర్పి (చ.చి 16/71) |
| | | | 4. మాండూరవటుకం | 4. తక్రము (చ.చి 16/77) |
| | | | 5. శిలాజత్వాది వటుకం | 5. దాడిమరసం (చ.చి 16/90) |
| | | | 6. పునర్ణవమాండూరం | 6. తక్రము (చ.చి 16/95) |
| | | మదాత్యయ | 1. వర్షభ్వాది పేయము | 1. దుగ్ధము (సు.ఉ. 47/46) |

| క్రమసంఖ్య | శ్రోతస్ | వ్యాధి | ముఖ్యఔషధం | అనుపానం |
|---|---|---|---|---|
| 3. రక్తావహ | రక్తపిత్తము | 1. ఉసీరాది చూర్ణం | 1. తండూలోదక (చ.చి 4/73) | |
| | | | 2. కిరాతిక్తాది చూర్ణం | 2. తండూలోదక (చ.చి 4/76) |
| | | | 3. పత్యాది చూర్ణం | 3. ఘృతము (సు.ఉ 45/35) |
| 4. మూత్రవహ | మూత్రకృచ్ఛ్రము | 1. త్రివృత్ తైలము | 1. మండూష్ణజలము మరియు | |
| | | | (త్రివృత్ లేహ్యం) | దుగ్ధము (సు.ఉ 59/17,18) |
| | | | 2. ఫల్గువాది యోగము | 2. సురా,జల (సు.ఉ. 59/25) |
| | | | 3. వ్యోషాది చూర్ణం | 3. మధుమరియుగోమూత్ర (చ.చి 26/55) |
| | | | 4. ప్రవాళ చూర్ణం | 4. తండూలోదక (చ.చి 26/55) |
| | | మూత్రాఘాత | 1. ముస్తాది కల్కము | 1. మండోష్ణజలం మరియు దుగ్ధము(సు.ఉ58/36) |
| | | | 2. అభయాది కల్కము | 2. మండోష్ణజలం (సు.ఉ 58/37) |
| | | | 3. ఏలా చూర్ణము | 3. ధాత్రిఫల స్వరసము (సు.ఉ 58/41) |
| | | అశ్మరీ | 1. పాషాణభేది చూర్ణం | 1. జలము (చ.చి 26/60) |
| | | | 2. పునర్ణవాది యోగము | 2. మదిరము మరియు ఇక్షురసము (చ.చి26/163) |

| క్రమసంఖ్య | శ్రోతస్ | వ్యాధి | ముఖ్యఔషధం | అనుపానం |
|---|---|---|---|---|
| 5. అన్నవహ | గుల్మము | 1. ద్రాక్షాది ఘృతం | 1. చక్కెర, తేనె (చ.చి 5/125) | |
| | | | 2. మిశ్రక స్నేహ | 2. మధు (చ.చి 5/150) |
| | | | 3. స్వార్జికాది చూర్ణము | 3. మండోష్ణజలము (సు.ఉ.42/46) |
| | | | 4. పాఠాది చూర్ణము | 4. మండోష్ణ జలము (సు.ఉ. 46/52) |
| | | చర్ది | 1. స్వయంగుప్తాదియోగము | 1. తండూలోదకము (సు.ఉ. 50/32) |
| | | విషూచిక | 1. పథ్యాది చూర్ణము | 1.మండోష్ణ జలము (సు.ఉ. 53/14) |
| | | ఆర్మ | 1. నిశోత చూర్ణం | 1. త్రిఫలారసాయనం (చ.చి 14/66) |
| | | | 2. కుటజాది రసక్రియ | 2. చాగ్ దుగ్ధము |
| | | క్రిమి | 1. పలాశబీజ స్వరసం | 1. తండూలోదకము (సు.ఉ.54/26) |
| | | | 2. పారిభద్రక పత్ర | 2. తేనె (సు.ఉ. 54/26) |
| 6. ఉదకవహ | అతిసారం | 1. హరీతక్యాది చూర్ణం | 1. మండోష్ణ జలం (సు.ఉ. 40/48) | |
| | | | 2. నల్లనువ్వులు | 2. అజదుగ్ధము (చ.చి 19/84) |
| | | | 3. పంచవల్కల యోగం | 3. తేనె (చ.చి 19/88) |
| | | | 4. రసాంజన | 4. తేనె (చ.చి 26/53) |

## ఔషధముల సేవనకు యోగ్యమైన మోతాదు - వివరణ
(Posology)

ఔషధముల మోతాదు నిర్దేశించిన ప్రకారము అవలంబించినను కొన్ని మార్లు వానికి వేరుగా అవసరానుసారము మార్పులు ఉండవచ్చును. వివిధ పరిస్థితులలో ఔషధముల మాత్రలో మార్పులు ఉంటాయి. ఈ మార్పులకు కారణాలు వ్యక్తుల యొక్క శరీర స్వభావము, వయస్సు, లింగభేదము, వ్యక్తి నివసించు పరిసరములు, పరిస్థితులు, వాతావరణ ప్రభావము, ప్రవర్తన, ఆహారపుఅలవాట్లు, సాంఘిక పరిస్థితులు వాని ప్రభావము, ఆచార వ్యవహారాలు, నమ్మకాలు, మూఢనమ్మకాలు, రాజకీయ పరిస్థితులు మానసిక స్థితి, వ్యక్తి విలువలు తెలివితేటలు మొదలైన విభిన్న అంశాలపై ఆధారపడి ఉంటుంది.

మాత్రానిర్దేశము చేయునపుడు, లింగభేదము, వ్యక్తి శారీరక, మానసిక శక్తి బరువు, ఆహారపుఅలవాట్లు, వృత్తి, వాతావరణము, వ్యాధి యొక్క స్థితి, అమాశయము (అగ్ని) యొక్క పరిస్థితి, వ్యక్తి ప్రకృతి, అలవాట్లు మొదలగు వానిని తప్పనిసరిగా పరిగణలోనికి తీసుకోవలెను. సాధారణముగా స్త్రీలకై, పురుషులకన్నా తక్కువ మాత్రలో ఔషధములు నిర్దేశించబడతాయి. ఈ విధముగా సమగ్రముగా పరిస్థితులను గమనించి ఔషధము యొక్క మోతాదును నిర్ధేశించవలెను.

**స్వభావము :** తీక్ష్ణ విరేచన ఔషధములు మరియు ఉత్తేజితకరమైనవి మృదు స్వభావము కలవారిలో వెంటనే తమ ప్రభావాన్ని చూపిస్తాయి. కనుక వీరిలో ఈ తరహా మందులను బహు జాగ్రత్తగా వాడవలెను. వీరికి విరుద్ధముగా వ్యాకులమైన, విచారగ్రస్తమైన స్వభావము కలవారిలో వీనిని ఎక్కువ మోతాదులలో కూడా వాడవచ్చు.

**అలవాట్లు :** ఔషధములు మాటి మాటికి సేవించుట వలన అవి అలవాటుగా మారి వాని ప్రభావము కావలసినంతమేరకు చూపజాలవు.

**వాతావరణము :** వాతావరణ ప్రభావము వలన శారీరక స్థితిలో మార్పు సంభవించవచ్చును. కనుక వీని ప్రభావము ఔషధ మాత్రానిర్ధేశన మున పరిగణించవలెను.

**ప్రకృతి :** శారీరక, మానసిక, ప్రకృతులను ఔషధ మాత్రా నిర్దేశము నందు తప్పనిసరిగా పరిగణించవలెను. కొందరు వైద్యుల పద్ధతి ప్రకారము ముందుగా సేవించిన ఔషధ ప్రభావము, నెమ్మదిగా తరుగుతున్న సమయ ములో తదుపరి మాత్ర ఇవ్వవలెను. దీనికి వేరుగా ఔషధ ప్రభావము తగ్గ కుండా నిర్ణీత సమయములలో ఔషధ ప్రయోగము చేయవలెనని కొందరు వైద్యులు భావిస్తున్నారు.

చరక సంహిత మొదలగు ఆయుర్వేద గ్రంథములలో నిర్దేశించిన మాత్ర, వాడవలసిన విధానములు ఉన్నదున్నట్లు ప్రస్తుత దేశకాల పరిస్థితులలో వాడుట ఆచరణయోగ్యముగా కనిపించుటలేదు. ఔషధమాత్రా నిర్దేశమునకు ప్రత్యేకమయిన సూత్రము ఏదీ తెల్పబడలేదు. చిన్న పిల్లలో ఔషధ మాత్ర నిర్ణయించడం దీని మూలంగా ఇంకా కష్టతరంగా మారినది.

**చిన్నపిల్లలు, శిశువులలో ఔషధముల మాత్ర**

శిశువులు, చిన్న పిల్లలలో ఔషధముల మాత్రా నిర్ధేశమునకు కాశ్యప సంహితలలో పేర్కొన్న సూచనలు వాడుటకు అనుకూలము కాశ్యప సంహితానుసారము కాష్టౌషధములు శిశువులకు వాడుటకై విడంగ బీజము యొక్క ప్రమాణములో ఉండవలెను. తరువాత ప్రతి మాసమునకు ఒక గింజ ప్రమాణములో మోతాదును పెంచుతూ పదిహేను సంవత్సరములు వచ్చువరకు ఉసిరికాయ ప్రమాణములో ఔషధములు ఇవ్వవచ్చు.

సుశ్రుత సంహిత ననుసరించి మోతాదు నిర్ణయించుట శిశువు యొక్క పరిస్థితిని అనుసరించి చేయవలసిందిగా నిర్ధేశించినారు. శిశువులకై ఒక మాత్ర అనగా చూపుడువేలు, బొటనవేలు మరియు అనామికా వేళ్ళతో ఒకసారి పట్టినంత చూర్ణము. ఈ మాత్ర పాలుతాగు పిల్లలకు (ఒక సంవత్స రము వరకు) అనుకూలము. పాలు అన్నము మొదలగునవి సేవించు శిశువులకు రేగుపండు ప్రమాణములో ఔషధము ఇవ్వవచ్చును.

వివిధ రకములుగా ఔషధముల మోతాదు వివిధ సందర్భములలో వర్ణింపబడినందున ఈ పుస్తకములో నిర్దేశించి మాత్ర భైషజ్య రత్నావళి ఆధారముగా పేర్కొనబడినది. వాడుక యొక్క, సౌలభ్యము కొరకు పట్టిక నందు వయస్సు, ఔషధము యొక్క ప్రకారముననుసరించి వివర ములు పొందపరచబడినవి.

# ఔషధముల యొక్క ఉపయుక్తమైన మోతాదుల పట్టిక

| ఔషధము | ఒక దినమునకు సంబంధించిన మోతాదు-వయస్సుననుసరించి | | | |
|---|---|---|---|---|
| | 1 నెల | 1-5 సం॥ | 6-15 సం॥ | యుక్తవయస్కులు |
| స్వరసము | 1-3 చుక్కలు | 5-15చుక్కలు | 2-5 మి.లీ | 7-14 మి.లీ |
| కల్కము | 130 మి.గ్రా | 1-2 గ్రా | 2-5 గ్రా | 6-12 గ్రా |
| క్వాథము | 1-5 చుక్కలు | 5-15 చుక్కలు | 2-5 మి.లీ | 14-28 మి.లీ |
| శీతకషాయము (హిమము) | 1-5 చుక్కలు | 5-15చుక్కలు | 2-5 మి.లీ | 14-28 మి.లీ |
| వటి | 16-30 మి.గ్రా | 30-130మి.గ్రా | 130-250మి.గ్రా | 250-500మి.గ్రా |
| లోహభస్మములు | 8-16 మి.గ్రా | 30-130మి.గ్రా | 130-250మి.గ్రా | 250-500మి.గ్రా |
| ఆసనవము/ అరిష్టము | 1-5 చుక్కలు | 5-15 చుక్కలు | 2-5 మి.లీ | 14-28 మి.లీ |
| అవలేహము | 120మి.గ్రా | 1-2 గ్రా | 2-5 గ్రా | 12-24 గ్రా |
| పానకము | 1-5 చుక్కలు | 5-15 చుక్కలు | 2-5 గ్రా. | 14-28 గ్రా. |
| ఘృతము | 1-5 చుక్కలు | 5-15 చుక్కలు | 2-5 గ్రా. | 2-5 గ్రా. |
| సిద్ధ దుగ్ధము | 1-5 చుక్కలు | 1-20 మి.లీ. | 100-200 మి.లీ. | 100-250 మి.లీ. |
| శుద్ధటంకణము/ స్ఫటికము/గైరికము | 65-130మి.గ్రా. | 130-250మి.గ్రా. | 250-500మి.గ్రా. | 500-1 గ్రా. |

1-6 నెలలో లోపు పిల్లలకై వటకములు, గోళీలను చూర్ణముచేసి లేదా అరగదీసి వాడవలెను. ఒక నెలనైన వయస్సుకల శిశువులకు, ఒక సంవత్సరము వయస్సుకల పిల్లలకుద్దేశించిన మాత్రలో కొద్దిభాగము మాత్రమే ఇవ్వవలెను. ఔషధములను తేనెతో లేదా తల్లిపాలతో కలిపి ఇవ్వవచ్చును.

## ఔషధ మరియు ఆహార ద్రవ్యముల గుణములు

**అభిష్యంది ద్రవ్యములు :** కఫవృద్ధి కల్గించి స్రోతస్సులను అడ్డగించు గుణమును గల్గి శరీరములో గురుత్వమును, మందకొడితనమును కల్గించును.

**ఉష్ణ ద్రవ్యములు :** ఆకలిని పెంచునవి, దప్పికను కల్గించునవి, శరీరములోమంటను, చెమటను పుట్టించు స్వభావము కల ద్రవ్యములు. ఈ ద్రవ్యములు అగ్నిమహాభూత ప్రాధాన్యత గల్గి ఉంటాయి.

**కఠిన ద్రవ్యములు :** శరీరానికి ధృఢత్వమును బలాన్ని కల్గించే ద్రవ్యములు. ఈద్రవ్యములు ధాతువులకు పుష్టిని కల్గించి మలములను తగ్గిస్తాయి.

**ఖర ద్రవ్యములు :** ఖరద్రవ్యములు, లేఖన కర్మను చేస్తాయి. (అధికంగా ఉన్న ధాతువులను తగ్గిస్తాయి.) వాతాన్ని పెంచుతాయి. ధాతువులను పచింపచేయు శక్తిని కల్గి ఉంటాయి. మలములను శుష్కింపచేస్తాయి.

**గురు ద్రవ్యములు :** గురుద్రవ్యములు నెమ్మదిగా జీర్ణమగు స్వభావాన్ని కల్గి ఉంటాయి. శరీరాన్ని వృద్ధిచేసే గుణాన్ని కలిగి ఉంటాయి. ఈ ద్రవ్యములు జల మరియు పృథ్వీ మహాభూత ప్రాధాన్యత కల్గి ఉంటాయి. కఫాన్ని పెంపొందిస్తాయి. సేవించిన వెంటనే ఉత్సాహాన్ని తగ్గిస్తాయి. అధిక మాత్రలో సేవించినపుడు క్రొవ్వు (మేదస్సును) పెంచుతాయి.

**తీక్ష్ణ ద్రవ్యములు :** శరీరములో మంటను పుట్టించే గుణాన్ని కల్గి ఉంటాయి. పిత్తాన్ని పెంచుతాయి. మరియు కఫవాతములను, క్రొవ్వును తగ్గిస్తాయి. శరీరం యొక్క బరువును తగ్గిస్తాయి. గడ్డలు మరియు పుండ్లను త్వరగా చీముపట్టునట్లు మరియు స్రావములు అధికమగునట్లు ప్రేరేపిస్తాయి.

**ద్రవ ద్రవ్యములు :** ఈ ద్రవ్యములు కఫము మరియు పిత్తములను పెంచుతాయి. శరీరములో నీటిశాతాన్ని పెంచుతాయి. ధాతువుల పుష్టికి, పెరుగుదలకు దోహదపడతాయి. శరీరములో స్రావములను పెంచుతాయి.

**పిచ్ఛిల ద్రవ్యములు :** పచన వ్యవస్థను మృదువుగా చేస్తాయి. ధాతువుల యొక్క క్రియలను వేగవంతం చేస్తాయి. శరీరానికి శక్తిని, జీవనాన్ని కల్గి

స్తాయి. మలములను చక్కగా బయటకు పంపడానికి దోహదం చేస్తాయి.

**మందగుణ ద్రవ్యములు :** కఫమును పెంచి పిత్తమును తగ్గిస్తాయి. ధాతువులను పెంచుతాయి. శరీరం యొక్క బరువును పెంచుతాయి. అధిక మాత్రలో శరీరంలోని జీవన క్రియను మందకొడిగా తయారుచేస్తాయి.

**మృదుద్రవ్యములు :** మృదు ద్రవ్యములు శరీరాన్ని కోమలంగా తయారు చేస్తాయి. కఫవృద్ధిని కల్గించి, పిత్తాన్ని, శరీరంలో మంటను, బాధను, చీమును తగ్గిస్తాయి. అధికమోతాదులో సేవించినపుడు శరీరాన్ని నిష్క్రి యంగా మారుస్తాయి.

**రూక్షద్రవ్యములు :** స్నిగ్ధ ద్రవ్యములకు వ్యతిరేక గుణములను కలిగి ఉంటాయి. శరీరంలో పొడిదనాన్ని కఠినత్వాన్ని కల్గిస్తాయి. జీవశక్తిని, శరీర కాంతిని,పుంస్త్వగుణాన్ని, కఫాన్ని తగ్గిస్తాయి. వాతాన్ని పెంచుతాయి. అధిక మోతాదులో శరీరాన్ని మార్చివేస్తాయి. పృథ్వి, వాయు మరియు అగ్ని మహా భూత ప్రాధాన్యాన్ని కలిగి ఉంటాయి.

**లఘు ద్రవ్యములు :** చక్కగా జీర్ణమగు స్వభావాన్ని కల్గి ఉంటాయి. జీర్ణం అయిన పిదప శరీరానికి శక్తిని కల్గిస్తాయి. శరీరం నుండి కఫాన్ని తొలగిస్తాయి. శరీరానికి ఉత్సాహాన్ని కల్గిస్తాయి. శరీరంలో మలసంచ యాన్ని, మలాల ఉత్పత్తిని తగ్గిస్తాయి. శరీరం యొక్క బరువును తగ్గిస్తాయి. క్రొవ్వును కల్గిస్తాయి. గాయములు మానడానికి తోడ్పడతాయి. వాయు, ఆకాశ మరియు అగ్నిమహాభూత ప్రాధాన్యతను కల్గి ఉంటాయి.

**విశద ద్రవ్యము :** విశదము అనగా స్వచ్ఛత. ఈ గుణము వలన శరీరంలోని అనవసర జీవ వ్యాపారాలు నియంత్రించబడతాయి. వాతాన్ని పెంచే గుణం కలది. రోప క్రియ (గాయమును మాన్పు గుణాన్ని కల్గి ఉ ంటుంది.)

**శీతద్రవ్యములు :** ఉష్ణత్వాన్ని (వేడిని) దప్పికను, మంటను, చెమటను, తగ్గిస్తాయి. స్థానికంగా రక్తస్రావాన్ని అరికడతాయి. ఈ ద్రవ్యములు జల మహాభూత ప్రాధాన్యత కలిగి ఉంటాయి.

**తీక్ష్ణ గుణములు :** తీక్ష్ణగుణ ద్రవ్యములు జీవకణాలలోని గాయము లను మాన్పు లక్షణాన్ని కల్గి ఉంటాయి. ధాతువులను ప్రేరేపిస్తాయి. మలము లను విసర్జింపచేయు గుణాన్ని కల్గి ఉంటాయి.

**సరద్రవ్యములు :** సరద్రవ్యములు, మలములను స్రవింపజేయు గుణాన్ని కలిగిగుంటాయి. కఫమును పెంచుతాయి మరియు అధికంగా

ఉండు ధాతువులను తగ్గిస్తాయి.

**సాంద్రద్రవ్యములు :** సాంద్రత అనగా గాఢతను పెంచునది. ఈ ద్రవ్యములు కఫమును మరియు ధాతువులను వృద్ధిచేస్తాయి. మలములను గట్టిపడేటట్లు తగ్గిస్తాయి.

**సూక్ష్మ ద్రవ్యములు :** శరీరములోని స్రోతస్సులు (సూక్ష్మ మార్గములు) చక్కగా వికసించి, శుభ్రంగా ఉంచబడి బాగా పని చేయునట్లు ప్రేరేపిస్తాయి. అధికంగా ఉత్పత్తి అగు ధాతువులను, మలములను నియంత్రిస్తాయి. మల ములను ఎండించి, పొడిగా చేస్తాయి. ద్రవ్యములు జీర్ణమగుటకు దోహద పడతాయి. వాతమును పెంచుతాయి.

**స్థిర ద్రవ్యములు :** అతిగా ఉండు వాతలక్షణములు తగ్గిస్తాయి. మలమూత్రములు సులభముగా తొలగించుటకు దోహదపడతాయి. ధాతువు లకు పుష్టిని, శక్తిని కల్గిస్తాయి.

**స్థూల ద్రవ్యములు :** కఫమును మరింత ధాతువులను పెంచుతాయి. శరీరం యొక్క బరువును పెంచి లావుగా చేస్తాయి. స్రోతస్సులను వాటి పనిని అడ్డగిస్తాయి. మలములు బయటకు వెడలానికి దోహద చేస్తాయి.

**స్నిగ్ధ ద్రవ్యములు :** అవయవాలలో కొత్తదనాన్ని కల్గిస్తాయి. శరీరంలో జీవశక్తిని పెంచుతాయి. శరీరకాంతిని పెంచుతాయి. ఈ ద్రవ్యములలో జల మహాభూత ప్రాధాన్యత ఎక్కువగానుండును.

## ఆయుర్వేదములో అనుపానావశ్యకత

ఆరోగ్యవిధానాన్ని, ఆరోగ్యాన్ని ఇచ్చే అతిపురాతన భారతీయ వైద్యశాస్త్రమే ఆయుర్వేదం. ఈశాస్త్రం అనేక ముఖ్యప్రతిపాదిత, మూల సూత్రా లతో పంచభూతాలనుంచి ప్రకృతి తద్వారా జీవుని ఆరోగ్యం ఎలా కాపాడు కోవాలో చెప్పిన శాస్త్రం ఆయుర్వేదం. స్వస్థ్య విజ్ఞానంలో "అతురస్య వికార ప్రశమనంచ" అని వ్రాసారు. అనగా రోగాన్ని తగ్గించడం, రోగం రాకుండా చెయ్యటంలో అనుపానం ప్రాముఖ్యతని పైరెండు విషయాల యందు నిరూపణ చేశారు. అనుపానం ముందు వెనుకల ఉపయోగం ఆయుర్వేద వైద్యులకు బాగా తెలుసు. అంతేగాక రోగవిజ్ఞానం, ద్రవ్యగుణం, నిఘంటు పరిజ్ఞానం, అనుపాన విజ్ఞానం, నాడీ, రోగ నిదానం తెలియని వారిని ఆయుర్వేద వైద్యుడని పిలువరాదని పెద్దలమాట.

మందుతోపాటు తీసుకునే ద్రవ పదార్థమును ఆయుర్వేద వైద్యశాస్త్రంలో

అనుపానముగా చెప్తారు. ఇవి అనేకరకాలు చల్లటినీరు, వేడినీరు, నెయ్యి, తేనె, వెన్న, పంచదార, బెల్లం పాలు, మజ్జిగ మొదలైనవి సాధారణ అనుపానములు. అలాగే ఆయుర్వేద మందుల తయారీ దారులు, వైద్యులు స్వరసం, ఫాంటము, క్వాథము, హిమము, అర్కము మొదలైన వాటిని తయారుచేసి కూడా అనుపానములుగా వాడతారు. ఒక రసౌధమును వివిధ రోగాలలో, వివిధ అనుపానములతో వాడటం సిద్ధ, ఆయుర్వేద వైద్యులకు అలవాటు. ఉదా:– మకరధ్వజమును జ్వరాలలో వాడవలసి వచ్చినపుడు అల్లం స్వరసంతోను అదే మకరధ్వజం శరీరంలోపలి రక్తస్రావం (రక్తపిత్తం) కలిగితే వాసా స్వరసంతోను వాడతారు. ఇలా మకర ధ్వజమును అనేక వ్యాధులలో వివిధ అనుపానములతో వాడుతూ రోగికి స్వస్థతను కలిగించేలా చేస్తారు అయితే స్వస్థత మరియు రోగములందు అనుపాన పాలనా విధానానికి ఆయుర్వేద వైద్యులు చాలా ప్రాముఖ్యతను ఇచ్చారు. అనుపానం మందుకు సహాయ కారిగా, రోగమును తగ్గించేదిగా, వ్యాధి తీవ్రతను నాశనం చేసేదిగా, త్వరగా మందును రోగముపైకి పంపించేదిగా, త్వరగా పనిచేయించేదిగా ఉపయోగ పడును. ఇది మందుకు ఉత్ప్రేరకంగా గొప్ప సహాయకారిగా మాధ్యమికంగా, రుచిని, గుణాన్ని మార్చి రోగియొక్క బాధను తగ్గించేదిగా ఉంటుంది.

చరకుని అభిప్రాయాన్ని అనుసరించి ఆహారం తిన్న తర్వాత తీసుకున్న పానీయం విరుద్ధ దోషముపై పనిచేయునని అది ధాతు, శరీరములకు హానికల్గించనిది అని తెల్పారు. అలాగే 84 రకాల ఆసవాలు (జలపానీయములు) తయారీగూర్చి అవి ఏవిధంగా అనుపానముగా వాడవచ్చో సంహితనందు తెల్పారు. శారంగధరుడు అనుపాన మోతాదు, గుణ, కర్మలను వ్రాసారు. ఉదా అనుపానమును చూర్ణ, లేహ్య, గుటిక, కల్కముగా వాడినపుడు దోషమునను సరించి 3,2,1 (వాత,పిత్త,కఫ) ఫలముల మోతాదు వాడాలని సూచించారు.

1 ఫల = 48 గ్రా. అనుపానం మందుతో, తర్వాత తీసుకున్నపుడు ఏవిధంగా పనిచేస్తుందంటే నీటిలో ఒక నూనె చుక్క వేసినపుడు ఏవిధంగా వ్యాప్తి చెందునో అదేవిధంగా అనుపానంలో మందుకల్పినపుడు అలా వ్యాపించి శరీరం అంతటా విస్తరించి వ్యాధిగల రోగి రోగమును కుదుర్చునని మరువరాదు. రసతరంగిణి గ్రంధములో సహపానము అనుమాటను పొందుపరచినారు. సహపానము అనగా ఔషధముతోపాటు తీసుకొనునది,

త్వరగా శరీరంలోనికి పంపునది పూర్తిగా స్వాంగీకరణ, జీర్ణమును కల్గించు నది, శరీరమందు సమానంగా వ్యాపించేలా చేయునది, ప్రత్యేకించి ద్రవము అని చెప్పబడినది. రాజనిఘంటుకారుని అభిప్రాయం ప్రకారం మందు తర్వాతవాడే మందులో భాగమైన ద్రవము. ఇది మందు తర్వాతనే వాడటం వల్ల పరిపూర్ణమైన జీర్ణమును కల్గించునని ఆయన అభిప్రాయం. అయితే అనుపానంను మందు, రోగి, రోగం అనుసరించి మార్చుకోవాలి.

1. ఔషధాన్ని అనుసరించి – వేడినీరు అనుపానముగా ఇవ్వవలసి వస్తే ఘృతమును తర్వాత వాడాలి.

2. రోగిని అనుసరించి – ఆసవారిష్టాలు వాడవలసివస్తే, తేనెలో నీరు కలిపి తర్వాత వాడాలి.

3. రోగమును అనుసరించి – రక్తపిత్తములో పాలువాడితే (శరీరం లోపల రక్తస్రావం) అపుడు జ్వరంవస్తే అల్లంరసం వాడాలి ఇలా రోగి, రోగం, ఔషధాన్ని బట్టి అనుపానం ఆయావేళలో మార్పు జరుగును.

రోగము అనుపానములను గూర్చి లోలంబరాజీయము నందు వైద్య అనుపానములు చర్చించారు.

1. శూల(నొప్పి)–ఇంగువను నెయ్యిలో కలిపి వాడాలి.
2. పురాణజ్వరము–తేనెలో పిప్పలి చూర్ణం కలిపి వాడాలి.
3. వాతరోగము – నెయ్యిలో వెల్లుల్లిరసం కలిపి వాడాలి.
4. శ్వాసాంతజ్వరము – తేనెలో త్రికటుచూర్ణం కలిపి వాడాలి.
5. శీతరోగము – చిత్రమూలం ఆకులు, మిర్యాలు కలిపి వాడాలి.
6. జ్వరము – ముస్తలు, పర్పాటకము కలిపి వాడాలి.
7. గ్రహణి – తక్రమును వాడాలి.
8. విష – స్వర్ణభస్మం వాడాలి.
9. చర్ధి – లాజమును వాడాలి.
10. అతిసారం – కుటజమును వాడాలి.
11. రక్తపిత్తము – వాసా
12. అర్మ (మూలశంఖ) – చిత్రమూలం.
13. క్రిమి – విడంగములను వాడాలి.

## అనుపాన కర్మ (ఏవిధంగా పని చేయును?)

తర్పయతి - నూతనత్వమును కల్గించును.

ప్రాణయతి - మనశ్శాంతి కల్గించును.

ఉర్జయతి - శక్తిని ప్రసాదించును.

బృంహయతి–ఆహారముగా ఉండి పెంచి,పోషించును.

పర్యాప్తి - వ్యాపకత్వమును కలిగి ఉండును.

భుక్తమనసాదయతై - ఆహారమును క్రిందకు పంపునది

(సక్రమంగా ఆహారముయొక్క కదలిక చూచునది)

అన్నసంఘతమ్–ఆహారమును సూక్ష్మముగా చేయునది.

మార్ధవమ్ - మెత్తగా చేయునది.

క్లేదయతి,జారయతి– జీర్ణమును చేయునది. జీర్ణించుకొనునట్లు చేయునది.

## అనుపాన ద్రవ్యాలు

చల్లని నీరు, వేడినీరు, మద్యము, ఆసవము, యూషము, పేయము, మొ॥వి మంచి అనుపానం అంటే చల్లని నీరు అర్థం. కాని ఆయుర్వేదమందు తేనె మంచి అనుపానమని గ్రంథాలు చెప్తున్నాయి.

అనుపానం ఆహారమునకు ముందు, మధ్య, అంత్యమందు తీసు కొనుట గురించి ఆయుర్వేద గ్రంథాలు ఈ క్రింది విధంగా చెప్తున్నాయి. ఆహారమునకు ముందు అనుపానం (నీరు) త్రాగిన శరీరం కృశించును. ఆహారము మధ్యలో నీరు త్రాగిన సమానముగా శరీరం ఉండును. ఆహా రాంత్యమునందు అనుపానం (నీరు) త్రాగిన స్థౌల్యము, బలమును కల్గి ఉండగలరు.

## అనుపానం ఎప్పడు వాడరాదు ?

దూరంగా నడిచినపుడు, పాడినపుడు, ఎత్తుపై నుంచి క్రిందికి దిగు నపుడు, నిద్రనుండి మేల్కొనినపుడు, చదువుతున్నపుడు వెంటనే అనుపానం లోనికి తీసుకోరాదు.

## అనుపానం - ప్రాముఖ్యత

దోషంతో ఉన్నా, గురు పదార్థాలు ఎక్కువ పదార్థాలను త్వరగాను,

పూర్తిగాను అనుపానం కుదర్చగలదు. ఏదైనా పదార్థం (ఆహారం) తీసుకున్న తర్వాత అనుపానం తీసుకోకపోతే సరైన పక్వము జీర్ణాశయంలోకాక అనేక వ్యాధులు కల్గుటకు అవకాశం కల్గును. కావున ఆహారం తర్వాత అనుపానం తీసుకోవాలి.

## అనుపానం 4 రకాలుగా పనిచేస్తుంది

1. లక్ష్యాన్ని చేరుకొనుటకు సహాయకారిగా మందు సవ్యంగా పని చేయుటకు వ్యాధినిరోధక శక్తి పెంచుటకు

ఉదా:- నూనె /పటికలు అనుపానంగా వాడిన మందుకు సహాయ కారిగా, మందు తీవ్రత తగ్గుటకు వాడతారు. తేనె అనుపానంగా వాడితే జీర్ణము, పక్వము కావటానికి, యోగవాహిగా వాడతారు.

2. వాహకం : ఒకచోటనుండి వేరొకచోటికి మందు పంపిణీ చేయుటకు లేదా మందు పూర్తిగా కరిగి పనిచేయుటకు, కణాలలోకి చొప్పింప చేయుటకు అనుపానం వాహకంగా పనిచేయును.

3. జీర్ణమవుటకు : ఆహారం పరిపూర్ణముగా జీర్ణమవుటకు అనుపానం జీర్ణకారిగా ఉపయోగపడును.

4. సహాయం : మందుకు సహాయకారిగా, రెండుమూడు మందులను కలిపి వాటి చర్యలను క్రమంగా నెరపుటకు అనుపానం సహాయపడును

ఉదా: మంజిష్టాదికషాయం కైషోరగుగ్గులకు సహాయ అనుపానంగా వాడినపుడు ఒకేమందు అనేక ప్రయోజనాలకోసం వివిధ అనుపానాలు వాడటం ఆయుర్వేద వైద్యులకు పరిపాటి.

## అనుపానం ఆధునిక శాస్త్రీయ ఆలోచన

తేనెలో గల అనేక రకాల ఎంజైములు జీర్ణక్రియకు సహాయ పడగలవని అది చల్లని నీరులో చాలావేగంగా పనిచేయ గలదని ఆధునిక శాస్త్రజ్ఞానం చెపుతుంది. అందువల్ల తేనె వేడి నీటిలో కలిపి త్రాగరాదు. అలాగే పెరుగు నందు చాలా ఎక్కువ మొత్తంలో లాక్టిక్ ఆమ్లం ఉంది. దీన్ని వాడితే హృదయమునందు వేడి/మంట పుట్టును. దీనినే మజ్జిగా వాడిన హృదయము నందు వేడి / మంట తగ్గును. అలాగే వేడినీరు వల్ల జీర్ణ సంబంధ రసాల ఉత్పత్తి పెరుగును. చల్లని నీరువల్ల జీర్ణరసాలు మెల్లగా ఉత్పత్తి అగును. అదేవిధంగా నారాయణ చూర్ణంను రోగి దోషాన్ని అనుస రించి వివిధ అనుపానములతో వాడతారు. ఉదా- ఉదర రోగాల యందు తక్రము,

గుల్మరోగాలయందు బదరకషాయం, మూలవ్యాధుల యందు దాడిమలతో వాడటం ఆయుర్వేద వైద్యశాస్త్రమందు గలదు. కావున వ్యాధి గలవారు వ్యాధిలేనివారు ఇద్దరూ సరైన అనుపానాన్ని సేవిస్తే జీవితకాలం ఆరోగ్యంగా ఉంటారని అనుపానం ద్వారా మనకు అవగతం కావాలి.

## అనుపానం-ద్రవ్య గుణం - అవగాహన

ద్రవ్యగుణ విజ్ఞానం అనేది ఆయుర్వేద వైద్యశాస్త్రమునకు కాండము వంటిది. ఇది తెలియకపోతే ఎంత శాస్త్రజ్ఞుడు అయినప్పటికీ అతని వైద్యం నిష్ఫలమే. ద్రవ్యము అనగా మందు, మూలిక, వస్తువు, గుణాలు అనగా లక్షణాలు, ఏవిధమైన గుణం మందు నందు గలదో చెప్తుంది. కర్మ అనగా పని. ఇవి అన్నీ కలసిన శాస్త్రవిజ్ఞానమే ద్రవ్యగుణకర్మ విజ్ఞానము.

ద్రవ్యము ఏడు రకాల గుణాలను కల్గి ఉంటుంది.

1. ద్రవ్యం (మందు, మూలిక)
2. గుణం (ప్రత్యేక లక్షణం)
3. రసం (రుచి)
4. విపాకం (జీర్ణమైన పిదపదాని చర్య)
5. వీర్యము (జీవశక్తి)
6. ప్రభావము (అన్నిటియందు కల్గించే గుణం)
7. కర్మ (పనిచేయు లక్షణం)

ముందు ద్రవ్యగుణ విజ్ఞానం నందు తెలుసుకోవలసినవి.

1. మందు, ఔషదం (ద్రవ్య) మోతాదు, శుద్ధి, తేలికగా ఏవిధంగా లోనికి తీసుకోవలెనో తెలుసుకోవాలి.

2. అన్ని ద్రవ్యాలు పంచభూతాల కలయికవల్ల పుట్టినవని మరువరాదు. అందువల్ల పంచభూతాల గూర్చి, ఓషదీగుణభాషీ పంచతత్వమును పరి పూర్ణంగా అభ్యసించాలి.

3. మూలికా, మందులను త్రిదోషాల ననుసరించి ఇవ్వాలి. రోగము నకు త్రిదోషాలే కారణములని కదా మన సిద్ధాంతం.

4. ప్రతీ వైద్యునికి నిఘంటుజ్ఞానం కావాలి అనగా మూలిక, ఉపయోగపడే భాగం, ఏయే వ్యాధులలో వాడవచ్చు, శుద్ధి, లక్షణాలు,

ఏ విధంగా పనిచేస్తుంది. అనే విషయాలకు సంబంధించిన పరిజ్ఞానం కావాలి.

ద్రవ్యానికి గుణకర్మలుండును. ఇది ఆయా ద్రవ్యమునుబట్టి మారును.

ఉదా : అల్లమునకు కారముతో కూడిన తీక్షణ గుణము ఉండును. దానివల్ల జీర్ణశక్తిని పెంచును. ఇది కర్మగా ఉండును.

ద్రవ్యముగూర్చి - 1. ద్రవ్యము అన్నింటికన్నా గొప్పది.

2. ప్రతి ద్రవ్యము పాంచభౌతికము

3. ప్రతి ద్రవ్యము ఔషధమే / మందే

4. ద్రవ్యము స్థిరము

5. ద్రవ్యముతో పంచభౌతిక శరీర అవయవములను బాగుచేయ వీలు కల్గును.

6. ద్రవ్యము నిల్వ ఉండుకొలదీ దానిలోని గుణకర్మలు ఉడిగిపోవును/ తగ్గును.

గుణాలు : గుణము అనేది ద్రవ్యంవల్ల కలిగిన / ఏర్పడిన పరిస్థితి. వచ్చిన పరిస్థితిని కర్మగా పిలుస్తారు.

ఉదా:- మనకు రొంప కలిగిందనుకుంటే ఈ గుణం కలుగటానికి శీతల, ఉష్ణపదార్థ సేవన (ద్రవ్యం) కారణమై రొంపతో కూడిన స్థితిని కల్గి వుండుటయే కర్మగా ఉండి శరీరమునందు పిత్తం ప్రకోపించును.

గుణాలు 20 రకాలు. ఇందు10 ఖచ్చితములు మిగతా 10 వీటికి వ్యతిరేకము కలిపి శరీరమందు 20 గుణాలుండును.

**శారీక గుణాలు భౌతిక శరీరమునకు సంబంధించినవి అవి.**

1. భారముగా ఉండుట (బరువుగా) 2. నీరసంగా ఉండుట 3. శీతలంగా (తడిగా) ఉండుట 4. పొడిగా ఉండుట 5. మృదువుగా ఉం డుట 6. ద్రవంగా మెత్తగా ఉండుట 7. వంగేటట్లు ఉండుట 8. స్థిరంగా ఉండుట 9. తేలికగా ఉండుట 10. అణురూపముగా ఉండుట (దీనికి వ్యతిరేకముగా ఉండే ఇంకో 10 గుణాలు కలిపి 20 గుణాలు పాంచభౌతిక శరీరం కల్గి వుండును.

అయిదు పాంచభౌతిక గుణాలు

| *గుణం* | | *పంచభూతము* |
|---|---|---|
| 1. శబ్దం (ధ్వని) | - | ఆకాశము (ఈథర్) |
| 2. స్పర్శ (ముట్టుకోవటం) | - | వాయు (గాలి) |
| 3. రూప (చూసేది) | - | తేజ (అగ్ని) |
| 4. రస (రుచి) | - | అప్పు (నీరు) |
| 5. గంధ (వాసన) | - | పృధ్వి (భూమి) |

**పాంచభౌతిక గుణాలు**

ఆకాశము : శుద్ధస్థితిని కల్గించును.

వాయువు : పొడిగా ఉండుట గ్రహణశక్తిని కల్గించును.

అగ్ని : జీర్ణశక్తి

నీరు మరియు భూమి : పెరుగుదలను ఇచ్చును.

అగ్ని మరియు వాయు : గోకుట,గీరుట లాంటి పిత్త లక్షణాలు ఇచ్చును.

కర్మ : ద్రవ్యము యొక్క శక్తిని బహిర్గతంగా కన్పింపచేసే లక్షణం కర్మ ద్రవ్యమును విడిచిన కర్మలేదు. ద్రవ్యంవల్ల కర్మఖచ్చితముగా కల్గును.
ఉదా :-1. శతావరిని (ద్రవ్యంగా) తీసుకుంటే స్తన్యజన్యముగా ఉండును అనగా పాలను వృద్ధిచేయును. ఇది కర్మ.

2. పిప్పళ్ళు ఆమమును పాచన చేయును. ఇక్కడ ఆమంజీర్ణం చేయుట కర్మ.

3. కుటజ అనేది అతిసారమునకు విరుగుడు అందువల్ల నీళ్ళవిరేచనాలు, వాంతులు కుటజవల్ల కలిగే కర్మ.

కర్మలు ద్రవ్యాన్ని అనుసరించి 9 రకాలుగా విభజించారు.

**1. దీపనము :** అగ్నిని, జీర్ణశక్తిని పెంచే మూలికను /ఔషధాన్ని దీపన ద్రవ్యంగా చెప్పారు. ఇవి సాధారణంగా ఉప్పు, పులుపు మరియు కారము తీక్షణమైన రసాన్ని కల్గి ఉండును. పిత్తాన్ని పెంచి వాతకఫాలు తగ్గించును. ఆమంనుజీర్ణం చేయవచ్చు/చేయకపోవచ్చు.

ఉదా:- అల్లం, మిరియాలు, చిత్రమూలం, పిప్పళ్ళు.

**2. పాచనము :** ఆమమును జీర్ణంచేయునది పాచన ద్రవ్యము లేదా ఆమపాచనాలు అంటారు. ఇవి అగ్నిని పెంచవచ్చు/ పెంచకపోవచ్చు. ఇవి సాధారణంగా చేదు, తీక్షణమైన కారము, పులుపు కల్గి వుండును. చేదు రసాన్ని కల్గి ఉన్న ద్రవ్యాలు మంచి ఆమపాచనములు.

ఉదా:– ముస్తలు, కుటజ, వెల్లుల్లి, నిమ్మ, అల్లం.

**3. శమన ద్రవ్యాలు :** దోషమును శమంచేయునవి. శరీరంలోనుంచి దోషమును తీసివేయలేనిది శమన ద్రవ్యముగా చెప్పాలి. మూలిక వాతాన్ని తగ్గిస్తే వాత శమన అని, పిత్తమును శమింపచేస్తే పిత్తశమని అని, కఫాన్ని తొలగించితే కఫశమని అని పిలవాలి.

శమనద్రవ్యం / మూలిక పనితీరు : 1. దీపన :– త్రికటు చూర్ణం అగ్నిని పెంచును దానివల్ల కఫవాతాలు సమం అవుతాయి.

2. పాచన : నిమ్మ, అల్లం మరియు కుటజలు ఆమమును జీర్ణం చేయును.

3. లంఘనము (ఉపవాసం) మూలిక ఆమమును కఫమును కరగించును.

4. దాహం (లోనికి నీరుత్రాగకుండుట) :– శరీరం వాపు (నీరు పట్టి నపుడు) నీటిని త్రాగుట ఆపివేయాలి. కావలసినంత త్రాగరాదు.

5. వ్యాయామ (శారీరక పరిశ్రమ):– దీనివల్ల శరీరంలో వేడిపుట్టి ఆమం జీర్ణమవును. చెడుబయటకు పోవును. కఫ, వాతములు తగ్గును, శరీరం తేలికగును. శరీర బరువు తగ్గును.

6. అతపసేవ (ఎండలో తిరుగుట) :– కఫము ఆమమును తగ్గించును.

7. మరుత సేవ (చల్లనిగాలిలో తిరగటం) :– పిత్తము తగ్గును.

ఉదా: నువ్వులనూనె వాతశమని, నెయ్యి పిత్తశమని, తేనె కఫశమనిగా తెలుసుకోవాలి.

**4. శోధన :** ఏ మూలిక/ ద్రవ్యమైతే శరీరములోనుంచి దోషములను తొలగించునో వాటిని శోధన ద్రవ్యాలందురు. ఇది శమన ద్రవ్యాలకంటే ఉత్కృష్టమైనవి. ఎందువల్లనంటే దోషమును బయటకు పంపును.

ఉదా:– 1. వమనము నోటి ద్వారా బయటకు రావటం. (క్రిందనుంచి పైకి); 2. విరేచనము క్రిందివైపుగా మలద్వారం ద్వారా బయటకు పోవుట.

ఉదా: ద్రవ్యాలు :- మధనఫలం, మైలతుత్తము, వచమొదలైనవి.

**5. స్తంభనము :** పెద్దప్రేగులలో పూర్తిగా ద్రవాన్ని పీల్చుకొనునవి. స్తంభన ద్రవ్యాలుగా చెప్తారు. దీని ముఖ్యలక్షణం పొడి, వగరు, శీతలము ఇవి ఆమమును జీర్ణం చెయ్యవు. ఒగరు, పొడి, శీతలముచేతనే ద్రవాలను పీల్చుకొనును. ఎక్కువ ఆమం ఉన్నపుడు, ఆమంతో కూడిన రోగం (వ్యాధుల) లో ఇవి ఉపయోగపడవు.

ఉదా: ఒగరు రుచితో కూడిన మూలికలు; ఉదా: కుటజ,నాగకేసరాలు.

**6. గ్రాహి :** మూలిక మలమును గట్టిపరిచినపుడు దీపన, పాచనలు బాగా జరిగినపుడు అక్కడగల ద్రవమును పీల్చే ద్రవ్యాలను గ్రాహిద్రవ్యాలంటారు. ఇవి వేడి గుణమును (వీర్యమును) కల్గి కారము తీక్ష్ణమైన స్థితిని ప్రకృతిలో కల్గి వుంటాయి.

ఉదా: ఎండిన అల్లం (శొంఠి); ముస్త, జీలకర్ర మొదలైనవి.

**7. అనులోమము :** విరేచన కర్మను చేసే ద్రవ్యాలను అనులోమన ద్రవ్యాలంటారు. ఆమము ఇక్కడ జీర్ణం కావించబడును. దీనినే శామ మలము (ఆమంతో కూడిన మలం) ఇక్కడ నుంచి ఆసనం (గుదము) ద్వారా విసర్జించబడును. ఉదా: వేడిపాలు, నెయ్యి, ద్రాక్ష, కరక్కాయ,త్రిఫల.

**8. స్రంశన :** కొద్ది కారము తీక్ష్ణము గల గుణం గలవాటిగా పనిచేసే ద్రవ్యలను స్రంశన ద్రవ్యాలంటారు. ప్రేగులలోని మలాన్ని ఈ మూలికలు బయటకు పంపును. ఇవి ఆమపాచన చెయ్యలేవు. ఇవి అనులోమ మూలికల కంటే బలమైనవి. ఉదా: రేల, ఆముదం.

**9. విరేచన :** తీక్షణము కారము బలంగా గల్గిన ద్రవ్యాలను విరేచన ద్రవ్యాలందురు. ఇవి సామ, నిరామ మలాలను ద్రవస్థితిలో ఉండగానే బలంగా బయటికి ఆసనం (గుదం) ద్వారా వెలువరించగలవు.

ఉదా: నిశోత్తర్ మరియు ఆముదం.

**10. భేదన :** మూలిక వేగంగా చురుకుగా తీక్ష్ణము కారముగల మూలికా ద్రవ్యమునే భేదన ద్రవ్యముగా పిలుస్తారు. ఇవి జీర్ణమండలంలో గల ఆగినమలం, గట్టిపడిన మలం, మల ద్రవ్యాలు, విపరీత జీర్ణదోషాలను బయటకు పంపును. ఇవి అన్ని ద్రవ్యాల కంటే బలమైన చర్యను కల్గి వుండును. ఉదా: కలబంద, కటుకరోహిణి, చిత్రమూలం.

**11. లేఖన ద్రవ్యాలు :** మూలిక, ధాతువు, దోషము, మలము వీటిని చిన్న చిన్నవిగా చేసివాటిపై పనిచేసే ద్రవ్యాలను లేఖనద్రవ్యాలంటారు. మేద మరియు కఫము ఈ రెండింటినీ ధాతు, దోషములను లేఖనద్రవ్యాలు తీసివేయును. ఇవి స్థూలకాయం, మధుమేహ వ్యాధుల యందు మంచివి. ఉదా: గుగ్గులు, పసుపు, వచ, దారుహరిద్రా, వేడినీరు మరియు తేనె.

**12. ప్రమతి :** ఉష్ణ, తీక్ష్ణ గుణములు దోషాలు, శ్రోతస్సుల యందు పనిచేయించును. కఫ, మేద రోగులయందు ప్రాణవహశ్రోతస్సు మరియు శిరోరోగాల యందు ఈ మూలికలు ఉపయోగపడును.

ఉదా: మిరియాలు, వచ, చిత్రమూలం, పిప్పళ్ళు మరియు వాయు విడంగాలు.

**షట్ రుచులు :** రస (రుచి) మును నాలుక ద్వారా తెలుసుకుంటాము. రుచులు 6 రకాలు అవి.

1. తీపి (మధురము) 2. పులుపు (ఆమ్లము) 3. ఉప్పు (లవణం) 4. కారము (కటు) 5. చేదు (తిక్త) 6. ఒగరు (కషాయం)

రసము అనేమాటకు ద్రవము, మొదటి ధాతువు, పాదరసమని అర్థాలున్నాయి.

నీరు అనేది మహాభూతములలో ఒకటి, ఇదే రసానికి, రుచికి కారణం.

ప్రతీదోషము రసం యొక్క హెచ్చు తగ్గులు చేతనే పెరుగుట/తగ్గుట జరుగును.

మన జ్ఞానేంద్రియాలలో నాలుక రుచిని గుర్తించగలదు. ఆహారమును లోనికి తీసుకున్నపుడు రుచి మొగ్గలు ఆహారము యొక్క రుచిని గుర్తించ గలము.

ఏ ద్రవ్యానికైనా, ఏ పదార్థానికైనా రసము శాశ్వతము కాదు. అది కాలానుగుణంగా వేరే రసంగా మార్పు చెందగలదు.

అయిదు భూతాలు ఆరు రుచులు

| రుచి | మహాభూతాల కలయిక |
|---|---|
| తీపి (మధురము) | భూమి+నీరు |
| పులుపు (ఆమ్లము) | అగ్ని+భూమి |
| ఉప్పు (లవణం) | అగ్ని+నీరు |
| కారము (కటు) | అగ్ని+వాయువు |
| ఒగరు (కషాయం) | వాయువు+భూమి |
| చేదు (తిక్త) | వాయువు+ఆకాశము |

అనగా పంచభూతాల కలయికవల్ల రుచి ఏర్పడును. నాల్గు రకాల రుచులను నాలుక చూడగలదు. అవి తీపి, పులుపు, ఉప్పు, చేదు, తీపి మరియు ఉప్పు నాలుక మధ్యభాగమందు, ఆమ్లము నాలుక ప్రక్కల యందు చేదు నాలుక వెనుక (చివరి) భాగమునందు గుర్తించగలదు. కారము రుచి మెత్తని పొరలను ఇబ్బందికల్గించటం ద్వారా గుర్తించగలం.

| **రసాలు - దోషాలు - గుణాలు** | | | |
|---|---|---|---|
| రుచి | కఫము | పిత్తం | వాతము |
| తీపి | పెరుగును | తగ్గును | తగ్గును |
| పులుపు | పెరుగును | పెరుగును | తగ్గును |
| ఉప్పు | పెరుగును | పెరుగును | తగ్గును |
| కారము | తగ్గును | పెరుగును | పెరుగును |
| కషాయం | తగ్గును | తగ్గును | పెరుగును |
| చేదు | తగ్గును | తగ్గును | పెరుగును |

| రసాన్నిబట్టి దోషశమన ఎలా జరుగును ? | | |
|---|---|---|
| దోషశమనము | రుచి | ప్రభావం |
| వాతశమన (లేదా)<br>వాతశామక | తీపి<br>ఉప్పు<br>పులుపు | తడితోకూడిన తేమ<br>వేడి, తేమ<br>వేడి |
| పిత్తశమన (లేదా)<br>పిత్తశామక | తీపి<br>ఒగరు<br>చేదు | చల్లగా<br>చల్లగా<br>చల్లగా |
| కఫశమన (లేదా)<br>కఫశామక | కారము<br>చేదు<br>ఒగరు | వేడి, తేలిక<br>తేలిక, పొడిగ<br>పొడిగా |

| రసము దోషము వర్ధనీయములు | | |
|---|---|---|
| దోషశమనము | రుచి | ప్రభావం |
| వాతవర్ధనము | కారం,ఒగరు,చేదు | పొడిగా |
| పిత్తవర్ధనము | కారం,పులుపు,ఉప్పు | వేడిగా |
| కఫవర్ధనము | తీపి, పులుపు, ఉప్పు | బరువుగా,తేమగాఉండును |

| పంచమహాభూతములు ద్రవ్యాలపై ప్రభావం | |
|---|---|
| దోషశమనము | ప్రభావం |
| ఆకాశము | శోధన, స్వచ్ఛముగా ఉంచుట |
| వాయు | శోషణ గ్రహించుట |
| అగ్ని (తేజస్) | దీపన, అగ్నిబలం చేకూర్చుట |
| ఆప్, పృధ్వి | బృంహణము, ధాతుపుష్టిని పెంచుట |
| వాయు, అగ్ని | లేఖన,ధాతువులను చిన్న చిన్నవిగాచేయును. |

# విపాకము (జీర్ణమైన తర్వాత ప్రభావం)

విపాకము పాచనము అనగా జీర్ణం, పాకము వండుట, పక్వం చేయుట విపాకము పూర్తి జీర్ణం తర్వాత దాని / ద్రవ్య ప్రభావమే విపాకము. ఇది శరీరమునకు అత్యంత గొప్పది ఎందువల్లనంటే ఇది శరీరము నిలుపుటకు మొదటి మెట్టు. ఆహారమునకు చివరిమెట్టు. దీనివల్లనే ఆహార శరీరముల మధ్య సమన్వయం ఏర్పడి జీవుడు పోషించబడతాడు.

విపాకము – రకాలు : చరకుని మతానుసారము విపాకము 3రకాలు

| రకం | విపాకం | రుచులు | ప్రభావం | ఉదాహరణలు | వర్తించనిది వ్యతిరేకము |
|---|---|---|---|---|---|
| 1. | తీపి మధురం | తీపి ఉప్పదనం | ధాతుపోషణ,గాయాలుమాన్పును చర్మంపొడిగా ఉంచును. మలమూత్రాలనుశుద్ధిపరచును | పాలు,నెయ్యి వెన్న,సముద్రపు లవణం,సైంధవ లవణం | తేనె (కారము విపాకము) మినుములు |
| 2. | పులుపు (ఆమ్లం) | (పులుపువిపాకం) పులుపు | రక్తధాతువునుపెంచును, అగ్నికి సహాయకారిగా ఉండును, ఆమ దోషమును తగ్గించును, వాతము వల్ల కలిగిన నొప్పులు తగ్గించును | నారింజ, టమోటో | నిమ్మ,ఉసిరి (తీపివిపాకం) |
| 3. | కారం (కటు) | కారము ఒగరు చేదు రుచులు కల్గివుండును. | నోరు,నాలుకలను శుభ్రపరచును మేధోధాతువును క్షీణపరచను ఎక్కువనీటిని తొలగించును. మలబద్ధకమును కల్గించును. మధురగ్రంధులను ఆటంక పరచును. | మిరపకాయలు చిత్రమూలం చేదుపుచ్చ,లోధ్ర మేడి(ఒగరు) | పిప్పళ్ళు, శొంఠి తిప్పసత్తు కరక్కాయ (తీపివిపాకం) |

## వీర్యము (పొటెన్సి)

వీర్యతే అనేన ఇతి వీర్యం ఏదైతే శక్తిని పెంచునో / పెంచుటకు దోహదపడునో దానిని వీర్యమని చెప్పబడును. వీర్యము ద్రవ్యము యొక్క ప్రభావచలనము, మూలిక యొక్క సత్తు అని అర్థము.

వీర్యము 2 రకాలు అవి

**1. శీత (చల్లని) వీర్యము :** వాత, కఫములను పెంచును. పిత్తమును తగ్గించును. కండరాల కదలికలు తగ్గును. చమటను కల్గించును. మూత్ర మును పెంచును. అగ్నిని మందగింపచేయును. మానసిక నూతనోత్సా మును కల్గించును. ధాతువులను క్రమపరచును. తడిగా ఉంచును. ధాతువులను పోషించును. శ్రోతస్సులను క్రమబద్ధీకరించును.

ఉదా: చందనము, కలువపువ్వు, కలబంద.

**2. ఉష్ణ(వేడి) వీర్యము :** వాత, కఫములను తగ్గించును. పిత్తమును పెంచును. రక్తధాతువును పెంచును. మలమును ఎండించును. మూత్రమును వేడిగా చేయును. చెమటను పుట్టించును. కారణం అగ్ని, దీపన మరియు ఆమపాచన, గొంతు తడి ఆరిపోవును. దాహంపుట్టించును. చిరాకు, తలతిరు గుట కల్గును. శ్రోతములు తెరచుకొనును.

ఉదా: శొంఠి, పిప్పళ్ళు, చిత్రమూలం

పై విధమునుబట్టి శీతవీర్యము కఫమును పెంచును. అలాగే ఉష్ణ వీర్యము పిత్తమును పెంచును. వాతము వీటిమధ్య సంచరించును. ఆరు రుచులలో మూడు రుచులు శీతవీర్యము లేదా చల్ల వీర్యమును మూడు రుచులు ఉష్ణవీర్యమును కల్గివుండును.

| రసం | వీర్యము |
|---|---|
| తీపి | చల్లగా(శీత) |
| పులుపు | వేడి (ఉష్ణ) |
| ఉప్పు | వేడి (ఉష్ణ) |
| కారం | వేడి (ఉష్ణ) |
| ఒగరు | చల్లగా(శీత) |
| చేదు | చల్లగా (శీత) |

**ప్రభావం :** ప్రభావతి సమస్త విశిష్టమ్ భవతి అనేన ఇతి ప్రభావ.

ప్రభావం అనేది రసముతో వీర్య విపాకముతోను చెప్పలేము. ఇది ప్రత్యేకమైన అంశము. ఇది పాంచభౌతికమైన పంచభూతాల కలయిక, దీనినే అచింత్యశక్తిగా మనస్సుగా చెప్పాలి.

ఉదా: 1. దంతి, చిత్రమూలం సమానరసాలను, వీర్య, విపాకాలను కల్గి ఉన్నప్పటికీ రెండూ కారము తీక్షణమైన రసంవల్ల విపాకంలో ఉష్ణవీర్యమును కల్గి ఉండును. ప్రభావముచే దంతి (నేపాలము) మలశోధిని (విరేచనకారి), చిత్రమూలం జీర్ణకారి.

2. పాలు,నెయ్యి సమాన రస, వీర్య, విపాకములు అయినప్పటికీ నెయ్యి అగ్నిని దీపనమునుకల్గించును. పాలు అగ్నిమాంద్యమును కల్గించును.

3. అర్జున మరియు విడంగాలు సమాన రస, వీర్య, విపాకములు కల్గి ఉన్నప్పటికీ అర్జున (మద్ది) గుండెపై పనిచేయును. విడంగాలు క్రిమి శోధినిగా పనిచేయును.

## ఔషధ ద్రవ్యాలు

మూలిక అనేదానిని మందుగా వాడితే దానిని ఔషధము అంటారు. అలాగే ధాతువులు, లోహాలు, రత్నాలు, రసములు ఔషధములుగా వాడితే వాటిని రసౌషధాలు అంటారు.

ఔషధమునకు ఉండవలసిన లక్షణాలు :

ఔషధంగా ద్రవ్యాన్ని వాడినపుడు 4 ముఖ్య లక్షణాలు ఉండాలి.

1. ఎల్లప్పుడూ లభ్యమయ్యేదై ఉండాలి.

2. ఎక్కువ ఔషధగుణాలుండాలి అలాగైతే ఎక్కువ ఔషధ సంయోగాలు చేసుకోవచ్చు.

3. మంచి స్థితిలో రస,వీర్య,విపాక,ప్రభావగుణాలుండాలి.

4. మంచిస్థితిలో చర్య, కర్మలను కల్గి వుండాలి.

ఆహారము ఔషధముగా వాడితే దాన్ని ఆహారౌషధము అంటాము. దీనిలో ఎక్కువ పోషకాలు ఉండుటచేత దీనినే పౌష్టిక ఆహారంగా పిలుస్తారు.

## మూలికలలో ఏ భాగం ఉపయోగం

మూలిక, అంతా ఔషధంగా ఉపయోగపడకపోవచ్చు. ప్రత్యేక భాగము లలో ప్రత్యేక స్థితి, రసము, గుణములను ఔషధం కల్గివుండును. దానినుప యోగించి వ్యాధులను కుదుర్చుదురు.

ఉదా: అల్లముమొక్క నందు వేరు కారము, తీక్షణగుణములు కల్గివుండుటచేత మూలము (వేరు)ను మాత్రమే ఔషధంగా వాడతాము. క్రింది పట్టికలో కొన్ని మొక్కల భాగాలు ఉదాహరణకు పరిశీలించండి.

| క్ర.సంఖ్య | ఏభాగం ఉపయోగం | ఉదాహరణలు |
|---|---|---|
| 1. | వేరు | దశమూలములు |
| 2. | బెరడు | అర్జున, ఖదిర |
| 3. | కాండము | చందనము |
| 4. | జిగురు | గుగ్గులు,తుమ్మజిగురు |
| 5. | కాడ | తామరపువ్వులు |
| 6. | రసము | గోటుకొల ఆకులు |
| 7. | పత్రము | మామిడి |
| 8. | విత్తులు (ఉజ్జులు) | బార్లీ, తామర |
| 9. | లోపలిగుజ్జు | కలబంద |
| 10. | పండ్లు | హరీతకి,ఆమ్ల(ఉసిరి) |
| 11. | పూలు | గులాబీ |
| 12. | బూడిద | త్రిఫల |
| 13. | నూనె | ఆల్మండ్ |
| 14. | స్పైక్స్ | సావరి |
| 15. | వేరు | అల్లము |
| 16. | విత్తనాలు | అజువాన్ |
| 17. | మూలికలు | స్వరసం |

మోతాదు :– మోతాదు అనేది ఖచ్చితంకాదు. అది క్రింది పరిస్థితులను అనుసరించి మారవచ్చు.

1. రోగి బలము 2. రోగం బలము 3. మూలికా బలము 4. జీర్ణశక్తి 5. వ్యాధికాలబలము 6. ప్రకృతి లేదా ఋతువు 7. వయస్సు, లింగమును అనుసరించి మోతాదు మారును.

ఔషధం, మోతాదు ఎక్కువ ఇవ్వాలంటే దోషం అసమతుల్యంగా ఉన్నపుడు ఔషధంలో ఔషధ విలువ నశిస్తున్నపుడు, రోగి బలంగా ఉన్నపుడు అలాగే రోగి బలహీనంగా ఉన్నా, మూలికాసారం ఎక్కువగా ఉన్నా, దోషం పర్వాలేదనిపించినా ఔషధపరిమాణం తగ్గును.

## పరస్పర గుణ విరుద్ధాలు

1. రసవిరుద్ధాలు – పాలు+పులుపు కలిపిన పళ్ళు
2. గుణవిరుద్ధాలు – విరుద్ధ లక్షణాలు గలవి
3. వీర్య విరుద్ధాలు – పాలు + చేపలు
4. విపాక విరుద్ధాలు – పాలు + ఉలవలు

## కలిపి వాడకూడనివి

1. మాంసము – తేనె,పాలు, బెల్లం
2. పాలు + ఉప్పు
3. పాలు + పులుపు
4. పెరుగు+కోడిమాంసం (పుంజు)
5. ముల్లంగి+నల్ల ఉలవలు
6. వెన్న+కుండలో పెంచిన మొక్కలు
7. అరటిపండు+పెరుగు,మజ్జిగ
8. నెయ్యి కంచుపాత్రలో నిల్వ ఉంచరాదు.
9. ఉష్ణద్రవ్యాలు తీసుకొన్న తీసుకున్న తర్వాత పెరుగు, తేనె, భల్లాతకి, సారావద్దు
10. తేనె, నెయ్యిలకు అనుపానం నీరు ఉండకూడదు
11. పాత+కొత్త ధాన్యాలు
12. ఉష్ణవీర్య ఔషధాలు + శీతవీర్య ఔషధాలు
13. ఉడికించిన+ఉడికించని ధాన్యాలు (ఆహారపదార్థాలు)
14. వాంతులైనపుడు ఆహారం విసర్జించాలి, ద్రవాహారాలు వాడుకోవచ్చు.

## వివిధ ఔషధాలు చికిత్సలో మోతాదులు

| విధము | తయారి | సాధారణ మోతాదు |
|---|---|---|
| 1. స్వరసం (అప్పుడే మూలిక నుండితీసిన రసం | మూలికను దంచి 1/2 లేదా సమభాగం నీరు కలపి తీసిన రసం | 10 మి.లీ. |
| 2. కల్కము(మూలికా చూర్ణం,దంచినది) | బాగాముద్దగా దంచినది కొంచెం నీరు కలపవచ్చు. | 5గ్రా. |
| 3. క్వాథము (కషాయం) | 1భాగం మూలిక 8 భాగాలు నీరు 4 భాగం అయ్యేవరకు మరిగించినద్రావణం | 10 మి.లీ. |
| 4.హిమము(చల్లని కషాయం) | 1భాగం మూలిక 3 భాగాలునీరు చల్లనినీటిలో కలిపి తర్వాతిరోజు తేటనువంచుకుని తీసుకున్న ద్రావణం. ఇది పిత్తరోగమును మంచిది. | 80 మి.లీ. |
| 5. ఫాంటము(వేడి కషాయం) | 1భాగంమూలిక, 3భాగాలు నీరు కాచి చల్లార్చిన ద్రావణం 1-12 గం॥లు పట్టవచ్చు. | 80 మి.లీ. |
| 6. ఔషధనూనెలు | 1భాగంమూలిక 8భాగాలు నీరు 1భాగం కషాయంవచ్చే వరకు మరగగాచి దాని సమ భాగం నూనె (నువ్వులనూనె సాధారణంగా) నూనె మిగిలేవరకు కాచినది ఔషధ యుక్తమైన నూనె. | 10 మి.లీ |
| 7. ఔషధ నెయ్యిలు | 1భాగం మూలిక 8 భాగాలు నీళ్ళు 1భాగం మిగిలేవరకూ కాచినకషాయం (అష్టభాగం)కు సమభాగం ఆవునెయ్యినుకల్పి సమవేడిలో నీరుఆవిరయ్యే వరకువండిననెయ్యి | 10గ్రా. |
| 8. ఆసవము (ఆయుర్వేదవైన్ స్వరసంతో చల్లనిపద్ధతి | మూలిక స్వరసము,పంచదార,(బెల్లం) ఆరెపువ్వు కలిపి 90 రోజులు నిల్వ ఉంచిన ద్రావణము. ఇది పిత్త రోగులకు మంచిది. | 15 నుండి 20మి.లీ |
| 9. ఆరిష్టా(ఆయుర్వేదిక్ వైన్ మూలికకషాయం) | మూలిక కషాయం, బెల్లం(పంచదార)ఆరెపువ్వు కలిపి 90 రో॥ గాలి తగులకుండా ఉంచిన ద్రావణం కఫ,వాత రోగులకు మంచిది. | 5 నుండి 20మి.లీ |
| 10. చూర్ణాలు | ఇది సాధారణంగా ఆయుర్వేదములో వాడే విధానం, 6 నెలల తర్వాత వీర్య గుణాల ప్రభావం తగ్గును. | 1నుండి 2గ్రా. వరకు |
| 11. గుళికలు | చూర్ణమును తేనె లేదా ఏదైనా స్వరసం కషాయంతో గుళికలు కట్టుపద్ధతి | 2నుంచి 4గ్రా. |

## మూలికలు, ఔషధాలు ఎప్పుడు వాడాలి ?

**ఖాళీ కడుపుతో (లేచిన వెంటనే)**

కఫ రోగములలో, రోగి బలంగా ఉన్నపుడు ఖాళీ కడుపుతో మూలిక లేదా ఔషధం వాడిన శరీరమంతా మందు వ్యాపించును.

**భోజనానికి ముందు**

వాత రోగముల యందు, అగ్నిని వృద్ధి పరచుటకు ఆపానవాయువును సరిచేయుటకు, ప్రేవులను శుద్ధిచేయుటకు ఇవ్వాలి.

**భోజన సమయమందు**

జీర్ణశక్తి పెంచుటకు శమన వాయువును సరిచేయుటకు, యకృత్ ప్లీహములు చురుకుగా పనిచేయుటకు భోజన సమయమందు ఔషధాలు ఇవ్వాలి.

**భోజనం తర్వాత మందు**

భోజనం (మధ్యాహ్నం) వ్యాన వాయువును సరిచేయుటంకోసం/ వృద్ధి పొందించటం గుండెబలం పెంచటంకోసం మధ్యాహ్న భోజనం తర్వాత మందివ్వాలి.

**రాత్రి భోజనం తర్వాత**

ఉదానవాయువును సరిచేయటం / వృద్ధి పొందించటం తద్వారా ఊపిరితిత్తులకు బలంచేకూర్చుటకు రాత్రి భోజనం తర్వాత ఔషధం వాడాలి.

**ఎప్పుడూ తీసుకునే మందులు (కాలనియమం లేకుండా)**

దగ్గు, గుండెల్లో మంట, ఆస్త్మా, దాహం, ఊపిరి అందకపోవుట, ఎక్కిళ్ళు.

**రాత్రి పడుకునేముందు మందు**

చెవి, ముక్కు, గొంతు రోగాలయందు ప్రాణవాయువును స్థిరపరచుటకు కారము తీక్ష్ణమైన నిద్రకలిగించుటకు రాత్రి పడుకునే ముందు ఔషధం వాడాలి.

## మందును ఎలా లోనికి పంపాలి ?

శరీరంలోనికి వివిధ మార్గాల ద్వారా ఔషధమును పంపించవచ్చు.

**1. నోటిద్వారా :** సాధారణ చర్యలకు 1 నోటి ద్వారా మందును తీసుకుంటే మూలిక / ఔషధం జీర్ణమై లోనికి రక్తం ద్వారా వివిధ భాగాలకు సారం పంపిణీ అగును.

2. నోటివ్యాధులలో పండ్లు, నాలుకమొదలైన ముఖ వ్యాధులయందు నూనె, నెయ్యి, ఔషధమును పూయుట, పుక్కిట పట్టుట ద్వారా ఆ ప్రదేశ మందు స్వయంగా మందును వేయగలుగుతాము.

3. లోనికి పీల్చుట ద్వారా ఊపిరి రోగాలను (ధూమపానం) తగ్గించుటకు.

4. వాంతి చేసుకొనుట (వమనము) ద్వారా కొన్ని రకాల జీర్ణాశయ రోగాలను తగ్గించుకొనుటకు.

**2. ముక్కుద్వారా :** దీని ద్వారా మెదడు సంబంధిత రోగాల యందు ఊపిరి రోగాల యందు నస్యకర్మ చేస్తారు. దీనిలో

1. పై ఊపిరి, ఛాతి భాగాలకు సంబంధించిన నాళాలను శుద్ధి చేయుటకు

2. ఆస్మాలాంటి వ్యాధులలో లోనికి మందులు పీల్చుటకు

3. మైగ్రేన్, సైన్‌సైటిస్, విపరీత తలనొప్పి మొదలగు వ్యాధులలో నశ్యకర్మ చేయటం ద్వారా ముక్కును ఒక ప్రధానమందు పంపే ద్వారముగా మనం వాడుకోవచ్చు.

**3. కన్నులు :** కంటి వ్యాధుల యందు స్వయముగా కంటిలో తైలం, అంజనం, చుక్కలు మందులను పెట్టుట.

**4. చెవి :** చెవిహోరు, చెవిలో కురుపు, నొప్పి, సరిగ్గా వినబడకపోవుట యందు చెవిలో మందులను వాడతారు.

**5. గుదద్వారం :** 1 మలబద్దకం, గట్టిగా బిగుసుకున్న గుదచలనం నందు ఎనీమా పద్దతి ద్వారా మందును పంపిస్తారు. 2 వస్తి (భస్తి) కర్మ గుద ద్వారం ద్వారా వాత వ్యాధులకు చేస్తారు.

**6. మూత్రనాళం :** మూత్రం సరిగా రానపుడు దానిని రప్పించుటకు లోనికి, పైకి మందులను పంపిణీ చేయుట, కొన్ని సుఖవ్యాధులలో మందు

లను లోనికి పిచకారీచేస్తారు.

**7. యోని :** యోని సంకోచ, యోనికంద, యోనివ్యాపక, యోనిభ్రంశ, గర్భవిచ్ఛితి, యోని దుర్గంధ, తెల్లబట్ట, మొదలైన వ్యాధులలో పై పూత లోనికి మందులు వాడతారు.

**8. చర్మం :** చాలా చర్మరోగాలు వాచిన కండరాలు, కీళ్ళు, వేడినీరు కాపడము, బొల్లి, సెక్స్ సామర్థ్యం కోసం పైపూతగా మందును వాడతారు.

**9. ఇంజక్షను, సెలైన్ :** ఇది పురాతన పద్ధతి అయిననూ/కాకున్ననూ ఇది మందును నేరుగా పంపుటకు ఒక సులువైన మార్గము. పూర్వకాలంలో సూచి ముఖము అని పిలుస్తారు.

**అనుపానం** : ఒక మూలికతో తీసుకునే ఔషధం లేదా ఆహారం దీనివల్ల ఔషధం ఖచ్చితంగా పనిచేయుటకు / పనిచేయించుటకు అవకాశం ఉంటుంది.

## అనుపానం ఏ పరిస్థితులలో వాడవచ్చు ?

1. రుచితెలియకుండా టీ లేదా పళ్ళరసాలలో ఆముదం కలిపి త్రాగుట.

2. ఔషధ బలం పెంచుటకు తేనెతో వాడాలి.

3. పనికిరాని, సరిపడని వస్తుగుణం తగ్గించుటకు ఉదా : పిత్త ప్రకోపం గుగ్గులువాడినపుడు కలిగితే దానికి విరుగుడుగా పాలను తాగాలి.

4. జీర్ణశక్తిని పెంచుటకు

5. ఖచ్చితమైన పనికోసం, అవయవాలమీద వాటి ప్రభావం కోసం ఉదా:- ఆసవారిష్టాలు, యకృత్ ప్లీహములపై స్వయముగా ప్రభావం చూపుతాయి.

**సాధారణ అనుపానాలు**

| దోషం | పరిస్థితి | ఉదాహరణ |
|---|---|---|
| వాతము | తడి మరియు వేడి | నువ్వుల నూనె, వేడినీరు |
| పిత్తము | చల్లని మరియు తీపి | నెయ్యి,చల్లనినీరు, పాలు |
| కఫము | పొడిగా మరియువేడి | తేనె, వేడినీరు |

## సప్తధాతువులకు అనుపానాలు

| ధాతువులు | అనుపానాలు |
|---|---|
| రస | నీరు,పటికిబెల్లం,పాలు |
| రక్త | పాలు,తేనె,పటికబెల్లం |
| మాంస | తేనె |
| మేధస్సు | ఆసవారిష్టాలు |
| అస్థి | పాలు,సేరువా |
| మజ్జ | ఆసవారిష్టాలు |
| శుక్రము | పాలు |

ఇటువంటివి ఎన్నో రకాలుగా వివరించి, పాటించి, పరిశీలించి అనేక రోగాలలో అనుపానంవాడి తద్వారా శాశ్వత ఆరోగ్యం పొందాలని మన శాస్త్రకారులు నిర్ధేశించారు.

## సాధారణ సూచనలు

1. యోగము నందు వివిధ వస్తువులు ఎంతెంత ప్రమాణముగ గైకొన వలెనో చెప్పకపోయిన యెడల అన్ని వస్తువులను సమానముగ కలుపు కొనవలెను.

2. యోగము నందు చెప్పబడిన వస్తువులు అన్ని పచ్చివి దొరకనపుడు ఎండువిరెండింతలు గ్రహించవలెను.

3. యోగము నందు ప్రత్యేకించి మోతాదు నిర్దేశించనపుడు చూర్ణము నకు 2-3 గ్రా. సేవించవలెను. లేహ్యము 3-5 గ్రా. సేవింపవలెను.

4. యోగము నందు అనుపానము ఎక్కడ చెప్పనపుడు నీళ్ళతో సేవించవలెను.

5. యోగము నందు ఔషధము ఎప్పుడు సేవించవలసినది ప్రత్యేకంగా చెప్పనపుడు భోజనం తర్వాత సేవించవలెను.

6. తేనె, నెయ్యి, పిప్పళ్లు, బెల్లం, ధాన్యములు ఎక్కడ పేర్కొన్నను పాతవి గ్రహించిన ఎడల శ్రేష్ఠములు.

## రోగము - సూత్రము - ఔషధాలు

**1. జ్వరము :క్షైరాతాం మృద పర్పటం జ్వరగదే ।**

జ్వరమునందు నేలవేము, పర్పాటకము, తుంగముస్తల కషాయం వాడాలి.

2. **జ్వరాదౌ లంఙ్ఘనం । శస్తం జ్వర మధ్యతు, పాచనం ।**

**జ్వరాంత, రేచనం, ప్రోక్తమేతజ్జ్వర చికిత్సితమ్ ॥**

జ్వరారంభమునందు లంఘనము చేయించుటయు, జ్వర మధ్యమునందు పాచ నౌషధములను (అనగా ఆహార పదార్థములను, మాత్రము పచనము చేయు చిత్ర మూలము, సోపు) సేవించుటయు, జ్వరాంతమందు విరేచనౌషధమును (అనగా ఆహార పదార్థములు అరిగినను, అరగకున్నను ద్రవత్వము చెందించి అధో భాగము నకు (మల మార్గమునకు వెడలించు తెల్లతెగడ, రేల మొ॥) సేవించుటయు జ్వర చికిత్సాక్రమము.

**మందులు**: జ్వరాంతక చూర్ణం, ఆమపాచనీయ చూర్ణం, సుదర్శన చూర్ణం, కణాదివటి, కిరాతకల్పం, కిరాతరిష్టా, జ్వర సంజీవిని, పూరవటి, పచ్చ మాత్రలు, దురదవటి, వాతరిపు, సూతాదిరసం, శీతాంశురసం, ఆనందభైరవి, కస్తూరి మాత్రలు.

**2. అజర్ణీం,**

**అజీర్ణే రుచితు స్వాపః**

అజీర్ణ రోగులకు నిద్రహితకరము.

మందులు : అజీర్ణకుఠారము, లఘుక్రవ్యాది, పంచలవణ మైనము, లఘువజ్ర వల్యాది చూర్ణం కుమార్యది వటి.

**3.** గ్రహణ్యాతిసారం

**తక్రం గ్రహణ్యామధాతీసారే కుటజః॥**

మజ్జిగ, గ్రహణివ్యాధియందును, కొడిసెపాల అతిసారమందు **ఔషధాలు** : బోళ వటి, బోళబద్ధవటి, గ్రహణికవాటం.

**లంఘనం - చాల్పదోషాణం । ప్రశస్త మతి సారిణాం ॥**

అల్పదోషముగల అతిసార రోగికి, లంఘనము చేయించుట ముఖ్యము.

**4. విషూచికా రోగము**

**పూర్వం ఛర్దనమంభసాచ పటినానస్యం రసైః భృంగ జైః ॥**

వేడినీటిలో సైంధవలవణమును జేర్చి వెంటనే వమనకర్మ చేయించుట, గుంట గలగర రసమును నాసారంధ్రములలో నింపుట, కలరాహరములు. కలరాగజకేసరి, రసపతంగవటి.

**5. శ్వాస, కాసము, క్షయ**

**శ్వాసేతు భార్‌ణ్యౌషదం । క్షయే గిరిజతు ॥**

దగ్గు ఆయాసమునకు గంటుభారంగి, క్షయకు శిలాజిత్తు భస్మం వ్యాధి హరములు.

త్రయో నాఖ్యరసం, శ్లేష్మాంతకరసం, కుక్కుట పలలాది ఆహారము.

**కఫం దుర్జన వత్తీక్ష్ణ ౩॥**

కోపముగల వాక్కుల చేతను, శిక్ష చేతను, దుర్మార్గుని శిక్షించునటుల, కఫమును వగరు, కారము, చేదుగల ద్రవ్యములచే హరింప చేయవలెను. వమనకర్మ, నస్యకర్మ చేయించవలెను. షడంగ పానీయము.

**6. పాండు, శోష, కామిలా రోగం**

1. పాండౌకిట్ట – పాండు రోగమునకు మాండూరము

2. శోఫే పునర్నవః– ఉబ్బు రోగమునందు గలిజేరు

3. కామిలా యాం ధాత్రీద్వయః–కామెర్లకు ఉసిరిక, నేల ఉసిరిక, మాండూర కల్పము, సూరాక్షార మాండూరము, సిందూర కల్పము.

**7. మేహరోగం**

**మేహేత్యామ రాత్రికే**

మేహ (మర్మాయవములకు (వస్తి) సంబంధించిన) వ్యాధుల యందుఉ సిరిపప్పు, పసుపు ఔషధములు.

భానుపుష్పసిందూరం, బాలచంద్రోదయం, దురదచింతామణి, సర్వమేహ సంజీవి. మేహ రోగి స్థూలుడు (బలవంతుడు) అగువానికి వమన విరేచన కర్మలును కృశుడు (దుర్బలుడు) అగువానికి పుష్టికర ఔషధములు ఈయవలెను.

**8. వాజీకరణం**

**కదళీఫల క్షీరశర్కరాదికం రేతో వృద్ధికరాణాం**

అరటిపండ్లు, పాలు, పంచదార (పటికబెల్లం) శుక్రవృద్ధి కరములు, బలవర్ధనీ వటి, యింగిలీకమైనము, గగనతార చంద్రోదయము, ప్రతినిధి చంద్రోదయము, రజిత నవనీతం, వీర్యస్థంభన గుటిక, ఖర్జూరాది లేహ్యము, అశ్వగంధాది పానకము.

**9. స్త్రీ రోగము**

**ప్రదరేతిరీటః ।**

కుసుమ వ్యాధుల యందు లొద్దుగ కషాయం ఇవ్వవలెను. ప్రదరాంతక కల్పం, ప్రదరహరవటి, అరుణసిందూరం, ఆమలకాది కల్పం, కపిత్థ ఘృతము, ప్రదరారిష్ట, గర్భపోషణరసము, అశ్వగంధ ఘృతం, సంతనకరణి.

10. **వాతపిత్త చర్ధిరోగం :**

**వాతవ్యాధిషు గుగ్గులుశ్చ లశున ః।**

వాతరోగమునందు గుగ్గిలము, వెల్లుల్లి

**పిత్తే (పిత్తరోగం)**

**ద్రాక్షా శర్కర సేవ్య గోపవనితా ఖర్జూర వాసామృత ।**

పైత్య రోగమందు ద్రాక్ష,పంచదార, వట్టివేరు, సుగంధి, ఖర్జూరము, అడ్డసరం, తిప్పసత్తు.

**చర్ధిరోగం**

**లాజా చూర్ణం శర్కరామిళిత త్రిసుగంధాదికం, కపిత్థమపి చర్ధిరోగహరణాం॥**

పేలాలపిండి పంచదార, యాలకులు, దాల్చినచెక్క, ఆకుపత్రి చూర్ణం వెలగ పండు చర్ధివ్యాధి హరములు.

వాతవిధ్వంసి, ఖజ్జలివాత రాక్షసం,పైత్యామృతం, జంబీరమురబ్బా వాతమునకు తీపి, పులుపు తైలద్రవ్యములచేతను, పిత్తచర్ధి వ్యాధులకు వగరు, తీపి, చేదు రసముల చేతను హరింప చేయవలయును.

**యోషాపస్మారే (హిస్టీరియా)** : రసరాజరసం, అంకోలాది కల్పం

**శూలే : హింగు (యింగువ) కరంజ (గానుగ) శూలహరములు.**

కుబేరాక్షాది వటి, లంఘన, వమన, స్వేదకర్మలు, పాచనౌషధములు, లఘు గుణము గల అన్నములు శూల హరములు.

**సుఖరోగము :**

చోపచీనీ (ఫిరంగిచెక్క) సారిభా (సుగంధి) కుమారి (కలబంద) వ్యాధిహరములు **ఔషదములు** : చంద్ర ప్రభావటి, పూయమేహాంతకవటి.

**చర్మరోగాలు**

**దూర్వాభయా, సైంధవంచ కాసమర్థ । కతేరక ః**

గరిక, కరక్కాయలు, సైంధవలవణము, తగరిస విత్తులు, అడవితులసి యీ వస్తువులు చర్మరోగహరములు.

**విషరోగే :**

**శిరీషో విషయ్నానాం**

**దిర్శినచెట్టు యొక్క పంచాంగములు సర్వరోగములను హరించును.**

**హిక్కారోగం** : జతుర సైర్హి ధ్మాసు

యెక్కిళ్లు రోగమునందు లక్కచూర్ణం నస్యం చేయవలెను.

**భేధియోగే :** త్రివృత్ సుఖవిరేచన । తెగడ సాధువిరేచనౌషదము

1. అభ్యంగో వాతనాశాయ
2. పిత్తనాశాయ భోజనం
3. శ్లేష్మనాశాయ సంగమం
4. వ్యాయామః కఫనాశాయ
5. జ్వర నాశాయ లంఘనం
6. బోధహీనం యధాశాస్త్రం
7. భోజనం లవణం వినా
8. పతిహీనం యధానారీ
9. తధా నాడీ వినాభిషక్
10. అన్నం వృత్థి కరాణాం శ్రేష్టం
11. ఉదక మా శ్వాస (శ్రమ) కారాశాం
12. క్షీరం జీవనీయా (బలము) నాం
13. మాంసం బృంహణీయానాం

14. లవణ మన్నుద్రవ్య రుచికరాణాం
15. ఆమ్లం హృద్యానాం
16. కుక్కుటో (కోడిగుడ్డు) బల్యానాం
17. ఖదిరః (చంద్ర) కుష్టఘ్నానాం
18. వస్తిర్వాత హరాణాం
19. విరేచనం పిత్త హరాణాం
20. వమనం శ్లేష్మ హరాణాం
21. తైలంవాత శ్లేష్మ హరాణాం
22. సర్పిర్వాత పిత్త ప్రశమనానాం
23. మధు(తేనె) శ్లేష్మపిత్త ప్రశమనానాం
24. మహిష (బఱ్ఱె) క్షీరం స్వప్న జనానాం
25. అజాక్షీరం సంగ్రాహికశోష (క్షయ) ఘ్నానానాం
26. వృద్ధోవ్యాప్యానాం
27. తద్విద్య సంభాషాబుద్ధి వర్ధనానాం
28. నవాతేనవి నాశూలం, నకండూశ్లేష్మణావినా
29. నపిత్తేన వినాచర్ధిః। నాజీర్ణేన వినాజ్వరః
30. ఇక్షు (చెరకు) ర్మూత్ర జననానాం।
31. ఉద్ధాలకాన్నం (కొఱ్ఱలు) విరూక్షణీయానాం।
32. శయనం పిత్త నాశాయ అజీర్ణే భోజనం విషం
33. అజీర్ణేలంఘనం హితం లంఘనం పరమోషధం
34. అన్నకాలేన భుంజానః క్షీయతే హస్యతే ధవా
35. మాషాః (మినుములు) శ్లేష్మ పిత్తజనానాం।
36. అమలకం (ఉసిరిక) వయః స్థాపనానాం
37. కాలభోజన మారోగ్య కరాణాం, మలజారీరోగహారీ
38. విడఙ్గం (వాయువిడంగాలు) క్రిమిఘ్నానాం
39. రాస్నా (సన్నరాస్నము) వాతఘ్నానాం.

## ఋతు చర్య

సూర్యచంద్రులకును భూమికిని గల సంబంధము వలన వానివాని గతి విశేషములను బట్టియు, వాయు సంచారమునుబట్టియు, శీతోష్ణవర్షముల సంబంధము భూమికి కల్గును. దానిబట్టి కొన్ని కొన్ని దినములకు కొన్ని కొన్ని లక్షణములు వేరుగా నేర్పడు చుండును. కాబట్టి సంవత్సరమునకు రెండు ఆయనములుగాను, మూడు కాలములుగాను, ఆరు ఋతువులుగాను, ఏర్పడుచుండును. ఆయనములు రెంటిలో (ఉత్తరాయణ దక్షిణాయములలో) ఉత్తరాయణము నందు భూమికి సూర్యుడు ఉత్తరపరిధి రేఖలో నుండినందున సూర్యతాపము అధికముగా భూమికి కలుగు చుండును. దక్షిణాయము నందు సూర్యుడు భూమికి దక్షిణపరిధి రేఖయందుండు నందున తాపము స్వల్పముగా భూమికి కలుగుచుండును.

అందువలన ఉత్తరాయణములో సూర్య తాపము ఎక్కువగుటచే అది భూమి యందలి నీటిభాగమును, ఎక్కువగా లాగికొనును. దానిని బట్టి ఆ కాలమున కారు కాలమని పేరు కల్గినది. దక్షిణాయనములో సూర్యతాపము తక్కువగుటచే భూమి యందలి నీటి భాగమును లాగికొనకుండుటయే గాక సూర్యకిరణములోనికి చేరి జలము తిరిగి భూమిపై వర్ష రూపముగాను, మంచు రూపముగాను, పడుచుండుట వలన భూమి యందలి జలభాగము నధికము చేయును. దానివలన నా కాలమునకు విసర్గ కాలమని పేరు కల్గినది.( ఈ కాల విభాగము, ఋతువిభాగములును భారత దేశమునకు వర్తించినట్లితర దేశములకు వర్తింపవు.)

ఇట్టి ఆయనములలోనుండు దినములకు మూడేసి ఋతువులుగా భాగం ఆయా ఋతువులందు నడుచుకొనవలసిన విధులీయధ్యాయములో వివరింపబడును.

### ఋతు స్వరూపము

ఋతు అను పదము,శీతోష్ణములు, వాయువు, వర్షము, ఇవి ప్రత్యేకముగా వేరు వేరు తీరులుగా నేర్పడుచుండు కాలమునకు పేరు. ఋతువులారు. ముప్పది రోజులు లొకమాసమై అట్టి మాసమలు రెండేసి చేరి ఒక్కక్క ఋతువగును. ఈ ఋతువులు ఉత్తరాయణము మొదటినుండి ప్రారంభించి లెక్కింపబడును. కాబట్టి మాఘమాసము మొదలు రెండేసి మాసము లొక ఋతువులుగా నుండును. వానిలో మాఘ మాసములు

శశిర ఋతువు, చైత్ర-వైశాఖ మాసములు వసంత ఋతువు, ఆషాఢమాసములు గ్రీష్మ ఋతువు శ్రావణ-భాద్రపద మాసములు వర్షఋతువు ఆశ్వీయుజ-కార్తీక మాసములు శరదృతువు, మార్గశిర-పుష్యమాసములు హేమంత ఋతువులు అని తెలియవలెను.

శార్ఙ్గధర సంహితా కారుడు శిశిరఋతువును వదలివేసెను. వర్షఋతువునకు పూర్వము ప్రావృడృతువను మరియొక ఋతువును చేర్చెను. ఆ మతములో వసంత గ్రీష్మ, ప్రావృట్, వర్ష, శరత్, హేమంత ఋతువులని ఆ ఋతువులు వరుసగా ఉత్తరాయణము మొదలుకొని లెక్కింపబడును. మొదటి మతము ననుసరించి శిశర - వసంత, గ్రీష్మ, ఋతువులు ఆదాన కాలమనియు వర్ష, శరత్, హేమంత ఋతువులు విసర్గకాలమనియు తెలియవలెను.

సుశ్రుతాచార్యుడు పై రెండు మతములను గూడ తీసికొని ఆయనములుగా విభాగించుకొనుటకు మాత్రము మొదటి ఋతుక్రమము సరిపడుననియు, రెండవ మతమే రసోత్పత్తికిని, ఓషధీ ప్రాదుర్భావమున కును, వృద్ధి-పరిణామము, అనువానికిని సంబంధించినవియనియు చెప్పెను. మరియు నోషధీ ప్రాదుర్భావము నకు ముఖ్య మగు రీతిని వర్షఋతువు మొదలుకొని ఋతువులు లెక్కించుచు భాద్రపద-ఆశ్వీయుజ మాసములు వర్షఋతువు. కార్తీక-మార్గశిర మాసములు శరదృతువు, పుష్య-మాఘ మాసములు హేమంత ఋతువు, ఫాల్గుణ-చైత్ర మాసములు వసంతఋతువు, వైశాఖ-జ్యేష్ఠ మాసములు గ్రీష్మ ఋతువు, ఆషాఢ-శ్రావణ మాసములు ప్రావృడృతువు అని చెప్పియుండెను.

**ఋతు స్వభావములు**

పైన చెప్పబడిన ఋతువులారును మూడు కాలములుగా భాగింపబడి శీత కాలము, (వేసవి) ఉష్ణ కాలము, వర్షకాలము అని వాని వేరు వేరు లక్షణములను బట్టి పేరులు పెట్టబడినవి, నాలుగేసి మాసములొక కాలముగా నుండును. అయితే హేమంత ఋతువులో తుదినుండు మాఘమాసము ఉత్తరాయణములో మొదటిసారిగా ప్రావృదృతువులో తుదినుండు శ్రావణమాసము దక్షిణాయనములో మొదటిగాను పరిగణింపబడుటయు కలదు. విసర్గ కాలమనబడు మూడు ఋతువులందును, సోముడు (జలభాగము) ఉత్తరోత్తరముగా భూమిలో బలపడును. కాబట్టి జల భాగము ముఖ్యముగా గల ఆమ్ల, మధురసములు

వరుసగా బలవంతమగును. ప్రాణులకు క్రమముగా బలమభివృద్ధి నందుచుండును. ఇటులనే ఆదాన కాలమనబడు మూడు ఋతువు లందును సూర్యుడు (తేజోభాగము) ఉత్తరోత్తమరముగా భూమిలో బలపడును. కాబట్టి తేజోభాగము, వాయుభాగము, అధికముగా గల తిక్త, కటు, కషాయరసములు వరుసగా బలవంతములగును. ప్రాణులకు క్రమముగా బలము క్షీణించుచుండును.

## హేమంత ఋతుచర్య

హేమంత ఋతువునందు బాహ్యా ప్రదేశమునందు మంచు మొదలగువానిచే శైత్యముఎక్కువగా నుండును. కాబట్టి శరీరములోనుండి రోమకూపముల ద్వారా వచ్చెడి జఠరాగ్ని యొక్క వేడి అడ్డబడి తిరిగి లోపలకు పోయి జఠరాగ్ని నెక్కువగా బలపరచును. కాబట్టి జఠరాగ్ని తీక్ష్ణముగా నుండును. ఈ విధముగా జఠరాగ్ని తీక్ష్ణముగా నుండుట వలన జలభూత ప్రధానములగు మధుర, ఆమ్ల, లవణ రసములు ప్రధానముగా గల ఆహారమును భుజింపవలెను. లేనిచో తీక్ష్ణమగు జఠరాగ్ని ఆహార మును శీఘ్రముగా పచింపజేసి శరీరమును క్షీణింపచేసి ఆరోగ్యమునకు హేతువగు బలమును నశింప చేయును.

## ప్రాతర్భోజనము

హేమంత ఋతువునందు రాత్రులు హెచ్చుగా నుండుటవలనను, జఠరాగ్ని తీక్ష్ణముగా నుండుటవలనను, ప్రాతఃకాలమునందే మొదటి భోజనము చేయవలయును, అనగా దినచర్యలో చెప్పబడిన ప్రకారము రెండవ యామము వరకు నిరీక్షింపనక్కరలేదని తాత్పర్యము. అయితే ఇట్టి భోజనము చక్కని ఆకలి కలుగుటను గుర్తించి చేయుటయు, ఆవశ్యముగా భోజనమునకు ముందు చేయదగిన దంతధావనము మొదలు స్నానము వరకు గల కృత్యములను త్వరలో చేసికొనియే భోజనమనకు సిద్ధపడుటయు, ముఖ్యమైనవిగా గ్రహింపవలయును మరియు సద్వృత్తములో నిషేధింపబడిన సంధ్యా భోజనమును చేయరాదు కాబట్టి సూర్యోదయమైన రెండుగడియల తరువాతనే భోజనం చేయవలెను.

## తైల మర్దనాదులు

భోజనమును మాత్రానుసారముగా చేసి విశ్రాంతి తీసికొనిన తరువాత జీర్ణ ముఖము నందు పూర్వ యామము మించకుండ వాతహరములగు బలాతైలము మొదలగు వానితో శిరస్సునకు, శరీరమునకు అభ్యంగము

చేసికొని మర్ధించు కొనవలెను. పిమ్మట తనతో సమానబలము కలవారితో అను వెరిగి చిన్న చిన్న కుస్తీపట్లు పట్టుటయు, శరీరమునకు సుఖకరముగా నుండునట్లు, ఇంకొకరి చేతను శరీరము నందు పాదములకు మెల్లగా త్రొక్కించు కొనుటయు చేయవలెను. పిమ్మట వగరు రుచికల తుమ్మ మర్రి మొదలగు చెట్లపట్టల కషాయముతో (స్నానకషాయము) సుఖోష్ణముగ నుండునట్లు శరీరమునందు బోసికోని జిడ్డు కొంచెము పోవునట్లు తోమి కడుగుకొనవలెను. అట్లు స్నానముచేసిన తరువాత కుంకుమపూవు, అగరు, వీనితో తీయబడు గంధమును శరీరమునకు లేపనము చేసికొనవలెను.

## భోజన పదార్థములు

ఈ ఋతువునందు భోజనములో స్నిగ్ధమధికముగా గల్గి గురుగుణము, అభిష్యంది గుణము, కల పదార్థములను మాత్రానుసారముగా భుజింపవలెను. దీని వలన జాఠరాగ్ని యందలి తీక్ష్ణతకొంత తగ్గి పిత్తోద్రేకమును కల్గింపకుండును. దాని వలన విదగ్ధాజీర్ణము మొదలైనవి కల్గవు. అని గ్రహింపవలెను.

సామాన్యముగా భారతీయుల యాచారము ఈ యారోగ్య విధుల కనుకూల ముగా నున్నదని తెలియుచున్నది. హేమంత ఋతువునందు ధనూరాశిలో సూర్యుడు ప్రవేశించినది మొదలుకొని తెల్లవారు జామునే లేచి కాలకృత్యములు, స్నానము, దైవపూజ మొదలైనవి చేసికొని, తీపి, పులుపు, ఉప్పురుచులు కల్గి ఎక్కువజిడ్డు గుర్వ భిష్యంది గుణములు కల చిత్రాన్నము (శక్కరపొంగలి) పులిహోర, దధ్యోదనము మొదలగునవి) లను ప్రాతః కాలమునందు భుజించు శ్రీ వైష్ణవాచారము ఇందుల కనుకూలముగా నున్నదని యెంచవచ్చును. పూర్వాచారము వదలని వారు గూడ నీ ఋతువులో నీ యాచారమును పాటించుట కలదు.

## శౌచాది విధులు

మలాయవములను, కాలు చేతులు మొదలగు వానిని కడుగుకొనుటకు గోరు వెచ్చని నీటి ఉపయోగించుచుండవలెను. కూర్చుండుటకును, పరుండుటకును, కప్పుకొనుటకును మెత్తని దుప్పట్లు, మృగచర్మములు, పట్టువస్త్రములు, తివాసులు, ఉన్ని దుప్పట్లు, వీని నుపయోగించు చుండవలెను. తిరుగాడునప్పుడు శరీరము నంద తటను కప్పుకొనియు, పాదములకు జోడు తొడుగుకొనియు, సంచరించవలెను. దీనివలన

మంచుపడి శరీరము, పాదములు, పగులకుండును. ఎక్కువ కాకుండా సూర్యకిరణములను గాని, వాని వేడినిగాని యుక్తిగా శరీరమునకు సోకించుట శ్రేష్ఠము. అనగా శరీరములో శీతముచేత కల్గు వాతోద్రేకమును పోగొట్టుటకు ఎండచే యుక్తిగా స్వేదనము మంచిదని భావము.

## స్త్రీ సంగమము

మనుజులకు, భోజనము, నిద్ర, యెట్లు కోరబడినవో అట్లే స్త్రీ సంగమము (స్త్రీలకు పురుష సంగమము కోరబడును). ఇది శరీరములో తయారగు సప్తమధాతువు అగు శుక్రము (స్త్రీలకు కార్తవము) శరీరమున కావశ్యకమై యున్నది. అయితే సత్సంతానమునకు కారణముగాను,స్త్రీ పురుషుల యానంద హేతువుగాను ఉపయోగ పడవలెనని తలచి, దానికి కొన్ని నియమములను పెద్దలేర్పరచి యుండిరి. అదియే సకాలమందలి సంగమము.

ఈ ఋతువునందు సప్తమధాతువు బాగుగా పోషింపబడును. కాబట్టి తన శరీరబలమును బట్టి వాజీకరణ పద్ధతుల నవలంబించువారలు ప్రతి దినమును స్త్రీ సంగమమును చేయవచ్చును. దీనివల్ల ధాతుక్షైణ్యము సంభవించదు.

## నివాసము

ఈ ఋతువునందు శీతమధికముగా నుండును. కాబట్టి నిప్పు మొదలగువానిచే వేడెక్కించబడిన (అనగా ప్రక్కలను నిప్పులుంచి లోనికి వెచ్చదనము చేరునట్లు చేయబడిన) వెచ్చనిగదులలో నివాసము చేయుట ఈ ఋతువులో శ్రేష్ఠము. దీనివలన శీతబాధచే కల్గు రక్తము గడ్డకట్టుట లేకుండ నారోగ్యముగా నుండును.

## శిశిర ఋతుచర్య

శిశిరఋతువునందుగూడ నించుమించుగా హేమంత ఋతు లక్షణములే యుం డును. కావున యీ ఋతువునందు గూడ స్వల్పభేదములతో హేమంత ఋతువు నందు నడచువిధులనే ఆచరించవలసియుండును.

## వసంత ఋతు చర్య

హేమంత శిశిరఋతువులందు మధుర ఆమ్ల, లవణరసములు, గుర్వభిష్యంది గుణములు కల పదార్థములను సేవించుట వలన శ్లేష్మ

దోషము, చయము (స్వస్థములో పెరుగుట) నొంది వసంత ఋతువు ప్రారంభింపగనే సూర్యకిరణములలో వేడి ఎక్కువగా ఋతువులో వమన కర్మవలనను, లఘువుగాను, స్నిగ్ధత తక్కువగాను, ఉండు పదార్థములను భుజించుటవలన, శరీర వ్యాయామమువలనను కఫదోషమును పోగొట్టుకొనవలెను. శరీర వ్యాయామముతోబాటు ఉద్వర్తనము, ముష్టిఘాతనము (ఇతరులచే పిడికిలిచే మర్దించుకొనుట) లేక ఒడలు పట్టించుకొనుట అనువాని వలన గూడ శ్లేష్మము శరీరములో నుద్రేకించి నూష్మచే నింకింపచేయబడును.

## అనులేపనము

ఈ ఋతువులో సూర్యునిలో వేడిమి కొంత హెచ్చగును. కాబట్టి శరీరమా యెండను భరింపజాలదు. అందువలన స్నానానంతరము, అగరు, కుంకుమ పూవు లతో బాటు పచ్చకర్పూరమునుగూడ కలిపి శరీరమునకు పూసికొనవలెను.

## భోజనము

జఠరాగ్ని యొక్క తీక్ష్ణతకొంత తగ్గియుండును. కావున లఘువైన పాత బియ్యము, యవలు, గోధుమలు, వీనితో చేయబడిన తేలికైన అన్నము, తేనె, మామిడిపండ్లు, మొదలగు మధురములును, కఫ హరములునగు ద్రవ్యములను, జాంగల జంతువుల మాంసమును, శూలమునగ్రుచ్చి, నిప్పు సెగను బెట్టి కాల్చి దానిని భుజింపవలెను.

## పానము

త్రాగుటకు ఆ యా శరీర ప్రకృతుల ననుసరించి శొంఠితో కాచబడిన నట్టిగాని వేగిస, చంద్ర మొదలగు చేపలువేసి కాచబడినట్టిగాని, తేనెతో చేర్చినట్టిగాని, తుంగ ముస్తలతో కాచినట్టిగాని నీటిని త్రాగవలయును.

## విహారము

ఈ ఋతువులో మధ్యాహ్నమునకు తరువాత చల్లనిగాలినీరు స్థలమునందు నివాస మేర్పరచుకొని విశ్రమింపవలెను. దీనివలన సూర్యుని యెండ వేడి తాకినందు వలన కల్గుబడలిక యుండదు. గ్రామముల ప్రాంత భాగములందు, నీటివాగులు పారెడి పార్శ్వములు కల తోటలలో సాయంకాలము తిరుగవలయును. తన కత్యంత స్నేహితులు, తనతో సమానమైన యీడుగలవారు అగువారితో సుఖముగా మాటలాడు కొనుచు,

తను కనువగు ప్రియరాంద్రతో సరస సల్లాపములాడుకొనుచు కాలమును గడుపవలెను.

## మైధునము

రాత్రులందు శరీరమును కామేచ్చనుబట్టి మూడేసి దినముల కొకమారు స్త్రీ సంగమ మొనరింపవచ్చును. కాని ప్రతి దినముకూడదు. అట్లు ప్రతిదినము సంగమ మొనరించినచో కాల స్వభావమునుబట్టి కఫహర ఆహార విహారమునుబట్టి, శరీరము లఘువైయుండుట వలన వాత ముద్రేకించి అనేక రోగములను కల్గించును.

మరియు ప్రకోపించియుండిన శ్లేష్మమును, వమనాదుల వలన జయించియుండి నందు వలన, తిరిగి వెంటనే శ్లేష్మము నుద్రేకింపచేయు గురు శీత గుణములు కలవియు, మధుర రసమెక్కువగా నుండునట్టియు, జిడ్డు ఎక్కువగానుండునట్టియు, పదార్థముల నీ ఋతువులో సేవించరాదు. పగటియందు నిద్రించుటకూడదు.

## గ్రీష్మ ఋతుచర్య

గ్రీష్మ ఋతువునందు సూర్యకిరణములు మిక్కిలి తీక్షణముగానుండి భూగతమైన జలమును ఆకర్షించుచుండుట వలన జలప్రాధాన్యముకల శ్లేష్మము, పూర్తిగా నింకి పోవును. దానివలన స్వాభావికముగానే వాతముద్రేకింపవచ్చును. అందువలన నీ ఋతువులో ఉప్పు, కారము, పులుపు రుచులుగల పదార్థములను వర్జింపవలయును. మధుర పదార్థమునే వాడవలయును.

## స్నానము

చల్లగానుండు నీటిలో మునిగి స్నానమాచరింపవలయును. ఈ కాలములో ఆకాశమునందు మేఘముల యావరణము లేకుండుటవలన, సూర్యసంచారము మధ్యపరిధిలో జరుగుటవలనను, సూర్యునివేడి యధికమగును. దిక్కులు సూర్యుని వేడిమిచేత వెలుగుచుండును. గాలులు వేడిగా వీచుచుండును. జంతువులన్నియు ఆ వేడికి తట్టుకొనజాలక నీటి ప్రాంతములలో చేరి అదివరకే ఎండిపోయియుండిన చెరువులను కలుషపరచును. చెట్లు అన్నియు ఆకురాలి నీడనివ్వజాలకుండును. ఈ కాలములో పై కారణములనుబట్టి నీటికుండ్లలో నూతులలోని చల్లనినీటిని నింపి దానియందవగాహన స్నానము నాచరింపవలయును.

## భోజనము - సక్తుపానము - మద్యపాన నిషేధము

ఈ ఋతువులో మధురమైన యాహారమును సేవింపవలయును. ఇంకను ఆహారము లఘువుగాను, స్నిగ్ధముగాను, చల్లనిదిగాను ఎక్కువ ద్రవప్రాయముగాను అయి యుండవలయును.

వేపుడు చేసిన బియ్యము విసరిచేసిన పిండి (సత్తుపిండి)ని ద్రవముగా నీటితో కలిపి అందు పంచదారచేర్చి దానిని త్రాగవలయును. ఇది యీ ఋతువునకనుకూల మగునన్ని గుణములు కలిగియుండును. మద్యమును దేనిని యీ ఋతువులో పానము చేయరాదు. మద్యము యొక్క వస్తుస్వభావమునుబట్టి శరీరములోని ద్రవధాతువు లెండింపబడి లోపల మంటకల్గును. మద్యమలవాటుగానుండి దాని త్రాగక నిలవలేని వారు స్వల్పముగా త్రాగుట మంచిది. పూర్తిగా మానినచో వారికి వికారముకల్గి బాధ కల్గింప వచ్చును.

### ఉదక పానము

మంచి పరిమళముకల్గి మధురముగాను ద్రవ ప్రాయముగాను వుండు భోజన మునుచేసి పచ్చకర్పూరము, పొదిలిపూవులు వీనిని వైచి మంచి సువాసన కల్గించిన జలమును చల్లని దానిని త్రాగవలెను.

### రాత్రి కృత్యము

రాత్రియందు చక్కెర చేర్చినట్టియు, కాచి చల్లార్చినట్టియు, గేదెపాలను, త్రాగ వలయును. దీని వలన శుష్కించిన ద్రవ ధాతువులు తిరిగి బలపడి సుఖముగా నిద్రపట్టును.

ఈ ఋతువులో చల్లని యాసనములు, పక్కలు, పగటివేళ గృహములలో భాగములలోను, రాత్రులందు చంద్రకిరణములు తగులుచుండు, ఆరుబయట ప్రదేశములలోను పండుకొనుట ఇవి సుఖకరములు.

### మైధునము

గ్రీష్మరుతువునందు మైధునము పూర్తిగా మానవలెను. ఇక స్త్రీలయొక్క చల్లని అవయవములను ఆనుకొని కౌగలించుకొని పరుండుట మాత్రము హితము.

## పగటినిద్ర

ఈ ఋతువులో పగటికాలమందు మధ్యాహ్న కాలము నొక ముహూర్త కాలము నిద్రపోవచ్చును. మిగిలిన యే ఋతువునందును పగటినిద్ర హితకరము కాజాలదు. కారణమేమనగా, ఈ ఋతువులో రాత్రులు చాల తగ్గియుండుటచే శరీరారోగ్యమున కవసరమైనంత నిద్రపోవుటకు వేళచాలదు. సూర్యోదయమునకు ముందుగనే నిద్ర లేవవలసిన, ఆవశ్యకతయుండుటచే, ఆ లోటు తీరుటకు పగలు నిద్రించవచ్చును. మరియు, నీ ఋతువునందు నిశ్శేషముగా శ్లేష్మ మింకిపోవుట వలన వాతదోషము ప్రకోపించకుండ పగలు నిద్రించవలయును. మిగిలిన ఋతువులలో తప్పనిసరిగా రాత్రి మేల్కొనినప్పుడు తప్ప మరియొకప్పుడు పగలునిద్రింపరాదు.

## వర్ష ఋతు చర్య

గ్రీష్మ ఋతువునందలి శీతలోపచారము వలన వర్షఋతు ప్రారంభమైన పిదప జఠరాగ్ని మందమై, కాల స్వభావముచే ప్రకోపించెడి త్రిదోషముల వలనను, దూషింపబడి మందమై మరియు తగ్గిపోవును. కాబట్టి ఈ ఋతువునందు జఠరాగ్నిని వృద్ధిచేయు నౌషధములను, ఆహారములను సేవించి అగ్ని బలమును కల్గించు కొనవలెను.

## వస్తికర్మా వశ్యకత

ఈ ఋతువులో నుద్రేకించిన త్రిదోషములను జయించుటకు వమనవిరేచనాది ప్రత్యేక శోధనకర్మల నాచరింపరాదు. శరీరబలమును సంరక్షించుచు త్రిదోషములు యుద్రేకమును తొలగించగల వస్తికర్మను చేసికొని కోష్ఠగత దోషములను శోధించు కొనవలెను.

## భోజనము

తేలికైై కొంచెము జిడ్డు కలిగి పులుపు, ఉప్పురుచులుగల పదార్థములను భుజించుచుండవలెను. అందువలన వర్ష ఋతువునందు ప్రకోపించిన వాత శ్లేష్మ దోషములు శమించును.

## పానము

ఈ ఋతువులో నారుబైట శుద్ధమైన వెడల్పు పాత్రలనుంచి పట్టబడిన వర్షపు నీరునుగాని అది లభింపనపుడు కాచిన నీరునుగాని, నూతులలోని నీరునుగాని త్రాగు చుండవలెను.

వర్షఋతువునందు నదులు, చెరువులు, మొదలైనవి క్రొత్త నీటితో నిండి కలుషితముగాను, మట్టికలసినవిగాను వుండును. కాబట్టి వానిని కాచనిదే త్రాగరాదు. లేక ఇందుపు (చిల్ల) గింజ నరగదీసిన, గంధమును కలిపి తేర్చి వడియగట్టియైనను త్రాగవలయును.

## పర్యటనము

ఈ ఋతువులో కాలినడకను సంచరించక ఏదైనా యావసాధనములో తిరుగ వలయును. లేనియెడల వర్షముతో తడిసిన నేలయందలి మలిన పదార్థములు కాలికి శరీరమునకు తాకినందువలన అనేక రోగములు కలుగవచ్చును.

## నివాసము

ఈ ఋతువులో ఆవిరి లేనట్టియు, నీటి తుంపురులు పడనట్టియు గృహములో నెల్లపుడు నివసించుచుండవలయును. అట్లు కానిచో శ్వాసము మొదలైన వాని ద్వారా నీటి తుంపురులు ఆవిరిపోయి శ్లేష్మము నుద్రేకింప చేయును.

## వర్జింపదగినవి

వర్షఋతువులో, నదీజలము, నీటితోచేర్చి నేయి కలిపిన పేలాలపిండి, పగటి నిద్ర, శరీరము అలయుపనులు, ఎండలోదిరుగుట, వీనిని వర్జింపవలయును. అట్లు వర్జింపనిచో వాతాది దోషములు వెంటనే యుద్రేకించి బాధించును.

## మైధునము

ఈ ఋతువులో శరీరమునుబట్టి కామేచ్ఛనుబట్టి మూడేసి దినముల కొకమారు మైధునము చేయవచ్చును.

## శరదృతు చర్య

వర్ష ఋతువునందు వర్షముల వలన చెత్త క్రుళ్ళి ఆమ్లమము (పులుపు రసము) కలవిగాని మారినందున ఆ యెరువుల వలన పెరిగి, కాచిన కూరలు మొదలగు వానిలో ఆమ్లరసము గూఢముగా చేరియుండినందు వలన వాని ఉపయోగించుట చేతను, నీటి తుంపురులతో గూడిన వీచినగాలులు, అట్టి యావిరితో కూడినయెండ, వీని స్పర్శచేతను, పిత్తదోషము శరదృతువు వచ్చునప్పటికి ప్రకోపించును. అట్టి పిత్త

ప్రకోపమును పోగొట్టుటకై చేదు రుచులు గల విరేచన ద్రవ్యములతో వండబడిన ఘృతమును పానముచేసి విరేచనము చేసికొనవలెను.

## భోజనము

శరదృతువులో పిత్తమును శమింపజేయు, తీపు, వగరు, చేదు రుచులు కలిగి లఘువుగా నుండు నాహారమును భుజింపవలెను.

## హంసోదకపానము

పగలు సూర్యకిరణములచే వేడెక్కి, రాత్రి చంద్రకిరణములచే చల్లబడి అగస్త్య నక్షత్రము (ఈ నక్షత్రము దక్షిణ దిక్కున శరత్కాలయందు కన్పడును.) యొక్క కిరణముల వలన విషపదార్థముల సంబంధము వేరుపరచబడిన నీరు హంసోదక మనబడును. దీనిని సూర్యోదయమునకు పూర్వమే మంచి పాత్రలో సంగ్రహించి యీ ఋతువునందు త్రాగుట కుపయోగించవలయును.

## అనులేపనము

ఈ ఋతువులో కూడ సూర్యునివేడి తగ్గియుండదు. కాబట్టి వట్టివేరు, పచ్చ కర్పూరము చేర్చి సిద్ధము చేయబడిన చందనమును శరీరమునకు పూసికొనుచుండ వలెను. చల్లని ముత్యాలహారములు, పువ్వులమాలికలు, ధరించి రాత్రి మొదటి భాగమునందు చంద్ర కిరణములను సేవించుట గూడ శ్రేష్టమై యుండును.

## వర్జింపదగినవి

శరదృతువునందు సూర్యకిరణములచే నాకర్షింపబడిన నీరు రాత్రి పూట మధ్యనుండి తిరిగి భూమిపై రాలుచుండును. దీనినే మంచుగా వ్యవహరింతురు. దానిని శరీరమునకు సోకనివ్వరాదు. కాబట్టి రాత్రి మీరినంతనే బయటనుండి లోనికి పోవలయును. మంచు చల్లని స్పర్శకలదైనను, అందు సూర్యకిరణముల తీక్ష్ణత్వము ఇమిడి యుండుటవలన పిత్తము నుద్రేకింపజేయునని కనుగొనబడినది. కాబట్టి దానిని తాకనివ్వరాదు.

మరియు యవక్షారము మొదలగు క్షారవస్తువులు, పెరుగు, ఎక్కువగా నూనె, నెయ్యి, మొదలగు స్నేహద్రవ్యములు వీనిని వర్జింపవలెను. అధికముగా భుజింపరాదు. ఎండను సోకనివ్వరాదు. తీక్ష్ణ మద్యములను పానము చేయరాదు. పగలు నిద్రింప రాదు. తూర్పుగాలిని తాకనీయరాదు.

## మైధునము

శరీర బలమునుబట్టి, కామేచ్ఛనుబట్టి, మూడు రోజులకొక పర్యాయము మైధునము చేయవచ్చును. అంత కెక్కువ చేయరాదు.

## ఆయా ఋతువులలో సేవింపవలసిన రసములు

మధుర, ఆమ్ల, లవణ, కటు,తిక్త, కషాయరసములను ఆరురసములు ప్రధానములుగా నుండిన ప్రత్యేక పదార్థములతో హేమంత–శిశిర–వర్షఋతువులలో మధుర ఆమ్ల లవణరసములుగలవానిని ఎక్కువగా భుజింపవలెను. ఈ మొదటి రెండు ఋతువులలో జఠరాగ్ని తీక్ష్ణముగా నుండుటవలనను.

వర్షఋతువునందు బాహ్య ప్రదేశము వర్షమువలన చల్లబడుటచే గ్రీష్మములో క్రమముగా శాంతించిన జఠరాగ్ని క్రమముగా తేరు కొనుచుండుట చేతను, ఈ రసములను వాడుట అత్యవసరము అటులనే వసంత ఋతువు నందు కఫము ప్రకోపించియుండును. కాబట్టి దాని యందు కఫశమనము చేయగల కటు–తిక్త కషాయ రసములుగల పదార్థములను ఎక్కువగా భుజింపవలెను.

గ్రీష్మ ఋతువు నందు వాతము చయమునందుచుండును. కాబట్టి దానిని తగ్గించుటకు కేవలము మధురరసము కల పదార్థములను గ్రీష్మ ఋతువునందు భుజింపవలెను. కాల స్వభావమునుబట్టి అగ్ని గుణ భూయిష్టమగు నీ ఋతువులో ఆమ్ల లవణరసములు సరిపడవు.

శరదృతువు నందు పిత్తము ప్రకోపించి యుండును. కావున దానియందు పిత్తమును శమింపజేయు మధుర తిక్త కషాయ రసములను భుజింపవలెను. ఈ క్రింది విధముగా నాయారసములు ఆయా దోషములను ప్రకోపింజేయుట శమింపజేయుటయు నుండును. వానిని చూపెదము.

| దోషము | శమింపజేయురసములు | ప్రకోపింపజేయురసములు |
|---|---|---|
| శ్లేష్మము | కటు–తిక్త కషాయరసములు | మధుర–ఆమ్ల–లవణరసములు |
| పిత్తము | మధుర–తిక్త–కషాయరసములు | ఆమ్ల–లవణ–కటురసములు |
| వాతము | మధుర–ఆమ్ల–లవణరసములు | తిక్త–కటు–కషాయరసములు |

## ఆయా ఋతువులలో సేవింపదగిన పదార్థములు

కేవలము మధురాది రసములను బట్టియేగాక గురులఘ్వాది గుణములను బట్టి గూడ ఆయా పదార్థము ఆయా దోషములను తగ్గించుట కాయా ఋతువులందు సేవింపవలయును.

శరదృతువులనందును, వసంత ఋతువునందును, రూక్షగుణముకల పదార్థము లనే భోజన పానములలో నుపయోగింపవలయును.

గ్రీష్మ శరదృతువులలో శీతగుణ ముకలవి ఉపయోగించ వలయును.

హేమంత, శిశిర, వసంత, వర్షఋతువులందు స్నిగ్ధ గుణముకలవి ఉపయోగించవలయును. హేమంత, శిశిర, వసంత, వర్ష ఋతువు లలో ఉష్ణగుణముకల పదార్థముల ఉపయోగింపవలయును. ఈ క్రింది వాని వివరము లను తెలియ చేయుచున్నాము.

| ఋతువులు | సేవింపవలసిన పదార్థములగుణములు | వాని వివరణము |
|---|---|---|
| హేమంతము | స్నిగ్ధ-ఉష్ణగుణములు | జిడ్డు-వేడి |
| శిశిరము | స్నిగ్ధ-ఉష్ణగుణములు | జిడ్డు-వేడి |
| వసంతము | రూక్ష-ఉష్ణగుణములు | జిడ్డులేకుండుట-వేడి |
| గ్రీష్మము | స్నిగ్ధ-శీతగుణములు | జిడ్డు-చలువ |
| వర్షము | స్నిగ్ధ - ఉష్ణ గుణములు | జిడ్డు - వేడి |
| శరత్తు | రూక్ష-శీతగుణములు | జిడ్డులేకుండుట-చలువ |

ప్రతి ఋతువునందు ఆరురుచులు గలిగియుండు పదార్థములను ఉపయోగించు చుండినను ఆయా ఋతువులలో నాయారుచు లెక్కువగా గల పదార్థములనుపయోగించుకొనవలెను. మిగిలిన రసములను స్వల్పముగా ఉపయోగించుట తప్పుకాదు.

## ఋతుసంధి కర్తవ్యము

ప్రతి ఋతువు మారునపుడు గడచిన ఋతువునందేడు రోజులును, రాబోవు ఋతువునందు ఏడు దినములును ఋతుసంధి యనబడును, ఆదినములలో క్రమ ముగా నా ఋతువునందు అభ్యాసము పడిన ఆహారాదులను తగ్గించుచు క్రొత్త ఋతువు నందలి మొదటి యేడు దినములలో క్రమముగా నా ఋతువునందభ్యసింప వలసిన ఆహారాదులనలవాటు చేసికొనవలెను. అట్లుకాక ఒక్కమారుగా మార్పుచేసి నందు వలన దోషము లెక్కువ తక్కువలనొంది రోగములను కల్గింపవచ్చును.

## పర్యవసానము

లోకములోనుండు మనుజులు ధనికులు, మధ్యసంసారులు, దరిద్రులు అని మూడు తెగలుగా నుండుట సహజము, ఇది భగవన్నియమిత మగు విధి. దీనిని తప్పించుటకు బ్రహ్మకైనను తరముకాదు. అయితే ఇందు చెప్పబడిన దినచర్య ఋతు చర్యలకు సంబంధించిన ఆరోగ్యవిధులు, ధనికులకును, దరిద్రులకును, కాక మధ్య సంసారులకు సాధ్యమైనంత అనుకూలముగనే యున్నవి. ధనికుల కింకను అధిక మైన వైభవముతో కూడిన విధానములు ఆయుర్వేద శాస్త్రమునందు చెప్పబడి యున్నవి. అవి సామాన్య సంసారులు అనువర్తింపలేనివి.

ఇక దరిద్రులు ఇందుచెప్పిన వానిని గూడ అనువర్తింప జాలరు. కాని వారల కుండు ధనాభావము వలన స్వేచ్ఛా విహారములుజరుగవు. ఇంకను దైవ సంకల్పము వారిపట్ల కొంత సహకరించి ప్రకృతి వారికి ప్రతికూలముగా విక్రమింపదు. దాని వలన వారికి శరీరమునందలి దోష ధాతుమలములు హెచ్చు తగ్గుల నందుట కవ కాశముండదు. మరియు విషక్రిమిన్యాయము చొప్పున వారికాయా శీతోష్ణ భోజనోప నాసాదులు సాత్మించిపోవుటవలన గూడ వారిని రోగములు బాధింపలేవు. వచ్చినను త్వరలో నయమగును. ఇంకను ఆరోగ్య విధులలోని వివరములు ఆయుర్వేద సంహితల వలన తెలియనగును.

## సత్ప్రవర్తనకు సామాన్య సూత్రముల వివరణము

1. గ్రామమునకును, పట్టణమునకును, దేవాలయమునకును, శ్మశానమునకును నాల్గు దారులు కలయచోటునకు, చెరువులు మొదలగు నీటి యాధారములకు, రాచ బాటకు సమీపముగా మలమూత్రములను విసర్జించరాదు, ఉమియరాదు.

2. గాలికి, నిప్పునకు, నీటిధారకు, చంద్రసూర్యులకు, బ్రాహ్మణునికి, గురువునకు యెదురుగా ఉమ్మివేయుట, అపానవాయువును విడుచుట, మలమూత్రములను విడుచుట మొదలగునవి చేయరాదు.

3. బహిరంగముగా మూత్రములను విడువరాదు.

4. పెద్దల యెదుటను, శుభసమయములందును తుమ్మరాదు.

5. మురికి గుడ్డలు, ఎముకలు, ముళ్ళు, మురికి, చెత్త, క్షౌరపు వెంద్రుకలు, ఊక, బూడిద, స్నానము చేయు ప్రదేశము వీటిని త్రొక్కరాదు.

6. ఉతికి ఆరవేసినట్టియు, అదివరకు వాడనట్టియు వస్త్రములనే వాడవలయును.

7. తలయందలి వెంట్రుకల నెప్పుడు దువ్వుకొనవలెను.

8. రోజునకు రెండు పర్యాయములు స్నానము చేయవలెను.

9. పెద్దల నడవడి ననుసరించి డాంబికము లేని రీతిని వస్త్రములను ధరింప వలెను.

10. తలపైని, చెవుల యందు, ముక్కురంధ్రములందు, పాదములందు నూనెను పూసికొనుచుండవలెను.

11. కండ్లు, ముక్కు, చెవులు, నోరు, చంకలు, బొడ్డు, గుహ్యావయవములు గుదము, చేతులు, కాళ్ళు వీనిని పరిశుభ్రముగా కడుగుకొనవలయును.

12. పక్షమునకు (అధవా నెలకు) మూడు పర్యాయములు అయినను, శరీరము నందలి రోములను, తలయందలి వెంట్రుకలను, మీసము, గడ్డము, వీనిని క్షారము చేయించవలయును. గోళ్ళను పెరగనీయక, ఖండించుకొనుచుండవలయును.

13. ఇంటినుండి బయటికి వెడలునపుడు, గొడుగును, చేతికర్రను, కాలిజోడును మానక, ఉపయోగింపవలెను. రాత్రియందు సహాయముతో పోవవలెను. ఒంటరిగా పోరాదు.

14. దారిన నడచునపుడు ముందు రెండు గజముల దూరమువరకు చూపును పెట్టి నడువవలయును.

15. మంచి స్వభావము నలవరచు కొనవలెను.

16. మంచి పరిమళ ద్రవ్యములను శరీరమునకు వాడవలెను.

17. జూదము, త్రాగుడు, అన్యస్త్రీలు, వీనికి వశము కాకూడదు.

18. ఎప్పుడును సత్యమునే పల్కుచుండవలెను.

19. ఇతరులెవరైన పరుషవాక్యములు ఆడినచో వానిని సహించుట నేర్చుకొనవలెను.

20. కామమును (ప్రతిదానియందు కోరిక) అసూయను (ఇతరుల మేలు సహింప లేకుండుట) జయింపవలెను.

21. సర్వ ప్రాణులందును సోదర ప్రేమను కల్గియుండవలెను.

22. కోపిష్టులను రేకెత్తించక శమింప చేయవలెను.

23. భయపడిన వారిని ఓదార్పు మాటలతో ఆదరించవలెను.

24. కష్టములోనున్న వారికి, బాధలు పడుచున్న వారికి దయతో సహాయ పడవలెను.

25. తన కపకారము చేసిన వారికైనను, తిరిగి అపకారము చేయరాదు.

26. మితి మీర నవ్వుచుండరాదు.

27. ఆకలి కల్గినపుడు మితముగా హితమైన భోజనము చేయవలయును.

28. మలమూత్రాది వేగములు కల్గినపుడు వానిని విడువక ఇతర కార్యములను చేయరాదు.

29. సాధ్యమైన రోగము కల్గినపుడు ప్రతి క్రియ చేయక ఉపేక్షింపరాదు.

30. తన మేలుకోరు మిత్రులను చేరవలయును. అంతకు విపరీతమైన అబద్ధపు మిత్రులను చేరరాదు.

31. పదివిధములగు పాపములుచేయరాదు. 1 జీవహింస 2 చౌర్యము 3 అగమ్యాగమనము 4 కొండెములుచెప్పుట 5 క్రూరముగా మాటలాడుట 6 అబద్ధ మాడుట 7 పదిమంది పలుకులతో కలసి మాటలాడుట 8 పరులకు ద్రోహము తలంచుట 9 ఇతరుల మంచిగుణముల నోర్వకుండుట 10 ప్రతి మంచిపని యందు పాపపు తలంపు. ఇవి పది పాపములు వీనిలోమొదటి మూడును కాయక పాపములు, నాల్గు మొదలు 7 వరకు వాచిక పాపములు, 8 మొదలు 10 వరకు మానసిక పాపములు.

32. పరులను తనవలెనే చూచుకొనవలెను

33. దేవ గో బ్రాహ్మణ వృద్ధ వైద్య నృపాలులనెడి పూజ్య వర్గమును పూజించవలెను.

34. యాచించు వారిని తూలనాడి పంపరాదు.

35. శత్రువునకైనను ఉపకారము చేయవలయును.

36. పరుల యభివృద్ధినిచూచి యీర్ష్యపడరాదు. పరులాచరించు మంచి పనుల కంటె మంచి పనులను తాను చేయవలయునని

పోటీపడవచ్చును.

37. సమయము నెరిగి హితము, మితమునగు మాటల నాడవలెను. ఎదుటి వారి కంటె తానే ముందు నవ్వు ముఖముతో మాటలాడవలయును.

38. తనకు ఇట్టివాడు శత్రువనియు, తాను వానికి శత్రువుననియు, తన కవమానము కల్గినదనియు, తనయందు ప్రభువునకు ప్రేమ లేదనియు, ఎవ్వరితోను చెప్పరాదు.

39. ఇంద్రియముల నెక్కువ బంధించరాదు. ఎక్కువ స్వేచ్ఛ కల్పించి వదల రాదు.

40. ధర్మమునకు, అర్ధమునకు, కామమునకు, ఒకదానితో నొకదానికి విరోధము రాకుండ వానిని ఆదరింపవలయును.

41. నదిలో కేవలము చేతుల సహాయముతో నీదరాదు.

42. మండుచుండు ఇండ్లు మొదలగువాని అభిముఖముగా పరుగెత్తరాదు.

43. తూట్లుగల నావను, పెళుసు పుచ్చుగల చెట్టును ఎక్కరాదు.

44. దగ్గునపుడు, తుమ్మినపుడు, నవ్వునపుడు ఆవులించునపుడు నోటిని చేతితో గాని, గుడ్డతో గాని మూసికొనవలెను.

45. ముక్కునెపుడు చేతితో నొక్కుకొనుచుండరాదు.

46. కారణము లేకుండ వ్రేళ్ళతోడను, వ్రేలి గోళ్ళతోడను భూమిని గోకుచుండ రాదు.

47. ఎగుడు దిగుడు ఆసనములపై కూర్చుండరాదు.

48. గొంతుక కూర్చుండుట చాలసేపు చేయరాదు.

49. శరీరముచేతను, వాక్కుచేతను, మనస్సుచేతను చేయు శరీర పరిశ్రమలను (మాటలాడుట లేక చదువుట, ఆలోచించుట, వీనిని) శ్రమ కలుగుక ముందే మాన వలెను.

50. ఎట్టి అడ్డును పెట్టుకొనకుండ సూర్యుని చూడరాదు.

51. ఎక్కువ బరువును తలతో మోయరాదు.

52. ఎక్కువ దట్టమైనట్టియు, ఎక్కువ కాంతిగల్గినట్టియు, మిక్కిలి సూక్ష్మమైన ట్టియు, అసహ్యమును కల్గించునట్టియు, తనకు గిట్టనట్టియు వస్తువులను పరికించి చూడరాదు.

53. మద్యమును అమ్ముట, వండుట, త్రాగుట, వీనిని మానవలెను.

54. తుమ్ముట, త్రేన్పుట, దగ్గుట, నిద్రించుట, భుజించుట, మైధునము వీనిని వంకరగా తిరిగి చేయరాదు.

55. నీటియొడ్డు, చెట్లనీడను రాజు శత్రువు వీరి ప్రక్కను క్రూరజంతువుల ప్రక్కను, చెడు తలంపుగలవారివద్దను నివసించుటయు, తనకంటె నెక్కువ నేర్పు, బలము కలవారితో పోట్లాడుటయు కూడదు.

56. ప్రాతస్సాయంకాలముల సంధ్యలలో భోజనము, మైధునము,నిద్ర, చదువు, ఆలోచన వీనిని చేయరాదు.

57. శత్రువుల యింటను, సత్రములలోను, సంఘములలోను, సానిదాని యింటను, అన్నమును విక్రయించు శాలలోను భోజనము చేయరాదు.

58. శరీరభాగములో వాద్యమువలె కొట్టుట, నోటితో మద్దెల మొదలగు వాని శబ్దముల ననుకరించి చెప్పుట గోళ్ళతో వాయించుట చేయరాదు.

59. జుత్తు నెల్లప్పుడు చేతితో దులుపుచుండరాదు. చేతుల నాడించి దులుపుకొనుచుండరాదు.

60. నీటిప్రవాహము, నిప్పు, పూజ్యులైనవారు వీని మధ్యనుండి పోరాదు.

61. శవము దహించు పొగ శరీమున సోకించుకొనరాదు.

62. స్త్రీలతోనమ్మకముగా రహస్యముగా మాటలాడుట, వారి అధీనములో నుండుట చేయరాదు.

63. పరుల కార్యములను తన కార్యములుగా చూచుకొనవలయును.

64. లోకానుసరణము చేయవలయును.

65. ప్రతిరాత్రి గడచిన తన నడతను సింహావలోకనము చేసికొనవలెను.

పైన వివరించిన సూత్రములను ననుసరించి, హేతువాదమునకు తలపడక ఆచరణమును దిద్దుకొని నడచువారికి చక్కని ఆరోగ్యభాగ్యము కల్గుటయేగాక, లోక పూజ్యత సుఖహితాయువులు చేకూరుట తథ్యము.

## రోగచికిత్సలు
(Principles and methods of treatment)

చికిత్సాకౌశల్యము యుక్తిపై నాధారపడినది. 'నదోషైర్వినారోగాః' అనుట వల్ల వాతాది దోషములు వికారము చెంది రసరక్తాది ధాతువులను చెరచినప్పుడు వ్యాధి కలుగుచున్నది. సౌమ్యముగా దేహయంత్రపాలనము జేయుచున్న వాత, పిత్త కఫములు కొన్ని బాహ్యాభ్యంతర కారణముల వల్ల దూషింపబడుచున్నవి. ఈ బాహ్యాభ్యంతర కారణముల వల్ల దూషింపబడుచున్నవి. ఈ బాహ్యాభ్యంతర కారణములన్నిటిని శాస్త్రకారులు 'మిధ్యాహార విహారములను' పదములో నిమిడ్చినారు. పాశ్చాత్యులు వివరించిన వివిధ రోగహేతువులను పరికించినప్పుడు యివన్నియును మిధ్యాహార విహారములలో చేర గలవు. సూక్ష్మ క్రిములుగూడ నిందులో చేరును. గనుక రోగచికిత్సకు బూనుటకు ముందుగా మిధ్యాహార విహారములను తొలగించి దీనికి బదులుగా హితాహార విహారములను ప్రవేశపెట్టిరి. పిమ్మట రోగోపశమనమునకై ఔషధము నియ్యవలెను. హితాహార సేవనకు (ప్రోపర్‌డైట్) అనియును, హితవిహారమునకు (రెగ్యులేషన్ ఆఫ్ ఎన్విరాన్ మెంట్స్, హేబిట్స్ అండ్ నర్సింగ్ కాంజినల్ టువర్డ్స్ హెల్త్) అనియు అందుము. రోగ ప్రధాన హేతువులుగా ప్రకోపించిన వాతాదులన్నవి గనుక నివి ప్రకోపించకుండ సక్రమాహార విహారములను ముందుగా ఆయుర్వేదములో స్వస్థవృత్త ప్రకరణమున బోధించిరి. ఇందులోనే ఋతువులలోనే రసప్రధానమైన ఆహార పదార్థముల తీసికొన వలెనో, వ్యాయామ, పరిశ్రాంతులెంత వరకు అవసరమో వివరింపబడినవి. జనపద సాంక్రామిక వ్యాధులు, విజృంభించినప్పుడు వ్యాధి క్రిముల నెదిరించుటకు, క్రిమి నాశన ప్రయత్నముల కంటెను, మన శరీర శక్తులను (ఊర్జశక్తి) వృద్ధిచేసికొనుటకు మనవారు రసాయనౌషధ సేవనము, యోగవ్యాయామ పద్ధతులు, శౌచ, నియమబద్ధ జీవితమును బోధించిరి. వీని ద్వారా స్వాస్థ్య రక్షణము చేసికొనవచ్చును.

ఇక రోగచికిత్సల నాచరించుటకు ఆయుర్వేదశాస్త్రము ప్రకోపించిన త్రిదోషము లకు ప్రాధాన్యమిచ్చినది. శరీరము పాంచభౌతికము. శరీరమందలి పంచభూతాంశలు వృద్ధిక్షయములందినప్పుడు రోగములు

కలుగుచున్నవిగదా యీ పంచభూత జ్ఞానము వల్ల నేల చికిత్స చేయరాదు ? త్రిదోషములేల కల్పితమయినవనిన : సౌకర్యము కొరకే అని చెప్పవచ్చును. ఆహార సంబందమయిన పంచభూతాంశలే మన శరీరములో వాత, పిత్త, కఫములుగా నేర్పడుచున్నవి. ఈ ద్రవ్యముల యొక్క ప్రశమన, చయ ప్రకోప స్థితులను రోగలక్షణముల ద్వారా సులువుగా గుర్తించుటకు వీలగును. పంచ భూతాంశల వృద్ధిక్షయలను గుర్తించుట కష్టమయినపని. కొన్ని రోగములలో పంచభూత జ్ఞానమును కూడ అనుసరించుటకు వీలగును. ఉదాహరణకు పాండురోగమునకు లోహద్రవ్య చికిత్సను విచారింతము. ఆరోగ్యవంతుని రక్తములో పంచభూతాంశలీ క్రింది విధముగా కలిసియున్నవను కొందము.

ఆరోగ్య రక్తము = 1 ఆ+1వా+4అగ్ని + 3 జ +1 పృ.

పాండురోగి రక్తము = 1 ఆ+1వా+2అగ్ని+5జ+1పృ.

ఇచ్చట రక్తధాతువులో కలిగిన వైషమ్యను తొలగించి సామ్యత కలిగించుటయే కదా చికిత్స యొక్క ఉద్దేశము. కనుక తేజో, పృధివ్యాంశ లధికముగాను, జలాంశలు తక్కువగా నుండిన లోహము ను చికిత్సగా నిచ్చెదము. లోహమందలి భూతాంశలు = 1 ఆ+వా+5 అగ్ని+1జ+2పృ. కనుక పాండురోగికి లోహద్రవ్యము నిచ్చుట వలన అగ్ని పృధివ్యాంశలు వృద్ధియై, జలాంశలు తగ్గి రక్తము స్వస్థతకు వచ్చుచున్నది. ఈ విధముగా అన్నిరోగములకు ప్రయోగించిన చికిత్సా ద్రవ్యములను కార్యముల నిరూపించ వచ్చును. గాని సామాన్యము కాదు. దేహధాతువుల యొక్క సామ్యస్థితి త్రిదోషముల యొక్క సౌమ్య వ్యాపారములపై నాధారపడినందున యీ త్రిదోషాను సారమైన చికిత్స లాచరించుట తేలికయైనపని. త్రిదోషములు ద్రవ్యములు, స్వతంత్రములు. ఇవి సౌమ్యముగా వ్యవహరించి నప్పుడారోగ్యమును, వీనికి వైషమ్యము కలిగినప్పుడు రోగములు కలుగుచున్నవి. కనుక 'నదోషైర్వినారోగాః' అని చెప్పిరి.

మన దేహములో సంచరించుచున్న వాత, పిత్త, కఫములకు త్రివిధావస్థలున్నవి. 1. చయావస్థ అనగా దోషములు స్వస్థానములందుండి వృద్ధి జెందుట. వృద్ధిపరిమితి, గుణాంశలలో కూడ కలుగవచ్చును.

2. ప్రకోపావస్థ : వృద్ధిచెందిన దోషములు స్వస్థానముల నుండి కదలి ఇతర భాగములకు వ్యాపించి అచ్చట బాధలను పుట్టించుట.

3. ప్రశమనావస్థ : ప్రకోపించిన దోషములు స్వస్థత జెంది తమతమ స్థానము లకు తిరిగి వచ్చుట.

దోష, దూష్యజ్ఞానమును రోగలక్షణముల ద్వారా గ్రహించి తిరిగి వాటిని స్వస్థత చేకూర్చుట కొనర్చిన యుపాయములకే చికిత్సయని పేరు. దోషముల యొక్క చయావస్థలోనే చికిత్సల నారంభించిన యడల స్వల్పకాలములో సుళువుగా దోషములు స్వస్థత చెందగలవు. ఒకప్పుడు రోగము రాకపోవచ్చును, వచ్చినను స్వల్ప బాధలతో నయమగును. దోషములు ప్రకోపించిన పిమ్మట దేహ ధాతువులు కూడ చెడిపోవును. గనుక రోగము చికిత్స కసాధ్యము లేక కష్టసాధ్యమగును. దోషముల పరిమితి వృద్ధి జెందుటయేగాక ఒకప్పుడు వాటి గుణాంశలు వృద్ధిజెందుట కలదు. ఉదాహరణకు పాలు పిత్తము (ద్రవ్యపరిమితి)ను వృద్ధి చేయును. నెయ్యి పిత్తము (పరిమితి)ను శమింపజేసి పిత్తగుణాంశయైన ఉష్ణము నధికపరచును. వాతము వృద్ధిచెందినప్పుడం దలి రూక్ష, లఘు, ఖర, శీత, విశద గుణాంశలలో నొకటి లేక రెండు గుణాంశలతో వృద్ధిజెందుట కలదు. ఈవిషయములను రోగలక్షణములనుబట్టి గ్రహించదగును. జ్వరములలోవాతము రూక్ష ప్రధానముగా వృద్ధిచెందిన తృష్ణ పుట్టును. మలేరియా జ్వరారంభమున వాతము శీతగుణ ప్రధానముగా నుండుట వలన చలి, వణుకు కన్పించును. రజోగుణ సహితవాతము కంపములను కలిగించును. ఇట్టి గుణాంశ భేదములతో వృద్ధిచెందిన దోషములను గుర్తెరిగి అవి శమించుటకు వ్యతిరిక్త గుణాధిక్య ద్రవ్యములతో చికిత్సించ వలసియున్నది.

రోగముయొక్క నిదాన, సంప్రాప్తి, దూష్యజ్ఞానము లేకుండ రోగమునకు చికిత్స చేయుటకు వీలుకాదు. నిదానము దోషములు వృద్ధిచెందుటకు వివిధ బాహ్యాభ్యంతర హేతువులను బోధించును. సంప్రాప్తిజ్ఞానము రోగిబలము, రోగబలము, అనగా ధాతువులలో దేని నాశ్రయించి యెంత వరకు చెరచినవి, రోగియొక్క ఊర్జశక్తి, దోషములు వృద్ధిచెందుట కనుకూలములయిన వయస్సు, ఋతువు, వంశపారంపత మొదలైన విషయముల బోధించును. ఈ దోష దూష్య, సంప్రాప్తి జ్ఞానముతోనే వ్యాధి శమన చికిత్సల చేయనారంభించవలెను.

చికిత్సాపద్ధతులు పలు విధములుగా నున్నవి. రోగ స్వభావము, రోగియొక్క బలము, వయస్సు, కాలము, దేశము, ప్రకృతి, దోషస్వభావముల

ననుసరించి తదను గుణమైన చికిత్సాపద్ధతిని బుద్ధిమంతుడగు వైద్యుడు నిర్ణయించవలెను. ఈ దృష్టితో చికిత్సలను మూడు విధములుగా విభజించ వచ్చును. 1. లంఘన చికిత్స 2. శోధన చికిత్స 3 శమన చికిత్స.

1. ఆమదోషములకు ముందుగా లంఘణ లేక అపతర్పణచికిత్స కనుకూలమైన యవాగులనిచ్చి అగ్ని దీపన పాచనశక్తులను వృద్ధి చేయవలెను. ఆమము సామాన్య ముగా వారము రోజులకు పచనమగును. ఇక దోషములు నిరామములై నిలుచును.

2. శోధనచికిత్సలు : అధిక పరిమితిలో వృద్ధిచెందియున్న నిరామ దోషములను వివిధ శరీరమార్గములద్వారా బహిష్కరింపజేయుటకు పంచశోధన కర్మలు చెప్పబడి నవి. ఎట్టి కర్మ లెవరికి అవసరములో (అర్హతార్హతలు), దుష్ట ప్రయోగము వలన కలిగే యుపద్రవముల నెరిగి, అనుకూలమైన కర్మల నాచరించవలెను. ఇందువలన ప్రకోపించిన దోషములు చాలవరకు వెడలిపోయి స్వల్పభాగము మిగులును.

3. దోషశమన చికిత్సలు : మిగిలిన దోషములు శమించుటకుగాను ఔషధముల నియ్యవచ్చును.

4. పూర్తిగా దోషములు శమించిన పిమ్మట నష్టపడిన శరీరధాతువులను పూరించుటకు తర్పణ చికిత్సలు అనగా పౌష్టికములైన రసాయనౌషధములు, ఘృతములు, లేహ్యములు, పౌష్టికాహారములను తినిపించవచ్చును. దీనికి బృంహణ చికిత్స అనికూడ అందురు.

1. ఆమసహిత దోషములను లంఘనము (ఉపవాసము లేక లంఘనతుల్య మయిన యవాగు పానీయములు) ద్వారా యున్ను స్నేహ, స్వేద క్రియల ద్వారాయున్ను నిరామదోషములుగా మార్చిన పిదప శోధనకర్మ లాచరించ వలసియున్నది. స్నేహ స్వేద క్రియలు నిరామ దోషములను వెడలించుటచే రోగిని స్థిపరచును.

ఎ) స్నేహన సంస్కారము : ఇందుకు క్రొవ్వు, మజ్జిగ, నెయ్యి, నువ్వులనూనె వీనిలో నొకదానితో సైంధవలవణము, మాంసరసము, పాలు, పాలువిరిగిన నీళ్లు చేర్చి రోగిచే త్రాగించవలెను. ఒంటికి పూయవచ్చును. కళ్లు, ముక్కు, చెవి రంధ్రము లలో వేయవచ్చును. శరీరశోఫ, సర్పదష్టము, విసర్పి, ఉన్మాదము, మూత్రకృచ్ఛము, మలబద్ధరోగులకు శరీరబలము, జీర్ణశక్తుల ననుసరించి ఉత్తమమాత్ర త్రాగించ వలెను. కణతులు కాలినపుండ్లు, చర్మరోగము, కుష్టురోగులకు మధ్యమమాత్ర దుర్బలు లకు,

ముసలివారికి, చిన్న పిల్లలకు, జీర్ణశక్తి తక్కువగా నున్నవారికి, దీర్ఘకాల జ్వర పీడితులకు, దగ్గు రోగులకు చిన్న మోతాదు చాలును.

బి) స్వేదన సంస్కారము : చరకుడు 13 రకముల స్వేదక్రియలను వివరించెను.

1. సంకర స్వేదక్రియ వేడి యిసుక, వేడి పిడకలను గుడ్డలో మూటగట్టి, బాధయున్న స్థలమున కాపడము పెట్టుట.

2. ప్రస్తార స్వేదక్రియ – వట్టి గడ్డిపరుపుమీద బాధా కరభాగము నుంచుట.

3. నాడి స్వేక్రియ – ఒక గొట్టములోనుంచి నీటి ఆవిరిని బాధాకర స్థలమున పట్టుట

4. పరిషేకము – చిదుకగొట్టిన ఓషధులతో తయారైన కషాయముతో కాపడముపెట్టుట.

5. అవగాహక్రియ – తొట్టిలోని వేడినీళ్లలో మందులను చేర్చి యందులోకూర్చుండుట.

6. జేంతాక స్వేదక్రియ – ఒక చిన్న గదిలో కిటికీలు, వాకిళ్లు బిగించి మంటలువేసి ఆ వెచ్చని గదిలో రోగిని కొంతసేపు యుంచుట.

7. అశ్మఘన స్వేదక్రియ – వెచ్చని రాతిపలక మీద రోగి పరుండుట.

8. కర్షూ స్వేదక్రియు – రోగి మంచము క్రింద నిప్పుల కుంపటులుంచుట.

9. కుటీ స్వేదక్రియ – గాలి చొరకుండ గదితలుపులు మూసియుంచి ఆ గదిలో రోగి పరుండుట.

10. భూస్వేదక్రియ–వెచ్చని నేలపైన రోగి పరుండుట.

11. కుంభీ స్వేదక్రియ – రోగి మంచము క్రిందను మందుతో నింపిన పాత్రనుంచి దానిపైన నిప్పులు వేయుట.

12. కూప స్వేదక్రియ – ఒక లోతైన గోతిలో కట్టెలుకాల్చి, మంట లారినపిదప నా గోతిపైన మంచము వేసికొని పరుండుట.

13. హొలాక స్వేదక్రియ–కాల్చిన పిడక నిప్పులను మంచము క్రింద నుంచుట. ఈ స్వేద క్రియలు కీళ్ళనొప్పులు దగ్గు, ఎక్కిళ్ళు, ఉబ్బస, చెవిపోటు, గొంతునొప్పి, తలపోటు, స్వరభంగము, మెడ ఇరుకు పట్టుట, పక్షఘాతము, మలబద్ధము, మూత్రకృచ్ఛ్రము, మొదలైన పలువ్యాధు లలో చాల మేలు చేయును. రోగానుకూలమయిన ప్రతిక్రియ లాచరించవలెను.

2. శోధన క్రియలు : నిరామ దోషములను బహిష్కరించుటకు చేయబడును.

1. వమనక్రియ : కఫము ప్రకోపించిన రోగములు – అనగా విషభక్షణము ఆమ దోషము (కఫప్రధాన) తో కూడిన జ్వరము, క్షయ వ్యాధి, స్త్రీకి స్తనవిద్రధి, అతిసారము, మధుమేహము, అనాహము, విషూచి, కఫాజీర్ణము, వమనానుమానము కడుపులో త్రిప్పు, విసర్పి, కుష్ఠు,ఉబ్బస, దగ్గు, శ్లీపదరోగము, హృద్రోగము, స్థౌల్య రోగము, ఉన్మాదము, మూర్ఛ, కీళ్లనొప్పులు, నాసాస్రావరోగము (ముక్కుపడిశము) గవదబిళ్లల వాపు యీ మొదలైన రోగములలో వాంతిచేయించవలెను. ఇందుకు మదన ఫలము మ్రంగకాయల కషాయము త్రాగించి వాంతిచేయించిన కఫము పోవును.

2. విరేచన క్రియ : ఇందుకు త్రివృత్ చూర్ణము (తెగడ) చాల ప్రశస్త మయినది. ఆముదమును కూడ తరచుగా వాడుచుందురు.

జీర్ణ జ్వరములు, గరము, ఆకలి లేకుండు, మూలవ్యాధి, ఒళ్లు నీరుపట్టుట యకృత్లీ ప్రహవృద్ధులు, విద్రధి, కుష్ఠు, భగంధరము, స్త్రీ రోగములు, విసర్పి అనాహము, మధుమేహము, మూత్రకృచ్ఛ్రము, గాయములు, ఒళ్లుకాలుట, నేత్రరోగములు, తల కాళ్ళు, చేతులు వేడిగానుండుట, రక్తస్రావములు, పచ్చకామిర్లు, శూల మొదలైన రోగములలో రోగారంభముననే విరేచన సాధనము చేయించుట మంచిది.

3. వస్తికర్మ : మూత్రసంచికి వస్తి యనిపేరు. జంతువుల మూత్రసంచితో తైల, కషాయాదులను గుదముద్వారా నెక్కించుటంజేసి యీకర్మకు వస్తి కర్మయని పేరు కల్గినది. దోషశమనము కొరకు చేర్చిన వస్తి ద్రవ్యములు రెండు విధములుగా నున్నవి. 1. (తైలవస్తి) అనువాసనవర్తి 2. నిరూహవస్తి (కషాయవస్తి) వీనిని గుదము ద్వారా నెక్కింతురు. ఉత్తరమార్గమున అనగా పురుషుల శిశ్నమార్గము ద్వారాయున్ను, స్త్రీలకు మూత్రమార్గము, యోనిమార్గములను క్షాళనమొనర్చు వస్తిక్రియలకు ఉత్తర వస్తి యనిపేరు. నేటికాలమున లభించుచున్న పూర్వపు వస్తి యంత్రములకు బదులుగా వాడుకొనుటకు తప్పుకాదు. జ్వరము, అతిసారము, నేత్రరోగములు, తలనొప్పి, అప తాపక వాతము, అక్షేపక వాతము, చచ్చువాతము, అనాహము, అశ్మరి, శూల, వృషణములవాపు, మలబద్ధము, మూత్రకృచ్ఛము మొదలైన రోగములలోచెప్పిన ఔషధ ద్రవ్యములతో

తయారైన తైల కషాయాదులను గుదములోనికెక్కించిన వాతము శమించి బాధలు నయమగును. ముందుగా కషాయవస్తిజేసి, దోషములు శమించిన పిమ్మట అనువాసనవస్తి చేయవలెను. వస్తి కర్మజేయుట వలన 76 రకముల యుప ద్రవములు సంభవించగలవని సుశృతుడు చెప్పెను.

4. నస్యకర్మ : శిరోరోగములకును, గొంతు, ముక్కు రోగములకును ఓషధుల చూర్ణములను పీల్చుటగాని లేక ఓషధీరసములను ముక్కురంధ్రములలో వేయుటగాని లేక ఓషధులతో తయారైన తైలములనైన పీల్చదగును. ప్రయోజనమునుబట్టి నస్య క్రియలు రెండువిధములుగా నున్నవి. 1) శోధన నశ్యక్రియలు 2) స్నేహన లేక బృంహణ నస్యక్రియలు. యివి ఆచరణ భేదముల ననుసరించి మూడు విధములు:

1. అవపీడనము; అనగా ముక్కులోకి ఓషధీరసములను పిండుట.
2. ప్రథమనము; అనగా ఔషధ చూర్ణముల పీల్చుట.
3. ప్రతిమర్షము : అనగా మందు ద్రవము నెగపీల్చుట.

పైన వివరించిన చికిత్సా క్రమము యొక్క వరుస నీ దిగువ సూచించడమైనది.

1. హేతు నివారణము
2. ఆమ దోషములను నిరామములుగా నొనర్చుటకు లంఘనాది క్రియలు–
3. స్నేహ, స్వేద క్రియలు
4. పంచ శోధన క్రియలు
5. శమన క్రియలు
6. బృంహణ క్రియ

## షడ్రస సిద్ధాంతము
## త్రిదోషములతో వీని సంబంధము

ఔషధాహార పదార్థములన్నియు పాంచభౌతిక ద్రవ్యములు. వీని నాశ్రయించు కొని మధుర, ఆమ్ల, లవణ, కటు, తిక్త, కషాయములనెడు ఆరు రుచులున్నవి. ప్రతి పదార్థమందు 6 రసములున్నప్పటికి యధికాంశరసము లేక రసములను మాత్రము నాలుక గ్రహించును. స్వల్ప రసములను గ్రహించలేదు. షడ్రసములు పదార్థముయొక్క గుణములని వ్యవహరించుచుండినను ఆయుర్వేద శాస్త్రము వీటిని ద్రవ్యములుగా నిశ్చయించి యందలి పంచభూత విభాగమలను కూడ వివరించినది. అదెట్లనగా –

1. మధురరసము = పృధ్వి + జల
2. ఆమ్లరసము = అగ్ని + భూమి
3. లవణరసము = అగ్ని + జల
4. కటురసము = వాయు+అగ్ని
5. తిక్తరసము = వాయు+ఆకాశ
6. కషాయరసము = వాయు+పృధ్వి

షడ్రసయుక్త ఆహారపదార్ధములను భుజించినప్పుడు ఆహార పదార్ధములు పాచకాగ్ని చేతను పచనమై పంచభూతాంశలుగా విడిపోయి, వీనితో రసాది సప్త ధాతువులను నిర్మించుచున్నవి.

ఇక షడ్రసములుగల ఆహారపదార్ధములు జఠరాగ్ని సంయోగమున త్రివిధ విపాకములజెంది, ఆవిపాక ద్రవ్య భూతాంశలతో వాతము, పిత్తము, కఫములు పుట్టుచున్నవి. అదెట్లనగా–

మధురరసము మధురవిపాకమునే జెందును.

ఆమ్లరస మామ్లవిపాకము పొందుచున్నది.

లవణరస మామ్లముతో కలిసి ఆమ్లమునే వృద్ధి చేయును.

మధురామ్లలవణ సంయోగములో మధురవిపాకము సంభవించును.

కటు రసము అగ్నియంశలు ప్రధానమగుటవలన పిత్తమును వృద్ధిపరచును. తిక్తరసము పిత్తహరముగా నుండును. కషాయరసము

వాతమును వృద్ధిచేయును. కటుతిక్త కషాయ రసములు కలిసి కటువిపాకముచెంది వాతమును వృద్ధిపరచుచున్నవి. ఈ కార్యములెట్లు జరుగుచున్నవో విమర్శించవలసియున్నది. సమాన భూతాంశలుగల రెండు ద్రవ్యములు కలిసినప్పుడు ద్రవ్యము వృద్ధి యగుచున్నది. విరుద్ధగుణ భూతాంశలుగల ద్రవ్యములు కలిసికొన్నప్పుడు, ఆ ద్రవ్యము తగ్గిపోవుచున్నదని ప్రకృతి సూత్రమున్నది. దీని ప్రకారము వాతాదులు వృద్ధిచెందుటకు సమానగుణ భూతాంశలు గల రసములేవి? విరోధగుణ భూతాంశలు గలిగిన రసములేవి? వాతాదులందలి భూతాంశలేవి? యను విషయమును తెలిసికోవలసి యుండును. వాతము=వాయు+ ఆకాశ, పిత్తము=జల+అగ్ని, కఫము=జల+పృథ్వి,

ఇక వాతమునకు రూక్ష, లఘు గుణములు ప్రధానములుగా నున్నవి.

పిత్తమునకు ఉష్ణ గుణము ప్రధానము.

కఫము శీత, స్నిగ్ధగుణములు కలది. ఇట్లే పంచభూత గుణములను తెలిసికొని వాటిలో పరస్పర మిత్రత్వ శత్రుత్వములను గ్రహింతుము.

1. ఆకాశభూతము శబ్దగుణము కలది. సత్వగుణ ప్రధానము సూక్ష్మ, విశద, లఘు గుణములు గలది. వీటికివిరుద్ధములైన స్థూల, పిచ్ఛిల, గురు గుణములతో విరోధించును.

2. వాయుభూతము- రజోగుణ ప్రధానమైన రూక్ష, లఘు గుణములను కలిగి నందున వీటికి విరుద్ధములైన స్నిగ్ధ, గురు గుణములు కలిగిన జల భూత గుణములతో విరోధించును.

3. అగ్ని భూతము కేవలము ఉష్ణగుణ ప్రధానమగుట వలన దీనికి విరుద్ధ మయిన శీతగుణముగల జలభూతముతో విరోధమేర్పడుచున్నది. వాయుభూత మగ్నికి తోడ్పడి మరింత ప్రజ్వలింపజేసి అగ్నియొక్క యుష్ణగుణమును వహించుట కలదు.

4. అప్‌భూతము-తనయందలి స్నిగ్ధ, శీత గుణముల చేతను వాయ్వగ్నులతో విరోధించును.

5. పృధ్వీభూతముయొక్క గురు, స్థిర, కఠిన గుణములు వాయువు, ఆకాశ, అప్ భూతగుణములతో వ్యతిరేకించును.

ఈ వరుసను రసములు దోషములు కలిసికొన్నప్పుడు, రెండిటియందలి భూత గుణాంశలు సమానముగా నుండినచో నా దోషమునకు

వృద్ధికలుగుచున్నది. వాటి యందలి గుణాంశలు విరోధించునవిగా నుండిన యా దోషము హరించగలదు. ఉదాహరణమునకు మధురపదార్థములను తినినప్పుడు కఫవృద్ధి యగుచున్నది. ఏలయన రెండిటి యందలి భూతాంశలు వాటిగుణములు సమానముగా నున్నవి. ఇట్లే ఆమ్ల లవణ రసమును పిత్తము వృద్ధిపరచును. కటుతిక్త కషాయ రసములు మూడింటిలోను వాయు భూతాంశలే యధికముగా నున్నందున తప్పక వాతము వృద్ధి యగు చుండును.

ఇక మూడేసిరసముల నొక్కసారిగా కలిపి భుజించినప్పుడు వేర్వేరు విపాకముల జెందుచుండుట వలన నీ మిశ్రమ ద్రవ్యముల కార్యములు కూడ వేరుగనే యుండు నని ఆయుర్వేద శాస్త్రము చెప్పుచున్నది. ఎట్లనగా-

1. మధురామ్ల లవణములు కఫమును వృద్ధిచేయును. మధురవిపాకము చెందును.

2. కట్వమ్లలవణ సంయోగము ఆమ్లవిపాకమును పొంది పిత్తమును వృద్ధి పరచుచున్నది.

3. కటుతిక్త కషాయరసములు మూడును కటువిపాకమును పొంది వాతమును వృద్ధిచేయుచున్నవి.

ఈ పైన చెప్పన విషయములు యదార్థములని అనుభవముచేతను గ్రహించ గలము. కాని శాస్త్రరీత్యా నాకార్యమెట్లు సంభవమగుచున్నదో తెలిసికొనుట కూడ అవసరమగును.

1. మధుర+ఆమ్ల+లవణ=ఏదోషవృద్ధి,

ఏ దోషము శమించును=(జ+పృ) +(జ+అగ్ని) = 2 జ+2పృధ్వి+2 అగ్ని.

ఇక ద్రవ్య నిర్ధారణకు జలాంశలు ప్రధానములు. ఈ కూటములో అన్ని యంశలు సమానముగనే యున్నవి. పృధివ్యగ్నులు వాటి యందలి గుణవైషమ్యము చేతను జలభూతాంశలకు విరోధులుగానే యున్నవి. అయినను కార్య సాధనకు జలాంశలు తక్కువ విరోధముగల పృధివ్యాంశల తోనే కలిసి, (జ+పృ) కఫమేర్పడి, కఫవృద్ధి జరుగుచున్నది. కఫబల మధికమగుట వలన యందలి శీతగుణము అగ్నిని చల్లార్చివేయును. కఫవృద్ధివల్ల అగ్నిమాంద్యము. ఒడలు బరువు, చల్లదనము కలుగు చున్నవి. కఫవృద్ధి జరిగినప్పుడు తనయందలి స్నిగ్ధ, గురుగుణముల చేతను, విరుద్ధ

గుణములుగల, రూక్ష, లఘు గుణములుగల వాతము యొక్క బలమును అణచి పెట్టును. ఇట్లే వాతబలము హెచ్చినచో కఫము నార్చి వేయగలదు. ఈ కార్యమును కూడ నీ దిగువ లెక్కమాదిరిగా చూపడమయినది.

| | | |
|---|---|---|
| కఫవృద్ధి | జ+పృ | స్నిగ్ధ + గురు |
| వాతము | వా+ఆకాశ | రూక్ష+లఘు |

ఇచ్చట కఫము యొక్క బలవత్తర గుణములైన స్నిగ్ధ గుణముచేత వాతమందలి అల్పరూక్షగుణమును, గురుత్వముచేత లఘుత్వము నశించుచున్నవి. కాన వాతబలము తగ్గినదని చెప్పుదుము. ఇదేవిధముగా మిగిలిన రస సంయోగముల ఫలితములను నిశ్చయించవచ్చును.

ఈ ప్రకారము ఒక్క ద్రవ్యరసముతోనే ద్రవ్యగుణ నిశ్చయమగుచున్నదికదా. దీనికితోడు అనుభవముకూడ నుండిన ద్రవ్యగుణ విషయమున సందేహముండదు. ద్రవ్యగుణమును నిశ్చయించుటకు యింత చక్కలి సుళువైన యుపాయము పాశ్చాత్యుల కున్నదా? పదార్థములందలి వివిధ రుచులను బోధించుటకు జిహ్వేంద్రియము వినా రసాయన పరికరములుగాని యంత్రములుగాని తోడ్పడగలవా ? అసలు రుచులను ద్రవ్యముల నాశ్రయించుకొనియున్న గుణములు అని చెప్పుదురుగాని అవి ద్రవ్యము లని యంగీకరించరు. నూతన ద్రవ్యముల గుణములను నిశ్చయించుటకు పరిశోధ కుడు స్వయముగా నద్దానిని తిని దాని ఫలము అనుభవించి చాటవలెను. ఇంకొకరి యభిప్రాయముల నంగీకరించరుగదా. ఒకడు ఎన్ని ద్రవములను తిని వాటి గుణముల నిశ్చయించగలడు. కొన్ని తీవ్ర విషయముల సందర్భము తన ప్రాణములనే పోగొట్టు కొనవలసివచ్చును. జంతు పరిశోధనలలో ద్రవ్యకార్యము ప్రస్ఫుటమగుచున్నదేకాని అందలి రుచిని తెలిసికొనుటెట్లు? జంతువులలో కన్పించిన కార్యము మనుష్యులలో ముఖ్యముగా రోగావస్థలో నదేవిధముగా నుండుననుటకు వీలుకాదు. ఏలయన నాడీ యంత్ర నిర్మాణము వేర్వేరుగా నున్నది. ఇంతవరకు పాశ్చాత్యులకు తెలిసిన దొక్క తిక్తరసము మాత్రమే. అనుభవము ద్వారా నిది ఆకలి పుట్టించును. ఆహార జీర్ణమునకు తోడ్పడుచున్నది. జ్వరతాపము తగ్గించగలదని చెప్పినారే గాని యీ కార్యములెట్లు సంభవమగుచున్నవో వివరించలేకున్నారు. హోమియోపతి వైద్యశాస్త్ర నిర్మాతలు కొన్ని వందల

ద్రవ్యగుణములను అనుభవ పూర్వకముగానే కనిపెట్టినారు. ఆయుర్వేదజ్ఞులు పంచభూత, త్రిదోష, షడ్రససిద్ధాంతముల ననుసరించి జిహ్వేంద్రియ సాయముతోనే యపరిచిత ద్రవ్యగుణమును యవలీలగా చెప్పగలరు.

మరియు ద్రవ్యకార్యము పదార్థములయొక్క రస, గుణ, వీర్య, విపాక, ప్రభావములనెడు అయిదు విషయములను పురస్కరించుకొని జరుగుచుండును. రసము (రుచి)ను గురించి త్రిదోషముల సంబంధమును విపులముగా చర్చించితిమి. ఇక మిగిలిన వాటికి త్రిదోషములకు సంబంధమును తెలిసికొందము.

గుణము : ప్రతి ద్రవ్యమును సత్వ, రజ, తమోగుణము లాశ్రయించుకొని యున్నవి. ప్రకృతికి సంబంధించిన నీ గుణములు ప్రకృతి పరిణామములైన పంచ భూతముల ననుసరించి ద్రవ్యములో ప్రవేశించుచున్నవి.

ఈ వరుసను మనకు త్రివిధ ఆహార పదార్థములు లభించుచున్నవి. నిత్యముగా సాత్వికాహారములు భుజించుచుండిన సత్త్వగుణము, రాజసాహారమును తినుచుండిన రాజసగుణము, తామసాహార భుక్కులకు తమోగుణములు వృద్ధిచెందుచుండుట విశేష మని చెప్పవలెను. ఈ విజ్ఞానము పాశ్చాత్యుల పథ్యశాస్త్రములో లేదు. ఆహారము శరీరమునే గాక మనస్సును గూడ పోషించుచున్నదను విషయము పరిచితముగానే యున్నది. ఈ త్రిగుణములకు త్రిదోషములకు సంబంధ మెట్టిదనిన

సాత్వికాహారము త్రిదోషములను సమస్థితిలో నుంచును.

రాజసాహారము వాతపిత్త వృద్ధిచేయును.

తామసాహారము కఫమును వృద్ధిచేయుచున్నది.

**వీర్యము** : ఆహార పదార్థములలో కొన్ని ఉష్ణ వీర్యప్రధానములుగాను, మరికొన్ని శీతవీర్య ప్రధానములుగా నున్నవి. వీర్యనిశ్చయము అనుభవముద్వారా తెలియవలసి యున్నది.

ఉష్ణవీర్య ద్రవ్యములు పిత్తమును

శీతవీర్య ద్రవ్యములు కఫమును వృద్ధి పరచును.

**విపాకము** : విపాకమనగా మధురాదిరస ద్రవ్యములు జఠరాగ్నిచేతను పక్వము కాగా నా పదార్థములకు క్రొత్త రుచులు పుట్టును.

ఈ మార్పునకు విపాకమనిపేరు. ఈ విధముగా షడ్రసయుక్త ద్రవ్యములు మూడువిధములైన విపాకముల జెందుచున్నవి.

1. మధురవిపాకము ఆమాశయములో జరుగును. ఇందులో నుంచి కఫము పుట్టుచున్నది.

2. ఆమ్లవిపాకము గ్రహిణిలో జరుగుచున్నది. ఈ ద్రవ్యములోనుంచి పిత్తము పుట్టును.

3. కటువిపాకము సన్న ప్రేగులలో జరుగుచున్నది. ఇది పెద్ద ప్రేగులలోకి చేరగా నందుండి వాతము పుట్టుచున్నవి.

**ప్రభావము** : ద్రవ్య ప్రభావము వర్ణనాతీతము, దీనిని గ్రహించుట కేయుపాయములు లేవు. అనుభవము చేతనే కొన్ని ద్రవ్యముల ప్రభావములు నిశ్చయింపబడినవి. ద్రవ్యమందలి రస, గుణ, వీర్య, విపాకముల ననుసరించిమాత్రవే కాక ద్రవ్యములో నుండిన యద్భుతప్రభావముచేతను ప్రకోపించిన దోషములు శమించి స్వస్థత చేకూర్చు నట్టి ద్రవ్యకార్యమును ప్రభావమందుము.

పాశ్చాత్యుల ఔషధ ద్రవ్య నిఘంటువులలో (మెటీరియామెడికా) శరీరములోకి అవి ప్రవేశించినపిదప వివిధ శరీరాంగముల మీద వాటి ప్రభావ మెవ్విధముగా ప్రసరించి వాటి కార్యములందెట్టి మార్పులను కలిగించుచున్నవో వివరింతురు. జంతు పరిశోధనలు వారికి ముఖ్యాధారములు పిమ్మట అనుభవజ్ఞానము కూడ తోడ్పడును. నిశ్చితజ్ఞానముతో చేసిన చికిత్సా ప్రయోగమునకు రేషనల్ లేక సైంటిఫిక్ ట్రీట్ మెంట్ అందురు. ఇట్టి కార్యవిజ్ఞానము లేకుండ అనుభవము ద్వారా రోగము శమిం చుట కిచ్చిన చికిత్సకు ఎంపిరికల్ ట్రీట్‌మెంట్ అనిపేరు. ఇట్టిమందుల నింకను వారు వాడుచునే యున్నారు.

నేలవేము, తుంగముస్తలు, పర్పాటకము జ్వరమునందును

తక్రము గ్రహణి రోగమునందును;

కొడిశపాల అతిసారమునందును,

వాయువిడంగములు కృమి వ్యాధి యందును,

నల్లజీడిగింజలు అర్శోవ్యాధియందును,

లోహకిట్టము (మండూ రము) పాండురోగమునందును,

శిలాజితుక్షయవ్యాధి యందును,
గంటుభారంగి శ్వాసరోగమునందును,
శిలాజిత్తు క్షయవ్యాధి యందును,
గంటుభారంగి శ్వాసరోగము నందును
ఉశిరిక, పసుపు, మేహవ్యాధి యందును
బంగారమును కాల్చిన మంచినీరు తృష్ణయందును
శూల రోగమునందు ఇంగువ, కానుగ
ఆమవాతము నందు గోమూత్ర మిశ్రితమైన ఆముదమును,
ప్లీహరోగములందు పిప్పళ్లును,
విషలక్షణము లందు దిశిరన చెట్టును,
కాసరోగమునందు వాకుడును,
వాత వ్యాధి యందు గుగ్గిలము, వెల్లులియు,
రక్త పిత్తమునందు అడ్డసరమును,
అపస్మారమునందు వసయు, సరస్వతి యాకును,
గరవిషమునందు స్వర్ణభస్మమును,
ఉదరవ్యాధి యందు విరేచనౌషధములును
వాతరక్తమునందు తిప్పతీగెయు,
ఆర్దితవాతమునందు మినప ఇడ్లీ లేదా కుడుములు,
స్థౌల్యము తేనె కలిపిన నీరు,
ప్రదర వ్యాధియందు లొద్దుగయు,
అరుచియందు మాదీఫలమును
వ్రణములందు గుగ్గులును
శోకములందు మద్యమును
ఆమ్లపిత్తమునందు ద్రాక్షయు,
మూత్రకృచ్ఛ్రమునందు పిల్లిపీచర, బూడిదగుమ్మడి కాయ రసమును,
నేత్రవ్యాధులందు త్రిఫలములును,
ఉన్మాదములందు పురాణ ఘృతము,

కుష్టమునందు చంద్రచేవ కషాయమును,

నిద్రక్షయమునందు బర్రిపాలును,

శ్రిత్రము, (బొల్లి) నందు బావంచాలును,

అజీర్ణమునందు నిద్రయు,

భయమునందు సంతోషమును,

చర్ది(వాంతి) యందు పేలాలు, తేనెయు,

ఊర్ధ్వజిత్రురోగములందు (కండ్లు, ముక్కు చెవులు గొంతురోగములు) తీక్ష్ణ ఔషధములచే నశ్యమును;

పార్శ్వ శూల యందు పుష్కరమూలమును;

మూర్ఛరోగమునందు శీతోపచారములును;

పార్శ్వమునందు మాంసరసమును,

అశ్మరియందు కొండపిండి వ్రేళ్ళును;

గుల్మములందు మునగపట్టయు;

విద్రదియందురక్త మోక్షణమును;

హిక్క యందు లాక్షా రసనస్యము;

దాహరోగమునందు (ఒళ్ళుమంట) శీతోపచారములును;

భగందరము నందు తేనెతో కలపిన పుష్కరమూల చూర్ణమును;

పై నుదాహరింపబడిన వ్యాధులలో యాయా రోగహరౌషధముల నొసంగునపుడు, ఆయా అనుపానములతో నిచ్చిన యెడల, ఔషధములు గుణవత్తరములగును.

అనుపానములన్నిటిలోను వర్షోదకము మిక్కిలి యుత్తమమైనది. మరియు ఎవరికి ఏ నీరు సాత్మ్యమో ఈ నీరే శ్రేష్ఠము.

భుజించుటకు ముందుగా ఉదకపానము చేసినచో శరీరము కృశించును.

భోజన మధ్యకాలమునందు ఉదకపానము చేసినచో, వృద్ధిక్షయములు లేక శరీరము స్థిరముగ నుండును.

భోజననానంతరము చేసినచో శరీరము లాగును.

కావున ప్రయోజనము ననుసరించి, ఉదకపానమును

చేయుచుండవలెను. శ్వాస, కాస, ఊర్ధ్వ జత్రుగత వ్యాధులు, ఉరఃక్షతము, చొంగకారుట, కంఠస్వరభంగము ఈ వ్యాధులచే బాధపడువారు ఉ దకపానము చేయకూడదు.

వాతమునందు స్నిగ్ధముగ నుండునట్టియు, నుష్ణముగ నుండునట్టియు అనుపానమును;

పిత్తమునందు మధురముగ నున్నట్టియు, శీతముగ నున్నట్టియు ననుపానమును;

కఫమునందు రూక్షగుణము గలిగినట్టియు, ఉష్ణముగ నున్నట్టియు సమపానమును హితములైనవి.

క్షయరోగమున మాంసమును, పాలను హితములైన అనుపానములు. భల్లాతకు స్నేహమును విడిచి మిగిలిన యన్ని స్నేహ ప్రయోగములందును ఉష్ణోదకానుపానము చేయవలెను. భల్లాతక స్నేహప్రయోగమున మిక్కిలి శీతలమైన జలమును పానము చేయవలెను. ఇటులనే తేనెను, పిష్టములను (పిండి వంటలు) పెరుగును, పాయసమును భుజించినప్పుడు శీతలోదకమును పానము చేయవలెను. మద్యార్తునకు గూడ శీతల జలమునే అనుపానముగా నియ్యవలెను. శాలిధాన్యపు అన్నము పెసలు మున్నగు విదళ ధాన్యమును (పప్పులను) భుజించి నప్పుడు పాలుగాని మాంసరసముగాని అనుపానముగా సేవింపదగినవి. యుద్ధము చేతను, అశ్వగమనము చేత శ్రమజెందిన వాల్లకును, అతపనుతతప్తులకును విషార్తులకును మద్యార్తులకును పాలుగాని, మాంసరసముగాని అనుపానముగా సేవింపదగినది. మద్యాభ్యాసములకును, మాంసాభ్యాస లకును మద్యానుపానమే శ్రేష్ఠ మైనది. మద్యాభ్యాసకులు కానివార్లకు కేవలము బలమునుగాని, ఆమ్లదాడిమాదిఫల స్వరసములను గాని యనుపానములుగా నొసంగవలెను. ఉపవాసములచేను, అశ్వగమనము చేతను, ఉపన్యాసముచేతను,మైధుననముచేతను, వాతముచేత, ఇతర కర్మలచేతను అలసినట్టి వార్లకు క్షీరానుపానము అమృతమువలె మేలు చేయును. శోఫ, అర్శోరోగము, గ్రహణీదోషము, అమృతమువలె మేలు చేయును మూత్రబంధము, ఉదరరోగము, అరుచి, స్నేహపానముచే గలిగిన వ్యాపత్తు, పాండురోగము, గరాది విషములు వీనియందెల్ల మజ్జిగను పయోగింపదగును. కృశులకు మరియు స్థూలులకు

మధుమిశ్రితమైన జలము, రక్తపిత్తముచే పీడింపబడిన వార్లకు పాలు, చెరకురసము హితములైన అనుపానములు. విషార్తులకు జిల్లేడు, నక్కెరుచెట్టు, దిరిశనచెట్టు వీట్లతో సిద్ధము జేసిన ఆసవమును అనుపానముగా నొసంగవలెను.

విధి ననుసరించి చేయబడిన అనుపానము హితకరమై మానవునకు ఆహారము వలన తృప్తి గలిగించును. సుఖముగ జీర్ణింపజేయును. ఆయువును వృద్ధి బొందించును.

## ఔషధసేవన కాలములు

అభక్తము (భుజింపకుండుకాలము) పూర్వ భక్తము (భుజించుటకు ముందు కాలము) మధ్యభక్తము (భోజనము యొక్క మధ్యకాలము) సభక్తము (అన్నమును నోట నుంచుకొనిన కాలము) భక్తోపరిష్టాత్కాలము (భోజనోత్తర కాలము) సాముద్గము (అన్నమును భుజించుటకు ముందు తరువాతి కాలములు) భక్తాంతరము (ఆహార కాలములకు మధ్యనుండు కాలము) గ్రాసకాలము (అన్నపుముద్దను మ్రింగునప్పటి కాలము) గ్రాసాంతరకాలము (ముద్దముద్దకు మధ్యనుండు కాలము) అనేకమార్లు అను నీ పదికాలములును ఔషధసేవన కాలములనబడును.

పిత్తకఫములు ప్రకోపము జెందినప్పుడు విరేచన వమనౌషధములను, లేఖనౌష ధమును ప్రభాతకాలమున సేవింపవలెను. ఇది భక్తాంతర రూపమైన ప్రథమౌషధ కాలమని చెప్పబడును.

అపాన వాతము వికృతి జెందినప్పుడును, అరుచియందును అనేక విధములైన రుచికరములగు ఆహారపదార్థములతో జేర్చిన యౌషధమును భోజన పూర్వకాలమున సేవింపవలెను. సమానవాతము వికృతి జెందినప్పుడును, జఠరాగ్ని మందగించినప్పు డును, అగ్ని దీప్తికరమగు నౌషధమును భోజన మధ్యకాలమున సేవింపవలెను. వ్యాన వాతము వికృతిజెందినప్పుడు భోజనోత్తర కాలమున నౌషధమును సేవింప వలెను. హిక్క, ఆక్షేపకవాతము, కంపవాతము వీని యందు ఔషధమును భోజనము నకు ముందు తరువాత కాలము లందు సేవింపవలెను. ఇటుల పూర్వభక్త, మధ్యభక్త, భక్తోపరిష్ట, సాముద్గరూప కాలములు ద్వితీయౌషధకాలమని చెప్పబడును.

ఉదానవాతము ప్రకుపితమై స్వరభంగాదులను గలిగించిన యెడల

సాయంకాలపు భోజనమందు అన్నపు ముద్ద మ్రింగునప్పుడుగాని, ముద్ద ముద్దకు మధ్య కాలమునగాని యౌషధమును సేవించవలెను. ప్రాణవాతము దుష్టమైనప్పుడు సాయంకాలపు భోజనముకంతమున ఔషధమును సేవించవలెను. ఇటుల గ్రాస గ్రాసాంతరాది రూపకాలములు తృతీయౌషధ కాలమనబడును.

దప్పిక, వాంతి, ఎక్కిళ్లు, శ్వాస, విషము వీనియందు పలుమార్లును, అన్నమును నోటనుంచుకొని నట్టి కాలమునకు ఔషధమును సేవించవలెను. ఇటుల ముహర్ముహు స్సభక్తకాలములు చతుర్థౌషధ కాలమనబడును.

జత్రువునకూర్ధ్వముగా పుట్టిన వ్యాధులయందు లేఖన–బృంహణ–పాచన– శమన క్రియలందును రాత్రికాలమునగూడ ఆహారములేకయే ఔషధమును సేవించవలెను. ఇట్టి అభక్త రూపకాలము పంచమౌషధ కాలమనబడును.

తొలుత ఉపయోగించిన యౌషధము యొక్క గుణమును ఏడు దినములవరకు దెలిసికొనవలెను. అప్పటికిని అట్టివ్యాధి శమనముకై ఏ మాత్రము గుణమును కనుపరచకున్నచో, ఎనిమిదవ రోజునుండి మరియొక యౌషధమునుపయోగించవలెను. ఈ యుపయోగించుటలో మొదటి యౌషధమునకును సాంకర్యముండకుండు నట్లు జూచుచుండవలెను. కాని మొదటి ఔషధము రోగి యొక్క దోషాది బలముల నంత హెచ్చుగా జయించునంతటి శక్తిగలది కాలేదని గుర్తింపబడినచో, నా యౌషధ మునే పూర్వముపయోగించిన పరిమితికంటె హెచ్చు పరిమితితో తిరిగి యుపయోగింపవలెను.

గ్రీష్మాది ఋతువులలో దుష్టమైన వాత పిత్త కఫములను వరుసగా శ్రావణ మాసమందును, కార్తీకమాసమునందును, చైత్రమాసమునందును శోధింపవలెను. ఈ శ్రావణాదిమాసములు మూడును శోధనకాలము లేక సాధారణ కాలము అని చెప్పబడును.

## వాత వ్యాధి చికిత్సలు

( ఆయుర్వేదచికిత్సా సూత్రములు–వాతవ్యాధి చికిత్సలు)

1. రూక్షత, 2 లాఘువము 3 వైశద్యము 4 చల్లదనము 5 సూక్ష్మత్వము ఇవి సామ్యములోనున్న వాతము యొక్క లక్షణములు. ఈ గుణములు గల ఆహారము, విహారము, ఔషధము, మర్దనము మున్నగునవన్నియు వాతమును వృద్ధి చేయును. వాతవృద్ధి యందు వీనికి విపరీత గుణములుగల ఆహారాదుల నుపయోగింపవల యును. వాత వ్యాధులందు ఈ క్రింది చికిత్సలు ప్రయోగార్హ్వంబులు.

1. స్నేహము : వాత హరములగు తైలములను పూయుట. (చరకసూ. 13)
2. స్వేదము : చరకోక్తములయిన 13 విధముల స్వేద చికిత్సలు.
3. ప్రదేహము : వెచ్చగానుండి శూలహరములైయున్న లేపములను, పిండి కట్టులను, పట్టీలను, చూర్ణములను ప్రయోగించుట.
4. విమర్దనము : లేక ఉన్మర్దనము, దృఢముగా మర్దించుట.
5. పరిషేకము : వెచ్చని జలాదులచే చిమ్ముట, ఒత్తుట, కాచుట, తుడుచుట మొదలగునవి.
6. ఉపనాహములు : వెచ్చని బంధములు
7. ఉపవేష్టనము : బిగువైన బంధనము
8. అవగాహము : ఉష్ణోదక, కషాయములందు స్నానము.
9. సమవాహము : గట్టిగా పిసుకుట, ఇది నొప్పి నివారించును.
10. అవపీడనము : తోదాదులయందు మృదువుగా పట్టిలాగుట.
11. విత్రాసనము : భయపెట్టుట
12. విస్మాపనము : ఆశ్చర్యము గొలుపుట
13. విస్మారణము : మరపించుట.
14. వస్తికర్మ : వాతచికిత్సయందు అన్ని క్రియలలో నిది ప్రధానము.
15. నస్యము : నాసికాశోధనము

16. బృంహణాహారము : మధురము, కొద్దిపులుపు, కొంచెము వుప్పు, నేయి, నూనె, కొవ్వు ఇట్టివియు వెచ్చని ఆహారములు మరియు రోగికి అనుకూలములయిన ఇతరములు రోగియొక్క సుఖము ననుసరించి అంగమర్దనము చేయదగును.

## పిత్త వ్యాధి చికిత్సలు

తీవ్రమయినవేడి, కొద్దిశ్లక్ష్ణత, తెలుపు ఎరుపులుగాని రంగులు, పచ్చిమాంసపు గంధము,పులుపు చేదురుచులు, మంట, ఒళ్ళుతిరుగుట, ఇవి పిత్త ప్రధానములయిన రోగములందు చూపట్టు లక్షణములు. పిత్తవ్యాధులందీ క్రింది సామాన్య చికిత్సలు ప్రయోగార్హంబులైయున్నవి.

1. స్నేహము : పిత్తశామకములయిన తైలములో చరముట, (స్వేదముకూడదు. చెమ్మట అధికముగా పట్టుట గూడ పిత్తప్రకోప లక్షణమయిఉన్నది.) కేవల ఘృతమును గాని ఔషధ సిద్ధమయిన దానినిగాని పైకిని లోపలికిని ప్రయోగింప వచ్చును.

2. ప్రదేహము : మంటను తగ్గించు చల్లని లేపములు, మలామాలు, పట్టీలు, చూర్ణములు మున్నగునవి.

3. పరిషేకములు : చల్లని జలప్రక్షేపములు.

4. అభ్యంగము – తలంట్లు

5. అవగాహము – చన్నీటిలో మునిగి స్నానము చేయుట.

6. విరేచనము – ఇవి పిత్తవ్యాధి చికిత్సయందు ప్రధానమయినది.

7. ఆహారము – మధుర, కషాయ; తిక్తప్రధానము.

8. హర్మ్యవాసము – చల్లని పిల్లవాయువులు సోకుచు చంద్ర కిరణ స్పృష్టంబు లయిన మిద్దెలు నదీసైకతంబులు మున్నగునవి సేవించుట. శీతములైన సురభిగంధ ములను సేవించుట.

9. పరమశిశిర ముక్తామణిధారణము – మిగుల శీతలములయి, శక్తివంతము లయిన ముక్తాహారములను, మాణిక్యంబులను శరీరములందు ధరించుట.

10. గీతవాదిత్రానామ శ్రవణము–శ్రావ్యములయిన గాన, వాద్యాది శ్రవణము.

11. ఉద్యానవన సేవ–పూదోటలందు విహారము.

12. సుహృత్ సంయోగము–ప్రాణ మిత్రులతో సల్లాపము, ఇట్లు ఉత్సాహ వర్ధకములు, శీతలములు అయిన ఇతరములు.

# కఫ వ్యాధి చికిత్సలు

(ఆయుర్వేదచికిత్సా సూత్రములు-కఫవ్యాధి చికిత్సలు)

మిగుల చల్లతనము, బరువు, స్థూలత, బండతనము, స్నిగ్ధత, తెలుపురంగు, నునుపు, పురాణమయిన తీట నాలుకయందు తీపి, ఈ లక్షణములు శ్లేష్మవ్యాధు లందు సాధారణముగా చూపట్టును. ఇందు చేయదగిన చికిత్సలు ఈ క్రింది వరుసలో వివరింపబడియున్నది.

1. స్వేదనము-చెమ్మట నుత్పత్తిచేయుట స్నేహముకూడదు. విశేషముగా స్నిగ్ధత కలిగియుండుట, కఫరోగములందుండు లక్షణములు.

2. ఉద్వర్తనము-సుగంధములయిన పిష్టాదులతో నలుగుపెట్టుట, ఇది చర్మ మును నిర్మలము గావించి రక్తభ్రమణము నధికముచేయును.

3. ఉద్ఘర్షణము-చేతులతో విసురుగా ఇటునటు రుద్దుట.

4. ఉన్మర్దనము-గట్టిగా తోముట.

5. ఉత్సాదనము-రోమములకు ఎదురుగా గట్టిగా నొక్కుచు దీర్ఘమయిన ఆఘాతములతో తోముట

6. ధావనము - పరుగిడుట

7. లంఘనము - దుముకుట, కుందుట

8. ప్లవనము- ఈదుట

9. పరిసారణము-చక్రమువలె తిరుగుట

10. జాగరణము-నిద్రనాపుట

11. నియుద్ధము-కుస్తీపట్లు

12. వ్యాయామము-శాస్త్రీయములయిన కసరతులు పనిచేయుట మొదలగు శ్రమకలిగించు చర్యలు.

13. వ్యవాయము-మైధునము

14. స్నానము-ఉష్ణస్నానము

15. ప్రణిపాతము-సాష్టాంగముగా పడుట. ఇది చైతన్య నాశ్రయములయిన భక్తి విశ్వాసములతో చేయవచ్చును. సూర్య నమస్కారములు మొదలయినవి.

16. యాత్రాగమనము-నడచి తీర్థములకు బోవుట

17. నస్యకర్మ – నాసావిరేచనములు

18. వమనము – కఫవ్యాధుల చికిత్సయందు సర్వప్రధానము

19. ఉపవాసము – లంఘనము

20. ఆహారము –చేదు, వగరు, కారము, గల ఆహారములు. నేయి,నూనె,చాల వరకు వర్జ్యములు. పచ్చని పదార్థములు, కఫనాశక ములయిన ఇతరములు.

## ప్రధానములైన ఔషధులు-వ్యాధులు

1. నీటియందు సన్నఇసుకను, లోష్టము (పెంకులును) లను వైచి కాచి, వడబోసి చల్లార్చిన ఉదకము దప్పియందును

2. పేలాలు ఛర్దియందును

3. శిలాజత్తువస్తి రోగములందును

4. ఆమలకము, పసుపు ప్రమేహములందును

5. లోహచూర్ణము పాండువునందును

6. కరక్కాయ వాతకఫ రోగములందును

7. పిప్పలి ప్లీహరోగమునందును

8. లక్క సంధానమునందును (కూర్చుటకు, అతుకుట)

9. దిరిశెనము విషమునందును

10. గుగ్గిలము మేఢీ ఆగ్రమమయిన వాయువునందును

11. అడ్డసరము రక్తపిత్తమునందును శ్రేష్టము

12. కొడిశెపాల అతిసారమునందు

13. నల్లజీడి అర్శస్సునందును

14. బంగారము గరవిషమునందును

(అన్నముతో నిడిన స్వల్ప విషము,) ఇతరములయిన ఆంత్ర విషములు)

15. రసాంజనము స్థౌల్యరోగమునందును

16. వాయువిడంగము క్రిమిరోగమునందును

17. మద్యము, మేకపాలు, మేకమాంసము క్షయరోగము (శోష) నందును.

18. త్రిఫల నేత్రరోగములందును
19. మజ్జిగ గ్రహణియందును
20. ఖదిర సారము కుష్టమునందును
21. గోమూత్ర శిలాజతు అనేకరోగములందును
22. పురాణ ఘృతము ఉన్మాదమునందును
23. మద్యము శోకమునందును
24. బ్రాహ్మి అపస్మారమునందును ప్రశస్తములు
25. పాలు నిద్రానాశమునందును
26. రసాలము (పెరుగునుండి తయారు చేయబడును) ప్రతిశ్యాయమునందును ప్రశస్తములు
27. మాంసము కార్శ్యమునందును
28. వెల్లుల్లి వాతమునందును
29. స్వేదకర్మ స్తంభము నందును
30. బూరుగుబంక నస్యరూపమున చేతులు, భుజములు, భుజశిరస్సు వీని శూలల నందును
31. వెన్నయు, పంచదారయు, ఆర్దిత వాతమునందును ఉత్తమ ద్రవ్యములు
32. ఒంటె మూత్రము, ఒంటెపాలు,ఉదరరోగమునందును
33. నస్యము శిరో రోగములయందును
34. నూతన విద్రధియందు రక్తమోక్షమును
35. నస్యము, కబళము, ముఖరోగములందును
36. నస్య, అంజన, తర్పణములు నేత్రరోగములందును
37. పాలు,నేయి, వార్ధక్యము నాపుటయందును
38. చల్లనినీరు, చల్లనిగాలి,నీడ, మూర్ఛయందును ప్రశస్తములు
39. శుక్తముతో (మద్యభేదము) కలిపిన అల్లము మందాగ్ని యందును
40. మద్యము, స్నానము, శ్రమయందును
41. వ్యాయామము, దుఃఖసహనము కొరకున్ను, స్థైర్యము కొరకున్ను

42. పల్లేరుమూత్రకృచ్ఛ్రము నందును

43. వాకుడు కాసమునందును

44. పుష్కర మూలము పార్శ్వశూలమునందును

45. ఉసిరిక రసాయనములందును

46. త్రిఫల, గుగ్గిలములు, వ్రణములందును ప్రశస్తములు.

47. తిప్పతీగ వాతరక్తమునందును

48. తుంగ ముస్తలు, పర్పాటకము, జ్వరమునందు శ్రేష్ఠము.

49. వస్తి వాతరోగములందు ప్రశస్తము

50. విరేచనము పిత్తరోగములందుత్తమము

51. వమనము శ్లేష్మమునందు శ్రేష్ఠము

52. తేనె కఫ రోగములందు ఉత్తమము

53. నేయి పిత్తరోగములందు ప్రశస్తము

54. తైలము వాతరోగములందు శ్రేష్ఠము

ఈ పైన వివరింపబడినవి కొన్ని ప్రత్యేక రోగములయందుపయుక్త చికిత్సలుగా నున్నవి. దేశ, కాల, బలములననుసరించి వీనిని మార్చవచ్చును. కలుపవచ్చును. ఇది వైద్యునికౌశలము.

## పథ్యాపథ్యములు

**భుజింపదగినవి :** పొట్లకాయ, బీరకాయ ఆనప (సొర) కాయ, దోస కాయ, పెండలము, పెరుగుతోటకూర, మెంతికూర, ఆవుపాలు, పాతచింత కాయపచ్చడి, పాతనిమ్మకాయ, లేతవంకాయలు, పెసరపప్పు మొదలగునవి.

**అప్పుడప్పుడు భుజింపదగినవి :** మెత్తగానుడికిన కందిపప్పు, తీగగా దొండకాయ, బంగాళాదుంపలు, చారు మొదలగునవి.

**జావలు :** సగ్గుబియ్యపుజావ, గోధుమనూకజావ, బియ్యమును కొద్దిగా వేయించిన విసరబడిన నూకలజావ మొదలగునవి. వానిని వ్యాధినిబట్టియు తత్త్వాదులను బట్టియు సేవింపవలయును. జ్వరము యొక్క ప్రారంభస్థితి లోను జీర్ణకోశము బలహీనముగ నున్నప్పుడును, జావల యొక్క పైతేటనే ఉపయోగింపవలయును. ఆవుపాలను కలిపిగాని కలపకగాని ఉపయోగింప వచ్చును. తీపిని కోరినచో కొద్దిగా పటికిబెల్లపు చూర్ణమును వేయవలయును.

పాలుపోసినచో ఉప్పును వేయగూడదు. జావలను సేవించునపుడు పాత చింతకాయ పచ్చడి మొదలగువాని నుపయోగించుట శ్రేష్ఠముకాదు.

గంధకభస్మము, గంధకరసాయనము, గంధకపుష్పము మొదలగు గంధక ప్రధానమగు ఔషధములను సేవించునప్పుడు నూనె, ఆవ, వంకాయ, చింతపండు పులుపు విశేషకారము మొదలగు పైత్యమును వేడిమిని, చేయు వస్తువులను సేవింపకూడదు.

ఇచ్ఛాపథ్యమనగా నూనె, ఆవ,కంద, అరటికాయ, గోంగూర, వంకాయ విశేషము చింతపండు, విశేషము కారము, పెరుగు, బచ్చలి, గుమ్మడిమొద లగు కేవలము వేడిచేయు వస్తువులనుగాని కేవలము చలువచేయు వస్తువు లను గాని కాకుండ సమశీతలమగు వస్తువులను వ్యాధిని తత్త్వమును బట్టి భుజింపవలయునని కొందరిమతము. ఆయా వ్యాధులకును, తత్త్వములకును సరిపోవు ఆహార విహారములను ఆచరింపచేయుటయే యిచ్ఛా పథ్యమని మా మతము.

**విషయము :** పైన వ్రాసిన పథ్యాపథ్యములు సామాన్యదృష్టితో వ్రాయబడినవి. ఒక్కొక్కప్పుడు వ్యాధిననుసరించి పై పథ్యములు కొన్ని అపత్య ములుగను అపథ్యములు కొన్ని పథ్యములుగను నుండవచ్చును ఉ దాహర ణము– వాత వ్యాధి యందు ఆనపకాయ అపథ్యముగను కందపథ్యముగను యుండవచ్చును మరియు వస్తువులను సామాన్యముగ చెప్పినను వాటియొక్క భేదముననుసరించి గుణభేదముండునని తెలిసికొనవలయును. ఉదాహర ణము–పెద్దదోసకాయ గుణమువేరు, చిన్నదోసకాయ గుణమువేరు. కాల మునుబట్టియు దేశమునుబట్టియు చిన్న దోసకాయ యందుకూడ గుణభేద ములు కలవు. మరియు పాకభేదమును వస్తు సంయోగ భేదమును అనుసరించి గుణభేదమునుండును. ఉదాహరణము మినుముతో తయారు చేయబడిన గారెల గుణము వేరు. మేహ వాతములను హరించును. బియ్యపు పిండిని కలిపి నీటి ఆవిరిమీద నుడికించిన వాసెనకుడుము (ఇడ్డెను) గుణము వేరు. మేహశాంతిని చేయును. బియ్యపు పిండిని కలిపి కాల్చిన మినపరొట్టె గుణమువేరు వేడిని మందమును చేయును. ఇట్టి గుణభేదముల నన్నిటిని సమన్వయించుకొనుచు పథ్యాపథ్యాదులను నిర్ణయము చేయవలయను.

## పథ్య కల్పనలు

ఆయుర్వేద శాస్త్రమునందలి ద్రవ్యా కల్పనలు ఔషధ మరియు ఆహార కల్పనలుగా విభజించి వర్ణింపబడినవి. ఆరోగ్యమునకు హితమైన పథ్యకర ఆహారములలో చేయబడు కల్పనలు వ్యాధి చికిత్సలలో ఔషధములతోబాటు రోగి సేవించవలసి యుండును. పథ్యమును గూర్చి వివరిస్తూ చరకాచార్యుడు (సూ. 25)

**"పథ్యోఽ ణపేతం యద్యచ్చోంక్త మనసః ప్రియమ్"**

శరీరరూపమైన మార్గమునకు అపకారమును చేయుకుండునది, మనస్సుకు ప్రియమైనదానిని పథ్యముగా నిర్వచించెను. లోకమున పథిన్ శబ్దమునకు మార్గమని అర్ధము. అట్టి మార్గవాచక పథిన్ శబ్దముచేత ఇచ్చట శరీరమునందలి "స్రోతోరూపములైన మార్గములకును, రసాది ధాతువుల కును ఆధారమైన శరీరము గ్రహింపబడును. ఆపేతమనగా అపకారి, అప కారి కానిది అనపేతమని గ్రహించవలెను. స్వస్థత నుండువారికి స్వస్థపరి పాలనంబును, రోగులకు రోగనివృత్తి చేయుటయు చికిత్సా విషయమున మార్గమని చెప్పబడును అట్టి స్వస్థపాలన రోగ నివర్తన రూపమార్గమునకు అపకారము చేయకుండుట పథ్య లక్షణమనియు చెప్పవచ్చును.

**"పథ్యేసతీ గదార్తస్య కిమౌషధ నిషేవణం"** అను లోలంబరాజు వచనానుసారం పథ్యకర ఆహారసేవన వలనే ఔషధము లేకుండానే వ్యాధిని నిరోధించవచ్చును. మరియు వ్యాధిని శమింపచేయవచ్చును.

చరకుడు కృతాన్నవర్గమున (సూ. 27) పేయా, విలేపి, మణ్ణము, సక్తువులు, మాంసరసము, రాగషాడవ మొదలగు పథ్యకల్పనలను వర్ణించెను. ముఖ్యముగా వ్యాధి చికిత్సలో నిర్దేశించబడిన కొన్ని పథ్యకల్పనలు ఈ అధ్యాయమున వివరించబడుచున్నవి.

**మండము :** పదునాలుగింతల నీటిలో తండులాదులను చేర్చి మెతు కులు లేకుండినట్లు పక్వము చేయబడు గంజి మండమనబడును. దీని యందు సైంధవ లవణము శొంఠి చూర్ణము యథావశ్యకముగా కలిపి పానము చేయవలెను. నఘగము (సిక్థము) కొద్దిగా కూడాలేని ద్రవభాగమునే మండమందురు. లఘుగుణము, శీతవీర్యము కలిగియుండును. దీపనీయ, ధాతు సౌమ్యకర కర్మలను కలిగియుండును. శ్రోతస్సులను మృదువుగా

చేయును. పిత్తము, జ్వరము, కఫము, భ్రమలను పోగొట్టును. దీపన శక్తిని, లఘుగుణమును కల్గినదగుట వలన లంఘనమును పొందినవారు. విరేచన కర్మను పొందినవారు, స్నేహకర్మను పొంది ఆ స్నేహము జీర్ణమైన పిదప, దప్పికను పొందిన వారికి ప్రాణమిచ్చునదిగ ఉండును.

**అష్టగుణమండము :** ఇంగువను వేయించి నూనెలో కలిపి దీనిలో ఫల ప్రమాణము పెసలు, రెండు ఫలముల బియ్యమను వేయించి, అందు ధని యాలు, శొంఠి, పిప్పళ్ళు, మిరియాలు, సైంధవలవణములను నలియగొట్టి వైచి 14 భాగముల నీరు పోసి కాచి, వడియకట్టి సేవించిన జ్వరము, వాతాది దోషములు హరించుటయేకాక, అగ్నిదీపనము, ప్రాణములకు తేజస్సు, వస్తి శోధనము, రక్తవృద్ధి కలుగును. ఇందు ఎనిమిది గుణము లుండుటచే ఇది అష్టగుణమండమనబడును.

**వాట్యమండము**–యవలను చక్కగ దంచి వేయించి, అందు 14 భాగముల నీరుపోసి ఉడికించి వడియకట్టుట వాట్యమండమనబడును. దీనిని సేవించిన శ్లేష్మపిత్తముల ప్రకోపము, రక్తపిత్తములను హరించును. కంఠము నకు హితముగా ఉండును.

**లాజమండము** – వరిపేలాల యందైనను, వేయించిన బియ్యము నందైనను 14 భాగముల నీరుపోసి కాచి వడియకట్టుట లాజమండమన బడును. దీని సేవనచే శ్లేష్మపిత్త ప్రకోపము,దప్పితో కూడిన జ్వరము నశించుటయేకాక అతిసారము శమించును.

**ప్రేయా :** పేయా మరియు యవాగు రెండూ ఒకటేనని కొందరి అభి ప్రాయము. ఆచార్య డల్హణుడు (సు.సూ.46) సిక్థైవిరహిలో మణ్డః" అను శ్లోకము పై వ్యాఖ్యానిస్తూ పేయా యవాయ వాగ్వాపర్యాయాసిక్థ సమన్వితా" అనుచూ పేయను యవాగు యొక్క పర్యాయముగా పేర్కొనెను. వారి మతానుసారము "యవాగూం షడ్గుణోమ్భసి" యవాగునందు 6రెట్లు ప్రమాణంలో నీరు గ్రహించవలెనని పేర్కొనెను. పదునాలుగింతల నీటిలో మెతుకులు ఉండునట్లు సిద్ధము చేయబడిన గంజి "పేయ" అనబడును.

పేయ కుక్షిరోగము, ఆకలి, దప్పిక, బడలిక, జ్వరము, మొదలగు వానిని పోగొట్టును. ధాతుపుష్టికరముగను, రుచికరముగను, అగ్నిదీప్తికరము గను, లఘు గుణముకలదిగను ఉండును. వాతాది దోషములు, మలము వీనికి అనులోమ గతిని కల్గి స్వేదము వెడలింపచేయునదిగ ఉండును.

లాజపేయ–పేలాల యొక్క పేయ ఆరిపోవుచున్న కంఠము కలవాని యొక్క శ్రమను పోగొట్టును. దప్పికను, అతిసారమును శమింపచేయును.

యవాగు : యవాగునందు మణ్డ పేయ విలేపి అను మూడు కల్పనలు యుండును.

ద్రవ్యమునకు 6 రెట్లు నీరు చేర్చి పాత్రయందు కొంచెము ద్రవరూపముగా ఉడుకునట్లు, ఉడికించినది "యవాగువు" అనబడును. శారంగధర సంహితా కారుడు ఔషధ దవద్రవ్యములను 4 పలములు గ్రహించి నలియ గొట్టి అందు 64 పలముల నీరు పోసి సగము మిగులునట్లు కాచి వడియ గట్టి అందు బియ్యము మొ॥న వైద్యోక్త ద్రవ్యములను చేర్చి గట్టియగునటుల మరల కాచబడినది యవాగువు అని పేర్కొనిరి. కాశ్యపుడు యవాగు నిర్మాణము నందు బియ్యమునకు 20 రెట్లు లేదా 15 రెట్లు లేదా 10 రెట్లు నీరు కలపవలెనని పేర్కొనెను. యేయవాగునందైతే చేతికి ఎన్నికణములు పట్టుకొనుటకు వీలుపడదో దానిని పేయాగాను, అన్న కణములను చేతితో పట్టుకొనుటకు వీలుపడిన దానిని యవాగు అని కాశ్యపుడు వర్ణించెను. చాలా చిక్కగానుండుట, చాలా పలుచగా నుండుట, చల్లగా నుండుట, బియ్యము కడుగులేకుండుట, పిచ్ఛిలత్వము, విశదత్వము, మరియు శహ్రు ద్యములనునవి యవాగు యొక్క దోషములుగా వర్ణించెను. (కా.ఖి.4)

**విలేపీ :** "విలేపీ విరలద్రవా" అనువచనాను సారము సిత్థ (ఘన)భాగము తక్కువగాను, ద్రవభాగము అవితక్కటిగా ఉన్న దానిని విలేపీ అంటారు.

4 రెట్లు నీటిలో తండులాదులను చేర్చి మెతుకులు ఉడుకునట్లు చిక్కగ కాచబడిన గంజి విలపి అనబడును. విలేపి తర్పణ, హృద్య, గ్రాహ, దీపనీయ, కర్మగలిగియుండును. నేత్ర జ్వరము, అతిసారము, అగ్ని మాంద్యము ఇందుఉపయుక్తుముగా యుండును.

**కృశరా :** పెసలు, బియ్యము ఈ రెండింటినీ సమానంగా కలిపి పక్వము చేయబడినది "కృశరము" (పులగము) అనబడును. (యో.ర) దీనినే ముద్గ తండుల కృశరము అందురు. ఇది లఘు గుణము కలదిగను, అల్పబలమును కలిగించునది గను, అన్నము కంటే కష్టముగ జీర్ణమగునదిగను, బలము, పుష్టి తృప్తినీ ఇది కల్గించునదిగను, శీతవీర్యము కలదిగను ఉండును.

**మాషతండుల కృశరా :** తెల్లనిబియ్యము ఒక భాగము, దానిలో నాల్గవ భాగము మినపప్పు వీనిని కలిపి తగినట్లు నీటినిచేర్చి వుడుకునప్పుడు అందు ఇంగువ, ఉప్పు, అల్లము, నెయ్యి వీనిని చేర్చి బాగుగా పక్వము చేయబడిన కృశరము శిశిర ఋతువునందు హితకరముగ ఉండును. బల్య, వాతహర, సర, కఫకరము, కృశర ఆలస్యముగ జీర్ణమగును. బలకరము గను, గురుగుణము కలదిగను, మలకర, శుక్రల కర్మలను కలిగియుండును.

**అన్నము లేక భక్తము :** 4 పలముల బియ్యమునకు, 14 పలముల నీరుపోసి వుడికించి గంజి వార్చిన అందలి గంజిని మండమనియు, ఘన(సిక్థ) భాగమును అన్నము లేక భక్తము అనియు అందురు. ఈ క్రమంలో అన్నమును వండి గంజివార్చి పిమ్మట కొంచెం నేతిని ఆ అన్నము మీద వేసి మూత మూసి ఎర్రని నిప్పుకణికను దానిపైన వుంచవలెను. ఘడియ కాలం గడిచిన పిమ్మట నిప్పుకణికలను తీసి వేసి గరిటతో అన్నము యొక్క పై భాగమును మాత్రము తీసివేయవలెను. ఈ విధంగా సిద్ధము చేయబడిన అన్నము రాజయోగ్యముగ వుండును.

మిక్కిలి వేడి అన్నము బలమును హరించును. చల్లనిదియు, ఎండిన దియు అగు అన్నము చక్కగ జీర్ణంకాదు. చిమిడిపోయిన అన్నము అరుచిని కల్గించును. చక్కగా పక్వము కాని అన్నము ఆలస్యముగా జీర్ణమగును. నీరు గ్రహించిన అన్నము శ్వాస, కాస, అగ్నిమాంద్యము, పీనస అను రోగము లను కలిగించి దేహ కాంతిని, బలమును హరించును. మరియు మల, వాతములను నిరోధించును.

మజ్జిగతో వండిన అన్నము గ్రహణి, మూలవ్యాధి, బడలిక వాతములను హరించును. బలము, శ్లేష్మము, పిత్తము, రక్తములను వృద్ధిచేయును. వేయించిన బియ్యపు అన్నము రుచిని పుట్టించునదిగను, కఫమును హరించునది గను, లఘువుగను, వాత పిత్తములను హరించునదిగను, మలమును బంధించునదిగను, జ్వరము, క్షయ, అతిసారములను పోగొట్టునదిగను, ఉండును. కడుగబడని బియ్యముతో వండబడినట్టి, గంజిని వార్చివేయబడ నట్టియు, మెత్తగ ఉడికించ బడినట్టియు, చల్లారినట్టియు అన్నము గురు గుణము కల్గి ఉండును.

మాంసము, కూరలు, వస, తైలము, ఘృతము, మజ్జ, పండ్లు వీనితో తయారుచేయబడిన అన్నములు బలమును, తర్పణమును, కల్గించును. హృదయమునకు మేలును కల్గించును. గురుగుణము కల్గి ఉండును.

బృంహణమును కల్గించును.

మినుములు, నువ్వులు, పాలు, పెసలు, వీనితో తయారు చేయబడిన అన్నములు పైన చెప్పబడిన గుణములనే కల్గి ఉండును.

**యూషము** : కల్కమున ఒక ప్రస్థము నీరుపోసి కొంచెము చిక్కగా కాచుటయే యూషమనబడును. అందు సాధారణ ద్రవ్యములను కల్కముచేసి కలుపునెడల కర్షప్రమాణము, శొంఠి, పిప్పళ్ళు, వీనిని కల్కముచేసి కలుపు నెడల అర్ధకర్ష ప్రమాణము కలుపవలెను. (శా.సం)

పెసలు మొ॥గు ద్విదళ ధాన్యమును 18 రెట్లు నీటిలోవేసి పక్వము చేసిన యెడల యూషమనబడును. యూషము బలకరముగను, సులభముగా జీర్ణమగునదిగను, రుచిని పుట్టించునదిగను, కంఠమున చేరు కఫమును హరించునదిగను ఉండును.

**ముద్గయూషము :**(పెసలకట్టు) అగ్నిదీపనము చేయునదిగను, శీత వీర్యము కలదిగను, లఘుగుణము కలదిగను, వ్రణము, మెడ కొంకులకు పై భాగమున జనించు రోగములు, తాపము, కఫము, పిత్తము, జ్వరము, రక్తదోషములను హరించును. దానిమ్మ, ఉసరిక, వీని పులుసులుచేర్చి సిద్ధం చేయబడిన పెసరకట్టు పిత్తవాతములను హరించునదిగను, పథ్యకరము గను, లఘుగుణము కలదిగను, అగ్ని దీప్తిని కల్గించునదిగను, సరగుణము కలదిగను వుండును.

**ముద్గామలక యూషము** : ఆమలక యుక్తమైన పెసరకట్టు మలము లను భేదించునదిగను కఫము, పిత్తము, దప్పి, తాపము, మూర్ఛ, భ్రమ, మదములను హరించునదిగను, శీతవీర్యము కలదిగను వుండును.

**కులుత్థ యూషము :** ఉలవకట్టు గుల్మము, మూలవ్యాధి, కఫము, వాతము, అశ్మరీ, శర్కవాశ్మరి, తూని, ప్రతూని, మేదోరోగము, మేహములను హరించును. అగ్నిదీప్తికరముగను, సరగుణము కలదిగను ఉండును.

**చణకయూషము :** శనగకట్టు శీతవీర్యము లఘుగుణము కలిగియుం డును. రక్తపిత్తము, ప్రతిత్యాయము, కాస, పిత్తము, కఫములను హరింప చేయును.

**ఆడక యూషము :** కందికట్టు మధురముగను, కొంచెము వగరుగను, విశేషముగ వాతమును హరించును. పిత్తము, కఫము, జ్వరము, క్రిములు, గుదభ్రంశములను పోగొట్టును.

**రసము :** మాంసముచే సిద్ధము చేయబడినది రసము లేక మాంస రసము అనబడును.

శుష్కించిన వారికి, వమనాది కర్మలచే శుద్ధులైన వారికి , వమనాది కర్మలచే శుద్ధిని కాంక్షించువారికి, దుర్బలులు, బలము, వర్ణము, స్వరము విశుద్ధముగా ఉండునట్లు కోరుకొనువారికి, విరిగి వేరయిన సంధులు కలవారును, ఉరఃక్షత రోగులు, ధాతువులు, ఇంద్రియములు, ఓజస్సు క్షీణించిన వారికి, వ్రణములచే బాధపడురోగులకు, వాతరోగులకు మాంసరసము మిక్కిలి శ్రేష్ఠమైనది. ఈ మాంసరసము హృద్య, బల్య, ప్రీణన కర్మలు కలిగి యుండును. (అ.సం.)

**రాగము :** చెక్కు తీసిన పచ్చిమామిడికాయ ముక్కలయందు చక్కెర, సౌవర్చలవణము, సైంధవ లవణము, వృక్షామ్లము లేక చింతపండు, చిట్టీత పండ్లు, నిమ్మపండ్లు, రసము వీనిని చేర్చి ఆవాలచే సంస్కరించిన యెడల రాగము అనబడును. (యో.ర)

**భాణ్డవము (షాడవము) :** చెక్కు తీసిన పచ్చిమామిడికాయ ముక్కలను పైన చెప్పినట్లు మధుర, ఆమ్లాది రసములను చేర్చి పక్వము చేసిన యెడల ఖాండవము అనబడును. ఇవి అగ్ని దీపనమును, బలమును, రుచిని, హృదయమునకు బలమును కల్గించునదిగను, తీక్ష్ణగుణము కలదిగను, శ్రమను హరించునవిగను ఉండును. (యో.ర) "మధురామ్ల ద్రవ్యకతా!" అనుచు మధుర, ఆమ్ల ద్రవ్యములతో చేసిన భక్ష్యమును షాడవముగా డల్హణుడు పేర్కొనెను. ఖాడ్జవము షాడవముకు పర్యాయనామముగా గ్రహించవలెను.

**రాగభాండవము :** పచ్చిమామిడికాయ పై చెక్కుతీసి 2,3 ముక్కలుగా కోసి నేతిలో మృదువుగ వేయించి కలకండ పాకమునందు చేర్చి పక్వము చేసి మిరియాలు, ఏలకులు, పచ్చకర్పూరము వీనిని తగినట్లు చేర్చి ఘృత బాండమందు ఉంచిన యెడల అది రాగ భాణ్డవ మనబడును. (యో.ర)

రాగభాండవము పుష్టికరముగను, బలకరము, పిత్తము, వాతము, రక్త దోషము, అరుచి వీనిని పోగొట్టును. స్నిగ్ధ, గురుగుణము కలిగి మధురముగ నుండును.

**కాంబళికము :** నువ్వుల కల్కము, పులిచింత వీనిచే సిద్ధము చేయబడినది 'కాంబళికము' అనబడును. (అ.స). ఇది హృదయమునకు హితకరమైనది. కాంబళికము స్నేహాదులచే భర్జన చేయబడును.

**వాట్యోదన :** వాట్యమనగా "భృష్టయవౌదన" వేయించిన యవలచే తయారుకాబడిన అన్నముగా చక్రపాణి పేర్కొనెను. (చ.సూ27) దీనినే వాట్యమండమని అందురు. పదునాలుగింతల నీళ్ళతో తండూలాదులను చేర్చి మెతుకులు లేకుండునటుల పక్వము చేయబడు గంజి మండమన బడును. వేయించిన యవలతోచేయబడిన మడ్కంబమును వాట్యోదన లేదా వాట్యమండముగా పరిగణించబడినది. ఇది లఘువుగను, మలమును బంధించునదిగను, శూల, తాపము, త్రిదోష ప్రకోపమును పోగొట్టునదిగా నుండును. దీనిలో పొట్లకాయ, పిప్పళ్ళుచేర్చి సిద్ధముచేసి త్రాగించిన తరుణ జ్వరమునందు పథ్యకరముగా నుండును.

**వేశ్వవార :** ఎముకలులేని మాంసమును బాగుగా ఉడికించి తరువాత బాగుగా దంచి దానిలో పిప్పళ్ళు, మరిచచూర్ణము, శొంఠి, గుడము, ఘృతము సముచిత ప్రమాణములో కలిపి ఒక పాత్రయందు పోసి పక్వముచేసిన దానిని వేశవారము అందురు. (సు.సూ. 96)

వేశవారమనగా శొంఠి, ధనియాలు, జీలకర్ర మొ॥గు వాని ద్రవ్యము లను సూక్ష్మచూర్ణముతో సంస్కరింపబడిన మాంసమని అని శశిలేఖ వ్యాఖ్యాన కారుడు వర్ణించెను.

శుంఠి, మిరియాలు, పిప్పళ్లు, జీలకర్ర, దానిమ్మపండ్లు, మోడి వీనిని సముదాయ చూర్ణమునకు వేసవారము అనిపేరు. వేశవారము గురుగుణము కలదిగను, స్నిగ్ధముగను, బలకరముగను, దాహమును హరించునదిగను, సమస్త ధాతువులకు పుష్టినొసంగునదిగను, ముఖ్యంగా మలదోషమును హరించునదిగ ఉండును.

తలమపాకులు, బియ్యము, లవంగములు, మిరియాలు ఇవి వేశవారము యొక్క దినుసులు ఈ వేసవార ద్రవ్యములు కలిపి ఉడికించినచో మాంసము శుద్ధి పొందును. ఇది మిగుల వృష్యము. బలకరము, రుచి కరము బృంహణము, దోషత్రయమును శమింపజేయును. అగ్నిదీపకము, ధాతు వర్ధకముగా పనిచేయును.

**తక్రము :** పెరుగును వెన్న వెలువడువరకు మధనము చేయగా వచ్చిన తక్రము అనబడును.

తక్రము లఘుగుణము కల్గివుండును. ప్రారంభమునందు కషాయ రసము, ఆమ్లరసములు ఒకదానితో ఒకటి కలసి ఉండును. జఠరాగ్నిని వృద్ధిపరచును. కఫవాత వికారములను శమింపచేయును. శోఫ, ఉదర,

అర్శోరోగములను, గ్రహణీదోషమును, మూత్రకృచ్ఛ్రమును, అరుచిని, గుల్మ, ప్లీహ వ్యాధులను, ఘృత పాన జనిత వ్యాపత్తులను, పాండురోగమును శమింపచేయును. మజ్జిగ ఘోలము, మథితము, ఉదశ్విత్తు, తక్రము అను నాలుగు విధములుగా పేర్కొనబడినది. పెరుగునందు నీళ్ళను చేర్చక మీగడతో గూడ చిలికిన మజ్జిగను మదితమందురు. నాలుగవ వంతు జలమును చేర్చి చిలికిన మజ్జిగను తక్రమనియు, అర్ధభాగమును జలమును చేర్చి చిలికిన మజ్జిగను ఉదశ్వితనిము (యోగరత్నాకరుడు) పేర్కొనెను. సారమేమియు లేక హెచ్చు నీరు కలపి స్వచ్ఛముగనుండు దానికి చచ్చికా అనబడునని భావమిశ్రుడు వర్ణించెను. తక్రము ఉష్ణవీర్యమగుటచే "నైవతక్రం క్షతే దద్యాన్నోష్ణకాలేన చ చుర్బలే" ఉష్ణకాలమునందు తక్రసేవన మంచిది గాదని యోగరత్నాకరుడు ఉదహరించెను. కాని చచ్చికా అను తక్రము (మజ్జిగతేట) శీతగుణము కలిగి పిత్త, శ్రమ, తృష్ణాహరముగా పనిచేయును. గావున ఉష్ణకాలము నందు సేవించవచ్చును. ఉప్పును కలిపిన మజ్జిగ గ్రహణీ రోగమునందగ్ని దీప్తిని కలిగించుననియు, లవణహీనమైన తక్రము గ్రహణీరోగము, అర్శోవ్యాధిని కలిగించునని యోగరత్నాకరుడు పేర్కొనెను. ఎల్లప్పుడు మజ్జిగను సేవించువాడు ఏ బాధలను పొందడు, తక్రముచే హరించబడిన వ్యాధుల మరల జనించనేరవు. దేవతలకు అమృతమువలె మానవులకు తక్రము సుఖకరమైనది అని వర్ణిస్తూ యోగరత్నాకరుడు "గిరీ శుడు, కేశువుడు, ఇన్ద్రుడు, చన్ద్రుడు గణపతి, కుబేరుడు, అగ్నిదేవుడు తక్ర పాన మొనర్చకపోవుటచే విష ప్రభావము, నల్లనివర్ణము, దుర్బలత్వము, ధాతుక్షయము, లంబోదరత్వము, కుష్ఠరోగములచే బాధపడినారని ఉదహ రిస్తూ కృష్ణవర్ణము, క్షయ, మేదోరోగము, దాహము, కుష్ఠరోగములందు తక్రము అత్యంత ఉపయువక్తముగా నుందునని నిర్దేశించెను.

**దధి :** రస, విపాకములు ఆమ్లముగా గల పెరుగు గ్రాహి, గురు, ఉష్ణ గుణ వీర్యములను కలిగి వాతమును, వాత వ్యాధులను జయించును. మేధో దాతువును, మేదో దోషమును, శుక్రమును, బలమును, కఫము, రక్తపిత్తమును, జఠరాగ్నిని, శోథను వృద్ధిపరచును. అరుచి యందును, ఎక్కువరుచి పుట్టించుట యందును ప్రశస్తమైనది. శీతపూర్వక విషమజ్వరము వచ్చుటకు 2 గంటలు ముందుగా పెరుగును, తృప్తిగా తాగిన యెడల ఆ జ్వరము రాదు. పీనసరోగమునందు, ఆకలి అగుచున్నప్పుడు బెల్లముకాని,

కలకండనుకాని వేసిన పెరుగు సేవించిన లాభకరముగా ఉండును. రూక్ష మైన పెరుగు (మీగడ తీసిన పెరుగు, వెన్నతీసిన పాలను తోడుబెట్టిన పెరుగు) మిక్కిలి ప్రశస్తమైనది.

రాత్రులందు పెరుగును సేవించరాదు. పెరుగును వేడిచేసి తినరాదు. వసంత, గ్రీష్మ, శరదృతువులందు పెరుగును తినరాదు. పెసరపప్పును చేర్చక, తేనె కలుపక, ఖండశర్కర కూర్చక పెరుగును సేవించరాదు. ఉసిరి కాయలను విధి విధానముగ చేర్చని దధిని తినరాదు. తోడుకొనని పెరుగును తినరాదు. అట్లుకాక పై నుదహరించిన విధంగా పెరుగును తినిన యెడల జ్వర, రక్తపిత్త, విసర్పాది రోగములుత్పన్నమగును. (అ.సం.సూ)

దధి మధురము, ఆమ్లము, అత్యమ్లము అని 3 విధములుగా ఉం డునని సుశ్రుతుడు పేర్కొనెను. మరియు పెరుగు ప్రాణశక్తిని దృఢపరచి, మంగళములను చేకూర్చుననియు చెప్పెను. మంగళకరమైనదనియు, వాత మును హరించుననియు చరకాచార్యులు పేర్కొనెను.

**కిలాటము :** పాలను, పెరుగును సమభాగంచేర్చి కాచిన యెడల అది దధికూర్చిక అనియు, పాలను మజ్జిగను రెండింటినీ సమభాగము చేర్చి కాచబడినది తక్రకూర్చిక అనియు అట్లు కాచబడిన దధి కూర్చిక, తక్ర కూర్చికల యందు వడగట్టినచో ముద్దగా ఉండునది కిలాట మన బడును, అట్టి కిలాటకము అజీర్ణకరంబును, వాతహరంబును, ఇంద్రియ పుష్టికరంబునై ఉండును. (భా.ప్ర.)

**కట్వర :** పెరుగును చిలికి దానికి నాల్గవవంతు నీటిని కలిపి తిరిగి మంథనముచేసి తక్రమును చేయవలెను. చిలికిన తరువాత వెన్నను మాత్రము వేరు చేయనిచో అటువంటి తక్రమునే కట్వరమందురు. కట్వర మనునది తక్రమునకు పర్యాయ నామముగా గ్రహించవలెను. పేయా, విలేపి, యవాగు మొదలగు కల్పనలందు గల ఘనభాగమును సిక్థ అందురు.

## పథ్యకల్పన

శాస్త్రీయ ఆయుర్వేద వైద్యమునందు మందుల తయారీ 2 రకాలుగా జరుగును. అందు 1. ఆహార కల్పన (ఆహారంతో వైద్యం) 2. ఔషధకల్పన (మందులతో వైద్యం) పథ్యకల్పన అనేది ఆహారకల్పనలో ఉండును. ఇది యుక్తి వ్యపాశ్రాయ చికిత్సగా పెద్దలు చెప్తారు. ఆయుర్వేద వైద్యములో ఆహారము, విహారాదులు, అలవాట్లు శారీరక, మానసిక స్థితులలో రోగము (వ్యాధి)గా మారును. ఆహారములు అయిదురకాలు. (పంచభక్ష్యాలు)

1. చూష్యాము : చుర్రుకుని తీసుకునేది.
2. గ్రాహ్యాము : గ్రహించేది.
3. లేహ్యాము - చప్పటించేది
4. భక్ష్యము- నమిలి తినేది.
5. భోజ్యము : నమిలి, ఆస్వాదిస్తూ తినేది.

అయితే ఆహారం శాస్త్రీయముగా 4 రకాలుగా.

1 ఖాద్యము (తినదగినవి, భుజించునది)

2. చూష్యము (నములతూ తినేది)

3. లేహ్యాము (నాలికతోనాకేవి)

4. పానీయములు (తాగేవి)

ఆహార కల్పన చెయ్యలేని వ్యక్తికి ఎంతగొప్ప ఔషధకల్పన చేసినా వృధా చికిత్స అగునని మరువరాదు. మన శాస్త్రీయ వైద్యంలో అనేక రకాల ఆహార కల్పనలు వాటి గుణాలు, కలిగే ఇబ్బందులు, తొలగే దోషాలు, ఏయే పరిస్థితులలో వాడవచ్చో / వాడకూడదో త్రిదోషాలపై వాటి ప్రభావం మనిషిపై ఆహార కల్పన స్థితిని ఈ వైద్యంలో చెప్పినంతగా మరే వైద్య విధానమునందూ చెప్పలేదు. మోడరన్ మెడిసిన్ (వెస్టన్ మెడిసన్ -అల్లోపతి)లో స్థూలంగా వాటి ఫార్ములాలుగా, ప్రోటీన్, కార్బోహైడ్రేట్స్ కొవ్వులుగా ఆహార పదార్థాలను విశ్లేషించారు. కాని మన వైద్యవిధానంలో జీవక్రియను ఆహారం ఏవిధంగా మార్చగలదో దోష సిద్ధాంతం ప్రకారం చెప్పటం జరిగింది. ఉదా:- కొత్తధాన్యం తీసుకోవ టం వల్ల కొవ్వులు శరీరంలో ఏర్పడతాయని అదే పాత బియ్యంలో అనేక పోషకాలు వుంటాయని చెప్తారు. అలాగే ధాన్యాలను, ఆహారాలను 12 రకాలుగా విభజించారు.

1. శుకధాన్యము (కంకుధాన్యాలు) 2. శమి ధాన్యములు (కాయధాన్యాలు) 3. శాకములు (కాయగూరలు) 4. మాంస (మాంసము) 5. ఫల (పళ్ళు) 6. హరిత (పచ్చికూరలు) ఉడకబెట్టినవి 7. మధ్య (సారాయి) 8. అంబు (నీరు) 9. ఇక్షు వికార (చెరకురసం) 10. కృతాన్న (వండిన ఆహారం) 11. ఆహారయోగి (ఆహారంతో కలిపి తీసుకునేవి.)

పథ్యకల్పనలలో యవాగు, మంద, అన్న,క్రిసర, యూష, ఖండ, కంబులిక, రాగ, సికత, తక్ర, కట్వక, దది వీటి ఉపయోగం అనిర్వచనము వీటి గురించి ఇదే పుస్తక మందు మరొక భాగమునందు వ్రాసాను. గమనించగలరు.

## భైషజ్య కల్పనా ఇతిహాసము

జీవితమునకు హితకర, అహితకర ద్రవ్యముల యొక్క జ్ఞానమును తెలియచెప్పు ముఖ్యోద్దేశముతోనే ఆయుర్వేద శాస్త్ర ఆవిర్భావము జరిగింది. కొన్నివేల శతాబ్దాములకు పూర్వము కాయచికిత్స, బాలచికిత్స, గ్రహచికిత్స, ఊర్ధ్వాంగ చికిత్స, శల్య చికిత్స శాలాక్య చికిత్స, భూత చికిత్స, రసాయన వాజీకరణ చికిత్సలు. అతికీలకస్థానము వహించుచున్నవని చెప్పుటలో అతిశయోక్తి లేదు. అట్టి ఔషధముల కల్పనా జ్ఞానమును గూర్చి తెలియజేయు విషయం కాలక్రమేణాభివృద్ధి తెలుసుకొనుటకు ఇతిహాసము ముఖ్యము.

ఆయుర్వేద ఇతియాసమునందలి విషయములను చరిత్రకారులు ప్రాచీన కాలమని మధ్యమకాలము మరియు ఆధునిక కాలముగా విభజించి వివరించినారు. ప్రాచీన కాలము క్రీ.పూ. 4000 సం॥నుండి ఉత్తర గుప్త కాలమైన క్రీ.శ. 7వ శతాబ్దము వరకు పరిగణించారు. మధ్యమ కాలము క్రీ.శ. 8వ శతాబ్దమునుండి క్రీ.శ. 15వ శతాబ్దము వరకు వివరించినారు. ఈ మధ్యమకాలంలో ఆఫ్ఘనులు, మొగలులు మన దేశమును ఆక్రమించి యున్నారు. ఆధునిక కాల నిర్ణయములో కొన్ని మత బేధములు కలవు. కొంతమంది ఈస్టిండియా కంపెనీ స్థాపన నుండి 16వ శతాబ్ధము నుండి

ఆధునిక కాలముగా పరిగణిస్తారు.

**ప్రాచీనకాలం :** వేదమునందు ఔషదులు ఆ పుష్ప, సపుష్ప, వనస్పతి అని నాలుగు విధములుగా వర్గీకరింపబడినవి. వైదికకాల మందు ప్రయోగింపబడిన ఓషధి నామములు నేటికినీ యధాతథముగా వాడుకతో కలవు.

వేదములలో ఓషధులు ప్రయోగభేదము చేత అధర్వణీ, అంగీరసీ, దైవీ, మానుషీ అను నాలుగు రకములుగా వర్ణింపబడినవి. శాంతి పౌష్టిక కర్మలతో ఉపయుక్త ఓషధులు అధర్వణీ అని, ఉచ్చారణ మారణాది కృత్యములలో ఉపయుక్త ఓషధులు అంగీరసి అని, దేవతలతో సమానముగా అజర, అమరులను చేసెడి రసాయనాది ప్రయోగములు దైవీ అనీ, సాధారణ ముగా రోగనివారణకు ప్రయోగింపబడెడి ఓషధులు మనుష్యజ అని వర్ణింప బడినవి.

వేదములందు సోమరసము గూర్చి విపుల వర్ణనలు కలవు. స్వరస కల్పన ఆధారముగనే సోమరస నిర్మాణము పేర్కొనబడినది. "పిలాచీ" (లాక్షా) అను ఔషధమును దెబ్బలు తగిలిన ప్రదేశమున పై లేపనము చేయవలెనని అథర్వణ వేదములో పేర్కొనబడినది. ఈ లేపము కల్క కల్పమును సూచి స్తుంది. అదే విధంగా ఔషధం కల్క కల్పనకు ఉదాహరణగా పేర్కొన వచ్చును. అథర్వణ వేదమున అవయ అను విషాక్త వనస్పతి వర్ణన కలదు. ఈ వనస్పతి స్వరసమును అగ్నిపై వేడిచేసినచో నిర్విషమగునని ఉదహరించ బడినది. ఈ ప్రక్రియ శృత కల్పనకు ఒక  ఉదాహరణగా పేర్కొనవచ్చును. శతపథ బ్రాహ్మణము నందు పాలలో వేసి అగ్నిపైపాకము చేయు కల్ప ప్రక్రియ వర్ణింపబడినది. ఈ ప్రక్రియను "తద్" దుగ్ధ్వాధిశ్రయతి శృతమనునది తితదాహ(శతపథ బ్రాహ్మణం 2-3-4) అనుచూ శృత కల్పనగా పేర్కొనబడి నది. శృత శబ్దం క్వాదమునకు పర్యాయనామము. వాస్తవంగా క్వాథకల్పన యొక్క స్వరూపమే.

కౌశిక సూత్రమునందు ఫాణ్డవకల్పన ఉల్లేఖింపబడినది.

వారిదం వారయాతై వరనావత్యామధి తత్రామృత స్యాసిక్తం

తేనా తే వారయే విషయే (ఆధర్వణవేదం 4/7/1) అను సూత్రము నందు విషమును జలమునందు కలిపి సేవించమని పేర్కొనబడినది. ఈ ప్రక్రియను శీతకనసయందు అంతర్భాగముగా గ్రహించవచ్చును.

వైదిక వాఙ్మయము నందు ఇన్ద్రావరుణా సుతపావిమం సుతం సోమం పిబతే మద్యం ధృతవతా (ఋగ్వేదం 6/68/10) ఆసావితే జుజుషాడాయ సోమః క్రత్వే రక్షాయ బృహతే మదాయ (ఋ.వే. 5/4/5) సోమ్మోవై వయోన్నం సురా (శ.బ్రా 12/7/8) మొదలగు సూత్రములందు మద్యము, ఆసవము, సురా కల్పనలు సూచింపబడినవి. అదేవిధంగా స్నేహ కల్పనలు, ఆహార కల్పనలు అక్కడక్కడ వేదములందు ఉదహరింపబడినవి. భైషజ్య కల్పనా

విజ్ఞానము యొక్క ప్రథమ దశయందే చాలా రకాల కల్పనలు వైదిక వాఙ్మయమునందు ఉదహరింపబడినవి. వైదిక కాలము తరువాత వ్రాయ బడిన గ్రంథములలో వాటినే ఆధారములుగా చేసుకొని వివిధరకాల ఔషధ కల్పనలను ఆవిష్కరించినటుల ఇతిహాసము పరిశీలించిన అవగతమగు చున్నది.

**చరకసంహిత**

ఆయుర్వేద సంహితలలో చరకసంహిత అతిప్రాచీనమైనది. ఆచార్య అగ్నివేశకృత తన్త్రము చరుకునిచే ప్రతి సంస్కరింపబడి కాలాంతరమున చరక సంహితగా ప్రసిద్ధి పొందినది. భైషజ్య కల్పన యొక్క సువ్యవస్థిత వైజ్ఞానిక వివరణ ఈ గ్రంథమునుండే ప్రారంభమైనది. చరకసంహిత సూత్ర స్థానము నందలి 4వ అధ్యాయమున పంచకషాయయోనులు, పంచకషాయ కల్పనలు వివరింపబడినవి. స్వరసము, కల్కము, శృతము, శీతము, ఫాణ్డము అను పంచవిధ కషాయ కల్పనలను మౌలిక కషాయ కల్పనలుగా పేర్కొన వచ్చును. వీటిని ఆధారముగా చేసుకొని మిగిలిన కల్పనలు రూపొందించ బడినవి. చరకుడు సంధాన కల్పనకు సంబంధించిన వివరణ సూత్రస్థానం 25వ అధ్యాయములో ఆసుత త్వాదాసవ సంజ్ఞా అని సంధాత రూపమైన 84 రకాల ఆసవాలను వర్ణించెను. వివిధ వ్యాధుల చికిత్సలలో అనేక ఔషధ కల్పనలను పత్య కల్పనలను విస్తృతముగా చరకుడు పేర్కొనెను.

**సుశ్రుత సంహిత**

సుశ్రుతుడు శల్య చికిత్సను విశేషములను వివరిస్తూ సుశ్రుత సంహితను రచించాడు. చరకుడు పేర్కొన్న పంచ విధ కషాయ కల్పనలకు భిన్నంగా "క్షీరం రసః కల్కసుఖో కషాయః కృతశ్చ శీతశ్చ తథైవ పాణ్డమ్, కల్పాషడేనే ఖలు భేషజనాం యక్షోత్తరం తే లఘువః ప్రవిష్టాః" క్షీరము (వృక్ష దుగ్ధాదులు) రసము, (క్షీరరసం, రసం) కల్కము, శృతము,. శీతము, మరియు పాణ్డవము అను ఆరు మౌలిక కల్పనలను పేర్కొనెను. ఆహార మరియు ఔషధ కల్పన లలో చరకునివలె ధాతుప్రధాన ఆయుష్కృత వంటి కల్పనలు పేర్కొనెను. ప్రప్రథమముగా వాత వ్యాధి చికిత్సలందు (సు.చి.5) గుగ్గులు కల్పమును పేర్కొనిన యశస్సు సుశ్రుతునికే దక్కుతుంది.

**అష్టాంగ సంగ్రహము-అష్టాంగ హృదయము**

వాగ్బటునిచే రచించపబడిన ఈ రెండు సంహితలందు చరకోక్త

పంచవిధ కషాయ కల్పనలు ఉదహరించబడినవి. చరక, సుశ్రుతులచే పేర్కొనబడిన కల్పనలు ఈ రెండు గ్రంథములందు ఉదహరింపబడినప్పటికీ కల్పనల సంఖ్య మాత్రము కుదించినట్లు అవగతమగుచున్నది.

## మధ్యమకాలము

**మాధవచికిత్సతం** : శ్రీచంద్రకర పుత్రుడైన మాధవకరుని ద్వారా క్రీ.శ. 7వ శతాబ్దంలో రచించపబడినది. మాధవ నిదానము వ్రాసిన మాధవకరుడే చికిత్సా ప్రధానమైన ఈ గ్రంథాన్ని రచించాడని ఆచార్య ప్రియవ్రత శర్మగారి అభిప్రాయము. సులభమైన వనస్పతి ప్రధానమైన యోగములు దీనియందు వర్ణింపబడినవి. రసౌషధములు మరియు ఖనిజ ద్రవ్యములు చికిత్సలలో ఉదహరించబడలేదు. చరక, సుశ్రుత మరియు వాగ్భటుల యోగకల్పన లను విస్తృతముగా వర్ణించెను. అతిసారమునందలి కుటజపుట పాకము పేర్కొనబడినది.

**వృన్దకృత సిద్ధయోగము (వృన్దమాధవము)** : మాధవకరుడు మాధవ నిధానమునందు వర్ణించిన రోగక్రమము ననుసరించి క్రీ.శ. 9వ శతాబ్దము నందు వృష్టుడు సిద్ధయోగము అను గ్రంథమును రచించినారు. స్నాయక రోగము మరియు పత్థ్య అనురోగములు. పారశీకయవాని మొదలగు ద్రవ్య ముల సర్వ ప్రథమంగా వర్ణించిన ఘనత వృస్థునికే దక్కుతుంది. అతిసార చికిత్సలందు కుబ్జపుటసారముతోబాటు దీర్ఘవృత్త పుటపాకము గూడ పేర్కొనబడినది.

**యోగరత్న సముచ్చయము** :క్రీ.శ.10వ శతాబ్దంలో వ్రాయబడినది. ఇందు మృతాధికారము, తైలాధికారము, చూర్ణాధి కారము, గుణికాధి కారము, అవలేహాధికారము, గదశాన్తి అధికారము పంచకర్మాధి కారము, కల్పాధికారము అను అధ్యాయములలో భైషజ్యకల్పనా విజ్ఞానము సశాస్త్రీయంగా వర్ణింపబడినది. కల్పాదికారమునందు ఆమ్లవేతస, చిత్రక, భల్లాతక, లశున, గుగ్గులు, శిలాజితు మొ॥ద్రవ్యములలో కల్పములు పేర్కొనబడినవి. సోడబుదు ఈ గ్రంథాన్ని అనుసరించి తన గదనిగ్రహమున కల్పనాధికారంలో కొన్ని ద్రవ్యాల కల్పనలను వర్ణించాడు. ఆయుర్వేద వైద్యశాస్త్ర విషయములను భైషజ్య కల్పనాపరంగా విశ్లేషించి వివరించిన మొట్ట మొదటి గ్రంథం చన్ద్రట ప్రణీత యోగరత్నము కూడా అవగతమగుచున్నది.

**రాజమార్తాండ:** భోజరాజు క్రీ.శ.11వ శతాబ్దంలో ఈ యోగసార సంగ్రహమును రచించెను. అస్థిభగ్నము మరియు వాత వ్యాధులందు నల్లేరు అస్థి సంహారకతో పకోడీలు చేసి రోగిచే తినిపించుట. అపస్మారకమునందు ఉరితీయబడిన తాడు యొక్క మసితో చికిత్సలు ఈ గ్రంథమునందు విశేషముగా పేర్కొనబడిన ప్రత్యేక భౌషజకల్పనా యోగములుగా పరిగణింప వచ్చును.

**చక్రదత్త**

చక్రదత్త చరక చతురాననగా ప్రసిద్ధిగాంచిన శ్రీచక్రపాణిదత్తునిచే రచింప బడిన అత్యంత చికిత్సోపయోగ గ్రంథం. క్రీ.శ. 11వ శతాబ్దమునకు చెందినవాడు. ఆయుర్వేద వైద్యక సాహిత్యంలో ప్రసిద్ధిగాంచిన సత్య యోగాలను స్వయంగా రూపొందించిన కొన్ని విశేష ఔషధకల్పనలు ఈ గ్రంథంలో పొందుపరచాడు. తైల మరియు ఘృత కల్పనలలో ఆచరణ సాధ్యమైన సుగమమైన ప్రక్రియలను పేర్కొన్నాడు.

అభ్రకమును నిశ్చంద్రీకరణ ముఖ్యమైనదిగా పేర్కొన్నాడు. దార్వీరస క్రియను కంఠరోగ చికిత్సలో పేర్కొన్నాడు. ధాతు భస్మములు, రసయోగములు చికిత్సలో వాడటమేగాక రసయోగాలను చికిత్సలలో ప్రవేశపెట్టిన ఘనత ఆయనకే కల్గును.

**గదనిగ్రహము :**

వైద్య సోఢలుడు కీ.శ. 12వ శతాబ్దంలోఈ గ్రంథాన్ని రచించాడు. సోఢలుడు గుజరాతి బ్రాహ్మణుడైన వైద్యనందుని కుమారుడు మాధవుడు, వృందుడు, చక్రపాణి దత్తుడు, వంగసేనుడు క్రీ.శ. 11వ శతాబ్దానికి చెందినవారు కాగా వైద్యసోఢలుడు తరువాత కాలం (12వ శతాబ్దం)లో చికిత్సలలో ప్రయోగించు ఔషధయోగాలను వేరు పరచి కల్పనల ఆధారంగా వర్ణించటం ప్రారంభించారు. అందువల్లనే భైషజ్య కల్పనా విజ్ఞానము ఒక ప్రత్యేక అంగముగా రూపొందించడంలో అతిముఖ్యుడు సోఢలుడంటే అతియోక్తికాదు. ఆసవాలను చేయుటలో నేర్పరి. ఈయన వరుణాసవను ఈయన యోగముగా చెప్పవచ్చు. అంతేగాక గుజరాతీ ప్రాంతంలోని యోగాలు, చికిత్సలు ఈయనవే వాడుకలో గలవు.

**శారంగధర సంహిత :** ఆయుర్వేద వాఙ్మయమునందు ప్రామాణిక గ్రంథములలో శారంగధరసంహిత ఒకటి. ఇందు సిద్ధయోగములు,

సద్వైద్యుల చికిత్సానుభవము లను ఈ గ్రంథములో సంకలనం చేసారు. ఈయన దామోదరుని పుత్రుడు 2600 శ్లోకాలు కల్గిన సంహితగా 13వ శతాబ్దంలో వెలుగులోనికి వచ్చింది.

**ఆధునిక కాలం :** భావ ప్రకాశిక ఈ గ్రంథకర్త కన్యాకుబ్జ (కాన్పూరు) దేశస్థుడు లటకమిశ్రుని కుమారుడగు భావమిశ్రుడు. ఇతని కాలం క్రీ.శ. 1625 గా నిర్ణయించారు, చాలా కొత్త ఔషధ ద్రవ్యముల యొక్క రస,గుణ, వీర్య, విపాక, ప్రభావాలను విపులంగా వర్ణించెను. కొంతవరకూ శారంగధర సంహితను అనుస రించారు. వేదవిజ్ఞానమును విపులీకరంగా వ్రాసారు. కొన్ని చరక సంహితలోని కల్పనలు అష్టాంగ హృదయం, అష్టాంగ సంగ్రహంలను అనుసరించి గ్రంథమును కొత్తగా వ్రాసారు.

## భైషజ్య కల్పన నిరుక్తి

భైషజ్య మరియు కల్పన అను రెండుపదముల యొక్క కలయికచే భైషజ్య కల్పన పదము ఏర్పడినది.

"భేషం రోగభయం జయతి యేన ఇతి భేషజమ్"

భేషమనగా రోగభయము. అట్టి భయమును జయింపచేసే సాధనమును భేషజమందురు. "కల్పనం యోజనమత్యర్థః" కల్పనము పయోగార్థ ప్రకల్పనం సంస్కరణమితి" (చక్రపాణి) అను నిర్వచనములు కల్పన శబ్దము నకు యోజన. సంస్కరణ అను అర్ధములు గోచరించుచున్నవి. ద్రవ్యమున కర్మ సామర్థ్యమును పెంచి వ్యాధిప్రశమునకు ఉపయోగపడునట్లు చేయు ప్రక్రియను కల్పనగా పరిగణించవచ్చును.

## భైషజ్య - ఔషధి అనెడి పదముల నిర్వచనము

వైద్య సంప్రదాయమునందు భేషజము, ఔషధము, అనెడి పదాలు ఒకదాని కొకటి పర్యాయ వాచకాలుగా ప్రయోగింపబడుచున్నవి.

"చికిత్సతం వ్యాధిహరం పథ్యం సాధనమౌషదమ్ ప్రాయశ్చిత్తం ప్రశ మనం ప్రకృతి స్థాపనం హితమ్ భైషజ్యనామాని॥ (చ.చి.1)అని పేర్కొంటూ ఓషధ బైషజ్యమను పదాలను చికిత్సకు పర్యాయ నామములుగా సూచిస్తూ "భేషజం ద్వివిధంచ తత్ స్వస్థస్యోర్జస్కరం కించిత్ కించిదార్తస్య రోగనుత్" అని వివరించాడు. శరీరానికి ప్రశస్త భావాలను (ఊర్జః) కల్గించుటకు, వ్యాధిని శమింప జేయుటకు ప్రయోగింపబడు పదార్థములు లేదా క్రియా విశేషములను "భేషజముగా" గ్రహించవచ్చును. "భేషం రోగభయం జయతి

యేన ఇతి భేషజం" (శబ్ద కల్పద్రుమ) అను మతానుసారము యేయే ప్రక్రియలు లేదా ద్రవ్యములచే రోగ విముక్తి చేయబడునో అట్టివి భేషజము, భైషజ్యములుగా వ్యవహరింపబడతాయి చికిత్స (ఔషధము)లందు స్వస్థునికి లేదా వ్యాధిగ్రస్థునికి ప్రయోగింపబడు పదార్థమును ఔషధములందు స్వస్థునికి లేదా వ్యాధిగ్రస్తునికి ప్రయోగింపబడు పదార్థమును ఔషధముగా పరిగణించ వచ్చునని కొందరి అభిప్రాయము. ఔషధమనగా చికిత్సలలో ఉపయోగించు మూలికాదులనియు, దాని వివిధ కల్పనలద్వారా ప్రయోగించు క్రియను బైషజ్యమనియు గ్రహించాలని కొందరాచార్యుల అభిప్రాయము.

## భైషజ్య కల్పనా పరిభాష

సత్ఫలితముల నిచ్చు ఔషధ యోగములను రూపొందించుటకు వివిధ ఔషధ కల్పనలకు ఆవిష్కరణకు కారణమైన ఆధారభూత సిద్ధాంతములు, కల్పనల సవీర్యకావధి, కల్పనలకు వలయు మానపరిభాష, ద్రవ్యపరిభాష, ద్రవ్య సంగ్రహణ, ద్రవ్య సంరక్షణ మొ॥ విషయములను గూర్చి సరియైన అవగాహన అత్యంత అవసరము.

**భైషజ్య కల్పన ఆధారభూత సిద్ధాంతములు**

ప్రకృతిలో లభ్యమయ్యే వివిధ ఔషధ ద్రవ్యములను యథాతథంగా వ్యాధులందు ప్రయోగింపశక్యము కానందున పలురకాల ప్రక్రియల ద్వారా సేవన యోగ్యమైన రూపంలో తయారు చేయుటకు వివిధ భైషజ్య కల్పనలు ఆవిష్కరింపబడినవి. "ఆయుర్వేదమూల సిద్ధాంతములైన దోష-ధాతు-మల సిద్ధాంతములు అగ్ని, స్రోతస్సుల ఆధారంగా, వివిధ కల్పనలు రూపొందించబడినవి. వ్యాధి చికిత్సలలో దోష లక్షణ ప్రశమనమే చికిత్సా ఫలమగుట వలన దోషముల యొక్క అంశాంశ కల్పనలను దృష్టిలో పెట్టుకొని సంప్రాప్తి విఘటనకుపకరించు విధంగా కల్పనలు తర్కించి ఆవిష్కరింపబడ్డాయి. త్రిదోషములు, సప్తధాతువులు, త్రిమలములు, అగ్ని, స్రోతస్సులను, సంప్రాప్తి ఘటకాలుగా పరిగణిస్తే వీటిపై పనిచేయు విధంగా ఔషధ కల్పనలు తయారు చేసి ప్రయోగించినచో చికిత్సలలో సత్ఫలితాలను పొందవచ్చును. దోషం, దూష్యం, బలం, కాలం, అగ్ని, ప్రకృతి, వయస్సు, సత్వం, సాత్మ్యం, ఆహారం అను అంశాల ఆధారంగా ఔషద ప్రయోగం చేయవలసి ఉంటుంది.

స్వరసము, కల్కము, క్వాథము, హిమము, పాంణ్ణము, అనునవి ప్రధాన మైన మౌలిక కల్పనలుగా పరిగణింపవచ్చును. వరుసగ అందు

ఒక దాని కంటే మరొకటి లఘుగుణము కలిగియుండును. వ్యాధ్యవస్థలో ప్రకోపించిన దోషాన్ని హరించే రస, గుణ, వీర్య, విపాకము గల్గిన ఔషదాన్ని గ్రహించి రోగి అగ్నిబలం సామాన్యంగా నున్నచో గురు గుణము కల్గిన స్వరసమును, అల్పంగా ఉన్నచో లఘుగుణము గల్గిన కషాయము లేదా పాంణ్డవమును ప్రయోగించవలెను. తైలము, ఘృతము, తేనె వరుసగా వాత,పిత్త, కఫదోష ములకు శ్రేష్టమైన శమన ద్రవ్యముగా పేర్కొనబడినది. వాతజ వ్యాధులలో వాతహర ఔషధములను స్వరసాధి రూపములలో ప్రయోగించుట కంటే ఆయా ఔషధాలను స్నేహకల్పన ద్వారా తయారుచేసిన తైలాలను ప్రయో గించుట, పిత్తజ వ్యాధులలో పిత్తహర ఔషధములతో తయారుకాబడిన ఘృతములను, కఫజ వ్యాధులలో కఫజహర ఔషధాల వివిధ కల్పనలను తేనె కలిపి ప్రయోగించుట శాస్త్రసమ్మతము. ఒకే ద్రవ్యముతో తయారు చేయబడిన రెండు కల్పనలు దోషానుసారముగా ప్రయోగించుట కూడా జరుగుతున్నది. ఉదాహరణకు ప్రవాలముతో చేయబడిన పిష్టి, భస్మములను వరుసగా పిత్తజ, కఫజ వ్యాధులలో ప్రయోగింపబడుతున్నాయి. సౌమ్య గుణము కల్గిన ప్రవాళముతో పిష్టి పిత్తహర కార్మకతను కల్గివుంటే ప్రవాలభస్మ తీక్ష్ణ గుణము వలన కఫహర కార్మకత కలిగి ఉంటుంది. చరకాది సంహిత లలో వ్యాధి చికిత్సలలో ప్రయోగింపబడు ఔషధాలను పత్యకల్పనలైన యూష, యవాగు, మందాది ఆహార రూపంలో ప్రయోగించ వలెనని పేర్కొనబడినది.

పంచవిధ కషాయ కల్పనల యందు స్వరసము గానీ, కల్కము గానీ ఔషధోపయుక్తమయిన వనస్పతులు ఆర్ద్రావస్థ యందు ఉన్నప్పుడు మాత్రమే తయారు చేయుటకు వీలుపడును. సామాన్యముగా ఎల్లవేళలా అన్ని వనస్ప తులు ఆర్ద్రావస్థలో లభించవు. శుష్క వనస్పతుల నుంచి కూడా స్వరసము గానీ, కల్కముగానీ నిర్మాణము చేయుట సాధ్యమయినప్పటికీ అవి ఆర్ద్రావ స్థలో వుండే వనస్పతుల స్వరస మరియు కల్కముల యొక్క గుణములు కలిగి యుండవు. స్వరసముగానీ, కల్కముగానీ తయారు చేసిన కొన్నిగంటల తరువాత ఉపయోగరహితముగా నుండును. అందుచేత ఈ కల్పనలు ప్రతీ సారి తయారుచేసుకొని వాడవలసి వుంటుంది. అదే విధముగా క్వాథము, హిమము, పాంటము మొ॥ కల్పనలు ఎక్కువసార్లు తయారుచేసి వాడవలసి యుండును. ఈ ఇబ్బందిని దృష్టియందుంచుకొని శీఘ్రముగా చెడిపోనటు వంటి ఎక్కువసార్లు తయారుచేయు అవసరము లేనటువంటి

చూర్ణకల్పన రూపొందించబడినది. తిక్తరసమును లేదా అరుచికర పదార్థములతో తయారు జేయబడిన చూర్ణం ఎక్కువ మాత్రతో సేవించుటకు ఇబ్బంది కరమగుట వలన గుటికా కల్పన ఆవిష్కరింపబడినది. అదేవిధముగా అల్ప మాత్రలోనే అధిక చికిత్సాఫలాన్ని కల్గించే రసక్రియాది కల్పము ఆవిష్క రింపబడినది. తక్కువ సమయములోనే శరీరమున ప్రసరించి ఎక్కువ ప్రమాణ ఔషధీయకర్మను కలుగజేసే సంధాన కల్పనలు రూపొందించబడినవి. సకాలం నిల్వ యుండిన చెడిపోనటువంటి కాల క్రమేణా గుణోత్కర్ష మగునటువంటి ధాతు భస్మాది కల్పనలు, ఆసవారిష్టాది సంధాన కల్పనల ఆవిర్భావ భైషజ్య కల్పనాశాస్త్ర అభివృద్ధిని సూచించే చక్కటి ఉదాహరణము లుగా పేర్కొనవచ్చును. ఔషధముల యొక్క స్థిరత్వము (చెడిపోకుండా వుండుట) మరియు గుణోత్కర్ష అనుసిద్ధాంతముల ఆధారముగా వివిధ బైషజ్యకల్పనలు రూపొందించబడినవి.

## వివిధ కల్పనల సవీర్యతావధి

సశాస్త్రీయముగా తయారుచేయబడిన ఔషధ కల్పనలు ఎంత కాలము వరకూ కార్యవంతములుగా నుండి ఔషధ కర్మ కల్గియుండునో ఆ కాలాన్ని సవీర్యతావధిగా పేర్కొనవచ్చును. క్వాథములు, కల్కములు, స్వరసములు మూడుగంటలు గడచిన పిమ్మట, అంజనములు, చూర్ణములు ఇవి మూడు మాసములు గడిచిన పిమ్మట, గుటికలు, లేహ్యములు ఇవి ఆరుమాసములకు పిమ్మట, తైలము, ఘృతములు ఇవి సంవత్సర కాలమునకు పైన నిర్వీర్యము లగును. (యోగరత్నాకరము)

## శారంగధరుని ప్రకారము

ప్రత్యేకముగా సంగ్రహించిన వనౌషధము, ఒక సంవత్సరము అనంత రము రసాది గుణములను కోల్పోవును. వనౌషధముల చూర్ణములు 2 మాసముల అనంతరము హీనవీర్యములు (శక్తిరహితములు) అగును. ఒక సంవత్సరము అనంతరము గుటిక, అవలేహ యోగములు మరియు ఘృత తైలాది యోగములు 16 మాసముల అనంతరము శక్తిరహితములు అగును. అల్పాయువు కల వనౌషధము (ప్రకృతిలో ఉత్పన్నమై శీఘ్రముగా ఫలించి, పరిపక్వమై తొందరగా నష్టమగునవి) లతో తయారు చేయబడిన యోగ ములు తొందరగా శక్తి హీనములగును. కానీ ఆసవయోగములు, ధాతు-ఉపధాతువుల భస్మములు, పారదము మొదలగు యోగములు ఎంత పురాతన మైన అంత గుణయుక్తములుగా ఉండును.

## మాన పరిభాష

**మానము :** దేని ద్వారా ద్రవ్యము కొలవబడునో దానిని మానము అందురు. మానము లేకుండా చికిత్సలందు భేషజ ప్రయోగము జరుగదు. వ్యాధి బలము,రోగి,బలము, అగ్ని, వయస్సు, కోష్ఠము మొదలగునవి విచా రించి విభిన్న మాత్రలలో కల్పనలను చేయవలసి వుండును. ఔషధ యోగములందు వివిధ ద్రవ్యముల సంయోగము ఒక ప్రత్యేక మానాను సారము చేయవలెను. సుశ్రుతాచార్యులు శుష్క ద్రవ్యములకు మానమును వివరిం చుచూ, ఆర్ద్ర ద్రవ్యములు మృదు వీర్యములుగా నుండుటచేత ఈ మానము ద్విగుణ ప్రమాణములో ఉపయోగించవలెనని పేర్కొనెను. గుడూచీ, శతావరీ, ప్రసారణి వంటి ద్రవ్యములు ఆర్ద్రావస్థయందే ప్రయోగించవలెను. వీటిని మాత్రము ద్విగుణ ప్రమాణముగా గ్రహించరాదని శారంగ ధరాచార్యులు పేర్కొనెను.

మానము పాతవ, ధ్రువయ, పాయ్య అను మూడు విధములుగా వివరింపబడినది. ప్రాచీన గ్రంథములందు ఆయుర్వేద సంహితలందు కాలింగము మరియు మాగద యను రెండు మానములు పేర్కొనబడినవి. కాలింగ మానము కంటే మాగధ మానము శ్రేష్టమైనదిగా మానపండితులు పరిగణించునట్లు చరకాచార్యులు పేర్కొనెను.

## ఔషధ కల్పనా విజ్ఞానము

ఏ ఔషధ ద్రవ్యమైనా చూర్ణముగా గాని, స్వరసముగా గాని, క్వాథముగా గాని లేక ఏ ఇతర సేవనయోగ్యమైన ఔషధ రూపముగాగాని తయారు చేయకుండా శరీరముపై ప్రయోగింపబడదు. ద్రవ్యములను ఔషధములుగా రూపొందించు ప్రక్రియను తెలిసికొనుట కొరకు భేషజకల్పనా విజ్ఞానము ఎంతైనా అవసరము. వానస్పతిక, ప్రాణిజ మరియు ఖనిజ ద్రవ్యములను ఔషదములుగా గాని లేక ఆహారములుగా గాని తయారుచేయు విధమును కల్పము లేదా కల్పనా అని అందురు. ఇవి అసంఖ్యాకముగా ఉన్నవి. మౌలికంగా కల్పాన్ని ఔషధకల్పము, ఆహార కల్పము అను రెండు విధములుగా విభజించవచ్చును. ఔషధకల్పము కషాయ, స్నేహ, సంధాన మరియు అన్యకల్పములుగా విభజించి అటుపైన అసంఖ్యాకములైన వర్గీకరణలను చేయవచ్చును.

**కషాయ కల్పన** : 1 స్వరసము 2 కల్కము 3 శృతము లేక క్వాథము

4 శీతము 5 ఫాంటము అను 5 విధములుగా చెప్పబడినది. ఈ అయిదు విధములైన కషాయములను మౌలిక కల్పనలుగా అయిదు రసముల యొక్క ద్రవ్యములతో చేయబడునవిగా చెప్పబడినవి. "ఇందు లవణ రసము చేర్చ బడలేదు. ఎందుచేత ననగా లవణ రసముతో ఎటువంటి కషాయముకూడా తయారు చేయుట కష్టతరము. మిగిలిన మధుర, ఆమ్ల, కటు, తిక్త, కషాయరస ద్రవ్యములతో మాత్రమే ఈ కషాయ కల్పనలు తయారు చేయ బడుచున్నవి. ఈ అయిదింటిని పంచకషాయ యోనులుగా చెప్పబడినవి.

**కషాయశబ్ద పరిభాష :** కష్+హింసాయాం అనుధాతువు నుండి కషాయ శబ్దము నిష్పన్నమైనది.

సేవించునపుడు కంఠము పట్టుకొని పోయినట్లుండుట వలన నోటికి రుచికరముగా లేకుండుట వలనను రోగములను కర్షణము చేయు (తగ్గించు) శక్తి కలిగి యుండుటవలనను పంచవిధ కషాయములకు కషాయ శబ్దము వర్తింపచేయబడినది. కషాయ శబ్దమునకు

1. "కంఠస్య కషణాత్ ప్రాయో రోగాణాం వాపి కర్షణాత్ కషాయ శబ్దః ప్రాధాన్యత్ సర్వ యోగేషు కల్ప్యతే (కాశ్యప సంహిత / 3/29) అను పరిభాషా చెప్పబడినది.

2. కషాయమను పదము కష్+ఆయ అను శబ్దముల సంయోగముచే ఏర్పడినదని కొందరి అభిప్రాయము. తదనుసారముగ "కష్" శబ్దమునకు హింసించుట అను అర్థమును తీసికొన్నచో ద్రవ్యములను హింసించి అనగా ముక్కలు చేయుట, వంచుట, పీడించుట, మర్దించుట అను ప్రక్రియల ద్వారా వాటి స్వరూపమును నష్టపరిచి సేవన యోగ్యమైన ఔషధములుగా తయారుచేయుట వలన కషాయమనుపేరు వీటికి వచ్చినది.

విశ్వకోశమునందు కషాయ శబ్దమునకు "కషాయో రసభేదే స్యాదఙ్గరా గో్రేపనే నిర్యాసే చ కషాయోథ సురభౌ లోహితేస్యవత్" కషాయము, రస దము, అంగరాగము, విలేపనము, నిర్యాసము, సురభి మరియు క్రోధము మొదలైన అర్థములు చెప్పబడినవి.

## స్వరసము

1. ఓషధి ద్రవ్యమును పచ్చిగ ఉన్నపుడు పురుగులు లేకుండా గ్రహించి కల్వములో మర్దించి వస్త్రనిష్పీడితము చేసిన లభించునది. "స్వరసము"

2. ఎండిన ఓషధి చూర్ణమును ఒక కుడవము గ్రహించి, దానియందు

రెండింతలు నీరుపోసి ఒక రేయి పగలు వుంచి మరునాడు ఆ ఉదకమును వడకట్టిన లభించునది "స్వరసము"

3. పచ్చిగ వుండు ఓషధి ద్రవ్యములు దొరకని ఎడల ఎండిన ద్రవ్యమును గ్రహించి వానికి ఎనిమిది భాగముల నీరుపోసి చతుర్ధావశేషము మిగునట్లు చేయవలెను. ఇది స్వరసమును తయారు చేయుటకు మరియొక పద్ధతి.

స్వరసమందు వేయదగిన ఔషధ ప్రమాణము : తేనె, శర్కర, క్షారములు, జీలకర్ర, సైంధవలవణము, నెయ్యి, నూనె, చూర్ణాదులు, మొదలగు వానిని స్వరసమునందు చేర్చునెడల కోల ప్రమాణము చేర్చవలెను.

**ఉదకకల్పనము :** ఒక భాగం ద్రవ్యము తీసుకొని వానిని 8 భాగములు నీటియందు వేసి ఒకరాత్రి నానబెట్టవలెను. ఉదయమున చేతులతో నలిపి వడగట్టిగా లభించునది.

**పుటపాకము :** పుటపాకము చేయదగిన ద్రవ్యమును మెత్తగానూరి ముద్దచేసి గుమ్ముడు, మర్రి, నేరేడు మొదలగు ఆకులలో దేనిచేనైననూ చుట్టి దానిపైన 2 అంగుళముల ప్రమాణం మట్టిని లేపనముచేసి అది ఎర్రగా కాలువరకు పుటమునందు ఉంచి పిదప బయటకు తీసి పై మట్టిని ఆకులను ఊడదీసి లోపలి ముద్దను పిండిన పుటపాక స్వరసం లభించును.

**కల్క కల్పన :** పచ్చిగానుండు ద్రవ్యములను మెత్తగా నూరి లేదా ఎండిన ద్రవ్యములను నీటిచే మెత్తగా నూరి ముద్దచేసిన అది కల్కము, ప్రక్షేపము, ఆవాపము అనబడును. కర్ష ప్రమాణం వాడాలి.

**అనుపానములు :** కల్కమునకు తేనె,నెయ్యి,నూనె వీటిని కలుపవలసి వచ్చిన కల్కమునకు రెట్టింపుగాను చక్కెర బెల్లములను కల్కమునకు సమముగాను, పాలు, నీరు మొదలగు ద్రవ్యములను 4 భాగములు అధికముగా కలుపవలెను.

**చూర్ణ కల్పన :** చక్కగా ఎండిన ద్రవ్యములను దంచి చూర్ణముచేసి వస్త్రగాళిత మొనర్చిన అదియే చూర్ణమనియు రజమనియు, క్షోదమనియు అనబడును. అష్టాంగ సంగ్రహకారుడు కల్కాదబేధః అనుచు చూర్ణమును కల్కకల్పనగా పరిగణించెను. (అ.స.ర.8/10)

**మాత్ర :** కర్షప్రమాణం (1తులం=11.5 గ్రాములు)

చూర్ణమునందు బెల్లం కలుపవలసిన సమభాగము, పంచదార

సుద్విగుణముగాను, నెయ్యి మొదలగు స్నేహద్రవ్యములను చూర్ణమునకు రెండింతలు కలుపవలెను. పాలు,నీరు,గోమూత్రం మొదలగు ద్రవ్యములను చూర్ణమునకు నాలుగు భాగములు కలుపవలెను. చూర్ణమును వాతరోగము నందు 3 ఫలములు; పిత్త రోగమునందు 2 ఫలములు; శ్లేష్మ రోగమునందు 1 ఫలము సేవించాలి.

**క్వాథ కల్పన :** కషాయ ద్రవ్యము ఒక ఫలము గ్రహించి మట్టికుండలో ఉంచి అందు 16 ఫలములు నీరుపోసి మందాగ్నిచే 8వ పాలు మిగిలినట్లు కాచి వడగట్టిన లభించునది. కషాయము, క్వాథము, శృతము, నిర్యూహము అనునవి కషాయమునకు పర్యాయ నామములు.

**అనుపానములు :** కషాయమునందు శర్కర కలుపవలసిన వాతరోగము కషాయమునకు నాల్గవ భాగము పిత్తరోగములందు 8వ భాగము శ్లేష్మ రోగములందు 10వ భాగము తేనె చేర్చిన వాతరోగమందు కషాయమునకు 16 భాగము, పిత్త రోగమందు కషాయమునకు 8వ భాగము, శ్లేష్మరోగ మందు కషాయమునకు 4వ భాగం కలపాలి.

**క్షీరపాకము :** ద్రవ్యమునకు ఎనిమిది భాగములు పాలు, పాలుకు నాలుగు భాగములు నీరుపోసి పాలు మిగులునట్లు కాచి తయారు చేయబడి నది క్షీరపాకము. అష్టాంగ సంగ్రహకారుడు ఔషధ ద్రవ్యములతో క్వాథము తయారు చేసి ఆ క్వాథమునకు సమభాగం క్షీరము కలిపి క్షీరము మిగుల నంత వరకు కాచినది క్షీరపాకమని పేర్కొనెను. అట్లు చేయునపుడు పాలు అడుగంటకుండా శ్రద్ధవహించాలి.

**ప్రమథ్యాకల్పన :** ద్రవ్యమును ఒక ఫలం మెత్తగా నూరి కల్కం చేసి 8 రెట్లు నీరునందువేసి మృదువైన అగ్నిపై కషాయము (చతుర్థావశేషముగా) కాచవలెను. దీనిని రెండు ఫలముల ప్రమాణములో సేవించవలెను. చక్ర పాణి తన వ్యాఖ్యయందు ప్రమథ్యామితి పాచన దీపనీయం ప్రమథ్యాకల్పన కల్క మరియు క్వాథ కల్పనం సంయోగముగా పేర్కొనవచ్చు.

**ఉష్ణోదకము :** నీటిని ఎనిమిదవ భాగముగాని, నాల్గవ భాగం గాని, సగము గాని మిగులనట్లు కాచినది ఉష్ణోదకం. దీనివల్ల రాత్రియందు సేవించిన శ్లేష్మము, ఆమవాతం, మేదోరోగము, శ్వాసము, కాసము, జ్వరం హరించును. వస్తి శోధనము, అగ్నిదీపనం కలుగును.

**పాంటకల్పము :** ఒక ఫలము ఔషధ ద్రవ్యమును మెత్తగాదంచి చూర్ణం

చేసి ఒక కుండలో వేసి అందు వేడినీరు ఒక కుడవము (16 తులములు)పోసి బాగుగా కలిపి వడకట్టిన అది పాంట మనియు, చూర్ణ ద్రవమనియు అన బడును.

**మన్థకల్పన :** చరక–సుశ్రుత సంహితల యందు మన్థకల్పన వివరింప బడినది. ఈ ఆచార్యులు మన్థమును సక్తు ప్రధాన కల్పనగా పరిగణించినట్లు అవగతమగుతుంది. ఆచార్య అగ్నివేశుడు సక్తు (పిండి)తో దీపన, పాచన ఔషధముల సూక్ష్మ చూర్ణము మరియు ఆమ్ల, మధుర, రసఫలముల రస ఫలముల రసములను కలిపి మన్థకల్పన తయారు చేయుటకు నిర్దేశించెను.

(చ.సూ 23) ఆచార్య సుశ్రుతుడు

శనగలు లేదా యవలపిండి యందు నెయ్యి మరియు శీతజలము కలిపి మన్థము చేయవలెనని సూచించెను. (సు.సూ.46)

ఆచార్య శారంగధరుడు ఔషధముల సూక్ష్మ చూర్ణం 4 తులములు మరియు 16 తులముల మట్టికుండలో వేసి కవ్వముతో బాగుగా చిలికి వస్త్రము ద్వారా వడకట్టి రెండుఫలములు (8 తులములు) ప్రమాణములో సేవించాలి. "మన్థోపి పాణ్డభేదఃస్యాత్" (శారంగధరుడు) మన్థము పాణ్డ భేదము వర్ణించబడినది. పాంటము ఉష్ణజలముతో చేయబడును. కాని మన్థ కల్పన చల్లని నీటితో చేయుదురు.

**హిమకల్పన :** ఒక ఫలం ఔషధ ద్రవ్యము చక్కగా దంచి కుండలోవేసి అందు 6 ఫలముల నీరుపోసి బాగుగా కలియునట్లు చేసి ఒక రాత్రి ఉంచి మరుదినము ఉషఃకాలమున ఆ నీరును వడగట్టిన లభించునది. హిమము లేదా శీతకషాయము మాత్ర 2 ఫలాలు (80గ్రా.)

**ఔషధసిద్ధయూషము :** కల్కమునకు ఒక ప్రస్థము నీళ్ళుపోసి కొంచెము చిక్కగా కాచినది యూషము అనబడును.

**ఔషధ సిద్ధ పానీయము :** ఔషధద్రవ్యములను ఒకతులం తెచ్చి కొంచెం దంచి అందు 64 ఫలముల ఉదకముపోసి సగము మిగులునట్లు కాచి వడియగట్టిన లభించునది. ఔషధసిద్ధ పానియము, దప్పిక తగ్గును.

**వటక కల్పన :** గుటిక, వటి, మోదకము, వటిక, పిండి, గుడము, వర్తి అనునవి వటకమునకు పర్యాయనామములు. బెల్లము, చక్కెర, గుగ్గిలము వీటిచే వటకములను చేయునెడల లేహ్యాపాకముగ పచనము చేసి అందు ఔషధచూర్ణం కలిపి వటుకములు చెయ్యవలెను. పాకము చేయకనే

వటుకములు చేయునెడల శుద్ధిచేసిన గుగ్గులు చూర్ణమును ఔషధ ద్రవ్య చూర్ణములో కలిపి గుటికలు చేయవలెను.

నీళ్ళు, పాలు, తేనె, మొదలగు ద్రవ్యములైననూ చూర్ణములో కలిపి వటుకములు చేయవచ్చును.

శర్కరతో గుటికలు చేయునెడల ఔషధ చూర్ణమునకు 4 భాగములు చక్కెర కలపాలి. బెల్లము చేర్చునెడల 2 భాగములు కలపాలి.

గుగ్గిలము, తేనె వీటిని కలిపి వటుకములు చేసిన యెడల చూర్ణము నకు సమముగాను నీరు,పాలు మొదలగు ద్రవపదార్ధములను చేర్చు నెడల చూర్ణమునకు 2 భాగములు చేర్చుకొని మోదకములు చేయవలెను.

**గుగ్గులు కల్పన :** అన్నివాతరోగములో గుగ్గులు ఉపయోగపడును. గుగ్గులు పాకము కూడా బెల్లంపాకమువలెనే తయారగును కాని గుగ్గులు పాకము గాఢముగా అగును. శుద్ధిచేయబడిన గుగ్గులను ఔషధ ద్రవ్యచూర్ణ ములతో కలిపి అధికముగా నలియగొట్టవలెను మధ్యలో నెయ్యి లేదా ఆము దం కలిపి నలియగొట్టిన శక్తివంతముగా పనిచేయును. వాత వికారాలు, ఆమవాతం, వాతరక్తం, ప్రమేహవ్రణ, అపచీ, గలగండ, కుండమాల, వ్రణ ములు, కుష్ఠము, కృమి, అన్నవికారం, స్నాయువికారం, శ్లేష్మిక కలా ప్రదాహ మునందు గుగ్గుల ప్రయోగం లాభదాయకం.

**అవలేహ కల్పన :** స్వరసము, క్వాథము, హిమము, పాంటము కషా యములను పాత్రలో వేసి తిరిగి చిక్కగా అగునంతవరకు పాకము చేయు విధానము రసక్రియ అందురు. దీనినే అవలేహ్యాము, లేహ్యాము అందురు. మాత్రా ప్రమాణం ఒకఫలం ఒక రోజుకి నాకుతూ భుజించునది అవ లేహ్యాము.

శర్కరతో తయారు చేయుట అవలేహ్యామునందు శర్కర ప్రమాణం, ప్రక్షేప చూర్ణమునకు 4రెట్లు గుఢముతో తయారు చేయు అవలేహ్యామునందు గుఢప్రమాణం ప్రక్షేపచూర్ణమునకు రెట్టింపు ఉండవలెను.

**పాన కల్పన :** పండ్లరసములను (పుల్లనివి) శీతలజలము నందు కలిపి దానియందు శర్కరా మరియు మరిచ చూర్ణములను చేర్చినచో అదిపానక కల్పము.

**క్షార కల్పన :** క్షారతత్వం అధికముగా గల కాష్ఠౌషదములను పత్రములను సమూలంగా ఎండించి కాల్చి తెల్లని బూడిదచేసి దానికి

నాల్గురెట్లు జలం కలిపి ఒక రాత్రంతా నిల్వయుంచి పై తేటను తేర్చుకొని ఆ నీటిని ఇగర్చగా వచ్చినది క్షారము.

**మసికల్పన :** జాంగమ లేదా వానస్పతిక, ద్రవ్యములను అగ్నిసంయోగ ముచే బొగ్గువలె నల్లగా చేయువిధానము.

**అర్క కల్పన :** ఔషధ ద్రవ్యమును చూర్ణమునుగాని, ద్రవ ద్రవ్యము నందుంచి తిర్యక్పాతన యంత్రం ద్వారా వేడిచేస్తూ జనించిన ఆవిరిని తిరిగి ద్రవరూపముగా పొందింప చేయుటను అర్కము తీయు విధానము అంటారు. గదనిగ్రహం, అర్క ప్రకాశికలలో వీటి ప్రయోగాలు కలవు.

**ద్రావక కల్పన :** ద్రవరూపంలో ఉండు తీక్ష్ణమైన ద్రవ్యములను ద్రావకములందురు. ఉదా, జీవనధార, శంభుజీరకం.

**శుక్త కల్పనము :** కాంజిక నిర్మాణము: ధాన్యము, ధాన్యమండము, నీరు, రాజిక, లవణము మొదలగువాటిని సంధాన మొనర్చిన లభించు ద్రవము కాంజికము.

## భైషజ్యక కల్పన

**ఔషధ యోగముల నిర్మాణము :** అన్ని రకముల ఔషధములను ఒకే పద్ధతిలో వాడుటకు వీలుకాదు. రోగులు సేవించడానికి అనుకూలముగా వానిని వివిధ ఔషధ పద్ధతులలో, వానియొక్క శక్తి (వీర్యము) నష్టముకాని విధముగా–మార్పు చేయవలసి ఉంటుంది. వీనికి అనుకూలమైన వివిధ ఔషధ నిర్మాణ పద్ధతులు ఈ క్రింద వివరింపబడినవి.

**అంజనము :** తడిగా లేదా పొడిగా కనులకు రాయడానికి అనుకూల మైన ఔషధములను అంజనము అంటారు. కనులకు ఉపయోగించు ఈ అంజనమును కొద్ది మోతాదులో ఔషధ చూర్ణమునకు లేదా భస్మమునకు నెయ్యి, లేదా పాలు లేదా నీటిని కలిపి వత్తిగా మార్చి వాడవచ్చును.

**అంతర్ధూమము :** కావలసిన ఔషధములను పొడిగా, శుభ్రముగా ఉన్న కుండలో ఉంచి దానిపై మూతనుపెట్టి మట్టితో సంధిబంధనము చేయవలెను. తరువాత పిడకలతో మండించి భస్మము చేయవలెను. చల్లారిన పిదప ఔషధమును వెలికితీసి పొడి చేసి వాడవచ్చును.

**అర్కము :** యవకూటము చేయబడిన ఔషదములను వాటి భారము నకు రెండురెట్లు నీటిని కలిపి ఒక రాత్రి అంతయు నానబెట్టవలెను. తదుపరి ఆ మిశ్రమమును ఆవిరి ప్రక్రియ ద్వారా సగభాగము నీరు ఉండునట్లు

అర్కము తయారుచేయవలెను.

**అరిష్టము :** ద్రవ్యముల యొక్క కషాయము తయారు చేసిన పిదప దానిని వడకట్టవలెను. తరవాత తగు ప్రమాణములో బెల్లము, శర్కర లేదా తేనె బాగా కలిపి ధాతకి పుష్పమునుచేర్చి మట్టిపాత్రలో, పింగాణీ లేదా చెక్క పిపాలో వేసి సంధి బంధనముచేసి 30 రోజులు సంధానము చేయ వలెను. (సంధాన కల్పనలో చెప్పబడిన జాగ్రత్తలను పాటించవలెను.)

**అవలేహము (రసక్రియ) :** ఔషధములక్వాధములను లేదా వాని రస మును నెమ్మదిగా వేడిచేస్తూ అవి గట్టిపడునంత వరకు బాగా కలుపుతూ తయారు చేయు మందులను అవలేహము అంటారు. చెంచాతో తీసినపుడు మరియు చేతితో తీసినపుడు అంటుకొకుండా ఉండునది మరియు ముద్దను వత్తినపుడు చేతి వేళ్ళ గుర్తులు పైన కనపడునట్లుండు పాకము సరియైన అవలేహము అనబడును.

**అవలేహము తయారుచేయుటకు ఇతర పద్ధతులు**

1. శర్కర లేదా బెల్లము యొక్క బరువునకు నాలుగురెట్ల నీటిని కలిపి మృద్వగ్నిపై బాగా కలుపుతూ పాకము చేయవలెను. (ఈ స్థితిలో మలిన ములు తొలగించుటకు కొద్ది మోతాదులో పాలు కలిపి వడకట్టవలెను.) తరువాత ఈ పాకమునకు నెమ్మది నెమ్మదిగా ఔషధముల యొక్క సన్నటి పొడిని కలుపవలెను. తేనె కలుపవలసిన యోగములలో చల్లారిన పిదప తేనె కలుపవచ్చును.

2. తేనె ఉపయోగించి తయారు చేయబడు అవలేహ్యములకు తేనెను చాలా కొద్దిగా వేడిచేసి మొదట పలుచగా చేయవలెను. తరువాత ఔషధముల సన్నటి పొడిని కలపవలెను.

**ఆసవములు :** ఔషధముల యొక్క రసము (స్వరసము) నకు, బెల్లము/ శర్కర నేరుగా కలిపి సంధానము చేయుపద్ధతిని అసవకల్పన అంటారు. (వివరములకు సంధాన కల్పన చూడగలరు.)

**ఉపనాహము (కాపడము) :** అవిసెలు, బార్లీ, గోధుమ, పసుపు మొద లగు వానిని నీటిలో, పాలలో, గంజి లేదా గోమూత్రముతో ఉడికించి కొద్ది మోతాదులో నెయ్యి లేదా నూనె కలిపి కాపుటకు వీలుగా తయారుచేయ వచ్చు. పరిశుభ్రమైన వస్త్రము యొక్క రెండు పొరలలో ఈ పొడి లేపాన్ని రాసి దెబ్బలు తగిలిన చోట వాపు ఉన్నచోట ఉపయోగించవలెను.

**ఉష్ణోదకము :** పరిశుభ్రమైన మట్టికుండలో, రాగి పాత్రలో లేదా ఇతర పాత్రలో నీటినివేసి పాత్రపై మూతపెట్టి 1/8వ భాగము లేదా 1/4వ భాగము లేదా సగభాగము ఇరుగునంత వరకు కాచి శుభ్రమైన బట్టద్వారా వడపోయ డం ద్వారా ఉష్ణోదకమును తయారుచేయవచ్చు.

ఉష్ణోదకము నిలువ ఉంచడం శ్రేష్టం కాదు. ఏ రోజుకు ఉద్దేశించి తయారు చేయబడిన ఉష్ణోదకం ఆ దినముననే వాడవలెను. తదుపరి దినమునకు కావల్సిన ఉష్ణజలమును రాత్రి తయారు చేసుకోవచ్చు.

**ఏరండభృష్ట హరీతకి :** కరక్కాయల యొక్క (యవకూట) చూర్ణమునకు నాలుగురెట్ల ఆముదముతోవేయించి సన్నటి పొడిగా చేయవలెను. ఈ చూర్ణ మును ఏరండ భృష్టహరీతకి అందురు.

**కజ్జలి :** శుద్ధపాదరసమును ఖల్వములో వేసి దానికి సమభాగము శుద్ధగంధకమును కొద్ది కొద్దిగా కలుపుతూ బాగా మర్దన చేయవలెను. ఈ మిశ్రణము బాగా నల్లగా కాటుకవలె, పాదరము యొక్క మెరుపు లేకుండా ఉండవలెను.

**కల్కము (ముద్ద) :** కల్కమును పచ్చి ద్రవ్యములనుండి మరియు ఎండిన ఔషధముల నుండి తయారు చేయవచ్చు. కల్కమును తాజాగా ఉన్నపుడే వాడవలెను. నిలువ ఉంచబడిన కల్కమును వాడకూడదు.

1. తాజాగా ఉన్న పచ్చి ఔషధములను శుభ్రముగా కడిగి మిగులు నీటిని తీసివేసి, ఖల్వములో దంచవలెను. అది బాగా ముద్దగా మారిన తరువాత వేరే పాత్రలోనికి మార్చవలెను.

2. పొడి ద్రవ్యముల యొక్క చూర్ణమును ఖల్వము లేదా సానపైన ఉంచి కొద్దికొద్దిగా నీటిని కలుపుతూ ముద్దగా తయారు చేయవలెను. పిదప వేరే పాత్రలోనికి మార్చవలెను.

కల్కమునకు తేనె, నెయ్యి మరియు నూనె మొదలగునవి కలుపవలసిన సందర్భములలో కల్కము యొక్క బరువునకు రెండు రెట్లు కలుపవలెను. శర్కర లేదా బెల్లము కలుపవలసిన కల్కమునకు నాల్గురెట్లు వాడవలెను.

**క్వాథము (కషాయము) :** ఔషధము యొక్క చిన్నముక్కలను, (యవ కూట చూర్ణమును) మట్టి కుండలో లేదా పైన మట్టిపూయబడిన రాగి పాత్రలలో వేసి నీరు కలిపి పైన మూతపెట్టి కాచవలెను. బాగా మృదువుగా ఉండు ద్రవ్యములకు నాలుగురెట్ల నీరు, కొద్దిగా కఠినముగా ఉండు ద్రవ్య

ములకు ఎనిమిదిరెట్లు మరియు కఠిన ద్రవ్యములకు పదహారు రెట్లు నీరు కలుపవలెను.

ఈ మిశ్రణమమును మృద్వగ్నిపై కాచవలెను. మృదు ద్రవ్యములకు నాలగవ భాగము మిగులనంత వరకు కొద్దిగా కఠినముగా ఉండు ద్రవ్యము లకు ఎనిమిదవ భాగము మిగులునంత వరకు కాచవలెను. చల్లార్చిన తరువాత, వడికట్టి శుభ్రమైన క్వాథము వేరొకపాత్రలోనికి మార్చవలెను. ఇతర ద్రవ్యములను కలుపవలసినచో ఫాంటమునకు తెలుపబడిన మోతాదు ననుసరించి కలుపవలెను.

**కాంజికము (పులిసిన గంజి) :** బియ్యమునకు రెండు నుంచి మూడు రెట్ల నీటిని కలిపి ఉడికించవలెను. తరువాత ఆ గంజని ఇంకొక పరిశుభ్ర మైన పాత్రలో తీసుకొని మూతపెట్టి రెండు నుంచి మూడు రోజుల వరకు పులియబెట్టవలెను. తదుపరి రెండు రోజులు వదిలివేసి వడియకట్టి ఆరవ రోజు కాంజికమును వాడవచ్చు.

**క్షారము :** లోహపాత్రలో ఔషధమును సమూలముగా తీసుకొని కాల్చ వలెను. తరువాత బూడిదను మట్టిపాత్రలో వేసి దానికి ఆరురెట్లు నీటిని కలిపి పాత్రను మూసివేయవలెను. తరువాత ఒకరాత్రి అంతయు ఉంచి ఉదయము పైని తేటను వంపవలెను. తరువాత 21 పర్యాయములు వడకట్ట వలెను. వడకట్టినన ప్రతిపర్యాయము వస్త్రమును శుభ్రపరచవలెను. ఈ విధముగా లభించిన నీటి మిశ్రణమును మట్టిపాత్రలో, మృదుగ్నిపై కాచ వలెను. నీరంతయు ఆవిరి అగునట్లు కలుపుతూ వేడిచేయవలెను. ఈవిధ ముగా లభించిన క్షారమును-గాజు పాత్రలో భద్రపరచవలెను.

**క్షీరపాకము :** పాల యొక్క మోతాదు మరియు క్షీరపాకము యొక్క శక్తి ననుసరించి క్షీరపాకమును మూడు విధములుగా పరిగణించవచ్చును.

1. ఒక భాగము ఔషధమునకు ఎనిమిదిరెట్ల పాలు మరియు 32 రెట్ల నీటిని కలిపి మరిగించి తిరిగి పాలు మిగులునట్లు కాచవలెను. తదుపరి వడపోసి వేరొక పాత్రలో వేయవలెను.

2. ఒక భాగము ఔషధమునకు 15 రెట్ల నీటిని మరియు పాలను కలిపి పాలు మిగులునంతవరకు కాచవలెను. తదుపరి వడపోసి వాడవలెను.

3. సమభాగములో నీటిని, పాలను కలిపి వేడిచేసిన పిదప నీటిలో సగభాగము తగ్గిన తరువాత వడపోసి వేరొక పాత్రలో వేయవలెను. ఈ

పాకము పిల్లలకు వాడుటకు యోగ్యమైనది.

**ఖండకల్పన :** కొద్ది మోతాదులో నీటిని శర్కరతో కలిపి-చిక్కటి పాకమును తయారుచేయవలెను. పాకమునకు తగు ప్రమాణములో, ఔషధముల యొక్క సూక్ష్మ చూర్ణమును బాగా కలిపి, చల్లబడిన తరువాత ఉపయోగించవలెను.

**ఘృతపాకము :** స్నేహపాకము నందు వివరింపబడింది.

**గోమూత్ర హరీతకి :** కరక్కాయ(హరీతకి) యొక్క ఫలత్వక్‌ను చిన్న చిన్న ముక్కలుగాచేసి- నాలుగు రెట్ల గోమూత్రములో మూడు రోజులు నానబెట్టవలెను. ఈ మిశ్రణమును-నీడలో నానబెట్టి చూర్ణము చేయవలెను.

**చౌషష్ట ప్రహర పిప్పలి :** బాగా పరిణతి చెందిన పిప్పళ్ళను ఖల్వములో వేసి ఎనిమిది రోజులు అనగా 64 ప్రహరముల కాలము మర్దన చేయవలెను.

**చూర్ణము :** బాగా ఎండిన ఔషధములను-రోటిలోవేసి నలుగకొట్టి వస్త్రగాలితముచేసి సూక్ష్మ చూర్ణమును తయారు చేయవలెను. పైన లేపము చేయుటకు మరింత సూక్ష్మ చూర్ణమును వాడవలెను.

చూర్ణమునకు బెల్లము సమభాగము, శర్కర, ఘృతము లేదా తేనెను రెండురెట్లు కలుపవలెను.

**చూర్ణోదకము :** 120 మి.గ్రా. చూర్ణమునకు 6 మి.లీ. నీటిని కలిపి రంగుగాజు సీసాలోవేసి మూత పెట్టవలెను.రెండుమూడు గంటల కొకసారి కదుపవలెను. తరువాత పైన తేటను వడకట్టి వాడవలెను.

**తాజా రసములు :** (స్వరసము చూడవలెను.)

**కషాయము :** (క్వాథము చూడవలెను.)

తక్రము (మజ్జిగ) మూడు రకాలు.

1) రూక్షతక్రము 2) అర్ధోధృత స్నేహ తక్రము 3) అనుధృతస్నేహ తక్రము.

పెరుగునకు సగభాగము నీటిని కలిపి బాగా చిలికి పూర్తిగా వెన్నను వేరు చేయగా లభించునది. రూక్షతక్రము. పెరుగునకు సమభాగము నీటిని కలిపి బాగా చిలికి సగభాగము వెన్నను వేరు చేసిన అది అర్ధోధృత స్నేహము పెరుగునకు రెండురెట్ల నీటిని కలిపి బాగా చిలికి వెన్నను వేరు చేయని ఎడల అది అనుధృత స్నేహ తక్రము అంటారు.

**తండులోదకము :** 50గ్రా. శుభ్రపరచబడిన బియ్యమునకు 400మి.లీ. నీటిని పరిశుభ్రమైన పాత్రలో వేసి కలిపి నాలుగు గంటలపాటు నానబెట్టవలెను. తరువాత నానిన గింజలను బాగా నలిపి, ఆ నీటిని వడకట్టి వాడుకొనవలెను.

**తైలపాకము :** స్నేహ పాకము చూడవలెను.

**పర్పటి :** నెయ్యిలో రాసి, వేడిచేయబడిన ఇనుప పెనము పైన కజ్జలితో కూడిన ఔషధములను వేసి నెమ్మదిగా కరిగించవలెను. ఈ మిశ్రణమును పేడపైన ఉంచబడిన అరటి ఆకుపై పరచి పైన ఇంకొక అరటి ఆకునువేసి సన్నని పొరగా మారునట్లు, అప్పడమువలె వత్తవలెను. చల్లారిన పిదప పొడిచేసి భద్రపరచవలెను.

**పిష్టి:** గులాబీ అర్కముతో లేదా చందనము యొక్క అర్కముతో ఔషధముల సన్నని చూర్ణమును రుద్ది లేపము చేయు పద్ధతిని పిష్టి అంటారు.

ముక్తా, ప్రవాళ (పగడము) జహర్మొహర, హజ్రుల్‌యహూద్, అకీక పిష్టి, హజ్రల్‌బెర పిష్టి మొదలగువానిలో పిష్టి తయారుచేయబడును.

**పేయ :** తాగడానికి వీలుగా అతికొద్ది మోతాదులో ఘనపదార్థము కలిగినటువంటి వానిని పేయ అంటారు. బార్లీ లేదా బియ్యమునకు ఆరు రెట్లు నీటిని కలిపి పేయ తయారుచేయవచ్చు.

**ఫాంటము :** ఔషధమునకు నాల్గురెట్లు నీటిని తీసుకొని మట్టిపాత్ర లేదా రాగిపాత్రలో సగభాగము మిగులునట్లు కాచి పిదప–ఔషధము యొక్క చూర్ణముచేసి బాగా మర్ధించి వడకట్టవలెను. ఈ ఫాంటమును మట్టి,గాజు లేదా పింగాణీ పాత్రలోవేసి ఉపయోగించవలెను.

జీలకర్ర,శుద్ధగుగ్గులు, యవక్షారము, సైంధవలవణము శుద్ధశిలాజితు, వేయించిన ఇంగువ, త్రికటుకములు మొదలగునవి కలిపి 1–3గ్రా. మోతాదులో ఒక పర్యాయము వాడుటకు ఉపయోగించవలెను. నెయ్యి,పాలు, బెల్లము, ఆవు మూత్రము చూర్ణము లేదా కల్కము కలుపుటకు 3–17 గ్రా. వాడవలెను.

**భావన :** బాగా కఠినముగా ఉన్న ఘనపదార్థములను నెమ్మదిగా ద్రవ పదార్థములను కలుపుతూ నూరి తిరిగి ఎండించుటను భావనచేయడం అంటారు. చూర్ణమునకు లేదా భావన చేయవలసిన ద్రవ్యమునకు క్వాథమును, రసమును, శీతకషాయమును కావలసినంత ప్రమాణములో కలిపి

బాగా మర్దించవలెను. ఈ విధముగా 24 గం॥చేయుటకు ఒక భావన అని పిలువబడును.

**భస్మము :** ఖనిజములను శోధన ప్రక్రియ ద్వారా సంస్కరించి మారణ విధానము ద్వారా సేవించుటకు ఉపయుక్తముగా తయారుచేయుటను భస్మము అంటారు.

**మూషా :** రెండు మట్టి మూకుడులలో (శరావములు) ఔషధముల యొక్క ఎండించిన చిన్నచిన్న ముద్దలను (చక్రికలు) వేసి సంధిబంధనము చేయుటను మూష అంటారు.

భస్మములు తయారుచేయుటకు, వివిధ స్థాయిలలో అగ్ని తీవ్రతను వాడవలసి ఉంటుంది. ఈవిధముగా అగ్నిని నియంత్రించుటకు వివిధ రకముల పుటములను వర్ణించడము జరిగినది. ఈ పద్ధతిని పుటపాకము అంటారు.

**వివిధ రకముల పుటముల వివరములు :** సూర్యపుటము లేదా రౌద్ర పుటము బాగా దంచబడిన ఔషధమును ముద్దలుగా చేసి సూర్యుని వేడిమితో ఎండించుటను సూర్యపుటము అంటారు.

**మహాపుటము :** 115 సె.మీ లోతు మరియు 46 సె.మీ (హస్తము) వ్యాసము కలిగిన గుంతను త్రవ్వవలెను. ఇందులో సగభాగము ఎండిన ఆవు పిడకలనువేసి పైన మూషలు పెట్టవలెను. తరువాత మిగిలిన భాగ మంతా పిడకలతో నింపవలెను. దీనిని పూర్తిగా మండించి స్వాంగ శీతమయిన పిదప మూషను, వెలికి తీసి ఔషధమును జాగ్రత్తగా సేకరించి వాడవలెను.

**గజపుటము :** 92 సె.మీ లోతు వెడల్పు కల్గిన నలుచదరమైన గుంతను త్రవ్వవలెను. తరువాత మహాపుటములో వివరించిన పద్ధతిలో పుటపాకము చేయవలెను.

**వరాహపుటము :** 46 సెం.మీ లోతు వెడల్పు (గజపుటములో సగము) కలిగిన గుంతలో పుటము చేయుట వరాహపుటము.

**కుక్కుటపుటము లేదా భాండపుటము :** 42.5 సె.మీ.ఎత్తు,వెడల్పు ఉండునట్లు ఏరుపిడకలను భూమిపైన అమర్చి వాని మధ్యలో ఔషధము నుంచి మండించి సాంగశీతలమయిన పిదప పుటముతీసి ఔషధమును భద్రపరచవలెను.

**గోర్వారపుటము లేదా భాండపుటము :** మూషను మధ్యభాగములో ఉంచి–దానిచుట్టూ వరిపొట్టును లేదా ఆవు పిడకల పొడిని బాగా దట్టించి తదుపరికాల్చి చల్లారిన తరువాత భస్మమును సేకరించుటను గోర్వారపుటము అంటారు.

**వాలుకాపుటము :** బాగా వేడి ఇసుక కలిగిన గట్టి పాత్రలో పుటము వేయుటను వాలుకా పుటము అంటారు.

**భూధర పుటము :** కావలసినంత ప్రమాణములో గుంతను తీసి అందులో 25 సె.మీ మందములో ఇసుకను పరచవలెను. పైన శరావమును ఉంచి నలువైపులా ఇసుకతో కప్పవలెను. ఆపైన పిడకలతో మండించి మహాపుటమువలె పుటము పెట్టవలెను.

**లావకపుటము :** 15 సె.మీ.ఎత్తులో పిడకలను పేర్చి మధ్యలో మూషను ఉంచి మహాపుటములో చెప్పబడిన విధముగా భస్మము చేయుటను లావక పుటము అంటారు.

**అమృతీకరణము :** తామ్రభస్మమువంటి భస్మములు పూర్తిగా నిర్విషము లగుటకు అమృతీకరణము చేయవలెను. ఇందుకు భస్మమునకు సగభాగము గంధకమును కలిపి నిమ్మరసముతో మూడు గంటలు మర్దన చేయవలెను. అటు పిమ్మట ముద్దను కందగడ్డ మధ్యలో ఉంచి మట్టితో లేపముచేసిన గుడ్డతో చుట్టి మండించి తిరిగి భస్మమును సేకరించవలెను. ఈ ప్రక్రియను అమృతీకరణము అంటారు.

**భస్మపరీక్ష :** (ఔషధోపయోగమైన భస్మము యొక్క లక్షణమలు)

**1. వారితరత్వము :** భస్మము నీటిపైన చిలకరించినపుడు అది నీటిపై తేలవలెను. తేలిన భస్మముపై బియ్యపు గింజలుంచినను అవి మునగరాదు. ఈ విధముగా తయారయిన భస్మము వారితరము.

**2. రేఖాపూర్ణత :** చాలా సూక్ష్మముగా ఉన్న భస్మమును చేతితో తాకి నపుడు ఆ భస్మము వేళ్ళపైని సన్నని గీతల మధ్య నిలవవలెను, లేదా వేలి ముద్రలు భస్మముపైన పడవలెను.

**3. నిశ్చంద్ర :** ఖనిజము లేదా లోహము యొక్క మెరుపు పూర్తిగా తొలగిపోవలెను.

**4. అవపునర్భవము :** భస్మమును బెల్లము, గురివింద, టంకణము, తేనె మరియు నెయ్యితో పుటమువేసిన భస్మము తన పూర్వపు లోహస్థితిని పొందకూడదు.

**మద్యము :** మూడుభాగముల ఔషధము, నాల్గు భాగముల బెల్లము మరియు ఎనిమిది భాగముల నీటిని కలిపి పాత్రలో మూసి 21 రోజులు పులియబెట్టి తరువాత వేరొకపాత్రలో వడకట్టిన పదార్థము మద్యము అం దురు. ఈ ప్రక్రియను సంధానము అంటారు.

**మల్హము :** (అయింట్‌మెంట్) గోరువెచ్చని నూనె, నెయ్యి, జిగురు వానిని శుభ్రమైన గుడ్డద్వారా వడపోసి, ఔషధముల సూక్ష్మ చూర్ణమును సరిసమానముగా కలిపి మృదువుగా తయారగునట్లు చేయుటను మల్హాము అంటారు.

**మండము :** బియ్యము లేదా బార్లీ రవ్వ యొక్క భారమునకు పధ్నాలుగు రెట్లు నీటిని కలిపి ఉడికించిన ద్రవ ఆహారమును మండము అంటారు.

**యవాగు :** యవాగు మూడు విధములు 1. మండ 2. పేయ 3. విలేపి. బియ్యము మరియు ఔషధములను నీటితో ఉడికించి ద్రవ భాగమైన మండము ను తీసివేయడము ద్వారా వీనిని తయారు చేయవచ్చును. కొద్ది మోతాదులో ద్రవ్యాంశము, పెసలు లేదా ఇతర ద్విదళ ధాన్యముతో తయారు చేయబడ్డ పదార్థము పేయ. అతి కొద్ది మోతాదులో ద్రవ పదార్థము మరియు ఎక్కువగా ఘనపదార్థము కలిగినది.

**కల్కసిద్ధయవాగు :** 12 లేదా 24 లేదా 48 గ్రా. ఔషధమును వీర్యము ననుసరించి ఒక లీటరు నీరు, ఔషధము యొక్క భారమునకు నాల్గవవంతుల బియ్యపు రవ్వ కలిపి ఉడికించిన అది కల్క సిద్ధయవాగు దీనిని రోగి ఆహారముగా సేవిస్తాడు.

**యూషము :** (సూప్)

12 లేదా 24 లేదా 48గ్రా. ఔషధము (వీర్యానుసారము) 48 నుంచి 96గ్రా. పప్పు ధాన్యములు మరియు 768 మి.లీ.నీటిని కలిపి ఉడికించి నీరు సగభాగమయిన తరువాత వడకట్టవలెను. దీనిని యూషము అంటారు. పిప్పలి మొదలగునవి కలుపవలసిన 6గ్రా. చూర్ణము కలుపవచ్చు.

**లేపము (పైపూత) :** పై పూతగా వాడబడు లేపము, చల్లగా, వేడిగా, గోరు వెచ్చగా,పలుచగా, మందముగా లేదా బాగా మందముగా ఉండ వచ్చును. ఔషధములను లేదా ఔషధ స్వరసమును, నీరు,నూనె,పాలు,నెయ్యి,

పెరుగు, గంజి మొదలగు వానితో నూరి లేపములు తయారు చేయవచ్చు. లేపము చేయవలసిన భాగము యొక్క అవసరాన్ని బట్టి ఔషధముల ప్రమాణము నిర్ధేశించుకోవచ్చును.

రోమకూపములకు వ్యతిరేక దిశలో లేపము రాయవలెను. ఒక సెంటీ మీటర్ మందము వరకు లేపము రాయవచ్చు. పగటిపూట లేపము వేసి పూర్తిగా ఆరకముందే తొలగించుట శ్రేయస్కరము వాపులు మొదలగునవి తగ్గడానికి వేయబడు లేపము పూర్తిగా ఆరవచ్చు.

**వటి (గుటిక,మోదక, వటిక, పిండ, గుడ, చంద్రిక వర్తిక)**

వస్త్రగాళితముచేసి సేకరించిన సూక్ష్మఔషధ చూర్ణమునకు తగు మాత్రలో నీరు, రసము, కషాయము, తేనె, బెల్లము, గుగ్గులు మొదలగు వానితో కలిపి ముద్దగాచేసి వానిని చిన్న మాత్రలుగా కట్టి ఎండించవలెను.

మాత్రల తయారీలో చక్కెర, బెల్లము, గుగ్గులు లేదా తేనె వాడవలసిన సందర్భములలో ఔషధమునకు నాలుగురెట్లు, రెండు రెట్లు లేదా సమభాగము తీసుకొనవలెను.

**విలేపి**

బియ్యము మరియు పప్పుధాన్యములను నాలుగురెట్లు నీటితో కలిపి ఉడికించిన అది విలేపి అనబడును.

**శతధౌత ఘృతము లేదా సహస్రధౌత ఘృతము**

ఘృతము ఔషధములు నీటిని కలిపి కాంస్య పాత్రలో వేసి బాగా మర్దన చేయవలెను. తరువాత నీటిని తీసివేసి తిరిగి క్రొత్తనీటితో మర్దన చేయవలెను. ఈవిధముగా వంద లేదా వెయ్యి పర్యాయములు చేయవలెను.

**శంఖద్రావము :** సమాన భాగములలో శుద్ధ శంఖభస్మము పంచ లవణములు, పటిక, నవాసారము, కాసీసము, టంకణము, యవక్షారము మరియు సర్జికా క్షారములు, నీటిలో కలిపి తిర్యక్పాతన యంత్రముతో మృదుగ్నిపై వేడి చేయవలెను. ఇంకొక పాత్రలో ద్రవీభవించిన ఆవిరిని సేకరించవలెను. ఈ ద్రావకాన్ని శంఖద్రావకము అంటారు.

**శర్కర :** హిమము, ఫాంటము, ఘృతము లేదా అర్కము మొదలగు వానికి రెండు రెట్లు శర్కర కలిపి మృద్వగ్నిపై పాకము వచ్చువరకు మరిగించి చల్లార్చి వడపోయవలెను. తదుపరి కావలసిన ఔషధమును కలుపవచ్చు.

**శీత కషాయము (హిమము) :** ఔషధమును చిన్న చిన్న ముక్కలుగా చేసి మట్టిపాత్రలో, గాజుపాత్రలో లేదా పింగాణీ పాత్రలోవేసి ఆరురెట్లు నీటిని కలుపవలెను. ఒక రాత్రంతయు నానిన తరువాత బాగా పిసికి వడకట్టవలెను. ఈ ద్రవమును శీతకషాయము అంటారు.

**శోధన :** ఔషధముల ఖనిజముల విషప్రభావమును తొలగించుటకు లేదా తగ్గించుటకు శోధన విధానములు ద్రవ్యములననుసరించి నిర్దేశించ బడినవి.

**కొన్ని ద్రవ్యముల శోధన విధానము**

**అకీక** : అకీకమును ఎర్రగా కాల్చి 21 మార్లు గులాబీ జలములో ముంచవలెను.

**అహిఫేనము :** నాల్గురెట్ల నీటిలోఅహిఫేనమును (నల్లమందు) కలిపి బట్టతో వడకట్టవలెను. దీనిని మృదుగ్నిపై గట్టిగా ఇగురబెట్టి ఏడుమార్లు అల్లపురసముతో భావన చేయవలెను.

**ఖర్పరము :** ఎర్రగా కాల్చిన ఖర్పరమును బీజాపూరస్వరసములో, తక్ర ములో లేదా కాంజికములో చల్లార్చవలెను. ఈ విధముగా ఏడుమార్లు చేయవలెను.

**గంధకము :** ఇనుప పాత్రలో కరిగించిన గంధకమును పాలలో లేదా భృంగరాజ స్వరసములో వేయవలెను. ఈ విధముగా పాలు, భృంగరాజ స్వరసమును మార్చి మార్చి ఏడుపర్యాయములు, గంధకమును శుద్ధి చేయ వలెను.

**గైరికము :** గైరికము నుండి రాళ్ళు మొదలగు వానిని తొలగించి ఆ చూర్ణమునకు పాలను కలుపవలెను. పాలు కనిపించనంతవరకు కలుపుతూ మర్దన చేయవలెను. ఈ విధముగా మూడుసార్లు మర్దించి నీడలో ఎండించ వలెను. గైరికము నందలి తడి అంతయుపోవునంత వరకు వేడిచేయుట ఇంకొక శోధన పద్ధతి.

**ఘనపాషాణ చూర్ణము (మాగ్నటిక్ పైరెట్) :** బాగా ఎర్రగా కాల్చిన ముక్కలను చింతాకు రసములో వేసి చల్చార్పవలెను. ఈ విధముగా ఏడు మార్లు పోసిన శోధనము పూర్తి అగును.

**గుగ్గులు :** 250గ్రా. త్రిఫలా చూర్ణము 125 గ్రా. గుడూచీ చూర్ణము (యవకూట) లకు నాలుగురెట్ల నీటిని కలిపి రాత్రంతయు నానబెట్టవలెను.

మరుసటి రోజు అర్ధభాగము నీరు ఇగురునట్లు క్వాథము తయారు చేయ వలెను. దీనియందు బట్టిలో మూట కట్టబడిన 250గ్రా. గుగ్గులు వేసి వేడి చేయవలెను. దానిని క్వాథములో మునుగునట్లు ఒక చువ్వకు వేళ్ళాడదీసి వేడిచేయవలెను. మధ్యలో కఱ్ఱతో వత్తుతూ పూర్తిగా గుగ్గులు క్వాథములో కరుగునట్లుగా 10 నుంచి 12 పర్యాయములు ఈ విధానమును అవలం బించవలెను. మొత్తం గుగ్గులు కరిగిన తరువాత గుగ్గులు కల్గిన క్వాథమును మృదుగ్నిపై వేడిచేసి నీడలో ఎండించవలెను.

**జహర్మొహర :** బాగా కాల్చిన జహర్మొహరను పాలు లేదా ఉసిరి రసములో వేసి చల్లార్చవలెను. ఈ విధముగా 21 మార్లు చేయవలెను.

**జయపాల బీజములు :** (విషముష్టిగింజలకు ఉపయోగించు పద్ధతి వాడవలెను.)

**టంకణము :** టంకణమును ఇనుప బాణలీలో వేసి బాగా విచ్చుకొని తేలికగా అగునంత వరకు వేపవలెను.

**తుత్థము :** తొమ్మిది గంటల పాటు ఆవు మూత్రములో లేదా బఱ్ఱె మూత్రములో లేదా మేక మూత్రములో తుత్థమును డోలాయంత్రమందుంచి కరిగించవలెను.

**ధత్తూర బీజములు :** పరిణతి చెందిన ధత్తూర బీజములను ఆవుపాలలో డోలాయంత్రమునందు కాచి తరువాత గోరువెచ్చని నీటితో కడిగి ఉపయో గించవలెను.

**పారదము :** (రసతరంగిణిలో తెలుపబడిన పద్ధతి ప్రకారము శోధన చేయవలెను.) శాస్త్రానుసారము మాత్రమే పారదశోధన చేయవలెను.

1. పారదమునకు సమభాగము సున్నము కలిపి – మూడు రోజులు బాగా మర్దించి వస్త్రము ద్వారా పారదమును వడకట్టవలెను.

2. పారదమునకు సమభాగము పొట్టుతీసిన వెల్లుల్లి ముక్కలను, అందులో సగభాగము ఉప్పు కలిపి ముద్దగా చేయవలెను. ఖల్వములో పారదము వేసి కొద్ది కొద్దిగా ఈ కల్కము కలుపుతూ అది నల్లగా మారు నంతవరకు మర్దనచేయవలెను. తదుపరి నీటితో కడిగి పాదరసమును వేరు చేయవలెను.

**ప్రవాళము :** పగడములను వేడి నీటిలో కడిగి ఆరబెట్టవలెను. తరువాత పొడిచేసి నిమ్మరసములో వేసి రెండు రోజులు భావన చేయవలెను. తరువాత

గులాబీజలము, చందన అర్కములలో భావన చేసి నీడలో ఆరబెట్టవలెను.

**భల్లాతకము :** జీడి గింజలను గోమూత్రములో 24 గంటలు నాన్చి కడిగిన పిదప, పాలలో నానబెట్టి కడుగవలెను. పాలతో మూడు పర్యాయ ములు ఈ విధానమును అవలంబించవలెను. తరువాత ముక్కలుగా చేసి సూక్ష్మమైన ఇటుక పొడిలోవేసి నలుగగొట్టి నీటితో కడిగిన భల్లాతకమును వాడవలెను.

**భంగ (భంగు) :**

1. భంగుయొక్క ఆకును వస్త్రములో కట్టి ఆకుపచ్చని రంగు ఆగిపోవు నంతవరకు కడుగవలెను. అదే వస్త్రమును పరచి ఆకులను ఆరపెట్టవలెను.

2. ఆకులను పొట్టముగా వస్త్రములో చుట్టి ఆకుపచ్చని రంగు పూర్తిగా తొలగి పోవునంత వరకు నీటిలో కడుగవలెను. తదుపరి నీడలో ఆరబెట్ట వలెను.

**మనఃశిల :** పొడిచేసిన మనఃశిలను ఏడు మార్లు ఆర్ద్రకస్వరములో భావన చేయవలెను.

**ముక్తా (ముత్యములు) :** డోలా యంత్రములో మూడుగంటలపాటు జయంతీ పత్రముల రసముతో ఉడికించి గోరువెచ్చని నీటితో కడిగి తరువాత నిమ్మరసములో భావనచేసి ఆరబెట్టవలెను.

**ముక్తాశుక్తి :**

1. ముత్యపు చిప్పలను వేడినీటితో కడిగి మూడు వంతుల నీరు మరియు ఒక భాగము నిమ్మరసము కలిగిన ద్రావకములో వేసి మూడు గంటలపాటు మట్టి పాత్రలోవేసి మరిగించవలెను.

2. గోరువెచ్చని నీటిలో కడిగిన ముత్యపు చిప్ప ముక్కలను మట్టిపాత్రలో వేసి అందులో నాల్గవవంతు నిమ్మరసము కల్గిన ద్రావకములో వేసి ఒక గంట మరిగించి నీటిని తీసివేసి ముక్కలను ఆరబెట్టవలెను.

**రసాంజనము :** భృంగరాజ స్వరసములో రసాంజనము యొక్క చూర్ణ మును ఏడుమార్లు భావన చేయవలెను.

**లాంగలి (పొత్తుదుంప) :** చిన్న చిన్న ముక్కలుగా చేసిన లాంగలిని గోమూత్రములో 24 గంటల పాటు నాన్చి, నీడలో ఆరబెట్టవలెను.

**వత్సనాభి :** చిన్న చిన్న ముక్కలుగా చేయబడిన వత్సనాభిని గోమూత్ర

ములో నానబెట్టవలెను. ప్రతి 24 గంటలకొకమారు గోమూత్రమును మార్చుతూ మూడు దివసములు నానబెట్టవలెను. తరువాత డోలా యంత్ర ములో ఆవుపాలతో మూడు గంటలు ఉడికించి ఆరబెట్టవలెను.

**విధారా బీజములు :** ఉత్తరేణి స్వరసము లేదా ఉప్పు కలిపిన నీటిలో విధారా బీజములను నానబెట్టి ఎండించవలెను.

**విషముష్టి గింజలు :** చిన్న చిన్న ముక్కలుగా చేయబడిన గింజలను ఏడు రోజులపాటు గోమూత్రములో నానబెట్టవలెను. (24గం॥ ఒకమారు గోమూత్రము మార్చవలెను.) తదుపరి గింజలపైని పొట్టు మధ్యలో ఉండు అంకురమును తీసివేసి ఆరబెట్టవలెను.

**వ్యోమాష్మ :** డోలాయంత్రములో ఆవుపాలతో మూడు దివసములు ఉడికించవలెను.

**స్నుహి దుగ్ధము :** 50 మి.లీ. స్నుహి దుగ్ధమునకు 12 మి.లీ. చింత పండు రసమును కలిపి వస్త్రము ద్వారా వడపోయవలెను. నీరు ఆరిన తరువాత మిగిలిన భాగమును వాడవలెను.

**స్ఫటికము(పటిక) :** లోహ పాత్రలో స్ఫటికము తేలికగా బాగా వికసించునంత వరకు వేడి చేయవలెను.

**హరితాళము :** చిన్న చిన్న ముక్కలుగా చేయబడిన హరితాళమును బూడిద గుమ్మడి పండు రసములో సున్నపు నీటితో డోలా యంత్రములో వేసి ఆరు గంటలపాటు మృద్వగ్నిపై వేడి చేయవలెను.

**హింగు :** శుభ్రమైన హింగు నిర్యాసనమును వేడిగా ఉన్న నెయ్యిలో వేసి దోరగా వేయించవలెను.

**హింగుళము :** ఆర్ద్రక స్వరసములో నిమ్మరసములో, లేదా గొర్రె పాలలో ఏడుమార్లు భావన చేయవలెను.

**శ్వేత పర్పటి లేదా వజ్రక్షారము**

శుద్ధ శంఖము 480గ్రా. స్ఫటికము 60గ్రా. మరియు నవసాదరము (నవాసారము) 30గ్రా. మట్టిపాత్రలో వేసి కరిగిన పిదప పేడపైనఉంచిన అరటి ఆకుపై పరచి పైన ఇంకొక ఆకునువేసి చల్లబరచవలెను. సన్నని అప్పడము వంటి పర్పటిని చూర్ణము చేసి గాజు పాత్రలో భద్రపరచవలెను.

**షడంగ పానీయము (భేషజ సిద్ధపానీయము):** 12గ్రా. ఔషధము యొక్క యవకూట చూర్ణమును 750 మి.లీ.నీటిని కలిపి వేడిచేసి సగ

భాగము మరిగిన పిదప వడపోసి వాడుకొనవలెను.

**సత్త్వము :** తాజాగా ఉన్న ఔషధ ద్రవ్యమును చిన్న చిన్న ముక్కలుగా చేసి వేరొక పాత్రలో నాలుగు రెట్లు నీటిని వేసి రెంటిని బాగా కలుపవలెను. ఆ నీటిని వడపోసి వేరొక పాత్రలో రాత్రంతయు కదపకుండా ఉంచవలెను. తరువాత పైన తేలిన నీటిని క్రింద చేరిన మడ్డిని తగు విధముగా తీసి నీడలో ఆరబెట్టవలెను.

**సంధాన కల్పన** (Fermentation Process)

మట్టి పాత్రను లేదా చెక్క సీసాను శుభ్రపరచి, ధూపమువేసి తదుపరి ఘృతము రాసి పాత్రను సిద్ధము చేయవలెను. ఈ పాత్రలో శర్కర, గుడము లేదా తేనె కలిపిన నీటిని వేసి అందులో ఔషధముల క్వాథమును లేదా యవకూటము చేసిన ఔషధముల చూర్ణము వేయవలెను. తరువాత ధాతకీ పుష్పము లేదా మధూకపుష్పమువేసి పాత్రను సంధిబంధనము చేసి ఒక నెలపాటు సమశీతోష్ణముగా ఉండు ప్రదేశములో సంధానము చేయవలెను.

12.30 లీ. ద్రవమునకు 48 కి.గ్రా. బెల్లము లేదా శర్కర లేదా తేనె యొక్క అవసరము ఉంటుంది. బాగా శర్కర శాతము కల్గిన ద్రాక్ష మధూక లేదా ఖర్జూరము వంటి ద్రవ్యములు కలిపినపుడు బెల్లము లేదా శర్కరి లేదా తేనె 3.6 కి.గ్రా. సరిపోతుంది. సంధాన ప్రక్రియ పూర్తి అయి తరువాత పైన తేలి ఉన్న ద్రావకమును వేరొక పాత్రలో వడపోసి శుభ్రపరచిన సీసాలలో మూతవేసి భద్రపరచవలెను.

ద్రవ్యమును క్వాథము చేసి సంధానము చేసిన దానిని అరిష్టము అంటారు. ద్రవ్యముల స్వరసమును సంధానము చేయగా లభించునది ఆసవము.

**సిక్థతైలము (మల్హాము) :** వేసవి కాలములో ఉపయోగించుటకు (6 భాగముల తిలతైలము 91 భాగము మధూచ్ఛిష్టము మైనము), శీతాకాలములో ఉపయోగించుటకు (5 భాగముల తిలతైలము, ఒక భాగము మధూచ్ఛిష్టము వాడవలెను.) తైలమును వేడిచేసి అందులో మైనము వేసి కరిగిన పిదప వడపోసి చల్లార్చవలెను.

**స్నేహపాకము :**

1. ఒక భాగము ద్రవ్యములకు 16 రెట్లు నీటిని కలిపి నాల్గవవంతు వచ్చు వరకు మరిగించి క్వాదము తయారు చేయవలెను. ఈ క్వాథమునకు

సమాన భాగము నెయ్యిని లేదా నూనెను కలిపి నీరంతయు ఆవిరి అగునంత వరకు మృద్వగ్నిపై కాచవలె. నీరు పూర్తిగా తొలగిపోయిన పిదప శు భ్రమైన పాత్రలో వడపోసి భద్రపరచవలెను.

2. తాజా ఔషధముల యొక్క ముద్ద లేదా ఎండిన ఔషధములను నీటితో కలిపి తయారు చేయబడిన ముద్ద కల్కము యొక్క భారమునకు నాలుగురెట్ల నెయ్యిని లేదా నూనెను మరియు 16 రెట్లు నీటిని కలుపవలెను. నీరంతరయు తొలగిపోవునట్లు కాచి, మిగిలిన స్నేహమును వడపోసి శు భ్రము చేయవలెను.

3. బాగా కఠిన ద్రవ్యముల స్నేహము సిద్ధము చేయుటకు వాని క్వాథము తయారుచేసి పైన పేర్కొన్న పద్ధతి ప్రకారము స్నేహపాకము చేయ వలెను.

4. స్వరసము నుండి స్నేహము తయారు చేయుటకు 8 భాగముల స్వరసమునకు ఒక భాగము స్నేహము (అందులో నీటి శాతమున్నట్లయితే) శబ్దము వస్తుంది. ముద్దను వత్తినట్లయితే తైలము బయటకు రావలెను. నెయ్యి పాకము జరుగుతున్నపుడు నురగ ఆగిపోవడము (ఫేనశాంతి) స్నేహ సిద్ధి లక్షణము. పాకము జరుగుతున్నపుడు (ఫేరోద్గమము) నురగ రావడము పాక సిద్ధి లక్షణము.

**స్ఫటిక ద్రవము :** 12 గ్రా. స్ఫటికమునకు 600 మి.లీ. నీటిని ఒక సీసాలో వేసి, మూతపెట్టి 15 ని॥ పాటు బాగా కలుపవలెను. స్ఫటికము కరిగిన తరువాత ద్రవమును వడపోసి వాడవలెను.

**స్వరసము**

**1. తాజా ఔషధములు :** క్రిమి కీటకాదులు మొదలగు వానితో దూషిత ముకాని, పరిశుభ్రమైన ప్రదేశమునుండి సేకరించిన తాజా మొక్కలను నీటితో శుభ్రపరచి చిన్న చిన్న ముక్కలుగా చేసి నెమ్మదిగా దంచి ముద్దగా చేయవలెను. ఈ ముద్దను శుభ్రమైన గుడ్డలో ఉంచి పిండడం ద్వారా రస మును వేరు చేయవచ్చు. ఈ రసమును గాజు లేదా పింగాణి పాత్రలో వేసి వెనువెంటనే వాడవలెను.

**2. ఎండిన ద్రవ్యములు :** ఎండిన ద్రవ్యముల చూర్ణమునకు సమాన భాగము లేదా రెట్టింపు నీటిని కలిపి 24 గం॥ పాటు మట్టి, గాజు లేదా పింగాణీ పాత్రలో నాన్చవలెను. తదుపరి శుభ్రమైన గుడ్డతో పిండి రసమును గాజు లేదా మట్టి లేదా పింగాణీ పాత్రలో వాడవలెను.

**3. పుటపాక స్వరసము :** తాజా ఔషధములను దంచి ముద్దగా చేయ వలెను. ఈ ముద్దను కమలము, మఱ్రి, నేరేడు, ఆముదము లేదా గుమ్మడి టేకు ఆకులలో వేసి దారముతో బంతివలె కట్టవలెను. ఈ బంతిగా తయారు చేసిన ఈ ముద్దపై తడి గోధుమ పిండిని పూసి పైన రెండు వేళ్ళ మంద ముతో మట్టిని పూయవలెను. తరువాత ఏరు పిడకలతో ఈ బంతిని కాల్చి అందులోని ముద్దను తీసి బట్టతో పిండడం ద్వారా రసమును తీయవలెను. ఈ రసమును గాజు లేదా మట్టి లేదా పింగాణీ పాత్రలో వేసి వాడవలెను.

తేనె, శర్కర, బెల్లము, జీలకఱ్ర, యవక్షారము, సైంధవము, నెయ్యి, నూనె లేదా చూర్ణము మొదలగునవి ఒకమారు సేవించడానికి కలుపుటకు యోగ్యమైన మాత్ర 3-18 గ్రా.

**హిమము :** శీతకాషాయము చూడవలెను.

## స్నేహకల్పనా విజ్ఞానము

ఘృతము, తైలాది స్నేహములను కల్కము క్వాథము, జలము, దుగ్ధము, స్వరసము, మాంసరసము, కాంజికము, గోమూత్రము తక్రము మొదలగు ద్రవ్య పదార్థములందు ఒకటి, రెండు లేదా అధిక ద్రవములతోగాని ఔషధ కల్కములతో కలిపిగాని, పాత్రయందు పోసి అగ్ని సంయోగము ద్వారా పాకము చేయు ప్రక్రియను స్నేహపాకమందురు.

భైషజ్యరత్నావళీకారుడు స్నేహకల్పన నందు స్నేహపాకము సరియైన పద్ధతిలో చేయుటకు సామాన్య పరిభాషను ఈక్రింది విధముగా సూచించి నాడు.

1. సర్వ ప్రథమముగా స్నేహములను మూర్ఛన చేయవలెను.

2. ఆ తరువాత ఆయా వ్యాధిహర ద్రవ్యముల క్వాథము లేదా స్వరస ములను మూర్ఛిత స్నేహముతో పాకము చేయవలెను.

3. పిమ్మట క్షీరము కలిపి పాకము చేయవలెను.

4. తరువాత ఆయా వ్యాధిహర ద్రవ్య కల్కములను చేర్చి పాకము చేయవలెను.

5. తరువాత గంధ ద్రవ్యములను చేర్చి మృద్వగ్ని ద్వారా స్నేహసిద్ధ లక్షణములుత్పన్నమగు వరకూ పాకము చేయవలెను.

**స్నేహభేదములు :** ఆయుర్వేద గ్రంథములందు తైలము,

ఘృతము, వసా, మజ్జా అను నాలుగు రకముల స్నేహములు వర్ణింపబడినవి. స్థావర స్నేహములలో తిలతైలము, జాంగమ స్నేహములలో ఘృతము శ్రేష్ఠమైనవిగా పేర్కొనబడినది. ఈ నాలుగు స్నేహములలో రెండింటిని కలిపి ప్రయోగించిన యమకస్నేహమని (ఉదా: తైలము+ ఘృతము) మూడింటిని కలిపి ప్రయో గించిన త్రివృతస్నేహమనియు (ఉదా:- తైలము+ఘృతము+వసా) మరియు నాలిగింటిని కలిపి ప్రయోగించిన మహాస్నేహమని పిలువబడును. స్నేహ కర్మ పంచ కర్మలకు పూర్వకర్మగా పేర్కొనబడినది.

**మూర్ఛన :** మూర్ఛన చేయకుండా ఏ స్నేహమును స్నేహకల్పనలందుపయోగించరాదు. మూర్ఛన అనగా కొన్ని ద్రవ్యములనుచేర్చి స్నేహమును పాకము చేయుట అని అర్థము. ఈ ప్రక్రియద్వారా స్నేహమందలి ఆమ దోషము నివర్తింపబడి స్నేహము వీర్యవంతమగును.

**ఘృతమూర్ఛన :** ఘృతము (1ప్రస్థము=64 తులములు) మందాగ్ని పై పాకము చేయుచూ త్రిఫలములు, ముస్తా, హరిద్రా, అను ద్రవ్యముల చూర్ణమును, మాతులుంగ ఫలరసమును ఒక్కొక్క తులము చొప్పున కలుపవలెను. ఈ సమయమునందు ఘృతము పొంగిపోవుటకు అవకాశమున్నది. అందుచేత జాగ్రత్తగా ఈ విధిని నిర్వర్తించవలెను. నురుగు తగ్గిన తరువాత ఘృతమును దించి చల్లార్చి భద్రపరచవలెను. (భై.ర.)

**తిల తైల మూర్ఛన :** గట్టిదైన ఒక లోహపాత్రలో ఒక ప్రస్థము తిల తైలమును వేసి పొయ్యిపైనుంచి మందాగ్నిలో తైలమునందు నురుగు తగ్గిపోవునంత వరకూ కాచి దించి చల్లార్చవలెను. అటుపిమ్మట మంజిష్టా, హరిద్రా, లోధ్ర, ముస్తా, నలికా, ఆమలకీ, విభీతక, హరీతకీ, కేతకీ, వటాం కుర, హ్రీబేర వీనియందు మంజిష్టా తైలమునకు 16వంతు (4తులము) మిగిలినవి మంజిష్టాలో నాలుగవ వంతు (ఒక్కొక్క తులము చొప్పున) గ్రహించి జలమునుచేర్చి కల్కముగా తయారు చేసి తైలమునందు వేసి తిరిగి తైలమును పొయ్యపైన ఎక్కించి మందాగ్నిలో తైలపాక విదినపాకము చేయవలెను. (భై.ర.)

**ఏరండ తైల మూర్ఛన :** దీనిని కూడా తిలతైలమువలెనే నురుగు ఆగి పోయేంతవరకూ కాచి దించి దానిలో మంజిష్టా, ముస్తా, ధాన్యక, త్రిఫల, అగ్నిమంథ, హ్రీబేర, వనఖర్జూర, పటాంకుర, హరిద్రాద్వయము, నలికా, శొంఠి, కేతకి పుష్పము ఒక్కొక్కటి తులములో నాలుగవ వంతు,

25 ప్రస్థములు దధి, కాంజికము (2 ప్రస్థము) తీసుకొని ఏరండ తైలమున వేసి తైలపాక విధిని కాచవలెను. (భై.ర.)

**స్నేహపాకవిధి :** నెయ్యి, నూనె, మొదలగు స్నేహద్రవ్యములను పక్వము చేయునపుడు కల్కమున కంటె తైలాదులను నాలుగురెట్లు పాలు, గో మూత్రము మొదలగు ద్రవ ద్రవ్యములను తైలాదులకు నాలుగురెట్లు కలిపి అందలి ద్రవ్యములను, కల్కమును ఇరుగునట్లు, తైలము మాత్రము మిగులునట్లు కాచవలెను.

**స్నేహపాక నియమములు :** స్నేహము మృదుపాకమనియు, మధ్యపాకమనియు, ఖరపాకమనియు 3 విధములు. ఇందలి కల్క ద్రవ్యము కొంచెము ద్రవయుక్తముగ ఉండెనేని మృదుపాకమనియు, ద్రవ విహీనమై కోమలముగా ఉండెనేని మధ్యపాక మనియు, కొంచెము కఠినముగ ఉండె నేని ఖరపాకమనియు అనబడును. నస్యమునకు ఉపయోగించెడి తైలము మృదు పాకముగను, సర్వకర్మల యందు ఉపయోగించెడి తైలము మధ్య పాకముగను, శరీరలేపమునకు ఉపయోగించు తైలము ఖరపాకముగను ఉండవలెను.

**స్నేహసిద్ధి లక్షణములు :** తైలమును పక్వముచేయునపుడు అందు కల్క ద్రవ్యమును వ్రేళ్ళతో నలిపినచో అది వ్రేలికి అంటుకొనక వత్తివలె వుండిన మరియు స్నేహద్రవ్యమును నిప్పులో ఉంచిన ఎడల చిటపట యను శబ్దము లేకున్నచో తైలము మున్నగు స్నేహ ద్రవ్యములు పక్వము లైనవని తెలుసుకొనవలెను. మరియు తైలము పక్వమగు సమయమున విశేషముగ నురుగుకట్టి, మంచి సువాననయు, మంచి వర్ణంబును, రసమును కలుగును. ఘృతము పక్వమగునపుడు నురుగు నిలిచి, గంధము వర్ణము, రసము కల్గును.

స్నేహపాకమునందు ద్రవ ద్రవ్యములు అయిదు కంటె ఎక్కువున్నచో అవి ఒక్కొక్కటి స్నేహమునకు సమాన పరిమాణములో ఉండవలెను. ద్రవ ద్రవ్యముల సంఖ్య నాలుగు అంతకు తక్కువున్నచో వాటి ప్రమాణము ఒక్కొక్కటి స్నేహమునకు 4 రెట్లుండవలెను. (శా.స) స్నేహము కొరకు క్వాథము తయారుచేయునపుడు క్వాథ్య ద్రవ్యములు మృదువుగ నున్నచో వాటికి 4 రెట్లు నీరును కలిపి, మధ్యమముగా నున్నచో 5 రెట్లు నీటిని కలిపి, కఠినముగా నున్నచో 8 రెట్లు నీరును కలిపి, మధ్యమముగా నున్నచో 16 రెట్లు నీటిని కలిపి క్వాథమును తయారు చేయవలెను. క్వాథ్య ద్రవ్యము

యొక్క ప్రమాణము కర్షమునుండి పలమున్నప్పుడు 16 రెట్లు నీటిని, పలము నుండి ప్రస్థము నున్నప్పుడు 8 రెట్లు నీటిని, ప్రస్థమునుండి ఖారీఉ న్నప్పుడు 4 రెట్లు జలముపోసి కషాయము తయారు చేయవలెను. స్నేహ నిర్మాణము నందు క్వాథ్య ద్రవ్యము చెప్పబడినపుడు కేవలము కల్కము కొరకు చెప్పబడిన ద్రవ్యములను జలములో కల్కముగా నూరి స్నేహమునకు చేర్చి పాకము చేయవలెను. స్నేహకల్పనందు కల్కము చెప్పబడినయెడల క్వాథ్యద్రవ్యము లనే కల్కముగా చేసి స్నేహమునందుచేర్చి పాకము చేయవలెను. పుష్పకల్క ముతో స్నేహపాకము చేయవలసి వచ్చినపుడు దాని ప్రమాణము స్నేహము నకు 3వ వంతుగా నుండవలెను.

దుగ్ధము, దధి, మాంసరసము, తక్రము వీటిలో స్నేహపాకము చేయు నపుడు కల్కము యొక్క ప్రమాణము స్నేహమునకు అష్టమాంశముండ వలెను. జలము, క్వాథము, స్వరసము వీటితో స్నేహమును తయారు చేయు చున్నప్పుడు కల్కము యొక్క ప్రమాణము క్రమముగా 4వంతు, 6వ వంతు, 8వ వంతుగా ఉండవలెను.

ఘృతము, తైలము, గుడము వీటిని ఒకేదినమున తయారు చేయ కూడదు. నిలువయుంచుచూ అల్పముగా పాకము చేయుచూ కొద్దిరోజుల వ్యవధిలో తయారు చేసిన ఎడల ఎక్కువ గుణమును కలిగియుండును.

## సంధాన కల్పనా విజ్ఞానము

జలము, ఇక్షురసము, క్వాథము మొదలగు ద్రవ పదార్థములు, వనస్పతిక ద్రవ్యములు, అన్నము, గుడము, కిణ్వము మొదలగువాటిని సంయోగపరచి, ఒక విశిష్టమైన పాత్రయందుంచి కొంతకాలము వరకు పులియునట్లు చేయు ప్రక్రియను "సంధానము" అందురు.

స్త్రీయతే యదిం, సంధాల్యుట్ అనువు ధాతువునుండి సంధాన శబ్దము ఏర్పడినది. శ్రీ నయనానందుడు "మద్యం సజ్జీకరణమ్ " అనియు, అమర కోశకారుడు ఆ విషయము పర్యాయనామములు పేర్కొనినారు. మేదినీ కోశమునందు సంఘట్టనమ్ అను పదము సంధానమునకు పర్యాయముగా పేర్కొనబడినది. అనేక ద్రవ్యములను ఒకచోట సంఘటితపరిచి కలుపుటచే సంఘటన అందురు.

సంధాన కల్పనద్వారా చేయబడు సురా మద్య ఆసవ అరిష్ట సోమరస మొదలగు మాచక పేయ పదార్థము వివరణ వేదములందు పేర్కొనబడినది.

వాటి విరణ చరక సుశ్రుతాది సంహితలందు విస్తృతముగా ఉల్లేఖించబడి నది. యోగమహెూరధికారుడు పేయం యన్మాదకం లోకైస్తర్మర్య మది ధీయతే” అనుచూ మదమును కలిగించు త్రాగే పదార్థమునకు మద్యమని పేర్కొనెను. శారంగధరుడు “బుద్ధిం లుస్పతి యద్ద్రవ్యం మరకారి తదుచ్యతే తమోగుణ ప్రధానం చ యథా మద్యం సురాది రమే”మద్యము సుకాదులు బుద్ధిని ఆచ్ఛాదరపరచి మత్తును కలిగించును. కనుక మదకారి ద్రవ్యములుగా పేర్కొనెను.

సంధాన కల్పనలయందు సురా, వారుణీ మొదలగువాని కంటె ఆసవ, అరిష్ట యోగములను చికిత్సలలో ప్రధానముగా ఉపయోగించబడు చున్నవి. చరక సంహిత (సూ.స్థా25) నందు 84ఆసవ యోగములను వర్ణిస్తూ “ఏషామాసవాగా మాసుత ర్వాదాసనవసంజ్ఞా” సంధాన మావమై ఔషధమును ఆసనముగా చరకుడు పేర్కొనెను.) భరద్వాజకృత భేషజకల్పం అను గ్రంథమున నిర్దిష్టం రిష్టమశుభం అరిష్టం రిష్ట వర్షితమ్ అరిష్టమాసవం క్షాద్రం లేహ్యమిత్యవిధీయతే, తర్చాంద్ర ద్రవ భేదేన పేర్కొనుచూ దోషములు లేనటువంటి ఔషధములను అరిష్టములుగ ఉదహరిస్తూ ఆయా ఔషధములను ఆసవాలు, క్షౌద్రము, లేహ్యమనియు చిక్కగా మరియు పలుచగ నుండు లక్షణమూలాధారంగా పిలువబడుచున్నవని విశదీకరించినాడు. నరిష్యతే ఇతి అరిష్టః నష్టము చెందనిది అరిష్టమని శ్రీ యాదవజీ పేర్కొని నాడు. (ద.వి.)

నిరంతర ప్రయత్నానంతరము వైద్యులు చిరకాలము వరకు వీర్యవంతములగ వుంటూ చెడిపోకుండా ఉండునటువంటి ఔషధ యోగము లను నిర్మించడములో కృతకృత్యులయినారు. సంధానకల్పన మరియు ధాతు వుల భస్మకల్పనలు దీనికి చక్కటి ఉదాహరణగా పేర్కొనవచ్చును.

శారంగధరుడు సంధానకల్పన వివరిస్తూ ఔషధ ద్రవ్యములను ద్రవ ద్రవ్యముల చేర్చి సంధిబంధనము చేసి చిరకాలముంచిన ఎడల దానిని ఆసవము లేదా అరిష్టము లనవచ్చునని పేర్కొనెను. ప్రాచీన ఆయుర్వేద గ్రంథములైన చరక, సుశ్రుతాది సంహితలందు ఆసవము మరియు అరిష్టము నకు గల భేదములు పేర్కొనబడలేదు. ఓషధులను కాచబడని జలము మొదలగు ద్రవ్యములందు చేర్చి సంధిబంధము చేసి సిద్ధము చేయబడిన మధ్యము ఆసవమనియు, కషాయముకాచి, అందు ఓషధులువేసి సంధిబందన మొనర్చి సిద్ధము చేయబడిన ద్రవము అరిష్టమనియు

శారంగధరాది ఆచార్యులు పేర్కొనిరి. అనామాత్ర జలోన్మితం అనగా జలపానమువలె అల్ప మాత్రగా సేవించవలెనని దీపికా వ్యాఖ్యానకర్త ఆడమల్లుడు వివరిం చాడు. కాని పలప్రమాణమని పాఠము కూడా కలదు.

**ఆసవారిష్ట నిర్మాణమునందు తీసుకోవలసిన జాగ్రత్తలు**

1. క్వాథముతో ఆసవారిష్టలను తయారు చేయునపుడు కషాయమును ఎల్లప్పుడూ మధ్యమాగ్ని ద్వారా పాకము చేయవలెను. అర్ధావశేష కషాయ మునందు ఔషధసార భాగము పూర్ణరూపములో జలములోనికి రాకపోవుటచేత చతుర్థావశేష కషాయము నిర్మించుట వలన ఆసవారిష్టలు గుణవంతములుగా తయారుగునని శ్రీ సిద్ధనందనమిశ్రాగారి అభిప్రాయము.

2.ఆయుర్వేద పరిభాషానుసారము "పాత్రేనుత్వేతు స్సుత్పాత్రం" పాత్రను గూర్చి నిర్దిష్ట వివరణ లేనపుడు మట్టికుండను గ్రహించవలెను. కొద్ది ప్రమాణములో అసవారిష్టలను తయారు చేయునపుడు మట్టికుండను ఉపయోగించ వచ్చును. మట్టికుండకు గల రంధ్రముల ద్వారా కొంత ద్రవము బయటకుపోవుట లేదా పరిసర ప్రదేశమునగల వాయువు కుండ లోనికి ప్రవేశించి అరిష్టము సరియగు రీతితో తయారుకాదని కొందరి అభిప్రాయము. ప్రస్తుత కాలమున స్టెయిన్‌లెస్ స్టీలు లేదా కొయ్యతో చేయ బడిన పెద్దపెద్ద డ్రమ్ములందు అసవారిష్టలు తయారు చేయబడుచున్నవి.

3. సంధానము చేయునపుడు బెల్లము బాగుగా పొడిచేసి ద్రవమునందు కరుగునట్లు చేయవలెను. లేనిచో ఆసవారిష్ట తయారయినపుడు రుచిలో తేడా కనబడును.

4. సంధిబంధనము చేసిన పాత్రను భూమిలోపల సంధానప్రక్రియ పూర్తగు నంతవరకూ యుంచవలెనని గ్రంథములందు పేర్కొనబడినది. ఒక్కొక్కప్పుడు మట్టిపాత్ర పగిలిపోయి ఔషధమంతయూ బయల్వెడలును. అందుచేత ప్రస్తుత కాలమున సిమెంటుతో తయారుచేసి గాలిచొరని గదు లందు ఆసవారిష్టములను సంధాత మొనర్చుచున్నారు.

5.ఆసవారిష్ట నిర్మాణమునందు కాలము,ఋతువు లేదా వాతావరణము యొక్క ప్రభావము చాలా ఉండును. వసంత మరియు శరత్ ఋతువులందు సంధాన కల్పనకు అనుకూలవైనవిగా గమనించబడినది. వర్షఋతువునందు ఔషధము చెడిపోయి సరిగ్గా తయారుకాబడదు. సంధానమునకు సామాన్య ముగా $30^0$-$35^0$సెం.

ఉష్ణోగ్రత ఆవశ్యకముగా నుండును. సంధానప్రక్రియ సందిబంధమును చేసిన 3-4 రోజులలో ప్రారంభమై 15-30 దినములలో పూర్తి అవుతుంది. గ్రీష్మ, ఋతువునందు 3-10 దినములలోనే సంధాన ప్రక్రియపూర్తి అవుతుంది. వసంత ఋతువునందు 15-20 దినములలో పూర్తి అవుతుంది. కాని శీతాకాలమున సంధాన ప్రక్రియ ఆలస్యముగా ప్రారంభ మగును.

6. సంధానము చేసిన పాత్రనందు 6-7 దినముల తరువాత చిన్న చిన్న శబ్దములు ప్రారంభమగును. ప్రక్రియ పూర్తి అగునపుడు ఈ శబ్దములు నిలచిపోవును. సంధాన ప్రక్రియ జరుగుచున్నప్పుడు కార్బన్-డై-ఆక్సైడ్ ఉత్పన్నమగును. కిణ్వీకరణ ప్రక్రియ పూర్తి యగునపుడు కార్బన్-డై-ఆక్సైడ్ వాయువు యొక్క ఉత్పత్తి ఆగిపోయి ఆక్సిజన్ జనించును. అగ్గిపుల్లను వెలిగించి సంధాన పాత్ర మధ్యలో వుంచితే వెలుగుతున్నట్లయినచో సంధాన ప్రక్రియ పూర్తి అయినట్లు గ్రహించవచ్చును. అగ్గిపుల్ల ఆరిపోయినచో కార్బన్-డై-ఆక్సైడ్ ఇంకా మిగిలియున్నట్లు, సంధానప్రక్రియ జరుగుతున్నట్లు తెలుసుకొనవచ్చును.

7. సవ్యముగా తయారుకాబడిన ఆసవ, అరిష్టలందు సురా యొక్క ప్రమాణము 5%-15% ఉండును. దీనిని సురామాపక యత్రము ద్వారా నిర్ణయించవచ్చును. శాస్త్రీయ పద్ధతిలో భూమిలో పాతిపెట్టి చేసిన ఆసన, అరిష్టలందు 15% వరకూ సురయున్నట్లు గమనించబడినది.

8. లోహాసవ, కుమార్యాసవర, సారస్వకారిష్ట మొదలగు వాని యందు లోహభస్మ, స్వర్ణమాక్షికభస్మ, స్వర్ణభస్మ మొదలగు ధాతుభస్మలు కలుపవలసి వుండును. ఆల్కాహాలునందు 20-25 దినములుంచిన స్వర్ణపత్రములు లేదా భస్మములుపై రసాయనిక ప్రక్రియ ప్రారంభమగును. కాని ఆసవా రిష్టయ సురానందు ఈ ప్రక్రియ 3-4 నెలలు తరువాత ప్రారంభమగును. అందువలన వారితర లక్షణములు గలిగిన భస్మములనే అసవారిష్ట కల్పనలో ఉపయోగించుట అత్యంత ప్రయోజనకారిగా నుండును.

9. ధాతకీ పుష్పములు, ఇప్పపువ్వులు, ప్రక్షిప్త ద్రవ్యములుగా సంధాన ప్రక్రియలో వాడబడుతున్నాయి. ధాతకీ పుష్పమువలన సంధానక్రియ యందు ఏ విధమైన సహాయము లభించదని, ఆసవారిష్టలకు మంచిరంగు ఏర్పడ వచ్చునని శ్రీపక్షధరయాగారి అభిప్రాయము. ఇప్పపువ్వు వేయుట వలన ఆసవారిష్టలకు మధురమైన రుచి ఏర్పడుటలో తోడ్పడవచ్చును.

**సంధానవిధి :** శుష్క ద్రవ్యముల క్వాథమును లేదా ఆర్ద్ర ద్రవ్యముల స్వరసమునందు గుడము, శర్కరా లేదా తేనె కలిపి, కొన్ని ద్రవ్యముల చూర్ణమును కలిపి నెయ్యిపూసిన కుండ లేదా చెక్క/స్టీల్ డ్రమ్‌నందు పోసి సంధిబంధనము చేసి నిర్వాత స్థలమునందు లేదా భూమియందు 15-30 రోజులు నిలువయుంచవలెను. ఆ తరువాత ఔషధమును వడగట్టి సీసా లందు భద్రపరచవలెను. దీనిని ఒడ్డ ఫలప్రమాణము సేవించవలెను. అరిష్ట యోగములందు ఉదకాది ద్రవ్య ప్రమాణము చెప్పనిచో ద్రవ పదార్థములు ఒక ద్రోణ ప్రమాణము, గుడము ఒకతుల్లా (100పలముల) ప్రమాణము, గుడమునకు సగము తేనె, ఔషధచూర్ణము గుడమునకు పదియవభాగము గ్రహింపవలెను.




**సీధు**-ఇవి (చెరకు) రసముగాని, ఇతర మధుర రసయుక్త ద్రవపదార్థములను సంధానపరచి తయారుచేయు ఔషధమును అపక్వరస సీధు లేదా శీతారససీధు అందురు. ఇది లేఖనగుణము కలిగియుండును. ఇవే ద్రవ పదార్థములను అగ్ని సంయోగముచే పాకముచేసి సంధానపరచినచో దానిని పక్వరససీధు అందురు. ఈ పక్వరససీధు దీపన, బల్య, స్వర్య, హృద్య, స్నేహన, రోచన, వాతపిత్తకర కర్మలు కలిగియుండును. విబంధము, శోధ, అర్శస్సు, ఉదర వ్యాధులందుపయుక్తముగా నుండును. (రాజనిఘంటు)

**వారుణీ**–తాటిచెట్టు, ఖర్జూరపు చెట్టులనుండి తీయబడిన రసమును 'నీరా' (కల్లు) అందురు. నీరాను సంధానపరచి తయారుచేసిన మద్యమును వారుణీ అందరు. పునర్నవా స్వరసమునందు శావిష్టిక బియ్యమును నూరి సంధాన పరచిన మద్యమును కూడా వారుణీ అందురు. ఈ మద్యము లఘు గుణము గలిగియుండును. పీనసము, ఆధ్మానము, శూలలను పోగొట్టును. (భా.ప్ర.)

**శుక్తము**–ఆసవారిష్టములు లేదా మద్యము యొక్క సంధాన ప్రక్రియ సవ్యముగా జరుగక పాడయిపోయి ఆమ్లరసముగా మారిన మద్యము, లేదా మధుర రసముగల ఇక్షురసము మొదలగునవి సంధానపరచినపుడు గుణ హీనమై ఆమ్లరసము పొందినదానిని మరియు జలమునందు ఆవాలు, ఉప్పు, స్నేహము (తైలాదులు), కందమూలము (ముల్లంగీ మొదలగునవి) లను కలిపి సంధాన ప్రక్రియలద్వారా ఉత్పన్నమైన ఆమ్లరసయుక్త మద్య మును శుక్తమందురు. కుల్లాకభట్టు "స్వభావతో మధురరసాని యానికాల వశేనోదకాదినా చామ్లీభవన్తి ఆనిశుక్త శబ్దవాచ్యాని" స్వాభావికముగా మధుర రసముగల ద్రవాదులు కాలప్రభావముచే ఆమ్లత్వమును (పులిపినచో) పొందిన దానిని శుక్తమందురని పేర్కొనెను. శుక్తము రూక్ష, లఘు,తీక్ష్ణ, ఉష్ణగుణములు కలిగియుండి పాచన, రోచన, ఛేదన, కఫఘ్న, రక్తపిత్త ప్రకోపకముగా పనిచేయును. పాండు, క్రిమి వ్యాధులందుపయుక్తముగా నుండును.

**కాంజికము :** అమరకోశకారుడు "వారి పర్యుషిరాన్నాన్లుజలం" నిల్వవుంచబడిన ఆమ్లరసముగల జలముగా కాంజికమును వర్ణిస్తూ ఆపస్తోపోమమి, కుజలమై అనునవి కాంజికమును పర్యాయనామములు పేర్కొనెను. కాధాన్యము (వరిబియ్యము) అన్నమువండి ఒక మట్టికుండలో వేసి దానికి మూడురెట్లు నీటినిపోసి పాత్ర ముఖమును వస్త్రముతో గట్టిగా బిగించి కట్టి ఒక వారము రోజులుంచవలెను. ఆ తరువాత మూతను తొలగించి చూచిన ఆమ్లరసయుక్త పదార్థము తయారగును. దానినే కాంజి కము, ధాన్యామ్లము లేదా ఆరనాళము అందురు. కోద్రవమండము లేదా కల్మాష (సగము వుడికిన మినుములు మొదలగు ధాన్యములు) మొదలగు పదార్థములలో తైలమును కలిపి సంధాన పరచుట ద్వారా కాంజికమును తయారుచేయవచ్చును. ఉష్ణ, తీక్ష్ణ గుణమును, దీపన, వేదన, వస్తిశోధన కర్మలను కలిగి యుండును. శ్రమను, క్లమను హరింపచేయును. పురాణ

కాంజికము హృద్రోగము, పాండు, క్రిమిరోగములను నశింపచేయునని రాజవల్లభ నిఘంటుకారుడు పేర్కొనెను. వలీపలితములను నశింపచేయు రసాయన కర్మను, బల్య, సంతర్పణ కర్మలు గలిగియుండిన వాత వికారములు, శోథ, పిత్తజ జ్వరము, దాహము, మూర్ఛ, అధ్మానము, విబంధములను హరించునని రాజ నిఘంటుకారుడు పేర్కొనెను. పారదాది సంస్కారముల కుపయోగించు కాంజికము నిర్దిష్టమైన విధి ప్రకారము తయారు చేయవలెను.

**తుషోదకము :** ఒక మట్టికుండ యందు యవలను పొట్టుతీయకుండా దంచి నాలుగురెట్లు నీటిలోవేసి పాత్ర ముఖమును వస్త్రముతో మూసి సంధానము చేయవలెను. ఒకటి రెండు రోజుల నుండి వారము రోజుల వరకువుంచి తీసిన ఆమ్లరస ద్రవము తయారగును. దీనినే తుషోదకము అందురు. ఈ తుషోదకము ఉష్ణ, తీక్ష్ణ గుణములను, దీపన, పాచన, పిత్తవర్ధక, హృద్య కర్మలను కలిగియుండును. పాండు, క్రిమి వస్తిశూల వ్యాధులను శమింపచేయున.

**సౌవీరము :** యవలు లేదా గోధుమలను పొట్టుతీసి ఉడికించి లేదా ఆపక్వముగనే కుండలోపోసి నాలుగురెట్లు నీరుపోసి సంధిబంధనము చేసి 6-7 రోజుల తర్వాత తీసినచో ఆమ్లరసముగల ద్రవము తయారగును. దీనినే సావీరమందురు. కొంతమంది 3 రెట్లు నీటినిపోసి సంధానము చేయు చున్నారు. సౌవీరము కఫఘ్న, వేదన, దీపన కర్మలుగలిగి గ్రహణీ. అర్శస్సు ఉదావర్తము, అంగమర్దము, ఆణాహము అస్థిశూలలో ఉపయుక్తముగా నుండును.

**సురా :** మద్యములకు గల పర్యాయములైన హలిప్రియా, హాలా, వరుణాత్మకా, గంధోత్తమా అనునవి సురకు వర్తించును. దీనికి సుపరి, సుధా అను పేరు బాగా గలదు.

బియ్యము పిండిగా చేసిగాని లేదా అన్నముగా వండిగాని నీటిలోవేసి సంధాన పరిచినచో తయారగు మద్యమును సుర అందురు. సురపైయుండు స్వచ్ఛమైన ద్రవభాగమును ప్రసన్నా అందురు. ఈ ద్రవభాగమునకు క్రింద కొంచెము చిక్కగా ఉండు దానిని కాదంబరి అందురు. కాదంబరికి అధో భాగమున ఉండునది జగలము అనియు జగలము కంటె గట్టిగా నుండు క్రింది భాగము 'మేదక'ము అనియు చెప్పబడును. సురను వస్త్రముద్వారా వడకట్టిన పిదప మిగిలియున్న ఘనభాగము పిప్పినకు వక్కస, కిణ్వ మరియు

సురాబీజము అని అందురు. సుర గురుగుణము, గ్రాహి, బల్య, స్తన్య, కఫకర కర్మలు కలిగియుందును. గ్రహణీ, అర్మస్సు, మూత్రకృచ్ఛము, గుల్మము, శోథ అను వ్యాధులందు ఉపయుక్తముగా యుండును.

సంధాకి ముల్లంగి కల్కముచేసి తెల్ల ఆవాలు, ఇంగువ, జీలకర్ర, శొంఠి, పసుపు, సైంధవలవణము మొదలగువాని చూర్ణమును, జలమును కలిపి పాత్రలో యుంచి సంధిబంధనము చేసినచో 3-4 దినములలో తయారయిన ద్రవమును సంధాకి అందురు. ఇది పాండు, కామలా, అగ్ని మాంద్యాది వ్యాధులందుపయుక్తముగా నుండును.

## నేత్ర - ముఖరోగ చికిత్సా కల్పనము

ప్రాచీన ఆయుర్వేద గ్రంథములలో నేత్రచికిత్సా క్రమమునందు శస్త్ర చికిత్సతోపాటు అనేక అశ్చ్యోతన పిండి బిడాలక తర్పణ పుటపాక, మరియు అంజములను అను ఏడు విధముల చికిత్సోపక్రమములు పేర్కొనబడినవి. సుశ్రుతాది ఆచార్యులు నిశితముగా అధ్యయనము చేసి తమ గ్రంథములందు వీటిని వివరించిరి. కాని శారంగధరుడు సేకము,అశ్చ్యోతనము, బిడాలము, తర్పణము, పుటపాకము అంజనము అనునవి ముఖ్యమైన నేత్ర కల్పనలుగా పేర్కొనెను. (సు.ఉ. 18)

సుశ్రుతుడు తర్పణము, పుటపాకము, పేకము, అశ్చ్యోతనము, అంజనము, అనునది నేత్రరోగములందు ప్రధానముగా ఉపయోగించ వచ్చు నని పేర్కొనెను.

**సేకము :** నేత్రములను కొంచెము తెరచి అందు పాలు, నేయి, ఆకుల స్వరసం మొదలగు వానిని నాలుగు అంగుళముల ఎత్తునుండి ధారగా విడచుట పీతము అనబడును.

సేకమును పగటియందే ప్రయోగింపవలెను. రోగాధిక్యతను అనుస రించి రాత్రికూడా ప్రయోగింపవచ్చును.

**వాతప్రకోపమున స్నేహన సేకము :** రక్త, పిత్త ప్రకోపమును రోషణ స్నేహము కఫ ప్రకోపమున లేఖన సేకము ప్రయోగింపవలెను.

**వాతాభిష్యంచ రోగములకు సేకము :** లొద్దుగచెక్క, అతిమధురము వీనిని సమభాగములుగ నేతిలో (వేయించి) భర్జితముచేసి దానిని చూర్ణము చేసి మేకపాలతో కాచి నేత్రములలో పోసిన రక్తవికారము, అభిఘాతము నశించును.

**రక్తాభిష్యందమునకు సేకము :** త్రిఫలములు లొద్దుగ, అతిమధురము, చక్కెర, భద్రముస్తలు వీనిని సమభాగములుగ నూరి శీతలోదకంబుతో కలిపి నేత్రములలో పోసిన రక్తాభిష్యందము నశించును.

**నేత్రశూల – తొలగుటకై సేకము :** తెల్లలొద్దుగ చెక్కను నేతిలో వేయించి చూర్ణంచేసి వస్త్రగాలితముచేసి ఉష్ణోదకముతో నూరి నేత్రములలో పోసిన నేత్ర శూల నశించును.

**అశ్చోతనము :** నేత్రములను తెరచునటులచేసి నేత్రములకు 2 అంగుళ ముల ఎత్తునుండి కషాయము, పాలు మొదలగు వానిని ధారగా విడచుట అశ్చ్యోతనము అని పిలువబడును.

వాత ప్రకోపమున చేదు, స్నిగ్ధములగు అశ్చ్యోతములను, పిత్త ప్రకోప మున మధురము, శీతలములగు అశ్చ్యోతములను, కఫ ప్రకోపమున ఒగరు, ఉష్ణము రూక్షములగు అశ్చ్యోతనముల ప్రయోగింపవలెను.

**వాతాభిష్యందమునకు అశ్చ్యోతనము :** మారేడు, దుందిలము, గుమ్ముడు, నెల్లి, పాదిరి, వీని వేళ్ళతో ములక, ఆముదపు వేర్లు, మునగ వేరుపట్ట, వీనిని కషాయముకాచి దానిని సుఖోష్ణంబున నేత్రములలో పోసిన వాతాభిష్యందము నశించును.

**సర్వాభిష్యందములకు అశ్చ్యోతనము :** త్రిఫలా కషాయంబును సుఖోష్ణంబుగ నేత్రముల పోసిన అభిష్యంద రోగమలు నశించును.

రక్తాపిత్తాభిష్యందములకు అశ్చ్యోతనము : చనుపాలను అశ్చ్యోతనంబు చేయుటచేత రక్త,పిత్త, జనిత వికారములు నశించును. మరియు పాలపై మీగడనుకాని, నేతినికాని నేత్రముల పోసిన వాత, రక్త పీడ హరించును.

**బిడాలకము :** నేత్రములను మూయునటుల చేసి కనురెప్ప వెంద్రుకలను వర్జించి నేత్రముల చుట్టు లేపనము చేయుట బిడాలకమనబడును.

**సర్వనేత్ర రోగములకు లేపనము :** అతిమధురము, కావిరాయి, సైంధవ లవణము, మ్రానుపసుపు, మయూరతుత్థము వీనిని సమభాగముగ నీటితో నూరి నేత్రములపైన లేపనము చేసిన నేత్రరోగములన్నియు నశించును.

మిరియములను, గుంటగలగర ఆకు రసముతో మర్ధనచేసి నేత్రములకు లేపముచేసిన శుక్లార్మ, అధిమాంసార్మ మొ॥ నేత్ర రోగములు నశించును.

ఇనుప పాత్రలో నిమ్మపండ్ల రసమువేసి అది గట్టిపడువరకు మర్దించి

నేత్రముల చుట్టు లేపనము చేసిన నేత్రరోగములు నశించును.

**తర్పణము :** రూక్షత్వము, శుష్కత, కలకబారిన నేత్రములందు, రెప్ప వెంట్రుకలు రాలినప్పుడు, శిరోత్పాతము, కృచ్ఛ్రోన్మీలనము, తిమిరము, అర్జునము, కంటియందు పువ్వులు, అభిష్యందము, అధిమంథము, శుష్కాక్షిపాకము, నేత్రశోఫము, వాత విపర్యయము అను నేత్రరోగములందు తర్పన చికిత్స చేయవలెను. తర్పణమనగా నేత్రములకు తృప్తిని కలుగజేయు చికిత్సా విధానము. తర్పణోపచారములను ఒక దినముకాని, 3 దినములు కాని, 5 దినములు కాని చేయవలెను.

**తర్పణ విధానము :** వాతము, ఎండ, దుమ్ము, ఇవిలేని ప్రదేశమున రోగిని వెల్లకిల పరుండబెట్టి మినుములును నానబెట్టి నూరి నేత్రములచుట్టు సమముగా దృఢముగ, కుదురువలె చేసి నేత్రములను మూసి ఉండునటుల చేసి ఆ కుదుటిలో నేత్రముల రెప్ప వెంట్రుకలు మునుగువరకు తేట నేతిని కాని, సుఖోష్ణమగు ఉదకమునుకాని, శతదౌత ఘృతమునుకాని, పాలను కానీ పోసి పిమ్మట నేత్రములను మెల్లగా తెరచునటుల చేయవలెను.

**పుటపాకము :** జింక మొదలగువాని మాంసమును రెండు బిల్వముల ప్రమాణముగ గ్రహించి అందు ఘృతాది స్నేహ ద్రవ్యములను కలిపి ముద్ద చేసి నూరి అందు శుష్క ద్రవ్యములను బిల్వ ప్రమాణముగాను, ద్రవ్య ద్రవ్యములనుకుడవ ప్రమాణముగాను కలిపి నూరి ముద్దచేసి దానిపై నేరేడు, మామిడి మొదలగువాని ఆకులనుచుట్టి దానిపై గుడ్డచుట్టి, మట్టిపూసి పుటపాక ప్రకారము అగ్నిలో పక్వము కావించి పిమ్మట అందలి మన్ను తీసివైచి ఆ పిండములోని రసమును పిండికొని నేత్ర తర్పణకు ఉపయోగించవలెను. పుటపాకమును కర్మభేదముచేత స్నేహన లేఖన మరియు రోపణ అను మూడు విధములుగా వర్ణిస్తూ సుశ్రుతుడు (సు.ఉ. 18) స్నేహన పుటకపాకమును 200 మాత్రాకాలములు, లేఖన పుటపాకము 100 మాత్రా కాలములు, రోపణ పుటపాకమును 300 మాత్రాకాలములు వరకు ధరించవలెనని పేర్కొనెను.

**అంజనము :** నేత్రరోగములు ఆమావస్థను విడచి పాకావస్థ చెందునపుడు అంజనము వేయవలెను. ఇట్టి అంజనమును హేమంత ఋతువు, శిశిర ఋతువులందు మధ్యాహ్నమునను, గ్రీష్మ, శరదృతువులందు పూర్వాహ్నము, అపరాహ్ణమునందు వసంత ఋతువునందు ఎల్ల సమయములందు ప్రయోగింపవలెను. వర్షాకాలమున, మబ్బుదినమునను, అత్యుష్ణ

కాలమున అంజనమును ప్రయోగించరాదు.

నోటి యందుంచి ఇటునటు కదుపుచు చర, ఔషధమును ధరించుటను కవల మందురని శారంగధరుడు పేర్కొనెను.

గండూషము, స్నేహికము, వమనము, శోధనమ, రోపణము అని నాల్గు విధములు విభజింపబడినవి.

వాత ప్రకోపమున స్నిగ్ధోష్ణ ద్రవ్యములచే చేయబడిన స్నేహిక గండూష మును పిత్త యోగములలో మధుర, శీతల పదార్థములచే నిర్మించబడిన గండూషమును, కఫరోగములలో కటు, ఆమ్ల, లవణ రసములు కల్గి ఉష్ణ వీర్య పదార్థములచే నిర్మించబడిన శోధన గండూషము, కషాయ తిక్త మధుర పదార్థములచే నిర్మించబడి కటు, ఉష్ణంబగు రోపణ గండూషము వ్రణము లందు ప్రయోగింపవలెను.

గండూషాదుల మాన ప్రమాణము : ద్రవ ద్రవ్యములచే తయారు చేయబడిన గండూషమునందు చూర్ణమును కోల ప్రమాణముగా వేయ వలెను.

గండూష ధారణ కాలము : కఫము నోటినుండి స్రవించు వరకు గాని, దోషమునశించు వరకుగాని, నేత్రములు, ముక్కు వీనినుండి స్రావము కల్గు వరకు గాని గండూషమును చేయవలెను.

వాత రోగములకు స్నైహ్నిక గండూషము : నువ్వులు, నల్ల కలువలు, నేయి, చక్కెర, పాలు వీనియందు తేనె కలపి గండూషము చేయించిన చెక్కిళ్ళు, ముఖము వీని యందు కల తాపము హరించును.

గ్రహకాదులకు మధుగండూషము : తేనెను గండూషము చేసిన నోటి వ్రణములు, తాపములు, దప్పి నశించును. మరియు ముఖమునకు స్వచ్ఛత ఉండును.

విషాదులకు గండూషము : నేతినిగాని, పాలను కాని గండూషము చేసిన విషదోషము, కాలాగ్ని దగ్ధవికారములు నశించును.

దంతచలనమునకు గండూషము : నువ్వుల నూనె యందు సైంధవ లవణం చేర్చి గండూషము చేసిన కదలుచున్న దంతములు గట్టిగా అగును.

ముఖశోషకు గండూషము : కాంజికము గండూషము చేసిన ముఖశోష, ముఖవైరస్యము నశించును.

కఫమునకు గండూషము : అల్లపురసమునందు సైంధవలవణము, త్రికటుకములు, ఆవాలు, వీని చూర్ణము కలిపి గండూషము చేసిన కఫ ప్రకోపము నశించును.

కఫము, రక్తపిత్తము వీనికి గండూషము : త్రిఫలా చూర్ణమును తేనెను కలిపి గండూషము చేసిన కఫము, రక్తపిత్తములు నశించును.

ముఖపాకమునకు గండూషము : ప్రాని పసుపు, తిప్పతీగె, త్రిఫల ములు ద్రాక్షపండు, జాజిచిగుళ్ళు, దురదగొండి వీనిని సమభాగములుగ కషాయం కాచి దానిలో 6వ భాగము తేనెవేసి గండూషము చేసిన త్రిదోషోద్భ వమగు ముఖపాకము నశించును.

కవళము : కల్కాదులను నోటిలో వేసికొని నమిలి ఉమియుట "కవళ" మనబడును.

కబలంబున కల్కమును కర్ష ప్రమాణముగా ప్రయోగింపవలెను. మాదీ ఫలములోని కేసరములు, సైంధవ లవణము, త్రికటుకములు, వీనిని కల్కముగాచేసి ముఖంబున ధరించిన కఫవాతములచే జనించిన అరోచకము హరించును.

ప్రతిసారణము (మంజనము) : ముఖము మరియు తాలు ప్రదేశము లందు చేతి వేలితోగాని శలాకును దూదిచుట్టి ఔషధములలో రుద్దుటను లేదా లేపము చేయుటను ప్రతిసారణము లేదా మంజనము అందురు. సుశ్రుతుడు కల్కము, రసక్రియ, మధువు, చూర్ణములను నాలుగు రకములు ప్రతిసారణ ఔషధములుగా పేర్కొనెను (సుచి. 40) శారంగధరుడు కల్కలము, అవలేహము మరియు చూర్ణములను ప్రతిసారణ భేదముగా పేర్కొనెను. (శా. స. 10)

గుణము : దంతరోగములను, చిగుళ్ళవాపు, నెత్తురు, చీము వచ్చుట వీనిని హరించును.

ప్రయోగము : ఈ చూర్ణములో 1 తులము సైంధవ లవణము 8 తులముల పంచదార కలిపి పండ్లను తోముచుండిన పండ్లు కదులుట, చీము కారుట, నొప్పులు, పోట్లు ఇవి శమించును.

# నస్యకల్పన (శా. సం.)

నస్యవిధి : నాసారంధ్రములందు ప్రయోగించు ఔషధము నస్యమన బడును. ఇదయే 'నావనం' అని నస్యకర్మ అని చెప్పబడినది.

రేచనం అని స్నేహనం అనియు నస్యము 2 విధములు.

కఫ ప్రకోపమున ప్రాతఃకాలము, పిత్త ప్రకోపమున మధ్యాహ్నము, వాత ప్రకోపమున సాయంకాలము నస్యకర్మ చేయవలెను.

ఎనిమిది సంవత్సరముల ప్రాయము మొదలు 80 సంవత్సరముల వరకు నస్య కర్మను చేయించవలెను.

నస్యకర్మ యందు తీక్ష్ణౌషధమును శాణ ప్రకారముగాను ఇంగువను యవ ప్రమాణముగాను, సైంధవలవణమును మాష ప్రమాణముగాను, పాలను ఎనిమిది శాణ ప్రమాణముగాను, ఉదకమును మూడు కర్షములు గాను, మధుర ద్రవ్యములను కర్ష ప్రమాణముగాను ప్రయోగించవలెను.

ప్రథమన నస్యము : అరంగుళము పొడవును, అగ్రభాగమున రెండు రంధ్రములును గల ఒక గొట్టమును చేసి యందు శుంఠి, పిప్పళ్ళు మొద లగు కటు ద్రవ్యములను చూర్ణము చేసి వేసి దానిని రోగియొక్క నాసికా రంధ్రములందుంచి నోటితో ఊదిన అది "ప్రథమన నస్యము" అనబడును.

మూర్ఛ, అపస్మారము, మొదలగు చేష్టానాశక రోగంబులందు మిగుల తీక్ష్ణంబగు ప్రథమన నస్యమును చేయవలెను.

సైంధవలవణము, వస, మిరియములు, పిప్పళ్లు,శొంఠి, తక్కోలములు, వెల్లుల్లి, గుగ్గిలము, కాయఫలము వీని చూర్ణమునుచేసి ఈ చూర్ణమును రోహిత సంజ్ఞిత మత్స్యము యొక్క పిత్తముతో భావనచేసి ఎండించి ఆ చూర్ణమును పూర్వము చెప్పబడిన గొట్టములో వేసి దానిని ముక్కునందుంచి ప్రథమన నస్యము చేయించిన అపస్మారాది రోగములు నశించును.

ఫలితమునకు నస్యము : తానికాయలు, వేప, గుమ్ముడు, కరక్కాయలు, విరిగి, కానుగ, వీనియందలి పప్పులను వేర్వేరుగ నూనెలోవైచి నస్యము చేయించిన తెల్లని వెంట్రుకలు నశించును.

వాత రక్తాదులకు కుంకుమ నస్యము : కుంకుమపువ్వుకు సమముగా పంచదార కలిపి ఆవుపాలతో నూరి నస్యము చేసిన వాత రక్తపీడ, కనుబొమలు, శంఖప్రదేశము కన్నులు శిరస్సు, చెవులు వీనియందలి పీడ, సూర్యావర్తము, అర్ధావభేదకము నశించును.

## ధూమపానము (శా.సం.)

ధూమపానము చేయుటచేత ఇంద్రియములకును, వాక్కునకును, మనస్సునకును ప్రసన్నత కలుగును. వెంట్రుకలు, దంతములు, గడ్డము ఇవి దృఢముగ ఉండును. ముఖము సువాసన కలిగి ఉండును.

ధూమపానము పన్నెండు సంవత్సరములు మొదలు ఎనుబది సంవత్సరముల వరకు సేవింపతగును. ధూమపానముచేత కాసము, శ్వాసము, పడిసెము, మన్యాస్తంభము, హనుస్తంభము, శిరఃపీడ వాతదోషము, శ్లేష్మ దోషము నశించును.

ధూమపానోపయుక్త కల్క ద్రవ్యములు : శమన, ధూమంబున ఏలాది గణ ద్రవ్య కల్కమును, బృంహణ దూమంబున స్నిగ్ధమగు సర్జరసము, రేచన ధూమమున తీక్ష్ణౌషధ కల్కమును, కాసఘ్న ధూమమన చిన్నములక, మిరియములు మొదలగువాని కల్కమును, వామన ధూమమున స్నాయువులు, చర్మము మొదలగు వాని కల్కమును వ్రణ ధూమమున వేప,వస, మొదలగు వాని కల్కమున ప్రయోగింపవలెను.

ధూమపానము శమనము, బృంహణము, రేచనము, కాసహరము, వమనము, వ్రణ ధూపనము అను భేదముచే 6 విధములు.

ధూమప్రయోగమున నాడీ విధానము : ధూమపానార్థంబగు నాడి గొట్టము 3 ఖండములు కల్గి 3 కణుపులు కల్గి చిటికెన వ్రేలంత లావు కలిగి బొబ్బరగింజ దూరునంత ఛిద్రము కల్గి ఉండవలెను.

## లేపాది కల్పనలు

ఆర్ద్రావస్థలో నుండు ద్రవ్యములను రాయిపై మెత్తగా నూరి ముద్దగ చేసిగాని, శుష్కావస్థలోగల ద్రవ్యచూర్ణమును నీటిలో కలిపి ముద్దగ నూరి పలుచగా శరీరముపై పూయుటకుపయోగించు ఔషధమును లేపనమందురు. (ద్ర.వి) ఆ లేపమునకు 'లిపి' 'లేప' అనునవి పర్యాయ నామములుగా పేర్కొన బడినవి.

సుశ్రుతుడు లేపములను 1 ప్రలేప 2 ప్రదేహ 3 అలేప అను మూడు భేదములలో వర్ణించెను. కాని ఆచార్య యాదవజీ ప్రలేపము మరియు ప్రదేహము అని రెండు భేదములనే వర్ణించెను. రక్తము మరియు పిత్తము వికారములందు శీతవీర్యము గల ద్రవ్యములలో శీతలముగా పలుచగా చేయబడు లేపమును ప్రలేపమందురు. కఫము మరియు వాతవికారములందు ఉష్ణ వీర్య ద్రవ్యములలో కల్కముచేసి వేడిచేసి దట్టముగా పూయ

బడు లేపమును ప్రదేహమందురు. ఆ లేపమనగా ఈ రెండింటికి మధ్యస్థ ముగా నుండును. లేపములు కర్మానుసారము దోషఘ్ను, విషఘ్ను మరియు వర్ణ్యమని మూడు విధములుగా వర్ణింపబడినవి. అందు ఒక అంగుళము ఎత్తువరకు చేయబడిన లేపము దోషఘ్నుమనియు, ముక్కాలు అంగుళము వరకు పేయు లేపము విషమఘ్నుమనియు, అర్ధాంగుళము ఎత్తువరకు లేపము వర్జ్యమని చెప్పబడినది. లేపమునందలి కల్కమునకు తైలాది స్నేహ ద్రవ్యములు కలుపవలసినచో దోషానుసారము నిర్ణయించవలెను. వాత రోగములందు కల్కమునకు 1/4 వంతును, పిత్తజవ్యాధి యందు 1/6 వంతును, కఫజవ్యాధులందు 1/8 వంతు స్నేహమును కలుపవలెను. చర కుడు విసర్ప చికిత్సలందు లేపన విధిని ఉదహరించును. ప్రదేహమును ప్రయోగించునపుడు ఇంతకు ముందు పట్టించిన లేపమును తీసి మాటి మాటికి కొత్త లేపమును ప్రయోగింపవలెను. ప్రలేపము యొక్క ప్రమాణము అంగుష్ఠములో మూడవవంతు మందముగా యుండవలెను. ప్రలేపము అతి స్నిగ్ధముగను, రూక్షముగాను వుండలువుండలుగా గాను, ద్రవమువలె యుండరాదు. నిలువయుంచిన తేపద్రవ్యమును వాడరాదు.

మలహర కల్పన : మలహము లేదా మరహం అను పదములు యునానీ వైద్యశాస్త్రమునందు పేర్కొనబడినవి. యోగరత్నాకరుడు. దీనికి సంస్కృతమున "మలహర" అను శబ్దమును ప్రయోగించెను. ఘృతము, తైలము, సిక్థ తైలము, మధూచ్ఛిష్ఠము, గంధ ఫిరోజా, వాలము, తుత్థము, స్ఫటికము మొదలగు ద్రవ్యములు ముఖ్యముగా మలహర కల్పనలందు ఉపయోగించబడును. ఆధునిక చికిత్సా శాస్త్రమున వాజలైను పేరాఫిన్, మొదలగు ద్రవ్యములు మలహరములను తయారు చేయుటకు ప్రధానముగా ఉపయోగించుచున్నారు.

## ఉపనాహ కల్పన

ఉపనాహకల్పనను విస్తృతముగా వర్ణించెను. ఉపనాహస్వేద ప్రకరణ మునందు (సు. చి. 32) వాతాహర ద్రవ్యముల మూలములను కాంజికములో నూరి లవణము, స్నేహములను కలిపి వేడిచేసి సుఖోష్ణముగా శరీరముపై లేపము చేసి ఉపనాహ స్వేదము చేయవలెను. ఇదేవిధముగా కాల్యాది ఏలాది సురాపనాది నస్యములకు అతసీ, సర్షప కల్కములను కృశర–పాయ సము, ఉత్కాములను సాల్వణములను పల్చటి వస్త్రమునందు మూటగట్టి స్వేదము నాచరించుని పేర్కొనెను.

## వస్తి కల్పన (పంచకర్మ)

పంచవిధ శోధన కర్మయందు వస్తికర్మ అత్యంత ప్రాధాన్యమైన చికిత్సా ప్రక్రియగా పరిగణించబడినది. మృగముల యొక్క మూత్రాశయము (వస్తి) చే నివ్వబడునది గావున వస్తియని చెప్పబడును.

లేడి, మేక, పంది, ఆవు, గేదెల యొక్క మూత్రాశయమును వస్తిగా ఉపయోగించవచ్చును. వస్తులు దొరకని యెడల కషాయములవలె ఎర్రగా నుండు, మృదువైన దృఢమైన చర్మము నుపయోగించవలెను. వస్తి నిరూహ, అనువాసన భేదములచే రెండు విధములుగా పేర్కొనబడినది. కేవలము స్నేహముచే నిచ్చునది అనువాసన మనియు, కషాయములు–పాలు–తైలము లతో నిచ్చునది నిరూహవస్తి యనియు అందురు. మాత్రావస్తి అనువాసన వస్తి యొక్క భేదముగా పేర్కొనబడినది. ఈ మాత్రా వస్తియొక్క ప్రమాణము రెండు పలములుగాని, ఒక పలముగానియై యున్నది. కర్మభేదముచేత ఆస్థాపన వస్తి "ఉల్క్లేశన–సంశోధన–సంశమన–లేఖన–బృంహణ–వాజీ కరణ పిచ్ఛబస్తి–మాధు తైలికము మొ॥లగు వస్తి కల్పనలుగా శాస్త్రమునందు పేర్కొనబడినవి. (ఆ.సూ.సు.28)

సామాన్యంగా వస్తి గుదమార్గం గుండా యివ్వబడును. కాని కొన్ని వ్యాధులకు ఉత్తరమార్గము (మూత్రమార్గము /యోని మార్గము) ద్వారా వస్తి కర్మ ఆచరించవలెను. ఆ విధమైన వస్తిని ఉత్తర వస్తి అందురు. కషాయ, స్నేహాదులతో వ్రణ ప్రాంతమున శోధన రోపణల కొరకు చేయు వస్తి వ్రణగత వస్తిగా పేర్కొన వచ్చును. వస్తికర్మను సవ్యముగా ప్రయోగించినచో శరీరవృద్ధి, కాంతి, బలము, ఆరోగ్యము, ఆయుర్వృద్ధి కలుగును.

వస్తి కల్పనయందు వస్తి ద్రవ్యముల మిశ్రణ ఒక పద్ధతిలో చేయవలసి యుండును. ప్రథమముగా తేనె మరియు సైంధవలవణ చూర్ణమును కలిపి నూరి తరువాత ఔషధసిద్ధ తైలఘృతములను కలిపి చిలికి అటుపిమ్మట కల్కమును, మిగిలిన ద్రవపదార్థములను (క్వాథము–గోమూత్రము–క్షీరము–కాంజికము–ఉష్ణజలము) కలిపి బాగుగా చిలికి సిద్ధము చేయవలెను.

వస్తికర్మ నుపయోగింపబడు వస్తి ద్రవ్యమును యథాతథముగా ప్రయోగించక కొంచెము వెచ్చబెట్టిన తరువాత ప్రయోగించవలెను. అందుకొరకు ఒక పెద్ద పాత్రలో నీటినిపోసి బాగుగా మరిగించి పొయ్యిపై నుండి దించి వస్తి ద్రవ్యమున్న పాత్రను 5–10 నిమిషములపాటు వేడినీరున్న పెద్ద పాత్రలో

పెట్టవలెను. సుఖోష్ణముగా అయిన తరువాత వస్తి యంత్రమునపోసి ప్రయోగించవలెను. లేక ఒక కుండలో నీటినిపోసి మరగించుచు ఆ నీటి ఆవిరి తగులునట్లుగా ఆ కుండ మూసిపైన వస్తి ద్రవ్యమున్న పాత్రనుంచి వెచ్చపెట్టవచ్చును. అంతేకాని వస్తి ద్రవ్యమున్న పాత్రను వేరుగా పొయ్యిపై నుంచి వేడిచేయరాదు. అటుల చేసినచో వస్తి ద్రవ్యము యొక్క గుణములలో మార్పు గలుగుటచే చికిత్స ఫలవంతము కానేరదు. శాస్త్రోక్త ప్రకారము వస్తిని ప్రయోగించిన తరువాత ఒక ముహూర్తకాలము (48 నిముషములు) లో గుదము నుండి తిరిగిరానిచో, మృత్యువు సంభవింపవచ్చునని అష్టాంగ హృదయకారుడు పేర్కొనెను. (అ.హృ.సూ. 19)

**అనువాసన వస్తి కర్మ :** అనువాసన వస్తికే స్నేహన వస్తి అని మరియొక పేరు కలదు.

**అనువాసిన వస్తి తైల కల్పన :** తిప్పతీగ, ఆముదపు వేరు, కానుగుపట్ట, గంటుభారంగి, అడ్డసరపు ఆకు, కామంచి, పిల్లిపీచర గడ్డలు, గోరింట, కాకిదొండ, వీనిని ప్రత్యేకముగా ఒక్కొక్క ఫలముగాను, యవలు, మినుము, అతసీ విత్తులు. రేగు విత్తులు, ఉలవలు, వీనిని ప్రత్యేకముగా రెండు పలములుగాను, గ్రహించి కొంచెము నలియగొట్టి అందు 4 ద్రోణముల నీరుపోసి నాల్గవపాలు మిగులునట్లు కషాయము కాచి వడగట్టి యందు ఒక ఆఢకము నువ్వుల నూనెపోసి జీవనీయ గణమందలి ద్రవ్యము లను ప్రత్యేకముగా ఒక్క పలము చొప్పున గ్రహించి కల్కము గావించి స్నేహ పాక విధానమున పక్వము కావించి గ్రహించి కల్కము గావించి స్నేహపాక విధానమున పక్వము కావించి గ్రహించవలెను. ఇది అనువాసన తైలమనబడును. ఇది ప్రబలమగు వాత రోగములను నశింపజేయును.

**వస్తికర్మ చేయువిధానము :** అనువాసన వస్తికర్మ కర్హుడగు వాని అభ్యంగము చేసి ఉష్ణోదకముచే స్వేద కర్మము కావించి, యథావిధిగా భోజనము చేయించి ఇటునటు సంచరింపచేసి, మలమూత్రోత్సర్జన మయిన పిదప వానిని ఎడమ పార్శ్వముగ పరుండబెట్టి ఎడమకాలును చాచునట్లును, కుడి కాలును ముడుచునట్లుచేసి గుదస్తానంబున స్నేహముచే స్నిగ్ధకర్మము చేసి వస్తి యంత్ర నేత్రమును గుదమందుంచి దానిని ఎడమచేతిలో పట్టుకొని కుడిచేతితో మధ్యమ భాగమును పీడించుచు స్నేహమును లోనికి పంపవలెను. అట్టి సమయమున రోగి జాగరూకుడై ఆవలింత, దగ్గు, తుమ్ములు, అపానవాతము వంటివి ఇవి రాకుండునటుల చేసికొనవలెను.

వస్తి కర్మమును 30 మాత్రల కాలములో ముగించి ఆ రోగిని 100 మాత్రల కాలము వరకు వెల్లకిల పరుండనీయవలెను. మోకాటి చిప్పను వేలితో ఒక మారుచుట్టి ఒక్క చిటికె వేయునట్టి కాలము మాత్ర అనబడును. వస్తి కర్మచేసిన పిమ్మట ఔషధ వీర్యము శరీరమంతా వ్యాపించుటకు వానిని వెల్లికిలా పరుండచేసి హస్తపాదాదులను చాచునట్లుచేసి పాదములందు, కటి ప్రదేశమందు, పిరుదులందు తట్టి శయ్యపై పరుండబెట్టవలెను.

సమ్యక్ వస్తికర్మ గుణములు : ఉపద్రవ రహితమై గుదమున ప్రవేశించిన స్నేహము అపాన వాతము, పురీషము వీనిలో బయటకు వచ్చిన యెడల వస్తి కర్మము చక్కగా చేయబడినదని తెలుసుకొనవచ్చును.

గుదమున ప్రవేశించిన స్నేహము జీర్ణమై వెడలి అగ్నిదీప్తి కలిగిన తోడనే లఘ్వాహారమును భుజించవలెను. మరియు అనువాసన వస్తి చేసిన వానిని మరునాడు కొంచెము వెచ్చగా ఉన్న నీటినిగాని, ధనియాలు, శొంఠి వీని కషాయంబును గాని ఈయవలెను. ఈ ప్రకారము 6,7,8 లేక 9 మారులు వస్తికర్మము చేసి పిమ్మట నిరూహవస్తిని చేయవలెను.

అనువాసన వస్తియందు ఉత్తమ బలం కలవానికి 6 పలముల స్నేహము, మధ్యమ బలం కలవానికి 3 పలముల స్నేహము, హీనబలం కలవానికి 1 1/2 పలముల స్నేహమును యివ్వవలెను. మాత్రా వస్తియందు ఒక పలప్రమాణముల స్నేహమును యివ్వవచ్చును.

గుదమున చేయబడిన అనువాసన వస్తినే స్నేహము బైటికి రాకుండిన అట్టి సమయమున నిరూహ వస్తి చేయవలెను. ఇట్లు పరస్పరము నిరూహ వస్తి, అనువాసన వస్తులను చేయించవలెను.

ఆస్థాపన వస్తి : దీనికే నిరూహవస్తి అనిపేరు. ప్రకోపము నొందిన వాతాది దోషములను, రసాది ధాతువులను స్వస్థానమునకు చేర్చుటచే దీనికి ఆస్థాన మని పేరు వచ్చినది. కషాయాదులచే ప్రయోగింపబడు వస్తి అస్థాపన వస్తి.

నిరూహవస్తిలో ప్రయోగించు కషాయము రెండు ప్రస్తములుండిన ఉత్తమ మాత్ర అనియు, ఒక్క ప్రస్థమైన ఎడల మధ్యమ మాత్ర అనియు, మూడు కుడువములైన హీన మాత్ర అని పేర్కొనబడినది. క్వాథ కల్పన ననుసరించి కషాయము తయారు చేయవలెను. వస్తికర్మ చేసిన పిమ్మట ఆ కషాయము బైటకు వచ్చునిమిత్తము రోగిని రెండు గడియల సేపు

కూర్చుండబెట్టవలెను. అంతట ఆ కషాయం బైటకు వచ్చును. ఒకవేళ ఆ కషాయ ద్రవ్యము రాని యెడల విరేచన కర్మ నాచరించవలెను. ఈ కషాయము బైటకు రానియెడల యవక్షారము; గోమూత్రము, ఆమ్లమము, సైంధవలవణము వీనిని కలిపి మరల నిరూహవస్తి చేత ఆ కషాయమును బయటకు వెడలింపవలెను.

నిరూహవస్తి కర్మ చేయబడిన వానికి మలము, పిత్తము, కఫము, వాతము ఇవి క్రమముగ గుద ద్వారము నుండి క్రిందికి వచ్చి శరీరము లఘువుగా ఉన్న యెడల నిరూహవస్తి చక్కగా చేయబడినదని తెలుసుకొనవలెను.

**నిరూహవస్తి** : దోషబలానుసారముగ నిరూహవస్తిని 2 మార్లు లేక 3 మార్లు చేయవచ్చును. నిరూహవస్తిని వాత ప్రకోపంబున స్నేహయుక్తముగ నొక్కసారియు పిత్త ప్రకోపమున పాలతోడ రెండు మారులును, కఫ ప్రకోపంబున కషాయ పదార్థములను, కటు పదార్థములను, రూక్ష పదార్ధములను కషాయం కాచి కషాయముతో మూడుసార్లు నిరూహవస్తిని చేయవచ్చును. త్రిదోషముల ప్రకోపమున పాలు, యూషము, మాంసరసము వీనితో క్రమముగా నిరూహ వస్తి చేసి పిమ్మట ఆనువాసన వస్తి చేయవలెను.

సుకుమారులు, వృద్ధులు, బాలురు వీరకి లఘువుగ వస్తి చేయవలెను. అట్టి వారలకు తీవ్రముగ చేసిన యెడల బలమును, ఆయుష్షును నశింప చేయును.

వస్తికర్మ, చేయబడినవాడు ఉష్ణోదకముచే స్నానము చేయవలెను. మరియు పగటి నిద్ర, అజీర్ణపదార్థ భోజనములను వర్జింపవలెను.

దోషముల యందు చేయదగిన వస్తి ప్రయోగము :

ప్రథమమున ఉత్క్లేశవస్తి, మధ్యయందు దోషహరవస్తిని అంత్యమున దోషశమన వస్తిని చేయవలెను.

**ఉత్క్లేశనవస్తి :** ఆముదపువిత్తులు, ఇప్పపట్ట, పిప్పళ్లు, సైందవ లవణము, వస, వెట్టిపుచ్చకాయలు వీనిని సమభాగములుగ నూరి కల్కము గావించి ఆ కల్కమును దోషములు ఉత్క్లేశము పొందుట కొరకు వస్తి యందు ప్రయోగించవలెను. అది ఉత్క్లేశవస్తి అనబడును.

**దోషహరవస్తి :** పిల్లిపీచర గడ్డలు, అతిమధురము, మారేడుపండు, వెలగ పండు వీనిని సమభాగములుగా గ్రహించి గంజితో నూరి అందు

గోమూత్రం కలిపి వాతాది దోషములు శమించు నిమిత్తము వస్తి కర్మయందు ఉపయోగింపవలెను. దీనిని శమనవస్తి అందురు.

**శోధనవస్తి :** తెగడ మొ॥గ రేచన ద్రవ్యములను కషాయం కాచి అందు ఆ శోధన ద్రవ్యములను కల్కముగా చేసి అందు స్నేహము, సైంధవ లవణం కలిపి బాగుగా కవ్వంతో చిలికి దానిని వస్తి యందుపయోగింప వలెను. ఇది దోషములను శోధించుటచేత శోధనవస్తి అనబడును.

**దోషశమనవస్తి :** ప్రేంఖణము, ఇప్పపట్ట, తుంగ గడ్డలు, రసాంజనము, వీనిని సమంగా పాలతో నూరి దోషములు శమించు నిమిత్తము వస్తి కర్మ యందుపయోగింపవలెను. దీనిని శమన వస్తి అందురు.

**శోధనవస్తి :** తెగడ మొ॥గ రేచన ద్రవ్యములను కషాయం కాచి అందు ఆ శోధన ద్రవ్యములను కల్కముగాచేసి అందు స్నేహము, సైంధవ లవణం కలిపి బాగుగా కవ్వంతో చిలికి దానిని వస్తి యందుపయోగింప వలెను. ఇది దోషములను శోధించుటచేత శోధన వస్తి అనబడును.

**దోషశమనవస్తి** : ప్రేంఖణము, ఇప్పపట్ట, తుంగ గడ్డలు, రసాంజనము, వీనిని సమంగా పాలతో నూరి దోషములు శమించుటకై వస్తి యందుపయోగింపవలెను.

**బృంహణ వస్తి :** నేల తాడిగడ్డ, పల్లేరు, దురగొండి విత్తులు మొ॥గు బృంహణ ద్రవ్యములను కషాయముకాచి అందు ఇప్పపువ్వు, ద్రాక్షపండు, దానిమ్మగింజలు మొ॥గు మధుర ద్రవ్యములను కల్కముగా వేసి ఘృతమును, మాంసరసమును చేర్చి వస్తికర్మ చేయవలెను. ఇది శరీరమునకు బలము నిచ్చుటచే బృంహణవస్తి అనబడును.

**పిచ్ఛిలవస్తి :** వేగుపట్ట, విరిగిపట్ట, బూరుగుపట్ట, దురదగొండివేరు, శొంఠి వీనిని సమభాగములుగా పాలతోనూరి అందు తేనె కలిపి దీనిని మేక, గొర్రె, జింక వీని రక్తంలో కలిపి దోషములు శమించు నిమిత్తము వస్తికర్మ చేయవలెను, ఇది పిచ్ఛిలవస్తి అనబడును. ఇందు చేర్చు ద్రవ్యము 12 పలము లుండవలెను.

**మూధుతైలక వస్తి :** ఆముదపు వేళ్ళ కషాయము 8 పలములు, తేనె 4 ఫలములు, తైలము 4 ఫలములు, సదాపాకు పలము, సైంధవలవణము అరపలము, వీనినన్నింటినీ కలిపి కవ్వంతో చిలకవలెను. దీనినే తైలవస్తి అందురు. సుశ్రుతుడు మాధుతైలిక వస్తిని యాపన, యుక్తరథ మరియు

స్నిగ్ధవస్తి అనునవి పర్యాయములుగా పేర్కొనెను. ఈ వస్తికర్మ చేసిన యడల మేదోరోగము, గుల్మరోగము, క్రిమిరోగము, ప్లీహోదరము, మందోష్ణము, ఉదావర్తములు నశించును. శరీరమునకు బలము, కాంతి, శుక్రవృద్ధిని, అగ్నిదీప్తిని కల్గించును.

**యాపనవస్తి :** తేనె, నెయ్యి, పాలు, నూనె అనునవి ఒక్కొక్కటి ప్రవృతము (8 తులములు) చొప్పునను, సోపు, సైంధవలవణము ఒక పలము చొప్పునను చూర్ణించివైచి బాగుగ కలిపి వస్తి చేయబడుదానిని యావనవస్తి అని పేరు. ఇది చాలా శ్రేష్ఠమైనది. (బా.ప్ర.)

**దీపనవస్తి :** తేనె, నెయ్యి, పాలు, తైలము వీనిని ప్రత్యేకముగా ఒక్కొక్క పలము గ్రహించి అందు చేదు పుచ్చకాయ, సైంధవలవణం వీనిని ప్రత్యేక ముగా ఒక్కొక్క అక్ష ప్రమాణం కలిపి అగ్నిదీప్తి నిమిత్తము వస్తికర్మ చేయ వలెను. ఇది దీపనవస్తి అనబడును.

**యుక్తరథవస్తి :** మహాపంచమూల కషాయమున నూనె, పప్పలీ చూర్ణము,తేనె, సైంధవలవణము, ఇప్ప వీనిని చేర్చి వస్తికర్మ చేయవలెను. ఇది సమస్త రోగములను హరించును.

**సిద్ధవస్తి :** బృహత్ పంచమూల కషాయంలో నూనెను, పిప్పలీ చూర్ణ మును తేనెను, సైంధవలవణ చూర్ణమును, ఇప్పపట్టలోని నారను, లేక అతి మధుర చూర్ణమును, కలిపి వస్తి ప్రయోగం చేయవలెను. ఇది సమస్త రోగములందు ప్రయోగించవచ్చును.

**ఉత్తరవస్తి :** నిరూహవస్తి తరువాత చేయబడుటచే మరియు ఉత్తర మార్గము నందు అనగా యోని లేదా మూత్ర మార్గము ద్వారా వస్తికర్మ చేయబడుటచే ఉత్తర వస్తి అని పేర్కొనబడినది.

**ఉత్తరవస్తి ప్రయోగనిధి :** నిరూహ వస్తిచే శుద్ధుడైన రోగికి స్నాన, భోజనంబులచే తృప్తికావించి మోకాళ్ళ ఎత్తుగల పీఠము మీద కూర్చుండబెట్టి ఉత్తరవస్తి యందు స్నేహమును పిచికారివలె గ్రహించి ఆ వస్తి నేత్రమునకు నూనె బాగుగా రాసి మేఢ్రమునకు నేయిపూసి ఆ మేఢ్ర రంధ్రమున 6అం. ల వరకును నేత్రమును పోనిచ్చి వస్తి పీడనము చేసి ఆ గొట్టమును మెల్ల మెల్లగ పెలికి తీయవలెను. పిమ్మట ఆ స్నేహము బైటకి వచ్చిన తోడనే అనువాదన వస్తి క్రమమును ఆచరించవలెను.

**స్త్రీలు మున్నగువారలకు వస్తి స్నేహ ప్రమాణం :** స్త్రీలకు యోని

మార్గమున ఉత్తరవస్తి చేయవలసి ఉండెనేని ఆ వస్తియందు స్నేహమును 2 పలములుగను, మూత్ర మార్గమున చేయవలసి ఉండెనేని పలముగను చేయవలెను. బాలురకు చేయునెడల 2 కర్షములు చేయవలెను. మరియు ఉత్తరవస్తి చేయునప్పుడు స్త్రీని వెల్లకిల పరుండబెట్ట మోకాళ్ళును పైకి ఎత్తు నట్లు చేసి స్నేహము బైటకు రాకుండునట్లు చేయవలయును. శోదన ద్రవ్య ములచే వస్తి విధానము మూత్రకృచ్ఛ్రాది రోగములందు వస్తికర్మము చేయ  నెడల శోదన ద్రవ్యములచే చేయవలెను. లేక ఆముదపు విత్తులు మొదలగు శోధన ద్రవ్యములను నూరి వస్త్రమునకుగాని, దారమునకుగాని లేపము చేసివర్తిగా చేసి ఆముదములో తడిపి ఆవర్తిని యోనియందు ప్రవేశింప చేయవలెను. అట్టి వస్తికర్మముచే నాలికధోభాగమున దాహము కలిగెనేని అత్తి, మర్రి మొదలగు క్షీరవృక్షముల పట్టల కషాయముతోగాని, పాలతో గాని మరల వస్తి చేయంగును. అట్లు చేసిన యెడల ఆ దాహము నశించి పురుషులకు గల శుక్రగత రోగములు, స్త్రీలకు గల ఆర్తవ రోగములు నశించును. ప్రమేహ రోగికి ఉత్తర వస్తి ప్రయోగించ కూడదు. అట్లు చేసిన యెడల ఆ రోగి మృతినొందును.

**పిచ్ఛావస్తి :** అనువాసన వస్తిని సంసర్జన క్రమమును చేయించినను పిత్తాతిసారము నివర్తించినిచో పిచ్ఛావస్తి చేయించవలెను.

**విధానము :** పచ్చివిగా ఉండు బూరుగకాడలను గ్రహించి పచ్చిదర్భలచే చుట్టి పువ్వులపైన నల్లమట్టిని పూసి ఏరుపిడకలతో పుటంచేసి నల్లమన్ను ఆరినతోడనేతీసి అందలి బూరుగుపువ్వుల కాడలను రోటియందు నూరి ఆ ముద్దను ఒక పలప్రమాణము గ్రహించి కాచబడిన ఒక ప్రస్థము పాలలో బాగుగా కలిపి వడపోసి అందునెయ్యి, యష్టిమధు కల్కం వీనిని తగురీతిగ కలిపి దీనిచే చమురులో పూయబడిన శరీరం కలవానికి వస్తిని చేయించ వలెను. మలం బయల్వెడలిన పిదప స్నానం చేయించి పాలలోగాని, జాంగల మాంసరసంతోగాని భుజింపచేయవలెను. ఈ పిచ్ఛావస్తి పిత్తాతిసారము, జ్వరము, నంజు, గుల్మము, ఆమాతిసారము, గ్రహణీదోషములను హరింప చేయును. మరియు విరేచనాతి యోగం వలనను, ఆస్థాపన వస్త్యతి యోగం వలన జనించిన వ్యాధులను హరించును.

వస్తికర్మకు అర్హులు, అనర్హులు, పూర్వకర్మ పశ్చాత్ కర్మలు, వస్తి వ్యావత్తులు మొదలగు విషయములు భైషజ్యకల్పన విషయమునకు అప్రస్తుతము గావున ఈ అధ్యాయమున చర్చించలేదు.

## రస ధాత్వాది విజ్ఞానము

**పారదము :** దేహమును స్థిరముగా, జరామరణ రహితముగా తయారు చేయుటకు పారదము, పారద అష్టాదశ సంస్కారములు ఆవిష్కరించబడి నవి. భారతీయ రసశాస్త్రములో పారదము ఒక ప్రధాన ద్రవ్యము. ఇదియే రసమను పేరుతో కూడా తెలియబడుచున్నది. హింగుళము పారదము యొక్క ముఖ్య ఖనిజము.

సామాన్య శోధన 1. ఖల్వమునందు 500 గ్రా. పాదరసమును 500 గ్రా. సున్నముతో కలిపి ఏడురోజులు మర్దన చేయవలెను. తరువాత సున్నము నుంచి పాదరసమును వస్త్రగాలితం చేసి దానికి గృహధూమము 500గ్రా. హరిద్రాచూర్ణము 500 గ్రా. ఇటుకపొడి 500 గ్రా కలపి మూడురోజులు మర్దన చేసి తర్వాత ఉష్ణకాంజికముతో క్షాళన చేయవలెను. పిదప వస్త్రమును నాలుగు మడతలుగా వేసి దానియందు పాదరసము ఉ ంచి పిండినచో సప్తకంచుకీ దోషములు తొలగిపోయి నిర్మలమైన పాదరసము లభించును.

2. పాదరసము 500 గ్రా. లశునము 500 గ్రా. లవణము 250 గ్రా. కలిపి ఖల్వమునందు ఏడురోజులు మర్దించి కాంజికముతో ప్రక్షాళనము చేసిన పారదము శుద్ధిపొందును. కేవలము లశునముచే మర్దించిననూ పారదము శుద్ధమగును. పాదరసము నందలి మల దోషములను ఆరగ్వధ మూలము, సప్తకంచుక దోషములను కుమారీ స్వరసము ఆంకోల మూలము విషదోషమును, చిత్రమూలము వహ్ని దోషమును పోగొట్టును.

**పారద సంస్కారములు :** పారద సంస్కారములు 18 రకములు రస శాస్త్రగ్రంథములందు వర్ణింపబడినవి. స్వేదనము, మర్దనము, మూర్ఛన ఉత్థాపనము, పాతనము, రోధనము, నియమామనము, దీపనము, అభ్రక భక్షణము, గర్భద్రుతి, జారణము, బాహ్యాద్రుతి, గంధక జారణము, రాగము, సారణము, క్రామణము, వేదనము, శరీర యోగము (లేక) శరీర వేధము అనునవి పాదరసమునకు అత్యంత దోష విశుద్ధి కొరకును, రసాయనాద్యు త్కృష్ణ గుణాపాదమునకును చేయదగిన పదునెనిమిది సంస్కారములు.

**పారద అష్ట సంస్కారములు :** స్వేదన, మర్దన, మూర్ఛన, ఉత్థాపన, పాతన సంస్కారములు శోధన ప్రధానములుగా ఉండును. రోదన, నియా మన, దీపన సంస్కారముల వలన పారదమునకు గుణాంతరాధానము

లేక వీర్యోత్కర్షత కలుగును.

పారద గుణకర్మలు : పారదము ద్రవ రూపములో ఉండెడి ధాతువు. పాదరసము షడ్రసములు, స్నిగ్ధగుణము కల్గి ఉండును. త్రిదోషహరముగా పనిచేయును. రసాయన, బల్య, వృష్య, యోగవాహీ కర్మలు కలిగి ఉండును. సర్వవ్యాధులందును ఉపయుక్తముగా ఉండును. విశేషముగా కుష్ట హరముగా పనిచేయును. గ్రహణీ, అతిసారము, అగ్నిమాంద్యము, క్షయము మొదలగు వ్యాధులను భస్మము చేయబడిన పారదము నశింపచేయును.

**మహారసములు**

అభ్రకము, వైక్రాన్తము, మాక్షికము, విమలము, శిలాజితు, సస్యకము, చపలము, రసకము అను 8 రసములను మహారసములు అందురు.

**అభ్రకము :** పీనాక,నాగ, మండూక మరియు వజ్రమను భేదముచే నాలుగు విధములుగా యుండును. అందు సర్వరోగములను హరించు వజ్రాభ్రకము చాలా శ్రేష్ఠమైనదిగా పరిగణింపబడినది.

శోధనము : అభ్రకము కొలిమియందు కాల్చి కాంజికము, గోమూత్రము ఆవుపాలు, త్రిఫలాకషాయము అనువానియందు దేనినైననూ ఏడుసార్లు చల్లార్చిన శుద్ధమగును.

మారణము : ధాన్యాభ్రకమును కాసమర్ధ స్వరసములో మర్ధించి పది గజపుటములు వేసినచో నిస్సందేహముగా భస్మమగును.

అభ్రకభస్మ అమృతీకరణ : 16 పలములు త్రిఫలాకషాయము, 8 పలముల గోమూత్రము, 10 పలముల అభ్రక భస్మము కలిపి లోహ పాత్రలో పోసి, ద్రవము ఇగురువరకూ కాచవలెను. దీనిని "అమృతీకరణ" మందురు.

మాత్ర : 124-250 మి.గ్రా.

ఉపయోగము : దీపన, బల్య, మేధ్య, ఆయుష్య, వృష్య, వాత, పిత్త హరకర్మలు గలిగియుండును. పాండు, క్షయ, గ్రహణీ, శూల, కుష్ఠము, ప్రమేహము, జ్వరము, శ్వాస, కాస, అగ్నిమాంద్యము, ఉదరరోగము లందుప యుక్తముగా నుండును.

**వైక్రాంతము :** వైక్రాన్తము ఎనిమిది అంచులు, ఎనిమిది పలకలు, ఆరు కోణములు గలిగి యుండును. ఇది వజ్రముతో సమాన గుణములు గలిగియుండును.

శోధనము : ఉలవల కషాయములో డోలా యంత్రములోస్వేదనము చేసిన వైక్రాన్తము శుద్ధి అగును.

మారణము : వైక్రాన్తమునకు సమముగా గంధకము కలిపి నిమ్మకాయ రసముతో మర్దించి 8 గజపుటములు వేసిన భస్మమగును.

మాత్ర : 4-10 మి.గ్రా.

ఉపయోగము : జ్వరము, కుష్టము, క్షయ, పాండురోగము, అర్శస్సు, కాస, శ్వాస వ్యాధులందు హితకరము.

**మాక్షికము :** స్వర్ణమాక్షికము మరియు తారమాక్షికమను భేదములచే రెండువిధములుగా యుండును.

శోధనము : వేడిచేసి త్రిఫలా కషాయమునందు ఉంచినచో రెండు విధములైన మాక్షికములు శుద్ధి పొందును.

మారణము : శుద్ధిచేసిన మాక్షికము సగభాగము గంధకము, కలిపి మాదీఫలరసముతో నూరి అయిదు వరాహపుటములు వేసినచో భస్మంమగును.

మాత్ర : 60-120 మి.గ్రా.

ఉపయోగము : ఉత్తమ రసాయనము కర్మగలిగి యుండును. క్షయ, పాండు, శోథ, కామలా, ప్రమేహము, శ్విత్రకుష్టము లందుపయుక్తముగా యుండును.

**విమలము :** విమలము స్వర్ణ, రౌప్య, కాంస్య అను భేదములచే 3 విధములుగా యుండును.

శోధనము : వాసా స్వరసము (వేదా) కషాయమునందు స్వేదము చేసినచో విమలము మలరహితమై శుద్ధిచెందును.

మారణము : విమలము వేడినీటితో కడిగి చూర్ణము చేసి త్రిఫలా కషాయము నందు 3సార్లు భావనజేసి తరువాత లోహపళ్ళెము నందుంచి అగ్నిపై ఉంచి గోఘృతంలో దానియందు మంటలు వచ్చునంత వరకూ భర్జనచేసి ఆపివేయవలెను. విమలచూర్ణమునందు సమముగా గంధకము కలిపి నిమ్మకాయ రసముతోనూరి 10 గజపుటములు వేసిన భస్మమగును.

మాత్ర : 60-120 మి.గ్రా.

ఉపయోగములు : వాత, పిత్తహర, వృష్య, రసాయన కర్మలు గలిగి

యుండును. పాండు, ప్రమేహము, అరుచి, కామలా, అర్శస్సు శూల వ్యాధులందు హితకరముగా నుండును.

శిలాజిత్తు : చరకుడు స్వర్ణ, రజత, తామ్ర, లోహములను 4 రకముల శిలాజితులను పేర్కొనెను. రసరత్న సముచ్చయకారుడు గోమూత్ర శిలాజితు, కర్పూర శిలాజితు అను 2 రకములను వర్ణించెను.

శోధనము : ఒక పాత్రలో త్రిఫలా కషాయముపోసి శిలాజితును వేసి ఎండలో ఆ పాత్ర నుంచవలెను. అందలి కషాయ మిగిలిపోయినప్పుడు తిరిగి కొంచెముగా త్రిఫలా కషాయము పోయుచూ పై తొరకను గ్రహించ వలెను. ఇదేవిధముగా ఆవుపాలు, గోమూత్రముతో పలుమార్లు భావన చేయవలెను.

కర్పూర శిలాజిత్తు ఏలక్కాయల కషాయమందు ముక్కలుగా చేసి కడిగినచో శుద్ధి అగును.

మారణము : శుద్ధిచేసిన శిలాజితును సమభాగములుగా గంధకము, తాళకం చేర్చి మాదీఫల రసముతో నూరి 8 పిడకలతో పుటము వేసిన భస్మ మగును. కర్పూర శిలాజితును కలబంద రసముతోనూరి లఘుపుటము వేసిన భస్మమగును.

ఉపయోగములు : జ్వరము,పాండు, శోఫ, మేహము, అగ్నిమాం ద్యము, మేథోరోగము, క్షయ, శూల, గుల్మము, ప్లీహ,జఠర హృదయ శూలలను హరించును. పక్వవిధములైన చర్మవ్యాధులు, క్రిమి రోగములను పోగొట్టును. ఉత్తమ రసాయన కర్మను గలిగియుండును. కర్పూర శిలాజితు మూత్రకృచ్ఛ్రము, అశ్మరి, కామెర్లు,పాండు రోగములను పోగొట్టును.

**సస్యకము :** సహజముగా ప్రకృతిలో లభించుదానిని సస్యకమనియు, కృత్రిమముగా తయారుచేయబడు వానిని తుత్థము (మైలతుత్థము) అని అందురు. కాని ప్రస్తుత కాలమున కృత్రిమముగా తయారు చేయబడిన దానినే వాడుచున్నారు.

శోధనము : రక్త చందనము (లేదా) మంజిష్టా కషాయమునందు భావన చేసిన ఎడల శుద్ధి యగును.

మారణము : శుద్ధ తుత్థ చూర్ణమునకు గంధకము, వెలిగారముచేర్చి లకుచ ఫలరసమునందు మర్దించి మూకుడుయందు ఉంచి కుక్కుట పుటము వేసిన భస్మ మగును.

ఉపయోగములు : హృద్రోగము, శూల, ఆమ్లపిత్తము, అర్శస్సు; మల బంధము, కుష్ఠము, శ్విత్ర కుష్ఠములందు ఉపయుక్తము, విషఘ్ను, రసాయన, వమన, రేచన కర్మలు కలిగి వుండును.

మాత్ర : 15-30 మి.గ్రా.

**చపలం :** గౌర (పసుపు) శ్వేత, అరుణ, కృష్ణ అను భేదముచే 4 విధములుగా యుండును.

శోధనము : చపల చూర్ణము జంబీరస్వరము, వంధ్యా కర్కోటకీ, ఆర్ద్రక స్వరసములందు భావన చేసిన శుద్ధి అగును.

సత్వపాతనం : చూర్ణించి ఉపవిషములను, విషములను చేర్చి ధాన్యామ్ల ముతో నూరి ముద్దచేసి మూష యందు వుంచి ఊదిన సత్వము వెడలును.

గుణము : త్రిదోష హరము తిక్తరస ఉష్ణవీర్య, మధురవిపాక, లేఖన, వృష్యకరము.

మాత్ర : 120 మి.గ్రా.

**రసకము :** దర్దుర, కారవేల్లకమను భేదములచే రెండు విధములుగా యుండును.

శోధనము : 1 నరమూత్రము ఒక మాసము నానబెట్టినను ప్రతి దినము మూత్రము మార్చవలెను.

2 తీవ్రమయిన అగ్నియందు వేడిచేసి 7 పర్యాయములు తక్రము నందు భావనచేసినను శుద్ధి అగును.

మారణము : శుద్ధ కర్పూర చూర్ణమునకు సమభాగము శుద్ధ హరితాల చూర్ణము కలిపి నీటిలో నూరి చక్రికలు చేసి ఎండించి 3 పుటములు వేసి నచో భస్మమగును.

మాత్ర : 60-240 మి.గ్రా.

ఉపయోగములు : అన్నిరకముల ప్రమేహములు, నేత్రవ్యాధులు, క్షయము, జ్వరములను హరించును. రసకముతో తయారుకాబడిన లఘు మాలినీ వసంతము, స్వర్ణమాలినీ వసంతమను ఔషధములు చాలా కాల ముగా వచ్చు జ్వరములందు అత్యంత అద్భుతముగా పనిచేయును.

**ఉపరసములు**

గంధకము, గైరికము; కాసీసము, కాంక్షి, తాలకము, మనఃశిలా,

అంజ నము; కంకుష్ఠము అని 8 విధములైన ద్రవ్యములను ఉపరసములని అందురు.

**గంధకము :** గంధకము ఎరుపు, పసుపు, తెలుపు, వర్ణములలో నాలుగు రకములుగా నుండును.

**శోధనము :** గంధక చూర్ణము ఒక లోహపాత్ర యందు కరిగించి భృంగ రాజ స్వరసమునందు భావనచేసి, స్వాంగశీతలమైన పిదప ఉష్ణ జలముతో కడిగి మరల ఒక పాత్రయందు వేడిచేసి భృంగరాజ స్వరసమందు వేయవలెను. ఇట్లు 7 పర్యాయములు చేసిన శుద్ధి అగును.

మారణము : శరావమున అర్జున క్షీరము నందు గంధకమును వుంచి పుటము వేయవలెను. పిదప దానిని నేల ఉసిరిక రసముతో మూడు జాములు మర్దించి శరావములోనుంచి చీలవేసి కపోత పుటము వేసిన గంధకము భస్మమగును.

మాత్ర : 120 మి.గ్రా 240 మి.గ్రా.

ఉపయోగములు : మధురస కటువిపాక; ఉష్ణవీర్యము గలిగియుం డును. శ్రేష్టరసాయన కర్మగలిగియుండును.

కండూ (దురద) కుష్ఠము, పామా (గజ్జి) దద్రు (తామర) విచర్చికా (ఎగ్జిమ) వ్యాధులను పోగొట్టును.

త్రిఫలా చూర్ణము గుంటగలర రసములో కలిపి సేవించినచో కంటి చూపును వృద్ధి చేయును.

**<u>గైరికము</u> :** గైరికము (జేగురు రాయి) పాషాణగైరికము, స్వర్ణ గైరికము లను రెండురకములుగా యుండును.

శోధనము : ఆవుపాలతో భావనచేసి శుద్ధి అగును. కొంచెము గోఘృత ములో వేయించిన శుద్ధి చెందును.

మాత్ర : 240 మి.గ్రా - 480 మి.గ్రా.

ఉపయోగములు : హిక్కా, ఆమ్లపిత్తము, కామలా, శీతపిత్తము, జీర్ణ జ్వరము, విసర్పమునందు ఉపయుక్తము; దీనితో తయారు చేయబడు లఘు సూత శేఖరరసము ఈ వ్యాధులందు బాగా పనిచేయును.

**కాసీసము శోధనము :** చూర్ణమును ఒక మారు భృంగరాజ స్వరసములో భావన చేసినను లేదా డోలా యంత్రమున మూడు ఘడియలు స్వేదనము చేసినను శుద్ధినొందును.

మారణము : శుద్ధ కాసీస చూర్ణము, కాంజికములో ఏడుసార్లు భావన చేసి చక్రికలు చేసి లఘుపుటము వేసినచో రక్తవర్ణ భస్మమగును.

మాత్ర : 60 మి.గ్రా. 240 మి.గ్రా.

ఉపయోగము : పాండు : ప్లీహ వృద్ధి, జలోదర; శోథ; మూత్ర కృచ్ఛ్రము మూత్రఘాతము; యకృద్వృద్ధి; రజోరోదము;ప్లీహోదర మందు ఉపయుక్తము కామలా వ్యాధిలో అత్యంత ఉపయుక్తముగా యుండును.

**కాంక్షి :** (పటిక) ఫటకీ మరియు పుల్లికా అను భేదముచే రెండు విధములుగా యుండును.

శోధనము : పటికను మూడు దినములు కాంజికమునందు ఉంచినచో శుద్ధి అగును.

మారణము : పది తులముల స్పటికము మూడు గంటలు గొర్రె మూత్రమున మర్దనచేసి చక్రికలు చేసి ఎండించి పెద్ద పెద్ద శరావములందు గజపుటము చేసినచో శ్వేత వర్ణము గల భస్మమగును.

మాత్ర : 120 మి.గ్రా. 480 మి.గ్రా.

ఉపయోగములు : విషమజ్వరము: రక్తపిత్తము; వ్రణము; శూల; నేత్ర రోగము; అస్యపాకము, శ్విత్రము (బొల్లి) నందుపయుక్తము.

**హరతాళము :** పత్రతాలకము, పిండతాలకమని రెండు విధములుగా యుండును.

శోధనము : హరతాల చూర్ణము మూటయందు ఉంచి డోలాయంత్రమున ఒక ప్రహర కాలము కూష్మాండ స్వరసంలో స్వేదన చేసినను, త్రిఫలా కషాయము లేదా సున్నపునీటియందు రెండు ప్రహతములు పాకము చేసినను శుద్ధినొందును.

మారణము : ఐదు తులముల హరతాలమందు 10 రెట్లు అర్క క్షీరము గ్రహించి ఖల్వమునందు బాగుగా మర్దించి తరువాత దానిని చక్రికలుగా చేసి, ఎండించి భస్మయంత్రమునందుంచి నాలుగు ప్రహరములు అగ్నిపై పక్వముచేసిన భస్మమగును.

మాత్ర : 30 మి.గ్రా 60 మి.గ్రా.

ఉపయోగములు : అన్ని విధములైన చర్మవ్యాధులు, కాస, శ్వాసలందు హితకరముగా నుండును. దీనితో చేసిన రసమాణిక్యరసము చర్మవ్యాధులందు బాగా పనిచేయును.

**మనఃశిలా :** శ్యామాంగీ, కణవీరకా, ఖండమని మూడు విధములుగా యుండును.

శోధనము : అగస్త్యపత్ర స్వరసమున లేదా ఆర్ద్రక స్వరసమున ఏడు భావనలు చేసినచో మనఃశిలా శుద్ధి చెందును.

మారణ : శాస్త్రకారులు మనఃశిలా మారణ పేర్కొనలేదు.

మాత్ర : 40–70 మి.గ్రా.

ఉపయోగములు : రసాయన, వాతహరకర్మలు గలిగియుండును. అగ్నిమాంద్యము, కండూ, కాస, క్షయవ్యాధులందు హితముగా యుండును.

**అంజనము :** అంజనమునందు సౌవీర, రసాంజన, స్రోతోంజన పుష్పాంజన, నీలాంజనమను అయిదు భేదములు గలవు.

శోధనము : భృంగరాజపత్ర స్వరసమునందు భావన చేసినచో 5 విధములైన అంజనములు శుద్ధి అగును.

సత్వపాతన : శుద్ధి చేసిన అంజనమునకు అష్టమాంశ మాత్రలో మండూరము; గుడము; గుగ్గులు; ఘృతములను చేర్చి మర్దనచేసి మూస యందు ఉంచి తీవ్ర అగ్నిచే ఊదుట ద్వారా సత్వము వెడలును.

ఉపయోగములు : సౌవీరాంజనము రక్తపిత్త హరము, హిక్కా హరము, రసాంజనము వాత, పిత్తహరము, వర్ణ్యము వ్రణములందు హితము శ్వాస హరము స్రోతోంజక్కాము–హిక్కా; శ్వాసహరము, పుష్పాంజనము నేత్ర రోగాలు జ్వరము, హిక్కులందు హితకరము నీలాంజనము నేత్రరోగ హరము, త్రిదోషశామకము.

**కంకుష్ఠము శోధనము :** శొంఠి క్వాథమున మూడుసార్లు భావన చేసిన కంకుష్ఠము శుద్ధినొందును.

మాత్ర : 40 మి.గ్రా.

ఉపయోగము : తీవ్ర విరేచనకారి, వ్రణము, ఉదావర్తము, శూల, గుల్మము, ప్లీహము, అర్శస్సులందుపయుక్తము.

**సాధారణ రసవర్గము**

1 కంపిల్లము, 2 గౌరీపాషాణము, 3 నవసాగరము 4 అగ్నిజారము 5 గిరిసిందూరము 6 హింగులము 7 మృద్దారశృంగము అను వానిని సాధారణ రసములని అందురు.

**కంపిల్లము :** మాలోటస్ ఫిలిపెన్సిస్ అను వృక్షము యొక్క కాయపైన రజమును కంపిల్ల మందురు.

శోధన : చూర్ణముచేసి వస్త్రమునందు మూటగట్టి డోలా యంత్రమున కరక్కాయల రసముతో, లేక కాంజికముతోగాని పక్వము చేసిన శుద్ధి అగును.

ఉపయోగములు : ఉదరము, గుల్మము, శూల, క్రిమి అనాహములందు ఉపయుక్తము.

**గౌరీపాషాణము** : తెలుపు, పసుపు, పసుపు కలిపిన తెలుపు వర్ణము గల 3 రకముల గౌరీపాషాణము గలవు.

శోధనము : ఉత్తమమైన పాషాణము తీసుకొని దానిని కారవల్లీ ఫలము నందుంచి, డోలా యంత్రమునందు ఒక ప్రహరము (3 గంటలు) స్వేదనము చేసిన శుద్ధి అగును.

మారణ : లజ్జాలు స్వరసమందు మర్దించి ఏడుసార్లు పుటము వేసిన భస్మ మగును.

మాత్రా : 1/120 రత్తీ 1/30 రత్తీ. (1-4 మి.గ్రా.)

ఉపయోగములు : కుష్ఠము; ఆమవాతము, వాతరక్తము; శ్లీపదము; విష జ్వరములందుపయుక్తము, పక్షవాతములందు బాగా పనిచేయును.

**నవాసారము :** తెల్లని వర్ణము గలిగి యిటికిరాళ్ళను గాల్చినపుడు వాటి వాటివల్ల ఉత్పన్నమగును.

శోధన : ఒక భాగము నవసారమును, మూడు భాగముల జలమందు కరిగించి వడగట్టి ఆ జలమును కోష్ఠియందుంచి జలమును ఇగురనివ్వగా మిగులు తెల్లని నవసారమును స్వచ్ఛమైన దానినిగా గ్రహించవలెను.

మాత్ర : 240-600 మి.గ్రా.

ఉపయోగములు : అగ్నిమాంద్యము, గుల్మము, ఉదరము, శోధలందుప యుక్తము. దీనిలో తయారయిన స్వర్ణవంగము ప్రమేహము, పూయమేహము లందు బాగా పనిచేయును.

**కపర్ధము :** గువ్వలు తెలుపు, ఎరుపు, పసుపు, అను వర్ణ భేదములే 3 విధములుగా యుండును.

శోధనము : వరాటములను కాంజికమునందు ఒక యామము స్వేదనము చేసిన శుద్ధి నొందును.

మారణ : శుద్ధమైన గవ్వముక్కలను నిమ్మపండ్ల రసముతో నూరి చక్రికలు చేసి ఎండించి గజపుటము వేయవలెను. గజపుటమును భస్మమై అంతయు మృదువుగా నుండిన వస్త్రగాలితము చేసి గ్రహించవలెను.

మాత్ర : 240 మి.గ్రా.

ఉపయోగము : గ్రహణీ, కర్ణపూయము, అగ్నిమాంద్యము, కాస, రక్త పిత్తము, శూల, పరిణామ శూలలను పోగొట్టును.

**అగ్నిజారము :** దీనినే అంబరమందురు. సముద్రమందలి స్పెర్మ్‌ఏవల్ అనే జంతువు యొక్క ప్రేగుల నుంచి స్రవించు కొవ్వువంటి మెత్తటి పదార్ధమే అగ్నిజారము.

శోధన : సముద్ర క్షార జలముచే శుద్ధమైనది గావున శోధనము చేయ నవసరములేదు.

మాత్ర : 30-60 మి.గ్రా.

**గిరి సింధూరము :** ఇది సీసము కలిసిన యౌగికము.నైసర్గిక మరియు కృత్రిమ అను భేదములనే రెండు విధములుగా యుండును.

శోధన : సింధూరమును నిమ్మపండ్ల స్వరసముతో మర్దనచేసి ఒక పాత్ర యందుంచి అగ్నిపై శోషింప చేయవలెను. పిమ్మట తండులోదకములో నూరి పై విధముననే చేసిన యడల సింధూరము శుద్ధి అగును.

ఉపయోగము : విరిగిన ఎముకలను సంధానము చేయును. కుష్ఠ, కండూహరము, వ్రణ శోధన రోపణముగా పనిచేయును కాళ్ళు పగుళ్ళకు పై పూతగా వాడవచ్చును. దీనిలో తయారగు సిందూరాది లేపము దెబ్బలు, పుండ్లపై రాసిన తొందరగా మానును.

**హింగులము :** చర్మారము, శుకతుండము, హంసపాదమును భేదము లచే నాలుగు విధములుగా నుండును.

శోధన : అల్లపురసము నందుగాని, జంబీర రసమునందుగాని హింగుళ మును ఏడుసార్లు భావన చేసిన శుద్ధి నొందును.

మారణము : అల్లపు రసమును శుష్కమగు వరకూ మధ్యాగ్నిచే పక్వము చేసిన పిమ్మట జీడిగింజలను, లవంగ చూర్ణములను, ఘృతమును పోసి దగ్ధముచేసి చల్లారిన పిమ్మట హింగుళపు ముక్కను తీసి చూర్ణముచేసి అనుపాన విశేషములచే ఉపయోగించెదరు.

సత్వపాతన : శుద్ధ హింగుళమును పాతన యంత్రమునందుంచి వేడి చేసిన సత్వధూపమున పారదము లభించును. దీనినే హింగుళోత్థపాదరస మందురు.

ఉపయోగము : ఆమాతిసారము, జ్వరము, కుష్ఠము, హృల్లాసము, కామలా, ఆమవాతము, ప్లీహవృద్ధి మొ॥ వ్యాధులను పోగొట్టును.

**మృద్దారశృంగము :** పసుపు, తెలుపు, వర్ణభేదములచేత రెండు విధములుగా యుండును. ఇది సీససత్వం అని చెప్పబడినది.

శోధన : జంబీరస్వరసమునందు భావన చేసిన శుద్ధి నొందును.

ఉపయోగములు : ఫిరంగ రోగవ్రణము బాహ్యా ప్రయోగమునకు వుపయోగపడును. విరేచనము కలిగించును. కేశములను రంజింపచేయును.

## ధాతు – ఉపధాతువులు

బంగారము, వెండి, రాగి, తగరము, సత్తు, సీసము, ఇనుము అనునవి ధాతువులుగా వ్యవహరింపబడుచున్నవి.

స్వర్ణమాక్షికము, తారమాక్షికము, మైలతుత్థము, కంచు, ఇత్తడి, గంగ సింధూరము, శిలాజిత్తు అనునవి ఉపధాతువులుగా వ్యవహరింపబడుచున్నవి.

వీటిని సేవించుటవలన వలీపలితములు, ఖాలిత్వము, కృశత్వము, వృద్ధావస్థ మరియు రోగములను పోగొట్టి శీరర ఆరోగ్యకారకములగునో వాటిని ధాతువులందురు. లాగబడుట (కర్షము) అను అర్థముతో ధాతువులకు లోహము అని పేరుకూడా గలదు. ధాతువులు ముఖ్యముగా స్వర్ణము రజతము, తామ్రము లోహము (శద్ధలోహము) నాగము, వంగము (పూతి లోహము), పిత్తలము–కాంస్యము–వర్తము మిశ్రలోహము అను భేదముచే వర్గీకరించబడినవి.

**శుద్ధం లోహం కనకరజతం భానులోహశ్మసారమ్**
**పూతీలోహం ద్వితయముదితం నాగవఙ్గాభిధానమ్**
**మిశ్రం లోహం త్రితయముదితం పిత్తలం కాంస్యవర్తమ్**
**ధాతుర్లోహే లుహ ఇతిమతః స్యోసికర్షార్థవాచీ ( ర.ర.స)**

**స్వర్ణము :** స్వర్ణమును అగ్నిపై కరిగించి కాంచనార రసమునందు 3 సార్లు ముంచిన శుద్ధమగును.

మారణము : జంజీర స్వరసముతో నూరిరస భస్మమును స్వర్ణ రేకులకు లేపనముచేసి పుటము వేయవలెను. ఇట్లు పదిసార్లు పుటము చేసిన స్వర్ణము భస్మమగును.

మాత్ర : 15-30 మి.గ్రా.

ఉపయోగము : రసాయన, వృష్యము, బృంహన, మేథ్య, నేత్ర, హృద్య, విషఘ్నకర్మను కలిగియుండును. సన్నిపాత జ్వరము, రాజయక్ష్మ, ఉన్మాదము, ఆమవాతము మొ॥ వ్యాధులను హరించును.

**రజతము :** పలుచటి వెండి రేకులను గ్రహించి నిప్పులందు ఎర్రగా అగునంతవరకూ వేడిచేసి అగస్త్య (అవిశ) స్వరసమునందు ముంచవలెను. ఈ నిర్వాప ప్రక్రియ 3 సార్లు చేసిన వెండి శుద్ధి నొందును.

శోధన : ధాతువులకు పేర్కొనబడిన తైలే తక్రేగవాంమూత్రే ...అనెడి సామాన్య శోధన కూడ రజతమునకు చేయవచ్చును.

మారణ :భస్మము : ఇంగిలీకమును వీనిని నిమ్మకాయ రసంతో మర్దించి వెండిరేకులపైన దట్టముగా రెండు మూడు పుటములు వేసిన రజతము భస్మమగును.

మాత్ర : 30 మ్గి.ఆ. -120 మి.గ్రా.

ఉపయోగములు : మేధ్యము; బల్యము; వయఃస్థాపన, లేఖన కర్మలు గలిగి యుండును. ఉన్మాదము, ప్రమేహము, అగ్నిమాంద్యములందుప యుక్తము.

**తామ్రము :** రాగి నేపాలము, మ్లేచ్ఛము అనురెండు విధములుగ నుండును.

శోధన : కాల్చి బొంతజెముడు పాలలోగాని జిల్లేడు పాలలోగానీ చల్లార్చిన శుద్ధియగును.

మారణము : తిలపర్ణి స్వరసమును తామ్రపత్రములకు లేపనముచేసి గజపుటమిడిన తామ్రము తెల్లని భస్మమగును.

మాత్రా : 15 మి.గ్రా. 60 మి.గ్రా.

ఉపయోగములు : ప్లీహ రోగ, అమ్లపిత్తము, అర్శస్సు, శూల, నేత్రపటల రోగము, పాండు, ఉదర, కుష్ఠ, కాస, శ్వాస, క్షయ, పీనస, శోధ, కృమి మొదలగు వ్యాధులను పోగొట్టును.

**లోహము :** ముండలోహము, తీక్ష్ణలోహము, కాంతలోహము అని లోహము మూడు విధములుగా యుండును.

లోహమును పల్చటి రేకులుగా చేసి కొలిమిలో ఎర్రగ కాల్చి తిలతైలము, తక్రము, గోమూత్రము కాంజికము, కుళుత్థ కషాయమునందు ప్రత్యేకముగా ఏడుసార్లు ముంచిన శుద్ధి నొందును. ధాతువులన్నిటిని ఈ విధి ద్వారా శోధనను చేయవచ్చును.

శోధనము – మారణము : లోహపు రేకులను మెత్తగా చూర్ణించి త్రిఫలాకషాయం లేదా పునర్నవా పత్రస్వరసమున మూడు దినములు మర్దించి చక్రికలుచేసి ఎండించి శరావ సంపుటమున బంధించి గజపుటము వేయవలెను. ఈ విధముగా 30 పుటములు వేసినచో నేరేడు పండువంటి వర్ణముగల భస్మము తయారవుతుంది.

మాత్ర : 30 మి.గ్రా – 240 మి.గ్రా.

ప్రయోగములు : కామలా, పాండు, రాజయక్ష్మ, గరదోషము, అష్టాదశ కుష్ఠములు, త్రిదోషవికారములు, శ్వాసరోగము, కఫజవ్యాధులు, రక్తపిత్తము మూత్రకృచ్ఛ్రము, కాసరోగము, మొదలగు వ్యాధులను పోగొట్టును.

**మండూరము :** లోహమును కొలిమిలో గాల్చునపుడు మలరూపమున బయటకు వచ్చు పదార్థమును మండూరమని అందురు.

శోధన : మండూరమును విభీతక వృక్ష కాష్టముతోచేసిన నిప్పుయందు ఎర్రగా కాల్చి, అదే వృక్షము యొక్క కొయ్యతో చేయబడిన పాత్రయందుగల గోమూత్రము నందు ఏడుసార్లు ముంచిన శుద్ధి అగును.

మారణ : త్రిఫలా కషాయమునందు భావనచేసి ఎండించి మూడు గజపుటములు వేసిన భస్మమగును.

మాత్ర : 30 మి.గ్రా. 240 మి.గ్రా.

ఉపయోగములు : శోఫ,కామలా, పాండు, కుంభకామలా వ్యాధులందు హితకరముగా నుండును.

**వంగము** : తగరము కుకరము, మిశ్రకము అని రెండు విధములుగా నుండును.

శోధన :వావిలి ఆకురసమునందు పసుపుకలిపి కరిగించిన వంగమును మూడుసార్లు పోసిన శుద్ధమగును.

మారణ : మోదుగ చెక్కరసముతో నూరిన శుద్ధతాలకమును వంగ రేకులకు పట్టించి పుటమువేసిన భస్మమగును.

మాత్ర : 120–240 మి.గ్రా.

ఉపయోగములు : ప్రమేహము, శుక్రధాతు క్షయమును, గుల్మము, శ్వేత ప్రదరము, అగ్నిమాంద్యము, కాస, శ్వాస, క్షయమలను వ్యాధులను పోగొట్టును. శుక్రనష్టమునందు గోమూత్ర శిలాజిత్తులోను, ప్రమేహములందు పసుపు, బూరుగు పట్టరసములోను, వంధ్యత్వమున అభ్రక భస్మమును ప్రయోగించవలెను.

**నాగము – శోధనము :** నాగమునుగాని వంగమునుగాని ముందు కరిగించి, మూడుసార్లు తెల్లజిల్లేడు పాలులోపోసి చల్లార్చిన శుద్ధి అగును.

మారణము : శుద్ధినొందిన సీనమును గ్రహించి కరిగించి, పారదముతో చేర్చి మర్దించిన చూర్ణమగును. ఇట్టి చూర్ణమందు జంబీర స్వరసమును చేర్చి నాలుగు గంటలు మర్దించిన తరువాత నీటియందు కడిగి, ఎండిన పిమ్మట రెండురెట్లు గంధకమును చేర్చి కజ్జలిగా తయారుచేసి శరావము నందుంచి ఏడుసార్లు గజపుటములు వేసిన భస్మమగును.

మాత్రా : 30 –120 మి.గ్రా.

ఉపయోగములు : ప్రమేహము, వ్రణము, అర్శస్సు, గుల్మము, గ్రహణీ, అతిసారములందుపయుక్తము, నిత్యము సేవించినచో రసాయన, వాజీకర ముగా పని చేయును.

**యశదము శోధన :** యశదమును గ్రహించి ద్రవమగు నంతవరకు వేడిచేసి దానిని గోదుగ్ధమునందు ఇరువది యొక్కసార్లు నిశ్వాసము చేసిన శుద్ధి నొందును.

మారణము : శుద్ధినొందిన యశదమును కరిగించి పాదరసములో కలిపి చూర్ణమగునంత వరకు మర్దించిన పిమ్మట జంబీస్వరసమును చేర్చి ఒకరోజు మర్దించవలెను. తరువాత స్వచ్ఛమైన జలముతో బాగుగా కడిగి ఎండయందు ఎండించి దానికి రెండురెట్లు గంధకమును చేర్చి రెండు రోజులు మర్దించవలెను. అట్లు మర్దించిన దానిని శరావము నందుంచి పుటము వేసిన పాండు వర్ణముగల యశద భస్మము లభించును.

మాత్ర : 60 – 120 మి.గ్రా.

ప్రయోగములు : దృష్టివృద్ధి, దుర్భలత్వము, మస్తిష్కదౌర్భల్యము, అర్ధావ భేదకము. ప్రమేహము, పాండు, శ్వాసను పోగొట్టును. నేత్రములకు హితకరంగా నుండును.

**పిత్తలము :** రాగి, సత్తు అను రెండు లోహముల సమ్మేళనముచే ఇత్తడి తయారగును.

శోధన : ఇత్తడిని ఎర్రగా కాల్చి హరిద్రా చూర్ణము కలుపబడిన వావిల ఆకు కషాయమునందు ఐదుసార్లు ముంచిన శుద్ధినొందును.

మారణ : మణిశిలను నిమ్మపండ్ల రసముతో నూరి ఇత్తడి రేకులకు లేపముచేసి పుటము వేయవలెను. ఇట్లు ఎనిమిది పుటములు వేసిన ఇత్తడి భస్మమగును.

మాత్ర : 60–100 మిగ్రా.

ఉపయోగము : క్రిమి, కుష్ఠము, అగ్నిమాంద్యములను పోగొట్టి నేత్రము లందు హితకరముగా నుండును.

**వర్తలోహము** : కంచు, రాగి, ఇత్తడి, ఇనుము మరియు సీసములను కరిగించి వర్తలోహము తయారు చేయుదురు. ఈ అయిదింటిని కలిపి పంచ లోహములందురు.

శోధన : వర్తలోహమును కరిగించి అశ్వమూత్రములో చల్లార్చిన శు ద్ధి అగును.

మారణ : గంధకం, తాళకములను శుద్ధవర్త లోహములో చేర్చి జంబీర స్వరసమునందు మర్ధించి పుటము వేసిన భస్మమగును.

మాత్ర : 240 మి.గ్రా.

ఉపయోగములు : క్రిమిరోగము, నేత్ర, కంఠవ్యాధులను పోగొట్టును.

**రత్నములు :** వైద్యమందు మిక్కిలి ప్రయోజనవంతములుగా నుండును. ధనార్దులగు జనులు వీనిని మిక్కిలి ప్రేమించుట వలన శబ్దశాస్త్ర విశారదులచే రత్నమని చెప్పబడుచున్నది. వజ్రము, విద్రుమ (పగడము) మౌక్తికము (ముత్యము), మరకతము (పచ్చ), వైడూర్యము (పిల్లికన్నురాయి), గోమేధము, మాణిక్యము (కెంపు) పుష్పరాగము (పుష్య రాగము), నీలము అనునవి నవరత్నములు లేదా మహారత్నములుగా వ్యవ హరింపబడును.

శోధన :ఆమ్లవర్గ ద్రవ్యములతో (జంబీర స్వరసాదులు) మాణిక్యమును, జయన్తీ రసముతో ముత్యమును, క్షారవర్గ ద్రవ్యములతో పగడమును,

ఆవు పాలతో మరకతమును స్వేదనచేసియు, పుష్యరాగమును ఉలవల కషాయము నందు సంధానము చేసియు, చిర్రికూర రసమునందు వజ్రమును, నీలిచెట్టు రసమునందు నీలమును, గోరోచన కషాయమునందు గోమేదకమును, త్రిఫలా కషాయమునందు వైడూర్యమును స్వేదనచేసి శుద్ధిచేయవచ్చును.

మారణ : మణిశిల, గంధకము, తాలకములను లకుచఫల రసము నందు మర్దించి దీనికి వజ్రము తప్ప మిగిలిన రత్నములలో ఒకదానిని చూర్ణముగా చేసి చేర్చి 8 గజపుటములు వేసినచో అది భస్మమగును. మూడు సంవత్సరములు పెరిగిన ప్రత్తిచెట్టు వేరుగాని, 3 సంవత్సరములు పెరిగిన తమలపాకు వేరునుగాని గ్రహించి మెత్తగానూరి దాని మధ్యలో వజ్రమునుంచి గోళకముగా చేసి ఎండించి శరావ సంపుటమున పెట్టి గజపుటమునందు పాకము చేయవలెను. ఈ విధముగా ఏడు పర్యాయములు చేసినచో వజ్రము భస్మమగును.

**వత్సనాభి :** వత్సనాభిచెట్టుయొక్క ఆకులు వావిలాకులవలె నుండును. దూడ యొక్క బొడ్డువంటి యాకృతిగల కందముండును. ఈ వృక్షము యొక్క పార్శ్వములం దెట్టి వృక్షమును ఉత్పత్తిగా నేరదు.

**శోధనావిధానము :** వత్సనాభికందమును చిన్న చిన్న ముక్కలుగా చేసి యొక పాత్రయందుంచి, అందు ఆ ముక్కలు మునుగునంత గోమూత్ర మును బోసి యొక రాత్రి యూరబెట్టవలెను. మరునాడా ముక్కలను వేరొక పాత్రలోనికి గ్రహించి యెండబెట్టవలెను. పిమ్మట పూర్వరాత్రియందు వలెనే యా ముక్కలను క్రొత్తదగు గోమూత్రమునందుంచి యూరబెట్టవలెను. ఇటుల మూడురాత్రులు గోమూత్రమునందూరబెట్టి నాల్గవ దినమునుండి తీక్ష్ణమగు నెండలో నుంచి బాగుగా నెండించవలెను. ఇటుల జేసినచో తప్పక నాభి పరిశుద్ధమైన యోగములందు ప్రయోగింప అర్హమగును.

**వికారములు :** వత్సనాభిని ప్రమాదవశమున అతిమాత్రగా భుజించినచో నట్టి మనుజున కెనిమిది వేగములు సంభవించును. అందు మొదటి వేగమున ఉద్వేగమును, రెండవ వేగమున శరీరకంపమును, మూడవ వేగ మున దాహమును, నాల్గవ వేగమున భూపతనమును, అయిదవ వేగమున ఫేనవమనము (నురుగు గ్రక్కుట)ను, ఆరవవేగమున నంగవైకల్యమును, ఏడవ వేగమున జడత్వమును, ఎనిమిదవ వేగమున మరణమును సంభ వించును. ఇట్టి వేగాంతరములను దెలిపి యెనిమిదవ

వేగము సంభవించు టకు ముందుగనే అట్టి వికారములను మంత్రౌ షధములచే శమింపజేయు టకు ప్రయత్నింపవలెను.

**విషవికార శమనోపాయములు :** వత్సనాభి నతిమాత్రగా భుజించు వలన గలుగు వికారములందు వెంటనే వమనము జేయించవలెను. మేక పాలను, వాంతులు నిలిచిపోవువరకు నిచ్చుచుండవలెను. ఎప్పుడు వాంతులు నిలిచిపోయిపానము చెడిన మేకపాలు కోష్ఠమునందు స్థిరీభూతమగు నోట అప్పుడు విషవేగము అడ్డిపోయినట్లుగా దెలియవలెను. అనగా విషవికార ములు శమించినట్టు దెలియవలెనని భావము. (ఆ.ప్ర.)

**అర్క :** వికారములు జిల్లేడుపాలను మాత్రాధికముగా సేవించినచో విశేష ముగ వమనములును, విరేచనములును జనించును. అధికముగ మూత్రము ప్రవర్తించును. నాలుక యందు తాపము బుట్టును.

వికార శాన్తి : శీతజలమునందు చక్కెర గలిపి పానము జేయవలెను. వస్త్రముచే విసరవలెను. చల్లని నీడయందుండవలెను. ఇటుల జేసినచో నర్క క్షీరాతి యోగముచే గలిగిన వికారములు శమించును. (ఆ.మం.)

**స్నుహి :** వికారములు జెముడుపాలను మూత్రాధికముగ సేవించినచో కుక్షి యందు అధికమైన తాపమును, విశేషముగ విరేచనములు, వాంతులును కలుగును. ఇందు వెంటనే చికిత్సింపవలెను.

వికారశాన్తి : జెముడుపాల యొుక్క అతియోగముచే గలిగిన వికారము లను ద్రాక్షపండ్ల రసమును, శీతలజలమును, ఆవుపాలను చక్కెరజేర్చి విశేష ముగా పానము జేసిన నయ్యవి శమించును. (ఆ.మం.)

**లాంగలీ :** శోధన పొత్తిదుంప నొకదినము గోమూత్రమునందూరబెట్టి మరునాడు ఎండలో నెండించిన నయ్యది పరిశుద్ధమగును.

వికారములు : పొత్తి దుంపయొుక్క మాత్రాధిక్యతచే గలుగు వికారములు వత్సనాభియందువలెనే జనించును. వీనికి శాన్తిగూడ వత్సనాభి విషము నందువలెనే జేయవలెను. (ఆ.మం.)

**గుంజా (శ్వేత) :** శోధన గురివిందగింజలను ఒక జాము కాంజికముతో డోలా యంత్రమున స్వేదనము జేసిన శుద్ధి యగును.

వికారములు : గుంజావిషాది యోగమున శరీర దౌర్బల్యమును, స్రోత స్సుల నుండి రక్తము బయటకు స్రవించుటయు, తంద్ర, మోహము, శరీరమునందంతటను వ్రణములును సంభవించును.

శాన్తి : చిర్రికూర రసమునందు చక్కెర గలిపి సేవించిన గుంజావిష సేవన వలన గలుగు వికారములు శమించును. (ర.రా.)

**కరవీర :** శోధన గన్నేరు బీజములకు డోలా యంత్రమున నావుపాలతో నొకజాము స్వేదనముచేసిన యయ్యని పరిశుద్ధములగును.

వికారములు : గన్నేరుపప్పు, నతిమాత్రగా భుజించినచో కోష్ఠము నందు దారుణమైన తాపమును, శూలతో గూడిన వమన విరేచనములును, ఆక్షేపక వాతమును సంభవించును.

విషశాన్తి : గేదె పెరుగునందుగాని, పాలయందుగాని చక్కెర చేర్చి పలుమార్లు పానము చేసినను పైవాని యందు జిల్లేడు వేరుపట్ట చూర్ణమును జేర్చి పానము జేసినను గన్నేరు విషవికారములు శమించును.

**దన్తీ బీజము:** శోధన నేపాళపు గింజల పైనుండు తోలును, మధ్యనుండు విషదళ ములను తొలగించి యా బీజములను గేదపేడగలిపిన నీళ్ళలో వేసి మూడు దినములుంచవలెను. పిమ్మట వాటి నుష్ణోదకముతో కడిగి యొక గుడ్డ యందు మూటగట్టి ఖల్వము నందుంచి మెత్తగా చితుకగొట్టవలెను. ఇటుల జేసిన అందలి తైలము కొంత వస్త్రమునందు లగ్నమగును. పిమ్మట నా పిష్టమును ఒక క్రొత్త కుండకు లోపలి భాగమున పూసి యొక రోజుంచినచో అందుండు తైలాంశమునంతను కుడా హరింపజేయును. తైలమును కుండ పీల్చుకొనగానే ఈ కల్కము పొడిపొడిగా రాలును. ఈ విధముగా జేసిన పిమ్మట నా చూర్ణమును ఖల్వమునందుంచి జంబీరములో పలుమార్లు మర్దించవలెను. ఇటుల జేసిన నేపాళపు గింజలను యోగములందు జేర్చుకొన నర్హములగును.

వికారములు : అధికమైన వాన్తి, భ్రాన్తి. అధిక విరేచనములు, కడుపు నొప్పి, ఉబ్బరింపు, అధిక స్వేదము, దౌర్భల్యము అనునవి దన్తీ విషారి యోగ సంభవించును.

విషశాన్తి : ధనియాల కల్కమును చక్కెరను గలిపి పెరుగుతో జేర్చిత్రాగిన దన్తీ విషజవికారములు శమించును.

శోధన : జీడిగింజలను ఇటుకరాయి పొడిలో నుంచి బాగుగా రుద్ది నీళ్ళతో కడిగిన నయ్యవి పరిశుద్ధములగును. ఇటుపై విధముగ రుద్దుటకు ముందుగా నొక గుడ్డలో మూటగట్టి తడిగల భూమిలో మూడుదినములు పాతియుంచుట కూడా సంప్రదాయముగా తెలియ నగును.

వికారములు : భల్లాతకము నధికముగా భుజించినప్పుడు కోష్ఠము నందు వ్రణముతో కూడి తాపము జనించును. దాని రసము చర్మముపై తగిలినచో నచ్చుట దెబ్బ పగిలి యందుండి స్రావమేర్పడి యది యెచ్చుట తగిలిన నచ్చుట తిరిగి వ్రణ మేర్పడును.

విషశాన్తి : చిర్రికూర రసములో చక్కెర జేర్చి పానము జేసిన ఒక జాములో విషవికారములెల్ల శమించును. చర్మముపైన బొబ్బలకు నారికేళ తైలమును బూసిన అవి శమించును.

ఇంకను అనేక ధాతు, ఉపధాతు, రత్నములను గూర్చి నాచే రచించబడిన "ధాతువైద్య" మను గ్రంథమును చూడగలరు.

## ద్రవ్య గుణకర్మ విజ్ఞానము

ద్రవ్యమును రస, గుణ, వీర్య, విపాకము, ప్రభావము అను పదార్ధ ములు ఆశ్రయించి యుండును. వీనిచే ద్రవ్యము కర్మను చేయును.

**ద్రవ్యము** : దేనియందైతే గుణకర్మలు సమవాయసంబంధంతో ఆశ్ర యించి ఉండునో అది ద్రవ్యము అనబడును. ఏ పదార్ధమునందు రస, గుణ, వీర్య, విపాకము మొదలగు అయిదు ఆశ్రయించి ఉండునో అదే "ద్రవ్యము" అనబడును. విశ్వమునందు స్థూలముగాని, సూక్ష్మాతి సూక్ష్మ మైన ద్రవ్యముగాని పంచీకృత మహాభూతముల ద్వారా నిష్పన్నమగును. అందుచేత అన్ని ద్రవ్యములు పాంచభౌతికములే "వ్యపదేశస్తు భూయశః" అను సిద్ధాంతానుసారము అయిదు భూతములు ప్రతి ద్రవ్య నిష్పత్తిలో పాల్గొన్నప్పటికీ ఏదో ఒక మహాభూతము ప్రధానముగా ఉండుటచే ఆ ద్రవ్యము పార్ధివ, ఆప్య, తైజస, వాయవ్య, నాభసములుగా పరిగణించ బడును. అట్టి ద్రవ్యము రసాదిగుణము లాధారముగా శరీరముపై వివిధ కర్మలను కలుగజేయును.

**రసము :** "రస్వతే ఆస్వాద్యతే ఇతిరసః రసనేంద్రియము ద్వారా ఏ విషయము గ్రహింపబడునో దానిని రసమందురు. అనగా ద్రవ్యమునందలి మధురాది షడ్రసములను గ్రహించవలెను.

"పునర్వసు ఆత్రేయుడు" రస సంఖ్య విషయమున కల వివిధ మతము లను సమన్వయపరచి మధుర, ఆమ్ల, లవణ, కటు, తిక్త, కషాయములు అను రసములు 'ఆరేనని' ప్రతిపాదించెను.

| రసము | గుణము |
|---|---|
| మధుర | స్నిగ్ధ, శీత, గురు |
| ఆమ్ల | స్నిగ్ధ, ఉష్ణ, లఘు |
| లవణ | స్నిగ్ధ, ఉష్ణ, గురు |
| కటు | రూక్ష, ఉష్ణ, లఘు |
| తిక్త | రూక్ష, శీత, లఘు |
| కషాయ | రూక్ష, శీత, గురు |

మధురరసము : వాతపిత్త హరము, జీవనము, తర్పణము, బృంహ ణము, బల్యము, ప్రీణనము, స్తన్యవర్ధనము,తృష్ణా–దాహ–మూర్ఛా ప్రశమ నము, రస,రక్త,మాంస,మేదో,అస్థి, మజ్జ, శుక్ర, ఓజోవర్ధకము.

ఆమ్లరసము : వాతహరము, దీపనము, రోచకము, హృద్యము, ఇంద్రియ స్థైర్యకరము, శుక్రనాశకము.

లవణరసము : వాతహరము, దీపనము, పాచనము, ఛేదనము, భేదనమూ కఫాభిష్యందకారకము, రోచకము, శుక్రనాశకము.

**కటురసము :** కఫహరము, దీపనము, క్రిమిఘ్నము, రోచనము, ఛేదనము, గ్రాహి, కండూహరము, ధాతునాశకము.

**తిక్తరసము** : కఫహరము, పిత్తహరము, దీపనము, పాచనము, జ్వర హరము, క్రిమి, విషహరము, లేఖనము, గ్రాహి, స్తన్యశోధనయు, దాహ, తృష్ణ, కండూ, కుష్ట ప్రశమనము.

**గుణము** : గుణశబ్దము "గుణ ఆమంత్రణే" ధాతువునుండి ఉత్పన్న మైనది. దేనిద్వారా అయితే లోకము ద్రవ్యమువైపు ఆకర్షింపబడునో దానిని "గుణ"మందురు. ఏది ద్రవ్యమును ఆశ్రయించి ఉండి క్రియా రహితమై, లేదా క్రియ కంటే భిన్నమైనదియు గుణరహితమై మరియు స్వసమాన గుణోత్పత్తియందు కారణభూతమై ఉండునో దానిని 'గుణము' అందురు. బదన్త నాగార్జునుడు ఏతైదే భిన్న భిన్న లక్షణములు కల్గి ఉండునో అట్టి దానిని 'గుణమని' పేర్కొనెను.

1. గుణము : పై శేషికగుణములు – శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ

2. సామాన్యగుణములు – వింశతి గుర్వాది గుణములు పరాది గుణ ములు.

3. ఆత్మగుణములు-ఇచ్ఛా, ద్వేష, సుఖ, దుఖ, ప్రయత్న, బుద్ధి.

గుర్వాది గుణములు : గురు, లఘు, శీత, ఉష్ణ, స్నిగ్ధ, రూక్ష, మంద, తీక్ష్ణ, స్థిర, సర, మృదు, కఠిన, విశద, పిచ్ఛిల, శ్లక్ష్ణ, ఖర, సూక్ష్మ, స్థూల, సాంద్ర. ద్రవ అను ఇరువదియును సామాన్య లేక శారీర గుణములు అన బడును.

గురు : శరీరమునకు పుష్టిని కల్గించు శక్తి కల గుణము

ఉదా : మాష, ఇక్షు

లఘు : శరీరమును లఘువుగా చేయు శక్తి కల గుణము

ఉదా : ముద్గ.

శీత : స్తంభనము చేయు శక్తికల గుణము

ఉదా : చందన, ఉశిర మొ॥

ఉష్ణ : స్వేదమును కల్గించు శక్తికల గుణము

ఉదా : మరిచము, చిత్రకము

స్నిగ్ధ : శరీరమునకు క్లేదనము కల్గించు శక్తిగల గుణము

ఉదా : తైలము

రూక్ష : శోషణమును చేయు శక్తి కల గుణము ఉదా: యవలు,ముస్త

మంద : శమనకర్మ చేయు శక్తికల గుణము ఉదా: ఆమలకీ,అతివిష

తీక్ష్ణ : శోధనము చేయు శక్తికల గుణము ఉదా : దన్తీ, మరీచము

స్థిర : ధారణ శక్తికల గుణము ఉదా : ఆస్తి, శుక్తి, బల, అతిబలా

సర : ప్రేరణచేయు శక్తికల గుణము ఉదా : హరీతకీ, త్రివృత్.

మృదు : శరీరమునకు కోమలత్వము లేదా స్నిగ్ధత్వము కలుగుచేయు శక్తి కల గుణము ఉదా : యష్టీమధు, గోధుమ

కఠిన : శరీరమునకు ధృడత్వము కలిగించు శక్తికల గుణము

ఉదా : అశ్వగంధ, శతావరి.

విశద : క్షాళన చేయు శక్తికల గుణము ఉదా : మాంసరోహిణి

పిచ్ఛిల : లేపనము చేయు శక్తికల గుణము ఉదా : అస్థిసంహారకము.

శ్లక్ష్ణ : రోపణ చేయు శక్తికల గుణము ఉదా వచా, శిలాజిత్తు

సూక్ష్మ : వివరణ (స్రోతస్సులను వికశింపచేయు) శక్తికల గుణము

ఉదా : ఏరండతైలం, లవణం.

స్థూల : సంవరణ(సోతోరోదము) కలుగచేయు శక్తికల గుణము

ఉదా: దధి, పిణ్యాకము

సాంద్ర : ప్రసాదన (శరీరావయవములకు) కలుగుచేయు శక్తి కల గుణము ఉదా : కాకోలీ, క్షీరకాకోలి.

ద్రవ : విలోదన (వ్యాపించు) శక్తికల గుణము ఉదా : జలము.

**వీర్యము :** "వీరయతే కర్మసమర్థోభవతి అనే నేతి వీర్యం" దేని ద్వారా ద్రవ్యము కర్మను చేయుటలో సమర్థవంతమగునో దానిని వీర్యమందురు. "యేన కుర్వనితత్ వీర్యం" అను చరకాచార్యుని సూత్రప్రకారము ఏ శక్తి ద్వారా ద్రవ్యము కర్మను చేయునో దానిని వీర్యమందురు.

**ద్వివిధ వీర్యములు :** ప్రపంచమునందలి అన్ని ద్రవ్యములు పాంచ భౌతికములైనప్పటికీ అగ్ని మరియు సోమములు విశేషాధిక్యత కల్గి ఉ ఒడును. కాలము కూడా ఆదాన (ఆగ్నేయ) విసర్గ (సౌమ్య) భేదముచే రెండు రకము లుండుటచే అగ్నిగుణప్రధాన ఉష్ణ మరియు సౌమ్యగుణ ప్రధాన శీత అను రెండురకముల వీర్యములను అంగీకరింపవచ్చును.

**వీర్యకర్మలు :** ఉష్ణవీర్యము, వాతకఫశామక, పిత్తకర, పాచన, దహన, మూర్ఛ, స్వేదన, భ్రమ, తృష్ణా గ్లాని ఉత్పాదక, వమన, రేచనకర, విలయన కర్మలు గలిగియుండును.

**శీతవీర్యము :** పిత్తశామక, కఫ–వాతవర్ధక, ప్రహ్లాదన, ప్రసాదన, స్థిరీకరణ, జీవన, స్తంభన, క్లేదన, విష్యందన కర్మలు కలిగియుండును.

**విపాకము :** "విశిష్టః జరణ నిష్ఠాకాలే రసవిశేషస్యపాకః ప్రాదుర్భావః విపాకః" (ప్రశస్తపాద) పాకక్రియ అంతమునందు ఉత్పన్నమైన రస విశేష మును విపాకము అందురు. జఠరాగ్ని వ్యాపారము సమాప్తమైన తర్వాత ఉత్పన్నమైన రస విశేషమును విపాకము అందురు. ఆచార్య నాగార్జునుడు పరిణామ లక్షణమును విపాకముగా పేర్కొనెను.

చరకుడు, వాగ్భటుడు, పరాశరుడు మున్నగు ఆచార్యులు విపాకమును మధు, ఆమ్ల, కటు అను మూడురకములుగా పేర్కొనిరి. మధుర, లవణరస ములు కలసి మధురవిపాకమును, ఆమ్లరసము ఆమ్లవిపాకమును, తిక్త,

కటు, కషాయ రసములు కటువిపాకమును పొందును. రసానుసారముగా విపాకము వివరింపబడుట చేత దీనికి రసవిపాకపాకము అని కూడా అందురు. సుశ్రుతుడు, నాగార్జునాది ఆచార్యులు విపాకమును గురు మరియు లఘువులుగా పేర్కొనిరి. సుశ్రుతాచార్యుల గురు విపాకమును మధుర విపాకమని, లఘువిపాకమును కటువిపాకమని పేర్కొనెను. నాగార్జునుడు శీత, స్నిగ్ధ, లఘు, రూక్షాది గుణములను విపాకమునకు కారణముగా పేర్కొనెను.

| విపాకము | గుణము | శోషకర్మ | ధాతుకర్మ | మలకర్మ |
|---|---|---|---|---|
| మధుర | స్నిగ్ధ,గురు | కఫవర్ధక | శుక్రల | సృష్టవిణ్మూత్ర |
| ఆమ్ల | స్నిగ్ధ,లఘు | పిత్తవర్ధక | శుక్రహర | సృష్టవిణ్మూత్ర |
| కటు | రూక్ష,లఘు | వాతవర్ధక రసవర్ధక | శుక్రహర | బద్ధవిణ్మూత్ర |
| గురు | – | వాత,పిత్తహర | – | సృష్ణవిణ్మూత్ర |
| లఘు | – | కఫఘ్న,వాతపిత్త వర్ధక | – | బద్ధవిణ్మూత్ర |

**ప్రభావము :** "ప్రభవతి సామర్థ్య విశిష్ఠం భవతి ద్రవ్యమనేన ఇతి ప్రభావః" దేనిద్వారా ద్రవ్యము విశిష్ట సామర్థ్యము లేదా శక్తిని కల్గి ఉండునో దానిని ప్రభావమందురు. ద్రవ్యమునందు రస, వీర్య, విపాకాదులు సమానముగా ఉండి, కర్మయందు విశిష్ఠత ఉన్నచో దాని కారణమును ద్రవ్యగత ప్రభావమే అయి ఉండును.

చిత్రక, దన్తీ రసము (కటు), విపాకము(కటు), వీర్యము (ఉష్ణ) పరసర్పరము సమానమైనప్పటికీ దన్తీ రేచనము చేయును. కాని చిత్రకము నందు ఆ కర్మలేదు. దన్తీయొక్క రేచకత్వమునకు ప్రభావమే కారణము, విషము యొక్క విషహరత్వము, ఊర్ధ్వ, అధోభాగహరకర్మలు, మణిధారణ మొదలగునవి ప్రభావము ద్వారా పనిచేయును.

'సుశ్రుతాచార్యులు' ప్రభావమును 'అమీమాంస్య' 'అచిన్త్య' అను శబ్దముల ద్వారా వర్ణించెను. అరుణదత్తుడు ద్రవ్యగత వీర్యవిపాకాదులను అధిగమించి పనిచేయు ద్రవ్య స్వభావమును ప్రభావముగా పేర్కొనెను. "చక్రపాణిదత్తుడు" వీర్యమును చిన్త్య, అచిన్త్య అను రెండు విధములుగా విభజించి అచిన్త్యమును ప్రభావముగా పేర్కొనెను.

**ద్రవ్య కర్మలు :** కర్మ "క్రియతే ఇతికర్మ" ఏదైతే చేయబడునో దానిని కర్మ అందురు. సంయోగ విభాగములకు కారణమై ద్రవ్యమును ఆశ్రయించి ఉండు దానిని కర్మ అని చరకాచార్యుడు పేర్కొనెను.

ద్రవ్యగుణ శాస్త్రమందు వమన, విరేచన, దీపన, సంగ్రాహక మొదలగు నవి కర్మ శబ్దముచేత గ్రహించబడినవి.

సంశోధనము, సంశమనము అను భేదముచేత కర్మను రెండు విధము లుగా విభజించవచ్చును. శరీరముపై ప్రయోగించిన ఔషధము దోష, ధాతు, మల, స్రోతస్సులపై పనిచేయును.

**శాస్త్రమునందు ఉదహరించిన కొన్ని ద్రవ్య కర్మలు**

**1. దీపనము :** జఠరాగ్నిని ప్రదీప్తము చేసెడి ద్రవ్యము దీపనీయమన బడును. ఆమమును పచనము చేయకుండా అగ్నిదీప్తి మాత్రము చేయు ద్రవ్యము దీపనీయముగా శారంగధరాచార్యులు పేర్కొనినారు. ఉదా : మిశ్రి

**2. పాచనము :** ఆమమును పచనము గావించి, అగ్నిదీప్తి చేయదో దానిని పాచనము అందురు. ఉదా : నాగకేసరము.

**3.గ్రాహి :** అగ్నిదీప్తిని కలుగజేసి ఆమపాచకముగా పనిచేసి ఉష్ణ గుణము వలన ద్రవరూప మలాదులను శోషింపచేయునది. ఉదా: శొంఠి, జీరకము.

**4.స్తంభనము** : ద్రవ్యముల యొక్క గతి, చలత్వము (రక్తం:పిత్తం మొ॥) ఆపు ద్రవ్యమును స్తంభనకరము అందురు. ఉదా : కుటజ

**5. అనులోమన :** మలములను పాకమొనర్చి బంధములను ఛేదించి అధోమార్గం ద్వారా బయటకు పంపు ద్రవ్యము. ఉదా : హారీతకి.

**6. స్రంసనము :** కోష్ఠమునందు అంటుకుని ఉన్న పచ్యమాన మలము లను పాకము చేయకుండగనే బయటకు వెడలింపచేయు దానిని స్రంసనము అందురు. ఉదా : అరగ్వద

**7. భేదనము :** పిండితరూప మలమును ద్రవరూపములో మార్చి బయ టకు వెడలింప చేయు దానిని భేదనమందురు. ఉదా: కటుకరోహిణి

**8. సంశోధనము :** మలసంచయమును (పురీషాది మలములు, దోషా దులు) స్వస్థానము నుండి విడదీసి ఊర్ధ్వ, అధో మార్గముల ద్వారా బయ టకు పంపునది. ఉదా : దేవదాలీఫలము.

**9. సంశమనము :** దోషములను వమన, విరేచనాదుల ద్వారా బయటకు పంపక, సామాన్యవస్థలో యుండెడి దోషములను ప్రకోపింపచేయక, ప్రకుపిత దోషములను మరల సమావస్థకు తీసుకువచ్చు ద్రవ్యము. ఉదా: గుడూచీ.

**10. ఛేదనము** : శరీరమునందు సంచయము చెందిన మరియు అంటుకొని ఉన్న దోషాదులను బలవంతముగా వేరు చేయునది. ఉదా: మరిచము.

**11. లేఖనము :** రసాది ధాతువులను మరియు మలములను శోషింపచేసి కృశత్వము కలుగజేయు ద్రవ్యము. ఉదా : వచా, యవ, క్షౌద్రం(తేనె).

**12. వ్యవాయి :** ముందుగా సర్వశరీరమునందు వ్యాపించి తరువాత పాకమును పొందు ద్రవ్యము. ఉదా : బంగు, అహిఫేసం.

13. వికాశి : ధాతువులనుండి ఓజస్సును విభజించి సంధి బంధములను శిధిలముచేయు ద్రవ్యమును వికాశి అందురు. ఉదా : వక్క

**14. మదకారి :** తమోగుణ ప్రధానముగ బుద్ధిని నశింపచేసి మదమును కల్గించు ద్రవ్యము. ఉదా : మధ్యం, సుధ.(సుర)

**15. అభిష్యంది :** పిచ్ఛల, గురు గుణముల వలన రసవహసిలను అడ్డగించి శరీరమునందు గురుత్వమును ఉత్పన్నము చేయు ద్రవ్యము.

ఉదా : దధి.

**16. ప్రమాథి :** వీర్యముచే స్రోతస్సులందుగల మలములను బయటకు వెడలింపచేయు ద్రవ్యము. ఉదా : మరిచము.

**17. యోగవాహి :** గుణములను విడువక దానితో కూడియున్న వస్తు గుణములను వృద్ధిపరచు ద్రవ్యము. ఉదా : మధు.

**18. జీవనీయము :** జీవితము (ఆయువు) నకు హితమైన ద్రవ్యము. ఉదా : జీవకము.

**19. బృంహణీయము :** శరీరమునకు పుష్టిని, లావును కల్గించు ద్రవ్యము. గురు, శీత, మృదు, స్నిగ్ధ, బహుల, పిచ్ఛిల; గుణములు కలిగి యుండును. ఉదా : అశ్వగంధ

**20. బల్యము :** శరీరము యొక్క బలమును వృద్ధి చేయునది బల్యము. ఉదా : శతావరీ, అశ్వగంధ, బలా.

**21. రసాయనము:** శరీరమందలి వ్యాధిని నశింపచేసి ముసలితనమును పోగొట్టునది రసాయనము. ఉదా : గుడూచీ, హరీతకీ, గుగ్గులు.

**22. వయఃస్థాపనము :** తరుణావస్థను (యవ్వనమును) స్థిరముగా ఉండునట్లు చేయు ద్రవ్యము. ఉదా : ఆమలకీ, హరీతకీ, గుడూచీ.

**23. వాజీకరణము-వృష్యము :** ద్రవ్య సేవనచే స్త్రీలయందు హర్షము, పురుషుడు అశ్వమువలె రతియందు ప్రవర్తించునో దానిని వాజీకరణము లేదా వృష్యము అందురు. ఉదా: నాగబలా, కపికచ్ఛు బీజం.

## మూలికల గుణ కర్మలు

**హరీతకీ** : కరక్కాయ త్రిదోషహరము, అనులోమనము, దీపనము, మేధ్యము, రసాయనము, చక్షుష్యము, బృంహణము, ప్రజాస్థాపనము హరీతకీ నమిలి తినిన దీపనంగాను, నూరి సేవించిన రేచనముగాను, ఉడికించి తినిన గ్రాహిగాను, వేయించి సేవించిన ఎడల త్రిదోషహరముగా పనిచేయును.

ప్ర.వా : పాండు, కామలా, అర్శస్సు, నేత్రరోగము, ప్రమేహము, కాసశ్వాస, జ్వరము.

**విభీతకీ :** తానికాయ కఫపిత్తహరము ఛేదనము, చక్షుష్యము, కేశ్యము, మదకారి (ఫలమజ్జా), చరకుడు విభీకీ రస, రక్త, మాంస, మేదోధాతుగత దోషములను హరించునదిగా పేర్కొనెను. ప్ర.వ్యా : శ్వాస, కాస, అశ్మరీ, అతిసారం.

**అమలకీ** : ఉసిరికాయ, త్రిదోషహరము, చక్షుష్యము, వృష్యము, వయః స్థాపనము, రసాయనము, ప్ర.వ్యా: ప్రమేహ, ప్రదర, జ్వర, అతిసార, కాస, కుష్ఠ.

**శుంఠీ :** ఎండించిన అల్లము వాతకఫహరము, దీపనము, భేదనము, ప్ర.వ్యా : కాస, శ్వాస, అనాహము, ఉదరము, శ్లీపదము, కామలా

**ఆర్ద్రక :** అల్లము, ప్ర.వ్యా; కాస, శ్వాస, ఆనాహము, ఉదరము, కామలా

**పిప్పలీ-పిప్పళ్ళు :** వాతశ్లేష్మహరము, దీపనము, రసాయనము, వృష్యము, కాస, ప్లీహ, ప్రవాహికా

**పిప్పలీమూలా :** పిప్పలీ తీగెయొక్క వేరు. దీనిని మోడి అందురు.

దీపన, రేచన రేచనకర్మలు గలిగియుండును. అనాహము, గుల్మము, శ్వాస, కాస, క్షయ, ప్లీహవృత్తిని మావృద్ధినివారించును. పిప్పలీ గుణకర్మలు గలిగియుండును.

**చవ్యము :** ఇది పిప్పలీ గుణకర్మలు గలిగియుండి అర్శస్సు రోగమునందు విశిష్ఠ గుణము గలిగియుండును.

**చిత్రక**–(చిత్రమూలము) వాత శ్లేష్మ హరము, దీపనము, పాచనము, గ్రాహి, రసాయనము, ప్ర.వ్యా అర్శస్సు, గ్రహణీ, అతిసారం. పాండు.
ధాన్యక (ధనియాలు) : త్రిదోషహరము, గ్రాహి, దీపనము, పాచనము, ప్ర.వ్యా, దాహ, తృష్ణా, కాస, శ్వాస, జ్వరం, చర్ది.

**అజమోద :** అజామోద విత్తులు కఫవాతహరము, దీపనము, పృష్యము, బల్యము, హృద్యము, విదాహి, ప్ర.వ్యా : శూల, హిక్కా, అధ్మానము, కృమి, ఛర్ది, వస్తిరుజ.

**జీరక :** (జీలకర్ర) కఫవాతశామకము, దీపనము, పాచనము, గ్రాహి, బల్యము, చక్షుష్యము, గర్భాశయ శుద్ధికరము, విషహరము, వృష్యము.

ప్ర.వ్యా : అరుచి, అతిసారము, గ్రహణి, శూల, అధ్మాన విషమజ్వరం

**కృష్ణజీరక :** (కృష్ణజీలకర్ర) కఫహరము, దీపనము, పాచనము, గ్రాహి, మేధ్యము, చక్షుష్యము, గర్భాశయ విశోధనము. ప్ర.వ్యా విషమజ్వరము, అతిసారము, ప్రతిశ్యాయ గుల్మము, ఛర్ది.

**హింగు :** (ఇంగువ) కఫవాతశామకము, పిత్తవర్ధకము, హృద్యము, చక్షుష్యం ఆర్తవజననము, బల్యము, ఛేదనీయము, అనులోమనము. ప్ర.వ్యా శూల, ఆర్తవరోగం. అపస్మారం, మూర్ఛా, క్రిమిదంత.

**వచా :** వస కఫవాత శామకము, మేధ్యము, లేఖనీయము. ప్ర.వ్యా. ఉన్మాద అపస్మార, కచ్చు, విచర్చికా, జ్వరం

**మేధికా :** మెంతులు వాతకఫ శమనము, దీపనము, రక్తపిత్త ప్రకోపకము. ప్ర.వ్యా ప్రమేహం, శూల, అరుచి, జ్వరము, ప్రవాహిక.

**మధుస్నుహి :** ఫిరంగి చెక్క త్రిదోషశామకము, దీపనం, మూత్ర పురీష గుహ్యాఫిరంగిరోగము, అపస్మార, ఉన్మాదము, తనువేదన, విబంధం.

**విడంగ :** వాయువిడంగము వాతకఫహరము, దీపనము, కృమిఘ్నము, విషహరము. ప్ర.వ్యా: క్రిమి కుష్ఠ, శూల, గర్భనిరోధకము

**యష్టీమధు :** అతిమధురము త్రిదోషహరము, వర్ణము కంఠ్యము, జీవనీయము, రసాయనము, వృష్యము, చక్షుష్యము. ప్ర.వ్యా రక్తపిత్తం, పరిణామశూల, దాహం, తృష్ణ.

**ఆరగ్వధ :** రేల కఫ పిత్తహరము, సంస్రసనము. ప్ర.వ్యా. కుష్ఠం, కామలా, ఆమవాత, వాత, రక్తము, జ్వరము.

**కటుకా :** కటుకరోహిణి ప్ర.వ్యా : విషజ్వరము, కామలా, కాస, శ్వాస ఉదరము. ఇది కామెర్ల వ్యాధికి మంచి ఔషధము.

**కిరాతతిక్తా :** నేలవేము కఫపిత్త శామకము, సారకము, స్తన్యశోధనము, నిద్రాహరము. ప్ర.వ్యా : సన్నిపాతజ్వరం, రక్తపిత్తము, కాస, శ్వాస, దాహం

**పర్పాటకము :** పర్పాటకము కఫపిత్తశామకం, గ్రాహి, తృష్ణా నిగ్రహణ ప్ర.వ్యా పిత్తజ్వరము, తృష్ణా, భ్రమ, అరుచి.

**ఉదీచ్య :** కురువేరు దీపన, పాచనముగా పనిచేయును.

ప్రవ్యా : అరుచి, అతిసారము, హృద్రోగము, విసర్పము.

**ఉశీర :** వట్టివేరు కఫపిత్తహరము, పాచనము, స్తంభనము

ప్ర.వ్యా : జ్వరం, రక్తపిత్తం, దాహం, తృష్టా, ఛర్ది

**జటామాంసీ :** జటామాంసీ త్రిదోషహరము, మేధ్యము, బల్యము.

ప్ర.వ్యా : ఆక్షేపకవాతం, కుష్ఠము, విసర్పము, ఇది రక్తపోటునందు బాగా పని చేయును.

**శఠీ :** కపూరకచూరీ, కఫవాతశామకము, గ్రాహి.

ప్ర.వ్యా : కాస, శ్వాస, హిక్కా ప్రతిశ్యాయము

**ప్రియంగు :** ప్రేంఖణము కఫ పిత్తహరము, పురీషసంగ్రహణీయ, మూత్ర విరజనీయ, ప్ర.వ్యా : రక్తాతిసారం, రక్తపిత్త, జ్వరం, దాహం, తృష్ణ.

**తాలీసపత్రి :** తాళీసపత్రి, కఫవాతహరం, దీపనం, హృద్యం, స్వర్యము

ప్ర.వ్యా: అరుచి, అగ్నిమాంద్య, శ్వాస,కాస, హిక్కా

**కంకోల :** తక్కోల, హృద్యముగా పనిచేయును.

ప్ర.వ్యా : అస్యదౌర్గంధ్యము, హృద్రోగము, అంధత్వము, వాతరోగము

**బిల్వ :** మారేడు వాతశ్లేష్మ హరం, దీపనం, పాచనం, గ్రాహి.

ప్ర.వ్యా: అతిసారం, గ్రహణీ, శోథ.

**కాశ్మరీ :** పెగ్గుమ్ముడు దీపనము, పాచనము, మేధ్య, ఖేటన కర్మలుగ గలిగి యుండును. తృష్ణా, శూల, అర్శస్సు, దాహ,జ్వరములను పోగొట్టును.

**పాటలా :** కలిగొట్టు త్రిదోషహరముగా పనిచేయును. అరుచి, శ్వాస, శోథ, హిక్కాహరముగా పనిచేయును.

**శ్యోనాక :** దుందిలము కఫవాతశామకం, దీపనం, గ్రాహి

ప్ర.వ్యా : అతిసారం, ఆమవాతం, కాస, శోథ

**బృహతీ :** పెద్దములక కఫవాతహరము, పాచన, గ్రాహి, హృద్యము.

ప్ర.వ్యా కాస, శ్వాస, అశ్మరీ, జ్వరం, శోథ

**కంటకారీ :** నేలవాకుడు కఫహరము దీపనం, పాచనం, శుక్రరేచకం, మూత్రలం అశ్మరీ బేధనం. ప్ర.వ్యా : కాస, శ్వాస, హిక్కా, అశ్మరీ, మూత్ర కృచ్ఛ్రము.

**గోక్షుర :** పల్లేరు వాతపిత్తశామకము దీపనం, హృద్రోగము, వస్తిశోధనం, రసాయనము. ప్ర.వ్యా : అశ్మరీ ప్రమేహ, మూత్రకృచ్ఛ్రము.

**పృశ్నిపర్ణి :** ముయ్యాకు పొన్న త్రిదోషహరము, వృష్యము, గ్రాహి.

ప్ర.వ్యా : అతిసారం, కాస, శ్వాస, శోధ

**శాలపర్ణి :** కోలపొన్న త్రిదోషహరం, బల్యం, వృష్యం, బృంహణం, రసాయం. ప్ర.వ్యా : శోథ, అతిసారం, కాస, శ్వాస, మూఢగర్భం

**వాసా :** అడ్డసరం కఫపిత్తహరం, స్వర్యము, హృద్యం

ప్ర.వ్యా : శ్వాస, కాస, రక్తపిత్తం, జ్వరం, క్షయ

**ధత్తూర :** ఉమ్మెత్త కఫవాత శామకం, విషఘ్నం.

ప్ర.వ్యా : శ్లీపదం, ఇంద్రలుప్తం, కాస, శ్వాస

**కరవీర :** తెల్ల (ఎర్ర) గన్నేరు, కఫవాతశామకం, కుష్ఠఘ్నం, వ్రణశోధ నం, వ్రణరోపనం, చక్షుష్యం.

ప్ర.వ్యా: కుష్ఠం, అశ్మరీ, ఉపదంశం, ఇంద్రలుప్తం, పాలిత్యం

**ఏరండ :** ఆముదము, కఫవాత శామకము, రేచనం, త్వచ్యం, వృష్యం.

ప్రవ్యా : గుల్మం, ఆనాహ, కటిశూల, ఆమవాతం,ఉదరం

**శిగ్రు :** మునగ కఫవాత శామకం, చక్షుష్యం, హృద్యం, శుక్రలం, గ్రాహి, దీపనం, విదాహికర.ప్ర.వ్యా క్రిమి, కండు, శిరఃశూల, అశ్మరీ.

**హరేణుకం** : దీపన, మేధ్య వాచన, గర్భవాతస కర్మలు గల్గియుండును.

ప్ర.వ్యా : తృష్ణా, కండూ

**నిర్గుండి :** వావిలి, కేశ్యం, చక్షుష్యం, ప్ర.వా.ఆమవాతం, గృధ్రసీవాతం, క్రిమి, కుష్టం

**శారిబా :** సుగంధిపాల త్రిదోషహరం,గ్రాహి

ప్ర.వ్యా : వ్రణ,శ్వాస, కాస, క్రిమిదంతం, అతిసారం

**భృంగరాజ :** గుంటగలగర కఫవాతహరం, బల్యం,రసాయనం, కేశ్యం, చక్షుష్యం. ప్ర.వ్యా : కాస, శ్వాస, ఆమ్లపిత్తం, అతిసారం, కుష్ఠము.

**భూమ్యామలకీ :** నేల ఉసిరి కఫపిత్తశామకం, రేచనం.

ప్ర.వ్యా : పాండు, కామలా, కాస,శ్వాస,ప్రమేహము, కామెర్లు లందు బాగాపనిచేస్తుంది.

**త్రివృత్ :** తెగడ కఫపిత్తహరం, రేచనం

ప్ర.వ్యా : పాండు, కామలా, శోథ, ఉదరం, అర్శస్సు

**అర్జున :** తెల్లమద్ది, కఫపిత్తహరం, హృద్యం, ఉదర్ధప్రశమనం, వ్రణ శోధనం, రసాయనము.

ప్ర.వ్యా : హృద్రోగం, రక్తపిత్తం, రక్తాతిసారం, ప్రమేహం, క్షయజకాస, కాండభగ్నము. ఇది గుండె జబ్బులకు దివ్యౌషధము.

**దంతీ :** కఫహరం, దీపనం, రేచనం.

ప్ర.వ్యా : కుష్ఠం, కండు, ఉదరం, శోథ, అర్శస్సు

**ఖదిర :** చండ్ర కఫవాతహరం, దీపం, పాచనం.

ప్ర.వ్యా : గుల్మం, ప్లీహం, ఉదరం, క్రిమి, వ్రణం, అన్ని చర్మవ్యాధు లందు బాగా పనిచేస్తుంది.

**అశోక :** అశోక పిత్తహరం, గ్రాహి, వర్ణం, హృద్యం

ప్ర.వ్యా : రక్తప్రదరము, దాహం,తృష్ణా, స్త్రీలకు వచ్చు తెల్లబట్ట ఎర్ర బట్టలందు బాగా పనిచేస్తుంది.

**గుడూచీ :** తిప్పతీగె త్రిదోషహరం, రసాయనం, గ్రాహి, దీపనీయం, మేధ్యం.

ప్ర.వ్యా : జ్వరం, పాండు, కామలా, దాహం, తృష్ణా, వాతరక్త, ఆమవాత

**మాషపర్ణి :** కారుమినుము వాతపిత్త హరం, శుక్రజననం, జీవనీయం బల్యం. ప్ర.వ్యా : జ్వరం, శోథ, గ్రహణీ

**కుటజ :** కఫపిత్తహరం, దీపనం, గ్రాహి, ప్ర.వ్యా : రక్తార్శస్సు, రక్తాతీసారం, అశ్మరీ, మూత్రకృచ్ఛ్రం, అమీబియాసిస్, రక్తంకారే మొలల వ్యాధులందు బాగా పనిచేయును.

**కపికచ్ఛూ :** వాతపిత్తహరం, బల్యం, బృంహణం, వాజీకరణ, మూత్రలం, స్తన్యజననం. ప్ర.వ్యా : వాతవ్యాధి, క్రిమి, కష్టార్తవము, రక్తపిత్తం.

**చంగల్వకోష్ఠ :** చంగల్వకోష్ఠ వాతహరం, శుక్రలము, లేఖనీయము, ప్ర.వ్యా : ఉన్మాద, అపస్మార, కాస, శ్వాస, హిక్కా, కుష్ఠ

**పాషాణభేద :** కొండపిండిచెట్టు

ప్ర.వా: అశ్మరీ, మూత్రకృచ్ఛ్రము, ప్రమేహం, యోనిరోగం, మూత్రంలోని రాళ్ళు కరగించుటకు దివ్యౌషదము.

## భస్మాలు వాటి రంగులు, పరీక్షలు

జ్వాలా పరీక్ష (లోహాలకు)

| | | | |
|---|---|---|---|
| 1. | స్వర్ణం | – | పసుపు రంగుజ్వాల |
| 2. | రజితం | – | శ్వేత |
| 3. | తామ్ర | – | నీలం |
| 4. | తీక్ష్ణలోహం | – | కృష్ణవర్ణ |
| 5. | వంగం | – | కపోత |
| 6. | నాగం | – | ధూమ |
| 7. | శిలాజిత్ | – | ధూమ |
| 8. | లోహం | – | కపిల |
| 9. | అయస్కాంత | – | ధూమ్ర |
| 10. | తుత్తం | – | లోహిత |
| 11. | వజ్రం | – | వివిధ వర్ణాలు |
| 12. | అభ్రక సత్వం | – | పాండు, పీతవర్ణాలు |
| 13. | సుద | – | రక్తవర్ణం |
| 14. | సర్జిక్షారం | – | పీత |
| 15. | యవాక్షారం | – | యశదనీలవర్ణం |
| 16. | ఖర్పర | – | నీల |

**కజ్జలి పరీక్షలు :**

1.ఖజ్జలబాస 2 సలక్షణ 3 అంజన సదృశ లక్షణ 4. రేఖాపూర్ణత 5 నిశ్చంద్రిక 6 జలపరీక్ష 7 లోహపరిక్ష 8 అగ్నిపరీక్ష

## భస్మాలు-వాటి సాధారణ రంగులు

1. రసం (పాదరసం) – శ్వేత, రక్త, పీత, కృష్ణ
2. స్వర్ణం – శ్వేత, రక్త, కృష్ణ, సంపెంగ
3. రజత – శ్వేత, రక్త
4. తామ్ర – నీల, హరిత, శ్వేత, కృష్ణ
5. వంగం – శ్వేత, యశద్ పీత
6. నాగం – శ్వేత, రక్త, కృష్ణ
7. యశదం – శ్వేత
8. లోహం – కృష్ణ, రక్త
9. అభ్రక – శ్వేత, రక్త సింధూరం
10. మాక్షిక – రక్త
11. వైక్రాంత – శ్వేత
12. విమల – శ్వేత
13. శిలాజిత్ – కృష్ణ
14. కర్పూర శిలాజిత్ – శ్వేత
15. తుత్త – శ్వేత, రక్త, సింధూరం
16. చపల – శ్వేత
17. కర్పూర– పీత, శ్వేత
18. రజితమాక్షికం – కృష్ణ, రక్త కృష్ణ
19. గంధక – పీత, శ్వేత, రక్త, కృష్ణ
20. గైరిక– రక్త
21. కాసీసం – రక్త, శ్వేత
22. హరితాళం– శ్వేత, పీత, రక్త
23. మనశ్శిల – శ్వేత, పీత, రక్త
24. స్రోతాంజనం – శ్వేత

25. నీలాంజనం – రక్త, శ్వేత
26. కాంక్షి – శ్వేత
27. గౌరిపాషాణం – శ్వేత
28. నవాసారం – శ్వేత
29. కపర్ధిక – శ్వేత
30. గిరి సింధూరం – రక్త
31. హింగుల – శ్వేత, రక్తభ
32. మృదారుశింగు – రక్తభ, కృష్ణ
33. మాణిక్యం – శ్వేత
34. వైక్రాంతం – శ్వేత
35. సూర్యకాంత – శ్వేత (ఎరుపు)
36. వజ్ర – శ్వేత
37. ముక్తా – శ్వేత
38. చంద్రకాంత – శ్వేత
39. రాజావర్తము – కృష్ణాభ
40. గరుడ – కృష్ణాభ
41. పుష్యరాగం – శ్వేత
42. మహానీలం – శ్వేత
43. పద్మరాగం – శ్వేత, రక్తభ
44. ప్రవాళం – శ్వేత
45. వైడూర్యం – శ్వేత
46. నీలమణి – శ్వేత
47. గోమేధికం – శ్వేత

పైవి ఏమీ కలపకుండా కేవలం మూలికలలో 1 లేదా 2 పుటాలు వేసినపుడు కనిపించే రంగులు. వీటిలో ఏదైనా ధాతువులు కలసినచో రంగు మార్పు కాగలదు. కావున గమనించగలరు.

# భస్మాలు - వాటి వర్ణరూప రస గంధాధులు

| భస్మం | వర్ణం/రూపం | స్పర్శ | గంధ | రసము |
|---|---|---|---|---|
| అభ్రకం | అరుణ,నిశ్చంద్రిక శ్వేతం,పద్మరాగ | క్షార, స్నిగ్ధ | లోహ గంధ | కషాయరసం |
| హరితాళం | శ్వేత | రూక్ష,క్షార | కణ్వాయి | కటు |
| మనశిల | శ్వేత | రూక్ష | నిర్గంధ | విరసం |
| స్వర్ణమాక్షికం | అరుణప్రభ | రూక్ష | మృత్తికా | కషాయ,స్వాధు |
| రౌప్యమాక్షికం | అరుణప్రభ | రూక్ష | మృత్తికా | కషాయ,స్వాధు |
| ఖర్పర | పీత,గులాబి | మస్రుణ | నిర్గంధ | కషాయ |
| తుత్త | శ్వేత | లఘు,చిక్కణ | నిర్గంధ | కషాయ,క్షార |
| కర్పూర | శ్వేత | స్నిగ్ధ | నిర్గంధ | కటు,తిక్త |
| గోమూత్ర | క్రిష్ణ | స్నిగ్ధ | గోమూత్ర | కటు,తిక్త |
| ప్రవాళ | శ్వేత | క్షార | సుధావత్ | కటు |
| మౌక్తిక | శ్వేత | మశ్రుణ | నిర్గంధ | యశదకటు |
| శంఖ | శ్వేత | రూక్ష | సుధావత్ | కటు |
| కపర్థ | శ్వేత | రూక్ష | సుధావత్ | కటు |
| శుక్తి | శ్వేత | రూక్ష | సుధావత్ | కటు |
| వజ్ర | శ్వేత | రూక్ష | సుధావత్ | సాధురహిత |
| వైదూర్య | పీతభ,శ్వేత | రూక్ష | సుధావత్ | ఆమ్ల |
| గోమేధ | శ్వేత | రూక్ష | సుధావత్ | ఆమ్ల |
| ఇంద్రనీల | శ్వేత | రూక్ష | సుధావత్ | తిక్త |
| మరకత | శ్వేత | రూక్ష | సుధావత్ | మధుర |
| సువర్ణ | రక్త,శ్వేత | చిక్కన | నిర్గంధ | కషాయ,తిక్త,స్వాదు |
| రజిత | శ్వేత,రక్త | మస్రుణ | నిర్గంధ | స్వాదు,కషాయ |
| తామ్ర(మారిత) | శ్వేత,కృష్ణ,నీల | రూక్ష | తుత్తవత్ | కషాయ |
| తామ్ర(జారిత) | నీల | మృదు | ఆమ్ల | |
| కషాయ,మధుర,తిక్త | | | | |
| లోహ | అరుణప్రభ | రూక్ష | లోహ | మధుర,కషాయ |
| వంగ | శ్వేత,యశద్‌పీత గులాబి,ఖటికప్రభ | రూక్ష | నిర్గంధ | కషాయ |
| నాగ | పీత,శ్వేత | రూక్ష | నిర్గంధ | కషాయ,తిక్త |
| యశద | పీత,శ్వేత | మస్రుణ | నిర్గంధ | కషాయ,తిక్త |
| రసం | శ్వేత,రక్త,పీత,కృష్ణ | – | – | – |

## రోగాలు- లక్షణాలు- చికిత్సలు- ఔషధాలు-పత్యాపథ్యాలు

## అగ్నిమాంద్యము (అజీర్ణము)

జఠరాగ్ని మందగించుట వలన జీర్ణశక్తి మందగించి ఆహార పాచనము చేయుశక్తి కోల్పోవుటను అగ్నిమాంద్యము అంటారు. పదమూడు రకముల అగ్నులలో జఠరాగ్ని అత్యంత ముఖ్యమైనది. దీని ప్రభావము వల్ల ఇతర అగ్నులు దూషించబడతాయి. కావున చికిత్స అవసరము.

**లక్షణాలు :** అజీర్ణము, ఆకలి తక్కువగా వుండుట, వైరస్యము, లాలా జలము ఊరుట, పులుపు త్రేన్పులు వచ్చుట, కడుపు భారముగా ఉండుట ఇవి అజీర్ణ లక్షణాలు.

**చికిత్స :** అగ్నిమాంద్య చికిత్సలో వాడబడు ఔషధములు అగ్నిని పెంచి దూషితకఫమును తగ్గించు గుణమును కల్గి ఉండవలెను.

**ఔషధయోగములు :** లవణభాస్కర చూర్ణం, హింగ్వాష్టక చూర్ణం, పాచనలవణం, అజమోదాది చూర్ణం, తేకరాజమరీచ చూర్ణం, శివక్షార పాచనచూర్ణం, అగ్నితుండివటి, శంఖవటి, రసోనాదివటి, చిత్రకాదివటి, ఉశీరాది చూర్ణము.

## అగ్నిమాంద్యం

అగ్నిమాంద్యము అనగా అగ్ని మందగించుట

మిథ్యాహార విహారాదులవల్ల కలుగు దోష ప్రకోపముచే జఠరాగ్ని మందగించును.

**చికిత్స :** 1 చిత్రకాది చూర్ణం 2 లవంగాది వటి 3 లవంగాది మోదకం

**చూర్ణం :** బృహదగ్నిముఖ (బా.ప్ర), హింగ్వాష్టక (యో.ర), వైశ్వనరక్షార (బా.ప్ర), సమశర్కర (బా.ప్ర) , బడకానల (బా.ప్ర), దహనాది (బా.ప్ర).

**గుటిక / వటి :** 1 ధనుంజయవటి (యో.ర) 2. చిత్రకాది గుటిక (భై.ర) 3 గుడాష్టక (బై.ర) 4 చిత్రగుడ (బై.ర) 5 హరితక్యాయోగ (బా.ప్ర)

**అవలేహ :** 1 విడంగాద్యవలేహ

**ఘృతము :** అగ్నిఘృతం (బై.ర), బృహదగ్ని ఘృతం (బై.ర), అగ్నికర ఘృతం (యో.ర), దశమూల ఘృత (యో.ర).

**రసౌషధాలు :** హుతశనరస (యో.ర), మహొదదివటి (బై.ర), అగ్ని

సందీపనరస (బై.ర), పంచామృతవటి (బై.ర), వజ్రాక్షర (బై.ర), జ్వాలానంరస (బా.ప్ర), అగ్నితుండివటి (శా.సం), రామబాణరస (బా.ప్ర), టంకణాదివటి (బై.ర), మహాశంఖవటి(బై.ర), క్షుదిసాగరరస (బై.ర), అగ్నికుమార రస(భా.ప్ర)

## అగ్నిమాంద్యము (గాలి,నీరువల్ల కలిగిన)

**లక్షణములు :** వర్షాకాలమున వాతావరణములో అధిక తేమ నీటిలోని ఆమ్ల విపాకము వలన ఆకలిమందగించును. దీనినే జలవాయు దోషజన్య అగ్నిమాంద్యము అంటారు.

**పథ్యము :** తేలికైన ఆహారము, విలేపి, పెసరకట్టు, మజ్జిగ, వేడినీరు, అల్లము, ఇంగువ, త్రికటులు, పులిచింతాకు, వాస్తుక, ముల్లంగి, పొట్లకాయ, మునగకాయ, కాకరకాయ, దానిమ్మ మరియు నిమ్మకాయ

**అపథ్యము :** గురు పదార్ధములు ,రూక్ష పదార్థములు, చల్లనినీరు, దూషిత జలం.

## అగ్ని దగ్ధము (వొళ్ళు కాలుట)

అతి ఉష్ణ సంపర్కమువల్ల కాలిన గాయములు అగ్ని దగ్ధము.

**చికిత్స :** ఒకవేళ రోగికి సాధారణము కన్నా శరీర ఉష్ణోగ్రత నాడి అనిమియతముగా ఉండుట శ్వాస అల్పముగ ఉండి దీర్ఘ నిశ్వాస యుక్తముగ ఉండి రక్తభారము తక్కువగా ఉన్న రోగిని ఆసుపత్రికి తీసుకుపోవాలి. కాలిన గాయములపై చల్లని / వేడి నీరు పోయరాదు.

ఔషధ యోగములు : 1. అగస్త్యాది లేపము 2. టంకణ మలహరము

**పథ్యములు :** తేలికగా జీర్ణమయ్యే పదార్థములు, ద్రవ ఆహారము, నెయ్యితో కూడిన భోజనము, కాలిన భాగములకు విశ్రాంతి ఇవ్వాలి.

**అపథ్యము :** కాలిన గాయములు గల రోగికి గురు, మధుర, రసద్రవ్య ములు, ఆమ్లరస ద్రవ్యములు/ఆహారము, పెరుగు, మిరపకాయ హానికర ములు. స్నానము పరిస్థితిని అనుసరించి చేయించాలి.

## అజీర్ణము

కొన్ని శారీరక కారణముల వలన మరియు అధిక, ఆహార జలసేవన వలన, ఆహారము,నిద్ర పద్ధతిగా లేకపోవుట వలన మానసిక కారణములైన ఈర్ష్య, క్రోధముల వల్ల జఠరాగ్ని మందగించి తేలికగా జీర్ణమగు పదార్థ

ములు కూడా జీర్ణము కాకపోవుటను అజీర్ణం అందురు.

**లక్షణాలు :** విపరీతమైన అలసట, శరీరము భారముగా ఉండుట, ఆపాన వాయువు అవరోధము, మలావరోధము, ద్రవమల ప్రవృత్తి అజీర్ణ సామాన్య లక్షణములు.

**చికిత్సౌషధాలు :** అగ్నిముఖచూర్ణం, హింగ్వాష్టక చూర్ణం, తేక రాజమరీచ చూర్ణం, శంఖభస్మం, కపర్ధిక భస్మం, ప్రవాలభస్మం, అగ్నితుండి వటి, లశునాదివటి, శంఖవటి.

## **అజీర్ణము** (Dyspesia)

జీర్ణానికి విరుద్ధమైనది అజీర్ణము.

ఆహారం సుఖంగా పక్వము కాకుండుట అజీర్ణం.

అజీర్ణ బేధాలు : 1 ఆమాజీర్ణ 2. విదగ్ధాజీర్ణ 3. విష్టబ్ధజీర్ణ 4. రసశేష జీర్ణ 5. దినపాకీ జీర్ణం 6. ప్రకృత్యా జీర్ణం.

**చికిత్స–చూర్ణం :**

1. బడబానల చూర్ణం – బడవాముఖ చూర్ణం ( బై.ర.)
2. పథ్యాది చూర్ణం (యో.ర) లఘువైశ్వానర చూర్ణం (యో.ర)
3. హింగ్వష్టక చూర్ణం, సాముద్రాది చూర్ణం, (యో.ర)
4. ఆర్ద్రక కల్పము హపుషాది చూర్ణం (శా.సం)
5. భాస్కర లవణం (భా.ప్ర)

**లేహ్యం :** గుడాష్టకము, విడంగద్యావలేహ్యం, త్రివృతాది మోదకం, అజీర్ణ కంటరసము.

**వటి :** సంజీవని గుటిక (యోగ), గుడ పిప్పలి, (శా.స) క్షారగుడం (బై.ర),హరితక్యాదియోగ (బై.ర) ,అమృతాదివటి, టంకణాదివటి, గంధగాదివటి లవంగాదివటి (బై.ర), అమృతకల్పవటి (బై.ర)

**క్వాథ :** లవణ పథ్యాక్వాథము (యో.ర), ధాన్యనాగర క్వాథము (బా.ప్ర)

**రసౌషధములు :** క్రవ్యాదరస (బా.ప్ర), పాశుపతరస (యో.ర), అజీర్ణ కంటరస (బా.ప్ర), అగ్నిరస (బై.ర), అజీర్ణాదిరస (బై.ర), రసరాక్షస(బై.ర) అజీర్ణహరరస (యో.ర),ఆదిత్యరస (యో.ర), శంఖవటి (బా.ప్ర), క్షారాది యోగ (యో.ర), సుకుమారమోదక (బై.ర), మహోదదిరసం, చింతామణి రసం,అగ్నికుమార రసం, హుతాసనరసం, ఆధిత్యరసం, క్షుద్రసాగర రసం.

**ఆమజీర్ణ చికిత్స :** 1 ధాన్యాది క్వాథము 2. గుడాది యోగము

**విదగ్ధాజీర్ణ చికిత్స :** ద్రాక్షద్యవలేహము, అభయాద్యవచ లేహము, అభయవలేహము, హరితాక్యాధి యోగము.

**విష్టబ్ధాజీర్ణ చికిత్స :** 1. సుకుమార మోదకం 2. అగ్నిముఖలవణం

**పథ్యములు :** వ్యాయామము, దీపనం, శాకాదికములు దీర్ఘకాలమునకు ఫలించెడి పెసలు, ఎర్రబియ్యం, పేలాల మండము, పెసలమండము, జింక, నెమలి, లావకపక్షి, సన్నజాతి మత్స్యములు అనువాని మాంసము. గొలుగు కూర, వెదురుకొమ్ము, చక్రవర్తిపు కూర, లేత ముల్లంగి గడ్డలు, వెల్లులి, పండిన గుమ్మడికాయ, అరటికాయ, మునగకాయ, పొట్లకాయ, వంకాయ, నక్కదోసకాయ, కాకరకాయ, అల్లము, గొంతెమగోరు కూర, పులిచింత సువిషణ్ణకము, ఉసిరికాయ, శొంఠి, దాడిమ, యవలు, పర్పాటకము, పుల్లప్రబలి,నిమ్మపండు, తేనె, వెన్న, నెయ్యి, మజ్జిగ, రేగుపండు, కలికూటినీళ్ళు, కారము,నూనె, ఇంగువ, లవణం, ఓమము, మిరియాలు, మెంతులు, కొత్తిమీర, జీలకర్ర, పెరుగు, తాంబూలం, కాచిన నీరు, చేదు ఒగరు కల రసములు ఇవి అగ్నిమాంద్యం (అజీర్ణం )అనువాని యందు పథ్యకరములు.

**అపథ్యము :** రేచనం, మల, మూత్ర ఆపానవాతముల బంధించుట అధికముగ భుజించుట, జాగరణము, విషమాశనము, రక్తస్రావము, శింబి ధాన్యము ,మత్స్య మాసంము బచ్చలికూర, జలపానము, సెనగలు, మొద లగు కడుపు నుబ్బించెడి పదార్ధములు, నేరేడు, కలవదుంపలు మొదలగు అన్ని దుంపలు ఈనిన నేడు దినములకు పిదప పితకబడిన ఆవుపాలు, విరుగుడు జున్ను దుష్టమైన నీరు, విరుద్ధమైన అసాత్మ్యకమైన అన్నపానములు మలబద్దకం ద్రవ్యములు, జడపదార్ధములు.

## అతిసారము (విరేచనములు)

అతిసార రోగమున రోగి ద్రవ పురీషములను అనేకమార్లు విసర్జించును.

**ఔషధయోగములు :** 1. భువనేశ్వర రసము 2. రామబాణ రసము

**పథ్యము :** లఘుభోజనము, శొంఠితో సిద్ధము చేయబడిన పెసరకట్టు.

**పక్వాతిసారము :** 1. కర్పూరవటి 2. లాజాచూర్ణం.

**జీర్ణాతిసారము :** పరిస్థితిని అనుసరించి నిర్ణయించుకోవాలి.

**రక్తాతిసారము** (నెత్తురువిరేచనములు) : కుటజ ఘనవటి

**ఆంత్రశోధజ అతిసారము :** బిల్వాదివటి, కుటజఘనవటి

**జ్వరాతిసారము :** చతుభద్ర చూర్ణం, దశమూల క్వాథము, బద్ధ ప్రాణేశ్వర రసము, ఆనంద భైరవీరసం, రామబాణ రసం, సంజీవణివటి.

## అంతరిక విద్రధి (కడుపులో పుండు)

శరీర అంతర్గత భాగములో పుట్టిన గడ్డను అంతరిక విద్రధి అంటారు.

**లక్షణాలు :** విపరీతమైననొప్పి, వాపు ప్రభావితమైన భాగముల అంగముల యొక్క బాహ్యద్వారము నుండి చీముకారుట మరియు వాటి యొక్క పనితీరులో మార్పులు కల్గును.

ఉదా : 1. గుద విద్రది – గుదభాగములో ఆపానవాయు అవరోధం కల్గును.

2. వస్తి విద్రది (మూత్రాశయంలో గడ్డ): కుంచెం కుంచెంగా మూత్రం అగును. కష్టముగా మూత్రం వెలువడును.

3. నాభి విద్రది – ఎక్కిళ్ళు మరియు కడుపుబ్బరం కల్గును.

4. కుక్షి విద్రది – వీపునొప్పి, తుంటినొప్పి క్రియాహీనతను కలిగించును.

5. వృక్కవిద్రది – పార్శ్వమందు కాఠిన్యతను కలిగించును.

6. ప్లీహ విద్రది – శ్వాసయొక్క అవరోధము కలిగించును.

7. యకృత్ విద్రది – శ్వాసయొక్క అవరోధము కలిగించును.

**యోగాలు :** జాత్యాది ఘృతము, వరుణాది ఘృతము, కాంచనార గుగ్గులు, త్రిఫలాగుగ్గులు, కజ్జలి.

**పథ్యము :** పాతవరిబియ్యం, పెసరకట్టు, వెల్లుల్లి, నెయ్యి, నూనె, ఉలవలు, మునగకాయ మరియు ఆకులు, కాకరకాయ, పొట్లకాయ, పునర్ణవా పత్రములు లాభదాయకములు.

**అపథ్యం :** ఉప్పు, కారం మొదలైనవి పులుపు, పిండి పదార్థములు, నువ్వులు, మినుములు, బెల్లం మరియు పెరుగు వాడరాదు.

## అంత్ర విద్రధి (హెర్నియా)

చిన్నప్రేవులు పొట్టనుండి వేరొక ప్రాంతములోనికి చొచ్చుకుని వచ్చుటను అంత్రవృద్ధి అంటారు. సామాన్యముగా మగవారిలో వంక్షిణ నలిక

ద్వారా ఇది బయటకు వచ్చి వృషణ కోశములోనికి వచ్చును మరియు స్త్రీల యందు వంక్షిణ తంతు (లిగమెంట్) యొక్క క్రింది ప్రాంతము నందు వాపు కలుగును. ఈ వాపులోనికి నొక్కినచో తగ్గి, మళ్ళీ చేయ తీయగానే తిరిగి వాపు కలుగును.

**పథ్యం :** తేలిక ఆహారములు, పాతబియ్యం, పెసరకట్టు, వెల్లుల్లి, కాకరకాయ, నిమ్మశర్బత్ మంచిది.

**అపథ్యం :** చేదు,కారం,వగరు, పొడిగా ఉండునవి, నువ్వులు పప్పు ధాన్యములు గురుగుణము కలవి హానిని కల్గించును.

## ఆంత్ర పృచ్ఛ ప్రదాహ (అపెండిసయిటీస్)

అంత్ర పుచ్ఛ శోధ అంత్రపుచ్ఛ ప్రదాహ మందురు.

**లక్షణం :** అకస్మాత్తుగా కడుపులోనొప్పి, కడుపులో మంట బొడ్డుచుట్టు కడుపునొప్పితో గట్టిపడుట, వాంతిరావటం, జ్వరము, కడుపుయొక్క కుడి వైపునందు ముట్టుకుంటే నొప్పి గట్టిదనము అంత్రపుచ్ఛ ప్రదాహము లక్షణాలు.

**యోగం :** వైద్యుని పర్యవేక్షణ అవసరం. శూలహరి, శూలకుఠారం పనిచేయును.

## **అతిసారము** (Diarrhoea)

అతిగా స్రవించుట

భేదములు –6; 1. వాతం 2. పిత్తజము 3. కఫము 4. త్రిదోషజం 5. శోకజము 6. ఆమ్లజము 7. భయాతిసారము.

**చికిత్స :** (స్వరస/ క్వాథ)

1. ధాన్యాది పంచకక్వాథ (బా.ప్ర)
2. ధాన్యాది చతుష్కక్వాథ (బా.ప్ర)
3. కుటజ పుటపాక స్వరస(బా.ప్ర)
4. జంబ్వాది స్వరస (బా.ప్ర)
5. గంగాధర క్వాథ (బా.ప్ర)
6. పాఠాది క్వాథ (బై.ర)
7. విడంగాది క్వాథ (బై.ర)
8. కుటజాష్టర క్వాథ (యో.ర)

**గ్రహిణి వటకములు**: ఆనందరసం, కనకసుందర రసం, ఆనందభైరవిరసం, అరళుపుటపాకం, దాడిమపుటపాకం, న్యాగ్రోధాది పుటపాకం,

**చూర్ణ / కల్క :** 1. కపిత్థాది చూర్ణ (చ.చి) 2. వృద్ధా గంగాధరచూర్ణ (బా.ప్ర) 3. బిల్వాది చూర్ణ (బై.ర) 4. గంగాధరచూర్ణం (బా.ప్ర) 5. హింగ్వాది చూర్ణ (బా.ప్ర) 6. నారాయణచూర్ణం (బై.ర) 7. చందనకల్క (బా.ప్ర) 8. కృష్ణ మృదాది కల్క (బా.ప్ర)

**అవలేహ :** 1. కుటజాష్టకవలేహ (బా.ప్ర) 2. గుడబిల్వం (బా.ప్ర) 3. నవనీత వలేహం (బా.ప్ర) 4. కుటజీవలేహము (బా.ప్ర)

**గుటిక :** 1. చుతుస్సమ మోదుక (బా.ప్ర) 2. అంకోల వటుక (బా.ప్ర) 3. అభయాది గుటిక (యో.ర)

**ఘృతం :** చవ్యాది ఘృతం (చ.చి )2. దూర్వాది ఘృతం (చ చి) 15, బిల్వాది తైలం (బా.ప్ర).

**అసవ /అరిష్ట** :బబ్బులాద్యరిష్ట(బై.ర), కుటజారిష్ట (బై.ర), ఆహిఫేనాసవ (బైర)

**రసౌషధములు :** లోకనాధరస (బై.ర), ఆనందభైరవిరసం, కర్పూర రసం, కణాదిలోహ, కనక సుందర రసం, దాడిమపుటపాకం.

**పథ్యము :** పొట్లకాయ, కొడిసెకాయి, జాజికాయి, పులిచింత, అరటి పండు, మారేడుకాయి, మేకపెరుగు, తెల్లావనూనె, పెద్దమ్రాను, చక్ర వర్తికూర,నిద్రకానుగ చిగుళ్ళు, వెలగపండు, కందికట్టు, అరటిపువ్వు, ఇవి గ్రహణ్యాది అతిసారములందు హితకరములని.

**అపథ్యములు :** నువ్వులు, అనుములు, గుమ్మడుకాయ, అకాకర కాయ, బచ్చలికూర, అనుగవుకాయ, కందగడ్డ, పిండివంటకములు, మాంసము, కల్లు, బెల్లము, శీతకర వస్తువులు, పులుసు మిక్కుటముగ నీరుత్రాగుట, తాంబూలము, స్నానము, జాగరణము, స్త్రీ సంగమము కోపము, జడకర పదార్థములు వీనిని గ్రహణ్యాతి సారములు యందు వర్జింపవలెను.

## అపస్మారము (సొమ్మరోగము)

అపస్మారము వేగముతో వచ్చును. బుద్ధి వికృతి కారణముచేత రోగి తన జ్ఞాపకశక్తి మరియు తెలివిని కొద్దిసేపటి వరకూ కోల్పోవును.

**లక్షణములు :** మధ్యవయస్సులో వచ్చును. కన్నులలో వికృతి కల్గి జొల్లు కార్చును,కంపము, కాళ్ళు చేతులలో మంట, కొద్దిసేపు ఉండి తరువాత తెలివి వచ్చును. రోగి పడుకుని లేచినట్లుగా భావన కల్గును.

**ఔషధ యోగాలు :** సారస్వత చూర్ణం, దశమూల క్వాథము, జటామాంస్యాది క్వాథము, వచాబ్రాహ్మీయోగము, బ్రహ్మీవటి, స్వల్ప పంచగవ్య ఘృతము, బ్రాహ్మీ ఘృతము, అశ్వగంధారిష్టా, దశమూలారిష్టా, సారస్వాతారిష్టా.

**పథ్యములు :** గోధుమలు, పెసలు, వరిబియ్యం, పాలు, నెయ్యి, బ్రాహ్మి, పటోల, తోటకూర.

**అపథ్యములు :** మద్యము, ఉష్ణ ఆహారము, విరుద్ధాహారము, ప్రాకృతిక వేగములను ధారణచేయుట మరియు అశుచిగా ఉన్న స్థలములందు నివసించుట వర్జితము రోగిని బావి,చెరువు మొదలగు ప్రదేశాల యందు అగ్ని దగ్గర, కొండల వద్ద ఉంచరాదు.

## అపస్మారము (కాకిచమ్మలు)

బేధములు : 1. వాతము 2. పిత్తము 3. శ్లేష్మ 4. సన్నిపాతము

**చికిత్స :** బ్రాహ్మీఘృతం, హింగ్వాది ఘృతం, చండభైరవ రసము, అపస్మారక గజాంకుశము.

**పథ్యము :** పొన్నగంటికూర, నెమలిజుట్టాకు, రాజనాలబియ్యము, గోధుమలు, పెసరకట్టు, నెయ్యి, దానిమపండు, ద్రాక్షపండు, ఉసిరికాయ, పొట్లకాయ, గుమ్మడికాయ, చిట్టికూర, చక్రవర్తికూర, వెలగపండు, చిత్తవిభ్రమము, బెండకాయ, ఉడుము, ముంగిస.

**అపథ్యము :** మద్యము, విరుద్ధాన్నం, ఉష్ణకర భోజనం, నిద్ర, ఆకలి, దప్పి, తుమ్ములు, మలమూత్రవేగం, వినిఅడ్డగించుట, చేదు తీక్షణంగల ద్రవ్యము సేవించుట.

**చికిత్స :** బ్రహ్మీఘృతం, హింగ్వాది ఘృతం, చండభైరవరసం.

## ఆమ్లపిత్తము (పులిత్రేన్పులు)

ఆమాశయమునందు ఆమ్లము యొక్క శాతము అధికమగుట వలన గొంతు మరియు హృదయ క్షేత్రమందు మంట కల్గును.

**లక్షణాలు :** పుల్లని త్రేన్పులు, చేదుత్రేన్పులు, గొంతు మరియు హృదయ

మునందు మంట, నోట్లో నీరూరుట, ఆకలితగ్గుట, అజీర్ణం, అలసట, శరీరంబరువుగా ఉండుట, ఆమ్లపిత్తము యొక్క లక్షణాలు.

**యోగాలు :** అవిపత్తికరచూర్ణం, దశమూల క్వాథము, ధాత్రీలోహం, కామదుధారసం, లీలావిలాస రసం, సూతశేఖర రసం, శంఖభస్మము, క్షార రాజ, నారికేళ ఖండము, ఆమ్లపిత్తాంతక రసం, క్రవ్యాదిరసం, సూర్యా వర్తి.

**పథ్యము :** పాలతో అన్నము, వరి, గోధుమ, పెసలు, సత్తుపిండి, శర్కర(పటికి బెల్లం), తేనె, పాలు, చల్లని నీరు, కాకరకాయ, అరటి, వెలగ, దాడిమ, ఉసిరి, పొట్ల, వేతసము ఉపయోగం.

**అపథ్యం :** గురుపదార్థాలు, పులుపు, కారం, క్రొత్తధాన్యం, నువ్వులు, మినుములు, ఉలవలు, నూనెపదార్థాలు, పెరుగు, మద్యము నిషిద్ధం.

## ఆమ్లపిత్తము

ఆమ్లత్వం నొందియున్న పిత్తమని భావము.

**భేదములు :** 1. మార్గభేదము

1. ఊర్ధ్వగత ఆమ్లపిత్తము 2. అధోగత ఆమ్లపిత్తం.

2. దోష భేదము

1. వాతం 2. పిత్తం 3. శ్లేష్మం 4. శ్లేష్మ పిత్తం

**పథ్యములు :** తిక్తరస ప్రధాన ద్రవ్యములు, కఫపిత్త హరమగు అన్న పానములు, జాంగల రసములు, పురాణశాలి ధాన్యము, యవలు, గోధుమలు, పెసలు, దోస, కాకర,చేదుపొట్ల, మగ్గిన గుమ్మడికాయ, అరటి పువ్వు, వెలగ, దానిమ్మ, ఉసిరిక, కలాయశాకము.

**అపథ్యములు :** వమనవేగము నవరోధించుట, నవాన్నములు, గురు ఆహారము, విరుద్ధాంకరము, పిత్తప్రకోప ఆహారము లవణ ఆమ్లకటు పదార్థ ములు. తైలము, గొర్రెపాలు, ధాన్యామ్లము దది మద్యము నువ్వులు మినువులు ఉలవలు.

**చికిత్స :** క్వాథము- గుడుచ్యాది (యో.ర) అవిపత్తికర (బై.ర) ఏలాది (యో.ర), భూనింబాది (యో.ర) పంచనింబాధి (బై.ర) త్రికటుకాది (యో.ర)

**గుటిక :** ద్రాక్షాదిగుటిక (యో.ర).

**అవలేహ :** అభయాద్యవలేహ (యో.ర),ఖండకూష్మాండక (బా.ప్ర),

ఖండపిప్పల్యకవలేహ (యో.ర), నారికేళ ఖండపాక (యో.ర).

**ఘృతం :** పిప్పలి ఘృతం (యో.ర), ద్రాక్షాది ఘృతం (బై.ర), శతావరి ఘృతం (యో.ర), నారాయణ ఘృతం (బై.ర), జీరకాదిఘృతం (బై.ర),

**రసౌషధములు :** లీలా విలాసరస (యో.ర), పానీయభక్తవటి (బై.ర), పంచానగుటిక (యో.ర), రసామృత (యో.ర), సూతశేఖర రస (యో.ర), ఆమ్లపిత్తంతక లోహ (భై.ర) ,సర్వతోభద్రలోహ (బై.ర) ,త్రిఫల మాండూరం (బై.ర).

## అరోచకము (అరుచి)

భోజనము చేయుటకు ఇష్టముండదు.

**లక్షణములు :** ఆకలి తక్కువగా ఉండటం వాతముచే పండ్లు పులియుట మరియు ముఖమందు వగరు రుచి, పిత్తముచే కారం మరియు పులుపు రుచి మరియు ముఖ దుర్గంధము మరియు కఫముచే ఉప్పు, తీపి, రుచి బంకదనము మరియు పట్టినట్టుగా ఉండు అనుభూతి నోటియందు కల్గును.

**ఔషధాలు :** దాడిమాది చూర్ణం, యవానీషోడశ చూర్ణం, లవణభాస్కర చూర్ణం, ఆర్ద్రక ఖండావలేహ్యము, పిప్పల్యాది రసాయనం, నారికేళపాకము.

**పథ్యము :** గోధుమలు, పెసలు, బియ్యం, మజ్జిగ, పాలు, ఘృతం, శిగ్రుపత్ర, పొట్లకాయ, వెల్లుల్లి, కంద, రేగు, వేతస, ద్రాక్ష, హరితకీ, ఆమ్లకీ, అల్లం, మిరియాలు, యవానీ, దాడిమబీజ, ఆమ్ర(మామిడి)

**అపథ్యం :** ఆకలితో ఉండుట, త్రేన్పులు కన్నీరు ఆపుట, కోపము, భయము, ఆహారము ఎక్కువగా తినుట, అప్రియ ఆహారము, అశుచి ఆహారం నివాసములు మంచివికావు.

## ఆరోచకము

భోజనము రుచిలేకుండుట.

**బేధములు :** 1. వాతము 2. పిత్తజం 3. కఫంజ 4. త్రిదోషజం

**చికిత్స :** 1. మహాభాండవ చూర్ణం (శా.సం.) 2. తాలిసాదిచూర్ణం (శా.సం.) 3. శుంఠ్యాది చూర్ణం (శా.సం.) 4. యవాని షోడవ (అ.సం) యవాని బాంధవము (బా.ప్ర) 5. ఏలాది చూర్ణం (అ.సం) 6. దాడిమాది చూర్ణం (బా.ప్ర) 7. లవంగాది చూర్ణం (బా.ప్ర) 8. కర్పూరాది చూర్ణం (యో.ర) 9. ఖండావ చూర్ణం (యో.ర) 10. ఆమలక్యాదిచూర్ణం (యో.ర)

**గుటిక :** తాళిశాది మోదకం (అ.సం) 2. ఖండార్ద్రకం (యో.ర) 3. ఆర్ద్రకయోగం (యో.ర) 4. మాతులుంగాదియోగం (యో.ర)

**అవలేహం :** ఆర్ద్రక మాతులజ్గావలేహం (యో.ర)

**ఘృతం :** జీరకాది ఘృతం (యో.ర)

**రసౌషధాలు :** సూతికగుటిక (బై.ర), సుధానిధిరసము (బై.ర), రసకేసరి (బై.ర), సులోచనాభ్రము (బై.ర).

**పథ్యం :** గోధుమలు, కందులు, పెసలు, గుమ్మడికాయ, వంకాయ, మునగకాయ, అరటిపండు, దానిమ్మపండు, నిమ్మపండు, పాలు, నెయ్యి, వెల్లుల్లి, రేగుపండు, ఇంగువ, చేదుపొట్ల, వెలగపండు, దేహమార్ధవం, మధుర ఆమ్లతిక్తద్రవ్య సేవనం, వరాహ, అజ,శశ, ఏణమాంసములు.

**అపథ్యములు :** కాస, క్షుధ అశ్రు వేగములను అవరోధిం చుట అహృద్య అన్నసేవనం, రక్తమోక్షణం, క్రోధము లోభము, భయము, శోకము, దుర్గంధము, అరూవక దర్శనము.

## అర్బుదము (పుట్టకురుపు)

**లక్షణములు :** గట్టిగా ఉబ్బి పెద్దదైన కురుపు శరీరము నందు ఏ ప్రాంతమందైనా కలుగును. దీనిలో సామాన్యముగా చీము ఉండదు. శరీర దోష మరియు ధాతువుల ప్రభావాన్ని అనుసరించి పైత్తిక, కఫజ, రక్తజ, మాంసజ, మేదోజలుగా వర్గీకరించబడినాయి.

**ఔషధములు :** మహామంజిష్టాది క్వాథము, పంచతిక్త ఘృత గుగ్గులు, కైశోర గుగ్గులు, కాంచనార గుగ్గులు, సారిబాద్యాసవము.

**పథ్యం :** పాతబియ్యం, బార్లీ, పెసలు, పటోల, మునగ

**అపథ్యము :** అజీర్ణకర పదార్థాలు, పులుపు పదార్థాలు, మినుములు, మీగడ, పెరుగు, శర్కర, ఇక్షు, మృష్టాన్నము.

## అర్శస్సు (మూలవ్యాధి, మొలలు)

గుదప్రదేశమందు వివిధ రంగులు, వివిధ ఆకారములలో మాంస ఉత్సేధము, సిరలుతేలుట మొదలైనవి ఉత్పన్నమగును. చికిత్సా దృష్టిచే వీటిని శుష్క మరియు స్రావీ అర్శస్సులుగా విభజించిరి.

**లక్షణాలు :** గుదమందు మాంసము సిరలు అంకురించుట, వాత మార్గావరోధము, మలత్యాగమున నొప్పి, క్షుధా మాంద్యము మొదలైనవి.

**శుశ్కార్శస్సు :** రక్తస్రావముండదు. వాత మరియు కఫ ప్రాధాన్యతచే ఉత్పన్నమగును.

**స్రావీ ఆర్శస్సు (రక్తార్శస్సు)** పిత్త మరియు రక్త ప్రధానత కారణముచే ఉత్పన్నమగును. ఇందు రోగి రక్తమును మలముతో విసర్జించును. అప్పుడప్పుడు రక్తము అధికముగా స్రవించి రోగికి రక్తాల్పత (పాండు) మొదలైనవి ఉత్పన్నమగును.

**ఔషధములు :** విజయాచూర్ణం, పథ్యాదిచూర్ణము, సమశర్కర చూర్ణం, ఆర్శకుఠార రసం, చంద్ర ప్రభావటి, నిత్యోదిత రసము, కాసీసాదితైలం (పైకి)

**పథ్యము :** బార్లీ, గోధుమ, వరి, ఉలవలు, మేకపాలు, వెన్న, వెలగ పండు, పొట్లకాయ, కంద, ఆకులు, ఆమలకీ పున్నర్ణవా హితము.

**అపథ్యము :** మినుములు, నువ్వులు, పిండిపదార్థాలు, మలబద్ధకము కలిగించునవి, కష్టంగా జీర్ణమగు పదార్థములు, ఆర్శస్సు నందు సదా అహితములు అతిజలపానము, గుఱ్ఱముపై సవారీ, మలమూత్ర వేగములను అణచుట అహితము.

## అర్శోరోగము

గుదమార్గమున మాంసకీలకములచే అవరోధము కలిగించి వ్యాధి పీడుతుని శత్రువువలె హింసించుటచే ఈ వ్యాధి అర్శము.

**బేధములు :** వాతము, పిత్తము, శ్లేష్మ, రక్తార్శస్సు, సన్నిపాత, సంసర్గాస్సు

**చికిత్స :** బృహత్ సూరణమోదకం, స్వల్ప సూరణ మోదకం, కాసీసాది తైలం, పిప్పల్యాదఘృతం, రోహితారిష్టము, తక్రారిష్ట, హరిద్రాదిలేపం, పిప్పలాదిలేపం, దంత్యాది లేపం, అర్శోఘ్నవటి, బోలబద్ధరసం, రక్తబంధిని, అభ్రక హరితకి, నిత్యోదితరసం, నాగరాధ్య ఘృతం, త్రూషణాదిచూర్ణం, భల్లాత్యవటి (బై.ర), కాంకాయనవటి(బై.ర), సూరణవటి (శా.స), ఉత్పలాది చూర్ణం (చ.చి).

**పథ్యములు :** కులత్థ, యవ, గోధుమ, రక్తశాలి, కాంజీకం, సూరణ, పటోల, వాస్తుక, వార్తకం, గో భాగ క్షీరం, తక్రం, నవనీతం ఘృతం, దదిమడము, అమలకీ, కపిత్థ, ద్రాక్ష, పలాండు, శొంఠి, మరిచ, మృగమాంసం.ఇందుపుకాయ, కందగడ్డ, పొట్లకాయ, గలిజేరుకూర, ఆవు

చల్ల, ఆవునెయ్యి, ఇంగువ ,మిరియాలు,దేవదారుకాయలు, సైంధవలవణం, చిన్నములక కాయలు, పెద్దములకకాయలు, మునుబాలకూర, వస చేతరాసి కూర,లేత మేడికాయ,చిర్రికూర.

**అపథ్యము :** చారకంద, మినపప్పు, తెలకపిండి, పెరుగు మత్స్యములు, కడుశీతకర ద్రవ్యములు, ఆనపకాయ, వంకాయ, పిండివంటకములు, బద్దాలికూర, శీతోదకము పప్పు, మాంసం కఠిన పదార్ధములు, గొంతు కూర్చుండుట గుర్రం మొదలగునవి నెక్కుట, స్నానంమొదలగునది విరుద్ధ, విష్ఠంబి, గురు ఆహారములు,మత్స్య అనూప మాంసములు, దుష్ఠజలం, ఆయుదోషవర్ధక ఆహారములు. వేగరోధము, మైదానం, పృష్టయానము, వాహనసస్య క్షోభ, దుష్ఠాసనములు.

## అశ్మరీ (మూత్రాశ్మరి-మూత్రములో రాయి)

**లక్షణములు :** బొడ్డు మరియు మూత్రాశయ ప్రదేశమందు తీవ్రమైన నొప్పికలుగును. అట్టి నొప్పి శిశ్నము మరియు శిశ్నమూలము వరకు వ్యాపిం చును. మూత్రవేగావరోధము కలుగును. దీనివల్ల రోగికి చుక్కలు చుక్కలుగా మూత్రము అతికష్టముగా త్యాగము చేయును. దీనివల్ల తీవ్రమైన నొప్పి కలుగును. ఎగురుట, దూకుట, అతిగానడుచుట, సవారీలు చేయుట వీటి వల్ల నొప్పి పెరుగును. మరియు సరక్త మూత్రత్యాగము, మూత్రాశ్మరి యొక్క ముఖ్యలక్షణము.

**ఔషధాలు :** బృహత్ వరుణ క్వాధము, చంద్రప్రభావటి, గోక్షురాది గుగ్గులు.

**పథ్యములు :** పాత బియ్యము, అల్లము, గుమ్మడికాయ మంచివి.

**అపథ్యములు :** గురుకర పదార్థములు, మలబద్ధకరమగు ఆహారము, ద్రవాలు, సహజవేగమును ఆపరాదు.

## అశ్మరీ

మూత్రవహ స్రోతస్సులందు శుక్రమూత్రాదులు ఘనీభూతములై రాయి వలె నుండుట చేతను పాషాణ గుటిక వలె వస్తిగతమై యుండుట చేతను అశ్మరి యనబడును.

**బేధములు :** 1 శ్లేషాశ్మరి 2. పిత్తాశ్మరి 3. వాతాశ్మరి 4. శుక్రాశ్మరి 5.త్రిదోషాజలనితములు

**చికిత్స :** గోక్షురాది యోగం, పాషాణబేదిచూర్ణం, పాషాణభేది ఘృతం,

చింత్యాదిచూర్ణం, త్రికటుచూర్ణం, తిలాదిక్షార ప్రయోగం, నారికేళకుసుమ యోగం, త్రివిక్రమ రసం, పాషాణవజ్రరసం, సర్వతోభద్రవటి.

**పథ్యం :** కుళత్థ, యవపురాణశాలి, పురాణ కుష్మాండ ఆర్ద్రకము.

ఉలవలకట్టు, పెసరుకట్ట, పాతబియ్యం, యవలు, నిర్జల ప్రదేశంలో జనించిన జంతుమాంసం, చిర్రికూర, ముదురు గుమ్మడికాయ, అల్లం, యవక్షారం.

**అపథ్యం :** మూత్రం శుక్ర వేగముల దరించుట, ఆమ్ల విష్టంచి, రూక్ష, గురు, ఆహారములసేవన విరుద్ధహరము, మలబద్ధకరాన్నమును రూక్షగల యన్నమును, జడత్వము గల యన్నమును సేవించుట విరుద్ధ పానాన్నమును సేవించుట.

## అష్ఠీలా (ప్రోస్టేట్ ఎన్‌లార్జ్‌మెంట్)

పొత్తికడుపులో మూత్రాశయములో ఉన్న రాయివంటి గ్రంథిని ప్రొస్టేట్ లేక పౌరుష గ్రంథి అందురు. దీనియొక్క పెరుగుదల మూత్ర మార్గమునకు అవరోధము కలిగించును. దీనిని అష్మీలా అందురు. ఇది వృద్ధాప్యములో అధికముగా కలుగును.

**చికిత్స :** 1 మొమ్మాయి వాడవలెను. 2. వరుణాది క్వాధ 3. కుటజ ఘనవటి.

## అస్థిభంగ (ఎముక విరుగుట)

దెబ్బలు తగులుట వలన కలుగు కీళ్ళు, ఎముకలు విరుగుట, అస్థిభగ్న ముగా పిలిచెదరు. సంక్షిప్తముగా ఇది 2 విధములు. సంధి భగ్నము మరియు కాండభగ్నము.

**లక్షణములు :** సంధిభగ్నము (సంధిచ్యుతి) ఏదైనా దెబ్బలు తగిలినపుడు కీళ్ళువాటి స్థానమునుండి జరిగినచో సంధిభగ్న మందురు. ఇందులో కీళ్ళ మలచుటకు, చాచుటకు కష్టమగును. మరియు ముట్టుకున్నపుడు తీవ్రమైన నొప్పి వుండును.

**కాండభగ్నము** – ఎముకలు విరుగుటను కాండభగ్నము అందురు. ఇందు శైథిల్యము, వాపు, తీవ్రమైన నొప్పి, ఆ స్థానమందు ముట్టుకున్నపుడు నొప్పి కలుగును.

**చికిత్స** :– ఎముకలను వాటి సహజ స్థానములో ఉంచి జాగ్రత్తగా

కదలి కలు లేకుండునట్లుగా ప్రత్తి, నూలు వస్త్రములతో కట్టవలెను. అస్థివైద్య నిపుణుడిని సంప్రదించాలి.

1. లాక్షాది గుగ్గులు వాడాలి.

2. మొమ్మాయి వాడవచ్చు.

**పథ్యము :** ఎఱ్రబియ్యం, గోధుమలు, పాలు, నెయ్యి, నూనె, మాంస రసము, తేనె, వెల్లుల్లి, పొట్లకాయ, ములక్కాడ, చింతపండు హితములు.

**అపథ్యము :** పులుపు, ఉప్పు, కారము, పాలు, పొడి పదార్థాలు, అధిక వ్యాయామము, మైథునము హానికరములు.

## అస్థిభంగం

**పథ్యం :** మాంసం, మాంసరసం, నువ్వులకట్టె, పుష్టికరములైన అన్నపానం

**అపథ్యం :** కారం, ఉప్పు, పులుపు, మైథునం, ఎండ, రూక్షాన్న భక్షణం, కసరత్తు మొదలగునవి.

**బేధములు :** భగ్నపిష్టస్తిభంగం, విదారితస్తీభంగం, వివర్తితౌభంగం, తిర్యక్షిస్థిభంగం, అధోగతాస్థిభంగం, ఉర్ధ్వగతాస్థిభంగం, సంధిభంగం.

## ఆధ్మానము (కడుపుబ్బరం)

కడుపులో సంచితమైన వాతము కారణముగా కడుపులో ఉబ్బరము నొప్పి కలుగుటను ఆధ్మానము అందురు.

**ఔషధాలు :** పాచనచూర్ణం, సాముద్రాది చూర్ణం, నరసారాది చూర్ణం, హింగ్వాష్టక చూర్ణం,నింబుపానకము, నింబుద్రవము.

**పథ్యము :** తేలికగా జీర్ణమగు ఆహారము, వెల్లుల్లి, కాకరకాయ, మునగ, పొట్లకాయలు.

**అపథ్యం :** కారం, చేదు, వగరు, పొడిదనము, భారీ ఆహారం, నువ్వులు, పప్పుధాన్యము, విషమ ఆసనముపై మైథునము, వేగావరోధము మొదలైనవి అహితములు.

## ఆనాహము (మలబద్ధకం)

ఆనాహము అనువ్యాధి యందు వాతదుష్టికారణముగా ఆమము పురీషము క్రమముగా ప్రేవులలో పేరుకొని పోవుటవల్ల కలుగును. ఇది 2 రకాలు.

**ఆమజఅనాహము :** ఆమసంచయ కారణముచే వ్యాధి కలిగినచో రోగికి తృష్ణ, తలలోమంట, ఉదరశూల, ప్రతిశ్యాయము, కలుగును.

**పురీషజ అనాహము** : మూత్ర, పురీష అవరోధము కలుగును, తీవ్రశూల, మూర్ఛ, వమనము, శోధ, ఉత్పన్నమగును.

**ఔషధయోగాలు :** త్రిఫలా చూర్ణం, రసోనాదివటి, హరీతకీ ఖండము, సుకుమార ఘృతము.

**పథ్యాపథ్యములు :** అధ్మానవ్యాధిలో వలెనే చెయ్యవలెను

## అనాహము

రోగికి మలమూత్ర బంధ మేర్పడును.

**బేధములు :** 1. ఆమజం 2. పురీషజం

**చికిత్స :** త్రివృతాది గుటిక, భాగోత్తర హింగ్వాదిచూర్ణం (యో.ర.), వచాది చూర్ణం, మదనఫలాది ఫలవర్తి.

**పథ్యం :** యవ, బాలమూలక, హింగు,

**అపథ్యం :** విష్టంచి, విరుద్ధ, గురు ఆహారములు, కషాయరస వేగవ రోధము.

## ఆమవాతము (కీళ్ళనొప్పులు,వాపులు)

కోష్ఠమందు దూషిత ఆమము మరియు వాతము త్రికసంధి మరియు ఇతర సందులయందు నొప్పి, ఆకలిమందగించటం, అపచనము, అంగ మర్ధనము, జడత మరియు హృదయ ప్రదేశమునందు బరువుగా ఉండి దౌర్బల్యము మొ॥లక్షణములు కలిగిన ఆమవాత మందురు.

**లక్షణములు :** ఒక సంధి లేక అనేక సంధులయందు నొప్పి, విశేషంగా చేతులు, కాళ్ళు, కీళ్ళు, తొడలు, నడుము, మరియు త్రిక ప్రదేశమందు తేలుకుట్టిన విధముగా నొప్పి కలుగును. అపచనము, క్షుధామ మాంద్యము, జ్వరము, వేదన, శరీర గౌరవము, ఉత్సాహహాని, జాడ్యము, విబంధము మొ.నవి.

**ఔషధములు :** అజమోదాది చూర్ణం, వైశ్వానర చూర్ణం, గుడుచ్యాది క్వాథము, మహారాస్నాది క్వాథము, రాస్నాదశమూల క్వాథము, రాస్నాధి క్వాథము, హింగుళేశ్వర రసం, మహాయోగ రాజగుగ్గులు, సింహనాద గుగ్గులు, యోగరాజ గుగ్గులు, విషతిందుకవటి, ఏరండపాకం.

**పథ్యం :** యవ, కులుత్థ, ఉష్ణోదక, ఆర్ద్రక, రసోన, పటోలపత్ర పునర్నవా మూలం, మునగ ఆకులు, వాస్తుక, కాకర కాయ.

**అపథ్యములు :** గురు మరియు అభిష్యంద ఆహారము, మినుములు, పెరుగు, బెల్లం, అవాంఛిత భోజనపదార్థములు, మత్స్య, అరటి, రాత్రి జాగరణ, వేగావరోధం, వాయుసేవన.

## ఆమవాతం

ఆమము మరియు వాతం యొక్క ప్రబల దుష్టి వలన జనించువ్యాధి.

ఆమవాత బేధాలు : 1. వాతజన్యమగు ఆమవాతం 2. పిత్తజన్యమగు ఆమవాతం 3. శ్లేష్మ జన్యమగు ఆమవాతం 4. సన్నిపాత వాతము.

**చికిత్స :** విజయభైరవ తైలం, దశమూలకషాయం, శుంఠీకషాయం, రాస్నాసప్తక క్వాదం, మహరాస్నాధి క్వాదం, అలంబుషాదిచూర్ణం, బల్లాతక వటి శౌంఠీపుటపాకం, యోగరాజగుగ్గులు, వాతారిగుగ్గులు, మహవాత విద్వాంసినిరస, శృంగబేరాద్యం ఘృతం, శుంఠీఘృతం, శుంఠిధాన్యకఘృతం, వాతగజేంద్ర సింహరసం.

**పథ్యం :** పురాణశాలి, కులత్థ జాంగలమాంసం, పటోల, కారవేల్ల మునగ,ఉష్ణోదక, రసోన, తక్రం, ఆర్ద్రకం

**అపథ్యం :** దది మత్స్య, గుడం పాలు, మాష, దుష్టజలపానం, అనూప మాంసం, అసాత్మ్య ఆహారసేవన విరుద్ధహారం.

## ఆమాశయ వ్రణము (అన్నద్రవశూల మరియు పరిణామశూల)

భోజనముతో ఏ విధముగా సంబంధం లేకుండా కడుపునొప్పి, ఆమాశయ వ్రణమునకు కారణమగును.ఇవి 2 రకాలు.

**1. అన్నద్రవశూల:** ఆమాశయమున ఉత్పన్నమయిన వ్రణము కారణంగా ఈ రకమైన ఉదరశూల ఉత్పన్నమగును. ఈ రోగమందు రోగికి భోజన సమయము తరువాత లేక పత్య మానవస్థలో నొప్పి యొక్క అనుభవం కల్గును. ఈ నొప్పి ఏవిధమైన ఆహారము వల్లకాని పథ్య లేక అపథ్య వస్తువుల సేవన, వాంతి వలన కాని నొప్పి తగ్గదు.

**2. పరిణామశూల :** ఈ నొప్పి గ్రహణి మొదటి భాగములో ఉత్పన్న మయిన వ్రణమువల్ల కలుగును. మరియు పచ్యమానావస్థ తరువాత కలుగును. భోజనమైన 3-4 గంటల తరువాత నొప్పి మొదలగును. ఇందు

చాతిలోన మంట, త్రేన్పులు, వాంతి మొదలగు లక్షణములు కల్గును. రక్తము కూడా స్రవించవచ్చు. రక్తవమనములు కావచ్చు.

**ఔషధం :** శూల వజ్రాదివటి, కామదుధారసము,సూతశేఖర రసం, కపర్ధికభస్మం, నారికేళ లవణక్షారం, ధాత్రీలోహం, త్రిఫలాలోహం, ఆమ్ల పిత్త రోగమందులు కూడా వాడవచ్చు.

**పథ్యములు :** అరటిపండ్లు, ద్రవాహారము, గోధుమ ఆహారం, పాల అన్నం మంచివి.

**అపథ్యం :** పులుపు, కారం, ఉప్పు, పదార్థాలు, మసాలాలు, మద్య ములు, శాలి ధాన్యములు, రాత్రి జాగరణ, ఎండ, అతిమైథునము, క్రోధము, దుఃఖము విడిచిపెట్టవలెను.

## అహిపూతనా (ముడ్డిపూత)

అపరిశుభ్రమైన శిశువుల గుదప్రదేశములందు దురద లేర్పడి క్రమముగా పిరుదులపైకి పాకి అక్కడ చర్మముపై రసితో కూడిన పొక్కులు ఏర్పడుటను అహిపూతనము అందురు.

**ఔషధం :** రసాంజనము పైకి లేపం.

**వృషణకచ్ఛూ :** వృషణకోశముల అపరిశుభ్రతవల్ల మరియు తేమ కారణంగా దురద ఏర్పడి స్రావయుక్తముతో కూడిన చర్మవ్యాధి వృషణ కచ్ఛూ అందురు.

**చిప్ప మరియు కునఖము :**

**చిప్ప :** నఖమూలముల యందు తీవ్రమైన వాపు కలిగి దురద నొప్పి కల్గును.

**కునఖ :** నఖము యందు మందమైన శోఫ కలిగి నఖములను మెత్తగా లేదా పెళుసుగా చేసిన ఆ వ్యాధిని కునఖము అందురు.

**చికిత్స :** ఖదిర అరిష్ట, శారిబాద్యసవము, ఆరోగ్యవర్ధిని వటి, బృహత్ మంజిష్టాది క్వాథము.

## ఇంద్రియ నష్టం

రక్తపుష్టికి లోపం కలిగించుటచేత దానంజేసి ఇంద్రియ పటుత్వం క్షీణించుట చేతను చిరకాలం సంగమము లేకుండుట వల్ల ఇంద్రియ నష్టం కల్గి సంభోగశక్తి తగ్గును.

**చికిత్స :** శుంఠ్యాది లేహ్యం, ఖర్జూరాది లేహ్యం, శతావరి లేహ్యం, శిగ్రుపుష్ప రసాయనం, సిద్దమోదకం.

## ఉదర రోగము

దీర్ఘకాలమునుండి మందాగ్ని మరియు అజీర్ణములవల్ల కడుపు యొక్క పరిమాణముకంటే పెద్దది అగును. దీనిని ఉదర రోగము అందురు. ఇవి 8 ఇందు 4 దోషజములు వాతజ, పిత్తజ, కఫజ, సన్నిపాతక, ప్లీహోదరం, యకృతోదరం, బద్ధగుదోదరము, పరిస్రావీ మరియు జలోదరములు.

**లక్షణాలు :** కడుపుబ్బరము, క్షుదామాంద్యము, అపచనము, ఆనాహము, విబంధము, దౌర్భల్యము, అలసట, నడుచుటకు శక్తిలేకపోవుట, శోధ, మంట మొదలగనవి సామాన్య లక్షణములు దోషములచే ఉత్పన్నమగు ఉదరమున క్రింది లక్షణాలుండును.

**1.వాతోదరము :** పొడిదగ్గు, మలబద్ధకం, కాళ్ళుచేతులలో వాపు కడుపులో గుడగుడ శబ్దము కల్గును.

**2. పిత్తోదరము :** జ్వరం, మంట, మూర్ఛ, భ్రమ, అతిసార, తృష్ణ, చీము, కలుగును.

**3. కఫోదరము :** వాపు, శరీరగౌరవము, అతినిద్ర,క్షుదా మాంద్యము, వాంతి, దగ్గు, కడుపు చల్లగా ఉండుట, గట్టిగా ఉండుట కలుగును.

**4. సన్నిపాతోదరము :** దీర్ఘకాల విషప్రయోగ లక్షణములు కల్గి వుండును. ఇందు వాంతి, పాలిపోవుట, మాటిమాటికి మూర్ఛ, ముఖము ఎండిపోవుట, మొదలైనవి.

**ఔషధాలు :** 1. హింగ్వాష్టక చూర్ణం, రసోనాదివటి, శంఖభస్మం, కళ్యాణక్షారం, అర్కలవణము వాసాకంటకారి లేహ్యము, పిప్పలీఘృతము దశమూలక్వాథం, శంఖవటి, శంబూకభస్మం.

యకృదోదరము మరియు ప్లీహోదరము (కాలేయం ప్లీహం పెరుగుదల) కడుపులో కుడివైపున కలుగు కాలేయవాపును యకృతోదరము అందురు. ప్లీహోదరము ఎడమవైపు కలుగును.

**లక్షణాలు :** కాలేయం, మరియు ప్లీహ వృద్ధితోబాటు మందజ్వరము, తృష్ణ, క్షుదామాంద్యము, దౌర్బల్యము, విబంధము, శోష, పాండు సామాన్య లక్షణాలు.

**ఔషధాలు :** పునర్నవారిష్టా క్వాథము, లోకనాధరసము, అర్కలవణం, యకృదారి లోహము, యకృత్ప్లీహారీ లోహం,నాగరఘృతం, కుమార్యాసము, రోహితకారిష్ట, ఆరోగ్యవర్ధినీవటి.

**జలోదరము :** కడుపుయొక్క పెరుగుదల, నాభిబయటకు వచ్చుట, పార్శ్వపూర్ణత, కడుపులో నీరు ఉన్నట్లు శబ్దం వచ్చుట, ఆకలిమందగించుట, బలహీనము, తృష్ణ, ఉదరశూల సాధారణము.

**ఔషధాలు :** షట్సకారచూర్ణం, పిప్పలీ వర్ధమాన యోగం, ఆరోగ్య వర్ధినీవటి.

**పథ్యం :** దుగ్ధ ప్రయోగం, పాతబియ్యం, ముద్గ, ఉలవలు, మేకపాలు, ఆర్ద్రక, వెల్లుల్లి, పటోల ఫలం, శిగ్రు, తాంబూలం, అరటి.

**అపథ్యం :** గురు, అభిష్యంద ఆహారము, పగటినిద్ర, వ్యాయామము, అతిగా తిరుగుట, అతిజలపానము, లవణ ప్రయోగము మంచివికావు.

## ఉదర రోగం

వాతాదిదోషములు కుపితమై స్వేదవాహినులను,ఉదర వాహినులను అగు సిరలు నడ్డగించి హృదయం జఠరాగ్ని అపానవాతం వినిని దోషయుక్త ములుగాజేసి ఉదర రోగం జనించును.

1. వాతోదరము 2. పిత్తోదరము 3. శ్లేష్మోదరము 4. సన్నిపాతోదరం 5. జలోదరం 6. ప్లీహోదరం 7.క్షులోదరము (ఛిద్రోదరము) 8. బుద్ధగ్రోదరం.

**చికిత్స :** 1. బేధనవటి 2. రోహితకవటుకములు 3. బ్రహ్మీఘృతం 4. వైశ్వానరటకము 5. అగ్నికుమారరసం 6. త్రైలోక్యసుందర రసం 7. వర్ధమాన పిప్పలి 8. నారాచ ఘృతం, బిందుఘృతం, పటోలాదిచూర్ణం, కుమారాసవ, దశమూల షట్పల ఘృతం, హింగ్వాది ఘృతం, నారాయణ చూర్ణం, నారచరరసం, అభయారిష్ట, వర్ధమాన పిప్పలి.

**పథ్యం :** శాలి షష్ఠక, యవ, గోధుమ, కులత్థ, ముద్గ, జాంగల మాంసములు పటోల, కారవేల, శిగ్రు, గోక్షీరం, చాగక్షీరం, ఉష్ణక్షీరం, లశున ఆర్ద్రకం, తక్రం. ఉలవకట్టు, తోటకూర, చక్రవర్తికూర, ములక్కాయ, పొట్లకాయ, చేదుపొట్ల, గలిజేరుకూర, ముదిరిన గుమ్మడికాయ, ఇందుపు కాయ, సదాప, ఇంగువ, జీలకర్ర, కోలపొన్న, బోడతరం, నారింజపండు మారేడుపండు

**అపథ్యం :** వేపపండు, కొత్తిమీర, అనుములు, కలువగడ్డలు, పిండివంట కము, పెండలం, తెలకపిండి, మాంసం, మధుర జనిత మద్య విశేషములు అనుగవు కాయ, పెరుగు, పులుసు, కల్మష పదార్ధములు, గురుకర ద్రవ్యములు, పిష్టాహారములు, తిలలు, గురు అభిష్యంది రుక్ష, విదాహి, ఆమ్లరసం, లవణం జలపానం, వ్యాయామం దివాస్వప్నం.

## ఉదర్ద (అర్టికేరియా)

శీతవాత సంపర్కంచే వాత శ్లేష్మములు ప్రకోపించి పిత్తముతో కలిసి రక్తాది ధాతు చర్మములందు జొచ్చి జోరీగలు కరిచినటు దద్దుర్లు గలుగజేసి దురద వేదన తాపము పుట్టించును.

**పథ్యం :** చేదుగానుండు పదార్ధము భుజించవలెను, పచ్చి పసుపు వేపాకు తినుట, రోగి గోరువెచ్చని నీరు స్నానం, వెట్టబుట్టించు దుస్తులను ధరించవలెను.

## ఉదావర్తము

మాటి మాటికీ, మల,మూత్ర, ఎక్కిళ్లు, క్షుద, తృష్ణ, అపానవాయు, శ్వాసోచ్ఛ్వాస, నిద్ర, మొ.స్వాభావిక వేగములను ఆపుటవల్ల ఉదావర్త రోగము ఉత్పన్నమగును. ఈ రోగమందు కడుపుబ్బరం, శ్రమ, వేదన, విబంధం, మూత్రకృఛ్ఛం ప్రతిశ్యాయం, శిర:శ్శూల మొదలగు లక్షణములు కలుగును.

**ఔషధ యోగములు :** కాంకాయనవటి

**పథ్యాపథ్యములు :** అనాహరోగమునందు చెప్పబడిన పథ్యాపథ్యములే వాడాలి.

## ఉదావర్తము

పురీష వేగములు నిరోధించుటచేత వాతం ఆవృతమై ఊర్ధ్వ ఆవర్తము నొందినదై ప్రతిలోమ గతిన సంచరించునో అట్టి వ్యాధి ఉదావర్తము.

**భేధములు :** 1 వేగనిరోదజన్యము 2. అపథ్యనిమిత్తజం

**చికిత్స :** అగ్నిముఖచూర్ణం, శ్యామాది ప్రథమన చూర్ణం, రక్షోఘ్నాది చూర్ణం, భద్రదుర్వాది చూర్ణం, శ్వదంష్ట్రాది లేహ్యం, త్రివృత్తాది చూర్ణం, పచాది చూర్ణం, హింగు గందాది చూర్ణం, భాస్కర లవణం, హింగ్వాష్టక చూర్ణం.

**పథ్యం :** లేతముల్లంగి, యవ, ఆర్ద్రక, హింగు, లవణం, గ్రామ్య,

అనుప మాంసరసములు, వాతహరములగు ఆహార పానీయాలు, బెల్లపు షరబత్.

**అపథ్యం :** గురుకర అన్నం తీక్ష్ణహరములు, చలిది అన్నం, శరీర పరిశ్రమ కాలినడకగల ప్రయాణం, కోపం దుఃఖం మొదలగు చిత్త వికలములు, శమీధాన్యాలు, కోద్రవములు, జంబూఫలం, అలుకము,పిష్ట విక్రతలు విష్టంచికర గురు విరుద్ధ కషాయరస రుక్షాహారములు, వేగావరోధము.

## ఉన్మాదము (పిచ్చి)

బుద్ధిభ్రంశము, మనస్సు అస్థిరముగా ఉండుట, జ్ఞాపకశక్తి తగ్గుట, విజ్ఞాన విభ్రంశము, శోకము, సమాజములో అప్రాకృతిక మరియు అనుచిత వ్యవహారములు చేయుట, అదుపులేని మరియు అస్పష్ట వాక్కులు, బెంగ పడుట, అధైర్యము, నేత్రముల యొక్క, వికృత చేష్టలు, మనోశూన్యత సామా న్యముగా కనిపించును.

**చికిత్స :** సారస్వత చూర్ణం, సర్పగంధావటి, ద్రాక్షాసవము, కళ్యాణ ఘృతము, మహా పంచగవ్య ఘృతములోనికి హిమసాగరతైలం, బృహత్ వైష్ణవ తైలం పైకి లేపం.

**పథ్యం :** వరి, ముద్గ, గోదుగ్ధం, తోటకూర, పటోల, కదలీఫలం, కూష్మాండఫల, ద్రాక్షా మంచివి. మనసునందు భ్రమ కలిగించిన ఉన్మాదం.

**బేధములు :** 1 వాతన్మోదం 2 పిత్తోన్మాదం 3 శ్లేష్మాన్మోదం

4 సన్నిపోతోన్మాదం 5 దుఃఖోన్మాదం

**చికిత్స :** విశ్వాద్యచూర్ణం, పంచగవ్య ఘృతం, కల్యాణ ఘృతం, బ్రహ్మీ ఘృతం, సిద్ధార్థక గణం, ఉన్మాదభంజనోరసం, ఉన్మదగజాంకుశ, బ్రహ్మ్యాది వర్తి, కృష్ణాది అంజనం, హింగ్వాదిఘృతం, కల్యాణక ఘృతం, మహిపైశాచిక ఘృతం, లశునాద్య ఘృతం, బ్రహ్మీ ఘృతం, ఫలఘృతం, చతుర్భుజ రసం, ఉన్మాద గజకేసరి రసం.

## ఉపదంశము (సెగమేహం)

లైంగిక సంపర్కం ద్వారా సంక్రమించే వ్యాధి.

**ఔషధాలు :** ఖదిరారిష్టా, సారిబాది వటి, చోప్ చీన్యాది గుగ్గులు, కైశోర గుగ్గులు, మంజిష్టాద్యరిష్ట.

**ఫిరంగి రోగం ఔషధాలు :** సప్త శాలీవటి, మల్లసింధూరం.

**పథ్యం :** తిక్త ద్రవ్యములు, గోధుమ,అలసందలు, మసూర, పాత నెయ్యి, నువ్వులనూనె, వేపనూని, గోమూత్రం, పటోల, పునర్ణవ, నాగకేసర, కస్తూరీ కాకమాచి, చేదుబీర, కానుగ బీజములు పథ్యము.

**అపథ్యము :** గురు, కొత్త బియ్యము, మినుములు, క్షీరము, పెరుగు, బెల్లము, మిఠాయిలు హానికరము.

## ఉపదంశము

లింగస్థానమున నేదో యొక కాఠిన్యము లేక బాధ

**బేధములు :** 1 వాతోపదంశం 2 పిత్తోపదంశం 3 శ్లేష్మోపదంశం 4 సన్నిపాతోపదంశం 5 రక్తోపదంశం

**చికిత్స :** అమృతభల్లతక లేహ్యం, అశ్వగంధాది లేహ్యం, మధుస్నుహీ రసాయనం, దేవకుసుమ రసాయనం, రసగంధక కజ్జలి, ఉపదంశ కుఠారం, వ్రణరాజం, వ్యాధిహరణ రసం.

**పథ్యం :** మంచి పాతబియ్యం, యవనధాన్యం, గోధుమరొట్టె అరణ్య జంతుమాంసం, మేకమాంసం, కందిపప్పు, పెసరపప్పు, ఆవుపాలు, మేక పాలు, ఆవు మజ్జిగ బీరకాయ, పొట్టికాకర కాయ, పొట్లకాయ, బూడిద గుమ్మడికాయ, లేతమునగకాయ, అరటికాయ, బావినీరు లేత ముల్లంగి

**అపథ్యము :** పగలు నిద్రించుట, మూత్రవేగములు అడ్డగించుట బెల్లం తినుట, వ్యాయము, అల్పం మజ్జిగ.

## ఉరఃక్షతము

శక్తికి మించి బరువులు మోయుట, క్రిందపడుట, బలవంతులచే యుద్ధం, అతిమైధునము, అసంపూర్ణ ఆహారసేవన, ఊపిరితిత్తుల యందు పుండు.

**లక్షణాలు :** వక్షములో తీవ్రవేదన, సరక్త కఫష్ఠీవనము, జ్వరము, భోగహాని, ఉత్సాహహాని, శక్తినాశము, కాంతి క్షయము, క్షుధామాంద్యము, అజీర్ణము, శోష మరియు శిథిల మలప్రవృత్తి ఉరఃక్షతము యొక్క ముఖ్య లక్షణములు ఇందు రోగి అప్పుడపుడూ రక్తము కక్కును.

**ఔషధాలు :** సీతోఫలాది చూర్ణం, ఏలాదివటి, ద్రాక్షాసవము, కూష్మాండావ లేహ్యం, వాసావలేహ, రాజయక్ష్మ ఔషధాలు ప్రయోగించ వచ్చు.

**పథ్యం :** గోధుమ, ముద్గ, శాలిధాన్య, యవలు, మేకపాలు, నెయ్యి, మాంసజరసము, ఆమ్లకీ

**అపథ్యం :** బిల్వఫలము, వంకాయ, కాకరకాయ, తైలనిర్మిత పదార్థ ములు హానికరము.

## ఉరస్తోయము (ప్లూరసీ)

ఊపిరితిత్తులపై పొరలలో నీరుచేరుట ఉరస్తోయము నొప్పితో కూడిన కష్ట, శ్వాస, ప్రశ్వాస అత్యంత నురుగుతో కూడిన చీమువంటి కఫము, దగ్గు, మందజ్వరము, దౌర్బల్యము పార్శ్వశూల, నిదురించినా కూర్చున్నా సౌకర్యంగా ఉండుట.

**ఔషధయోగములు :** పునర్ణవాష్టక క్వాథము, శృంగిభస్మము రాజయక్ష్మలో వర్ణించిన చికిత్సౌషధాలు ప్రయోగించాలి.

**పథ్యములు :** గోధుమ, ముద్గ, శాలి, మేకపాలు, గోదుగ్ధ, కాకరకాయ, పటోల, వాస్తుక, మునగ మంచివి.

**అపథ్యము :** గురు ఆహారము, పెరుగు, చేపలు, చల్లటిపానకములు.

## ఉరుస్తంభము

అత్యంత కుపితమైన మరియు సంచిత ఆమము కఫము, మేధస్సు, మరియు వాయువు తొడలయందు జడత్వము కలుగజేయును. దీనినే ఉ రుస్తంభమందురు.

**లక్షణములు :** కాళ్ళు కదలక పోవడం, తొడలు చల్లగా ఉండుట, భారము యొక్క అనుభవము, క్షుదా మాంద్యము, జ్వరము, వమనము, శైథిల్యము, తడిబట్టతో కప్పిన అనుభూతి.

**చికిత్స :** రాస్నా సప్తక క్వాథము, అమృతాది గుగ్గులు పైకి బిల్వతైలం, హింగు త్రిగుణతైలం, కర్ణబిందు తైలం పూయాలి.

**పథ్యం :** ప్రవహించు నీటికి వ్యతిరేక దిశలో ఈతకొట్టుట, కటు,తిక్త కషాయద్రవ్య, శ్యామక మరియు కోద్రవ ధాన్యము, ఉలవలు, కాకరకాయ, పటోల, వెల్లుల్లి, ముద్గ, మునగ మంచివి.

**అపథ్యం :** గురుశీతల ద్రవ్యములు, విరుద్ధ వీర్య ద్రవ్యములు, అసాత్మ్య పదార్థములు వర్జ్యములు మరియు పంచకర్మలు కూడా అపథ్యములే.

# ఊరుస్తంభం

మేధస్సుతో పాటు కఫము, పిత్తము కలిసి దిక్కరించి అత్యధికమైన తన యందలి స్థైర్య శైత్య గుణములచేత ఊరు ప్రదేశమునకు చేరి ఊరువులను స్తంభింపచేయు వ్యాధి.

**చికిత్స :** 1 మూర్వాది చూర్ణము 2 స్వర్ణ క్షీర్యాది చూర్ణము 3 ఫలీవ్యాఘ్రనఖాది చూర్ణము 4 త్రిఫల చూర్ణము 5 శ్రీవేష్టకాది చూర్ణము.

**క్వాథములు :** 1. భల్లాతక క్వాథము 2. రాస్నా క్వాథము 3. పిప్పల్యాది క్వాథములు

**తైలాలు :** 1. పీలు పర్ణ్యాది తైలం 2. కుష్టాది తైలం 3. సైంధవాదితైలం

4 అష్టకట్వార తైలం

**లేపములు :** 1 ధన్యాది ప్రలేపం 2 సర్షాపాది ప్రలేపం 3 వత్సాకాది ప్రలేపం

4 శ్యోనాకాది ప్రలేపం 5 రసోవాది ప్రలేపం

శ్యోనాకాది పరిషేకము, గుంజ భద్రారసము, వాతగజాంకుసరసం

**పథ్యం :** పాతబియ్యం, పచ్చిపెసలు, చిరుసెనగలు, మేడి, పొట్ల, పనసకాయలు, వంకాయలు, వెల్లుల్లి, అల్లం, కూరగాయలు, మేకపాలు, పావురం, కోడి, మాంసపు షార్వాలు, రోగి త్రాగగలిగినంత నెయ్యి, కొంచము మజ్జిగ వీనిని పగలు గైకొనుదగును. సాయంకాలం భోజనము, గోధుమ పూరీలు పంచదార బహు సూక్ష్మముగా గలిపిన పిండి వంటకాలు మొదలగు వారిని భుజింపదగును. ఖర్జూరాలు, వాతమును వృద్ధిచేయక శ్లేష్మమును హరించిన ఫలములు, వీనిని ఫలహారముగా దీనికొనవలయును వేడినీటిని చల్లార్చి పుచ్చుకొనవలెయును. రోగి స్నానమాడుట తగదు ఒకవేళ వీలుకాని యెడల సాధ్యమైనంత తక్కువగా స్నానం చేయవలెను. వాతం ఎక్కువగ ఉన్న యెడల నదులయందుగాని ప్రవాహోదకమున గాని స్నానమాడి ప్రవాహమున కెరురీద వలయును. రోగి మితముగా భుజించ వలయును.

యవలు, చామలు, కొర్రలు, వీనిలో వండిన అన్నము ఉద్దాలశాలి ధాన్యము శుష్కమూలకం. వ్యాయములు తగ్గించవలెను.

**అపథ్యము :** గురు, శీత ద్రవ, అతిస్నిగ్ధ ద్రవ్యములతో కూడినవియు విరుద్ధ సేవన అసాత్మ్యాహార సేవన స్నేహనం. ఇది అహితకరంగా వుండును.

చేపలు అపక్వంగా వండి చక్కెర, పెరుగు, బచ్చలికూర, మినుము రొట్టెలు, పగటినిద్ర, జాగరణములు.

## కర్ణ రోగము (చెవిరోగము)

భాదిర్యము (చెముడు) దూషిత వాయువు శబ్దవహా స్రోతస్సులను ప్రభావితము చేసి శ్రవణ శక్తిని తగ్గించి భాధిర్యం కలిగించును.

**చికిత్స :** అపామార్గక్షార తైలం, బిల్వతైలం, బిల్వాది తైలం, దశ మూలాది తైలం.

కర్ణశూల (చెవిపోటు) దూషిత వాయువు కర్ణప్రదేశములో వృద్ధి అగుట వల్ల కర్ణశూల కలుగును.

**చికిత్స :** పై వలెనే,సరలకాష్ఠ తైలం.

కర్ణపాకము (చెవిలో పుండు) దూషిత పిత్తము చెవిలో విద్రధిని కలిగించును. దీనివలన చీము కలుగును. ఇట్టి స్థితిని కర్ణపాకమందురు.

కర్ణస్రావము (చెవిలో చీము) కర్ణక్ష్వేడము (దిబ్బడ) మృదంగ వాదము వాయించినట్లు విశేష శబ్దములు కర్ణమునందు వినబడుటను కర్ణక్ష్వేడము అందురు.

**చికిత్స :** బిల్వాది తైలం, హింగ్వాది తైలం, క్షార తైలం, నిర్గుండి తైలం.

**పథ్యం :** గోధుమ, శాలి, ముద్గ, పురాణ ఘృతం, పటోల, శిగ్రు.

**అపథ్యం :** గురు మరియు కఫవర్ధక ఆహార ద్రవ్యములు, విరుద్ధ వీర్య ద్రవ్యములు అతిగా మాట్లాడుట, వ్యాయామము, చల్లటిగాలి మంచివి కావు.

## కామలా (పసరికలు, కామెర్లు)

నఖ, త్వక్, నేత్రాది పీతత మరియు ఈ క్రింది లక్షణాలుండును.

**కోష్ఠాశ్రిత కామలా :** క్షుధామాంస, శ్రమ, దౌర్బల్య, మలబద్ధత అజీర్ణ, అరుచి, వమనం, రక్తపీత మూత్రతత కల్గును

**శాఖాశ్రిత కమలా :** ఉదరశూల, క్షుధామాంద్యము, దౌర్బల్యము, దక్షిణా ఉదర ప్రదేశమున నొప్పి, ఉదరార్మనం, గుడగుడ, పీత మూత్రత, శ్వేత పురీషం

**చికిత్స :** ఆరోగ్య వర్థినీవటి, మాండూర భస్మం, చించాది లేహ్యాము, కామలాహర రసము.

**పథ్యం :** శాలి ధాన్యం, గోధుమ యవ, ముద్గ, మసూర, పటోల కదళీఫల, పునర్ణవ, మూలక ఇక్షురసం మంచివి.

**అపథ్యం :** గురు, ద్రవ్య, దుష్పాచ్య భోజన పదార్థములు హానికరము.

## కామలా

పాండురోగము వలన రోగ పీడుతుడి (ప్రాకృత) కాంతిని హరించి హరిద్ర వర్ణమునకు మార్చుటచే ఈ వ్యాధి కామలా అంటారు.

బేధములు :

1. హలీమన కామలా 2. శాఖశ్రిత కామిలా

2. కుంభ కామలా 4 కోష్టాశ్రిత కామలా

**చికిత్స :** విడంగాధ్యాలేహ్యం, ద్రాక్షాది ఘృతం, ఆమలకలేహ్యం ద్రాక్షాది లేహ్యం భృంగరాజాసవ, లోహాసవ, త్రిఫలాది కషాయం, వాసా కషాయం.

**పథ్యములు :** పురాణశాలి, యవగోధుమ, ప్రాతముద్గ, అటకి మాసూర, బూడిదగుమ్మడి, జాంగల మాంసములు, లేత అరటికాయ, ద్రాక్ష, ఆమలకి, బదరి, దాడిమ, ఖర్జూర, పటోల, చిర్రికూర, పొన్నంటికూర, ఉసిరిక, క్షీర తిక్త ఘృతం, మజ్జిగ, నెయ్యి ,వగరుగా వుండు పదార్థములు.

**అపథ్యం :** నిదాన పరివర్తన, ఆమ్ల లవణరసం, అగ్ని అతపసేవన అధ్యయనం, మైథునం, ఆయాస, చింత ,క్రోధ, కామ.

## కాస (దగ్గు)

కాస చికిత్స ననుసరించి 2 రకాలు.

**1. శుష్కకాస (పొడిదగ్గు):** పొడిదగ్గు, వక్ష ప్రదేశములో శూల, శిర, ఉదర, పార్శ్వ, ప్రదేశములందు శూల, ఉరోదాహము, జ్వరము, నోరెండుట, తృష్ణాధిక్యత, కటుకాస్యత స్వరభేదము మొదలైనవి.

**ఔషధయోగములు :** సీతోఫలాది చూర్ణం, కర్పూరాది చూర్ణం, బృహత్ పంచమూల క్వాథము, చంద్రామృత రసము, కరవీరాది యోగము, లవం గాది వటి, శ్వాసానందగుటికా, ఏలాదివటి గోదంతి భస్మం, ప్రవాళభస్మం, పిప్పల్యాది రసాయనము, వాసావలేహము, వాసాకంటకార్యవలేహం.

**కుక్కురకాస (కోరింతదగ్గు)** లో పై మందులు వాడుట మంచివి.

ఆర్ద్రకాస (కఫముతో / కళ్ళెతో కూడిన దగ్గు) మాటి మాటికీ దగ్గు వచ్చును. గాఢమైన తెమడ వచ్చును రోజంతా ఆలస్యము శిరఃశూల కలుగును. క్షుధామాంద్యము మరియు శరీర గౌరవము కలుగును.

**సామాన్యయోగాలు :** త్రికటు చూర్ణం, తాళీసాది చూర్ణం, సీతోఫలాది చూర్ణం, వ్యోషాదివటి, ఖదిరాదివటి, ఏలాదివటి, మయూర పుచ్ఛ భస్మము, అమృత ప్రాశ్యలేహము ద్రాక్షారిష్టా, చ్యవనప్రాశ వాడాలి.

**జీర్ణకాస :** ఒకవేళ శుష్క కాస ఆర్ద్రకాసకు చికిత్స చేయని ఎడల అవి జీర్ణకాసగా మారును.

**ఔషధాలు :** ధన్వంతరగుటిక, మరియు పై మందులు, లక్ష్మీవిలాస రసం, కఫ కేసరి, శ్వాసానందరసం, శ్వాసకుఠారం, రసపర్పటి.

## కాస రోగము

వాతము కంఠము నుండి శిరస్సు వైపునకు, ఊర్ధ్వముగా చరించుట కాస అనబడును. కంఠము నుండి అప్రకృతమైన కుత్సిత శబ్దం వెడలుట వలన కూడ కాస యనబడును.

**కాసభేదములు :** 1 వాతజ 2 పిత్తజ 3 కఫజ 4 క్షతజ 5 క్షయజ

**చికిత్స :** 1 కంటకారీ ఘృతం 2 తృషణాది ఘృతం 3 చాగలాద్య ఘృతం 4. అగస్త్యహరతకి అవలేహము 5 కంటకర్యావ లేహం 6 కర్కాటక శృంగి చూర్ణం 7 ద్రాక్షాధ్యావ లేహ్యం 8 వృషపిప్పలి కషాయం 9 పిప్పల్యాది లేహ్యం 10 ద్విపంచ మూల్యాది ఘృతం 11 గుడుచ్యాది ఘృతం 12 భృంగరాజాసవ 13 కూష్మాండవలేహం 14 వాసారిష్ట 15 దశములారిష్ట 16 బృహత్ చాంగలఘృతం 17 దశమూలారిష్ట 18 వాసా ఘృతం 19 త్రిజాతుకాది వటి 20 లవంగాది వటి 21 ఏలాదివటి.

**పథ్యములు :** ధాన్యములు, పురాణ గోధుమ, శాలి షష్టక యవ ద్విదళ ధాన్యములు ముద్గ, మాష కులత్థ శాకములు వాస్తక, లేతవంకాయ, లేత ముల్లంగి, కంటకారి, జీవంతీ దొండ, ద్రాక్ష, మాదీఫల, ఖర్జూర, క్షీర వికారములు జాంగల, అనూప, పొట్లకాయ, పిన్నసదాప లశున ఉష్ణోదర, మధు, కొయ్యతోటకూర, చక్రవర్తికూర, లేతముల్లంగి, చాతరాసికూర, లేతఅరటికూర.

**అపథ్యములు :** రూక్ష విదాహి విబద్ధకరము. స్త్రీ సంగమము గురు, శీతలాహారములు, మత్సములు సర్ష, కందశాఖములు, దుష్టజలము, సొరకాయ వేగరోధము, వ్యాయమము, రజోసేవన, వంకాయ, బచ్చలికూర, జిగటగల పదార్థాలు మధురపదార్ధములు

**చికిత్స :** పగటియందు నిద్రించుట, కందపులుసు, నూనె, పాలు, పెరుగు, పిండివంటకములు, తాళీసాదిచూర్ణం, సీతోఫలాదిచూర్ణం, తెకరాజమరీచము, కర్పూరాదిచూర్ణం, శ్వాసానంద గుటిక, చంద్రప్రియ గుటిక, కాససంహారబైరవము, నీలకంతరసం, స్వరభూపతి, త్వగాది లేహ్యము, దాడిమాది ఘృతం, బృహత్కంటకారీఘృతం, భూతాంకుశరసం, విజయభైరవ రసం, త్రినేత్రకరసం, రసేంద్రగుటిక, దాడిమఘృతం, అగ్నిరసం.

## కంఠ మరియు గళ రోగములు (గొంతురోగాలు)

**స్వరభేదము (బొంగురు) :** స్వరము యొక్క గరగర, గళదాహము, తక్కువ ధ్వని మెల్ల మెల్లగా మాట్లాడుట.

**ఔషధం :** సీతోఫలాది చూర్ణం, ఖదిరాది వటి

**గలాయు (అంగటిముల్లు) :** గళమందు వేదన మరియు కాఠిన్యత ఇందు ప్రధాన లక్షణము.

**అధిక జిహ్వాక (కొండనాలుక పెరుగుట) :** కాలిక చూర్ణం వాడాలి.

**గలౌఘ :** ఈవ్యాధి యందు గళము తీవ్ర విదాహ యుక్తమై, అన్నము మరియు నీరు మ్రింగుటకు కష్టముగా ఉండును. ఇందు తీవ్రజ్వరము మరియు కృచ్ఛశ్వాస కల్గును.

**పథ్యం :** గోధుమ, పాతనెయ్యి, ఆవనూని, నువ్వుల నూని, వేపనూని, యవ, ముద్గ, కులుత్థ, కారవేల్లక, తాంబూలం, మంచి తిక్తద్రవ్యములు, పటోల, కస్తూరి, నాగకేసర, తాళఫలం, త్రపుస మంచివి.

**అపథ్యం :** రూక్ష,గురు, అమ్లద్రవ్య, క్షీరం, పెరుగు, బెల్లం, మాష, తైల, దుగ్ధ, దది, ఇక్షు, విరుద్ధ వీర్య పదార్థములు హానికరములు.

## కుష్ఠము

**లక్షణములు :** చర్మము యొక్క స్నిగ్ధత లేక రూక్షత, అత్యధిక స్వేదాగమము లేక స్వేదాభావము, సూదితో గుచ్చినట్లు నొప్పి,దాహ,కండు,

శూన్యతా, వ్రణ, స్పర్శనేంద్రియ కర్మహాని, చికిత్స చేయుచున్ననూ వ్రణముల యొక్క వృద్ధి మరియు శ్రమ, క్షయ, మొదలైనవి.

**ఔషధాలు :** త్రిఫలాచూర్ణం, లఘుమంజిష్టాదిక్వాథము, బృహత్ మంజిష్టాది క్వాథము, రసమాణిక్య రసము, ఆరోగ్యవర్ధినీవటి, పంచతిక్త ఘృతము, పంచతిక్త ఘృత గుగ్గులు, ఖదిరారిష్టా.

## కుష్ఠం, శ్వేత కుష్ఠం

సకాలంలో చికిత్స చేయక ఉపేక్షించినచో శరీరమునకు కురూపత్వ మును కలిగించునది కుష్ఠమని పేరు.

**కుష్ఠబేధములు :** 1. మేహ(మహా) కుష్ఠ – 7; 2. క్షుద్ర కుష్ఠ – 11

**మహాకుష్ఠ :** 1 కపాల 2 ఔదుంబర 3 మణ్డల 4 ఋష్యజిహ్వ 5 పుండరీక 6 సిధ్మ 7 కాకణక.

**క్షుద్రకుష్ఠ :** 1 ఏకకుష్ఠ 2 చర్మ 3 కిటభ 4 విపాదిక 5 అలసక 6 దద్రు 7 చర్మదల 8 పామా 9 విస్ఫోటక 10 శతారు 11 విచర్చిక.

**చికిత్స :** పాఠాదిచూర్ణం, ద్రాక్షాది చూర్ణం, త్రిఫలాది చూర్ణం, బకుచికాది చూర్ణం, లఘునింబపంచక చూర్ణం, బృహత్పంచక నింబకచూర్ణం లాక్షాది చూర్ణం, విడంగాది మోదకం, కనకారిష్టము, ఖదిరారిష్టము, మహాతిక్త ఘృతం, సూర్యపాక సాధ్యఘృతం, సర్వేశ్వరరసం, కుష్టకుఠారము, తాళక భస్మయోగం, గంధక కల్పము, తురవక లేపం, అరగ్వధాది ఘృతం, మష్కక ఘృతం, తువరక తైలము, శ్వేతకర విరాద్యతైలం, మంజిష్టాది క్వాదము, పటోలాదిక్వాథము, కుష్టకుఠారరసం, అర్కేశ్వర రసం, బ్రహ్మ రసం, విషగుటికలు, లాంగలీగుటికలు, వజ్రగుటికలు, విరుంగసార గుటికలు, తూణి భద్రవటుకములు, స్వయంభువ గుగ్గులు, చంద్రప్రభావటి, మహాయోగరాజ గుగ్గులు, భద్రాదితైలం, శ్వేతకర పారాదితైలం, నింబాది తైలం, టంకణ ద్రావకం, గంధక రసాయనం, రసభస్మ యోగము, మహాత్తిక ఘృతం, సోమరాజీ ఘృతం, వజ్రక ఘృతం, నీలఘృతం, గోమూత్రఘృతం, పంచతిక్త గుగ్గులు, భల్లాతకతైలం, సాలసరాది గుణచూర్ణం, న్యగ్రోదాది గణచూర్ణం, కనకబింద్వారిష్టం, కుష్టకాల నలరసం, గలత్కుష్టారిరసం, కుష్టహరితాలేశ్వరరసం, చంద్రాననరసం, తాళకేశ్వరరసం, రసమాణిక్య రసం, కుష్ఠనాశనరసం, సర్వేశ్వర రసం, ఉదయభాస్కర రసం, రాజరాజేశ్వర రసం, కుష్ఠారిరసం, గంధక రసాయనం, తాళకేశ్వర రసం, బృహత్ వాతరక్తాంతక లోహము, తాళకభస్మం, కుష్టహర రసము.

## శ్విత్రము

కుష్ఠమునకు సమాననిధానము

**కిలాసము : చికిత్స :** పశుపతి చూర్ణం, భృంగ్వాది చూర్ణం, పటోలాది చూర్ణం, మహావజ్రక తైలము, చంద్రప్రభ రసము, ఉదయాదిత్య రసం, మరీచాది తైలం,మణిశిలాదిలేపనం, కదలీలేహ్యం, నీలోత్పలాదిలేహ్యం, కాకోందు బరాదిలేహ్యం, అవలుంజాదిలేహ్యం, అరగ్వదాదిలేహ్యం.

**పథ్యము :** యవలు, గోధుమలు, చామలుకొఱ్ఱలు, పచ్చి పెసలు, శనగలు, కందులు, చేదుగల చర జాంగలమాంసము, పిల్లపీచర, పొట్ల, చంద్ర, వేపపువ్వు, నేలములక, కస్తూరి, చందనము, కుంకుమ, ఇంగువ, కారముగల అన్నపానములు, పెరుగు, పాలు,బెల్లము,నువ్వులు, మినువులు, నిద్రించి పరుండుట.

## కృమి రోగము (కడుపులో పురుగులు)

**లక్షణములు :** క్షుదా మాంద్యము, శిధిల పురీషం లేక అతిసారము, ఉదరశూల, జ్వరము, త్వక్ వైవర్ణ్యము, జిహ్వా వైవర్ణ్యము, శ్రమ, భ్రమ మొ॥లక్షణాలు కలుగును.

**చికిత్స :** సోమరాజ్యాది చూర్ణము, విడంగాది చూర్ణము, కృమిముద్గర రసము, కృమికుఠార రసము, విడంగారిష్టా.

**పథ్యం :** తిక్తద్రవ్య, శాలిధాన్య, వేడిపాలు, గోమూత్రం, ఇంగువ, కాకర, మునగ, అరటిపండు హితం.

**అపథ్యము :** మధురరసం, పిష్టిమయ ద్రవ్య, మాష, విరుద్ధ వీర్య, పదార్థ, పెరుగు, క్షీరము మొ॥నవి.

## క్రిమిరోగము

క్రిమి వలన జనించు రోగము క్రిమి రోగము.

**భేదములు :** 1. బహిర్మలజములు 2. కఫజ క్రిములు 3. శోణిత క్రిములు 4. పురీషజ క్రిములు.

**చికిత్స :** 1. విడంగ చూర్ణము 2. పలాశబీజ కల్కము 3. పారశీక యవానీ చూర్ణము, 4. ఖర్జూర పత్ర క్వాథము 5. కంపిల్లక చూర్ణము 6. యవానీ చూర్ణము. పలాశ బీజాది చూర్ణము, క్రిమిముద్గర రసము, క్రిమి కుఠార రసము.

**పథ్యము :** పొట్లకాయ,వాము,వెదురుకొమ్ము, చక్రవర్తి కూర, ముల్లంగి గడ్డలు, పెసరకట్టు, వాయువిడంగములు.

## గండమాల, అపచి

మేధస్సు, కఫము అనునవి భుజశిరములు పెద్దనరములు, కంఠము, గజ్జలు వీనియందలి శోషరస గ్రంధులు.

**చికిత్స :** కాంచనార క్వాథము, వరుణాది క్వాథము, కాంచనారత్వక్ చూర్ణం, సింధురాది తైలము, త్రిఫలగుగ్గులు, కాకాధనీ తైలము, పిండతైలము, త్రిఫలాది గుగ్గులు.

**పథ్యము :** కాకరతైలం, పొన్నగంటికూర, పురాణ రక్తశాలి ధాన్యము, యవముద్గ పటోల, రక్తశిగ్రుఫలము కరవేళ్ళకము, రూక్షణకటు అగ్నిదీపక గుణములు.

**అపథ్యములు :** దుగ్ధవికృతులు, పాలు, బెల్లం, ఇక్షువికృతులు, పంచదార, పిండివంటలు, అనూపదేశ పశుపక్షులు, పులుసు తీపిగల పదార్ధములు.

## గలగండ (గాయిటర్)

థైరాయిడ్ గ్రంధియొక్క వృద్ధికారణముగా చిన్నపెద్ద ఆకృతులలో గ్రంధులు ఉత్సేధమును గలగండము అందురు. ఇది శూల రహితము, మెల్లగా పెరుగును.

**చికిత్స :** వరుణాది క్వాదము, చిత్రకాదివటి, కాంచనార గుగ్గులు,

**పథ్యము :** యవలు,పెసలు, పొట్ల, రూక్ష ద్రవ్యములు, సముద్ర లవణము మంచివి.

**గండమాల, అపచీ:** ఈ వ్యాధియందు రేగుపళ్ళు ఆకారములో అనేక మైన గ్రంధులు రోగి కక్ష, గ్రీవా పృష్ట మరియు జంఘ యందు ఏర్పడును. ఇవి నెమ్మదిగా పక్వము చెందును. పక్వావస్థ యందు వీనిని అపచీగా గుర్తించాలి. ఈ అవస్థలో గ్రంధుల నుండి పూయాదులు స్రవించును.

**ఔషధములు :** మధుస్నుహీ రసాయనము, కాంచనార గుగ్గులు.

**పథ్యములు :** కోద్రవ బీజములు, పాతబియ్యము, పెసలు, పొట్ల, మునగ, కాకర, పథ్యములు.

**అపథ్యములు :** గురుమధుర మరియు ఆమ్లరస ద్రవ్యాలు, మినుములు,

చెరకురసం, పాలపదార్థాలు, ఉల్లి, అనూప దేశ జంతువుల మాంసము నిషిద్ధము.

## గలగండ

గళము నందు అండము వలె పెద్దదిగా ఉండునది.

**భేదములు :** 1. వాతజ గలగణ్డము 2. కఫజ గలగణ్డము 3. మేదోజ గలగణ్డము.

**చికిత్స :** కాంచనార గుగ్గులు, కాంచనార గుటిక, సర్షపాదిలేపము, కట్ఫల చూర్ణము, తిలబీజలేపము, నింబూశాది లేహము, మండూర లోహము, తుంబితైలము, తుంబిర్యాదితైలము, సురవర్తాది లేపము.

**పథ్యము :** పురాణ, రక్తశాలిధాన్యము, యవముద్గ పటోల, రక్త శిగ్రు ఫలము కారవేల్లకము, శాలింబిశాకము.

**అపథ్యములు :** దుగ్ధ వికృతము, ఇక్షువికృతము, అనుపదేశ పశు పక్షుల మాంసరసములు.

## గుల్మము

చలించునట్టి లేదా చలించని గ్రంథుల వంటి ఉత్సేధము ఉదరము నందు ఏర్పడిన వానిని గుల్మము అందురు. ఆకార ప్రకారాదుల యందు పెరుగుట మరియు గట్టిపడుట సంభవించును.

**లక్షణములు :** అగ్నిమాంద్యము, మలవృద్ధి, మూత్రావరోధము, వాత సంగము, కడుపులో గుడగుడలు, అనాహము, ఉద్గార (త్రేనుపులు) ఎక్కువగా వచ్చుట.

**ఔషధాలు :** బృహత్ పంచమూల క్వాథము, విజయచూర్ణం, ద్రాక్షా ఘృతము, కాంకాయనవటి, రసోనాదివటి, సుకుమార ఘృతము, క్షీర షట్పల ఘృతము, ఇందుకాంత ఘృతము.

**పథ్యములు :** ఎఱ్ఱబియ్యం, ఉలవలు, ఆవుపాలు, మేకపాలు, ద్రాక్ష, ఉసిరికాయలు, ఖర్జూరాలు, చిట్టీత, వెల్లుల్లి, ఇవి భోజనమందు హితములు.

**అపథ్యములు :** మధర రస ద్రవ్యములు, ఉద్దులు, ఆకుకూరలు, ఎండిన మాంసము, చేపలు అహితములు.

## గుల్మ రోగము

ప్రకాండము లేకుండా పత్రములను దట్టముగా కలిగి స్థిరమై గుబురుగా నుండుట గుల్మము అంటారు. రోగనిదానము అట్టి సాదృశ్యమును కలిగించు వ్యాధి. వర్తులాకారంగా గ్రంథి రూపమున జనించునది గుల్మము.

**భేధములు :** 1. వాత గుల్మము 2. పిత్త గుల్మము 3. శ్లేష్మగుల్మము.

**చికిత్స :** శంఖద్రావకం, కల్యాణక్షారం, గుల్మకుఠారము, హింగుత్రిగుణ తైలం, కాంకాయన గుటిక, నాగేశ్వరరసం, గుల్మకాలనలరసం, భల్లాతక ఘృతం, హింగుసౌవర్చలాది ఘృతం, క్షీర షట్పల ఘృతం, దంత హరితాకావ లేహ్యం, ప్రాణవల్లభరసం. విద్యాధర రసం.

**పథ్యం :** రక్తశాలి, పురాణ ధాన్యం,ఉలవకట్టు,తోటకూర, జాంగల మృగ పక్షి మాంసం, చక్రవర్తికూర, పెద్దములక,కులత్థలు, ముద్గములు, యూషములు, పొట్లకాయ, బిల్వ, వరుణ, చిరుబిల్వ ,యవాని ,చిత్రకం, బీజపూరకం, హింగు, ఆమ్లవేతసం, క్షారం, దాడిమము, తక్రం,తైలం ఘృతం. జీలకర్ర, అవుచల్ల, బోడతరం మొ॥నవి.

**అపథ్యం :** వాతహర స్వభావం, సర్వభావములు, విరుద్ధాసనం, వేపపండు, శుష్కశాఖములు, అనుములు, తామర, శమీధాన్యములు, తెల్లని చారకంద, గురుకర ద్రవ్యములు.

## గ్రంధులు (అర్బుదము)

తమ స్వకర్మములచే ప్రకోపించిన కఫ ప్రధానమైన వాతాది దోషములు మాంసము రక్తం, కఫయుక్తమైన మేధస్సు వీనిని దూషింపచేసి వర్తులమును ఉత్పన్నమును కఫమును ఐన గ్రంథులు శోఫను కలిగించును.

**భేధములు :** 1. వాతజ గ్రంధి 2. పిత్తజ గ్రంధి 3. కఫజ గ్రంధి 4. మేదాజ గ్రంధి 5. సిరాజగ్రంధి 6. రక్తజగ్రంధి 7. మాంసజ గ్రంధి 8. అస్థిజ గ్రంధి 9. వ్రణజ గ్రంధి.

**అర్భుద :** దేహమున వచ్చినచోట వాతాది దోషములు ప్రకోపించి రక్త మాంసాలు చెరచి వర్తులను కఠినంగా స్వల్పభాధ కల్గినదియు గొప్పది నియు గాఢమగు మూలము కల్గినదియు చిరకాలమున పరిపక్వమయి నదియునైన మాంస పిండమును కల్గించును.

**భేధములు :** 1. వాతజార్భుదము 2. పిత్తజార్బుదము 3. శ్లేష్మ

జార్బుదము 4. మేధాజార్బుదము 5. రక్తజార్బుదము 6. మాంసా జార్బుదము.

**గ్రంధి చికిత్స :** గ్రంధ్యర్బుద లేపము, రౌద్ర రసము.

## ప్రవాహికా (బంక విరేచనాలు)

ప్రవాహికా వ్యాధి యందు రోగి బంకతో, రక్తముతో కూడిన మలమును అతి ప్రయాసతో మరియు నొప్పితో మంటతో కూడి మలత్యాగము చేయును.

**ఔషధములు :** బిల్వాది చూర్ణం, శతపుష్పాది చూర్ణం, చతుషష్ఠి ప్రహర పిప్పలీ, కుటజావలేహము, కుటజారిష్టా, లఘు గంగాధర చూర్ణం, కుటజ ఘనవటి.

**పథ్యము :** (తినవలసినవి) :- పాతబియ్యం, పేలాలు, కంది, పెసరకట్టు, పాలు, అల్లం, శొంఠి, చాంగేరి, జంబు, దాడిమ, బిల్వఫలములు,అరటి పండ్లు.

**అపథ్యము :** గురుకర, శీతల, నిల్వాహార పాత, కొత్త పచ్చళ్ళు, మైధునం, వ్యాయామం, అపక్వాహారం నిసిద్ధము.

## గ్రహణీ

గ్రహణీ రోగము యందు రోగి ఆహారమును బాగుగా జీర్ణము చేసుకో లేరు. మరియు భుజించిన ఆహారము మాటి మాటికీ శిధిలముగా లేక ద్రవరూపములో పురీషమును విసర్జించును. ఈ రోగములో ఒక్కొసారి శిధిలముగా ఒక్కొసారి గాఢముగా అయినట్టి పురీషమును విసర్జించును. అంతేగాక అనాహము, భారముగా తోచుట మరియు శక్తిహాని, జీర్ణముగా కుండుట, అవసాదము, చర్మము యందు స్థైమిధ్యము, గొంతు ఎండుట, నోరు ఎండుట, దప్పిక, చెవుల యందు శబ్ధములు మరియు మైథునేచ్ఛ తగ్గుట జరుగును.

**ఔషధాలు :** బృహత్ గంగాధరచూర్ణం, దాడిమాష్టకచూర్ణం, హింగ్వాష్టక చూర్ణం, కపిత్థాష్టక చూర్ణం, జాతీఫలాది చూర్ణం, లవణభాస్కర చూర్ణం, నృపతి వల్లభ, రసము పీయూష వల్లిరసము, మహాగంధక యోగము, కామేశ్వర మోదకం, బిల్వాది లేహ్యము, పంచామృత పర్పటీ, రసపర్పటీ, స్వర్ణ పర్పటీ.

**పథ్యము :** కాచిన నీరు మాత్రమే వాడాలి. పాతబియ్యం, పెసలు, బియ్యముతో చేసిన విలేపి, ఆవుపాలు, మజ్జిగ, వెన్న, అరటిపువ్వు, పళు ్ళ, కరక్కాయలు, నేరేడుపళ్ళు, వెలగపండు, మారేడు, దానిమ్మపండు, తామర నాళములు.

**అపథ్యములు :** గురు,స్నిగ్ధ మరియు మిరియాలు అధికముగా గల ఆహారాలు, ఎక్కువనీరు త్రాగటం, ఎక్కువ స్నానం చేయటం, వ్యాయామం గ్రహణీ రోగులు చెయ్యరాదు.

## గ్రహణి

భుక్తాహారము పాచనమగుట కొరకు గ్రహించి యంచునుగాన దీనిని గ్రహణి అందురు.

**భేదములు :** వాతజము, పిత్తజము, కఫజము, సన్నిపాతజం, అయజగ్రహణి, త్రిదోష గ్రహణి.

**చికిత్స :** 1. తక్రారిష్ట 2. నాగరాది చూర్ణం (చ.చి.15); 3. జాతి ఫలాదిచూర్ణం (యో.ర) 4. బృహల్లవజ్గాది చూర్ణం (బై.ర) 5. తాళిసాదిచూర్ణం (యో.ర) 6. దాడిమాష్టకచూర్ణం (బై.ర) 7. జీరాకాదిచూర్ణం (బై.ర)

1. చిత్రకాది గుటిక (చ.చి) 2. ముస్తకాదిమోదక (బై.ర) 3. క్షారగుటిక (చ.చి15); 1. తక్రహరీతికి (యో.ర) 2. కళ్యాణకావలేహ్య (యో.ర) 3. మంగళకళ్యాణగుడ (బా.ప్ర) 4. కూష్మాండ కళ్యాణగుడ (బా.ప్ర)

దశమూలాది (చచి15),క్షారఘృతం (చ.చి15), బిల్వాది ఘృతం (యో.ర), బిల్వతైలం (బా.ప్ర), గ్రహణికవాటరస (యో.ర), క్షారతామ్రరస (యో.ర), హిరణ్యగర్భ పొటలీ (బై.ర), పానీయ భుక్తవటి (బై.ర),రసపర్పటి (యో.ర), స్వర్ణపర్పటి(బై.ర), క్షారతామ్రరస(యో.ర), అగస్త్య సూతరాజరసం (బై.ర), దుగ్ధవటి (బై.ర), పంచామృతపర్పటి (యో.ర), కనకాసవ (యో.ర).

పాఠాది చూర్ణం, కపిర్థక చూర్ణం, అగ్నిముఖచూర్ణం, గంగాధర చూర్ణం, కుటజారిష్టం, బబ్బులారిష్టం, బిల్వాదిపానకం, మృతసంజీవని రసం, లోకనాథరసం, ద్రాక్షారిష్ట, కర్పూరాదివటి, లశునాదివటి, విర్యాణక గుడము, కళ్యాణ గుడావలేహం, కుటజపాణితం, కర్పూరాధ్యర్కము, ఆయకుమారరసం, మహాగంధకం, మాసురఘృతం, దురాలభారిష్టం, ఆమకుఠారసం, లోకనాథరసం, మృత సంజీవనిరసం, మదవారణ

సింహరసం.

**పథ్యం :** (అతిసారంలో వలెనే)

## చర్ధి

నోట నీరూరుట అగ్నిమాంధ్యం నోరుఉప్పగా రుచించుట ఉద్గారములు లేకపోవుట మొదలగు లక్షణాలతో చర్ది ప్రారంభమగును.

**చికిత్స :** మయూర పింఛభస్మము తేనెతో

**పథ్యం :** శాలి, యవలు, పెసలు, రేగుపళ్ళు, ద్రాక్ష,కొబ్బరికాయలు ఉసిరి, దానిమ్మ అల్లము, నిమ్మపళ్ళు, మొదలగునవి. అగంతుజ చర్ది యందు రోగి అభీష్టము మేరకు భోజన పదార్ధములు ఇవ్వాలి.

**అపథ్యములు :** దొండ, అరటిపండ్లు, అతిమధురం, ఇవన్నియు చర్ది రోగికి హానికరములు. అలాగే రుచిలేని భోజన పదార్ధములను కూడ త్యజించాలి.

## చర్ధీ రోగము

అన్నపానాదుల యందు ద్వేషము కలిగి వమనమగుట.

**బేధములు :** వాతచర్ధి, పైత్య చర్ధి, శ్లేష్మ చర్ధి, ఆరోచక చర్ధి ఆగంతుక చర్ధి.

**చికిత్స :** 1. దాత్ర్యాది పానకం 2. లాజశ్చర్ధిషు (అ.హు.) (పేలాల పిండి); 3. సువర్ణ సూతశేఖర రసం, పూర్ణచంద్రోదయ సింధూరం, 4. మాదీఫలరసాయనం, 5. విడంగాది చూర్ణం 6. మహాసూర్యవర్తి.

**పథ్యం :** పురాణశాలి, షష్టిక, యవ, గోధుమ, లాజ పువ్వులు, ముద్గ, దాడిమ, మాతులుంగ, జంజీర ,నింబుక, అమలకి, ద్రాక్ష , బదర, నారికేళా.

**అపథ్యం :** నాన్యవస్తి, స్నేహపానం, దొండకాయ, సోరకాయ, విరుద్ద హారముల వేగవరోదం వ్యాయమాలు.

## చర్మ రోగము

**పామా మరియు కచ్చు (గజ్జి, దురద):–** పామా అను వ్యాధి యందు అసంఖ్యాకములైన చిన్నకురుపులు ఏర్పడును. వీని నుండి స్రావము, దురద, మంట, కలుగును. ఇది విశేషముగా చేతివేళ్ళ సంధుల యందు, అంతః ప్రకోష్ఠాస్థుల యందు, ఊరు(తొడల) వులయందు, నితంబముల యందు కనబడుచుండును. ఒకవేళ సంధుల యందు, విశేషించి చేతులు మరియు

నితంబముల యందు మాత్రమే ఏర్పడిన దానిని కచ్ఛూ వ్యాధి అందురు.

**ఔషధాలు :** మహామంజిష్ఠాధి క్వాథము, గంధక రసాయనము.

**విచర్చికా (నసిమిరి) :** నలుపు మరియు ఎరుపు రంగులో ఉండు అనేకానేక వ్రణ సమూహములు చర్మముపై ఏర్పడి అందుండి అత్యధికముగా స్రావము వచ్చును.

**ఔషధం :** పిండతైలము

**యువాన పిడకా (మొటిమలు) :** యుక్తవయసులో ముఖములో బూరుగ ముల్లువలే ఏర్పడు చిన్న చిన్న మొటిమలను యువాన పిటికలు అంటారు.

**ఔషధం :** టంకణ భస్మం.

**దద్రు :** చర్మముపై తామ్రవర్ణములో గల గుండ్రటి దద్దుర్లు పుట్టి ఎక్కువగా దురదతో కూడి ఉండు అవస్థను దద్రు అంటారు.

**పాదదారి (కాళ్ళుపగుళ్ళు) :** అరచేతులు, అరికాళ్ళు వేళ్ళ మధ్యలో నొప్పితో కూడిన చీరికలు ఎక్కువగా వుండుట లేదా వాత ప్రకోపము వలన ఏర్పడు అవస్థనే పాదదారి అందురు.

**ఔషధం :** సర్జరసాదిలేపం పైకి వాడాలి.

## జ్వరము

శరీర ఉష్ణోగ్రత పెరుగుట వలన వచ్చు వ్యాధియే జ్వరము. స్వేదము పట్టకుండుట అంగమర్దము, జ్వరలక్షణం. 7 రోజుల వరకు జ్వరము నవ జ్వరము.

**చికిత్స :** గోదంతిభస్మము, తేనె 3సార్లు, సితోఫలాది చూర్ణం 3గ్రా. గూడూచి సత్వం, జయవటి, హింగులేశ్వరరసం, మృత్యుంజయ రసం.

**వాతశ్లేష్మజ్వరం :** అధికమైన తాపముతోపాటు సంధిశూల శిరఃశూల జలుబు కాస, బరువుగా వుండుట, గొంతు నొప్పి అధికమైన నిద్ర.

**చికిత్స :** పిప్పలి క్వాథము,దశమూల క్వాథము, లఘుపంచమూల క్వాథము, పంచకోల క్వాథము. గోజిహ్వాది క్వాథము, సౌభాగ్యవటి, లక్ష్మీ విలాసరసం, త్రిభువన కీర్తిరసం, శృంగారాభ్రరసం, శ్వాసకాస చింతామణి రసం,శృంగి భస్మం.

## అభిన్యాస జ్వరము

జ్వరము జ్ఞానేంద్రియాల కర్మశక్తి తగ్గుట శ్రవణ దృష్టి మరియు ఘ్రాణ శక్తుల కర్మశక్తి తగ్గుట ఆకలి లేకపోవుట, గుచ్చినట్లు నొప్పి, రోగి కదలకుండా పడుకొనును. లేదా తరుచుగా తలను కదుపుచుండును. ప్రక్కలకు తిరుగు చుండును, తక్కువగా మాట్లాడును.

**చికిత్స :** బృహత్ కస్తూరి భైరవరసం, బృహత్ వాత చింతామణి రసం, కృష్ణచతుర్ముఖ రసం.

## పునారావర్తక జ్వరం

జ్వరం తీవ్రత 6–7 రోజులు జ్వరం తగ్గుట. అత్యధిక స్వేదముతో లేక అతిసార పూర్వకంగా నుండును. జ్వరం మరల 7 రోజుల తర్వాత వచ్చి 3 నుండి 4 రోజులు వరుకు వుండును.

**చికిత్స :** సుదర్శనచూర్ణం 1–2గ్రా.

## విషమజ్వరం

ఇది ఆవర్తక జ్వరం (మరల తిరిగి వచ్చు లక్షణం) ఒక దినం లేదా రెండు దినములు లేదా మూడు దినములు వ్యవధిలో వణుకుతోపాటు వచ్చును. రోగి అత్యధికంగా చల్లదనం అనుభవించి పిమ్మట అత్యధికంగా వేడిని అనుభవించును. పిమ్మట అత్యధిక చమటలు వచ్చుటలో జ్వరతాపం తగ్గును.

1. అన్యేదుష్క జ్వరం 2. తృతీయక 3. చతుర్ధక

**చికిత్స :** సప్తపర్ణఘనవటి, మహజ్వరాంకుశ రసం, కృష్ణచతుర్ముఖ రసం, చందనాది లోహం, విషమజ్వరాంతక లోహం, సర్వ జ్వరహర లోహము.

**ప్రలేపక జ్వరం :** శీతపూర్వక మందజ్వరం, సంపూర్ణ శరీరం చెమటతో తడుపుబడినట్లుండును మరియు శరీరం బరువుగా తోచుట.

**చికిత్స :** స్వర్ణ వసంత మాలతీ, మకరధ్వజ, అభ్రక భస్మము.

## సన్నిపాతక జ్వరం

శీతముగా నుండుట మరియు ఉష్ణంగ నుండుట, క్షణక్షణమునకు మారుచుండును. అధిక జ్వరతాపం, రోగి శీతమును అనుభవించి కొద్ది క్షణములోనే అధికమైన లేపమును అనుభవించుట సంధిశూల, హస్తపాద

శిరఃశూలం, ఎక్కువగా కన్నీరువచ్చుట, దప్పిక నాలుక పొందుట, కర్ణశూల, కర్ణనాదం శ్వాసకష్టం, రక్తముతో కూడిన తెమడ వెడులుట, రోగి ఎల్లప్పుడు తలను తిప్పుచుండుట.

**చికిత్స :** చిన్నారుహధిక్వాదము, దశమూలకటుత్రయాదిక్వాదము, సౌభగ్యవటి, మహలక్ష్మివిలాసరసం, ఆనందభైరవిరసం, శ్వాసకాసచింతా మణిరసం, చతుర్ముఖరసం, బృహత్ చింతామణి రసం, వేతలరసం, బృహత్ కస్తూరి బైరవరసం.

## శ్వాసనక జ్వరం

వణుకుతోపాటుగా తీవ్రజ్వరం పార్శ్వశూల ఛాతీ భాగమున నొప్పి, తెమడతోపాటు కాసశ్వాస పీల్చుకొనునపుడు నాసికా ద్వారములు ఎగురుట, నాడీగతి అతివేగముగా శ్వాసముతో 2:1 ఉండును. లలాటంపై స్వేదము, దుర్బలత రూక్ష మరియు మలినమైన నాలుక, తంద్రప్రలాపము.

**చికిత్స :** గోరోచనాదివటి, సంజీవని వటి, సిద్ధప్రాణేశ్వరరసం, కఫ కేతురసం, స్వర్ణభూపతిరసం, బృహత్ కస్తూరి భైరవి రసం.

## అంత్రిక జ్వరం

7 దినములు నిరంతరం అధిక ఉష్ణోగ్రత కలిగి జ్వరము సంతత రూపముగా వుండును. 4-5 వారముల వరకు కొనసాగును. కొష్టబద్ధత, అల్ప మల త్యాగం అధికంగా నాలుకపై పూత బాహ్యాంతర జ్వరతాపం.

**చికిత్స :** సిద్ధప్రాణేశ్వర రసం, సౌభాగ్యవటి.

## గ్రంధిక జ్వరం

కంపము, కళ్ళుతిరుగుట, అనిద్ర ప్రలాపం విభ్రమ, మూర్ఛ, తీవ్ర తాపము,స్వేదనశీల, కక్షప్రదేశ లేక గజ్జల ప్రదేశమునందు 2వ లేక 4వ రోజు లసీక గ్రంధులవృద్ధి అత్యధిక బాధ కలుగును.

**చికిత్స :** నింబాది చూర్ణం 2-4గ్రా.

## పాషాణ గర్భజ జ్వరం

జ్వరముతోపాటు కోమల,స్థిర సంవేదనాల గ్రంది చెవి, ముక్కు, వెనక భాగములో కర్ణమూల గ్రంధి శోధ కారణముగా జనించును. ఒక చెవి వెనుక శోధ కలిగి తర్వాత ఇరు పార్శ్వ కర్ణమూల వ్యాధిగ్రస్థమగును.

**చికిత్స :** పంచతిక్త ఘృతం, మహాతిక్త ఘృతం, తిక్త ఘృతం.

**పథ్యం :** పురాణశాలి, ముద్గ, మాసూర, గోదుగ్ధ, గోఘృత అజీదుగ్ధ షడంగ పానీయం వార్తాక, శిగ్రు పటోల వాస్తుక, ద్రాక్ష, దాడిమ, లావక మాంసం కుక్కుట మాంసం.

**అపథ్యం :** గురు అసాత్మ్య విదాహ అన్న శ్రమ మైధున స్నానం భ్రమణం.

## జ్వరము

దేహము, ఇంద్రియములకు మనస్సునకు సంతాపము కలిగించు నది జ్వరము.

**బేధములు :** 1 శారీరక–మానసిక; 2. సౌమ్య–ఆగ్నేయ;

3. అన్తర్వేక–బహిర్వేగ; 4. ప్రాకృత–వైకృత.

**దోషకాల బలా బలముల జ్వర భేదములు**

1. సంతత జ్వరము 2. సతత జ్వరము 3. అన్యేద్యుష్క జ్వరము

4. తృతీయక జ్వరము 5. చతుర్ధక జ్వరము.

**ఆశ్రయ బేధములు :** 1. రసగత 2. రక్తగత 3. మాంసగత

4. మేదో గత 5. అస్థిగత 6. మజ్జాగత 7.శుక్రగత.

**చికిత్స :** లంఘనం, యవాగు

**ఔషధాలు**:– షడంగపానీయం, వత్సకాది క్వాధము, మధుకాది క్వాదము, జాత్యాది క్వాదము, దాన్యాదిచూర్ణం, గోరోచనాదిచూర్ణం, అగస్త్యాది చూర్ణం, లవంగాది చూర్ణం, సుదర్శన చూర్ణం, నింబాదిచూర్ణం, తాళిశాదిచూర్ణం, పిప్పల్యాది ఘృతం, బలాది ఘృతం, వాసాది ఘృతం, గుడుచ్యాదిఘృతం, కలశ్యాది ఘృతం, పటోలాది ఘృతం, త్రిఫలాదిఘృతం, పంచగవ్యఘృతం, కల్యాణక ఘృతం, మంజిష్టాది ఘృతం, బిల్వాకాది ఘృతం. గోదంతిభస్మం, జహుర్‌ముహోర్‌పిష్టి, ప్రవాళపిష్టి, శృంగిభస్మ, కాసీస గోదంతిభస్మ, కట్ఫాలాది చూర్ణం, ఆమలకాది చూర్ణం, పిప్పలీచూర్ణం, మహాలవంగాది చూర్ణం, ఏలాది చూర్ణం, పిప్పలాద్యఘృతం, పంచతిక్త ఘృతం, త్రికంటకాది క్షీరపాకం, శింశుపాది దుగ్ధపాకం, నాగరాది క్షీరపాకం, లాక్ష్యాదితైలం, స్వచ్ఛందభైరవం, వైష్ణవీరసం, సన్నిపాత భైరవరసం, హరితాలగోదంతీభస్మం, హరితాల భస్మం, మల్లభస్మం,

మృత్యుంజయరసం, నారాయణజ్వరం కుశరసం, పంచవక్త్ర రసం, కాలకూటరసం, మహావాత విధ్వంశిని, వాతాభకేసరిరసం, అమర సుందరి గుటిక, జ్వరకేసరివటి, సంజీవనివటి, మహాజ్వరాంకుశరసం, త్రిభువన కీర్తిరసం, లక్ష్మివిలాసరసం, విశ్వాతాపహరణరసం, లక్ష్మీ నారాయణరసం, సింహప్రతిపాలనరసం, ఆనంద భైరవరసం.

**నిజ జ్వరములు**

వాత, పిత్త, కఫ, ద్విదోష, సన్నిపాత.

**వాత చికిత్స :** మహాసుదర్శన చూర్ణం, సత్వర జ్వరశామకం, కల్పతరు రసము, త్రిపురభైరవరసం, సూతరాజరసం, జ్వరఫణిగరుడం, జోగినిరసం, స్వల్పకస్తూరి భైరవరసం, చంద్రశేఖరసం, జ్వరకాలకేతురసం.

**కఫ :** రత్నగిరిరసం, శీతభంజీరసం, దుర్జలజేత రసం, కఫకేతు రసం, శ్లేష్మకాలనాల రసం, కస్తూరి భైరవ రసం, మహాప్రబోధాంజనం.

**కఫజ్వర పథ్యం :** కులత్థ, పురాణశాలి, చణకము, షష్టికదాన్యం, కలాయ(బఠానీ నీళ్ళు).

**ద్వంద్వ జ్వరం :** 1. వాత పిత్త 2. వాత శ్లేష్మ 3. శ్లేష్మ పిత్త.

**వాతపిత్త చికిత్స :** కంటికార్వాది క్వాథము, పంచమూలాది క్వాథం, పర్పటాది క్వాథము, జయవటి, జయన్తివటి.

**వాతశ్లేష్మ :** దశముల క్వాథము, వచాది క్వాథము, అరగ్వదాది క్వాథము

**శ్లేష్మ పిత్త :** పటోల నింబాది యూషము, అమృతాష్టక క్వాథము, కిరాతాది క్వాథము, చార్వ్యాది క్వాథము, అరగ్వదాది క్వాథము.

**ఆగంతుక జ్వరం**

1. అభిషుతుజ 2 అభిషంగ 3. అభివారజ 4 అభిశాహజ

**అభిషంగ బేధములు :** మనో వికారాది షంగజములు

(ఎ) కామాబిషంగజ (బి) శోకబిషంగజ, భయబిషంగజ, క్రోధబిషంగజ

2. భూత బిషంగజ 3. విషాబిషంగజ

**భూతవిషంగజ :** దండకజ్వరం(డెంగ్యూ), పీతజ్వరం(ఎల్లో ఫీవర్), విషజ్వరం(టైఫస్)

(కస్యప సంహిత)

కాస్యప : సమజ్వరములు, విషమ జ్వరములు.

నవజ్వరం, మధ్యమజ్వరం, పురాణజ్వరము (జీర్ణ జ్వరం)

**చికిత్స :** వర్ధమాన పిప్పలి, దాత్ర్యాది పిప్పలి, సువర్ణమాలినీ వసంత, జయమంగళ రసం, చందనాది లోహం, షట్పల ఘృతం.

**జీర్ణచికిత్స :** సంశయనీవటి, పర్పహృద్యరిష్ట, స్వర్ణభస్మం, మల్లభస్మం, గుడుచీ సత్వం, రససింధూరం.

**పునారావర్తక జ్వరం**

1. యుకాలిక్షజన్య పునరావర్తక జ్వరం 2. విణ జన్య పునరావర్తక జ్వరం

**చికిత్స :** కిరాత తిక్తాదిక్వాధము, తాళకసింధూరం, భూతభైరవరసం, శీతభంజనరసం.

**సన్నిపాత జ్వరములు : (13 రకములు)**

ప్రకృతి సమ సమంవాయము, వికృత సమంవాయము.

**చికిత్స :** కస్తూర్యాదిఅంజనం, భృష్టకులత్థచూర్ణం, అర్కాదిక్వాధము, బృహత్ పంచమూల క్వాధము, వాతభకేసరి రసం, లక్ష్మీనారాయణ రసం, దేవదార్వ్యక్వాధము.

1. వాతోల్బణ 2. పిత్తోల్బణ 3. కపోల్బణ 4. వాత పిత్తోల్బణ మందకఫ 5. వాతశ్లేష్మల్బణ మందపిత్త శీఘ్రకారి 6. పిత్తకపోల్బణ హీనవాత (చెల్లు) 7. హీనవాత పిత్తమధ్యశ్లేష్మాదిక (వైదారిక) 8. హీనవాత మధ్యకఫ పిత్తాదిక (యామ్య) 9. హీన పిత్తమధ్య కఫాధిక (క్రచక) 10.హీనపిత్త వాత మధ్యకపాది (కర్కాటక) 11. కఫహీన పిత్తమధ్యవాతాధిక (సమ్మోహిక) 12. కఫహీన వాతమధ్య (పిత్తాదిక) 13. సర్వదోషజ (కూట పాలక).

**సన్నిపాత జ్వర భేదములు :**

1. శీతంగా సన్నిపాత 2. తన్ద్రిక సన్నిపాత 3. ప్రలాపక సన్నిపాత 4. రక్తపిష్టిని సన్నిపాత 5. అభిన్యాస్య 6. జిహ్వగ సన్నిపాత 7. సన్ధిగత 8. అన్తక 9. రుగ్దాహ

**చికిత్స :**

1. కట్పలాది చూర్ణం 2. మహలవంగాది చూర్ణం 3. ఏలాదిచూర్ణం 4. నింబాది చూర్ణం 5. మంజిష్టాది ఘృతం 6. బిల్వకాది ఘృతం 7. పంచతిక్త ఘృతం 8. అంగారక తైలం 9. లాక్ష్యాదితైలం

10. ధాన్యకారిష్టం 11. కిరాతారిష్టం 12. అమృతారిష్టం 13.జ్వరారి 14. జ్వరాంకుశ 15. జ్వరగజకేసరి 16. స్వచ్ఛందభైరవము 17. సన్నిపాత భైరవము 18. సింహప్రతిపాలనరసం 19. హుతాసనరసం 20. సూతరాజీయము 21. రాజమణిరసం 22. అమృతసంజీవిని రసం 23. శీతాంశురసం 24. జ్వరఫణిగరుడం 25. జోగినీరసం 26. స్వల్పకస్తూరి భైరవము 27. జ్వరమరాదిరసం 28. లక్ష్మీవిలాస్ రసం 29. చంద్రశేఖరరసం 30. జ్వరకాలకేతురసం 31. మహాప్రబోదాంజనం.

**పథ్యం :** విరుద్ధాహారములు ఆకుకూరలు పగటినిద్ర, స్నానం స్త్రీ సంబోగం ఎండ,గాలి, క్రోదం

**జ్వరాతిసారం**

1. ధాన్యశౌంఠి 2. గుడుచ్యాది కషాయం 3. ఉశీరాది కషాయం 4. వోష్యాదిచూర్ణం 5. కళింగాది గుటిక 6. గగన సుందర రసం. 7. కనక ప్రభావటి 8. పంచామృత పర్పటి.

**అపథ్యం :** ఎండుద్రాక్ష, కుండపంచదార, కలకండ, యవలు, గోధుమ, జాగరణం, పగటినిద్ర, సంగమములు.

## తృష్ణ

అధిక దప్పిక

**చికిత్స :** జింజీర పానకం, గుడూచి సత్వం, సూతశేఖర రసం, ప్రవాళ పిష్టి, ఆమలకీరసాయనం.

**పథ్యం :** శాలిధాన్యలేపి, లాజమండము, తేనె,మసూర, ఆవుపాలు, మజ్జిగ, ధనియాలు, కషాయం, నారికేళజలం, శర్కర, అరటి ఫలశాకము, ఖర్జూరఫలం, దాడిమ, ఆమలకీ, మాతులుంగ, కరమర్ద, జంబీర, కూష్మాండ.

**అపథ్యం :** ఆమ్లు, లవణ, తిక్త, కషాయ, రస, గురుద్రవ్యములు. దూషిత జలం త్రికటు.

## తృష్ణా

నాలుక బైలువెడలుట.

**బేధములు :** 1. వాత 2. పిత్త 3. శ్లేష్మా 4. సన్నిపాత 5. ఉపసర్గ 6. ధాతుక్షయం.

**చికిత్స :** 1. పక్వోందుభర క్వాదము 2. బిల్వామూలాది కషాయం 3. వృషాది కషాయం 4. తుండికేరి కార్పసయోగం 5. ఆమ్రాదికషాయం 6. వటశృంగాది గుటిక 7. రసాది గుటిక 8. హరితాళవటి 9. ప్రవాళ పిష్టి 10. మాతులుంగ రసాయనం 11. జంబీరాది రసాయనం 12. గుడుచీ సత్వం.

**పథ్యం :** పిష్టిక,శాలి, కోద్రవ, ముద్గ, మాసుర,చణక,కూష్మాండ పటోల,ఉష్ణోదక,అరటిపువ్వు, ఖర్జూర, ద్రాక్ష, మాతులంగ, ఆమలక, నారికేళోశోదక, జంబీర,శీతోదకం, హిమోదకం, శృతశీతజలం, శర్కర, ఇక్షురసం, గోక్షీరం, అజాక్షీరం.

**అపథ్యం :** గురు ఆమ్ల లవణ కటు కషాయ రసమాత్రం, దుష్టజలం, ఉష్ణోదకం, దంతకాష్ట ,వ్యాయామం, ధూమపానం, పిప్పలి, మిరియాలు, చెడ్డ నీరు, కారము.

## దాహము

శరీరము మంటగ ఉండు ముఖ లక్షణం. మధ్యము యొక్క అతిసేవన, రక్తపిత్తములచే దూషితమగుట, దప్పిక అవుట వలన రక్తస్రావం క్షయరోగం, మర్మాఘాతం.

**చికిత్స :** గుడూచీ సత్వం, ప్రవాలపిష్ఠి, ఉశీరాసవ

**పథ్యం :** పుష్టికి శాలి,ముద్గబీజ, యవ మండలాజ క్షీరము,వెన్న, శర్కర, మాంసరసం, శ్వేత కూష్మాండ ఫలం, అరటి పటోల, పర్పటి పత్ర, పరూషకీ ఫలం, ప్రియలా,శృంగటక, ద్రాక్ష, నారికేళఫలం.

**అపథ్యం :** కటు,తిక్తరస,ఉష్ణ ద్రవ్యములు. తాంబూలం,అసాత్మ్య బీజ పదార్దము హానికరము.

## దాహ రోగము

మద్యపానం వలన పిత్తము ప్రకోపించి దాని యొక్క యూష్మము పిత్త రక్తము వలన వృద్ధిచెంది చర్మగతమై భయంకరమగు దాహము కలుగును.

**బేధములు :** రక్తపిత్తదాహము, రక్తదాహము, తృష్ణ దాహము, పిత్త దాహము, రసాది ధాతు క్షయం, మర్మఘాతములు, రక్తపూర్ణాదర దాహము.

**పథ్యము :** పెసలు చిరుసెనగలు, మెట్టభూమి యందలి జంతురసములు, పేలాల పిండి, పంచదార నూరుమార్లు ఉదకముతో కడుగబడిన ఘృతము. పాలు, పాలయందు తీయబడిన వెన్న బూడిదగుమ్మడికాయ,

దోసకాయ, అరటిపండు,పనసపండు, తీపిగల దానిమపండు, పొట్లకాయ, దొండకాయ, ఆనపకాయ, అల్లం, ఖర్జూర పండు, ధనియాలు సదా లేతపాటి ముంజలు, కరక్కాయ, చేదుగల పదార్దము, వరికెట్టు నెమ్మటముగల కచ్చో రాలు, శీతలపదార్ధలేపము.

**అపథ్యము :** క్షారమత్స్యాది విరుద్ధన్నములు విరుద్ధ పానం సేవించుట, క్రోధమున జెందుట, వేగము నడ్డగించుట, శ్రమ, స్త్రీసంఘమము కడుపునుబ్బించెడి పదార్ధములు, క్షారము,పిత్తకర వస్తువులు, సంచారము చేయుట ,ఎండ ,మజ్జిగ, తాంబూలము, తేనె, ఇంగువ, చేదు, కారం, ఉష్ణముగల పదార్దములు.

## ధాతు క్షయము

స్మృతినాశనం, మందబుద్ధి, ఆత్మవిశ్వాసం లోపించుట,మైథున అయోగ్యత లేక అసమర్ధత శిథిలత చర్మంవృద్ధి చెందుట, పురుష జనాంగ ముల యందు మంట, వాపు మొదలగునవి.

**చికిత్స :** మకరధ్వజవటి, శిలాజిత్వాది వటి, మకర ముష్టియోగం, స్మృతిసాగరరసం, పూర్ణచంద్రరసం, అమృతప్రాశవలేహం, అశ్వగంధాది ఘృతం, బ్రహ్మీఘృతం, బృహత్ చాంగాల్వాది ఘృతం, మృత సంజీవని సుర.

**పథ్యం :** శాలి, గోధుమ, మసూర, బీజ, పాలు, వెన్న, జింక, కోతి, కుందేలు, మేకమాంసం, ద్రాక్ష, ఖర్జూర, ఆమ్ర, దాడిమ.

**అపథ్యం :** కటు, ఆమ్లరస భోజనములు హానికరమగు అతి మైథునం వర్జితము.

## నాడీ వ్రణం

**బేధములు :** 1. వాత నాడీ వ్రణం 2. పిత్తినాడీ వ్రణం 3. శ్లేష్మ నాడీ వ్రణం 4. త్రిదోష నాడీ వ్రణం 5. శల్యానాడీ వ్రణం.

**చికిత్స :** సిందూరాది లేపం

**పథ్యం :** వడ్లబియ్యం, గోధుమలు, నల్లని పాతబియ్యం, చిరుసెనగలు, కందులు, పెసలు, అనులేనియుషము, పశుపక్షి మాంసం, నెయ్యి, నూనె, పొట్లకాయ, లేతముల్లంగి, వంకాయ, కాకర, ఆగాకరకాయ, చిర్రికూర.

**అపథ్యం :** రూక్షం, పులుసు ,శీతలం,ఉప్పుగలరసం, మైధునం,

శ్రమ, బిగ్గరగా మాటలాడుట, స్త్రీ.

## నాసా రోగము

తుమ్ములు, శరీరం బరువుగా నుండుట, బడలిక

**చికిత్స :** త్రిభువన కీర్తిరసం, నాగగుటికా.

**పీనసం :** ప్రారంభావస్థలో శిరోగౌరవం, క్షుధానాశము నాసాస్రావము స్వరభేదం కలుగును. తరువాత నాసాస్రావం గాఢమగును. మరియు నాసా వివరములందు ఉండిపోవును. గంధము మరియు సంజ్ఞానాశము.

**చికిత్స :** వ్యోషాదివటి, మహలక్ష్మివిలాస్, చిత్రహరితకి అవలేహం, షడ్బిందుతైలం (లేక) అణుతైలం

**పథ్యం :** లఘుఆహారం, ఉష్ణజలం, పురాణశాలి, కులుత్థ, ముద్గబీజ, పటోల,శిగ్రుఫల, మూలీ,రసోన.

**అపథ్యం :** అభిష్యంది, గురుద్రవ్య,అసాత్మ్యభోజనం.

## నాసా రోగములు

ముక్కుకు సంబంధించిన రోగములు.

**రోగబేధములు :** 1. వాత ప్రతిశ్యాయము 2. పిత్త ప్రతిశ్యాయము 3. శ్లేష్మ ప్రతిశ్యాయము 4. రక్త ప్రతిశ్యాయము 5. సన్నిపాత ప్రతిశ్యాయము 6. అపీనసము 7. ప్రతీనాహము 8. నాసార్మము 9. భ్రాశ్యదు 10. క్షవము 11.నాసానాహము 12. పూతిరక్తము 13. అర్బుదము 14. దుష్టపీనసము 15. నాసా శోషము 16. భూణపాకము 17. పుటస్రావము 18. దీప్తకము.

**చికిత్స :** వ్యోషాది చూర్ణము, చవ్యాధి చూర్ణము

చిత్రక, హరీతక్యవలేహము, చిత్రకావలేహము, గృహధూమతైలం, పాఠాది తైలం, కుష్టతైలం, వ్యాఘ్రీ తైలం, గృహధూమ తైలం, నఖతైలం.

**పథ్యం :** యవలు, బియ్యం, ఉలవలు, పెసలు, గ్రామ్యమాంసం జింకల మాంసం, వంకాయ, చేదుపొట్ల, మునగకాయ, మారేడుకాయలు, ముల్లంగి, వెల్లుల్లి, పెరుగు, ఉష్ణోదకం, మద్యం, ఉప్పు, జిగట గల పదార్ధములు, ఉష్ణం లఘుకర భోజనం.

**అపథ్యం :** స్నానం, క్రోధం మలమూత్ర వాత వేగముల నడ్డగించుట, ద్రవపదార్ధములు, భూమిపై పరుండుట.

# నేత్రరోగం

**నేత్రబిష్యంధం :** నేత్రశ్లేష్మకల యొక్క శోధ మరియు ఎర్రబడుటను నేత్రబిష్యందం అందురు. అశ్రుస్రావం, జడత మంట నేత్రగౌరవం శిర, శూల.

**కూకునఖము :** కూకుణనకం తల్లిపాలు త్రాగు శిశువుల యొక్క మర్మ ప్రదేశం. ఇది రోగి యొక్క వర్త్మ శోధయుక్త ఎర్రగా కండు మరియు స్రావ యుక్తముగా నుండును. పిల్లలు ఎప్పుడూ నుదురు నేత్ర నాసా ప్రదేశమును తడుముకొనుచుండును. ఎండను చూడలేకపోవును.

**అర్మ :** కనుగుడ్డుపై ముక్కు వైపు త్రికోణాకార పొర పుట్టి వ్యాపించు చుండును.

**ఫోథకీ :** కనుగుడ్లపై ఎర్రని చిన్న చిన్న పొక్కులు జనించును. మంట నొప్పి అశ్రుస్రావం.

**అంజననామిక :** మంట పొడిచినట్లు నొప్పి రాగిరంగు గల మృదువైన చిన్న పొక్కులు జనించును.

**పక్ష్మశాతం :** కనురెప్పలపై ఉండు వెంట్రుకలు ఊడిపోయి మంట మొదలగునవి జనించు అవస్థను పక్ష్మశాతం అందురు.

**నక్తాంధ్యం :** ఇవి కఫదోషముచే కలుగును. ఇందు రోగి రాత్రియందు చూచుటకు అసమర్ధత కలిగి పగటిపూట సరిగా చూడకలుగుచుండును.

**నిక్టోలిప్ :** పగటిపూట వ్యక్తి కనులముందు చిత్ర విచిత్ర రూపముల రంగులు, కనిపించును. మరియు అతడి కనులు ముంగీస కనులు వలె కనిపించును.

**దివాంధ్యం :** రోగి అన్ని పదార్ధములను పసుపు రంగులో చూచును. కానీ రాత్రులందు అన్ని వస్తువులను స్పష్టంగా చూచును.

**సవ్రణ అవ్రణ శుక్లం :**

**స్రవణ :** కృష్ణభాగమున కొంచం కాఠిన్యత కలిగించు వ్రణం మరియు ఉష్ణస్రావం జనించును.

**అవ్రణ :** కుష్టమండలంలో దాహయుక్త శ్వేత వర్ణ భిన్న పరిమాణంలో పొక్కులు జనించును. దీని వలన విషమ దుష్టి మరియు వస్తువులను మేఘవృత్తమైన వాటిగా చూచు చుండును.

**దృష్టి దౌర్బల్యము :** దృష్టి మాంద్యము, కళ్ళయందు విచిత్ర రూపములు కనిపించుట, వస్తువులు, మేఘవృత మయినట్లుగా కనిపించుట దూరస్థ వస్తువులు సమీపంగా వుండు వస్తువులు దూరంగా కనిపించుట.

**చికిత్స :** త్రిఫల చూర్ణం, త్రిఫల ఘృతం, సప్తామృత లోహము.

**తిమిరం :** కాచము యొక్క కొద్దిగా లేక సంపూర్ణముగా పారదర్శకత కోల్పోవుట, తిమిర మందురు. ఇందు రోగియొక్క దృష్టి కృశించి అవాస్రవిక వస్తువులను దర్శించును. చివరి అవస్థలో పూర్తిగా దృష్టి లోపము కలుగును.

**పథ్యం :** యవ, శాలి, ముద్గ, తిక్త, ద్రవ్య, పురాణ, ఘృత, కర్పూర, చందన, నారీదుగ్ధ,అంజనం.

**అపథ్యం :** విదాహ కటు ఆహార ఉష్ణ మరియు గురు ద్రవ్య అంకురిత అన్నం,తైలముచే చేయబడిన పదార్ధములు, పెరుగు, ఆమ్లలవణ మత్స్య మాంసములు.

## నేత్ర రోగములు

**నేత్ర రోగ సంఖ్య (24) :**

1. కృచ్ఛ్రోన్మీలము 2. పక్ష్మఘాతము 3. కపోత్క్లిష్ఠము 4. లోహితం 5. అరుజీబుమేఘము 6. రక్తోత్క్లిష్టము 7. కుకూనకము 8. పక్ష్మర్మము 9. పక్ష్మిరోధము 10. పిత్తోత్క్లిష్టము 11. షోథకి 12. శ్లిష్టవర్త్మము 13. బహులము 14. పక్ష్మోత్సంగము 15. మేదోర్బుదము 16. కుంబీకము 17. సికతావర్త్మము 18. అలంగణము 19. అంజననామికము 20. కర్దమము 21. శ్యామ వర్మము 22. విషవర్మము 23. అలజి 24. ఉత్క్లిష్ట వర్త్మము.

**నేత్ర సంధి రోగములు - 9**

1. జలస్రావం 2. శ్లేష్మ స్రావం 3. రక్తస్రావం 4. పర్వాణి 5. పూయస్రావం 6. క్రిమిగ్రంధి 7. ఉపనాహము 8. అలజి 9. యలశము

**కంటి తెల్లగుడ్డు నందు జనించు రోగములు -13**

1. సిరోత్పాతము 2. సిరాహర్షము 3. సిరా జాలము 4. శుక్లకము 5. శుక్లార్మము 6. అదిమాంసార్మము 7. ప్రస్తాహర్షము 8. పిష్టకం 9. సిరాపిటిక 10. కఫగ్రంధికం 11. అర్జునము 12. స్నాయ్వర్మము 13. అధిమాంసం.

**కంటినల్లగుడ్డు జనించు రోగములు :** 1. శుద్దశుక్రం 2. సిరా శుక్రము 3. క్షత శుక్రము 4. అంజికము 5. సిరాసంగము.

**కాచ బిందు రోగములు :** 1. వాతజ కాచ బిందువులు 2. పిత్తజ కాచ బిందువులు 3. శ్లేష్మజ కాచ బిందువులు 4. రక్తజ కాచ బిందువులు 5. సంసర్గజ కాచ బిందువులు.

**తిమిరోగములు :** 1. వాత 2. పిత్త 3. శ్లేష్మ 4. సంసర్గ 5. రక్త 6. సన్నిపాత.

**లింగ నాశ :** 1. వాతజ లింగనాశము 2. పిత్త లింగనాశము 3. శ్లేష్మ లింగనాశము 4. త్రిదోష లింగనాశము 5. ఉపసర్గలింగనాశము 6. సంసర్గలింగనాశం, రక్తలింగ నాశం.

**దుష్టి రోగములు :** 1.పిత్త విదగ్ధం 2. ఆమ్లపిత్త విదర్ధం 3. ఉష్ణ విదగ్ధం 4. నకులాంధ్యమం 5. దూసవాంధ్యం 6. రాత్రంధ్యయము 7. హ్రస్వదృష్టి 8. గంభీర దృష్టి.

**అభిష్యందం :** 1. రక్తాభిష్యందము 2. వాతాభిష్యందము 3. పిత్తాభిష్యందము 4. శ్లేష్మభిష్యందము.

**అధిమంద రోగములు :** 1. వాత 2. పిత్త 3. శ్లేష్మ 4. రక్త

**సర్వాక్షి రోగములు :** 1 వాతవిపర్యయము 2 అల్పశోఫ

3. అనృతోవాతము 4 పాకాత్నయము 5 శుష్కాక్షిపాకం 6 శోఫము 7 అజ్యూషితం 8 హతాదిమంధము.

**చికిత్స :** 1. త్రిఫలాదికషాయము, 2 వాసాదిక కషాయము 3. అమృతాది కషాయము 4. చంద్రప్రభ గుటిక 5. మహాత్రిఫలాది ఘృతం 6. పటోలాది ఘృతం 7. ద్రాక్షాది ఘృతం 8. మహాత్రిఫల రసము 9. కృష్ణాది తైలం 10. సృపవల్లభ తైలం, 11. యుష్ట్యాదితైలం, 12. అమృతాది ఘృతం 13. కతాకాంజనము 14. దాత్ర్యాంజనము 15. ఉత్పలాంజనం 16. నారికేళ అంజనం 17. గరుడాంజనం 18. రసాంజనము 19. చంద్రకాంజనం 20. తిలపుష్పాంజనం 21. శిలాద్యంజనము 22. గిరికర్ణ కాద్యంజనం 23. తామ్రాంజనం 24. నేత్రాంజనం 25. సిద్దనాగార్జునవర్తి 26. నేత్రబిందు 27. గజకేసరివర్తి 30. కతకాంజనం, గరుడాంజనం శిలాద్యాంజనం.

**పథ్యం :** వరిబియ్యం,గోధుమలు, పెసలు, సైంధవలవణం, ఆవునెయ్యి, ఆవుపాలు, పంచదార, తేనె.

**అపథ్యం :** మనుబాల, చక్రవర్తికూర, పొన్నగంటాకు, చిర్రికూర, గలిజేరు, కల్లు, పెరుగు, ఇంగువ, ఉప్పు, తెలగపిండి, పిండివంటకములు, స్నానం, సంచారం, ఉదకపానం, తాంబూలం, కోపం, ఎండ, తేజస్సును చూచుట, అగ్నిజ్వాల.

**పరిణామ శూల:**

అన్నంజీర్ణ మయినపుడు కలిగిన బాధ చికిత్స

1) ఖండామలక లేహ్యం

2) శంఖవటి 3) ఖండార్ద్రక లేహ్యం.

## పాండు రోగము

పాండు రోగమందు రక్తము & రక్తకణములు పనితీరు తగ్గి రోగి యొక్క శరీర వర్ణం తెలుపుతో కూడిన పసుపు రంగు (పాలిపోయినట్లు) వుండును.

**చికిత్స :** మాండూర భస్మము, పునర్నవా మాండురం, ధాత్రిలోహం, లోద్రాసవం, కుమార్యాసవం, రోహితారిష్ట.

**పథ్యం :** గోధుమ, యవ, శాలి, ముద్గ, మసూర, అడకీ పటోల తండూలియా, పత్రములు, పునర్నవా, బృహతీ, అరటి, జామ, ద్రాక్ష, ఆమలకీ, దాడిమ మాతులంగ తక్రం.

**అపథ్యం :** లవణ, ఆమ్లరస, గురు ద్రవ్య మధ్యము హానికరములు. మరియు ఎండ వ్యాయామం క్రోధం, అతిమార్గ గమనం, వేగధారణ.

## పాండురోగము

**భేదములు :** వాతపాండు, పిత్తపాండు, శ్లేష్మపాండు, సన్నిపాతపాండు, మృత్తిక పాండు.

**చికిత్స :** సిద్ధమాండూరం, ముస్త్యాసవము, పునర్నవాసవము, లఘు చింతామణి లేహ్యం, చించ్యాది లేహ్యం, లోహరసాయనం, షడ్గుణ సింధూ రం, పునర్నవాది మాండూరం, శోఫాయశరసం, కాలవిధ్వంసరసం, మస్త్యాసవము.

**పథ్యం :** పాతవడ్లు, యవలు, గోధుమలు, పెసలు, జాంగలమాంసము, ఆవుపాలు, బర్రెనెయ్యి, అడ్డసరం, పొట్లకాయ, వెదురకొమ్ము, పర్పాటకం, తోటకూర, ద్రాక్షపండ్లు, నిమ్మపండ్లు, ఖర్జూరపండు, ఉసిరిక పండు, మారేడు నెల్లికూర, గుమ్మడి బద్ద, దుందిలము కలిగొట్ట, నదీజలము.

**అపథ్యం :** గురు కర ద్రవ్యములు, విదాహకర వస్తువులు, నువ్వులు, పులగము, బచ్చలికూర, మాంసములు,

## పైత్యములు

1. ఆవర్ణపైత్యం 2. వివర్ణ పైత్యం 3. సూర్యవర్తి పైత్యం 4. కామలా పైత్యం 5. ఆమ్ల పైత్యం 6. రక్త పైత్యం 7. స్వేదపైత్యం 8. ఉన్మాదపైత్యం 9. పుండరీకపైత్యం 10. భుజంగ పైత్యం 11. కరపాద పైత్యం 12. శీత పైత్యం 13. మూర్ఛపైత్యం 14. మధుర పైత్యం 15. క్రోధ పైత్యం 16. భ్రంశ పైత్యం 17. కుసుమ పైత్యం 18. శిరఃపైత్యం 19. క్షుధాపైత్యం 20. తృష్ణా పైత్యం 21. దుర్భాషాపైత్యం 22. చర్మ పైత్యం 23. దుర్గంధ పైత్యం 24. మదన పైత్యం.

**చికిత్స :** 1.పిప్పలీ ఘృతం 2. జంబీరాధిఘృతం 3. ఖండ కూష్మాండ లేహ్యము 4. అల్లమమురబ్బా 5. లఘుపైత్యాంతకం 6. రామబాణరసం 7. సూర్యవర్తి 8. పిత్తభంజనరసం 9. పైత్యహింసకరసము 10. పైత్యాంకుశ రసము 11. పాణిబద్ధరసం 12. పైత్యాంతక రసం.

**పథ్యం :** పాతవడ్లు, బియ్యము, గోధుమలు, పొట్లకాయ, చిర్రికూర, ఉసిరిక, పొన్నగంటికూర, చేతరాసికూర, ద్రాక్ష, దానిమ్మపండు.

**అపథ్యం** : పెరుగు, పాలు, బెల్లం, నెయ్యి, మినుములు, ఆవాలు, విదాహములు, గురుపదార్థములు, సంచారము, కోపము.

## ప్రవాహికా రోగము

వాత పదార్థములను అధికముగా భుజించుటచే వాతము ప్రకోపించి ఉదర మందలి శ్లేష్మముతో గూడి మలమును కఫ మిశ్రితమగును. గుద ద్వారము వెడలునటు చేయునదియు ప్రవాహిక అనబడును.

**రోగభేదములు :** 1.వాత ప్రవాహిక 2. పిత్త ప్రవాహిక 3. శ్లేష్మ ప్రవాహిక 4. రక్త ప్రవాహిక.

**చికిత్స :** 1. శంఖ ద్రావకం 2. ప్లీహరి రసము 3. రోహితకారిష్టము

**పథ్యం :** పక్వజీర్ణ జ్వరముల యందుపయోగించు పదార్థములు వాడ వలయును. సామాన్యంగా పాలు నిచ్చుటకు బదులుగా రెండు మూడు పిప్పళ్ళులతో ఉడికించిన పాలను రోగికి ఇచ్చుట యుక్తము.

**అపథ్యం :** పక్వ జ్వరములందు విడనాడవలసిన పదార్థముల ఇప్పుడు కూడ విసర్జింపవలెయును. రాత్రి జాగరణ పగటి నిద్ర స్త్రీ సంగమము.

## ప్రమేహము

మూత్ర విసంగతి యొక్క సమూహం ఇందు అత్యధిక మాత్రలో మూత్రం పోయుట ఇవి 20, కఫ-12, పిత్త-6, వాత-4. వాతమేహములు అసాధ్యము.

**మధుమేహం :** అన్ని విధముల ప్రమేహములు కూడ ఉపేక్షించినచో మధుమేహ దశకు చేరును.

ఇక్షుమేహముకు విశిష్ట యోగం : జయన్తి క్వాథము

**చికిత్స :** నారసింహ, చూర్ణం, చంద్రకలావటి, శుద్ధశిలాజిత్, చంద్ర ప్రభావటి, శిలాజత్వాదివటి, శుక్రమాతృకవటి తారకేశ్వరరసం, వంగేశ్వర రసం, వసంత కుసుమాకర రసం, స్వర్ణవంగం, వంగభస్మము, గోక్షురాది గుగ్గులు.

**పథ్యం :** యవ, గోధుమ, కోద్రవ, కంగునీ, ముద్గ, కులత్థ, పటోల, శిగ్రు, కాకరకాయ, ఉదుంబర, కపిత్థ, గుడుచీ, త్రిఫల

**అపథ్యం :** ఆమ్ల, మధుర, లవణ, రస, నవీన అన్న, ఇక్షురస, గుడము పెరుగు, తైలము.

**ప్రమేహ పిడకలు :** ప్రమేహంను ఉపేక్షించినచో విభిన్న ప్రకారంలు పిడకలు జనించును. ముఖ్యంగా సంధి మాంసం, మర్మములు ప్రభావిత మగును. ప్రమేహం లేనివారికి కూడ మేదో దృష్టి కారణముగా జనించ వచ్చును.

1. శరావిక 2. సర్షపికా 3. కచ్ఛాపికా 4. జాలినీ 5. వినతా 6. పుత్రిశ 7. మాసూరిక 8. అలజి 9. విదారికా 10. విద్రధికా.

**చికిత్స :** సారివాద్యసవము.

**అపథ్యం :** అభిష్యంధి, రూక్షణ,తీక్ష్ణ దుష్టాచ్య ద్రవ్యములు రసోన పిండ లేక పలాండు మత్స్య మద్యములు.

## బాల రోగములు

పిల్లవాడు గుక్కపెట్టి ఏడ్వటం, విరామం లేకుండా ఉండడాన్ని గమనించడం ద్వారా నొప్పి / వ్యాధి స్థితిని అవగతం చేసుకోవచ్చు.

– పిల్లలు ఏ శరీర భాగాన్నైతే తాకడానికి ప్రయత్నిస్తు ఉంటారో ఏ భాగాన్ని తాకినపుడు ఏడుపు పెంచుతున్నారో గమనిస్తే అక్కడ బాధ వున్నట్టు అర్ధం.

– పిల్లలు పళ్ళు కొరుకుతూ గుప్పెట మూసుకొని మరియు కష్టంగా గాలి పీలుస్తూ వుంటే ఊపిరితిత్తులలో వ్యాధి వుందని అర్ధం.

– పిల్లలు జ్వరం వచ్చే ముందు వ్యాధి చూపిస్తు వుంటారు. ఏమి తినరు. నోటియందు లాలాజలం ఎక్కువగా అవుతుంది. మరియు ముఖ మంత వేడిగాను కాళ్ళు మాత్రం చల్లగా వుంటాయి.

– కడుపులో గుడ గుడ శబ్దం, వాంతి ఉబ్బరం తల్లియొక్క స్తనములను పళ్ళతో కొరకడం, కాళ్ళు వంచడం చేస్తే కడుపులో బాధ వుందని అర్ధం.

– పిల్లలు చూపులు బెదిరినట్లు విరామం లేకుండా ఉన్నట్లు ఉంటే దానికి కారణం మలం మూత్రం అపానవాయువు విసర్జన కాలేదని.

**బాల జ్వరం :** షడంగ పానీయం, బాల చతుర్భద్ర చూర్ణం, గోదంతా భస్మం.

**ఫక్కరోగం :** శిశువు ఒక సంవత్సరం వయసులోగా నిలబడలేకపోతే అతడు ఈ వ్యాధికి గురి అయ్యే అవకాశం వుంటుంది.

**చికిత్స :** 1. లఘు వసంత మాలతి 2. కచ్ఛాప పృష్టభస్మము 3. కర్కాటక భస్మము 4. ప్రవాళ పంచామృత రసం 5. శతావర్యాది అవలేహం 6. ప్రవాళ భస్మ (లేక) శుక్తిభస్మము.

## బాల రోగములు

**భేధములు :** 1. వాతజం 2. పిత్తజం 3. శ్లేష్మజం 4. దంతోచ్ఛేదము 5. దంతాఘాతము 6. దంతశబ్దము 7. అకాలదంతము 8. అహిపూతనం 9. ముఖపాకము 10. ముఖస్రావం 11. గుదపాకం 12. ఉపశీర్షకం 13. పార్శ్వారుణం 14. తాలుకంటకం 15. విచ్ఛిన్నము 16. పరిగర్భికము 17. దౌర్బల్యము 18. గాత్ర శోషము 19. శయ్యామూత్రం 20. కుకూనఖము 21. రోదనం 22. అజగల్లి.

**చికిత్స :** బాలా రోగంతక రసం

**బాల గ్రహ దోషములు :** 1. స్కంద గ్రహము 2. విశాఖ గ్రహము 3. పితృగ్రహము 4. సైగ మేష గ్రహము 5. శకునీ గ్రహము. 6. శీతపూతన గ్రహము 7. ముఖమండనీ 8. పూతనా గ్రహము 9. అంధ పూతన 10. రేవతి 11. స్వగృహ 12. శుష్కరేవతి.

## భగంధరము

భగందరము కల్గుటకు ముందు నడుము నొప్పి గుద ద్వారము నందు దురదతో కూడిన వాపు మరియు మంట కల్గును.

**పథ్యం :** పెసలు, వాస్తుక ఆకులు, మరియు వివిధ రకములైన, ఆకు కూరలు తేలికగా జీర్ణమగు ఆహార పదార్ధములు, భగందర రోగంకు పథ్యం.

**అపథ్యము :** విరుద్ధ ఆహారము, అధికంగా మాటి మాటికి భుజించుట, అధికంగా వ్యాయామం చేయుట, వాహనంపై అధికంగా ప్రయాణించుట.

**చికిత్స :** పంచ తిక్త ఘృతం. మోతాదు: 12-24 గ్రా.

## భగందర

1. శతపోతము 2. ఉష్ణగ్రీవము 3. పరిస్రావీ 4. ఋజువు 5. పరిక్షేపము 6. ఆర్శోజము 7. ఉన్మార్గి 8. శంఖావర్తము.

**చికిత్స :** 1. అమృతాది గుగ్గులు 2. త్రిఫలాది గుగ్గులు 3. పంచతిక్త గుగ్గులు ఘృతం 4. గుగ్గుల్యాసవము 5. గంధకతైలం 6. విడాంగాది వటకములు.

**పథ్యం :** శాలిధాన్యం, పెసలు, పొట్లకాయ, మునగకాయ, లేత ముల్లంగి, నువ్వుల నూనె, ఆవనూనె వగరు పదార్ధలు, తేనె, నెయ్యి

**అపథ్యం :** శ్రమచెందుట, మైధునం, యుద్ధం, మొలకెత్తిన పదార్ధాలు భుజించుట.

## భూతోన్మాదం

**భేదములు :** 1. దేవోన్మాదము 2. దానవోన్మాదము 3. గంధర్వోన్మాదము 4. కిన్నరోన్మాదము 5. యక్షోన్మాదము 6. అగ్ని ఘ్వాత్తాది పిత్రోన్మాదము 7. గుదోన్మాదము 8. గుహ్యోన్మాదము 9. వృద్ధోన్మాదము 10. భూతోన్మాదము 11. సిద్ధోన్మాదము 12. ప్రేతోన్మాదము 13. జలాధిదేవతో

న్మాదము 14. పిశాచోన్మాదము 15. నాగోన్మాదము 16. బ్రహ్మ రాక్షసో న్మాదము 7. రాక్షసోన్మాదము.

**చికిత్స :** భూతభైరవ రసము, ఉన్మాద గజకేసరి, హింగ్వాది ఘృతం, విజయ ఘృతం.

## భ్రమ

తలయందు తిరుగుతున్నట్లు అనిపిస్తూ నిలబడలేకుండా ఉండు స్థితి భ్రమ కల్గునపుడు రోగియొక్క ముఖము తలను చల్లని నీటితో కడుగవలెను.

**చికిత్స :** రససింధూరం, జహర్‌ముహర్ పిష్టి, హరితాశ్మ పిష్టి, శతావర్యాధి ఘృతం, సారస్వతారిష్ట, బలారిష్ట, హిమంశ తైలము లేక హిమ సాగర తైలము.

## మదాత్యయము

ఎక్కువగా మద్యము సేవించుట వలన సంభవించు లక్షణములు.

**మదాత్యయము :** వాంతి, ఆకలి మందగించుట, దప్పిక, విరేచనాలు మేహము, ప్రలాపం, మాట్లాడలేకపోవుట, ఎక్కిళ్ళు, ఆయాసం, తలయందు వణుకుట.

**పరమదం :** శరీరం బరువుగ వుండుట, రుచి లేకుండుట అన్నద్వేషం, దాహము, కీళ్ళలో నొప్పి, తలనొప్పి, మలమూత్రము ఆగిపోవుట.

**పానాజీర్ణం :** అధ్మానం కడుపులో మండుట వికారం, వాంతి కల్గుట.

**చికిత్స :** కళ్యాణక ఘృతం

**పథ్యం :** శష్ఠికధాన్యం, బార్లీ, పెసలు,గోధుమలు, తండులీయకము, చిర్రికూర, ఆకు బఠాణీలు, పొట్లకాయ, మాదీఫలం, పరుశకఫలం, దానిమ్మ, ఉసిరికపండ్లు.

**అపథ్యం :** చెమట తీయుట, అంజనం, దంత ధావనం, తాంబూలం, ధూమపానం.

## మదన రోగము

**భేదములు :** 1 వాత 2 పిత్త 3 శ్లేష్మ 4 సన్నిపాత 5 మద్యపాన 6 విషసంయోగం.

**మదాత్యయము :** 1. వాత మదాత్యయము 2. పిత్త మదాత్యయము 3. శ్లేష్మ మదాత్యయము 4.సన్నిపాత మదాత్యయము 5. పరమదము

6. పానాజీర్ణము 7. పానా విభ్రమము 8. పానాత్యయము.

**మూర్ఛాదికములు :** అకస్మాత్తుగా తమోగుణం జనించడం.

వాత, పిత్త, కఫ, సన్నిపాత, భ్రమ, నిద్ర, తంద్ర, సన్యాస, గ్లాని.

## మూర్ఛలు

1. వాత మూర్ఛా 2. పిత్త మూర్ఛ 3. శ్లేష్మ మూర్ఛ 4. సన్నిపాతమూర్ఛ

**భ్రమ :** రజోగుణం, పిత్తం, వాతం వీటివలన కలిగే బాధ.

**నిద్ర :** తమోగుణం + పిత్తం + వాతం

**తంద్ర :** ఇంద్రియము మోహంబును జెంది యొకింత నిదుర తెలివి వీనితో కూడిన నేత్రములందు భ్రమ కలిగి వుండుట.

**సన్యాసము :** దేహము మనస్సు వీని వ్యాపారం, వృక్షంవలె భూమి మీద వెళ్ళుట.

**చికిత్స :** భృంగామ్లక తైలం.

**పథ్యం :** వేడినీళ్ళు, అన్నము, 100 మార్లు కడిగిన నెయ్యి మృదుత్వం చేదు పదార్థములు, రసము, పేలాలపిండి, పాతయవలు, యవలు, ఎర్ర బియ్యం, బఠానీలు, ఆవుపాలు, చక్కెర, పొట్లకాయ, అరటికాయ, దానిమ్మ పండు, చిర్రికూర.

**యద్యత్యయము పథ్యం :** విరేచనము, రతిబంధము, నిద్ర, లంఘనము, సంచారము, యవధాన్యం, పెసలు, మినువులు, గోధుమలు లావకపిట్ట, తిత్తిరపక్షి, పాలు,పంచదార, చిర్రికూర, పొట్లకాయ, మాదీఫలము, ఖర్జూరం, దానిమ్మపండు, టెంకాయ, ద్రాక్షపండు, పాతనెయ్యి, కర్పూరం, నదీతీరం, చల్లగాలి, ప్రియాలింగనం, సంగీతం, వాద్యములు.

**అపథ్యం :** చెమటతీయుట, అంజనం, ధూమపానం, నస్యం, దంత ధావన, తాంబూలం.

## మసూరిక

తొందరగా విస్తరించు అంటువ్యాధి. అధికమైన జ్వరం. 3వ రోజు నుండి చిన్న చిన్న పొక్కులు ఏర్పడి రోజు రోజుకు పెరుగు చుండి పగిలి పోయి, మచ్చలుగా ఏర్పడును.

**చికిత్స :** అమృతాది క్వాధము, ఖదిరాష్టక క్వాధము, నింబాది క్వాధము, పటోలాది క్వాధము, త్రిఫలాది క్వాధము.

**పథ్యం :** ద్రవపదార్థములు, లేక పాలు, గోధుమలు, పెసర్లు, కందిపప్పు, కాకరకాయ, పొట్ల, దానిమ్మ, ద్రాక్ష, ఉసిరిక.

**అపథ్యము :** నెమ్మిదిగా జీర్ణమగు అన్నము, మద్యము, మినువులు, నువ్వులు, ఎండా చలిగాలులు, రాత్రుళ్ళు మేల్కొనుట, రాత్రుళ్ళు తిరుగుట.

## మసూరిక (స్మాల్ పాక్స్)

**బేధములు :** 1. వాత మసూరిక 2. పిత్త మసూరిక 3. శ్లేష్మమసూరిక 4. పిత్తాశ్లేష్మ మసూరిక 5. వాతపిత్త మసూరిక 6. వాత శ్లేష్మ మసూరిక 7. సన్నిపాత మసూరిక 8. త్వగ్థత మసూరిక 9. రక్తజమసూరిక 10. మాంసజ మసూరిక 11. మేధాజ మసూరిక 12. అస్థిమసూరిక 13. మజ్జా మసూరిక 14. శుక్రధాతు మసూరిక.

**పథ్యం :** ఆరవ దినమునకు పండు, ఎర్రవడ్లు, సంబాబియ్యం, సెనగలు, పెసలు, చిరుసెనగలు, యవలు, అతిమధురం, దోసకాయ, చేదుపొట్ల, ద్రాక్ష, దానిమ్మపండు రేగు పెసరకట్టు, జాంగల దేశపు జంతువులు, పావురం వానకోయిల గోమయి భస్మలేపము వ్రణనాశక క్రీములు.

**అపథ్యం :** గాలి చమట శ్రమ, గురురాన్నము క్రోధము ఎండుకారము, మలమూత్ర వేగ నిరోధము.

## మూర్ఛ మరియు సన్యాసము

అకస్మాత్తుగా తెలివి తప్పుటను మూర్ఛ వ్యాధి అందురు. కొన్ని సందర్భలలో ఏ ఉపచారము చేయకుండానే ఒకప్పుడు రోగి తనంతట తానుగా తిరిగి తెలివిని పొందును.

**పథ్యం :** ఎర్రరాజనాల బియ్యం తండుల, పెసర్లు, బార్లీ, యవ, పాలు, దానిమ్మ, క్రూరమృగాలు మరియు పక్షులు యొక్క మాంసరసం.

**అపథ్యం :** చేదు పదార్థాలు సర్షపాకులు, తమలపాకు, మజ్జిగ,అనునది మూర్ఛరోగి యందు హానికరము.

## ముఖ రోగ

నోటి భాగములో వున్న ఏడు ప్రదేశములలో అనగా పెదవులు, చిగుళ్ళు, పళ్ళు నాలుక,అంగటి, గొంతు మరియు నోటి ప్రదేశమంతటిలో

ఏ భాగములోనైనను వచ్చు వ్యాధులు.

**ఓష్ఠ రోగ :** ఖదిరాది వటి

**దంతమూల రోగ :** త్రిఫల గుగ్గులు

**సౌశీర :** చిగుళ్ళు వాపు, నోటిలో అధికంగా నీరూరుట.

**చికిత్స :** పంచక్షీర వల్కల కషాయం.

**దంతరోగ :** ఖలివర్ధన (విజ్‌డమ్ టూత్)

17-21 సంవత్సరాల వయసులో తీవ్రమైన నొప్పితో జ్ఞానదంతము పైకి వచ్చుటకు ఖలివర్ధన మందురు.

**పథ్యం :** కారం మరియు చేదు ద్రవ్యములు, కంగువిత్తులు, శ్యామ, లేత, ధనియాలు, యవలు పెసర్లు ఉలవలు మరియు మెంతులు, నెయ్యి, శతావరీ, పటోల పత్రం ఫలము ముల్లంగి కాకర తమలపాకు.

**అపథ్యం :** రుక్షాన్నము, ఆమ్లరస, ఆహారం గురు అభిష్యంద ద్రవ్యములు మినువులు, పెరుగు,పాలు,మరియు బెల్లం ముఖ రోగికి తగదు. పళ్ళును ఎక్కువ తోముట గట్టిపదార్ధములను నములుట బోర్లపడుకొనుట, పగటి నిద్ర, అడవి జంతువుల మాంసం వాడకూడదు.

## ముఖరోగములు

ఓష్ఠగత రోగములు - 11; దంత రోగములు-10; దంతమూల రోగము-18; జిహ్వారోగములు-6; తాలు రోగములు-8; గళరోగ ములు-18; ముఖాంతర రోగం-8.

**ఓష్ఠగత :** వాత, పిత్త, శ్లేష్మ, సన్నిపాత, రక్తఓష్ఠ, క్షత, మాంసార్బుద, ఖండోష్టం, జలార్బుదం, మేదోజార్బుదం, అర్బుదం.

**దంత :** దాలనం, క్రిమిదంతం, దంతాహర్షం, కరాళము, దంతా చాలనం, దంతా శర్కర, అధితం, శ్యాదంతం, దంతభేదం, కలిపాకం.

**దంతమూలములు :** శీతాదం, ఉపకుశము, దంతవిద్రధి, పుష్పటం, అధిమాంసం, విదిర్భం మహాసౌఖిలం, సౌఖిలం, వాత, పిత్త, శ్లేష్మ, సన్నిపాత, రక్తా

**చికిత్స :** దంత ధావన చూర్ణం.

**జిహ్వా :** వాత, పిత్త, శ్లేష్మ, అలసజిహ్వా, అధి, ఉపజిహ్వా.

**చికిత్స :** అరిమేదాది తైలం.

**తాలు :** 1. అర్బుదం లేక తాల్వర్బుదం 2. తాలుపిటిక లేక గ్రంధిషము

3. కచ్ఛాపి 4. తాలు సంహతి 5. గళా తుండి 6. తాలు శోఫ 7. తాలు పాకము 8. పుప్పుటం.

**గళము :** 1. వాతరోహిణి 2. పిత్త రోహిణి 3. శ్లేష్మ రోహిణి 4. త్రిదోష రోహిణి 5. మేదా రోహిణి 6. బృందము 7. గళ్ఘుము 8. గళవిద్రది 9. స్వరఘ్నుము 10. తుండకేరి 11. శితఘ్ని 12. తాలుకం 13. అర్బుదం 14. గిలాయువు 15. వలయము 16. వాతగండము 17. శ్లేష్మగండము 18. మేదో గండము.

**ముఖపాకం :** 1. వాతముఖపాకం 2. పిత్త ముఖపాకం 3. శ్లేష్మ ముఖపాకం 4. రక్తముఖపాకం 5. సన్నిపాత ముఖపాకం 6. దుర్గంధస్యము 7. ఊర్ధ్వగదము 8. అర్బుదం

**పథ్యం :** చెమటతీయుట, విరేచనం, వమనం, గండూషం, ప్రతిసార, కబలదారుణం, రక్తమోక్షణం, నస్యం, ధూమపానం, అగ్నికర్మ, దూసరి బియ్యము, వెదురు బియ్యం, యవలు, పెసలు జాంగలమాంసం నేలఉసిరిక, చల్లపిల్లిగడ్డలు కాకరకాయ, పొట్ల లేత ముల్లంగి, పచ్చకర్పూరం ఉదకం నల్లతుమ్మకం, చేదుగల రసములు.

**అపథ్యం :** దంతకాష్టం, స్నానం, పులుసు, మత్స్యములు, అనూపజంతు, పెరుగు, పాలు, బెల్లం, ఉద్దులు, బోరగిల పరుండుట, జడాన్నం, పిండివంటకం, పగటినిద్ర.

## మూత్రరోగ

**మూత్రకృచ్ఛం :** రోగిమాటి మాటికి కొంచం కొంచం మూత్రంను నొప్పి మంట కష్టముతో విసర్జించవలెను.

**చికిత్స :** ఏలాది చూర్ణం, శుద్ధశిలాజిత్తు, తారకేశ్వరరసం, చంద్రప్రభా వటి, ప్రవాళ భస్మ, శతావరీ ఘృతం.

**పథ్యం :** పాతబియ్యం,పెసలు, బార్లీ, మజ్జిగ పెరుగు, నెయ్యి, చల్లటి నీరు, గుమ్మడి, ఉసిరి, ఖర్జూరములు, కలబందరసం.

**అపథ్యం :** పొడిదనముకల, పులుపు పదార్థములు ఉప్పు, రుచి కలిగినవి తమలపాకులు అల్లం, ఇంగువ, ఆవాలు, ఆకులు, మద్యం.

## మూత్రాఘాతం

మూత్రం రాకుండ ఆగిపోవుట. మూత్రం కొద్ది కొద్దిగా కష్టంతో కూడినట్టి మూత్రాశయం నిండినను మూత్రప్రవృత్తి లేకపోవుట.

**చికిత్స :** పాషాణ బేదచూర్ణం, రుద్రజట కందం యొక్క చూర్ణం, గోక్షుర కషాయం.

**పథ్యం :** పాతవరిబియ్యం, మినువులు, బూడిదగుమ్మడి పచ్చికొబ్బరి, వక్కలు, ఖర్జూరములు, పాలు, పెరుగు, అభ్యంగం.

**అపథ్యం :** పొడిగుణము కలుగజేయు పదార్ధములు, విదగ్ధ విష్టంబి ద్రవ్యములు, శరీర సహజ వేగములనాపుట, సంభోగం, నడక విడిచి వేయ వలెను.

## మూత్రకృచ్ఛము

**భేధములు :** వాత, పిత్త, శ్లేష్మ, సన్నిపాత, శుక్ర, విట్క ృచ్ఛము, ఘాత మూత్రకృచ్ఛము, అశ్మరీ మూత్రకృచ్ఛము.

**చికిత్స :** చందనాసవము, తిలాదిక్షారము, మూత్రవిరేచనీయ క్వాధి చూర్ణం, లఘులోకేశ్వర రసం, తారకేశ్వర రసం, సురాక్షార కాసీసము, శ్వేత పర్పటి, దార్వీచూర్ణం, శ్వదంష్ట్రాదిలేపం, తిలక్షారం.

**పథ్యము :** పొట్లకాయ, పొన్నగంటికూర, ఆవుపెరుగు, మధుర పదార్ధ ములు, దొండకాయ, బెల్లము, కలబంద, ముదురగుమ్మడికాయ, ములదోస నక్కదోసకాయ, పంచదార, అరటిపువ్వు, నెయ్యి, పనసపండు, ఉసిరికాయ, పెసలు, పాలకూర, శీతోధకం తక్రం, గోక్షీరం, దధిఘృతం.

**అపథ్యము :** నువ్వులు,ఆవాలు, తెలకపిండి, నూనె, పిన్నమూలక పెద్ద మూలక, అత్యుష్ణకర పదార్ధములు ఇంగువ, ఉప్పు, ఎండ, మత్స్యములు, కందగడ్డ, పులుసు, మద్యం విదాహకరమగు అన్నము వెదురు ములక సదాప ఉద్దులు, గలిజేరు తాంబూలం, రుక్ష ఆమ్ల, సంగ్రహి పదార్దము, జంబూఫల కషాయ రసం. మలశుక్ర వేగధారణ.

## మూత్ర ఘాతము

మూత్ర, పురీష శుక్రాది వేగముల నడ్డగించుట.

**భేదములు - 13**

1. వాతకుండలీక 2. వాతాష్టీల 3. వాతవస్తీ 4. మూత్రాతీతము 5. మూత్ర జఠరము 6. మూత్రోత్సంగం 7. మూత్రక్షయం 8. మూత్రగ్రంధి 9. మూత్రశుక్రం 10. ఉష్ణవాతం 11. మూత్రసాదము 12. విద్విఘాతం 13. వస్తి కుండలిక.

**పథ్యం :** అభ్యంగనం, చెమటదీయుట, విరేచనం, వస్తి కర్మ ప్రాత యెర్రవడ్లబియ్యం, నిర్జలదేశమునందుండు జంతు మాంసం, మద్యం, మజ్జిగ, పెరుగు, పాలు, మినువులు, యూషం బూడిద గుమ్మడిపండు, పొట్లకాయ, నక్కదోసకాయ, ఖర్జూరం, టెంకాయ, తాటి పురాణశాలి, మూష యూష క్షీరం తక్రం, కూష్మాండ, పటోల, ఆర్ద్రక, నారికేళ, ఖర్జూర.

**అపథ్యం :** విరుద్దాన్నం,వ్యాయామం, నడుచుట, రూక్షపదార్ధములు విదాహకర పదార్ధము,మలబద్దకర పదార్థాలు, మూత్రవేగ నిరోధం వెదురు మొలకలు వమనం.

**చికిత్స :** ఏర్వారుబీజ కల్కము, శతావర్యాది యోగం, గోక్షురక్వాధము, సుర్యాక్షార ప్రయోగం. విదారి, గంధాదిక్షీర, సోరాకారాదిలేపం, బింబమూల లేపం, త్రికంటుకాది ఘృత, అష్టమూర్తి రసాయనం, చందనాదివటి, గోక్షురాది గుగ్గులు, చందనాది ఆసవ.

## మేహరోగములు

### శ్లేష్మజనిత మేహములు - 10

1. ఉదక మేహము 2. ఇక్షుమేహం 3. సాంద్రమేహం 4. సురామేహం 5. సికతామేహం 6. శుక్లమేహం 7. శీతమేహం 8. పిష్టమేహం 9. శనైర్మేహం 10. లాలామేహం.

### పిత్తజనిత మేహములు - 6

1. క్షార మేహము 2. హరిద్రమేహము 3. రక్తమేహము 4. మంజిష్ఠి మేహము 5. నీలమేహము 6. కాలమేహము.

**వాతజనిత :** మధ్యామేహం, వసామేహం, హస్తిమేహం, మధుమేహం,

**చికిత్స :** ఆనందభైరవి, త్రిఫలాదికషాయము, వత్సరాదిక కషాయము, మూత్రసంగ్రహ క్వాదచూర్ణం, జాత్యాది వటికములు, గోక్షురాది గుగ్గులుగుటిక, నిరూర్యాది గుటిక, మహదాడిమ ఘృతం, మధ్వాసవము, హరిశంకరరసం, మధ్వాసవం, మేహకులాంతిక రసం, ప్రమేహకుఠారము, పంచవక్త్రరసం, మేహకులాంతక రసం, ఆనందభైరవి, వసంతకుసుమాకర, మహవంగేశ్వర రసం, పంచలోహరసాయనం, జాతీఫలాదివటి, నింబతైలం, దేవదారు అరిష్ట, హరిశంకర రసం.

**పథ్యం :** వరి వంటకములు, పొట్లకాయ, చిర్రికూర, చక్రవర్తికూర, పొన్నగంటి కూర, పెసరకట్టు, అరటికాయ, చణక, ముద్గ, తిక్తశాకములు,

బింబా, బిల్వ, కపిత్థ.

**అపథ్యం :** తైలం ఘృతం గుడం, మద్యం, కాంజీకం, ఇక్షురసం శుక్రము పిష్టాన్నము నవాన్నము, దధి, దివాస్వప్నం, స్వేధం, మూత్రవేగములు ధరించుట.

## మేహ పిటికలు

శరావిక, కచ్ఛాపిక, పుత్రిణి, అలజి, మాసూరిక, సర్షపిక, జాలిని, విదారిక, విద్రధి.

**చికిత్స :** మకరధ్వజ రసం

**పథ్యం :** పాతబియ్యం, గోధుమలు, బచ్చలికూర, చిర్రికూర, పొన్నగంటి కూర, మనుబాలకూర, లేత మునగకూర, పెసరకట్టు, తిప్పతీగ చాతరాసి కూర, దుందిలపుకూర, వెలగపండు, ఇందుపుకాయ, కాకరకాయ, ఎలుకచెవి కూర, చేదుగల పదార్థములు, సంచారం.

**అపథ్యం :** పెరుగు,కల్లు,బెల్లం,నెయ్యి, పాలు, పులుసు, ఇంగువ, ఉప్పు, వెల్లుల్లి, స్త్రీ సంగమం మత్స్యమాంసములు, నువ్వులు, ఆవాలు, శొంఠి, టెంకాయనీరు, పిండివంటకము, ములకకాయలు, పనసపండు, కందగడ్డ.

**చికిత్స :** వసంతకుసుమాకర, మహవంగేశ్వర రసం, పంచలోహ రసాయనం.

**యకృద్రోగము** (డీసీజ్‌ఆఫ్ లివర్) : లవణ త్రయాది చూర్ణం, బాస్కరలవణం క్షీర షట్పల ఘృతం, విద్యాధర రసం.

## రక్తపిత్తం

**భేదములు :** 1. ఊర్ధ్వగామియగు రక్తపిత్తం 2. అధోగామియగు రక్తపిత్తం 3. ఊర్ధ్వాధోగామియగు రక్తపిత్తం.

**చికిత్స :** ఉసీరాసవము

**పథ్యం :** పెసరకట్టు, గోధుమలు, అణువదినములకు ఫలించినవడ్లు, జాంగలమాంసం, ముదురగుమ్మడిపండు, పొన్నగంటికూర, పొట్లకాయ, చిర్రికూర, ద్రాక్షపండు, ఖర్జూరపండు, ఉసిరిక పప్పు, ఆవునెయ్యి.

**అపథ్యం :** కారం, పులుసు, ఉప్పు, కారం, మత్స్యములు, మద్యం, విదాహకర ద్రవ్యములు, మినువులు, ఆవాలు, నూనె, ఉలవలు, వెల్లుల్లి,

పెరుగు.

**చికిత్స :** ఉశీరాదిచూర్ణం (చ.చి) కిరాతత్తోదిచూర్ణం (చ.చి)చందనాది చూర్ణం (యో.ర) ఖండకూష్మాండ (బా.ప్ర) ఖండకాద్యలేహ (యో.ర) వాసా ఖండం (బై.ర) ఉశీరాసవం (బై.ర) ఏలాదిగుటిక (యో.ర) కూష్మాండ వలేహ (యో.ర) లాక్షవలేహ (బై.ర) వాసాఘృతం (చ.చి) శతవర్యాది ఘృతం (చ.చి) దుర్వాది ఘృతం (బా.ప్ర) శణపుష్పాది ఘృతం (యో.ర) అర్కేశ్వర రస (బై.ర) కపర్ధక రసం (బై.ర) సమశర్కరలేహ (బై.ర) రక్తాపిత్త కుల కుఠార (యో.ర) రక్తాపిత్త ఖండన (బై.ర) బోలపర్పటిరస (యో.ర) సుధానిధిరస (యో.ర) తీక్షణాది వటిక (బై.ర) ఖండకాద్యలేహ (బై.ర)

## మేధావృద్ధి

స్తనములు, తొడలు, పొట్ట మొదలగు వాని యందు అధికంగ క్రొవ్వు పదార్ధములు చేరుచుండుట.

**చికిత్స :** అమృతాది గుగ్గులు, త్రిఫల గుగ్గులు, నవక గుగ్గులు.

**పథ్యం :** పాతవరిబియ్యం, పెసలు, బార్లీ, మూసూర అధకీ కషాయం, మజ్జిగ మరియు ఎక్కువగా నడవటం.

**అపథ్యం :** కొత్తవరి బియ్యం, గోధుమలు, మూష, పాలు, శర్కర, చన్నీటి స్నానం.

## రక్తపిత్తం

శరీరం నుండి రక్తం ఊర్ధ్వ మరియు అధోభాగాల మార్గంగుండా బయలు వెడలును.

**చికిత్స :** బోల పర్పటి, కూష్మాండ లేహ్య, ఉశీరాసవ, బోలబద్ధవటి, చంద్రకళా రసం.

**రక్తవాంతులు :** చందనాది చూర్ణం.

**పథ్యం :** చేదు పదార్థాలు, పాతవరిబియ్యం, బార్లీగింజలు, పెసర్లు, మసూర, శనగలు, కందులు, శర్కర, తేనె చెరుకుతో తయారు చేయు పదార్థాలు శతదౌత ఘృతం అరటిపండు, బాదాము, పొట్లకాయ, మరియు ఆకులు. కాసాపత్రములు, శృంగాటక ఫలం, కిరాతతిక్తమూలం, కమలం యొక్క కాండం నింబపత్రములు, దానిమ్మఫలం, కొబ్బరికాయనీరు, వెలగపండు, ద్రాక్ష.

**అపథ్యం :** పులుపు, ఉప్పు, మరియు కారం, ఉలవలు, నువ్వులు, శింబిధాన్యం ఆవాలు ఆకు, వంకాయ, పెరుగు, వెల్లుల్లి.

**ముక్కునుండి రక్తం వెడలుట :**

**పథ్యం :** చల్లని పదార్థాలు, పాత వరిబియ్యం.

**అపథ్యం :** పులుపు, ఉప్పు, కారం, క్షారం, మరియు వేడి పదార్థములు.

## రాజయక్ష్మ

మందజ్వరం, ఆకలి తగ్గుట, రాత్రిళ్ళు చెమటపట్టుట, బరువుతగ్గుట, ఊపిరితిత్తులు విశేషంగా ప్రభావితమగును. రోగికి సాయంత్రం జ్వరము, దగ్గు, రక్తవమనం, స్వరవికృతి, రాత్రిస్వేదం, ప్రక్కటెముకలో నొప్పి, కాళ్ళలో వేడి చెమటలు కలుగును.

**చికిత్స :** ఏలాది చూర్ణం, సితోఫలాది చూర్ణం, తాలిసాది చూర్ణం, మహాలక్ష్మి విలాసరసం, జయమంగళ రసం, చతుర్ముఖరసం, చంద్రామృత రసం, స్వర్ణవసంతి రసం, అమృతప్రాశ, వాసావలేహం, చ్యవనప్రాశ, ద్రాక్షాసవం.

**పథ్యం :** శాలి, గోధుమ, ముద్గ, దాడిమ, ఆమలకీ, అజీదుగ్ధం, బలాసిద్ధ దుగ్ధం, మాంసం, జాంగలమాంసం, హితకరం.

**అపథ్యం :** తైల పదార్థములు, వంకాయ, కాకరకాయ, మైధునం, పగటి నిద్ర.

## రాజయక్ష్మ

**చికిత్స :** ఏలాది గుటిక, అగస్త్య హరితకివలేహ్యం, గుడకూష్మాండవ లేహ్యం, చవనప్రాశ లేహ్యం, అమృతప్రాశలేహ్యం, కాంతవల్లభరసం, లోక నాధరసం, శివగుటిక, దశములారిష్ట, అశ్వగంధారిష్ఠం, ఇందుకాం ఘృతం, చందనాది తైలం, అమృతేశ్వర రసం, అగ్నిరసం, శీతోఫలాదిచూర్ణం (బా.ప్ర) లవంగాది (బై.ర) ద్రాక్షాది చూర్ణం (యో.ర)

**పథ్యం :** గోధుమలు, పెసలు, సెనగలు, పాతబియ్యం, మేకమాంసం, వెన్న, నెయ్యి, పాలు, అడవిజంతుమాంసం, మధుర రసములు, అరటి, పనస, మామిడి, ఉసిరిక, ఖర్జూర, సొరపండ్లు, పొగడపండ్లు, పచ్చిద్రాక్ష పండు, ఆవునెయ్యి, ఖండశర్కర, షష్ఠికధాన్యం, కమల, కంద, కొబ్బరి, మునగ, ద్రాక్ష, సైంధవ లవణం.

**అపథ్యం :** వెదురు మొలకలు, తాంబూలం, ఉలవలు, మినువులు, కొత్తబియ్యపు అన్నం, చలి అన్నం, కరుబూజా, ఇంగువ, పంపన పనాస, నారింజ, గొర్రెమాంసం, పులుసు, కారం, పెరుగు, ఆకుకూరలు, దోసకాయ, జాగరణ, తాంబూలం, ఆమ్లతిక్త కషాయ, కటుపత్ర శాకములు.

**చికిత్స :** వాసావలేహ (బా.ప్ర) ఖండపిప్పలీ (యో.ర) కూష్మాండలేహ (శా.స) జీవంత్యాదిఘృతం (యో.ర) అజాపంచక (బై.ర) నాగబలాఘృతం (బై.ర) చాగలాయ (బై.ర) ఖర్జూర్యాసవ (యో.ర) కుమార్యాసవ (శా.సం) దశమూలారిష్టా (శా.సం)

## రాజయక్ష్మ

**చికిత్స :** అశ్వగంధాది క్వాథ (బై.ర) రాస్నా స్వరస (శా.స) దాన్యకాదిహిమ (శా.స) వాసకక్వాథ (శా.స) వృషపత్ర పుటపాకరస (శా.స) తాక్ష్య కల్కా, రాజమృంగాకరసం (బా.ప్ర) చతుర్ముఖరస (యో.ర) సువర్ణ భూపతిరస (యో.ర) వసంత కుసుమాకర (యో.ర) లోకనాధరస (శా.సం) లోహరసాయనం (శా.సం) మాచికాసవం, చందనాది బలాలాక్ష్యది, లక్ష్మి విలాస తైలం, శతావర్యాది తైలం, అమృతేశ్వర రసం, అగ్నిరసం, కాంతవల్లభ రసం, త్రైలోక్య చింతామణి రసం, ప్రాణదా పర్పటి, హేమభ్రక రససింధూరం, లక్ష్మీవిలాస్‌రసం, పుష్కరమూలాసవం, అజాపంచక ఘృతం.

**అపథ్యం :** శ్రమ, వ్యాయామం, స్త్రీసేవనం, వేగధారణం, శోకం, క్రోధం, అసూయ, ఉలవలు, వంకాయ, కాకర, అగాకర, క్షారములు.

## దగ్ధ వ్రణం లేక వహ్ని

**బేధములు :** ప్లుష్టము, దుర్గ్ధము, సమ్యగ్దద్దము, అతిదగ్ధము.

## రోమాంతిక

చిన్న పిల్లలలో వచ్చువ్యాధి. జ్వరముతోపాటు చిన్న చిన్న బొబ్బలు కలుగును

**చికిత్స :** కర్పూరాది చూర్ణం,ఖదిరాది క్వాథ, పర్పటాదిక్వాథ, లక్ష్మి విలాస్‌రసం, మృత్యుంజయరసం.

## వాత వ్యాధి

**అర్ధితవాత :** ముఖంలో సగభాగం వ్యాధికి గురి అవుట, మూతి

వంకర పోవుట, తలవణుకుట, స్పష్టంగా మాట్లాడలేకపోవు, కనురెప్పలు మూసుకొని లేవకపోవుట.

**చికిత్స :** సమీర పన్నగ రసం.

**పక్షాఘాత :** శరీరం యొక్క ఒకవైపు భాగము నందు చైతన్యం పోయిన ఎడల దానిని పక్షాఘాతం లేదా పక్షవాతము

**చికిత్స :** మహాబలాదిక్వాథ, మహారాస్నాది క్వాథ, ఏకాంగ వీరరసం, రసరాజరసం, మహాయోగరాజగుగ్గులు, గ్రంధికాది తైలం, మాషతైలం, రసోన పిండ, లశునాది వటి.

**ఖంజువాత :** దూషితమైన వాతం వలన ఒక కాలు పక్షవాత గ్రస్థమై కుంటితనం కలుగును.

ఎపుడైతే వాతం రెండు కాళ్ళలో కలిగిస్తుందో రోగికి అవిటితనం వచ్చును.

**చికిత్స :** అగ్ని తుండివటి, సర్పగంధవటి.

**గృధ్రసీ (సయాటిక):** నొప్పి నడుమ క్రింద భాగం నుండి మొదలై తొడవెనుక భాగం, కాలు యొక్క లోపలి వైపు మరియు పాదం యొక్క లోపల వైపు వరుకు వ్యాపించునో దానిని గృధ్రసీ.

**చికిత్స :** త్రయోదశాంగ గుగ్గులు, రసోన పిండ, తిందుక వటి

**విశ్వాచి :** దూషితమైన వాయువు హంసఫలకం నుండి చేతివేళ్ళు వెనక భాగం వరకు ఉన్న కండరాలను నరములను, ఆవహించి వాని పనులను నాశనం చేయును.

**చికిత్స :** వాతవిధ్వంసిని రసం, యోగరాజ గుగ్గులు.

**సంధిగత వాత :** దూషితమైన వాయువు కీళ్ళలోచేరి నొప్పిని వాపును కలుగజేసి ఆ కీళ్ళ యొక్క కర్మలపై దుష్ప్రభావం చూపును.

**చికిత్స :** వాతగజాంకుశ, యోగరాజ గుగ్గులు.

**క్రోష్టుక శీర్ష :** మోకాళ్ళ కీళ్ళయందు తీవ్రమైన నొప్పి, వాపు వుంటుంది. వ్యాధిగ్రస్తుని కీలు నక్కతలవలె కనిపించును.

**చికిత్స :** కైశోర గుగ్గులు, అమృతాది గుగ్గులు, యోగరాజగుగ్గులు.

**మన్యాస్తంభ :** దూషితమైన వాతం మెడలోని కండరములను చేరి గట్టిపరిచి కదలిక లేకుండా చేయును.

**చికిత్స :** యోగ రాజ గుగ్గులు.

**హనుస్తంభ :** రోగి దవడ తెరుచుట లేక మూయుట.

**చికిత్స :** మహాయోగరాజ గుగ్గులు, ప్రసారిణి తైలం.

**వాతకంటక :** అడుగు సరిగావేయకపోవడం.

నడవటం వలన చీల మండలో నొప్పితో కూడినది.

**చికిత్స :** త్రిఫల గుగ్గులు, యోగరాజ గుగ్గులు.

**కటిశూల :** నడుము క్రింద భాగంలో నొప్పి, వాపు

**చికిత్స :** త్రయోదశాంగ గుగ్గులు

**కంపవాత :** దూషించబడిన వాతం కండరములలో వణుకు పుట్టించి తద్వారా ఎపుడు తల లేక చేతులు లేక శరీరమంతా ఒక ప్రత్యేకమైన వణుకుకు గురి చేయును.

**చికిత్స :** సర్పగంధ ఘనవటి, వాత గజాంకుశ, యోగరాజ గుగ్గులు, మహనారాయణ తైలం, మహామాషతైలం

**ఆక్షేపక :** శరీరమందు కంపములను కలిగించును.

**చికిత్స :** సర్పగంధవటి, క్షీరబలాతైలం.

**పథ్యం :** పాతబియ్యం, గోధుమలు, మినువులు, ఉలవలు, మునగ ఆకులు, కాయలు, వంకాయలు, దానిమ్మకాయలు, తాటిపండ్లు, మామిడి నిమ్మ ద్రాక్షపండు, నారింజ, ఇప్పపూలు, రేగుపండ్లు, చింతపండు, కొబ్బరి నీళ్ళు, తమలపాకులు, ఉప్పు వేసి కాల్చిన పందిమాంసం పొట్టేలమాంసం.

**అపథ్యం :** యవగింజలు,బఠాణీలు, కోద్రవం, కాకరకాయ, పద్మము యొక్క కాడ, మూలం, స్నుహివిత్తులు, మేడిపండు, పచ్చితాటికాయ, వక్క నేరేడుపండు, కశేరుగ, శాక చల్లటినీరు, ఎండిన మాంసం, గుఱ్రపుస్వారీ, బద్ధకంగా ఉండుట, రాత్రుల యందు నిద్రలేకుండుట లంఖణము, పళ్ళు నూరుట.

## వాతరక్త

కీళ్ళయందు తీవ్రమైన నొప్పి మరియు వాపు ఆకస్మికంగా రావడం.

**చికిత్స :** నవకార్షిక క్వాథ, అమృతాది గుగ్గులు, కైశొరగుగ్గులు, పునర్న వాది గుగ్గులు.

**పథ్యం :** శాలి ధాన్యం, గోధుమలు, శనగలు, కందిపప్పు, బచ్చలికూర, ఆకులు, కాకమాచి కాయలు, వాస్తుక, తండులీయక గుమ్మడి కాయ,

తిప్పతీగ, చందనం చెక్క, దేవదారు.

**అపథ్యం :** మినువులు, ఉలవలు, బఠాణీ, సక్తు, శింబి, ముల్లంగి, చెరుకు, సంబంధిత ద్రవ్యాలు, మద్యం, పెరుగు, పగటినిద్ర, శరీరానికి వేడితగులుట, అధిక వ్యాయమాం, లైంగిక సంపర్కం.

## వాత రోగములు

**అశీత వాత నిర్ణయం :**

1. అక్షేపక 2. హనుస్తంభ 3. ఊరుస్తంభ 4. శిరోగ్రహ 5. బాహ్యాయామ 6. అభ్యంతరాయము 7. పార్శ్వశూల 8. కటిగ్రహ 9. దండపతానక 10. ఖిల్లి 11. జింహ్వాస్తంభ 12. అర్ధిత 13. పక్షఘాతా 14. క్రోష్టుశీర్ష 15. మన్యస్తంభ 16. పంగు 17. కలాయ ఖంజ 18. తూని 19. ప్రతితూని 20. ఖంజ 21. పాదహర్ష 22. గృధ్రసీ 23. నిశ్వాచీ 24. అపబహుక 25. అపతానక 26. వ్రణాయామ 27. వాతకంఠ 28. అపతంత్రక 29. అంగబేధ 30. అంగశోష 31. మిణ్మిణత్వ 32. కృష్ణత 33. అష్ఠీలా 34. ప్రతీష్ఠీలా 35. వామనత్వ 36. కుబ్జతహ 37. అంగపీడా 38. అంగశూల 39.సంకోచ 40. స్తంభ 41. రూక్ష 42. అంగభంగ 43. అంగ విభ్రంస 44. విడ్గహ 45. బుద్ధవిట్క 46. మూకత్వ 47. అతిజృంబా 48. అత్యుద్గార 49. అంత్రకూడన 50. వాతప్రవృత్తి 51. స్పురణ 52. సిరాపూరణ 53. కంఫ 54. కార్శ్య 55. శ్యావతా 56. ప్రలాప 57. క్షిప్రమూత్రా 58. నిద్రానాశ 59. స్వేదానాశ 60. దుర్బలత్వ 61. బలక్షయ 62. శుక్రాతి ప్రవృత్తి 63. శుక్రాకార్శ్య 64. శుక్రనాశ 65. అనవస్థిత చిత్త: 66. కాఠిన్య 67. విరసావ్య: 68. కషాయవక్త 69. అధ్మాన 70. ప్రత్యాధ్మాన 71. శిత: 72. రోమహర్ష 73. బీరుత్వ 74. తోద: 75. కండూ 76. రసాజ్ఞత 77. శబాజ్ఞత 78. ప్రసుప్తి 79. గంధాజ్ఞత్వ 80. దృశక్షయ.

**చికిత్స :** రాస్నాపంచక కషాయము, రాస్నాసప్తక కషాయం, మహరాస్నాది కషాయం, షడ్బరణ యోగం, అజమోదాది చూర్ణం, చిత్రకాది వటుకలు, సమీరగజకేసరి, పిరంగాది లేహ్యం, విడాంగాసవం, దేవదార్వాసవము, విడంగారిష్టం, విషముష్టితైలం, విజయభైరవతైలం, బలాతైలం, విష్ణుతైలం, బలాశ్వగంధాదితైలం, క్షీరబలాతైలం, కర్పూరాదితైలం, ఆమవాత తైలం, వాతాగ్ని కుమారరసం, లోహసౌవీరము, వాతరాక్షసము, లఘువాత విద్వంసి, వాతవిధ్వంసిని, స్వచ్ఛంద భైరవరసం, అగ్నికుమార

రసం, కాలగ్ని రుద్ర రసం, రామబాణ రసము, వాతగజాంకుశము, విష్ణుపరాక్రమ రసం, వాతాంతకం, సహచారాది తైలం, శ్వదంష్ట్రా తైలం, అమృతాదితైలం, ములకాదితైలం, దశమూలాది ఘృతం, చిత్రకాది ఘృతం, ద్వాత్రింశతి గుగ్గులు, షడశీతి గుగ్గులు, త్రయోదశంగ గుగ్గులు, యోగీంద్ర రసం, రసరాజరసం, వాతకులాంతకరసం, చతుర్భుజరసం, స్వర్ణవాత రాక్షసం, త్రైలోక్య చింతా మణి రసం, మహావాత విధ్వంసిని, వాతగజాం కుశం, మాహాయోగరాజ గుగ్గులు, సమీర గజకేసరి, అర్ధాంగవాతారి రసం, బృహత్వాత చింతామణి,

**చికిత్స :** మల్లాదివటి, నవగ్రహరసం, మల్లసింధూరం, అష్టమూర్తి రసా యనం, స్వర్ణభూపతి రసం, ఏకాంగవీర రసం, అర్ధాంగవాతరి రసం, తాప్యాదిలోహం, వాతం గుగ్గులు, సింహనాదగుగ్గులు, ఖంజనీకార, సమీర పన్నగరసం, గుడూచి గుగ్గులు, విదారి కంద చూర్ణం, కిరాతతిక్తాది కల్కం, తగరాది క్వాధము, దాత్రీభల్లాతకం, పత్యాభల్లాతకం, రౌప్యభస్మం, రాస్నా సప్తక క్వాధము, తృణపంచమూలాధి క్షీరతైలం, పత్యాదిగుగ్గులు, రసోన పిండం, అభయాదిచూర్ణం, సైందవాది తైలం, వాజీగంధాదితైలం, సహస్యాది తైలం, ప్రతాపలంకేశ్వర రసం, మాషాది తైలం.

**పథ్యం :** మధుర ఆమ్ల, లవణ రసములు పురాణశాలి, రక్తశాలి, ఉలవలు, మినువులు, గోధుమ, బూడిద గుమ్మడికాయ, వంకాయ, మునగ కాయ, కాకరకాయ, చక్రవర్తికూర, కసివెందకూర,తూడికూర గలిజేరు కూర, నల్ల ఉలవలు, గోధుమలు, నూనె, చేదుపొట్ల, ముల్లంగి, కొడిసెకాయ, దుందిలపుకాయ, మొక్కపుకాయ, తక్కలి, బోడతరం, పెద్దసదాప, జీలకర్ర, ఇంగువ, పాతబియ్యం.

**అపథ్యం :** కటు, తిక్త, కషాయముగల ద్రవ్యములు. శీతోదకం, దోసకాయ, ఆనపకాయ, పెసలు, గురుకర ద్రవ్యములు, కఫహర పదార్ధము, అనుములు, నక్కదోసకాయ, ఆవాలు, వెదురు మొనకలు, వేప పండ్లు, కొత్త ధాన్యము,శీతల ప్రదేశము, బీరకాయ, నేతిబీరకాయ, శనగలు, బఠానీలు, చామలు, పెద్ద సంభావులు, నావారమును తృణ ధాన్యం కొర్రలు, పెసలు, యవలు, లశునం, లఘ్వశనం, రుక్ష, గురు, అభిష్యందికరం, దొండబీర, సోర, దోశ, కంద. నేరేడు, తాటిపండు, మేడిపండు, చేపలు, ఆమ్ల లవణ, స్నిగ్ధద్రవ్యమైన మేద్యములగు జలజ అనూప జంతువుల ఉద మాంసం, చెరువునీరు, తేనె ఏటినీరు, చింత, ఉద్వేగం, చల్లని వాతా

వరణం,మంచంపై పరుండుట.

## వాతరక్తం

**భేదములు :** వాతాధిక, పిత్తాధిక, రక్తాధిక, కఫాధిక

**చికిత్స :** త్రివృతాది క్వాధము; పటోలాది కషాయం, శ్రావణాదిఘృతం, స్థిరాదిఘృతం, నింబాది చూర్ణం, బలాది ఘృతం, శతావరీ తైలం, ద్రాక్షాది ఘృతం, జీవనాయఘృతం, అమృతాది క్వాధము, వాసాది క్వాధము, నవక్షారక క్వాధము, ఏరండక్వాధము, కోకిలాక్ష్యాది క్వాధము, సింహస్యాది క్వాధం.

**పథ్యం :** కందులు, సెనగలు, పెసలు, చిరుసెనగలు, ఏనుగు పెసలు, గోధుమలు, వరిధాన్యం, సంచారి బియ్యం, 60 దినములలో ఫలించిన వడ్లు, ఆవుపాలు, బర్రెపాలు, మేకపాలు.

**అపథ్యం :** పగటినిద్ర, నిప్పు, ఎండ తాపం, మైధునం, కారం, ఉష్ణం, గురుత్వం, ఉప్పు పులుసు గల వస్తువులు.

**చికిత్స :** మధువర్ణ్యాది తైలం, సుకుమార తైలం, అమృతాది తైలం, మహపద్మతైలం, ఖడ్డాక మధుకతైలం, శతపాక మధుపర్ణీతైలం, నాగబలా తైలం, గుడుచ్యాది తైలం, బృహత్ గుడూచ్యాదితైలం, అరనాలాది తైలం, పిండ తైలం, ద్విపంచమూలాది తైలం, రుద్రతైలం, విషతిందుక తైలం.

## వాతరక్తం

**చికిత్స :** యోగ సారామృతం, కైశోర గుగ్గులు, అమృత గుగ్గులు, పునర్నవ గుగ్గులు, రసాభ్రా గుగ్గులు, లాంగల్యాది లోహం, మధుకాది లేపం, జలజపత్రలేపం, యస్టాహ్వాది లేపం, జీవనీయాది లేపం, తాలాది లేపం, వాతరక్తాన్తక రసం, విశ్వేశ్వర రసం, ద్వాదశయనరసం, మహ తాలేశ్వర రసం, సర్వేశ్వర రసం, గుడూచ్యాదిలోహం, పైత్యాంతక లోహం, గుడఘృత యోగం.

## విరేచన బద్ధం

**చికిత్స :** రుక్మిణీరసం, రేచనవటి, ఇచ్ఛాభేదిరసం, సుఖవిరేచనవటి, సర్వాంగసుందర రసం, ధాత్రి తైలం.

## విష

విషపు మొక్కలను సేవించడం వలన లేదా విష జంతువులు కరవ

డం వలన లేదా అశుద్ధ ఖనిజములు సేవించటం వలన లేదా తక్కువ విష యుక్తమైన పదార్థములను ఎక్కువ మోతాదులో సేవించటం వలన లేదా ఔషధమును అవసరం మించి సేవించుట వలన కలుగు లక్షణములను విషరోగం అంటారు.

**స్థావర విషములు :** గొంతు బిగిసి అడ్డుకున్నట్లు ఉండి తెల్లటి నురగ లాంటి పదార్థం వాంతి అగును. ఎక్కిళ్ళు పళ్లుచెడి చల్లని పదార్దలు సహించ లేక పోవుట ఆకలి మందగించుట, జ్వరము, దగ్గు, ఆయాసం, మరియు మూర్ఛ.

**జంగమ విష :** పాము,బల్లి,సాలెపురుగు, తేలు, జలగ, మరియు విష జంతువులు కరవడం కుట్టడం, చర్మమునకు తగులుట వలన పళ్ళు గోర్లు మూత్రం శుక్రం లేదా విషజంతువుల యొక్క పదార్థములు మొదలగునవి సేవించుట వలన కలుగు లక్షణములు. జంగమ విషరోగము.

**లక్షణాలు :** శరీరమంతా మంటలు, వాపు, విరేచనాలు, మైకం, అసాధారణమైన నిద్ర.

**మూషిక విష :** ఎలుక కరిచిన చోటి నుండి పసుపు పచ్చని ద్రవం కారును. మంటతో కూడిన దద్దురు, మచ్చలు, కనబడును. రంగుమారుట, తలనొప్పి, వాంతి,నోటిలో నీరూరుట,జ్వరం.

**సర్పదంశం :** పామకు కరచిన ప్రదేశం నుండి 7-10 సెం.మీటర్లు పైన తాడుతో గట్టిగా కట్టవలెను.

**వృశ్చిక విషం :** శరీరమంతా సహించరాని మంట, నొప్పి, తేలు కరి చిన చోట నుండి పైకి ప్రాకుట. నాలుక వాపు, మ్రింగుట కష్టం, మూర్ఛ.

**లూత విష :** కరిచినచోట కణజాలం కుళ్ళుట. రక్తం కూడిన రసి కారును. వివిధ పరిమాణం మరియు ఆకారంలో గుండ్రటి అధిక పరిధి కలిగిన మొటిమలు కనబడును.

**అలర్క విష :** కుక్కతలను మరియు తోకను వేలాడదీయుట నోటి నుండి చొంగకారుట, అసాధారణంగా తిరుగుచుండును.

పిచ్చికుక్క కరిచిన ప్రదేశం మొద్దుబారి నల్లటి రక్తం కారును. రోగి తలనొప్పి, జ్వరం, తల తిగరడం, మూర్ఛ.

**మాక్షిక విషం :** తేనెటీగ కరిచిన వెంటనే కరిచిన ప్రదేశం నుండి నీటి వంటి ద్రవం కారును. మరియు మంట దురద తో కూడిన నీలి రంగు

బొబ్బలు ఉత్పన్నమగును.

**పాదవికారం :** శుద్ధిచేయని పాదరసం వాడుట వలన ముక్కు అణిగి పోవుట ముక్కునుండి చీముడుకారుట, అకాలములో దంతములు ఊడుట ముక్కు మరియు కళ్ళలో పుండ్లు పడుట. చర్మంపై దద్దుర్లు గుండ్రటి ఉబ్బెత్తు మచ్చలు తలనొప్పి చర్మం రంగుమారుట వాపు, నొప్పితో గూడిన గడ్డలు.

**చికిత్స :** మరిచాది తైలం, నారాయణతైలం, మహామరిచాది తైలం, వ్రణరాక్షస తైలం.

**అపథ్యం :** మినువులు,మసూర, బఠానీ, ఉలవలు, నువ్వులు, బూడిద గుమ్మడికాయ, కాకరకాయ, ఆకులు అరటికాయ, కర్కోటక ఆకు, పిప్పళ్ళు చిల్లగింజలు నల్లజీలకర్ర, నూనె పదార్ధలు, రాగిపాత్రలు కంచు పాత్రలో ఆహారం భుజించుట.

**నాగవిష :** ఆకలి మందగించుట వాంతివచ్చినట్లు ఉండుట, కడుపులో భరించలేని మంటలు, గొంతులో నస, కడుపు ఉబ్బరం, కడుపులో నులి నొప్పి, నల్లరేగడి మట్టివంటి రంగుకల విరేచనాలు. చల్లటి చమటలు, తల తిరుగుట, మానసిక అస్వస్థత.

**చికిత్స :** అహిఫేన ఆసవము, కనకాసవం

**మల్లవికార :** తలనొప్పి, చూపు మసకబారుట, కనులచుట్టు వాపు గొంతులో కడుపులో ప్రేవులలో మంట, వాంతులు, విరేచనాలు, వణుకు చర్మంపై మచ్చలు.

**చికిత్స :** మకర ధ్వజ వటి.

**దూషివిష :** నెమ్మదిగా పనిచేయు విషద్రవ్యములు చాలాకాలం పాటు వాడుట దూషీవిషం.

**లక్షణాలు :** విరేచనాలు, కాంతిపాలిపోవుట, వాసన రుచి, మార్పు చెందుట, దప్పిక, కంఠం దగ్ధమగుట, సొమ్మసిల్లుట.

**ఆహారవిషం :** దీర్ఘకాలంపాటు విషపూరిత ఆహారంను సేవించిన వ్యక్తి యొక్క కాంతి పాలిపోవును. వ్యక్తి సన్నబడును, తల తిరుగునట్లు వుండును. కాళ్ళు చేతులలో వాపు కల్గును, గుండె, తల మొదలగు మర్మ ప్రాంతాలలో నొప్పి కల్గును, జ్వరం, విరేచనాలు.

**చికిత్స :** నాగదంతి ఘృతం.

**ఔషధం :** అజితఅగదం, దశంగా అగదం, గంధహస్తిఅగదం,మహా సుగంధి అగదం, అమృత ఘృత, తండులీయక ఘృతం, మృత సంజీవని అగదం, శిరిషారిష్ఠ, శారిభారిష్టా.

**పథ్యం :** పాతబియ్యం, కందులు, బఠానీలు, తోటకూర, సరస్వతిఆకు, పులిచింత, పొట్లకాయ, ఆకులు, నాడీశాకం, చందనం శిగ్రుపత్రములు, ఆమలిక ఫలం, పసుపు కొమ్ము, కుంకుమ పువ్వు మజ్జిగ నెయ్యి కస్తూరి, ఆవు మేక మూత్రం.

**అపథ్యం :** పులుపు ఉప్పురుచికల పదార్థాలు,విరుద్ద గుణాలుకల ఆహారం, కోపం అతివ్యాయామం, ఉపవాసములు, ప్రొగతాగుట, పగటి నిద్ర, చెమట పట్టుట, తమలపాకు, బలమైన గాలులు

### విశూచిక

వాంతులు, విరేచనాలు, కలిపి ఒక్కసారిగా కనిపిస్తాయి. తీవ్రమైన వాంతులు, దప్పిక మంట నులిపెట్టినట్లు బాధ, భ్రమ పాలిపోవుట, వణుకు హృదయభాగమున నొప్పి, తలనొప్పి.

**చికిత్స :** చిత్రకాదివటి, శంఖవటి, అగ్నికుమార రసం, రామబాణరసం.

## విసర్పి

చర్మంపై వాపు మంట, వేగంగా వ్యాపించుట, రాగి రంగులో మంటలు, చేతితో ముట్టినపుడు మైనంవలె వుండును.

**చికిత్స :** అమృతాది క్వాథ, భూనింబ క్వాథ, గంధకరసాయనం, నవకర్షిక గుగ్గులు, తిక్తఘృత గైరిక ఘృత లేపం పంచ వల్కల లేపం, శతదేత ఘృత లేపం శిగ్రులేపం.

**పథ్యం :** యవ, గోధుమ, షష్టి, శాలి, మసుర, చణక, కంఘు కారవేల్లిక, ద్రాక్ష, దాడిమ, ఆమలకి వెన్న, ఆవునెయ్యి,

**అపథ్యం :** ఆమ్ల లవణ కటు రసములు, గురుద్రవ్య కులుత్థ తిల రసోన మొదలగునవి కోపం సహజ వేగమును ఆపుట, వ్యాయామం, మైధునం, నడక వేడి వాతావరణం.

## విషూచికా రోగము

**చికిత్స :** ముస్తాద్యవటిక, అహిఫేనాసవం, సూచికాభరణం, కర్పూర

రసం.

**పథ్యం :** లంఘనం, సగ్గుబియ్యం, (పాతబియ్యం, అన్నం, మేడి,చేతిపొట్ల సొరకాయలు)

**అపథ్యం :** స్త్రీ సంభోగం, వ్యాయామం, అజీర్ణకర ఆహారములు.

## విసర్పి

వాత, పిత్త, శ్లేష్మ, వాతపిత్త, వాతశ్లేష్మ, పిత్త శ్లేష్మ, సన్నిపాత, వహ్ని దాహ విసర్పి, అభిఘాత విసర్పి.

**పథ్యం :** పాతయవలు, గోధుమలు, కొర్రలు, 60 దినముల ఫలించెడు వడ్లు, పెసలు, చిరుసెనగలు, సెనగలు, జాంగలమాంసం, వెన్న,నెయ్యి, ద్రాక్షపండు, దాడిమి పండ్లు, కాకరకాయ,వెదురుకొమ్ము, చిట్టి తుమికి కూర, ఉసిరిపండు, ద్రాక్ష, చంద్ర,నాగకేసరములు,దిరిసెనము, కర్పూరం, చందనం, నువ్వులు.

**అపథ్యం :** సంచారం,పగటినిద్ర, మైధునం, గాలి,క్రోధము, దు:ఖం, జడాన్నము, పానం, వెల్లుల్లి, చెమటవేయుట, విదాహకర ద్రవ్యములు, ఉప్పు, పులుపు, కారం, మద్యం, సౌవీరాది మద్యములు, మాష, తిలలు, స్వేదనం,జాంగల మాంసం, కిలాటం, గురుపదార్ధములు, దధి, కూర్చిక, పత్రశాకములు.

## విసర్పము

**చికిత్స :** రాస్నా నీలోత్పలాది లేపం, హ్రిబేరాదిలేపం, ప్రపౌండరాకాది లేపం, ఖదిరాదిలేపం,అరగ్వదాదిలేపం, ఇంద్రణ్యాదిలేపం, శైవలాదిలేపం, త్రిఫలాదిలేపం, అజగంధాదిలేపం, కాలానుసార్యాదిలేపం, బలాదిప్రలేపం, దంత్యాది ప్రలేపం.

## విస్ఫోటం

పెద్దపెద్ద బుగ్గలతో జ్వరముతో కూడిన చర్మవ్యాధి తలనొప్పి, ఒంటి నొప్పులు, దురద, మంట, చీము, ఆకలిలేకపోవుట.

**చికిత్స :** పంచతిక్త ఘృతం

**పథ్యం :** యవ, గోధుమ, షష్ఠి, శాలిముసుర, చెణక కంగు కారవేల్లిక, శిరిష, ద్రాక్ష, దాడిమ, ఆమలకి వెన్న ఆలు నెయ్యి.

**అపథ్యం :** ఆమ్ల లవణ, కటు రసములు, గురుద్రవ్య కులుత్థ, తిల, రసోన, కోపం, సహజ వేగమును ఆపుట, వ్యాయామం, మైథునం నడక వేడి వాతావరణం.

## విస్ఫోటకము

సర్వ శరీరం జ్వరము తోడను మంటతోడను గూడి నిప్పునకాలి బొబ్బల వలె భయంకరములగు బొబ్బలను కలిగించును.

**భేదములు :** వాతజ విస్ఫోటకము, పిత్తజ విస్ఫోటకము, కఫజ విస్ఫోటకము, వాత పిత్తజ విస్ఫోటకము, పిత్త శ్లేష్మజ విస్ఫోటకము, సన్నిపాతజ విస్ఫోటకము, రక్తజ విస్ఫోటకము.

**పథ్యము :** పాతబియ్యము, అన్నము, యవలు, పెసలు, కందులు, బీరకాయ, పొట్లకాయ, పొట్టికాకరకాయ, వెదురు మొలకలు, నూనె, చిర్రి కూర, చెంచలికూర, ఆవుచల్ల.

**అపథ్యము :** కొత్తబియ్యం, అన్నం, చల్దిఅన్నం, ఉలవలు, మినువులు, ఉప్పు, పులుసు కారం, విదాహకర పదార్ధలు, చేపలు,పెరుగు,వంకాయ.

**చికిత్స :** పటోల మృతాది క్వాథము, పటోల త్రిఫలాది క్వాథము, వ్రణారిగుగ్గులు, మదురామృత సిద్ధ మృతములు, చందనాదిలేపం, ఉత్పలాది లేపం, పంచతిక్త ఘృతం, శుక్రాది లేపం.

## వృక్క రోగములు

మూత్రం ప్రవృత్తిలో తేడాలు, మూత్రపిండరోగం ముఖ్యలక్షణం. కనుల చుట్టువాపు, మూత్రం పెరుగుట, తగ్గుట, మూత్రం ఆపుకోలేక పోవుట మాటి మాటికి పోవుట.

**చికిత్స :** శుద్ధ శిలాజిత్తు, మహేశ్వరవటి, శివగుటిక, పునర్ణవ మాండురం, గోక్షురాది గుగ్గులు.

**పథ్యాపథ్యములు :** వేయించిన పదార్ధాలు, పూర్తిగ వదలివేయ వలెను. ఉప్పు తగ్గించవలెను. మలబద్దకం రాకుండా జాగ్రత్తపడవలెను.

## వ్రణ శోథ

వ్రణము 3 అవస్థలు

– ఆమవాస్థలో వాపు, నొప్పి మందజ్వరం.

– పత్యమాన అవస్థలో చర్మంలో రంగు మార్పు, అధికమైన నొప్పి మంటతో చీముతో జ్వరం.

– ఏక్వావస్థలో నొప్పి తక్కువగా వుండి పుండుపైన చర్మం ముడతలు.

**చికిత్స :** 1 త్రిఫలాక్వాథం 2 సప్తాంగ గుగ్గులు.

**పథ్యం :** మధుర, తిక్త, కషాయరస, ఆహారం స్నిగ్ధ, పదార్థాలు, పాత బియ్యం, బార్లీ, గోధుమ, లాజమంతం, మాసుర, కందులు, పెసలు, నువ్వులు, వంకాయ, దోసకాయ, పొట్లకాయ, కాకరకాయ, వేపాకు, ముల్లంగి, వాస్తుకజీవంతి కదలి దానిమ్మ, ద్రాక్ష, ఆవునెయ్యి, తేనె, సైంధవ లవణం.

**అపథ్యం :** ఆమ్ల లవణ కటురస ఆహారం పప్పు దినుసులు, కొత్త బియ్యం, మినువులు, ఉలవలు, ఆకుకూరలు, చెరుకు పదార్ధములు, మద్యం, విరుద్ద ఆహారం, అధికశ్రమ చేయుట, కోపం, మైధునం, మాట్లాడుట.

## వృషణ వృద్ధి మరియు శోథ

బీజములు, బీజకోశము దాని ఇతర భాగములలో వాపు మరియు పెరుగుదల కనిపించును.

**చికిత్స :** శుద్ధగుగ్గులు, దశమూలక్వాథం, త్రిఫలకషాయం, రాస్నాది క్వాథము.

**అపథ్యం :** స్నిగ్ధ ఆహారం, మినువులు, బచ్చలి, పెరుగు, పాలు, మంచివికాదు. స్వారి, వ్యాయామం, ప్రయాణం, ఉపవాసం, మైధునం, సహజవేగములను ఆపుట.

## వృద్ధి రోగము

**బేధములు :** వాతజవృద్ధి, పిత్తజవృద్ధి, శ్లేష్మజవృద్ధి, రక్తజ వృద్ధి, మేదొజ వృద్ధి, మూత్రజవృద్ధి, అంత్రవృద్ధి.

**పథ్యం :** చెమటనుదీయుట, ఎర్రబియ్యం, గోమూత్రం, నిర్జల ప్రదేశ జంతువుల మాంసం, మునగకాయ, పొట్లకాయ, గలిజేరు, పల్లేరు, కూరనెల్లి, తాంబూలం, కరక్కాయ, సన్నరాస్నం, వెల్లుల్లి, ఎర్ర ఉల్లిగడ్డ, కుండలోని నెయ్యి, ఉష్ణోదకం, మజ్జిగ అనువానిని సేవించుట.

**అపథ్యం :** జలప్రదేశపు జంతువుల మాంసం, పెరుగు,ఉద్దలు, పిష్టాన్నము, దుష్టమగు అన్నం, బచ్చలికూర, గురు ఆహారం, శుక్రమూత్ర వేగములు.

## వ్రణములు

**బేధములు :**

వాతజ, పిత్తజ, శ్లేష్మజ, రక్తజ, వాత పిత్తజ, పిత్త శ్లేష్మజ, త్రిదోషజ, శుద్ధ, మానుచున్న వ్రణము, మానిన వ్రణము.

**చికిత్స :** విడంగాది గుగ్గులు, అమృతాది గుగ్గులు, త్రిఫలాక్వాదము, దుర్వాది తైలం.

**పథ్యం :** 60 దినములకు ఫలించిన వడ్లబియ్యం, గోధుమలు, పాత బియ్యం, చిరుసెనగలు, పెసలు, అనునవి యూషం పంచదార, విలేపి, పేలాల యొక్క మండం, జాంగల దేశములోని పశుపక్షుల మాంసం, నెయ్యి, నూనె, పొట్లకాయ, వెదురు మొలక,లేత ముల్లంగి, కాకరకాయ, అకాకర కాయ,

**అపథ్యం :** రూక్షం, పులుసు, శీతలం, ఉప్పుగల రసములు, మైధునం, శ్రమ బిగ్గరగా మాట్లాడుట, స్త్రీలను చూచుట, పగటినిద్ర, జాగరణ, అతి సంచారం, శోకం, విరుద్ధాశనం, ఉదక పానము, ఆకుకూరలు జలచర మాంసము.

## శిరో రోగములు

తలలో కలిగే నొప్పి మరియు ఇతర కారకమైన అననుకూలమైన బాధనైన శిరో రోగముగా పరిగణించవచ్చు.

**శిర:శూల :** 1 పథ్యాధిక్వాథము 2 గోదంతి భస్మము 3 మహాలక్ష్మి విలాసరసం 4 శిర:శూలాది వజ్రరసం.

**అర్ధవబేధకం :** ఒక ప్రక్క తలలో కలిగిన నొప్పికి అర్ధవబేధకం తలలో కలిగిన నొప్పిని అర్ధవబేదకం తలలో విపరీతమైన వేదన, పొడిచినట్లు మండినట్లు తీవ్రంగా వుంటుంది.

**చికిత్స** : త్రిభువన కీర్తి రసం, గోదంతి మిశ్రమం, గోదంతి భస్మం.

**సూర్యవర్తము** : సూర్యోదయంతో ప్రారంభమైన పార్శ్వ నొప్పి మధ్యాహ్న సమయం వరుకు పెరిగి తరువాత నెమ్మదిగా సూర్యాస్తమయం వరకు

తగ్గును. ఈ నొప్పి కనుబొమ్మలు కనులు మధ్య కేంద్రీకృతమై వుండును.

**పథ్యములు :** శాలి షష్ఠి వరిబియ్యం, పొట్లకాయ, మునగ, కాకరకాయ, కలబంద, ద్రాక్ష, మామిడిపండు, దానిమ్మ, నిమ్మ, కొబ్బరి, కర్పూరం, వట్టివేళ్ళు, ముస్తక, భృంగరాజ,పాలు, మజ్జిగ, పులసిన గంజి, పాతనెయ్యి, చంద్రుని కాంతి మొదలగునవి.

**అపథ్యం :** సహజ మలమూత్ర వేగములను అడ్డగించుట,విపరీతంగ దంత ధావనం, పగటినిద్ర

**పాలిత్య :** తల ఊడిపోవడం

**ఖాలీత్యం :** కొద్దిగా లేదా పూర్తిగా వెంట్రుకులులూడి బట్టతల వచ్చుటకు ఖాలీత్యం.

**అరుంశిక :** కఫం,రక్త దోషములు దూషించుట వలన పుండ్లు, మొద లగు వాని వలన కలిగిన పుండ్లు చీము తలపై రాయడాన్ని అరుంశిక కురుపుల నుండి కారుచీము, రసి వలన తల తడిగా మారును.

## శీత పిత్తం

విపరీతమైన దురదతో కూడిన దద్దుర్లు, శరీరముపైన ఎరుపు రంగులో ఉబ్బిన అంచులతో వచ్చిన దానిని శీతపిత్తం.

దద్దుర్లు వాటంతట అవే తగ్గిపోతాయి. కొన్ని మార్లు జ్వరం వాంతులు, చూపు మందగించుట.

**చికిత్స :** హరిద్రాఖండం, సూతశేఖరరసం, గుడూచ్యాది తైలం.

**పథ్యం :** పాత ఎర్రరాజనాలు, బియ్యం, పెసలు, ఉలవలు కాకరకాయ రసం, మునగ, బచ్చలి వేతస ఎండిన ముల్లంగి మజ్జిగ, తేనె.

**అపథ్యం :** తీపి పులుపు రుచులు ఎక్కువగల పదార్ధములు నెమ్మదిగా జీర్ణమగు పదార్ధములు క్రొత్తగా తయారు చేయు మద్యం చేపలు, పగటి నిద్ర.

## శిరో రోగములు

1. అర్ధావబేధం 2. వాతజ శిరోభిఘాతం 3. పిత్తజ శిరోవాతం 4. శ్లేష్మజ శిరోఘాతం 5. రక్తజ శిరోభిఘాతం 6. సన్నిపాతజ శిరోభిఘాతం 7. సుర్యావర్తము 8. శిరఃపాకము 9. క్రిమిజ శిరోతాపం 10. శంఖము

**చికిత్స :** నీలోత్పలాది తైలం.

**పథ్యం :** ఆవిరి మొదలగు వానిచే చెమటవేయుట, నస్యము ధూమ పానం విరేచనం, లేపనం, స్వేదనం, లంఘనం, శిరోవస్తి, పాతనెయ్యి, పొట్లకాయ, ఉసిరికాయ, దాడిమ ఫలం, మాదీఫలం, నూనె, మజ్జిగ, టెంకాయ, కరక్కాయ, చెంగల్వ కోష్టు, కలబంద, తుంగముస్తల, వట్టివేరు, కర్పూరం.

**అపథ్యం :** తుమ్ములు, ఆవలింతలు, నిద్ర, మలవేగం, వినినడ్డగించుట అంజనం, పాలు, ఉదకం, విరుద్దన్నం, దంతకాష్ఠం, పగటినిద్ర.

## శీత పిత్తం

దురదలు శీతలము కలిగి ఒళ్ళు జిలగా ఉండును.

**చికిత్స :** శీతారిరసం.

**పథ్యం :** సంబాబియ్యం, పెసలు,ఉలవలు, కాకరకాయలు, బచ్చలి కూర, వెదురు మొలకలు, వేడినీళ్ళు.

**అపథ్యం :** స్నానం, ఎండ, పులుసు, గురుకర అన్నం.

## శూల

**ఆమజశూల :** కడుపులో నులిపెట్టునట్టుగా వచ్చే తీవ్ర వేదన, రుచి లేకుండుట ఓకారంవాంతులు, తిన్నవెంటనే నొప్పి పెరుగుట, అపాన వాయువు అడ్డగించుట, కడుపులో గుడగుడ మని శబ్దములు మలబద్దకం వంటి నొప్పులు.

**చికిత్స :** హింగ్వాష్టక చూర్ణం,శివక్షార పాచన చూర్ణం, చిత్రకాదివటి, లశునాదివటి.

**అజీర్ణ జన్యశూల :** నరసారాది చూర్ణం, క్షీరరాజ, కుబేరాక్షవటి.

**క్రిమిజన్యశూల :** కడుపులో పురుగు వలన కలుగు మెలిపెట్టినట్లుండును. ఆకలి మందగించుట, విరేచనం, నీరసంగ వుండుట, జ్వరం, తల తిరుగుట.

**పిత్తాశ్మరి జన్యశూల :** పిత్తాశయంలో రాళ్ళవలన కలుగు నొప్పి, నొప్పి కడుపులో కుడిభాగములో వచ్చి కుడి భుజమునకు ప్రసరించును, జ్వరం, కొవ్వు పదార్థములు పచ్చకామెర్లు కలుగును.

**వృక్కశూల :** మూత్రనాళంలో వచ్చు ఇసుకవంటి రాళ్ళవలన కలుగు తీవ్రమైన నొప్పిని వృక్కశూల అంటారు.

**చికిత్స :** త్రివిక్రమ రసం.

## శూల రోగములు

వాతశూల, పిత్తశూల, శ్లేష్మశూల, వాతపిత్త శ్లేష్మశూల, శ్లేష్మవాత శూల, ఆమవాతశూల, సన్నిపాతశూల.

**చికిత్స :** గజకేసరీరసం.

**పథ్యం :** పాతబియ్యం,కాచిన పాలు, మునగకాయ, కాకరకాయ, చక్రవర్తి కూర, వాయు విడంగాలు, సోపు వెల్లుల్లి, లవంగములు, ఆముదము లఘుకరములగు అన్నములు.

## శోఫ

శరీరంలో వివిధ భాగాలు నీరు నిలుచుట, వత్తినపుడు గుంటపడుట, వాపు శరీరం భారంగా వుండుట, చర్మం రంగుమారుట, వెంట్రుకలు ఊడుట.

**చికిత్స :** శివక్షార పాచన చూర్ణం, పునార్నవాది క్వాథం, గోక్షురాది క్వాథం, చంద్రప్రభావటి, ఆరోగ్యవర్ధినివటి, హృదయార్ణవ రసం, శృంగి భస్మం, జహుర్‌ముహర్ పిష్ఠి హజ్రత్‌యహుద్ పిష్టి, పునర్ణవమాండురం, మాండూర భస్మం, పునర్ణ్వ అసవం, అర్జున అరిష్ఠ దశములారిష్ఠ.

**పథ్యం :** పాతవరిబియ్యం,ఉలవలు, బార్లీగింజలు పెసలు, కర్కోటక, మునగ ఆకులు, ముల్లంగి, పొట్లకాయ ఆకులు పునర్నవా, రాస్నావేర్లు, ఉసిరికాయ, మజ్జిగ

**అపథ్యం :** కొత్తధాన్యం, అన్నం, పిండిపదార్థంలో పులుపురసం, నెమ్మదిగా జీర్ణమగు ఆహారం. ఎండిన కాయగూరలు, ఉప్పు, మద్యం, విరుద్దగుణాలు కల ఆహారం పగటి నిద్ర, సంభోగం, చాలాదూరం నడుచుట,

## శోఫ రోగములు

**బేధములు :** వాతశోఫ, పిత్తశోఫ, శ్లేష్మశోఫ, వాతపిత్త శోఫ, పిత్తశ్లేష్మ శోఫ, శ్లేష్మవాతశోఫ, సన్నిపాతశోఫ, అభిఘాతశోఫ, విషశోఫ

**చికిత్స :** కిట్టాది కషాయం, తింత్రికారి మండూరం, వజ్రమాండూరం, రసభూపతి, శోఫముద్గరరసం, సురదారు లేపం.

**పథ్యం :** పాతవడ్లు, గోధుమలు, పొట్లకాయ, చిర్రికూర, ఉసిరిక, గలిజేరు, చేతరాసికూర, దానిమ్మపండ్లు, ద్రాక్షపండ్లు, శ్రీగంధము, ఆవుచల్ల, ఇప్పపువ్వు, తేనె.

**అపథ్యం :** పెరుగు, చిక్కుడుకాయ, ఆనపకాయ, కారము, పులుసు, మత్స్యములు, కల్లు, విదాహకర.

## శ్వాస రోగము

1 క్షుద్రశ్వాసము 2 తమక శ్వాసము 3 ఊర్ధ్వ శ్వాసము 4 మహ శ్వాసము 5 చిన్నా శ్వాసము

**చికిత్స :** పంచపత్రసార లేహ్యం, వాసవలేహ్యం, గుడాద్యవలేహ్యం, పంచసారామృతం, ఉదయభాస్కర రసం, శ్వాసకుఠార రసం.

**పథ్యం :** పాతయర్రబియ్యం, గోధుమలు, యవలు, పాతనెయ్యి, మేక నెయ్యి, పాలు, మద్యం, తేనె, పొట్లకాయ, వంకాయ, వెల్లుల్లి, దొండకాయ, చిర్రికూర, ద్రాక్ష, ఏలకులు, ఉష్ణోదకం.

**అపథ్యం :** తూర్పుగాలి, వాతకరములగు అన్నపానములు గొర్రె నెయ్యి, పాలు, దుష్టకరమగు ఉదకం, మత్స్యం కందమూలములు, ఆవాలు.

## శ్వాస

ఉచ్ఛ్వాస, నిశ్వాసం అతికష్టముగా తీసుకొనుట. తిత్తుల నుండి గాలి బయటకు వెడలుటట్లు వుండును.

**క్షుద్రాశ్వాస :** గాలి వదులుట శ్వాసక్రియలో అవరోదం కల్గుట.

**తమకశ్వాస :** మాటిమాటికి దమ్ము ఆయాసం, కలిగినపుడు రోగి తీవ్రమైన బాధకు లోనగుట, కళ్ళముందు బైర్లుకమ్ముట, దప్పికతో బాధపడుట కదలిక లేకుండా అగుట, తెమడ బయటకు రాకపోవడం వలన రోగికి చాలా కష్టంగా ఉంటుంది. తెమడ బయటికి వచ్చినపుడు దగ్గవలసిన పరిస్థితి రోగి వెల్లకిలా పడుకోలేడు, నిద్రపోలేడు.

**అపథ్యం :** ఆయాసం, దమ్ము చల్లని నీరు, చల్లని గాలి కఫం పెంచు ఆహారం వలన ఎక్కువ అవుతుంది.

**చికిత్స :** ఏలాదిచూర్ణం,సితోఫలాదిచూర్ణం, శృంగాది చూర్ణం, తాలీసాది చూర్ణం, దశమూలక్వాధం, శృంగాదిక్వాధము, కరపారాది యోగం, మయూర పిచ్ఛభస్మం, కంటకార్యది క్వాధం, వాసాది క్వాధం,

బాగోత్తర గుళిక, ఖదిరాదివటి, లవంగాదివటి, సోమయోగం, అభ్రకభస్మం, అర్క లవణం, బారంగ్యాది గుడం, చ్యవన ప్రాశ, అగస్త్య హరితకి అవలేహం, ద్రాక్షారిష్ట వ్యాఘ్రి హరితకి అవలేహ. వాసారిష్ట, కనకాసవ.

**పథ్యం :** పాతవరిబియ్యం, ఉలవలు, గోధుమలు, బార్లీ, వాస్తువక, పత్రములు, పొట్లకాయ ఆకులు, రాస్నామూలం, ద్రాక్ష, నెయ్యి, మేకపాలు.

**అపథ్యం :** నెమ్మదిగా జీర్ణమగు ఆహారం, పొడిఆహారం మలబద్ధకం, కల్గించు ఆహారం, అభిష్యంది ద్రవ్యం, మినువులు, ఆవాలుశాకం, ఆవాలు, నూనెతో వండిన ఆహార పదార్థాలు, పెరుగు, చేపలు, శ్వాసరోగికి, హాని కరములు, సహజమైన మలమూత్రములను దప్పిక త్రేన్పులు, దగ్గు తుమ్ము, అధిక ధూమపానం, ఎండలో తిరుగుట.

## శ్వాస

ఆర్ద్రక స్వరసప్రయోగం, కులత్థాది క్వాథం, కర్పూరాది చూర్ణం, కృష్ణ సైంధవాది చూర్ణం, శృంగ్యాదిచూర్ణం, దశమూల కటుత్రయాదిక్వాథం, వాసాది క్వాథం, అశ్వగంధాసవం, మయూర ఫించభస్మం, వాసా ఘృతం, త్ర్యూషణఘృతం, తేజోవత్యాది ఘృతం, సిద్ధమకరధ్వజ, శ్వాసకుఠారం, చ్యవన ప్రాశ, వాసావలేహం, వాసాకంటాకర్యావలేహం, అగస్త్యహరితకి, బార్లీగుడం, శ్వాసకుఠారం, మహలక్ష్మివిలాసం, శ్వాసకాసచింతామణి, స్వర్ణసమీరపన్నగ, రసమాణిక్య, శతపుటఅభ్రకం, పంచసూతరసం, శృంగారాభ్ర రసం.

## శ్లీపదం

చలిజ్వరం మాటిమాటికి వచ్చి తరువాత క్రమక్రమంగా వాపు కాలిలో గట్టిపడుట వాపు పెరుగుట, వాపు చేతులలో వృషణాలలో కూడ కన్పించును.

**చికిత్స :** మంజిష్ఠాది క్వాథం, నిత్యానందరసం. శీతాంశురసం, శ్లీపద గజకేసరి రసం.

**పథ్యం :** బార్లీగింజలు,ఉలవలు,బియ్యం,పొట్లఆకులు, మునగ కాడలు, కాకరకాయలు, పునర్నవా ముల్లంగి, బచ్చలి, వెల్లుల్లిపాయలు ఆముదం.

**అపథ్యం :** గురు అభిష్యంది పిండిపదార్థాలు, పాల ఉత్పత్తులు.

## శ్లీపద

**పథ్యం :** 60 దినములకు పండెడి పాతవడ్లు, సంబావడ్లు, ఉలవలు, ఉల్లిగడ్డలు, పొట్లకాయ, వంకాయ, మునగకాయ, కాకరకాయ, ఆవునెయ్యి, ఆవుచల్ల, ఆముదం, గోమూత్రం, కారం, వగరు దీపనముగు పదార్ధములు.

**అపథ్యం :** పిష్టాన్నము పాలతో జేయబడు పదార్ధములు, బెల్లము, జలప్రాంత జంతుమాంసం, గురుత్వ పదార్ధములు.

## షండరోగము (ఇంపొటెన్సి)

**చికిత్స** : అకారభాధివటి

## సద్యోవ్రణములు

ఆవక్లిస్రవ్రణము, విలంబి భిన్నము, ప్రచలితం, ఘృష్ఠము, విద్ధము, నిపాతితము.

**చికిత్స :** గౌరాది ఘృతం, సప్తవింశతి గుగ్గులు.

## సెగరోగము (గనోరియా)

చికిత్స : స్వర్ణవంగము, చందనాదివటి

## స్వరభేదము

**బేధములు :** 1. వాత స్వరబేధము 2. పిత్తస్వరబేధము 3. శ్లేష్మ స్వర భేదము 4. మేదోస్వర భేదము 5. సన్నిపాత స్వభేదము 6. ధాతుక్షయ స్వర భేదము.

**పథ్యం :** చెమట, యవలు, ఎర్రవడ్లు, హంస, అడవికోడి, నెమలి, మాంసరసం, పల్లేరు, కాచిఆకురసం, జీవంతీకూర, లేతముల్లంగి, ద్రాక్ష, కరక మాదీఫలం, వెల్లుల్లి, ఉప్పు, తాంబూలం, నెయ్యి.

**చికిత్స :** బ్రహ్మి ఘృతం.

## అసృగ్ధరము

**చికిత్స :** పాఠాది ఘృతం, ప్రదరాంతక రసం, బాలసూర్యోదయం

## స్త్రీలలో కలుగు వ్యాధులు

**శ్వేతప్రధరం :** యోనిగుండా జిగటబంక నురుగుతో కూడిన తెల్లని స్రావం బియ్యం కడుగు నీళ్ళవలె స్రవించును. వంటినొప్పి, నడుంనొప్పి కల్గును.

**చికిత్స :** గోదంతి భస్మం, శిలాజత్వాదిలోహ

**రక్తప్రదరం :** అధిక రుతుస్రావం క్రమంతప్పి ఎక్కువ రోజులు స్రవించ డాన్ని రక్తప్రధరం అంటారు. బలహీనత, మంట, మగత, తల తిరుగుట, చిత్తభ్రమ, కళ్ళుతిరుగుట.

**చికిత్స :** ఉసిరిక స్వరసం, తిప్పతీగ, కోకుందుర, అడ్డసరం స్వరసం, ఉసిరిక చూర్ణం, అశోక బెరడు చూర్ణం, రేగుపండ్లు చూర్ణం, నేలఉసిరి చూర్ణం, శుద్ధలాక్షా చూర్ణం, లోద్రచూర్ణం, నాగకేసరచూర్ణం, కుశవేళ్ళచూర్ణం బుల్లవేరు చూర్ణం, చంద్రప్రభావటి, ప్రధరాంతకరస, కామదుగ్ధరసం, చంద్ర కళారసం, వంగభస్మం, త్రివంగభస్మ ప్రదారారి లోహం, లోద్రాసవం, పత్రాంగాసవ, అశోకారిష్ఠ.

**యోనిభ్రంశ :** యోనిద్వారం గుండా గర్భాశయం ముందుకు చొచ్చు కొని వచ్చుటను యోనిభ్రంశం.

**చికిత్స :** సుకుమరతైలం, బలాతైలం.

**గర్భస్రావం & గర్భవాతం :** గర్భం ధరించి నాలుగు మాసములు నిండక మునుపే గర్భం పడిపోయినచోగర్భస్రావం. నాల్గవ మాసం నిండిన తర్వాత గర్భం పడిపోయినచో గర్భపాతం అందురు. శ్రోణి, మరియు పుష్ఠభాగంలో నొప్పి, గర్భాశయ స్రావం బలహీనత కల్గును.

**చికిత్స :** లవంగాది చూర్ణం, శతావరీ చూర్ణం, చందనాది క్వాథం, హ్రిబేరాది క్వాథము, గర్భపాలరస, ముక్తభస్మ, అమృతప్రాశ అవలేహం, చ్యవనప్రాశ, అవలేహం, ఫలకళ్యాణ ఘృతం, అశ్వగంధారిష్ఠ.

**పథ్యం :** శాలిధాన్యం, ముద్గ, గోధుమ పేలాలు, నుక్తం, అరటిపండు, ఉసిరిక, ద్రాక్ష, బాగా ఎండిన మామిడి, వెన్న, నెయ్యి రసోల, తేనె పంచ దార, గర్భస్రావ & గర్భపాతనం జరిగిన స్త్రీలకు ఉపయోగకరం. మర్దనం మృదువైన పడక,చల్లని వాతావరణం, వెన్నెల, సుగంధ ద్రవ్యములు వాడుట.

**అపథ్యం :** పులుపు,కారం,చేదు ఆలస్యముగా జీర్ణమగునవి ఆమ్ల, కటు తిక్త, గురు అభిష్యంద ద్రవ్యములు క్షార విరుద్ధాహారం, అయిష్ట ఆహార సేవనం.కఠినమైన పడక, దుఃఖం, కోపం, భయాందోళనం, సహజవేగం, అపుట, ఉపవాసం, రాత్రిపూటభోజనం, విరేచనం, మాంసం, మద్యం, అయిష్ట, ఆహారసేవన బావిలో, నదులలో తొంగిచూచుట.

**మక్కనశూల :** ప్రసవాంతరం కాని అనియుత కారణాల వలన నాభీ

ప్రాంతంలోకాని మంత్రశయ ప్రాంతంలోకాని వాపు, పడినట్లుగా నాభీప్రాంతంలోగాని, ఉదర మంతటకానీ, నొప్పికల్గుట.

**చికిత్స :** దేవదార్యాది క్వాథము.

## సూతిక జ్వరం

ప్రసవ సమయంలో సరియైన పరిశుభ్రత సూక్ష్మక్రిమి, నాశన క్రియ, మొదలగునవి సరిగా పాటించక పోవుట వలన రోగికి జ్వరం వచ్చును.

స్తన్యాత్థ & గ్రహ్యాత్థ –6 విధములు

**స్తన్యోథ :** స్త్రీ ప్రసవాంతరం మూడు రోజులు లోపే పాలు ఉత్పన్నమగును కొన్నిసార్లు ఆలస్యం అగుట వలన స్తనములు బిగుతుగా అయిన దాహము తలనొప్పి ప్రక్కల నొప్పి ఒంటినొప్పి మరియు దడ.

**గ్రహ్యాత్థ :** గ్రహ దుష్టి లేదా మానసిక భీతి చెందిన లేక దిగ్భ్రాంతి చెందుట వలన సంభవించిన జ్వరం.

**చికిత్స :** లవంగాది చూర్ణం, దశమూలక్వాథం, దేవదార్యాధి క్వాథం, అమృతాది క్వాథము, ప్రతాప లంకేశ్వర రసం, సౌభాగ్య శొంఠి, కళ్యాణక ఘృతం, పంచతిక్తఘృతం, దశమూలాదిఘృతం, జీరాకాద్య మోదకం, మృత సంజీవని, సుర, దశములారిష్ఠ, జీరకాద్యరిష్ట.

**పథ్యం :** కారము తీక్ష్ణ మరియు ఉష్ణద్రవ్యములు పాతబియ్యం, షష్ఠి ధాన్యం గోధుమలు, ఉలవలు, మునగ, పొట్ల, వెల్లుల్లి, తేలికగా జీర్ణమగు ఆహారం శరీర మర్దనం, మృదువుగా కాపడం.

**అపథ్యం :** పగటినిద్ర, చల్లటి నీటిస్నానం, వ్యాయామం, మైధునం, తూర్పుగాలిని త్యజించాలి.

**స్తన్యదోష :** పాలిచ్చు తల్లి గురు ఆహారమును సేవించడం వలన తల్లి పాలులో దోషం కలిగి శిశువుకు రుగ్మతలు కలుగుచేయును.

**స్తనవిద్రది :** స్తనములో వచ్చిన గడ్డను స్తనవిద్రది ప్రథమదశలో ఇది గట్టి రాయివలె వుండును. కొద్దికాలం తర్వాత మెత్తబడి విద్రది లక్షణాలు కలిగి వుండును.

## శ్విత్రం

రాగిరంగు, గులాబి రంగు లేదా తెలుపురంగు కల మచ్చలతో ఎల్లపుడు పొడిగా వుండటం.

**చికిత్స :** గంధకరసాయనం, రససిందూరం, పలాశత్వక్క్షారం.

**పథ్యాఅపథ్యాలు :** మొలకెత్తిన శనగలు, గోధుమలు, శ్విత్రవృద్ధి కల వానికి మంచివి.

## హృద్రోగం

**వాత :** హృదయభాగంలో తీవ్రమైన నొప్పి, నొప్పికోసినట్లు, చిలికినట్లు, లాగినట్లు వుంటుంది. హృదయ స్పందన అదుపుతప్పుట, గుండెదడ గుండె పనిచేయకపోవుట.

**పిత్త :** చాతీప్రాంతం,హృదయ ప్రదేశం భారముగా ఉండుట, విపరీత మైన అలసట, దప్పిక మండినట్లుగా, వేదన చెమట పట్టుట.

**కఫ :** గుండెలో పట్టినట్లుండును శరీరము బరువుగా అన్పించుట తెమడ చొల్లు, ఎక్కువకారుట, ఆకలి లేకపోవుట, నోటిలో తీపి దనముం డుట.

**చికిత్స :** వర్ధమాన పిప్పలి, దశమూల క్వాధము, పునర్నవాష్టక క్వాదము, అజమోదాదివటి, ఆరోగ్యవర్ధిని వటి, చంద్రప్రభావటి, యాకుతి జహర్‌ముహర్‌రసం, చతుర్మఖరసం, బృహద్వాత చింతామణి రసం, నాగార్జునాభ్రరసం, హృదయార్ణవ రసం. శృంగిభస్మం, అకిక్‌భస్మము, ముక్తా పిష్టి, వ్యోమశ్వపిష్ఠి, జహర్మోహరపిష్ఠి, అర్జునఘృతం, దశమూల అరిష్ఠ, అర్జున అరిష్ఠ, అర్జునపట్ట.

**పథ్యం :** పాతవరి ధాన్యం, పెసలు, ఉలవలు, పొట్లకాయాకులు, ముల్లంగి, అరటిపండు, గుమ్మడికాయ, మామిడిపండు, దానిమ్మ,ద్రాక్ష, అల్లం,వెల్లుల్లి, ఉల్లిపాయ, శొంఠి, బెల్లం, కస్తూరి, జంతుపక్షుల మాంసం.

**అపథ్యం :** వగరు రుచి, వేడి తీక్ష్ణ ద్రవ్యం శాకములు, ఇప్పపువ్వు, విరుద్ధ గుణముకల పదార్ధం. హానికరములు, సంబోగం కోపం, ఆందోళన, అరుచుట వేడి, అధిక ఉష్ణోగ్రత, మలమూత్రవేగములు ఆపుట. **హిక్కా(ఎక్కిళ్ళు) :-** ఉదానవాత, ప్రాణవాతము దుష్టిచెంది శ్వాస మార్గములు అడ్డగించినపుడు హిక్ అనిశబ్దముతో కడుపులో నుండి మెలిపెట్టినట్లుగును. **చికిత్స:-** మయూర పుచ్చభస్మం + పిప్పలి చూర్ణం తేనెతో వాడాలి.

## యోని రోగములు

బేధములు :

**1 వాతజయోనిరోగములు - 5**

ఉదావర్తయోని వ్యాపత్తు, వంధ్యాయోని వ్యాపత్తు, విప్లుతాయోని వ్యాపత్తు, పరిప్లుతా యోని వ్యాపత్తు, వాతలయో యోని వ్యాపత్తు.

**2. పిత్తజ యోని రోగములు - 5**

లోహితక్షయ యోని వ్యాపత్తు, వామినీ యోని వ్యాపత్తు, ప్రస్రంగినీ యోని వ్యాపత్తు, పుత్రగ్ని యోని వ్యాపత్తు, పిత్తలాయోని వ్యాపత్తు.

**3. కఫజయోని రోగములు -5**

అత్యానంద యోని వ్యాపత్తు, కర్ణినీ యోని వ్యాపత్తు, అచరణ యోని వ్యాపత్తు, అతీచరణ యోని వ్యాపత్తు, శ్లేష్మయోని వ్యాపత్తు.

**4. సన్నిపాత యోని వ్యాపత్తు -5**

షండీ యోని వ్యాపత్తు, అండలీయోని వ్యాపత్తు, మహతీయోని వ్యాపత్తు, సూచీవక్రయోని వ్యాపత్తు, సర్వజయోని వ్యాపత్తు.

**చికిత్స :** లఘుఫల ఘృతం

**వంద్యారోగం** : భేదములు జన్మవంధ్యా, కాకవంధ్యా, కదలీవంధ్యా, మృతవంధ్యా.

**చికిత్స :** విష్ణు క్రాంతయోగం కళ్యాణ ఘృతం, మంజిష్టాది ఘృతం

## యోని కందము

**బేధములు**

1. వాతజయోని కందము, 2. పైత్తిక యోని కందము 3. కఫజ యోని కందము 4. సన్నిపాత యోని కందము.

**పథ్యం :** ప్రాత సన్నబియ్యం అన్నం, మేకమాంసం, చిన్నచేపల సూపు.

**అపథ్యం :** శ్లేష్మవృద్ధికర పదార్ధములు, చేపలు, మిఠాయి, మిక్కిలి ఎక్కువ ఉప్పు,పాలు, నిప్పువద్దగాని, ఎండలోగాని, చలిలోగాని యుండుట, పగలు నిద్రించుట, రాత్రి జాగరణ సల్పుట, మిక్కిలి, నడిచి ఆయాసం జెందుట, ఎత్తగు ప్రదేశము ఎక్కుట లేక అక్కడి నుండి దిగుట, సంబోగ సుఖము పొందుట మలమూత్రముల అడ్డగించుట. బిగ్గరగా మాట్లాడుట, నువ్వులు, పెరుగు, గంజి, చేపలు, మాంసములు.

## గర్భజ రోగములు

ఉపవిష్టక గర్భం, నాగోదరం, మక్కల్లము, విష్టంబగర్భం, జరాయు దోషం, గూఢగర్భం, గర్భపాతం, మూఢగర్భం.

**పథ్యం :** భోజనమున తేలిక జీర్ణించునవిగ పుష్టికరమైనవిగా రుచిని పుట్టించినవిగా తగు మాత్రం, శరీర పరిశ్రమ మధుర పదార్థములు.

**అపథ్యం :** దూరముగా ప్రయాణమును సల్పుట, పరిగెత్తు బండ్లమీద బోవుట, భయపడుట, దిగులుపడుట, సంభోగించుట, కఠినంగా పాన్పులపై పరుండుట, మల మూత్రాలను అడ్డగించుట.

## సూతిక రోగములు

**చికిత్స :** బృహత్సూతివినోదరసం, సూతికారిరసం, సింధూరభూషణం, సూతికా భరణం.

**పథ్యం :** ముల్లంగి, వంకాయలు, చిరుసెనగలవంట పప్పులు, చేతి పొట్ల, వాత శ్లేష్మ దోష నివారకములగు దాడిమ మున్నగాగల ఫలమును.

**అపథ్యం :** గురుకర పదార్థములు, తీక్ష్ణ పదార్థములు ఎండలో వుండుట, శైత్యాపచారములు, సంభోగం, ప్రసవానంతరం కనీసం 3,4 స్త్రీ జాగ్రత్తలు పాటించవలెను.

## స్తన్యరోగములు

వాతదుష్ట దుగ్ధములు, పిత్తదుష్ట దుగ్ధములు,కఫదుష్ట దుగ్ధములు, త్రిదోష దుష్ట దుగ్ధములు, ద్వంద్వ దుగ్ధములు.

**పాలుపడుజేయునవి :** అనుములు, ఆకుపత్రి,వాము,కాసిని గింజలు, ఖర్జూరపండు, జీలకర్ర, సెనగలు, మదనానబకాయ, ముండ్లతోటకూర, సోపు.

## హృద్రోగము

**బేధములు :**

వాతజ హృద్రోగం, పిత్తజ హృద్రోగం, శ్లేష్మజ హృద్రోగం, సన్నిపాతజ హృద్రోగం, క్రిమిజ హృద్రోగం.

**హృదయబలకారులు :** అంజీరపండు, అంబరు, అక్రోటు, అజామోద విత్తులు, ఉసిరికాయలు, ఎదునాలుకచెట్టు, యాలకులు, హారతి కర్పూరం, కస్తూరి, కస్తూరి బెండకారుబా, కుంకుమపువ్వు, కొబ్బరి కాయ, కొబ్బరిసారాయి, చింతపొట్టు, కామంచి చెట్టు, జఠామాంసి, జాజి కాయ, గులాబీపువ్వు, చింతపండు, దాల్చినచెక్క, ద్రాక్షరసం, తియ్యని దానిమ్మ పండు, నేలతాడి, పగడభస్మం, పసుపు, సాంబ్రాణీ, పాలపండు బాదంమసి,

బోడతరం, ముత్యముల భస్మం, మందారపుష్పం, లవంగపట్ట, లవంగాలు, వస, వెదురు, వాయింటకచెట్టు.

**పథ్యం :** చెమటతీయుట, విరేచనం, వమనం జేయించుట, లంఘనం చేయుట, లేపనం జేయించుట పాత బియ్యంవంటకం, అడవియందుండు పశు పక్షులు మాంసం, పెసరకట్టు, ఉలవకట్టు, పాతగుమ్మడికాయ, మామిడి కాయ, దాడిమపండు, రేలాకు, పొట్లకాయ,ఆముదం, వాననీరు, వెల్లుల్లి, సైంధవలవణం, మేక గొర్రె వీని మజ్జిగ, పాతబెల్లం, శొంఠి ఓమము,వెల్లుల్లి, కరక్కాయ,చెంగల్వకోష్టు, కొత్తిమీర, మిరియాలు, అల్లము, కలి, తెల్లని తేనె, సారాయి, కస్తూరి, చందనం, తాంబూలం.

**అపథ్యం :** దప్పి, వాంతి, మూత్రము, వాతము, పొడిదగ్గు, తేనుపు, శ్రమ, శ్వాసము, మలం, రోదనం, అనువాని వేగం నడ్డగించుట బర్రెపాలు, దుష్టజలం, వగరు, ఉప్పు, దంతకాష్టం, రక్తమోక్షము

## కష్టార్తవ

నొప్పితో కూడిన నెలసరి, ఆర్తవం సక్రమముకాని విరామము, తక్కువ సమయం మరియు కొంచం మోతాదులో నొప్పితో కూడిన రక్తస్రావం.

**చికిత్స :** బోలాదివటి, హింగుకర్పూరవటి, హింగ్వాది వటి, రజః ప్రవర్తినివటి, రజోదోష హరవటి, శూలాంతక రసం, ఋతుశూల సంహారి.

**అపథ్యం :** మజ్జిగ పుల్లటిపెరుగు, గంజి, మరియు చేపలు.

## భగశోధ

యోని యొక్క వాపునే భగశోధ అంటారు.

**చికిత్స :** అభయ క్వాథం, పునర్నావాది క్వాదం, గోక్షురాది క్వాదం, చంద్రప్రభావటి, శిలాజత్వాదివటి, పునర్నావాది గుగ్గులు.

## యోని దాహం & యోని కండు

యోనిగుండా పసుపు పచ్చని దుర్వాసనలోకూడిన స్రావం.

**చికిత్స :** పుష్యానుగచూర్ణం, శతావరి చూర్ణం, గుడుచ్యాదిచూర్ణం, నింబాది క్వాదం, చందనాది క్వాదం, చంద్రప్రభావటి చందనాదివటి, చంద్ర కళారసం, శంఖపుష్పిపానకం, ఉశీరాసవ.

**యోనికండు :** యోనిభాగం పొడిగాను దురదతో ఉండుటను యోని కండు అంటారు.

**చికిత్స :** అమృతాది క్వాదం, గుడుచ్యాదిక్వాదం, మంజిష్టాదిక్వాదం, చంద్రప్రభావటి, శారిబాదివటి, శిలాజిత్వాదివటి.

**రక్తగుల్మ :** గర్భసంచిలో గడ్డనొప్పితోను మంటతోను కూడిన ప్రత్యేక లక్షణం. ఇది క్రమేణ పెద్దదై ఉదరంపై భాగం నుండీ స్పర్శించదగును. గర్భదారణంలో శిశువు గుండె దడ వినిపించును.

## శిరోరోగములు

**చికిత్స :** మయూర ఘృతం, షడ్బిందుతైలం, ప్రపాండిరీకాది తైలం, ప్రియళాది లేపం, అయశ్చూర్ణాది లేపం, మాషాది లేపం.

## కర్ణశూల

కర్ణనాదతైలం, వచాది తైలం, పూతీకర్ణం, ప్రియంగ్వాది తైలం.

**ఆయుర్వేద ఔషధములు - అనుపానాలు- మోతాదులు- పథ్యా పథ్యాలు**

## అర్కములు

### అజమోదార్కము (వామ్ వాటర్)

ద్రవ్యములు : వాము

గుణము : దీపనము

దీనిని 1/2 మొ౹౹ 3/4 ఔన్సుల వరకు సమమగు నీటిలో కలిపి సేవించినచో అజీర్ణము, కడుపునొప్పి, శూలపరిణామము అతిసారము, అజీర్ణ విరేచనములు, వాంతులు అరుచి, కడుపునొప్పి, కలరా, అగ్నిమాంద్యము మొదలగు వ్యాధులు వెంటనే హరించును.

అనుభూత ప్రయోగములు :

1. కడుపుబ్బరము, పులిత్రేన్పుల యందు భాస్కర లవణమంత తీసుకొనిన ఉపశనము కలుగును.

2. కఫ దోషమువలన కలిగే వ్యాధుల యందు కఫహర ద్రవ్యముల నిచ్చుచూ ఈ అర్కమును ఇచ్చిన కఫహరము కాగలదు.

3. చిన్న పిల్లలకు ప్రతిరోజు ఇచ్చుచుండిన, అగ్నిదీపనము జరిగి, పాచనము చెంది, మలమూత్రముల విబంధము తొలగిపోవును.

పథ్యము : అల్లము, శొంఠి, బీరకాయ, పొట్లకాయ, లఘు పదార్థములు, కాచి చల్లార్చిన నీరు.

అపథ్యము : గురు పదార్థములు, శీతలకర పదార్థములు, తీపి

పదార్థములు.

మోతాదు : 15-30 మి.లీ. పిల్లలకు ఇందు అర్ధభాగము భోజనమునకు అరగంట ముందు లేదా వెనుక ఇవ్వవలెను.

లభ్యము : 100 మి.లీ. 200 మి.లీ. 450 మి.లీ.

## కర్పూరాద్యర్కము (అనుభూత యోగము)

ద్రవ్యములు : ముద్ద కర్పూరము, వాము, శుద్ధోదకము.

గుణము : దీపనము, హృదయోత్తేజనము, గ్రాహి.

అనుభూత ప్రయోగములు :

1. కార్మిక్స్ కాప్స్యూల్‌నకు అనుపానముగా ఇచ్చిన, **అగ్ని మాంద్యమును** హరించును.

2. **అశ్మస్సు**నందు కందమూల రసాయనమునకు అనుపానముగా ఇచ్చిన, విబంధనము తొలగి తద్వారా అర్శస్సు శమించును.

3. జఠరదీప్తికై అగ్నితుండివటి లేదా అగ్నికుమార రసంతో ఇవ్వవచ్చును.

**పథ్యము** : పాతబియ్యము, పెసలు,పెసరకట్టు, వెల్లుల్లి, పొట్లకాయ, బీరకాయ, పీచు పదార్థములు.

అపథ్యము : గురుకర బియ్యము, బచ్చలి, మలబద్ధకర పదార్థములు, దుంప కూరలు మాంసము, నూనె పదార్థములు.

మోతాదు : 15-30 మి.లీ. ఆహారమునకు ముందు లేదా వెనుక, లేక వ్యాధ్యాను సారము ఆహారము లేకుండా ఇవ్వవలెను.

లభ్యము : 50 మి.లీ. 100 మి.లీ.

## తరుణార్కము

దీనిని (1) తమలపాకుల రసముతో నిచ్చిన యెడల కఫ మెదుర్కొనుట, కాళ్ళు చేతులు చల్లబడుట, చెమటలు, మగత, నాడినీరసించుట మొదలగునవి (2) అల్లపు రసముతో నిచ్చిన యెడల సన్నిపాత జ్వరములు, దోష జ్వరములు, జ్వరములు మొదలగునవియు నశించును. అతి తీవ్రముగ పనిచేయును.

మోతాదు 1/3 మొ॥ 1/4 వరకు.

### యవాన్యర్కము

దీనిని 1/2 మొ॥ 1/4 ఔన్సు వరకు సమానమగు నీటిలో కలిపి సేవించిన యెడల మేహ వ్యాధులు, అగ్నిమాంద్యము, నోటిపూత, శుక్లనష్టము, రక్త దోషములు, ప్రదరములు, ఉడుకు, తాపము, దప్పిక మొదలగునవి నశించును.

## ఆసవములు

### అహిఫేనాసవము

దీనిని 10 చుక్కలు మొదలు 30 చుక్కలు వరకు 1/4 మొ॥ ఔన్సు నీటిలో కలిపి సేవించిన యెడల జిగటవిరేచనములు, అతిసారము, రక్తముపడుట, విషూచి (కలరా) పొడిదగ్గు, శుక్లనష్టము, పొడి ఆయాసము, గ్రహణి, మొదలగునవి వెంటనే నశించును. ఇందు నల్లమందు కలియును. కనుక వెంటనే పనిచేయును.

### అరవిందాసవము (భై.ర.)

వట్టివేళ్ళు, మంజిష్ట, బలా, ఏలక్కాయలు.

ఇది చిన్న పిల్లల జీర్ణశక్తిని వృద్ధిచేయును. పెరుగుదలకు ఉపయోగపడును.

### భృంగరాజాసనము

దీనిని 1/4 మొదలు 1/2 ఔన్సు వరకు రెట్టింపు నీటితో కలిపి సేవించిన యెడల పాండువు, నంజు, జీర్ణజ్వరము, కామెర్లు, అజీర్ణము, దగ్గు, ఆయాసము, గుండె వ్యాధులు, కృశించుట, శుక్రము క్షీణించుట ఇవి హరించును.

### చందనాసవ (భై.ర.)

ద్రవ్యములు : శ్వేత చందనపు పొట్టు, కురువేరు, తుంగముస్తలు, పెగ్గుమ్మడు, నల్లకలువ దుంపలు, ప్రేంఖణము, పద్మకము, లొద్దుగచెక్క, మంజిష్ట, మామిడిచెక్క, బూరుగబంక, ధాతకీ పుష్పము, ద్రాక్షపండ్లు.

గుణము : శుక్రమేహమును నశింపచేసి బలమును పుష్టిని పెంపొందించును. హృదయమునకు హితకారి పాచకాగ్నిని పెంపొందించును. ఉష్ణశమనము, మూత్ర లము (భైషజ్యరత్నావళి)

దీనిని 1/4 మొ 1/2 ఔన్సుమోతాదు చొప్పున సమానమగు నీటిలో

కలిపి సేవించిన యెడల శుక్లనష్టము, కాళ్ళు చేతులు మంటలు, సెగ వ్యాధులు, అతిమూత్రము మూత్రకృచ్ఛము గుండెవ్యాధులు, రక్తపిత్తము మొదలగు వేడివలన కలిగిన వ్యాధుల నన్నిటిని వెంటనే నశింపజేయును. దీనిని సేవించునప్పుడు వేడి చేయు పదార్థములను భుజింపరాదు.

అనుభూత ప్రయోగములు :

1. శరీర అతి ఉష్ణమునందు బాగుగా పనిచేయును.

2. సెగరోగములందు సేవించిన, చురుకు, పోటుతగ్గి, మూత్రము జారీ అగును. ఉష్ణ శరీరము కలవారు దీనిని సేవించుట మిక్కిలి శ్రేయస్కరము.

3. హృదయ దౌర్బ ల్యమును పోగొట్టును.

4. కర్పూర శిలాజిత్ 10 గ్రా. త్రిఫల చూర్ణము 50గ్రా. గోక్షురాది చూర్ణము 50గ్రా. త్రివంగ భస్మము 10గ్రా. కలిపి 3 గ్రా. చొప్పున చందనాసవ అనుపానముగా తీసుకొనిన, సామాన్యముగ కనబడే మూత్ర వ్యాధుల యందు ఉపయోగకరము.

5. సరసరెండు చెంచాలు, చందనాసవ రెండు చెంచాలు కలిపి భోజనానికి ముందు తీసుకొనిన, మొటిమలను నివారించవచ్చును.

6. మూత్రాగత అశ్మరిని నివారించుట రాస్నాకషాయముతో చందనాసవ సేవించిన మిక్కిలి ఉపయోగకరము.

7. తలనొప్పి, కళ్లవెంట నీరు కారుట మొదలగు సందర్భములలో చందనాసవ అత్యంత ఫలదాయకము.

మజ్జిగ,బెల్లపు పానకము, కొబ్బరినీరు, బార్లీ జావ, పాయసము మొదలగు చలువ చేయు పదార్థములు నీరు ఎక్కువగా సేవించ వలెను.

**చిత్రకాసవము (అ.హృ)**

250 ఎం.ఎల్. చిత్రకము, మరీచము, తేనె,పిప్పళ్ళు, గో మూత్రము

25 ఎం.ఎల్. రెండుసార్లు – తెల్లమచ్చలు, రక్తార్శస్సులను తగ్గించును. జీర్ణ శక్తి పెంపొందించును.

**ధాత్ర్యాసవము**

ఉసిరికాయ, చతుర్జాతకములు, శొంఠి, జాజికాయ, మరీచము, పిప్పళ్లు, కర్పూరము.

25 ఎం.ఎల్. రెండుసార్లు - కామెర్లు, రక్తహీనత, దగ్గు, పురాణ జ్వరములందు ఉపయుక్తము.

**ద్రాక్షాసవ (భై.ర.)**

ద్రవ్యములు : ద్రాక్ష, ఖండశర్కర, తేనె, ఆరెపువ్వు, జాపత్రి, లవంగం, తక్కోల ములు,చలువ మిరియాలు, లవలీఫలము, శ్వేత చందనము, పిప్పలి, దాల్చిన చెక్క, యాలకులు, తేజపత్రి.

గుణము : అర్శస్సు, శోథ, అరుచి, హృద్రోగము, పాండు, రక్తపిత్తము, భగం దరము, గుల్మము, ఉదరరోగము, కృమి, గ్రంధి, క్షయ, శోష, జ్వరము, వాతజ, పిత్తజ రోగములు మొదలగు వానిని హరించును. బలవర్ధకము. వర్ణమును పెంపొం దించును.

అనుభూత ప్రయోగము :

1. క్షయనందు తామ్రభస్మము, రజత భస్మము, స్వర్ణ భస్మములను చ్యవనప్రాశతో ఇచ్చుచూ, ద్రాక్షాసవను ఇచ్చిన దౌర్బల్యము తగ్గి ఆకలి పుట్టి హృదయమునకు బలము నిచ్చును.

2. అనేక కారణముల వలన కలిగే అగ్నిమాంద్యమునందు హింగ్వాష్టక చూర్ణము, నేలవేములను కలిపి ఇచ్చుచూ, ద్రాక్షాసవము ఇచ్చిన, జఠరదీప్తి కలుగును.

3. రక్తపిత్తమునందు వ్యాధ్యానుసార చికిత్స చేయుచూ, లొద్దుగచెక్క, శాల్మలీ చూర్ణములతో ఇచ్చిన, రక్తస్రావము క్రమముగా తగ్గును.

పథ్యము : పప్పు పదార్థములు, మాంసము, వేడిగానుండు ఆహారమును తీసుకొనవలెను. శ్వాస, కాస, తమక శ్వాసలయందు తేలికగా జీర్ణమగు ఆహారమును తీసుకొనవలెను. మితముగా భుజించుట మిక్కిలి శ్రేయస్కరము.

అపథ్యము : చల్లని పదార్ధములు, నూనె ఎక్కువగా ఉన్న పదార్ధములు చల్లని ప్రదేశములు.

మోతాదు : 15-30మి.లీ.రోజుకు రెండు లేదా మూడుసార్లు భోజనానంతరం వాడవలెను.

లభ్యము : 200 మి.లీ. 450 మి.లీ.

## కనకాసవము

దీనిని 1/4 మొ 1/2 ఔన్సువరకు రెట్టింపు నీటిలో కలిపి సేవించిన యెడల దగ్గు, ఆయాసము, క్షయ, రక్తపిత్తము ఉరఃక్షతము మొదలగునవి నశించును. ఉమ్మెత్త అధికముగ కలయుటచే శ్లేష్మ జాతిమీద వెంటనే పనిచేయును.

## శారిబాద్యసవము

దీనిని 1/4 మొ॥ 1/2 ఔన్సు వరకు సమానము లేక రెట్టింపు నీటిలో కలిపి సేవించిన యెడల రక్తదోషముచే కలిగిన వ్యాధులన్నియు నశించును. జీర్ణించిన సవాయి వ్యాధులు కూడ నశించును. మరియు శుక్లనష్టము శరీరతాపము మొదలగు వేడి వలన కలిగిన వ్యాధులన్నియు నశించును. చర్మవ్యాధులు, ప్రమేహములు, వాత రక్తము, సెగ వ్యాధులు, ప్రదరములు, భగందరము మొదలగు వ్యాధులు కూడ హరించును.

450 ఎం.ఎల్. శారబ, తుంగముస్తలు, లొద్దుగ, పిప్పళ్ళు, కచ్చోరాలు, పద్మకం, గుడూచి, వట్టివేళ్ళు, చందనం

25 ఎం.ఎల్. రెండుసార్లు - మేహరోగము, కీళ్ళవాతము, చర్మరోగములందు ఉపయోగము.

## కనకాసవ (భై.ర.)

ద్రవ్యములు : నల్ల ఉమ్మెత్త సమూలము, అడ్డసరపు వేళ్ల చెక్క, ఇప్పపువ్వు, పిప్పళ్లు, వాకుడు, నాగకేసరములు, శొంఠి, గంటుభారంగి, తాళిసపత్రి, ధాతకీ పుష్పము, ద్రాక్షపండ్లు.

గుణము : సర్వ విధములైన శ్వాస, కాస, రాజయక్ష్మ, క్షత, క్షీణ, జీర్ణ, జ్వర, రక్తపిత్త, ఉరఃక్షతములను హరించును.

అనుభూత ప్రయోగములు :

1.కఫహరము, శ్వాసకాసలను హరించును. కఫవాత ప్రధానమైన దగ్గులు, ఉబ్బసములను హరించును. స్రోతోమార్గము నందలి కఫమును వెడలించి ఉపశమనమును కల్గించును. తమక శ్వాసయందు శ్రేష్టమైనది.

2. శ్వాసానందవటి, కస్తూరి మాత్రలతో అనుపానముగా ఇచ్చిన శ్వాసరోగము తగ్గును.

3. త్రికటుచూర్ణము, ఏలాది చూర్ణము, లవంగాది చూర్ణము 50 గ్రా. చొప్పున కలిసి రెండు గ్రా. చొప్పున కనకాసవతో సేవించిన ఎటువంటి

కాస అయినను తగ్గును.

4. ఏరకమైన ఆయాసమునందైనను అర్జునారిష్టతో కలిసి వరుసగా 40-65 రోజులు వాడిన ఫలితమునిచ్చును.

**పథ్యము :** తేలికగా జీర్ణమయ్యే ఆహారమును తీసుకొనవలెను.

**అపథ్యము :** పెరుగు, దుంపకూరలు, నెయ్యి, పప్పు పదార్ధములు, నూనె ఎక్కువగా ఉన్న పదార్థములు, చేపలు, రొయ్యలు, మాంసము, మాంసరసము తగ్గించి వాడవలెను.

మోతాదు : 15-30 మి.లీ. రోజుకు రెండు లేదా మూడుసార్లు భోజనానంతరం రెట్టింపు నీటితో ఇవ్వవలెను.

లభ్యము : 200 మి.లీ. 450 మి.లీ.

**కుమార్యాసవము (శా. సం.)**

ద్రవ్యములు : కలబంద నిజరసము, కరక్కాయలు, ఆరెపువ్వు, జాజికాయ, లవంగములు, తక్కోలములు, చలువ మిరియములు, జటామాంసి, చవ్యము, చిత్ర మూలము, జాపత్రి, కర్కాటక శృంగి, తానికాయ, పుష్కరమూలము, తామ్రభస్మము, లోహభస్మము.

గుణము : స్త్రీలకు కలుగు ఋతు దోషము, గుల్మము, రక్తగుల్మము, ప్లీహము, శ్వాస,కాస,క్షయ, ఉదరరోగములు, అర్శ, వాతరోగము, అపస్మారము, మందాగ్ని, ఉదరశూలలను హరించును. పాచనశక్తిని పెంపొందించును.

దీనిని 1/4 మొ॥ 1/2 ఔన్సు వరకు రెట్టింపు నీటిలో కలిపి సేవించిన యెడల దగ్గు, క్షయ, ఆయాసము, హృద్రోగము, శుక్లనష్టము, సమస్తమగు ప్రమేహములు, సమస్తమగు సెగ వ్యాధులు, సమస్తమగు ప్రదరములు, మూత్రకృచ్ఛ్రము, రక్త పిత్తము మొదలగు వేడివలన కలిగిన వ్యాధులన్నియు నిశ్చయముగ హరించును.

450 ఎం.ఎల్. కుమారి లోహం, త్రికటు, చతుర్జాతకములు, చిత్రకం, పిప్పలీ మూలం, వాయువిడంగాలు.

25 ఎం.ఎల్ రెండుసార్లు - శ్వాసకాసం, పాండు, గుల్మరోగహరం.

**అనుభూత ప్రయోగములు :** 1.ఋతుశూల కలిగిన స్త్రీలకు మూడు మాసములు సేవించిన రజఃశుద్ధి కలిగి శూల హరించును.

2. ఫిరంగి రోగము, పూయమేహము మొ॥ వ్యాధులచే వస్తియందు శూల కలిగి బాధనొందువారికి 40 రోజులు ఇవ్వవలెను.

3. శ్వాస కాసలయందు వాసకారిష్టముతో గాని ద్రాక్షారిష్టతోగాని సేవించ వలెను.

4. అశోకాదివటి, చంద్రప్రభావటి ఒక్కొక్కమాత్ర చొప్పున కుమార్యాసవ రెండు చెంచాలు, అశోకారిష్ట రెండు చెంచాలు అనుపానముగా వాడిన, ప్రదర రోగములను నివారించవచ్చు.

5. లోహాసనవ, కుమార్యాసవ, అశోకారిష్ట ఒక్కొక్క చెంచాడు చొప్పున కలిపి భోజనానంతరము పగలు, రాత్రి వాడిన యెడల గర్భాశయమునకు కలుగు ఎటువంటి వ్యాధిని దరిచేరనీయదు.

6. ఋతుక్రమము సరిలేనపుడు ఋతుబద్ధ నివారిణి ఒక మాత్రతో అనుపాన ముగా ఇవ్వవచ్చును. ఋతుశూలనందు ఋతుశూల ఒకమాత్రతో రాత్రి,పగలు వాడిన గుణకారి.

పథ్యము : ఎక్కువగా మజ్జిగ, ఖర్జూరపు పండ్లు, కొబ్బరినీళ్లు, పండ్లరసములు తీసుకొనవలెను.

అపథ్యము : మషాలాదినుసులు, కారము, మిరియాలు వంటి తీక్ష్ణ పదార్ధ సేవన మంచిదికాదు.

మోతాదు : 15-30 మి.లీ. రోజుకు రెండు లేదా మూడుసార్లు భోజనానంతరం రెట్టింపు జలముతో ఇవ్వవలెను.

లభ్యము : 200 మి.లీ. 450 మి.లీ.

### కర్పూరాసవము

దీనిని 1/8 మొ॥ 1/4 మొ॥ ఔన్సు నీటిలో కలిపి సేవించిన యెడల విషూచి (కలరా) నీళ్లవిరేచనములు, అజీర్ణ విరేచనములు, దగ్గు, ఆయాసము, గ్రహణీ విరేచన ములు మొదలగునవి వెంటనే హరించును.

### లోహాసవము

దీనిని 1/4 మొ॥ 1/2 ఔన్సు వరకు సమానము లేక రెట్టింపు నీటిలో కలిపి పుచ్చుకొనిన యెడల పాండువు అజీర్ణము, నంజు, ఉదరము, కామెర్లు, తిమ్మెర్లు, గుండె వ్యాధులు, రక్తదోషములు, వాత వ్యాధులు, అతిసారము,దగ్గు, ఆయాసము, గుల్మము, ప్లీహ వ్యాధులు మొదలగునవి

వెంటనే హరించును. లోహసంబంధమగు భస్మములు గాని కుప్పె ఔషధములుగాని వేడిచేసే పని చేయునప్పుడు దీనినుపయో గించినచో బహు చక్కగ పనిచేయును. గర్భిణీ స్త్రీలకు కూడ వాడవచ్చును.

**లోహాసవ (భై.ర.)**

ద్రవ్యములు : లోహభస్మము, త్రిఫలములు, త్రికటుకములు, అజమోదము, వాయు విడంగములు, తుంగముస్తలు, చిత్రమూలము, ఆరెపువ్వు.

గుణము : పాండు,శోథ,గుల్మ రోగములు, అర్శశూల, కుష్ఠ, ప్లీహవృద్ధి, కండు, కాస, శ్వాస, భగందర, అరుచి, సంగ్రహణి మరియు హృదయ రోగములను నశింప జేయును.

అనుభూత ప్రయోగములు :

1.కామిల, పాండువులకు పునర్నవాది మండూరముతో ఇవ్వవలెను.

2. శోఫ (నంజు) రోగమునకు గోక్షురాది చూర్నముతో ఇవ్వవలను.

3. గ్రహణి, అతిసారములయందు కర్పూరాదివటితో సేవించవలెను.

4. కాసీస సిందూరముతో సేవించిన త్వరితగతిన పాండు, యకృత్ వృద్ధులను శమింప జేయును.

5. ఏరకమైన రక్తక్షయమునందైనను, మండూర భస్మము 10 గ్రా. రజిత చంద్రోదయము 2.5 గ్రా. గోమూత్ర శిలాజిత్తు 10 గ్రా.మహాద్రాక్షాది చూర్ణము 25గ్రా. శతావర్యాది చూర్ణము 40 గ్రా.లను కలిపి 2గ్రా. చొప్పున లోహాసవ అనుపానముగా ఇచ్చిన చాలా ఉపయోగకరము.

6. దగ్గు, ఆయాసము కలవారికి వాసారిష్టతో ఇవ్వవలెను.

7. ఉబ్బసము, దగ్గు కలవారికి కనకాసవతో కలిపి ఇవ్వ వలెను.

పథ్యము : ఆకుకూరలు, ఉసిరిక, గోంగూర, మెంతికూర మొదలగు వానితో కూడిన ఆహారమును తీసుకొనిన మిక్కిలి శ్రేష్ఠము,నారింజ,బత్తాయి, ఆపిల్ పండ్ల రసములను ఎక్కువగా సేవించవలెను.

అపథ్యము : క్రొవ్వు ఎక్కువ కలిగిన పదార్థములు, చేపలు, ఆవాలు, పులుపు పదార్థములు, అధికశ్రమను నివారించవలెను.

మోతాదు : 15-30 మి.లీ. రోజుకు రెండు లేదా మూడుసార్లు భోజనానంతరం రెట్టింపు జలముతో సేవించవలెను.

లభ్యము : 200 మి.లీ. 450 మి.లీ.

**లోధ్రాసవము (అ. హృ)**

450 ఎం.ఎల్. లొద్దుగ, మూర్వా, కుష్టం, క్రముకం, అతివిషం

25 ఎం.ఎల్. రెండుసార్లు – మొలలను నశింపజేయును.

**నింబామృతాసవము (స.యో)**

450 ఎం.ఎల్ –వేప, గుడూచి, చేదుపొట్ల, అడ్డసరము

25 ఎం.ఎల్ రెండుసార్లు – చర్మరోగములు, భగంధరము, ఆమవాతము, కణితులు, జలుబు, మరియు వాపులను తగ్గించును.

**పిప్పల్యాసవము (శా. సం)**

450 ఎం.ఎల్ – పిప్పలి, మరీచము, చవ్యం, పసుపు, చిత్రకము

25 ఎం.ఎల్ – రెండుసార్లు – ఉదర సంబంధ వ్యాధులందు, రక్తహీనత, మొలలు, శరీర శోషలందు మంచి ఔషధం.

**పునర్నవాసవము (శా. సం)**

450 ఎం.ఎల్. త్రికటు, త్రిఫల, దార్వి, పెద్దములక, అడ్డసరం, ఆముదంవేరు, కటుకరోహిణి.

25 ఎం.ఎల్. రెండుసార్లు – శోధ, ఉదర, కాలేయ సంబంధవ్యాధులు, గుల్మ జ్వరముల నివారించును.

**పూతీకరంజాసవము (అ. హృ)**

450 ఎం.ఎల్ – పూతీకరంజ,చిత్రకం, కంటకారి, త్రిజాతకములు, త్రికటు, దానిమ్మ

25 ఎం.ఎల్ రెండుసార్లు – మొలలు, గుల్మము, ఉదరము, ప్లీహ వ్యాధులందు శ్రేష్టము.

**ఉశీరాసవ (భై. ర)**

ద్రవ్యములు : వట్టివేళ్లు కురువేరు, తామరదుంపలు, పెగ్గుమ్మడు, నల్లకలువ పూలు, ప్రేంఖణ పువ్వు పద్మకాష్ఠము, లొద్దుగచెక్క, మంజిష్ట, దూలగొండివేళ్లు, చిరుబొద్ది, నేలవేము మర్రి ఊడలపట్ట, మేడిపట్ట, కచ్చూరములు, పర్పాటకము, తెల్లతామరపూలు, చేదుపొట్ల, దేవకాంచనపు చెక్క నేరేడు చెక్క, బూరుగ బంక.

గుణములు : రక్తపిత్తము, పాండు, కుష్టము,ప్రమేహము, అర్శస్సు, క్రిమిజన్య రోగములు, శోధ మొదలగువానిని హరించును.

దీనిని 1/4 మొ॥ 1/2 ఔన్సు వరకు సమానము లేక రెట్టింపు నీటిలో కలిపి సేవించిన యెడల రక్తపిత్తము, కుష్ఠములు, రక్తార్శస్సు, దప్పిక, తాపము, రక్తదోష ములు, సమస్తమగు ప్రమేహములు, గుండెదడ, శుక్లనష్టము, శరీర మెల్లప్పుడు వెచ్చగనుండుట మొదలగు వేడివలన కలిగిన వ్యాధులన్నియు వెంటనే నశించును. దీనిని వేసవి కాలమునందు సేవించినచో వేసవి భయముండనేరదు.

అనుభూత ప్రయోగములు :

1. దాహమును, తాపమును హరించును.

2. వేసవిలో భోజనమునకు ముందు రెండు చెంచాలు ఉశీరాసవ, రెండు చెంచాలు అమృతారిష్ట కలిపి తీసుకున్న యెడల వేసవి తాపమునుండి రక్షణ కలుగును.

3. జ్వరహరిమాత్రలు 6 గంటల తేడాతో ఒకటి చొప్పున మూడు నుండి నాలుగు చెంచాల ఉశీరాసనతో తీసుకొనిన జ్వరము శాంతించును.

4. రక్తపిత్తమునందు లాక్షాది చూర్ణము 25 గ్రా. ద్రాక్షాది చూర్ణము 40 గ్రా. తిప్పసత్తు 20 గ్రా. చొప్పున కలిపి 2 గ్రా.తో ఉశీరాసవ అనుపానముగా ఇచ్చిన ఊర్ధ్వ, అధోగత రక్తపిత్తమునందు ఉపయోగకారి.

5. శోథయందు పునర్నవారిష్టతో వాడిన బహుళ ప్రయోజనకారి.

6. కఫజ శోథయందు పిప్పలీ చూర్ణము, తుంగగడ్డల చూర్ణముతో అనుపానముగా వాడవచ్చును.

పథ్యము : దానిమ్మపండ్లు, అరటిపువ్వు, కొబ్బరిపువ్వు, ఖర్జూరపు పండ్లు, చింత పువ్వు, నీరుల్లిపాయ, తాటిముంజెలు

అపథ్యము : చలి అన్నము, పులుసు, ఉప్పు, ఉష్ణోదకము నిషిద్ధము.

మోతాదు : 15-30 మి.లీ. రోజుకు రెండు లేదా మూడుసార్లు భోజనానంతరం రెట్టింపు నీటితో సేవించవలెను.

లభ్యము : 200 మి.లీ. 450 మి.లీ.

**అభయారిష్ట (భై. ర)**

ద్రవ్యములు : కరక్కాయ, ఎండుద్రాక్ష, వాయు విడంగములు,

ఇప్పపువ్వు, పల్లేరు, తెల్లతెగడ, ధనియాలు,ఆరెపువ్వు, వెర్రిపుచ్చ, చవ్యము, సొంపు, శొంఠి, దంతి వేళ్లు బూరుగుబంక.

గుణము : అన్నిరకముల అర్శస్సులను, మరియు ఉదర రోగములను హరించును. మలమూత్ర విబంధరోగములను నశింపచేయును. జఠరాగ్నిని ప్రదీప్తింప జేయును.

దీనిని 1/4 మొ॥ 1/2 ఔన్సు వరకు సమానము లేక రెట్టింపు కలిపి సేవించిన యెడల మలబంధమును పోగొట్టి సుఖ విరేచనమును చేయును. దగ్గు, ఆయాసము, మూలవ్యాధి, భగంధరము, ఉదరము, నంజు, గుల్మము మొదలగునవి నశించును. మలబంధము కలవారికి ఆయా ద్రావకములలో కలిపి యియ్యవచ్చును.

అనుభూత ప్రయోగములు :

1. అర్శస్సునందు రాత్రి పరుడం బోవునపుడు సమభాగము నీటితో సేవించవలెను.

2. మలబంధరోగి రోజూ రెండు పూటలా భోజనమునకుముందు నీటితో కలిపి సేవించవలెను.

3. అగ్ని దీపనమునకు ప్రతి ఉదయము నీరు లేకుండా సేవించవలెను.

4. ఇది మూత్రలము, పాచకము, సారకము కాబట్టి వృద్ధుల యందు కలిగే కోష్ఠబద్ధత యందు అగ్నిమాంద్యము, అరుచిలందు త్రికటుచూర్ణము 2.5 గ్రా.లతో తీసుకొనిన యెడల అదిక ఉపయోగకారి.

5. మధుమేహమునందు తారకేశ్వర రసంతో వాడిన ఉపయోగకరము.

6. గ్రహణి, సంగ్రహణిల యందు దాడిమాష్టక చూర్ణము, కుటజఘన వటిలతో వాడవచ్చును.

7. అమ్లపిత్తమునందు గంగాధర చూర్ణము, భాస్కరలవణ చూర్ణములకు అనుపానముగా నిచ్చిన ఉపయోగకారి.

పథ్యము : తేనె, లేతముల్లంగి, ద్రాక్షపండ్లు, పెసరపప్పు, పొట్లకాయ, బీరకాయ, మునగకాయ, పీచు పదార్థములు.

అపథ్యము : మినుములు, శనగలు, పులుసుకూరలు, ఎండు, ఉప్పు చేపలు, వ్యాయామము చేయరాదు.

మోతాదు : 15-30 మీ.లి. రోజుకు రెండు లేదా మూడుసార్లు

భోజనానంతరం రెట్టింపు నీటితో తీసుకొనవలెను.

లభ్యము : 200 మి.లీ. 450 మి.లీ.

**అమృతారిష్ట**

ద్రవ్యములు : తిప్పతీగ, దశమూలములు, జీలకర్ర, పర్పాటకము, ఏడాకుల పొన్న, త్రికటుకములు, తుంగముస్తలు, నాగకేసరములు, కటుకరోహిణి, అతివస, కొడిశపాల విత్తులు.

గుణము : సర్వ జ్వర హరము

దీనిని 1/4 మొ॥ 1/2 ఔన్సువరకు సమానము లేక రెట్టింపు కలిపి సేవించిన యెడల జీర్ణ జ్వరము, పురాణ జ్వరము, విషమజ్వరము, సన్నిపాత జ్వరము సూతికా జ్వరము మసూరి (మసూచిక) జ్వరము, వాతజ్వరము, శ్లేష్మ జ్వరము మొదలగు సమస్త జ్వరములు హరించును. ఇది రక్తశుద్ధిని, ఆకలిని కలిగించును.

అనుభూత ప్రయోగములు : త్రిదోషహరము, కుష్ఠహరము, జ్వరహరము, జీర్ణ జ్వరము, పిత్తజ్వరము, విషమజ్వరము, తరచుగా వచ్చు జ్వరము, సన్నిపాత జ్వరము మొదలగు వానియందు గుణకారి. జ్వరానంతరము కలుగు నీరసము. బలహీనతలయందు, మరియు దాహములందు అత్యంత గుణకారి. జ్వరములందు దశమూలారిష్టతో సన్నిపాత జ్వరములందు కస్తూరితో సేవించవలెను.

1. త్రిదోష జ్వరములందు దశమూలారిష్టతో సేవించవలెను.

2. ఒళ్లు నొప్పులు, కీళ్ళనొప్పులతో వచ్చు జ్వరములందు తిప్పసత్తుతో సేవిం చిన బాగుగా పనిచేయును.

3. వేసవి కాలమునందు అమృతారిష్ట రెండు చెంచాలు, ఉశీరాసవ రెండు చెంచాలు కలిపి, రోజుకు రెండు మూడుసార్లు చొప్పున సేవించిన యెడల, వేసవి తీవ్రత ప్రభావము శరీరముపై ఉండదు.

4. సన్నిపాత జ్వరము నందు జ్వరాంకుశ రసతో ఇచ్చిన, జ్వరము వారము లేదా పది రోజులలో తగ్గును.

5. సూర్యావర్తమునందు సువర్ణ సూర్యావర్తితో వాడిన లాభదాయకము.

పథ్యము : జ్వరము ఉన్న సమయమున ద్రవ పదార్థములను మాత్రమే తీసుకొన వలెను. (బార్లీనీరు మొ.) జ్వరములేని సమయమున తేలికగా

జీర్ణమగు ఆహారమును మాత్రమే తీసుకొనవలెను. కాచి చల్లార్చిన నీటిని మాత్రమే త్రాగవలెను. ఉడికించిన ఆహారమును మాత్రమే సేవించవలెను.

అపథ్యము : గురుకర ఆహారసేవన, శీతలకర ఫలములు, మాంసము, చేపలు, దుంపకూరలు మొదలగునవి తాత్కాలికముగా సేవించరాదు.

అనుపానము : కాచిచల్లార్చిన నీరు.

మోతాదు : 15-30 మి.లీ. రోజుకు రెండు లేదా మూడుసార్లు భోజనానంతరం రెట్టింపు నీటితో తీసుకొనవలెను.

లభ్యము : 200 మి.లీ. 450 మి.లీ.

**అరగ్వధారిష్టము (అ.హృ)**

రేల, వాయువిడంగములు ఉసిరిక

చర్మరోగములు, నులిపురుగులు, తెల్లమచ్చలను నశింపచేయును.

**అర్జునారిష్ట (భై.ర.)**

ద్రవ్యములు : తెల్లమద్దిపట్ట, ఎండిన ద్రాక్షపండ్లు, ఇప్పపువ్వు, ధాతకీపుష్పము

గుణము : హృదయ, శ్వాసకోశగత వ్యాధులయందు అత్యుత్తమ ఔషధము, హృదయమునకు బలమును కల్గించును. పిత్త ప్రధాన హృదయరోగములయందు, ఊపిరి తిత్తులయందు వాపు, నీరు చేరుట మొదలగు వ్యాధులయందు బాగుగా పని చేయును. మందగత నాడియందు ఈ ఔషధమును సేవించిన దృఢత్వమును కల్గించును. బలహీనతలయందు కూడా ఉపయోగకారి.

దీనిని 1/4 మొ॥ 1/2 ఔన్సు వరకు రెట్టింపు నీటిలో కలిపి సేవించిన యెడల గుండె సంబంధమగు వ్యాధులన్నియు నశించును. గుండెకు బలము కలుగును. పుప్పుస (లంగ్సు,) సంబంధమగు వ్యాధులనన్నిటిని కూడ నశింపచేయును. కఫమును వెంటనే కరగించి నశింపచేయును. గుండె వ్యాధులకు శ్రేష్టమైనదని అందరికిని తెలియును.

అనుభూత ప్రయోగములు :

1. రక్తలేమి యందు పునర్నవాది మండూరము, కాసీసభస్మములతో కలిపి వాడవచ్చును. రాజయక్ష్మ యందు (క్షయ) స్వర్ణభస్మము, ముత్యభస్మము, శృంగి భస్మములకు అనుపానముగా వాడవచ్చును.

2. రక్తపిత్త రోగములయందు చందనాసవతో సేవించుట శ్రేష్టము.

3. హృదయగతి సరిలేనపుడు ద్రాక్షారిష్టతో వాడిన గుణకారి.

4. గుండెదడ, నీరసములందు తిప్పసత్తు 20 గ్రా. అభ్రక భస్మము 5 గ్రా. అశ్వగంధ చూర్ణము 45 గ్రా. గోమూత్ర శిలాజిత్ 10 గ్రా. లను కలిపి రెండు గ్రా. చొప్పున 10–15 మి.లీ. అర్జునారిష్ట అనుపానముగా వాడిన గుణకారి.

పథ్యము : ద్రాక్షపండ్లు, వెల్లుల్లి, అల్లము, మంచి తేనె తీసుకొనవలెను. మనస్సును ప్రశాంతముగా ఉంచుకొనవలెను. ఉదయం, సాయంత్రం తేలికపాటి నడక అవసరం. ఎక్కువసేపు విశ్రాంతి తీసుకొనవలెను.

అపథ్యము : క్రొవ్వు, మద్యము, తాంబూలము పూర్తిగా నిషిద్ధము, అలసట చెందుట, ఆందోళనపడుట, అతిగా ఆలోచించుట మొదలగునవి చేయరాదు. వేడి చేయు పదార్థములు నిషిద్ధము.

మోతాదు : 15–30 మి.లీ. రోజుకు రెండు లేదా మూడుసార్లు భోజనానంతరం రెట్టింపు నీటితో సేవించవలెను.

లభ్యము : 200 మి.లీ. 450 మి.లీ.

## అశ్వగంధారిష్ట (భై.ర.)

ద్రవ్యములు : అశ్వగంధ, మంజిష్ట, మంచి పసుపు కొమ్ములు, మాను పసుపు, కళింగ రాష్ట్రం, పాలగుమ్మడి, అర్జునపట్ట, తెల్లతెగడ వేళ్లు, నేలతాడి, కరక్కాయ, అతి మధురం, తుంగముస్తలు, తెల్ల సుగంధిపాల, దూలగొండివేళ్లు, శ్వేత చందనపు పొట్టు, రక్త చందనపు పొట్టు, వస, చిత్రమూలము, త్రికటుకములు, త్రిజాతకములు, ప్రేంఖణము, నాగకేసరములు.

గుణము : బృంహణము, రసాయనము, బల్యము, దీపనము, స్మృతికరము, మూర్ఛ, అపస్మారము, యోషాపస్మారము, శోష, దారుణోన్మాదము, క్షయ, ఆరు విధముల అర్శరోగములు, అగ్నిమాంద్యము, వాత రోగములను హరించును.

దీనిని 1/4 మొ॥ 1/2 ఔన్సువరకు సమానము లేక రెట్టింపు నీటిలో కలిపి సేవించిన యెడల బలహీనత శుక్లనష్టము దగ్గు, క్షయ, గుండె వ్యాధులు, కృశించుట, వాత వ్యాధులు, మూర్ఛ, అపస్మారము, ఉన్మాదము మొదలగునవి వెంటనే హరిం చును. నరములకు బలమును శరీరమునకు

పుష్టిని కలిగించును.

అనుభూత ప్రయోగములు : బలవర్ధకము, రసాయనము పాండురోగము, నరముల బలహీనత, సంధ్యా దోషము, నిస్సత్తువ మొదలగు వానిని హరించును. రక్తమును వృద్ధిచేసి, దేహమునకు పుష్టిని కలిగించి ధాతు శక్తిని పెంచును. మస్తిష్కమునకు బలమునిచ్చును. రక్తపోటు కలవారు సర్పగంధ చూర్ణముతో తీసుకొనిన రక్తపోటును క్రమబద్ధము చేయును. కీళ్ళనొప్పుల యందు ఉపయోగకారి. బాలింతలకు కలుగు నీరసమునందు బాగుగ పనిచేయును. శతావరీ చూర్ణముతో సేవించిన క్షీర వృద్ధికరము.

1. పక్షవాతము నందు వాత గజాంకుశరస, మహాయోగ రాజగుగ్గులుకు అనుపానముగా వాడిన అత్యుత్తమ, ఫలితములిచ్చును.

2. కృశత్వమునకు మహాకూష్మాండ లేహ్యముతోరెండు మండలములు సేవించ వలెను.

3. స్త్రీల వంధ్యా దోషమునకు శతావరీ లేహ్యముతో మూడు మండలములు సేవించవలెను.

4. అత్యుష్ణముతో బాధపడు గర్భవతులకు చందనాసవతో కలిపి ఇవ్వవలెను.

పథ్యము : జీర్ణమగుచున్నచో పాలు, పెరుగు, వెన్న, పప్పుదినుసులను సేవించ వలెను. శారీరక శ్రమ చేయకుండా ఉండరాదు. తేలికపాటి వ్యాయామము అత్యంత అవశ్యకము.

అపథ్యము : తాంబూలము, మద్యము, కర్బూజా, పనసపండ్లు,చల్లని నీరు, చలి అన్నము, శీతలకర పదార్థములు సేవించరాదు.

మోతాదు : 15-30మి.లీ. రోజుకు రెండు లేదా మూడుసార్లు భోజనానంతరము రెట్టింపు నీటితో ఇవ్వవలెను.

లభ్యము : 200 మి.లీ. 450 మి.లీ.

## అశోకారిష్ట

ద్రవ్యములు : అశోకపట్ట, మానుపసుపు, త్రిఫలములు, ఆరెపువ్వు, నల్లజీలకర్ర, తుంగముస్తలు, శొంఠి, కలువదుంపలు, మామిడిగింజలు, మంచి జీలకర్ర, అడ్డసరము మంచి గంధపు చెక్క.

గుణము : రక్తప్రదరము, జ్వరము, రక్తపిత్తము, రక్తార్శస్సు, మందాగ్ని,

అరోచ కము, ప్రమేహము మొదలగు వానిని హరించును.

దీనిని 1/4 మొదలు 1/2 ఔన్సు మోతాదు చొప్పున సమానము లేక రెట్టింపు నీటిలో కలిపి సేవించిన యెడల స్త్రీలకు కలుగు ఋతుశూల, శ్వేతరక్త ప్రదరములు, నెలకు సరిగ బహిష్టు కాకుండుట, ఋతురక్తముసరిగ వెడలకుండుట, ఋతురక్త మధికముగ నశింపజేయును. సంతానమును కలిగించును. గర్భాశయమునకు బలము నిచ్చును.

అనుభూత ప్రయోగములు : ఋతు దోషములు, ఋతుశూల, వంధ్యా దోష ములు, యోని దోషములు మొదలగు వ్యాధులను హరించును.

1. అశోకాది వటితో సేవించిన ఋతుశూలను హరించును. (బహిష్టు అయిన రోజులలో కూడా రోజుకు రెండు పూజలు ఇవ్వవలెను.)

2. వంధ్యా దోషములకు అశ్వగంధారిష్ట, శతావరి రసాయనములతో మూడు మాసములు సేవించవలెను.

3. ఋతుబద్ధమునకు 'ఋతుబద్ధనివారిణి'తో సేవించవలెను.

4. రక్తప్రదరమునందు ఉశీరాసవతో తీసుకొన్న గుణకారి.

5. ఋతుక్రమమునందలి దోషము పోవుటకు, గర్భాశయ శోధనమునకు, పుష్యానుగ చూర్ణము రజఃప్రవర్ధన వటి, అబలసుధలతో అనుపానముగా సేవించిన లాభదాయకము.

పథ్యము : లేత అరిటికాయ, బెండకాయ, అరటిపువ్వు, బూడిద గుమ్మడికాయ, నేరేడు పండ్లు, దానిమ్మపండ్లు, పంచదార, తేనె, మొదలగునవి తీసుకొనుట మంచిది.

అపథ్యము : కొత్తబియ్యము, శనగలు, కోడిమాంసము, మునగకాయ, చేపలు, ఆవనూనె, నువ్వులనూనె, గురుత్వము చేయు పదార్థములు తినకూడదు.

మోతాదు : 15-30 మి.లీ రోజుకు రెండు లేదా మూడుసార్లు భోజనానంతరం రెట్టింపు నీటితో ఇవ్వవలెను.

లభ్యము : 200 మి.లీ. 450 మి.లీ.

## బబ్బూలారిష్టము (భై.ర.)

దీనిని 1/4 మొ॥ 1/2 ఔన్సువరకు సమానము లేక రెట్టింపు నీటిలో కలిపి సేవించిన యెడల దగ్గు, క్షయ, ఆయాసము, నోటిపూత, శుక్లనష్టము,

అతిసారము, జిగట విరేచనములు, రక్తముపడుట, శ్వేతరక్త ప్రదరములు, కుష్ఠము, ప్రమేహ వ్యాధులు మొదలగునవి వెంటనే హరించును.

## బలారిష్టము

దీనిని 1/4 మొ॥ 1/2 ఔన్సువరకు రెట్టింపు నీటిలో కలిపి సేవించిన యెడల వాత వ్యాధులు, దగ్గు, క్షయ, బలహీనత, శుక్లనష్టము మొదలగునవి వెంటనే నశిం చును. శరీరమునకు బలమును, పుష్టిని కలిగించును.

450 ఎం.ఎల్ – బలా, అశ్వగంథ, రాస్నా, ప్రసారిణి

25 ఎం.ఎల్ రెండుసార్లు – పక్షాఘాతం, సంధిగత వాత వ్యాధులు, నరముల బలహీనత మొదలగు వాని యందు ఉత్తమము.

## దశమూలారిష్టము (భై.ర.)

ద్రవ్యములు : కోలపొన్న, ముయ్యాకుపొన్న, చిన్నములక, పెద్దములక, పల్లేరు, మారేడు, తక్కిలి, దుందిలము, కలిగొట్టు పెగ్గుమ్మడు, చిత్ర మూలము, పుష్కరమూలము, లొద్దుగపట్ట, తిప్పతీగ, ఉసిరికవరుగు, దురదగొండి, చంద్రచెక్క, కరక్కాయ, చెంగల్వకోష్టు, మంజిష్ట, దేవదారు, వాయువిడంగములు, అతిమధురము, గంటు బారంగి, వెలగపట్ట, తానికాయ, గలిజేరు, చవ్యము, జటామాంసి, ప్రేంఖణము, సుగంధి పాల, నల్లజీలకర్ర, తెల్లతెగడ, రేణుకలు, సన్నరాష్ట్రము, పిప్పళ్లు, చికినీ వక్కలు కచ్చూరములు, మంచిపసుపు, పెద్దసోపు, పద్మకము, నాగకేసరములు, తుంగముస్తలు, కొడిశపాల విత్తులు, కర్కాటక శృంగి, జీవకము, ఋషభకము, మేదా మహామేద, కాకోళి, క్షీరకాకోళి, ఋద్ధి, వృద్ధి, తక్కోలము, వట్టివేళ్లు, చందనము, జాజికాయలు, లవంగములు దాల్చినచెక్క, యాలకులు, ఆకుపత్రి, పిప్పళ్లు.

గుణము : సంగ్రహణి, అరుచి, శూల, శ్వాస, కాస, భగందర, వాతవ్యాధి క్షయ, వమన, పాండు, కామల, సర్వవిధములైన చర్మవ్యాధులు ఆరురకముల అర్శస్సులయందు 20 రకముల ప్రమేహముల యందు, సమస్త ఉదర వ్యాధులయందు, మందాగ్ని, అశ్మరి, మూత్రకృచ్ఛము, ధాతుక్షయము మొ॥ రోగములయందు బాగుగా పని చేయును. మరియు కృశించిన మనుష్యులకు పుష్టిని, వంధ్యా స్త్రీలకు సంతాన ప్రాప్తిని కలుగజేయును.తేజస్సును వీర్యమును, బలమును పెంచును.

దీనిని 1/4 మొ॥ 1/2 ఔన్సువరకు సమానము లేక రెట్టింపు నీటిలో

కలిపి సేవించిన యెడల పక్షవాతము మొదలగు సమస్త వాత వ్యాధులు, సూతికావాతము, క్షయ,దగ్గు, ఆయాసము, అగ్నిమాంద్యము, అజీర్ణము, ధాతుక్షయ, అరుచి, శూల, మొదలగు వ్యాధులు వెంటనే నశించును. నరములకు బలమును, శుక్ర వృద్ధిని, సంతానమును, కలిగించును. ఇందు కస్తూరి కలియును.

అనుభూత ప్రయోగము : 1. బాలింతలకు కలుగు అన్ని రకముల సూతికా రోగములయందు బాగుగా పనిచేయును.

2. త్రిదోషహరము నిస్సత్తువలయందు అత్యంత గుణకారి.

3. హృదయ దౌర్బల్యమునందును, కాళ్లు చేతులు చల్లబడుటయందు, ఒక ఔన్సు దశమూలారిష్టయందు 30 మి.గ్రా. కస్తూరి, 60 మి.గ్రా. పచ్చ కర్పూరము, 60 మి.గ్రా. కుంకుమపువ్వు కలిపి నూరి ఇవ్వవలెను.

4. శ్వసనకజ్వరము (న్యుమోనియా) యందు కస్తూర్యాది వటి, గోరోచనాది వటితో సేవించిన శ్రేయస్కరము.

5. నాడీవ్రణములందు కాంచనార గుగ్గులుకు అనుపానముగా వాడుతూ, చ్యవనప్రాశ వాడిన యెడల అధికప్రయోజనకారి.

6. ఏరకమైన శ్వాస, కాస సంబంధిత రోగములనందైనను సితోపలాది చూర్ణము, తాళీసాది చూర్ణములతో అనుపానముగా వాడవచ్చును.

పథ్యము : కాల్చిన గోధుమరొట్టె, పొట్లకాయ, కొయ్యతోటకూర, గలిజేరుకూర, ఆవుపాలు, మేకపాలు, వేడినీరు, తేనె

అపథ్యము : కల్లు, చిక్కుడు, గోరు చిక్కుడు, వంకాయ, దుంపకూరలు, తీపి పదార్థములు తినకూడదు.

మోతాదు : 15-30 మి.లీ. రోజుకు రెండు లేదా మూడుసార్లు భోజనానంత రము రెట్టింపు నీటితో సేవించవలెను.

లభ్యము : 200 మి.లీ. 450 మి.లీ.

**ధన్వంతరారిష్టము (అ.హృ)**

450 ఎం.ఎల్. బలా, దశమూలములు, మేధ, మహామేధ, కాకోళి, కుష్టం, చందనం, శారిబ, గ్రంథి తగరం.

25 ఎం.ఎల్ రెండుసార్లు - పక్షాఘాతం, అర్ధితం, జ్వరం, హెర్నియా, మూల సంబంధ, స్త్రీ సంబంధ వ్యాధులందు ఉపయోగము.

## ద్రాక్షారిష్ట (భై.ర.)

ద్రవ్యములు : ఎండిన ద్రాక్షపండ్లు, దాల్చినచెక్క, యాలకులు, ఆకుపత్రి, నాగకేస రములు, ప్రేంఖణము, మిరియాలు, పిప్పళ్లు, వాయు విడంగములు.

గుణము : ఉరః క్షతము, క్షయ, కాస, శ్వాస, కంఠ సంబంధిత రోగములయందు బాగుగా పనిచేయును. శరీరబలమును పెంచును. మల శోధనము చేయును.

దీనిని 1/4 మొదలు 1/2 ఔన్సు మోతాదు చొప్పున సమానము లేక రెట్టింపు నీటిలో కలిపి సేవించినయెడల బలహీనత, అజీర్ణము, గుండె వ్యాధులు, మలబంధము, దగ్గు, ఆయాసము, క్షయ, శుక్లనష్టము, పైత్య వ్యాధులు, శ్లేష్మ వ్యాధులు, వాత వ్యాధులు, అరోచకము, ఉరఃక్షతము, జీర్ణజ్వరము, రక్తపిత్తము, అర్శస్సు మొదలగు వానిని నశింపజేయును. రసౌషధములలో పూర్ణ చంద్రోదయమువలె ఆసవారిష్టము లలో నిది శరీరమునకు బలమును, పుష్టిని, కలిగించుచు సమస్త వ్యాధులను నశింప జేయును.

అనుభూత ప్రయోగములు :

1. గుండెదడ కలవారు అర్జునారిష్టతో సేవించ వలెను.

2. గర్భవతులు నిత్యము సేవించుచున్న గర్భపోషణము కలుగును.

3. మూర్ఛ, క్షయ రోగములలో అనుపానముగా వాడిన మిక్కిలి శ్రేష్టమైనది.

4. అర్శోరోగులయందు భల్లాతకవటి ఆర్శోఘ్నవటి, ద్రాక్షారిష్ట అనుపానముగా ఉదయము రాత్రి భోజనము తరువాత సేవించిన స్రంసనక్రియ ద్వారా మలబద్ధత పోయి అర్శోవికారము ఉపశమించును.

5. కాస, శ్వాసలందు శ్వాసానందవటితో ద్రాక్షారిష్ట రెండు చెంచాలు ఇచ్చిన, కఫము బయటకు వెడలి ఉపశమనము కలుగును.

6. మానసిక దౌర్బల్యము కలవారికి బ్రాహ్మివటితో ఇచ్చిన ఫలితము నిచ్చును.

పథ్యము : ఎక్కువగా పప్పు పదార్థములు, మాంసపదార్థములు వాడవలెను. వేడిగా నుండు పదార్థములు తీసుకొనవలెను.

అపథ్యము : చల్లని పదార్థములు, చల్లని ప్రదేశములనుండి దూరముగా నుండ వలెను. నూనె ఎక్కువగా ఉన్న పదార్థములను వాడరాదు. కఫ రోగములు అనగా శ్వాస, కాస, తమకశ్వాసలయందు తేలికగా జీర్ణమగు ఆహారమును తీసుకొనవలెను. మిత భోజనము మిక్కిలి శ్రేయస్కరము.

మోతాదు : 15–30 మి.లీ. రోజుకు రెండు లేదా మూడుసార్లు.

లభ్యము : 200 మి.లీ. 450 మి.లీ.

**దురాలాభారిష్టము (అ. హృ)**

450 ఎం.ఎల్ – దురాలబ, దన్తి, చిరుబొద్ది, ఉసిరిక, నాగరా

25 ఎం.ఎల్. రెండుసార్లు – మొలలు, రక్తహీనత, విషప్రయోగము, జ్వరం, చర్మరోగములు, స్ప్రీనోమెగాలే, కడుపులో పురుగులను నశింప చేయును.

**జీరకాద్యరిష్టము (భై.ర.)**

దీనిని 1/4 మొదలు 1/2 ఔన్సు వరకు రెట్టింపు నీటిలో కలిపి యిచ్చిన యెడల సూతికా వ్యాధులు, గ్రహణీరోగము, అతిసారము, అరుచి, అగ్నిమాంద్యము పైత్య వ్యాధులు మొదలగునవి వెంటనే హరించును.

450 ఎం.ఎల్. జీలకర్ర, శొంఠి, జాతీఫలం, తుంగముస్తలు యవానిక, కాకోళి, దేవపుష్ప

25 ఎం.ఎల్ రెండుసార్లు – స్త్రీలకు ప్రసవానంతరము మంచి ఔషధం, అతిసార రోగములను హరించి, అగ్ని దీపనము కలిగించును.

**కుటజారిష్ట (భై.ర.)**

ద్రవ్యములు : కొడిశపాలవేరు, ద్రాక్ష, ఇప్పపువ్వు, పెగ్గుమ్మడు, ఆరెపువ్వు

గుణము : సర్వవిధములైన జ్వరములను నశింపజేయును. అగ్నిని పెంపొం దించును. ఇతర ఔషధములకు అసాధ్యమైన గ్రహణీరోగమును మరియు భయంకర మైన రక్తాతిసారమును కూడా నశింపజేయును.

దీనిని 1/4 మొ॥ 1/2 ఔన్సు వరకు సమానము లేక రెట్టింపు నీటిలో కలిపి సేవించినయెడల అతిసారము గ్రహణి, జిగటవిరేచనములు, రక్తముపడుట, రక్త పిత్తము, రక్తార్శస్సు,జ్వరములు, ఇవి వెంటనే హరించును. ఇది ఆకలిని పుట్టించును.

అనుభూత ప్రయోగములు :

1.గ్రహణి అతిసారములందు లోహాసవముతో కలిపి ఇవ్వవలెను.

2. రక్తాతిసారమునందు బబ్బులారిష్టతో కలిపి ఇవ్వవలెను.

3. అర్శోరోగమునందు 15 మి.లీ. కుటజారిష్టను 15 మి.లీ. అభయారిష్టతో కలిపి ఇవ్వవలెను.

4. కుటజఘనపవటి ఒకటి, చేదుకట్టు మాత్ర ఒకటి చొప్పున పగలు రాత్రి భోజనము తరువాత కుటజారిష్ట అనుపానముగా తీసుకొన్న గ్రహణి రోగము తగ్గును.

5. ఆమ్లపిత్తమునందు హింగ్వాదిచూర్ణము, గంగాధర చూర్ణము 50గ్రా. చొప్పున యష్టిమధు చూర్ణము 25 గ్రా. శంఖభస్మం 10 గ్రా. కలిపి, రెండు గ్రా. చొప్పున కుటజారిష్టతో తీసుకొనిన కడుపులోమంట, కడుపుబ్బరము వంటి ఉదర సంబంధ లక్షణములు శమించును.

పథ్యము : ఆహారములో కారము, మషాలా దినుసులు తక్కువగా వుండవలెను. తీపి పదార్థములు, పలుచని పాలు, మీగడలేని పెరుగు, మజ్జిగ, కొబ్బరినీళ్లు, తాటి కల్లు, తాటి బెల్లము వాడవచ్చును. తేలికగా జీర్ణమగు ఆహారము కాచి చల్లార్చిన నీరు సేవించవలెను.

అపథ్యము : మద్యము, పుగాకు, తాంబూలము, పులుపు, ఊరగాయలు, సాధ్య మైనంతవరకు వాడరాదు.

మోతాదు :15-30 మి.లీ. రోజుకు రెండు లేదా మూడుసార్లు భోజనానంతరం రెట్టింపు నీటితో సేవించవలెను.

లభ్యము : 200 మి.లీ. 450 మి.లీ.

## కిరాతారిష్టము

దీనిని 1/4 మొ॥ 1/2 ఔన్సువరకు సమానము లేక రెట్టింపు నీటిలో కలిపి యిచ్చిన యెడల పురాణజ్వరములు, జీర్ణజ్వరములు, చలిజ్వరములు, శ్లేష్మజ్వరములు, అజీర్ణము, ధాతుగతజ్వరము, మలబంధము, చర్మవ్యాధులు, అరుచి, అగ్నిమాంద్యము మొదలగునవి వెంటనే హరించును. ఇది రక్తశుద్ధిని చేయును.

## ఖదిరారిష్ట (భై.ర.)

ద్రవ్యములు : ముదురు చంద్రచేప, దేవదారు చెక్క, బావంచాలు,

మానుపసుపు, త్రిఫలములు, చలువ మిరియాలు, నాగకేసరములు, జాజికాయ, లవంగములు, యాలకులు, దాల్చిన చెక్క, ఆకుపత్రి, పిప్పళ్ళు.

గుణము : మహాకుష్ఠము, హృద్రోగము, పాండురోగము, అర్బుదము, గుల్మము, గ్రంధివృద్ధి, క్రిమిరోగము, కాస, ప్లీహోదరము మరియు సర్వ విధములైన కుష్ఠము లను నశింపచేయును.

దీనిని 1/4 మొ॥ 1/2 ఔన్సు వరకు సమానము లేక రెట్టింపు నీటిలో కలిపి సేవించిన యెడల సమస్తమగు కుష్ఠములు, దగ్గు, గుండెవ్యాధులు, ప్లీహ వ్యాధులు, శ్లేష్మవ్యాధులు, చర్మవ్యాధులు, రక్తదోషములు ఇవి హరించును.

అనుభూత ప్రయోగములు :

1. చర్మవ్యాధులను హరించుటలో మిక్కిలి శ్రేష్ఠమైనది. తెల్లపొడలు, చర్మము పగులుట, చర్మము బిరుసుగా అగుట మొదలగు వానియందు అమృత భల్లాతకి లేహ్యముతో 80 రోజులు సేవించవలెను.

2. శ్విత్రము (బొల్లి) నందు ఆరోగ్య వర్ధనీవటి, చంద్రప్రభావటిలకు సరస రెండు చెంచాలు, ఖదిరారిష్ట రెండు చెంచాలు కలిపి అనుపానముగా సేవించిన తెల్లమచ్చలు తగ్గును.

3. శరీరము కృష్ణత్వము (నల్లనిమచ్చలు) పొందుట వంటి చర్మ సంబంధిత వికారములలో పాలసుగంధి లేహ్యముతో వాడిన గుణము నిచ్చును.

4. ఉపదంశ వ్యాధియందు, వ్యాధిహరణ రసము 2.5 గ్రా. సుదర్శన చూర్ణము 50 గ్రా. అశ్వగంధ చూర్ణము 50 గ్రా.లను కలిపి 2 గ్రా. చొప్పున ఖదిరారిష్టతో ఇచ్చిన మంట తగ్గును.

పథ్యము : మజ్జిగ, బీరకాయ,పొట్లకాయ, పెరుగు తోటకూర, మెంతికూర.

అపథ్యము : దురద పుట్టించు పదార్ధములైన కంద, చేమదుంప, వంకాయ, గోంగూర,చేపలు, రొయ్యలు మొదలగునవి వాడరాదు. శరీరము ఎల్లప్పుడు స్నిగ్ధముగా నుంచవలెను. కారము, పులుపు కల్గిన ఆహారములను సేవించరాదు.

మోతాదు : 15-30 మి.లీ. రోజుకు రెండు లేదా మూడుసార్లు

భోజనానంత రము రెట్టింపు జలముతో సేవించవలెను.

లభ్యము : 200 మి.లీ. 450 మి.లీ.

**మూలకాద్యారిష్టం (భై.ర.)**

450 ఎం.ఎల్. ముల్లంగి, కరక్కాయ

25 ఎం.ఎల్. రెండుసార్లు – చిన్నపిల్లలకు వచ్చు చర్మరోగములు, గజ్జి, తామర, మరియు వాపులకు శ్రేష్ఠము.

**ముస్తారిష్టము (భై.ర.)**

450 ఎం.ఎల్. తుంగముస్తలు, ధాతకి, యవాని, మరీచము

25 ఎం.ఎల్ రెండుసార్లు – అజీర్ణము, నీళ్ళ విరేచనములను నివారించుటకు మంచి ఔషధం.

**మృతసంజీవని (భై.ర.)**

450 ఎం.ఎల్. దాడిమ, అర్జున, అశ్వగంధ, అడ్డసరము, హరిక్రాంత

25 ఎం.ఎల్. రెండుసార్లు – జీర్ణశక్తిని పెంచి, శారీరకశక్తిని, చర్మకాంతిని వృద్ధి పరచును. జ్వరము, అతిసారములయందు ఉపయోగ పడును.

**పంచతిక్తారిష్ట**

ద్రవ్యములు : నేలవేము, కటుకరోహిణి, తుంగముస్తలు, తిప్పతీగ, పర్పాటకము

గుణములు : విషమజ్వరహరము, రక్తశోధకము, జీర్ణశక్తిని వృద్ధి చేయును క్రిములను హరించును. చలిజ్వరములు, శీతజ్వరములు, విషమజ్వరములు, శీతపైత్య జ్వరములు, పురాణ జ్వరములు వీనిని నశింపచేయును.

అనుభూత ప్రయోగములు :

1. శారిబాదివటి, నిత్యానందవటిలతో అనుపాన ముగా ఇచ్చిన, బోదకాలు, పిత్తజ, కఫజ రక్తవికారములు శమించును.

2. పురాణ జ్వరములందు, త్రిదోష ప్రధాన జ్వరములందు, శీతాంశు రసము ఒక మాత్ర, మృత్యుంజయ రసము ఒక మాత్ర, అమృతారిష్ట, పంచతిక్తారిష్ట రెండు రెండు చెంచాలు కలిపి ఎనిమిది గంటల వ్యవధితో 5 రోజులు వాడిన ఉపశమనము పొందగలరు.

3. కండునందు తిప్పసత్తు రెండు గ్రా. చొప్పున మూడు పూటలు పంచతిక్తారిష్టతో తీసుకొనిన యెడల తగ్గును.

పథ్యము : పొన్నగంటికూర, అల్బ్రఖరాపండ్లు, నేరేడుపండ్లు, వెలగపండ్లు, అల్లము, కరివేపాకు, కొత్తిమీర, పుదీనా, మొదలగునవి సేవించిన శీరరమునందలి మలినములు, విషపదార్ధములు బయటకు వెడలును. తేలికగా జీర్ణమగు ఆహారము, కాచి చల్లార్చిన నీటిని సేవించవలెను.

అపథ్యము : గోధుమలు, వేరుశనగపప్పు, శనగపప్పు, అన్నిరకముల చేపలు, గోంగూర, అధికముగా పులుపు కారము, మషాలా కల్గిన పదార్ధములను సేవించ రాదు.

మోతాదు : 15–30 మి.లీ. రోజుకు రెండుసార్లు భోజనానంతరము రెట్టింపు జలముతో సేవించవలెను.

లభ్యము : 200 మి.లీ. 450 మి.లీ.

## పునర్నవారిష్ట (భై.ర.)

ద్రవ్యములు : తెల్లగలిజేరు, ఎర్రగలిజేరు, బల, అతిబల, చిరుబొద్ది, తిప్పసత్తు, చిత్రమూలము బెరడు, వాకుడు, త్రిఫలములు, నాగకేసరములు, దాల్చినచెక్క, యాలకులు, నల్లమిరియాలు, తేజోపత్రి, కురువేరు.

గుణములు : హృదయ వికారములు, పాండురోగము, శోథ, ప్లీహవృద్ధి, భ్రమ, అరుచి, ప్రమేహము, గుల్మము, భగందరము, ఉదర రోగము, కాస, శ్వాస, గ్రహణీ వికారములు, కుష్ఠము, కండు, శాఖాశ్రిత వాత ప్రకోపము, మలబంధము, ఎక్కిళ్లు, కిలాసము, హలీమకము మొదలగు వానిని హరించును. శరీరమునకు వర్ణము, బలము, ఆయుష్షు, ఓజస్సు, తేజస్సులను పెంపొందించును.

దీనిని 1/4 మొ॥ 1/2 ఔన్సు వరకు రెట్టింపు నీటితో కలిపి సేవించిన యెడల నంజు, పాండువు, అజీర్ణము, గుండెవ్యాధులు, ఉదర వ్యాధులు, గుల్మము, ప్లీహ వ్యాధులు, యకృత్ వ్యాధులు, దగ్గు, ఆయాసము, వాత వ్యాధులు, అతిసారము, జీర్ణ జ్వరము, కామిర్లు ఇవి వెంటనే నశించును.

అనుభూత ప్రయోగములు :

1. హృదయ సంబంధిత రోగములయందు బాగుగా పనిచేయును. మూత్రమును అధికముగా జారీ చేయును.

2. హృద్రోగమునందు కలిగే శోధయందు (పరిపూర్ణ) గోక్షురాది చూర్ణము, తిప్పసత్తు, అకీక పిష్టిలకు అనుపానముగా ఇచ్చిన శరీరమునందలి శోథ తగ్గి హృద్రో గము క్రమముగా నయమగును.

3. స్త్రీలలో కలిగే రక్తక్షీణతయందు పునర్నవాది మండూరమునకు అనుపాన ముగా ఇవ్వవలెను.

4. పుష్యానుగ చూర్ణము 50 గ్రా. లాక్షాచూర్ణము 25 గ్రా.కాంత భస్మం 10 గ్రా. కలిపి 2 గ్రా. చొప్పున తేనెతో ఇచ్చుచూ, పునర్నవారిష్ట కూడా వాడినచో ఋతు క్రమమువలన కలిగే రక్తహీనత తగ్గి ఋతుక్రమము సహజస్థితిలో ఉండును.

5. కామిల, పాండువుల యందు పునర్నవాది మండూరముతో ఇవ్వవలెను.

6. శోఫయందు గోక్షురాది చూర్ణముతో సేవించిన మూత్రము జారీ అగుటచే శోఫను హరించును.

7. యకృత్, ప్లీహ రోగములయందు చిత్రకాది వటితో ఇవ్వవలెను.

పథ్యము : ఆకుపచ్చని కూరలు, టొమోటో, బార్లీ జావ, సగ్గుబియ్యం జావ.

అపథ్యము : క్రొవ్వు ఎక్కువ కలిగిన పదార్థములు, ఉప్పు, కారము, మసాలా దినుసులు.

మోతాదు : 15-30 మి.లీ. రోజుకు రెండు లేదా మూడుసార్లు భోజనానంత రము రెట్టింపు జలముతో సేవించవలెను.

లభ్యము : 200 మి.లీ. 450 మి.లీ.

## సారస్వతారిష్ట (భై.ర.)

ద్రవ్యములు : సరస్వతి మొక్క సమూలము, పిల్లిపీచర వేళ్లు, పాలగుమ్మడి గడ్డలు, కరక్కాయ, వట్టివేరు, అల్లము, పెద్ద సదాప విత్తులు, రేణుకలు, తెల్ల తెగడ, పిప్పళ్లు, లవంగములు, వస, చెంగల్వకోష్టు, పెన్నేరు గడ్డ, తానికాయలు, తిప్పతీగె, యాలకులు, వాయు విడంగములు దాల్చినచెక్క.

గుణములు : ఆయువు, వీర్యము, జ్ఞాపకశక్తి, ధారణశక్తి బలము మరియు కాంతి పెంపొందింపచేయును. వాక్సుద్ధిని కలుగజేయును.

హృదయమునకు హితకారి. శ్రేష్ఠరసాయనము. బాలురు, యువకులు, వృద్ధులు, పురుషులు, స్త్రీలు అందరకు హితరకమైనది. ఓజస్సు, ధాతువులను వృద్ధిచేయును. ఎల్లప్పుడు సేవిం చిన, బొంగురు, అస్పష్ట వాక్ దోషమును నివారించి మధుర కంఠస్వరమునకు దోహదము చేయును. స్త్రీలలో రజోదోషము, పురుషులలో శుక్ర దోషమును నివారించి సంతాన ప్రాప్తిని కలిగించును. అధిక శ్రమ చేయు విద్యార్థులకు ఇది నిత్యము సేవించిన మనో వికాసమును కలిగించును.

200 ఎం.ఎల్. బ్రహ్మి, శతావరి, విదారి, వట్టివేళ్ళు, అల్లం

25 ఎం.ఎల్. రెండుసార్లు ఉన్మాదము, అపస్మారం, జ్ఞాపకశక్తిని పెంచుట మంచి ఔషధము,రసాయనము.

దీనిని 1/4 మొ॥ 1/2 ఔన్సు మోతాదుచొప్పున ఆవుపాలతో పుచ్చుకొనిన యెడల ఉన్మాదము, మూర్ఛ, అపస్మారము, జ్ఞాపకశక్తి సరిగ లేకుండుట బుద్ధి మాంద్యము మొదలగు మెదడు సంబంధమగు వ్యాధులన్నియు నశించును. మరియు నిది స్వరదోషములను, శుక్ర దోషములను, రజో దోషములను, గుండె వ్యాధులను, శుష్కించుటను, మాటలుసరిగ రాకుండుటను హరింపచేయును. బుద్ధికుశలతను, శరీరకాంతిని, వీర్యమును ధైర్యమును, ఆయువును వృద్ధిపొందించును. దీనిని సేవించు నప్పుడు పైత్యమును వేడిని చేయు వస్తువులను సేవింపరాదు.

**అనుభూత ప్రయోగములు :**

1. మనో ఉన్మాదము, మతిమరుపు, భ్రమ, ఆందోళన మొదలగు మానసిక రోగములయందు బాగుగా పనిచేయును.

2. సరియైన సమయములో మాటలు రాని పిల్లలు అశ్వగంధ చూర్ణముతో సేవించిన ఉపయోగకారి.

3. బుద్ధిమాంద్యము మాటలు సరిగా రాకపోవుట, జ్ఞాపకశక్తి లోపము వంటి మేధస్సును చెందిన వికారములన్నియు బ్రాహ్మీవటి రెండు మాత్రలతో అనుపానముగా వాడుతూ సరస్వతి లేహ్యము కూడా వాడిన సర్వవిధముల ఉపయోకరము.

4. ఒకమాదిరి మతి చాంచల్యము కలవారికి అతివస చూర్ణము 25 గ్రా. మాంసి చూర్ణము 25 గ్రా. శంఖపుష్పి సమూల చూర్ణము 30 గ్రా. కలిపి 2 గ్రా. చొప్పున సారస్వతారిష్టతో తీసుకొన్న అత్యంత గుణకారి.

పథ్యము : పాలు,పంచదార, మాదీఫలము, దానిమ్మ, ఉసిరి,

ద్రాక్షపండ్లు, నెయ్యి, మాంసము, నిద్ర, వ్యాయామము.

అపథ్యము : కోడిమాంసము, నూనె, ఆవ,వెల్లుల్లి, ధూమపానము, తాంబూలము, మద్యము.

మోతాదు : 15-30 మి.లీ. రోజుకు రెండు లేదా మూడుసార్లు భోజనానంతరం రెట్టింపు జలముతో సేవించవలెను.

లభ్యము : 200 మి.లీ. 450 మి.లీ.

## రోహీత కారిష్ట

ద్రవ్యములు : ములుమోదుగపట్ట, ఆరెపువ్వు, శొంఠి, పిప్పలి, మోడి, చిత్రమూలం, త్రిఫలం,ఏలకులు, లవంగాలు, దాల్చినచెక్క.

గుణములు : ఉదర రోగములు, ప్లీహవృద్ధి, గుల్మ, ఉదర, శూల, అష్ఠీలావృద్ధి, సంగ్రహిణి, అర్శస్సు, కామల, కుష్టము, శోధ, అరుచి మొదలగు వానిని హరించును.

దీనిని 1/4 మొ॥ 1/2 ఔన్సువరకు రెట్టింపు వీటిలో కలిపి సేవించిన యెడల సమస్తమగు ప్లీహవ్యాధులు, గుల్మము ఉదరము,అష్ఠీలా వ్యాధి, గ్రహణి, అర్శస్సు, కామిర్లు, కుష్ఠము, నంజు, అరుచి, మొదలగునవి నశించును.

అనుభూత ప్రయోగములు : 1. యకృత్ ప్లీహరోగము కలిగినచో చిత్రకాది వటితో సేవించవలెను.

2. కామలయందు అగ్నితుండివటి, చిత్రకాదివటి ఒక్కొక్కటి చొప్పున మూడు పూటల రోహితకారిష్ట అనుపానముగా వాడవలెను. దీనివలన కోష్ఠశుద్ధి జరిగి ఆకలి పుట్టును. ఓకలింతలు తగ్గును.

3. క్రిమికుఠార రసముతో ఇచ్చిన కోష్ఠమునందలి క్రిములు పోయి కడుపుబ్బ రము తగ్గి, ఆకలి పుట్టును.లాలాస్రవము అధికముగా స్రవించుట తగ్గును.

4. గ్రహణి రోగములో కలిగే యకృత్వృద్ధిలో ఆరోగ్యవర్ధనీవటి, అగ్నికుమార రసములతో అనుపానముగా ఇచ్చిన నివృత్తి కల్గును.

పథ్యము : తేలికగా జీర్ణమగునటువంటి బీరకాయ, సొరకాయ, పొట్లకాయ వంటి కాయగూరలను వాడవలెను. ఎక్కువగా మజ్జిగను తీసుకొనవలెను.

అపథ్యము : చిక్కటిపాలు, మీగడ, వెన్న, నెయ్యి, మషాలా పదార్థములు సేవించరాదు.

మోతాదు : 15-30 మి.లీ. రోజుకు రెండు లేదా మూడుసార్లు భోజనానంత రము రెట్టింపు జలముతో సేవించవలెను.

లభ్యము : 200 మి.లీ. 450 మి.లీ.

**శారిబాద్యరిష్ట (శారిబాద్యాసవ) (భై.ర.)**

ద్రవ్యములు : సుగంధిపాల, తుంగముస్తలు, లొద్దుగపట్ట, మర్రిపట్ట, పిప్పలి, కచ్చూరములు, నల్లసుగంధిపాల, పద్మకము, కురువేరు, చిరుబొద్ది, ఉసిరిక, తిప్ప సత్తు, వట్టివేరు, శ్వేత చందనం, రక్త చందనం, అజమోదము, కటుకరోహిణి, ఆకు పత్రి, పెద్దయాలకులు,చిన్నయాలకులు, చెంగల్వకోష్టు, ఉమ్మెత్త ఆకు, కరక్కాయలు, ఆరెపువ్వు, ఎండుద్రాక్ష.

గుణములు : ఇరువది విధములైన ప్రమేహములు, ప్రమేహ పిటికలు, ఉప దంశవ్రణములు, వాతరక్తము, భగందము మొదలగు వ్యాధులను నశింపజేయును.

అనుభూత ప్రయోగములు :

1. రక్తశోధకము, సర్వచర్మరోగహరము. ఫిరంగి రోగమునందు వ్యాధిహరణ రసంతో సేవించవలెను.

2. గ్రీష్మ ఋతువునందు ప్రతిరోజు భోజనమునకు గంటముందుగా నాలుగు చెంచాలు పగలు రాత్రి తీసుకొనిన గ్రీష్మతాపమునుండి రక్షణ పొందవచ్చును.

3. అనేకమైనటువంటి చర్మరోగములందు తప్పనిసరిగా శారిబాద్యరిష్ట వాడిన సత్ఫలితములనిచ్చును. ఉదా. ఎ) శ్విత్రమునందు బావంచాలు చూర్ణము, ఆరోగ్య వర్ధనీవటి, చంద్రప్రభావటిలతో అనుపానముగా వాడవచ్చును.

బి) సోరియాసిస్‌నందు ఆర్ అండ్ హెచ్ మాత్రలు, గంధక రసాయనము,పాల సుగంధి లేహ్యములతో అనుపానముగా ఇవ్వవచ్చును.

4. ముఖము మీద నల్లనిమచ్చలు, తెల్లని మచ్చలు, మొటిమలకు గంధక రసాయనము, కుంకుమపువ్వులతో పాటుగా అనుపానముగా వాడవచ్చును.

5. కీళ్ళనొప్పులు, వాపులు, జ్వరము వీనియందు వాతగజాంకుశ రసంతోగానీ, వాతవిధ్వంసిని రసతోగానీ ఉపయోగించవలెను.

6. ఆమవాతము, వాతరక్తములందు అమానుబంధజ్వరము లేనపుడు యోగ రాజగుగ్గులతో సేవించవలెను.

పథ్యము : ఆవుమజ్జిగ,ఆవునెయ్యి,బీర,పొట్లకాయలు, పెరుగు తోటకూర, మెంతి కూర, చలువ చేయు ఆహారములను మాత్రమే సేవించవలెను.

అపథ్యము : మాంసము, చేపలు, పుల్లని పెరుగు, ఉలవలు, శనగలు, పులుసు కూరలు, వంకాయ, గుమ్మడికాయ, నూనెపిండి వంటలు, ఆవాలు, వేడిచేయు పదార్థ ములు సేవించరాదు.

మోతాదు : 15-30 మి.లి. రోజుకు రెండు లేదా మూడుసార్లు భోజనాంతరం రెట్టింపు జలముతో సేవించవలెను.

లభ్యము : 200 మి.లీ. 450 మి.లీ.

## తక్రారిష్టము

దీనిని 1/4 మొ॥ 1/2 ఔన్సు వరకు సమానము లేక రెట్టింపు నీటిలో కలిపి సేవించినయెడల మూలవ్యాధి, అజీర్ణము, అగ్నిమాంద్యము, అరుచి మొదలగునవి వెంటనే నశించును. కఫవాతముల కానులోమ్యము కలుగును. జఠరదీప్తియు, శరీర కాంతియుగలుగును.

## వాసారిష్ట (ఆ.పా.ఇం.)

ద్రవ్యములు : అడ్డసరము, ఆరెపువ్వు, దాల్చినచెక్క, యాలకులు, ఆకుపత్రి, నాగకేసరములు, చలువ మిరియాలు,శొంఠి, మిరియాలు, పిప్పలి.

గుణములు : కాస,రక్తపిత్త, క్షయ,శోథలను హరించును.

దీనిని 1/4 మొ॥ 1/2 ఔన్సు మోతాదు చొప్పున సమానము లేక రెట్టింపు నీటిలో కలిపి సేవించిన యెడల దగ్గు, ఆయాసము, క్షయ, రక్తపిత్తము, శ్లేష్మ జ్వరము, జలుబు, శ్లేష్మ ప్రకోపము, మొదలగునవి వెంటనే నశించును. శ్లేష్మమును వెంటనే పలచగచేసి తగ్గించును. దీని గుణములు ప్రసిద్ధములు.

అనుభూత ప్రయోగములు : దగ్గు, ఆయాసము, ఉబ్బసము మొదలగు

కఫ సంబంధిత రోగములయందు బాగుగా పనిచేయును.

1. సాధారణ దగ్గులందు కేవలము 2-3 చెంచాల చొప్పున రోజులో నాలుగు సార్లు వాడిన ఉపశమించును.

2. కఫ ప్రధానమైకాస, శ్వాసలందు, యష్టిమధుచూర్ణము 25 గ్రా. టంకణ భస్మము 25గ్రా. ప్రవాళ భస్మము 5గ్రా. శితోఫలాది చూర్ణం 25 గ్రా. 2 గ్రా. చొప్పున వాసారిష్టతో ఇచ్చిన ఎటువంటి కాస, శ్వాసలైనను శమించును.

3. ద్రాక్షారిష్టతో వాసారిష్టను కలిపి వాడిన యెడల కఫనిస్రావము నొంది శరీరమునకు బలమునిచ్చును.

పథ్యము : గోధుమలు, మద్యము, తేనె, మేకనెయ్యి, పాతనెయ్యి, ద్రాక్షపండ్లు, పొట్ల, బీరకాయలు, వెల్లుల్లి, దొండకాయ, ఉష్ణోదకము.

అపథ్యము : గొఱ్ఱెనెయ్యి, గొఱ్ఱెపాలు, చల్లనినీరు, కంద మొ॥దుంపలు, ఆవాలు, నువ్వులనూనె, గురుత్వపదార్ధములు మలమూత్ర వేగనిరోధము, చల్లని గాలి, మంచు.

మోతాదు : 15-30 మి.లీ. రోజుకు రెండు లేదా మూడుసార్లు భోజనాంతరము రెట్టింపు నీటితో సేవించవలెను.

లభ్యము : 200 మి.లీ. 450 మి.లీ.

**పర్పటకాద్యారిష్టము (భై.ర.)**

450 ఎం.ఎల్. తిప్పతీగ, పర్పాటకం,ఆరెపువ్వు, తుంగ ముస్తలు, దేవదారు, మానుపసుపు.

25 ఎం.ఎల్ రెండుసార్లు - ఉదర సంబంధ వ్యాధులందు, రక్తహీనత, కాలే యము పెరుగుట, కామెర్లు, కడుపులో కణితులు పెరుగుట, జ్వరము, వాపులందు ఉత్తమౌషధం.

**అయస్కృతి (అ.హృ)**

450 ఎం.ఎల్ ఆసన, ఖదిర, చందనం వాయు విడంగాలు, లోహము

మధుమేహము, మొలలు, తెల్లమచ్చలు, చర్మ రోగములు, రక్తహీనత, స్థౌల్య త్వము (అధికశరీరము) లను నశింపచేయును.

## చూర్ణములు

### అగ్నిముఖ చూర్ణము

దీనిని 1. మద్యముతో పుచ్చుకొనినయెడల అజీర్ణము, కడుపుబ్బరము, ప్రేగు లరచుట, అగ్నిమాంద్యము. శూల మొదలగునవియు 2. వేడినీటితో సేవించిన యెడల శరీరపీడ, విషవ్యాధులు, మూలవ్యాధి, ఉదరము, గుల్మము మొదలగునవియు హరించును. మోతాదు 1/12 మొ॥ 1/6 తు॥ వరకు.

### ఆకారకరభాది చూర్ణము

దీనిని వెన్నతో సేవించినయెడల శుక్ల నష్టము, అతిమూత్రము, శుక్లము పలచగ నుండుట, కాళ్లులాగుట, నడుము నొప్పులు, శీఘ్రస్ఖలనము, దగ్గు, మొదలగు వ్యాధులు వెంటనే హరించును.

మోతాదు 1/12 తు ॥ మొ॥ 1/6 వరకు.

### అశ్వగంధాది చూర్ణము (ర.సి.ప్ర.సం)

ద్రవ్యములు : అశ్వగంధ, వృద్ధదారు, ఉసిరిక, పల్లేరు, తిప్పసత్తు.

గుణము : వాజీకర రసాయనము, సంవత్సరము పాటు దీనిని సేవించిన శుక్ర క్షయము, వీర్యదోషము, ప్రమేహము మొదలగు వీర్య వికారములు, తత్ జన్య ఉపద్రవములు అనగా అకాల వృద్ధాప్యము, జ్ఞాపకశక్తి నశించుట, దృష్టి మందగించుట మొదలగునవి నశించును. **(రస తంత్రసారవ సిద్ధప్రయోగ సంగ్రహ.)**

దీనిని పంచదారతోగాని వెన్నతో గాని పాలతోగాని సేవించినయెడల బలహీనత, శుక్లనష్టము, దగ్గు, క్షయ, శుక్లము పలచగనుండుట, శీఘ్రస్ఖలనము, మధుమేహము, అతిమూత్రము, శ్వేతప్రదరము, రక్తప్రదము, ఇరువది ప్రమేహములు, ఉరఃక్షతము, ఇవి వెంటనే హరించును. ఇది శరీరపుష్టిని బలమును కలిగించును. మోతాదు 1/12 తు ॥ మొ॥ 1/6 తు॥ వరకు.

అనుభూత ప్రయోగములు : బల్యము, రక్త వృద్ధికరము, రక్త శుద్ధికరము, బృంహణము, కృశత్వము, మూలవ్యాధిని, ఫిరంగి రోగమును హరించును. వంధ్యా దోషమును పోగొట్టును.

1. వాజీకర రసాయనముగా వాడవలెనన్న దూలగొండి విత్తుల

చూర్ణముతో పటికబెల్లము అధికముగా కలిపి చిక్కని పాలతో తీసుకొనిన అధిక ప్రయోజనము కనబడును.

2. ధాతువర్ధిని, శతావరీ చూర్ణములతో కలిపి వాడిన శుక్ర క్షయము నశిం చును. (శుక్రవృద్ధి కరము)

3. జ్ఞాపకశక్తి నశించుట, నిద్రలేమి యందు బ్రాహ్మీవటి తీసుకొనుచూ అశ్వ గంధ చూర్ణము పాలతో తీసుకొనిన నిద్రబాగుగా పట్టుట, జ్ఞాపకశక్తి పెరుగుట జరుగును.

4. ఆమవాతమునందు చికిత్సతో పాటు అశ్వగంధ చూర్ణమును సేవించిన మిక్కిలి గుణకారి.

5. రక్త చాపమునందు అశ్వగంధ మిక్కిలి గుణకారి.

6. నాడీ వ్యవస్థకు చెందిన వ్యాధులందు, వాత వ్యాధులయందు అశ్వగంధ మిక్కిలి ఉపయోగకారి.

7. నాడీ మండలమును ఉత్తేజ పరచును.

పథ్యము : పాలు, పెరుగు, వెన్న, పప్పు

అపథ్యము : తాంబూలము, మద్యము, కర్బూజా పండు, పనసపండు, చల్లని నీరు, చలి అన్నము.

అనుపానము : నెయ్యి, తేనెలతో మిశ్రితము చేసి సేవించవలెను. అనంతరము ఆవుపాలను సేవించవలెను.

మోతాదు : 6-12 గ్రా.

లభ్యము : 40 గ్రా.

**అవిపత్తికర చూర్ణం (వై.చి.)**

ద్రవ్యములు : శొంఠి, పిప్పళ్లు, మిరియాలు, కరక్కాయ, తానికాయ, ఉసిరిక, తుంగముస్తలు, వాయువిడంగాలు, యాలకులు, ఆకుపత్రి, లవంగములు, తెగడ,చక్కెర.

గుణము : ఆమ్లపిత్తము, శూల, దుర్నామము, వింశతి మేహములు, మూత్రా ఘాతము, అశ్మరి నివర్తించును.

దీనిని వేడినీటితో సేవించిన యెడల మలబంధము, అజీర్ణము, కడుపుబ్బరము, కడుపునొప్పి, అగ్నిమాంద్యము, అరుచి, ఆమ్లపిత్తము, మూత్ర బంధము, అగ్నిమాంద్య మువలన కలిగిన వ్యాధులు, శూల,

ప్రమేహములు, మొదలగునవి వెంటనే మోతాదు 1/8 తు॥ మొ॥ 1/4 తు. వరకు.

అనుభూత ప్రయోగములు : దీపనము, ఛేదనము, భేదనము, మృదు విరేచనము చేయును.

1. యష్టిమధు చూర్ణము, శూలకల్పము, కామదుఘా రసములతో వాడిన ఆమ్లపిత్తము శాంతించును.

2. గోక్షురాది చూర్ణము, చంద్రప్రభావటి, చ్యవనప్రాశ లేహ్యములతో ఇచ్చుచున్న మూత్రాఘాతము నశించును.

3. గోక్షురాది గుగ్గులు, రాస్నా కషాయముతో ఇచ్చుచూ భోజనానంతరము అవిపత్తికర చూర్ణం, మజ్జిగలతో ఇచ్చిన మూత్రాశ్మరి నశించును.

పథ్యము : గోధుమలు, ఉలవలు, యవలు (బార్లీ), పెసలు, మజ్జిగ, అల్లము, చక్కెర, పల్లేరుకూర, ఖర్జూరము, టెంకాయ, తాటిముంజెలు, తేలికగా జీర్ణమగు ఆహారము.

అపథ్యము : చేపలు, ఇంగువ, నూనెపిండివంటలు, నువ్వులు, ఆవాలు, వెల్లుల్లి తీసుకొనరాదు.

అనుపానము : చల్లనినీరు లేదా కొబ్బరి నీరు

మోతాదు : 4-8 గ్రా. భోజనానికి ముందు చల్లని నీటితో

లభ్యము : 50 గ్రా.

## భాస్కర లవణము (శా.సం)

ద్రవ్యములు : సముద్రలవణము, సౌవర్చలవణము, నవాసాగరము, సైంధవ లవణము, ధనియాలు, పిప్పళ్లు, మోడి,నల్లజీలకర్ర, ఆకుపత్రి, నాగకేసరాలు, తాళిస పత్రి,ఆమ్లవేతనము, మిరియాలు, తెల్ల జీలకర్ర, శొంఠి, దానిమ్మ బెరడు, దాల్చిన చెక్క, చిన్న యాలకులు.

గుణము : దీపనము, పాచనము, అపానవాయువు మరియు మలములను అనులోమము చేయును. మందాగ్ని, వాయువు, కఫములవలన జనించెడు ఉదర శూలను శమింప చేయును.

అనుభూత ప్రయోగములు : జీర్ణశక్తిని పెంపొందించును. అజీర్ణమును పోగొట్టును. అగ్నిదీప్తిని కలిగించును. మందాగ్ని ఆమ్ల దోషమును

పోగొట్టును.

1. మజ్జిగతో ఇచ్చిన దీపన,పాచనకారిగా పనిచేయును.

2. ఉదరశూలయందు వాత విధ్వంసినీరసతో ఇచ్చిన తగ్గును.

3. మలబద్ధకమునందు అవిపత్తికర చూర్ణము, త్రిఫల చూర్ణములతో కలిపి ఇచ్చిన వాతానులోమము జరిగి మలబద్ధత సడలును.

పథ్యము : గోధుమలు, బార్లీ, ఉలవలు, పెసలు, మజ్జిగ, అల్లము,చక్కెర,పల్లేరు, కూర, ఖర్జూరము, టెంకాయ, తేలికగా జీర్ణమగు ఆహారము.

అపథ్యము : చేపలు, నూనెపిండివంటలు, నువ్వులు, ఆవాలు, దుంపకూరలు, వెల్లుల్లి, వెన్న, మాంసము, పప్పు పదార్థములు మొదలగునవి తాత్కాలికముగా నివా రించవలెను.

అనుపానము : నీరు లేదా మజ్జిగ

మోతాదు : 2-4 గ్రా. ఉదయము, సాయంత్రము భోజనానికి ముందు లేదా వెనువెంటనే సేవించవలెను.

లభ్యము : 45 గ్రా.

## భాస్కరలవణ చూర్ణము

దీనిని వేడినీటితోగాని, తేనెతోగాని పుల్లని మజ్జిగతేటతోగాని సేవించిన యెడల అజీర్ణము, పుల్లని త్రేనుపులు, కడుపుబ్బరము, కడుపునొప్పి, ఆమ్లపిత్తము, అగ్ని మాంద్యము, గుల్మములు, ఉదరములు, శూలలు, అరుచి, గ్రహణి వ్యాధులు, గుండె వ్యాధులు, క్రిమి వ్యాధులు, ప్లీహ వ్యాధులు, యకృద్వ్యాధులు, ఇవి వెంటనే నశిం చును. వేడిని చేయకుండ అజీర్ణములను హరింపజేయుటలో కడు శ్రేష్ఠమైనది.

మోతాదు 1/12 తు ॥ మొ॥ 1/6 వరకు.

## భావన జీలకర్ర

దీనిని సుమారు పావుతులము చొప్పున నోటిలో నుంచుకొని చప్పరించిన యెడల సమస్తమగు పైత్య వ్యాధులు, అజీర్ణము, అగ్నిమాంద్యము, తలతిరుగుట, నోట నీరూరుట, అరుచి, గ్రహణి, పైత్య దద్దుర్లు, దురద, వాంతి, మలబంధము, వికారముగ నుండుట, ఎక్కిళు మొదలగునవి వెంటనే హరించును.

## భావన శొంఠి

దీనిని సుమారు పావుతులము చొప్పున నోటిలోనుంచుకొని చప్పలించిన యెడల అజీర్ణము, కడుపుబ్బరము, త్రేనుపులు, కడుపునొప్పి, అరుచి, సమస్తమగు పైత్య వ్యాధులు, ప్రేగులరచుట మలబంధము, అతిసారము, తలతిరుగుట, నోట నీరూరుట, మొదలగునవి వెంటనే హరించును.

## భావన కరక్కాయ

దీనిని 1/2 మొ॥ 3/4 తు. వరకు నోటిలో నుంచుకొని చప్పలించుచు రసమును మ్రింగినయెడల అజీర్ణకము, మలబంధము, అరుచి, నోటనీరూరుట, సమస్తమగు పైత్య వ్యాధులు, దగ్గు, ఆయాసము, సమస్తమగు శ్లేష్మ వ్యాధులు, అగ్నిమాంద్యము, గుల్మము, గుండెలలోమంట, వికారముగ నుండుట, నోరు అసహ్యముగ నుండుట, తలతిరుగుట మొదలగు వ్యాధులు నశించును.

## చందనాది చూర్ణము

దీనిని పంచదారతోగాని తేనెతోగాని బియ్యపు కడుగుతోగాని సేవించిన యెడల సమస్త ప్రదరములు, రక్తాతిసారము, యోని దోషములు, శుక్లనష్టము, ప్రమేహములు, కాళ్ళు, చేతులు మంటలు, సెగ వ్యాధులు, నోటిపూత, రక్తపిత్తము పొడిదగ్గు, రక్తార్శస్సు ఇవి వెంటనే హరించును. మోతాదు 1/12 తు. మొ॥ 1/6 తు. వరకు.

## చాతుర్జాత చూర్ణము

దీనిని 1. పంచదారతో ఉపయోగించిన యెడల మేహవ్యాధులు, ఉడుకు వ్యాధులు, నోటిపూత, శుక్లనష్టము, సెగ వ్యాధులు, ప్రదర వ్యాధులు, మూత్రకృచ్ఛ్రము సవామేహము వల్ల జీర్ణించిన వ్యాధులు అరుచి, దగ్గు, శ్వాస మొదలగునవి నశించును. మోతాదు 1/12 మొ. 1/6 తు. వరకు.

## దాడిమాష్టక చూర్ణము (శా.సం)

ద్రవ్యములు : దానిమ్మ బెరడు, చక్కెర, లవంగపు పట్ట, యాలకులు, లవంగపత్రం, శొంఠి, పిప్పళ్లు, మిరియాలు.

గుణము : అరుచి, అగ్నిమాంద్యము హరించును. కంఠమునకు హితకరము. అతిసారము, కాస, జ్వరములను నివర్తింపజేయును.

దీనిని నేతితోగాని పంచదారతో గాని సేవించిన యెడల జిగట (బంక) విరేచ నములు, రక్తవిరేచనములు, గ్రహణివిరేచనములు, అజీర్ణ విరేచనములు, అరుచి, రక్తాతిసారము, రక్తార్శస్సు మొదలగు వానిని వెంటనే నశింప జేయును.

మోతాదు 1/12 తు. మొ॥ 1/6 వరకు.

అనుభూత ప్రయోగములు : గ్రహణి, క్షయ, గుల్మము, అర్శస్సు, పీనస రోగము లందు ఉపయోగకారి.

1. యకృత్, ప్లీహ వృద్ధులందు నేలవేము చూర్ణముతో ఇచ్చుచూ పంచామృత పర్పటి వాడవచ్చును.

2. రోహిత కారిష్ట, కుటజారిష్ట అనుపానములతో ఇచ్చిన అరుచి అగ్నిమాంద్యము, అతిసారము తగ్గును.

3. తాళిసపత్రి, పటిక బెల్లము, అతిమధురము, జటామాంసిలను కలిపి దాడిమాష్టక చూర్ణముతో ఉపయోగించిన కంఠమునకు హితకరము.

4. అతిసారము యందు, కుటజారిష్ట, కుటజఘనవటి, దాడిమాష్టక చూర్ణము సేవించిన మిక్కిలి గుణకారి.

పథ్యము : తీపి పదార్థములు, పలుచని పాలు, మీగడలేని పెరుగు, మజ్జిగ, కొబ్బరినీళ్లు, తాటిబెల్లము, తేలికగా జీర్ణమగు ఆహారము,కాచి చల్లార్చిన నీరు వీనిని సేవించవలెను.

అపథ్యము : మద్యము, పుగాకు, తాంబూలము, పులుపు, ఊరగాయలు, దుంపకూరలు, కారము, మాంసము పూర్తిగా నిషేధించవలెను.

మోతాదు : 1-3 గ్రా. చొప్పున రోజుకు రెండు లేదా మూడుసార్లు ఖాళీ కడుపున సేవించవలెను.

లభ్యము : 45 గ్రా.

**ఏలాది చూర్ణము (గ.ని.)**

ద్రవ్యములు : యాలకులు, లవంగపట్ట, ఆకుపత్రి, నాగకేసరములు, మిరియాలు, పిప్పళ్లు, శొంఠి, పంచదార

గుణము : దీపనము, పాచనము, కఫహరము, స్రోతశ్శోదనము, కాస శ్వాస హరము, రక్తపిత్తహరము, గళరోగహరము, అజీర్ణము,

అగ్నిమాంద్యము, కాస, శ్వాసలు, హృద్రోగములందు విశేష గుణకారి.

దీనిని వెన్నతో సేవించిన యెడల శరీరతాపము, దప్పిక, ఉడుకువ్యాధులు, క్షయ, దగ్గు, శరీరము వెచ్చగనుండుట, అతిమూత్రము, అరుచి, వాంతి, శుక్లనష్టము, మూత్రదోషములు ఇవి వెంటనే హరించును. మోతాదు 2 చి॥ మొ॥ 4 చి॥ వరకు.

అనుభూత ప్రయోగములు :

1. స్రోతశ్శోధనమునకై కనకాసవము, దశమూలారిష్టలతో ఇచ్చిన ఉపయోగకరముగా ఉండును.

2. దీపనమునకై పిప్పలీ చూర్ణము, భాస్కర లవణములతో కలిపి, మజ్జిగను అనుపానముగా ఇచ్చిన జఠరము దీప్తి నొందును.

3. స్వరభేదము, ముఖ పాకములందు నల్లతుమ్మ, త్రిఫల కషాయములతో కబళము గావించి ఈ చూర్ణమును లోనికి ఇచ్చిన, స్వరము మామూలు స్థాయికి వచ్చును. ముఖ పాకము నుండి విముక్తి కల్గును.

పథ్యము : తేలికగా జీర్ణమగు ఆహారమును భుజించవలెను.

అపథ్యము : పెరుగు, దుంపకూరలు, నెయ్యి, పప్పు దినుసులు, చలిగాలిలో తిరుగుట.

మోతాదు : 1-3 గ్రా. రోజుకు 3సార్లు తేనెతో గానీ,నీటితో గానీ భోజనమునకు అరగంట ముందు లేదా వెనుక ఇవ్వవలెను.

లభ్యము : 45 గ్రాములు.

## గంగాధర చూర్ణము

దీనిని తేనె, బియ్యపు కడుగు వీనితో నిచ్చిన యెడల బంక విరేచనములు, అతిసారము, రక్తాతిసారము, గ్రహణీ విరేచనములు, అతిమూత్రము, సమస్తమగు ప్రదరములు, శుక్లనష్టము. ఇరువది ప్రమేహములు, రక్తపిత్తము, రక్తార్శస్సు ఇవి వెంటనే హరించును.

మోతాదు 1/12 తు॥ మొ॥ 1/6 తు. వరకు.

## గోక్షురాది చూర్ణం

ద్రవ్యములు : పల్లేరు కాయలు

గుణము : అశ్మరీ రోగహరము, శోథ, మూత్రాఘాతము, మూత్రకృచ్ఛ్రములను హరింపజేయును.

దీనిని 1. పంచదారతో సేవించిన యెడల సెగవ్యాధులు, మూత్రనాళమునందు మంట, మూత్రకృచ్ఛ్రము, మూత్రాఘాతము, చురుకు పోటు మొదలగు మూత్ర వ్యాధులు వెంటనే నశించును. మోతాదు 1/12 మొ॥ 1/6 తు. వరకు.

అనుభూత ప్రయోగములు :

1.మూత్రబంధము, మూత్ర దోషములు, గుల్మ ములు, శోఫ, ఉదరములు నశించును.

2. అతిమూత్రము, ప్రమేహములందు త్రివంగ భస్మము, అభ్రక భస్మములను తేనెతో వాడుచూ భోజనానంతరము అమలకీ స్వరసమును తారకేశ్వర రసతో ఇచ్చిన ఎక్కువసార్లు మూత్ర విసర్జన చేయుట తగ్గును.

3. మూత్రకృచ్ఛ్రము, మూత్రాఘాతములందు రాస్నాది చూర్ణము, గోక్షురాది గుగ్గులు, సుదర్శన చూర్ణములను వాడుచూ, భోజనానంతరము చందనాదివటితో పునర్నవారిష్ట సేవించిన మూత్రము సాఫీగా పోవును.

4. అశ్మరినందు చంద్రప్రభావటి, మహాయోగరాజు గుగ్గులతో ఇచ్చుచూ, పునర్నవారిష్ట, చందనాసవలను అనుపానముగా ఇచ్చిన మూత్రములో రాళ్లు నశిం చును.

పథ్యము : పాతమంచి బియ్యము, ఎర్రబియ్యము, యవలు, గోధుమలు, ఉల వలు,పెసలు, పెసరకట్టు, ఉలవకట్టు, అల్లము, ఆవుపాలు, ఆవునెయ్యి, ఆవుమజ్జిగ.

అపథ్యము : చలి అన్నము, బిరుసైన అన్నము, తాంబూలము, చేపలు, నూనె, నూనె పిండివంటలు, పులుసు, ఇంగువ, నువ్వులు, మలబద్ధకర పదార్థములు, కోడి మాంసము, చేపలు, మూత్రవేగ నిరోధము.

అనుపానము : తేనెతో సేవించి మేకపాలు అనుపానము చేయవలెను.

మోతాదు : 4 గ్రా. ఉదయము, సాయంత్రము సేవించవలెను.

లభ్యము : 40 గ్రా.

## హింగ్వాష్టక చూర్ణము

ద్రవ్యములు : ఇంగువ, శొంఠి, పిప్పళ్లు, మిరియాలు, వాము,సైంధవ లవణము, జీలకర్ర, నల్లజీలకర్ర.

గుణము : అజీర్ణము, అపచనము, మందాగ్ని, విశూచిక, అతిసారము,

వాత సంగ్రహణి, వాతగుల్మము, వాతశూల, కడుపుబ్బరము నశింపచేయును. కఫజ, వాతజ వికారములందు గుణకారి. పిత్తప్రకృతిగల వారికి ఈ ఔషధము నిషేధము

దీనిని నేతితో ప్రథమకబలమునందు పుచ్చుకొనినయెడల అగ్నిదీప్తి కలుగును. వాతవ్యాధులు హరించును. తేనెతోగాని వేడినీటితోగాని సేవించిన యెడల సమస్తా జీర్ణములు, కడుపుబ్బరము, ప్రేగులరచుట, కడుపునొప్పి, శూల, పరిణామశూల, అజీర్ణ విరేచనములు, అగ్నిమాంద్యము, అరుచి, త్రేనుపులువచ్చుట, ఋతుబంధము, ఋతుశూల, ఇవి నివారించును. కడుపుబ్బరము ప్రేగులరచుట మొదలగు లక్షణములు కల వాతాజీర్ణ సంబంధమగు వ్యాధుల నన్నిటిని నశింపజేయుటలో మిక్కిలి శ్రేష్టమైనది. మోతాదు 1/12 తు. మొ॥ 1/6 తు. వరకు.

అనుభూత ప్రయోగములు : 1. విశూచిక యందు కర్పూరరస, దాడిమాష్టక చూర్ణములతో ఇచ్చుచూ, ఉశీరాసవ ఇచ్చిన విశూచిక యొక్క వేగము క్రమముగా తగ్గును.

2. అతిసారమునందు కుటజఘనవటి, కుటజారిష్టలతో ఇచ్చిన అతిసారము తగ్గును.

3. అజీర్ణమునందు అగ్ని తుండివటి, చిత్రకాదివటిలతో ఇచ్చిన జఠరాగ్ని దీప్తి నొందును.

పథ్యము : అల్లము, తేనె, అరటి పిందెలు, మజ్జిగ, ఆవునెయ్యి, వెలగపండు, దానిమ్మపండు, తేలికగా జీర్ణమగు ఆహారమును మాత్రమే తీసుకొనవలెను.

అపథ్యము : కొవ్వు, మాంసమిశ్రితాన్నము, మిక్కిలి కారము, ఉప్పు, పులుపు గల పదార్థములు, అజీర్ణము చేయు పప్పు దినుసులు, మాంసము, వేడిచేయు పదార్థ ములు, దుంపకూరలు పనికిరావు.

మోతాదు : 2-4 గ్రా. ఉదయము, భోజన సమయమున నేతితో సాయంత్రము సేవించవలెను. ఆమవిరేచనములందు మజ్జిగతోనూ, గుల్మములందు, ఉదర వ్యాధుల యందు వేడినీటితో సేవించవలెను.

లభ్యము : 50 గ్రా.

## జాతీఫలాది చూర్ణము

దీనిని తేనెతోగాని పంచదారతోగాని సేవించిన యెడల జిగట విరేచనములు, రక్తవిరేచనములు, గ్రహణి, దగ్గు, శ్వేతరక్త ప్రదరములు, నోటిపూత, అర్శస్సు, వాంతి, అరుచి, ఇవి వెంటనే నశించును. మోతాదు 1/12 తు. మొ॥ 1/6 తు. వరకు.

## కర్పూరాది చూర్ణము (భై.ర.)

ద్రవ్యములు : కర్పూరము, దాల్చినచెక్క, చలువ మిరియాలు, జాజికాయలు, జాపత్రి, లవంగములు, జటామాంసి, శొంఠి, పిప్పళ్ళు, మిరియాలు, పంచదార.

గుణము : హృదయమునకు హితకరము, హస్తపాదాది దాహము, క్షయ, స్వర భంగము, పీనసము, శ్వాస, వమనము మరియు గళ రోగములను నశింప చేయును.

అనుభూత ప్రయోగములు :

1. సూత శేఖరసము 5 గ్రా. అభ్రక భస్మము 2 1/2 గ్రా. శృంగభస్మము 5 గ్రా.లను కర్పూరాది చూర్ణముతో కలిపి (50గ్రా.) తేనె అనుపానముగా ఇచ్చిన, పీనసము, శ్వాస, కాసలను హరించును.

2. జటామాంసి చూర్ణము, అశ్వగంధ, సర్పగంధ (తక్కువ మోతాదు) లను ఈ చూర్ణముతో కలిపి వాడిన, హృదయమునకు హితకరముగా ఉండును.

3. క్షయ నందు రజత భస్మము 2 గ్రా. అభ్రకభస్మము 2 1/2 గ్రా. ముత్య భస్మము 2 1/2 గ్రా. తిప్పసత్తు 20 గ్రా.లను 50 గ్రా. కర్పూరాది చూర్ణముతో కలిపి, చ్యవనప్రాశ లేహ్యముతో 40 రోజులు వాడిన క్షయ తగ్గును.

పథ్యము : తేలికగా జీర్ణమగు ఆహారమును భుజించవలెను.

అపథ్యము : పెరుగు, దుంపకూరలు, నెయ్యి, పప్పు పదార్థములు, నూనె పదార్థములు, చేపలు, రొయ్యలు, మాంసము.

మోతాదు : 1-3 గ్రా. రోజుకు రెండు లేదా మూడుసార్లు భోజనమునకు ముందు లేదా వెనుక ఇవ్వవలెను.

లభ్యము : 45 గ్రా.

## లాక్షాది చూర్ణము (అ. హృ)

ద్రవ్యములు : లక్క, దంతీమూలము, అతిమధురము, తానికాయ, కరక్కాయ, ఉసిరిక, చిత్రమూలము, పాఠ, వాయు విడంగములు, ఉత్తరేణి, శొంఠి, పిప్పళ్లు, మిరియాలు, పసుపు, ఏడాకుల పొన్నపట్ట, అడ్డసరము, మంజిష్ట, దేవదారు పొట్టు, దశమూలములు.

గుణము : కుష్ఠహరము

అనుభూత ప్రయోగములు : రక్తస్తంభనము, గ్రాహి, శీతవీర్యము, రక్తపిత్త శమనము, రక్త విరేచనములు, ప్రదరోగములను శమింపజేయును.

1. ఫిరంగి చెక్క చూర్ణము, లొద్దుగ చెక్క చూర్ణము, జటామాంసి చూర్ణము, అతి మధురము, టంకణ భస్మములను సమపాళ్లలో కలిపి 1 గ్రా. తేనెతో తీసుకొనిన, కండూహరము కాగలదు.

2. గంధక రసాయనము, ఖదిరారిష్ట, సరసలతో ఉపయోగించిన అనేక కుష్ఠ రోగములను నశింపజేయును.

3. రక్తపిత్తమునందు శీతలోపచారములు చేయుచూ, పర్పాటకము, ఉశీరము, పంచదారలను లాక్షాది చూర్ణముతో కలిపి ఉశీరాసవ అనుపానముగా ఇచ్చిన రక్త స్రావము క్రమముగా తగ్గును.

పథ్యము : కందులు, పెసలు, పొట్లకాయ, పొట్టికాకరకాయ, లేత గలిజేరు కూర, చిర్రికూర, ఆవు మజ్జిగ.

అపథ్యము : కొత్తబియ్యపు అన్నము, చలి అన్నము, కారము, శనగపప్పు.

అనుపానము : గోమూత్రము

మోతాదు : 1-3 గ్రా. రోజుకు రెండు లేదా మూడుసార్లు భోజనమునకు అరగంట ముందు లేదా వెనుక సేవించవలెను.

లభ్యము : 40 గ్రా.

## మహాద్రాక్షాది చూర్ణం (బ.రా.)

ద్రవ్యములు : ద్రాక్షపండ్లు, దానిమ్మపండు, ఖర్జూరము, చాతుర్జాతకములు, త్రికటుకములు, అడవిబర్రెపాలు, కొబ్బరి, శ్రీగంధము, అతిమధురము, ఉసిరిక, సారపప్పు, కురువేరు, వట్టివేళ్లు, జాపత్రి, పల్లేరు, నేలగుమ్మడి, అరటిగడ్డ, దూలగొండి విత్తులు, జాజికాయ, తక్కోలపుచెట్లు,

చెంగల్వకోష్టు, నువ్వులు, మినుములు, వెదురు బియ్యము, యవలు, లొద్దుగపువ్వు తుంగముస్తలు, జిబిలిక వేళ్లు, జనపవిత్తులు, నల్ల జీలకర్ర, జీలకర్ర, వాము, మెంతులు, తాళిసపత్రి, సైంధవలవణము, కొత్తిమీర, గంటుభారంగి, కర్కాటక శృంగి, గుంటగలగర, గలిజేరు వేళ్లు, జీడి పలుకులు, మామిడి పలుకులు, అభ్రక సింధూరం, పంచదార.

గుణము : క్షయము, రక్తపిత్తము, పాదదాహము, అసృగ్దరము, ప్రమేహము, సోమ రోగము, మూత్రశర్కర, మూత్రాఘాతము, మూత్రకృచ్ఛ్రము, వాతకుండలి, అత్యుగ్రమైన వాంతి, అరుచి, శ్వాసకాసలు, జ్వరము, భ్రమ,పీనస, పడిశము, ప్లీహము ఉదరరోగము, ఆమ్లపిత్తము, అంగదాహము, రసాది ధాతు నాశనము,ముదిమి, సర్వార్శస్సులు, పాండువు, కామిల, రొమ్ము నొప్పి, తలనొప్పి, కడుదారుణమైన కడుపుబ్బరము, దురద, శీతపిత్తము, మలమూత్రబద్ధము వీనిని హరింపజేయును.

పురుషులకు వీర్యవృద్ధిని కలుగజేయును. స్త్రీలలో గర్భస్రావమును, మృతగర్భ మును నివారించి సత్సంతానమును కలుగజేయును.

దీనిని పంచదారతో సేవించిన యెడల దగ్గు,ఆయాసము, క్షయ, ప్రమేహము, శ్వేతరక్త ప్రదరములు, శుక్లనష్టము, నోటిపూత, పైత్య వ్యాధులు, తాపము, దప్పిక, రక్తపిత్తము, అరోచకము, ఛర్ది, మెదడు వ్యాధులు, యోనిదోషములు, వంధ్యాదోషము, రక్తార్శస్సు మొదలగు వ్యాధులు వెంటనే హరించును. ఇందు అభ్రకము కలియును. మోతాదు 1/16 తు. మొ. 1/8 తు. వరకు.

అనుభూత ప్రయోగములు : రసాయనము, వాజీకరణము, దీపనము, బల్యము, శోషహరము.

1. పాదదాహమునందు తేనెతో ఇచ్చుచూ, అశ్వగంధ, శతావరీ చూర్ణములను కలిపి 2 గ్రా. చొప్పున ఉదయము, సాయంత్రము తీసుకొనిన తగ్గును.

2. రక్తపిత్తమునందు ఉశీరాసవ, అమృతారిష్టలతో వాడుచూ, తిప్పసత్తు ఉద యము, రాత్రి 2 గ్రా. చొప్పున ఇచ్చిన రక్తస్రావము క్రమముగా తగ్గును.

3. క్షయయందు ముత్యభస్మము, రాజమృగాంకరసలతో ఇచ్చిన

వ్యాధినిరోధక శక్తి పెరిగి, క్షయ తగ్గును.

పథ్యము : ఆవుమజ్జిగ, మేకపాలు, మేకమాంసము, ఉష్ణోదకము, తేనె, వాకుడు కాయ, నీరుల్లి, దొండపండ్లు.

అపథ్యము : ఆవుపాలు,గేదెపాలు,కర్బూజాపండు, శీతల, శ్లేష్మకర ఫలములు.

అనుపానము : ఆవునెయ్యి లేదా ఆవుపాలు

మోతాదు : 1-3 గ్రా. రోజుకు రెండు లేదా మూడుసార్లు భోజనమునకు ఒక గంట ముందు లేదా వెనుక ఇవ్వవలెను.

లభ్యము : 50 గ్రా.

## ఫిరంగాది చూర్ణము

దీనిని పంచదారతోగాని వేడినీటితోగాని సేవించిన యెడల సవాయి వ్యాధులు, అవి జీర్ణించుటచే కలిగిన వ్యాధులు, కుష్ఠములు, చర్మవ్యాధులు, రక్త దోషములు, వాత వ్యాధులు ఇవి వెంటనే నశించును.

మోతాదు 1/12 తు. మొ. 1/6 తు.వరకు.

## పుష్యానుగ చూర్ణము (ర.ర.స)

ద్రవ్యములు : చిరుబొద్ది, నేరేడు విత్తులు, మామిడి జీడి, పాషాణభేది, రసాంజ నము, బూరుగ బంక, మంజిష్ట, కొడిశపాలపట్ట, కుంకుమపువ్వు, మారేడు పిందెలు, అతివస, లొద్దుగ పట్ట, గైరికము, తుంగముస్తలు, శొంఠి, అతిమధురము, ద్రాక్ష, రక్తచందనము, కాయఫల చెక్క, పెద్దమానుచెక్క, కొడిశపాల విత్తులు, సుగంధపాల, ఆరెపువ్వు, అతిమధురము, సౌవీరాంజనము.

గుణము : రక్తార్మస్సు, రక్తాతిసారము, దోషజములు, అగంతుజములునగు బాల రోగములు, యోనిరోగములు, ఆర్తవదోషములను హరించును.

దీనిని బియ్యపుకడుగుతో గాని తేనెతో గాని పంచదారతో గాని సేవించిన యెడల సమస్తమగు ప్రదర వ్యాధులు, యోని దోషములు, రక్తాతిసారము, బంక విరేచనములు, శుక్లనష్టము, రక్తపిత్తము,గర్భస్రావములు, అతిమూత్రము, రక్తార్శస్సు, ఇవి వెంటనే హరించును.

మోతాదు 1/12 తు. మొ॥ 1/6 తు. వరకు.

అనుభూత ప్రయోగములు : స్రోతశ్శోధనము, రజఃశుద్ధికరము, గర్భాశయ ప్రసాదనము, రసాయనము, ఇది స్త్రీలకు కలుగుశ్వేత ప్రదరము, రక్తప్రదరము, ఋతుశూల మొదలగు ఇతర యోని వ్యాధులను హరించును.

1. యుటిరిల్‌తో తీసుకొని ఆర్తవదోషము నివర్తించును.

2. అభయాదివటి, లాక్షాదిగుగ్గులు, ఉశీరాసవమును అనుపానముగా వాడుచూ, పుష్యానుగ చూర్ణము పండ్ల రసముతోనిచ్చిన రక్తప్రదరము తగ్గును.

3. రక్తార్శస్సు,రక్తాతిసారమునందు లాక్షాదిచూర్ణము, తిప్పసత్తు, ఉశీరాసవలతో వాడుచూ లక్షణానుసార చికిత్స చేసిన రక్తదోషము నశించును.

పథ్యము : లేత అరటికాయ, బెండకాయ, ఆకుకూరలు, అరటిపువ్వు, దానిమ్మపండ్లు, ద్రాక్షపండ్లు, పంచదార,తేనె

అపథ్యము : కోడిమాంసము, వంకాయ, మునగకాయ, ఎండుచేపలు, గురుత్వము చేయు పదార్థములు

అనుపానము : తేనె, బియ్యపు కడుగు.

మోతాదు : 1-3 గ్రా. రోజుకు రెండుసార్లు భోజనమునకు అరగంట ముందు లేదా వెనుక నివ్వవలెను.

లభ్యము : 40 గ్రా.

## స్ఫటికాది చూర్ణము

దీనిని 1. తేనెతోగాని కేవలముగాని పండ్లకు రుద్దిన యెడల చిగుళ్లు వుబ్బుట, చీముకారుట, రక్తము స్రవించుట, దంతములపోటు, దంతములు కదలుట, మొదలగునవి నశించును. 2.పైన చల్లినచో దుర్మాంసములనుకోసి వ్రణములను మాన్పును. 3.నేతితో కలిపి పూసిన యెడల నోటిపూత మానును. 4. తేనెతో కలిపి కొండ నాలుకకు పట్టించిన యెడల కొండనాలుక తగ్గిపోవును. దీనిని ప్రతిదినము పండ్ల పొడిగ ఉపయోగింపవచ్చును. మోతాదు అవసరమైనంత.

## సితోపలాది చూర్ణం (భై.ర.)

ద్రవ్యములు : పటికబెల్లము, తవాక్షీరి, పిప్పళ్లు, చిన్న యాలకులు, దాల్చిన చెక్క.

గుణము : శ్వాస, కాస, క్షయలను హరించును. రుచ్యము అరుచి, మందాగ్ని, పార్శ్వశూల, జ్వరము, రక్తపిత్తములను నశింపజేయును,కర, పాదదాహమును (మంట) శమింపజేయును.

దీనిని వేడినీటితోగాని, రెట్టింపు పట్టిక బెల్లపు చూర్ణముతోగాని ఉ పయోగించిన యెడల పొడిదగ్గు, పొడి ఆయాసము, అజీర్ణము, అరుచి, కాళ్లుచేతులు మంటలు, అగ్నిమాంద్యము, శ్లేష్మ ప్రకోపము, నాలుక మొద్దుగ నుండుట, స్వర దోషములు, జలుబు మొదలగునవి నశించును.

మోతాదు 1/12 తు ॥ మొ ॥ తు॥ వరకు.

అనుభూత ప్రయోగమలు : సమస్త దగ్గులయందు గుణకారి.

1. ముత్యభస్మము, అతిమధురము, టంకణ భస్మములతో సితోపలాది చూర్ణ మును కలిపి తమలపాకు స్వరసముతో తీసుకొనిన శ్వాస, కాసల వేగము క్రమముగా తగ్గును. ఉసిరిక స్వరసముతో తీసుకొని క్షయ తగ్గుముఖం పట్టును.

2.పార్శ్వ శూలయందు పై విధముగానే వాడుచూ, వాత విధ్వంసినీ రసమిచ్చిన, శూల తగ్గును.

3. కరపాద దాహమునందు చందనాది తైలము అభ్యంగనమునకు వాడుచూ శతావరీ చూర్ణము, అశ్వగంధ చూర్ణము,సితోపలాది చూర్ణములను కలిపి పాలతో తీసుకొనిన దాహము తగ్గును.

పథ్యము : గోధుమలు, మద్యము, తేనె, ద్రాక్షపండ్లు, పొట్లకాయ, బీరకాయ, వెల్లుల్లి, ఉష్ణోదకము.

అపథ్యము : గొఱ్ఱెనెయ్యి, గొఱ్ఱెపాలు, చల్లని నీరు, దుంపకూరలు, ఆవాలు, నూనె పదార్థములు, చల్లని గాలి, మంచు

అనుపానము : 6 గ్రా. తేనె 12 గ్రా. నెయ్యి

మోతాదు : 1–3 గ్రా. రోజుకు రెండుసార్లు భోజనమునకు అరగంట ముందు లేదా వెనుక ఇవ్వవలెను.

లభ్యము : 50 గ్రా.

## సుదర్శన చూర్ణం (శా.సం.)

ద్రవ్యములు : త్రిఫలములు, పసుపు, మానుపసుపు, పెద్ద ములక, కచోరములు, త్రికటుకములు, మోడి, చాగమట్ట, తిప్పతీగ, దురదగొండి,

కటుకరోహిణి, పర్పాట కము, తుంగముస్తలు, కలు(క్రానుగ, కురువేరు, వేప, పుష్కరమూలము, యష్టిమధు, కొడిశపాల, ఓమము, కొడిశపాల విత్తులు, గుంటుభారంగి, మునగ విత్తులు, తువరి మన్ను, వస, లవంగపట్ట, పద్మకము, వట్టివేరు, చందనము, అతివస, చిట్టాముట్టి, కోలపొన్న, ముయ్యాకుపొన్న, వాయు విడంగములు, (గంథితగరము, చి(త్రమూలము, దేవదారు, చవ్యము, చేదుపొట్ల ఆకులు, జీవకము, ఋషభకము, లవంగము, తవాక్షీరి, తెల్లతామరపూలు, కాకోళి, లవంగప(త్రి, జాప(త్రి, తాళిసప(త్రి, నేలవేము.

గుణము: వాత,పిత్త,శ్లేష్మ జన్యరోగములు, సర్వజ్వరములు, వాతాది దోషము లచే (ప్రత్యేకముగా జనించెడి జ్వరములు, ద్వంద్వ జ్వరములు, సన్నిపాత జ్వరము ఆగంతుకజ్వరము, ధాతుగతజ్వరములు, విషమజ్వరములు, మానసిక జ్వరములు, శీత జ్వరములు, ఏకాహిక జవరములు, మేహము, తం(ద, దప్పి, శ్వాసము, కాసము, పాండురోగము, హృ(ద్రోగములు,కామిల; వెన్ను,వెన్నుపూస చివరి భాగము, నడుము, మోకాళ్లు, (ప్రక్కలు, తొడలు వీనియందలి పొట్లు నశించును.

దీనిని వేడినీటితోగాని తేనెతోగాని సేవించినయెడల సమస్తమగు జ్వరములు, చలిజ్వరము, తాపజ్వరము, అంతర్గత జ్వరము, సన్నిపాత జ్వరము, అజీర్ణ జ్వరము, దప్పిక, శ్లేష్మజ్వరము, అరుచి, రక్తదోషములు, చర్మవ్యాధులు, అగ్నిమాంద్యము, ఇవి వెంటనే నశించును.

మోతాదు 1/12 తు ॥ మొ॥ 1/6 తు. వరకు

అనుభూత (ప్రయోగములు : 1. సన్నిపాత జ్వరమునందు జ్వరాంకుశరస, భేది జ్వరాంకుశములతో ఇచ్చుచూ, అమృతారిష్ట, ఉ శీరాసవలను అనుపానముగా వాడిన, జ్వరము తగ్గును.

2. ఆగంతుక జ్వరమునందు లశునాదివటి, కాంచనార గుగ్గులతో దశమూలా రిష్ట అనుపానముగా వాడిన జ్వరము తగ్గును.

3. రక్తవికారమునందు సరసతో వాడుచూ, గంధక రసాయనము దినమునకు రెండుసార్లు ఒక్కొక్కటి చొప్పున వాడిన రక్తము శుద్ధినొంది వ్యాధి తగ్గును.

4. (క్రిమివ్యాధులు, చర్మవ్యాధులను కూడా హరించును.

పథ్యము : ఉసిరిక, నిమ్మపండ్లు, పెరుగుతోటకూర, పొట్లకాయ,

నీరుల్లిపాయ, ముల్లంగి తాటికలకండ, చక్కెర, తేలికగా జీర్ణమగు ఆహారము, కాచి చల్లార్చిన నీటిని ఉపయోగించవలెను.

అపథ్యము : కొయ్యతోటకూర, గుమ్మడికాయ, కోడిమాంసము, మామిడికాయ.

మోతాదు : 3 గ్రా. ఉదయము, సాయంత్రము భోజనమునకు ముందు కాచి చల్లార్చిన నీటితో సేవించవలెను.

లభ్యము : 40 గ్రా.

## సారస్వత చూర్ణము

దీనిని 1/12 మొ. 1/6 తు. వరకు తేనెతోగాని నేతితోగాని సేవించినయెడల మంచి స్వరమును, మనోధైర్యమును, బుద్ధికుశలతయు, కవనశక్తియు కలుగును. ఈ సారస్వతచూర్ణము బుద్ధికుశలతలేనట్టియు మనస్సు సరిగలేనట్టియు ప్రజలయొక్క హితము కొరకు బ్రహ్మచే స్వయముగ చెప్పబడినది.

## స్థాలీచూర్ణము

దీనిని 1. వేడినీటితో సేవించిన యెడల మలబంధము, శోఫ, ఆయాసము, అగ్నిమాంద్యము, అజీర్ణము, కడుపుబ్బరము, ప్రేగులరచుట, కడుపుపెరుగుట మొద లగునవి హరించును. 1/12 మొ. 1/6 తు. వరకు

## శతావర్యాది చూర్ణము (శా.సం)

ద్రవ్యములు : పిల్లి పీచరగడ్డలు, పల్లేరువేళ్లు, దూలగొండివిత్తులు, నాగబల, అతిబల, నీరుగొబ్బి విత్తులు ఉత్తమ వాజీకర ఔషధము

గుణము : ఉత్తమ వాజీకర ఔషధము

అనుభూత ప్రయోగములు : రస రక్తాది సప్తధాతువులకు పుష్టిని కలిగించును. పిత్తశామకము, స్తన్యమును వృద్ధిచేయును.

1. పంచదార, చిక్కని గేదెపాలతో కలిపి వాడిన క్షీరవృద్ధి కల్గును.

2. అశ్వగంధ చూర్ణము కలిపి, అధికమాత్రలో శర్కరను వాడిన మంచి వాజీ కరముగా పనిచేయును.

3. మానసిక దౌర్బల్యమునందు బ్రాహ్మీవటితో వాడిన అధిక ప్రయోజనకారి కాగలదు.

పథ్యము : ద్రాక్షపండ్లు, ఖర్జూరములు, నేరేడుపండ్లు, దానిమ్మపండ్లు, పొట్లకాయ, బీరకాయ, పంచదార, తేనె

అపథ్యము : అపథ్యము లేదు.

మోతాదు : 3-6 గ్రా. పాలతో రోజుకు రెండుసార్లు ఇవ్వవలెను.

లభ్యము : 40 గ్రా.

## తాళీసాది చూర్ణము

ద్రవ్యములు : తాళిసపత్రి, మిరియములు, శొంఠి,పిప్పళ్ళు, తవాక్షీరి, లవంగపు పట్ట, వంగభస్మం, తామ్రభస్మం, చక్కెర

గుణము : అరుచి, అజీర్ణము, కాస, శ్వాస, జ్వరములు, వాంతులు, అతిసారము, శోషము, కడుపుబ్బరము, ప్లీహరోగము,సంగ్రహణి, పాండురోగము నశించును.

దీనిని వేడినీటితోగాని తేనెతోగాని సేవించినయెడల దగ్గు, ఆయాసము క్షయ, అరుచి, అజీర్ణము, శ్లేష్మప్రకోపము, గుండెవ్యాధులు, మలబంధము, కళ్ళెదగ్గులను త్వరలో తగ్గించుటకు ఎంతటి శ్రేష్టమైనమందు వేరొకటిలేదు.

మోతాదు 1/12 తు మొ. 1/6 తు. వరకు

అనుభూత ప్రయోగములు : సమస్త దగ్గులయందు అత్యంత గుణకారి,కఫహరము, స్రోతశ్శోధనము.

1. శ్వాసానందవటి, కనకాసవ అనుపానముగా వాడుచూ తాళీసాది చూర్ణము తేనెతో ఇచ్చిన శ్వాసకాసలు నివర్తించును.

2. కడుపుబ్బరమునందు కాంకాయనవటి, అగ్నితుండివటిలను కలిపి వాడిన ప్రయోజనముండును.

3. ప్లీహ రోగమునందు పంచామృత పర్పటితో వాడిన బలముగా పనిచేయును.

పథ్యము : తేనె, బీరకాయ,పొట్లకాయ,వెల్లుల్లి, ఉష్ణోదకము, తేలికగా జీర్ణమగు ఆహారము కాచి చల్లార్చిన నీటిని ఉపయోగించవలెను.

అపథ్యము : వాతకర, శ్లేష్మకర అన్నపానములు, చేపలు, దుంపకూరలు, ఆవాలు, చల్లనిగాలి, మంచు.

అనుపానము : జ్వరమునకు వేడినీరు, కాసయందు-తేనె, ఆమ్లపిత్తమునందు - నీరు, క్షయదగ్గులకు - పేరిన నెయ్యి.

మోతాదు : 1–3 గ్రా. బలము, రోగతీవ్రతనుబట్టి రోజుకు 2–3సార్లు భోజనానికి అరగంట ముందు తేనెతో

లభ్యము : 50 గ్రా.

## త్రికటు చూర్ణము

ద్రవ్యములు : శొంఠి, పిప్పళ్లు, మిరియాలు

గుణము : అరుచి, అగ్నిమాంద్యము, ఆమదోషము, గళరోగములు, పీనసము, కుష్ఠములను హరించును. ఆమపాచనముచేసి జ్వరములను హరించును.

దీనిని 1. వేడినీటితో సేవించినయెడల అజీర్ణము, కడుపుబ్బరము, ప్రేగులర చుట, అగ్నిమాంద్యము వాతవ్యాధులు,శూలలు, పులిత్రేనుపులు మొదలగునవి. 2. తేనెతో సేవించినచో జ్వరములు, శ్లేష్మము, జలుబు, ఆయాసము, మొదలగునవి వెంటనే నశించును.

మోతాదు 1/12 మొ॥ 1/6 తు. వరకు

అనుభూత ప్రయోగములు :

1. అరుచి, అగ్నిమాంద్యములందు తేనెతో తీసు కొనిన జఠరదీప్తి కలిగి రుచి పుట్టును.

2. పీనసమునందు సితోఫలాది చూర్ణము, ఇస్నోఫాల్‌లతో వాడిన బాగుగా పనిచేయును.

3. ఆమదోషమును వలన కలిగే వ్యాధులైన ఆమవాతము మొదలగు వాని యందు మొదట ఆమపాచనము గావించవలెను. అటువంటి సందర్భములో తేనెతో నిచ్చిన ఆమపాచనమునొంది ఆమదోషము వలన కలిగే వ్యాధులు నివర్తించుటలో దోహదము చేయును.

పథ్యము : సముద్రలవణము, వేడి అన్నము, అల్లము, బీరకాయ, పొట్లకాయ, లేత ముల్లంగి, తేలికగా జీర్ణమగు ఆహారము, కాచి చల్లార్చిన నీరు వీనిని సేవించవలెను.

అపథ్యము : మునగకాయ, గురుపదార్ధములు, చేపలు, వంకాయ, దోసకాయ, దుంపకూరలు, వెన్న, పెరుగు, మాంసము మొదలగునవి తాత్కాలికముగా నిషేధము.

అనుపానము : తేనె లేక వేడినీరు.

మోతాదు : 1-3 గ్రా. రోజుకు రెండుసార్లు సేవించవలెను.

లభ్యము : 45 గ్రా.

## త్రిఫల చూర్ణము

ద్రవ్యములు : కరక వలుపు, తానికాయవలుపు.

గుణము : ప్రమేహము, వాపు, విషమజ్వరము, శ్లేష్మ రోగము, పిత్తరోగము, కుష్ఠము, అగ్నిమాంద్యము నశించును. త్రిఫల చూర్ణమును నెయ్యి, తేనెలను కలిపిన రసాయనము అనబడును. ఇది సమస్త నేత్రరోగ హరము.

అనుభూత ప్రయోగములు : అనులోమనము, త్రిదోషహరము, నేత్ర్యము, శ్వాసకాసలను, మలబద్ధకమును హరించును.

1. నేరేడు విత్తుల చూర్ణము, అశ్వగంథ చూర్ణము, నేలవేము చూర్ణములను కలిపి త్రిఫల చూర్ణముతో ఇచ్చిన క్రమేపీ ప్రమేహము తగ్గును.

2. విషమజ్వరమునందు త్రిఫల కషాయమును భేదీ జ్వరాంకుశముతో ఇచ్చిన జ్వరము శాంతించును.

3. శ్లేష్మ రోగములందు త్రికటు చూర్ణముతో ఇచ్చిన శ్లేష్మహరము కాగలదు.

4. పిత్తరోగములందు యష్టిమధు, దానిమ్మబెరడు, కొడిశపాల చెక్కలతో ఇచ్చిన పిత్తవికారము నశించును.

5. నేత్రములకు బలము కలుగుటకు తేనె, నెయ్యి కలిపి రాత్రి పుచ్చుకొనవలెను.

6. కండ్లకలకయందు త్రిఫలకషాయమును బాగుగా వడియబోసి నేత్రధార చేసినచో శీఘ్రముగా శమించును.

పథ్యము : వేడినీరు, అరటిపువ్వు, అత్తికాయలు, తేనె, తాంబూలము, వేయిం చిన బియ్యము, విసిరిన నూకలజావ, గోధుమనూకజావ, తేలికగా జీర్ణమగు ఆహారము, కాచి చల్లార్చిన నీటిని మాత్రమే ఉపయోగించవలెను.

అపథ్యము : చేపలు, మాంసము, అజీర్ణకర పదార్థములు, విరుద్ధాహార సేవనము.

అనుపానము : మలబద్ధకమునందు వేడినీరు దగ్గునందు- తేనె

మోతాదు : 1-3 గ్రా. రోజుకు రెండు లేదా మూడుసార్లు గానీ, లేదా

రాత్రి పరుండబోవునపుడు ఒక్కసారి సేవించవలెను.

లభ్యము : 50గ్రా.

### త్రిఫలా చూర్ణము

దీనిని వేడినీటితోగాని పంచదారతో గాని వెన్నతోగాని సేవించినయెడల నోటి పూత, శుక్లనష్టము, దగ్గు, మలబంధము, శ్వేతరక్త ప్రదరములు, నేత్రవ్యాధులు, భగందరము, రక్తస్రావము,రక్తార్శస్సు, బంకవిరేచనములు, ఇరువది ప్రమేహములు, వ్రణములు, మొదలగు అనేక వ్యాధులు నశించును. ఇది సుఖవిరేచనమును చేయును. మోతాదు 1/12 తు॥ మొ॥ 1/6 వరకు.

### త్రిజాత చూర్ణము

దీనిని 1.తేనెతో సేవించిన యెడల నోటిపూత, గుండెలలోమంట, ఉడుకు, తాపజ్వరములు 2. వెన్నతో సేవించిన యెడల మేహ వ్యాధులు, శుక్లనష్టము, శుక్లము పలచనగా నుండుట, నీరసము, ప్రదరవ్యాధులు, ఉడుకుజ్వరములు మొదలగు నవి వెంటనే హరించును. మోతాదు 1/12 మొ 1/6 వరకు.

### త్రివృత్ (తెగడ) చూర్ణము

దీనిని రెట్టింపు పంచదారకలిపి వేడినీటితో పుచ్చుకొనిన యెడల మలబంధము, కడుపుబ్బరము, కడుపునొప్పి, శూల, అజీర్ణము, నోటిపూత, యకృద్వ్యాధులు, ప్లీహ వ్యాధులు, గుల్మములు, ఉదరవ్యాధులు, మూలవ్యాధి, నంజు మొదలగు మలబంధ ప్రధానమగు వ్యాధులయంద మోఘముగా పనిచేయును. వాంతి, వికారము, నీరసము విరేచనములు హెచ్చుతగ్గులగుట మొదలగు దుర్లక్షణముల నేమియు కలిగింపక బహు చక్కగ విరేచనములను చేయును. విరేచనకారులలో బహు శ్రేష్ఠమైనదని శాస్త్రము నందు చెప్పబడిన మాట మిక్కిలి తథ్యమైనది. మలబంధ ప్రధానమగు వ్యాధులలో ఆయామందులతో దీనిని అనుపాన చూర్ణముగ చేర్చవచ్చును. మోతాదు 1/8 తు॥ మొ॥ 1/5 తు. వరకు అరతులమునకు వచ్చిన యెడల 5-6 విరేచనములను చేయును.

## క్వాథ చూర్ణములు

### మహారాస్నాది క్వాథ చూర్ణము (స.యో)

ద్రవ్యములు : సన్నదుంప రాస్నము, దురదగొండి వేళ్లు, చిట్టాముట్టి వేళ్లు, ఆముదపువేళ్లు, దేవదారు, కచ్చూరములు, వస, అడ్డసరము, శొంఠి, కరక్కాయ బెరడు, చవ్యము, తుంగముస్తలు, తెల్లగలిజేరు, తిప్పతీగ, వృద్ధదారు, బద్దసోపు, పల్లేరు, పెన్నేరుగడ్డ, అతివస, రేలకాయ, శతావరి, పిప్పళ్లు, నల్లముళ్ళ గోరింట వేళ్లు, ధనియాలు, ములక, వాకుడు.

గుణము : సర్వాంగ కంపము, కుబ్జత, పక్షాఘాతము, అపబాహుకము, గృధ్రసీ, ఆమవాతము, శ్లీపదము, అపతానకము, ఆంత్రవృద్ధి, ఆధ్మానము, జంఘాగత వాతము, జానుగత వాతము, ఆర్ధిత వాతము, శుక్రరోగము, మేఢ్రరోగము, వంధ్యా రోగములు మరియు యోని రోగములు నశించును.

అనుభూత ప్రయోగములు : 1. శోథ యందు ఆరోగ్య వర్ధనీ వటి, పర్పటిలతో ఉపయోగించిన, శోథహరము కాగలదు.

2. సర్వాంగ శోథయందు తిప్ప సత్తు, త్రివంగ భస్మము, కర్పూర శిలాజిత్‌లతో కలిపి ఇచ్చిన, శోథ పూర్తిగా నశించును.

3. ఏవిధమైన వాత రోగములందైనను అలిశట్ కాప్స్యూల్‌తో పాటుగా ఇచ్చుచూ, మహావాత విధ్వంసిని, లహసాన్ ఇంజక్షన్‌లను ఇచ్చుచున్న, సర్వ వాతహరము కాగలదు.

పథ్యము : పాతబియ్యము, గోధుమరొట్టె, గోధుమజావ, మేకమాంసము, కంది పప్పు, కందికట్టు, వెల్లుల్లి, మునగ ఆకు కూర, కొయ్యతోటకూర; అంగమర్దనము.

అపథ్యము : కొత్తబియ్యము, పెసలు, మినుములు, శనగలు, బచ్చలి, చుక్క కూర, పెరుగు, మీగడ, పిండివంటలు, నూనె, కోడిమాంసము, చేపలు; చన్నీటి స్నానము, చింత, జాగరణ, మలమత్రము వేగ నిరోధము.

మోతాదు : 30 మి.లీ. కషాయమును రోజుకు రెండు మూడుసార్లు భోజనము నకు ముందు ఇవ్వవలెను.

లభ్యము : 250 గ్రా. 500 గ్రా.

క్వాథమును తయారు చేయు విధానము : క్వాథ చూర్ణమునకు 16

రెట్లు నీటిని చేర్చి, 8వ వంతు మిగులు వరకు కాచి, వడియగట్టి సేవించవలెను. క్వాథమును 24 గం॥కు మించి నిలువ ఉంచరాదు.

### రాస్నాదిక్వాథ చూర్ణము (స. యో)

ద్రవ్యములు : సన్నరాస్నము, ఆముదపువేళ్లు, బలావేళ్లు, నల్లముళ్ల గోరింట వేళ్లు, శతావరి, దూలగొండివేళ్లు, అడ్డసరపువేళ్లు, తిప్పతీగ, దేవదారు, అతివస, తుంగముస్తలు, నీటి గొబ్బి, కచ్చూరములు, శొంఠి.

గుణము : శూలతో కూడిన వాతము, పిక్కలు, తొడలు, నడుము, వీపు, ప్రక్కలు, దవడలయందలి వాపులు మరియు వాతరక్తము శమించును.

అనుభూత ప్రయోగములు : చచ్చువాతము, ఆమవాతములందు గుణకారి.

1.రోజూ కనీసము 3-4 సార్లు కషాయమునకు మహాయోజరాజ గుగ్గులు అనుపానముగా లోనికి వాడుచూ, వాపుగల ప్రదేశమునందు ఈ కషాయముతో పరిషేకము చేసిన, ఆమవాతమునందలి శోథతగ్గి, వాతము శమించును.

2. అతిమూత్రమునందు త్రివంగ భస్మమునకు అనుపానముగా ఇవ్వవచ్చును.

3. అశ్మరీనందు చందనాదివటి, గోక్షురాది వటిలకు అనుపానముగా వాడిన, రాళ్లు పడిపోవును.

పథ్యము : పాతబియ్యము, గోధుమరొట్టె,గోధుమజావ, మేక మాంసము, కంది పప్పు, కందికట్టు, వెల్లుల్లి, మునగాకు కూర, కొయ్య తోటకూర, అంగమర్దనము.

అపథ్యము : కొత్తబియ్యము,పెసలు, మినుములు, శనగలు, బచ్చలి, చుక్కకూర, పెరుగు, మీగడ, జాగరణ, మలమూత్ర వేగ నిరోధము.

మోతాదు : 30 మి.లీ. కషాయమును భోజనమునకు ముందు ఇవ్వవలెను.

లభ్యము : 250 గ్రా. 500 గ్రా.

క్వాథమును తయారు చేయు విధానము : క్వాథ చూర్ణమునకు 16 రెట్లు నీటిని చేర్చి, 8వ వంతు మిగులువరకు కాచి, వడియబోసి సేవించవలెను. క్వాథమును 24 గంటలకు మించి నిలువ ఉంచరాదు.

**అమృత చూర్ణము**

25 గ్రా. అమృత, శతాహ్వా, ఆమ్లకి, గోక్షూరం మొ॥

5-10 గ్రా. నీటితో రోజుకు 2సార్లు ప్రమేహము నందు ఉపయోగకారి.

**అష్ట చూర్ణము (అ.హృ)**

25 గ్రా. త్రికటు, అజమోదం, సైంధవలవణం, తెల్లజీలకర్ర, నల్లజీలకర్ర, ఇంగువ.

3 నుండి 5గ్రా. మొదటిముద్దలో నెయ్యి చేర్చిగాని లేక మజ్జిగతోగాని ఇవ్వవలెను.

అగ్నిమాంద్యము, అజీర్ణము, ఆధ్మానము, గుల్మము హరించి అగ్నిదీప్తిని కలుగ చేయును.

**నాశికా చూర్ణము**

10 గ్రా. ఉసిరిక, యవాని, లవంగాలు, నెమలిఫించం కాడలు, జాపత్రి మొ.

నశ్యకర్మకు - శిరఃశూల, పీనసం, దుర్గంధం, సూర్యావర్తంలను నివారించును.

**దశనకాంతి చూర్ణము**

25 గ్రా. ఇరుగుడుచెక్క, యష్ఠిమధు, దార్వి, ఖదిరసారం, గైరికం, లవంగ, ఏల, త్వక్

3 నుండి 5 గ్రా. దంతధావన చూర్ణము : నోటిదుర్వాసన, దంతములు, చిగుళ్ళ బాధను, నోటిపూతలను తగ్గించును.

**గుగ్గులు పంచఫల చూర్ణము (అ.హృ)**

25 గ్రా. గుగ్గులు, త్రిఫల, మాగధిక

3-5 గ్రా. లోపలికి తేనెతో లేక వేడినీళ్ళతో - చర్మరోగములు, భగంధరము, గుల్మమునందు శ్రేష్ఠము.

**హింగువచాది చూర్ణము (అ.హృ)**

25 గ్రా. హింగు, వచ, దాడిమ, చిరుబొద్ది, ధనియాలు.

3 నుండి 5 గ్రా. మజ్జిగ లేక వేడినీళ్ళతో త్రాగవలెను. గుల్మం, నీళ్ళ విరేచన ములు, శ్వాసకాసం, రక్తహీనత ఆకలి మందగించుట యందు బాగుగా పనిచేయును.

## హుతభుగాది చూర్ణము (అ.హృ)

25 గ్రా. చిత్రకం, అజమోదం, సైంధవలవణం

3 నుండి 5 గ్రా. మజ్జిగ లేక వేడినీళ్ళతో త్రాగవలెను.

మొలలు, ఆకలి మందగించుట, రక్తహీనత యందు ఉపయుక్తము.

## జటామయాది చూర్ణము (స.యో)

25గ్రా. జటామాంసి, చందనం, కుందురుష్కం

పైపూతకి – శరీరముపై నొప్పులు, వాపులు, మంటలుగా ఉండుటయందు, ఆమవాతమునందు పైపూతగా రాయవలయును.

## కచోరాది చూర్ణము

25గ్రా. కచ్చోరాలు, అతిమధురం, ఉసిరిక, బలా

పైపూతకి – తలనొప్పి, మంటలు, తలతిరుగుట, కంటి వ్యాధులందు పై పూతగా రాయవలయును.

## కర్పూరాది చూర్ణం (స.యో)

25గ్రా. కర్పూరం, లవంగం, దాల్చినచెక్క, అనాసిపువ్వు, జాజికాయ, జాపత్రి, నాగకేసరం.

లోపలికి 3–4 గ్రా. తేనెతో– శ్వాసకాసలు, హిక్కా పీనసము, తమకశ్వాసము, హృద్రోగము వీనిని శమింపచేయును.

## కొట్టంచుక్కాది చూర్ణము (స.యో)

25గ్రా. చంగల్వకోష్ఠం, శొంఠి, మునగ, వస, వెల్లుల్లి, దేవదారు.

పైపూతకి – ఆమవాతము, కీళ్ళవాతములలో వచ్చు వాపులకు, పైన లేపనము చేసిన శమించును.

## నవాయస చూర్ణము (అ.యో)

25 గ్రా. చిత్రకము, త్రిఫల, త్రికటు, వేల్ల

లోపలికి 3–4 గ్రా. తేనె/వేడినీళ్ళతో – ఆమవాతహరము

## పంచకోల చూర్ణము (అ.హృ)

25గ్రా. పిప్పళ్లు, పిప్పలి మూలం, చవ్యం

లోపలికి – అజీర్ణము, ఆకలి మందగించుట యందు శ్రేష్ఠము.

### పీతకచూర్ణము (అ.హృ)

25 గ్రా. దార్వీత్వక్, సైంధవలవణము, మనఃశిల

నోటిలోపలికి పూతకు – నోటిలో, గొంతులోని పుండ్లకు లేపనముగా పూయుటకు

### పుష్యానుగ చూర్ణం (అ.హృ)

25 గ్రా. చిరుబొద్ది, నేరేడు గింజలు, మామిడి టెంకలు, గైరికం, మారేడుగుజ్జు, మాచికాయ.

3 నుండి 5 గ్రా. లోపలికి తేనెతో – విరేచనములు, అర్మస్సు, రక్తార్మస్సు, స్త్రీల దోషములు, శ్వేత, రక్తప్రదములు శమించును.

### రజన్యాది చూర్ణము (అ.హృ)

25 గ్రా. రజని, దారుహరిద్ర, దేవదారు

3 నుండి 5 గ్రా.లు. లోపలికి తేనెతో – జ్వరము, విరేచనాలు, ఆయాసం, కామెర్లు, రక్తహీనత, చిన్నపిల్లల వ్యాధులందు ఉత్తమము.

### రాస్నాది చూర్ణము (స.యో)

25 గ్రా. పసుపు, కటుకరోహిణి, రాస్నా, మిరియాలు, వట్టివేళ్లు, గైరికం, అతిమధురం.

పైపూతకు – జలుబు, తలభారము, తలనొప్పియందు చనుపాలతో గలిపి వేడినీళ్ళతో గాని నుదురుపైన పట్టీవేసిన శమించును.

### షడ్ధర్ణ చూర్ణం (చ. సం.)

25 గ్రా. దార్వి, కళింగ, చిరుబొద్ది, అగ్ని

లోపలికి 3–5 గ్రా మజ్జిగతో – ఉదరము, మొలలు, కామెర్లకు శ్రేష్ఠము.

### వైశ్వానర చూర్ణము (అ.హృ)

25 గ్రా. చిత్రకము, అతివిష, హింగు

లోపలికి 3–5 గ్రా.లు తేనెతో – గుల్మం, మొలలు, మలబద్ధకము, అజీర్ణం, కడుపు ఉబ్బరములందు ఉపయోగము.

### త్రిఫలాది చూర్ణము (అ.హృ)

25గ్రా. కరక్కాయ, తానికాయ, ఉసిరిక, అతిమధురం

3 నుండి 5 గ్రా.లు. లోపలికి తేనెతో, వేడినీళ్ళతో - కంటిజబ్బులయందు తేనెతో, మలబంధనమునందు వేడినీళ్ళతో తీసుకొనవలెను.

## యవన్యాది చూర్ణము (స.యో)

25గ్రా. యవాని, దాడిమ, తింత్రిణిక, రేగుగింజలు

లోపలికి 3–5 గ్రా.లు తేనెతో - దగ్గు, ఆకలిలేకపోవుట, మొలలు, మలబద్ధ కము కడుపు, గుండెలోపల నొప్పులకు గుణకారి.

## గుగ్గులు

### గోక్షురాది గుగ్గులు (సి.యో.సం.)

ద్రవ్యములు : త్రికటుకములు, త్రిఫలములు, నాగముస్తలు, పల్లేరు, శుద్ధ గుగ్గులు.

గుణము : ప్రమేహము, మూత్రకృచ్ఛము మరియు మూత్రాఘాతము లందు అత్యంత గుణకారి (సిద్ధయోగసంగ్రహ) ప్రమేహ, మూత్రకృచ్ఛ, మూత్రాఘాత, ప్రదర, వాతరోగము, వాతరక్తము, శుక్రదోషము, అశ్మరి రోగములను నశింపజేయును.

వీనిని 1. కొండపిండికషాయముతో గాని నీటితోగాని యుపయోగించిన యెడల మూత్రకృచ్ఛ్రము, శుక్లనష్టము, సెగవ్యాధులు, లింగమందలి వ్రణము, మొదలగునవి నశించును. మోతాదు 1 మొ॥ 2 మా॥ వరకు

అనుభూత ప్రయోగములు :

1. మూత్రకృచ్ఛ్రము మూత్రాఘాతములందు రాస్నాది చూర్ణము, గోక్షురాది చూర్ణము, సుదర్శన చూర్ణములను కలిపి తేనెతో తీసుకుంటూ, భోజనానంతరము చందనాదివటితో ఇచ్చుచూ, పునర్నవారిష్ట అనుపాన ముగా ఇచ్చిన మూత్రము సాఫీగా పోవును.

2. అతిమూత్రము, ప్రమేహములందు అభ్రక భస్మము, త్రివంగభస్మములను తేనెతో తీసుకొనుచూ, భోజనానంతరము తారకేశ్వరరసతో ఆమలకీస్వరసమును అనుపానముగా ఇచ్చిన ఎక్కువసార్లు మూత్రమునకు వెడలుట తగ్గును.

3. అశ్మరినందు చంద్రప్రభావటి,మహాయోగరాజ గుగ్గులతో ఇచ్చుచూ, పునర్నవారిష్ట, చందనాదిసనములను అనుపానముగా ఇచ్చిన, మూత్రము

యొక్క రాళ్లు నశించును.

పథ్యము : గోధుమలు, యవలు, ఉలవలు, పెసలు, మజ్జిగ, కల్లు, అల్లము, చక్కెర, పల్లేరుకూర, ఖర్జూరము, టెంకాయ, తాటిముంజెలు.

అపథ్యము : నూనె పిండివంటలు, చేపలు, ఇంగువ, నువ్వులు, ఆవాలు, వెల్లుల్లి.

అనుపానము : పల్లేరు క్వాథము లేదా ఇతర ప్రమేహర క్వాథము.

మోతాదు : 1-2 మాత్రలు ఉదయము సాయంత్రము ఖాళీ కడుపున సేవించ వలెను.

లభ్యము : 26 మాత్రలు.

## కాంచనార గుగ్గులు (సి.యో.సం.)

ద్రవ్యములు : దేవకాంచనపు పట్ట,త్రిఫలములు, త్రికటుకములు, ఉలిమిడి పట్ట, యాలకులు, దాల్చినచెక్క, ఆకుపత్రి, శుద్ధగుగ్గులు.

గుణము : గండమాల, గళగండ, అపచి, అర్బుదము, గ్రంధులు, వ్రణములు, గుల్మములు, కుష్ఠములు, భగందరములను నశింపజేయును.

శాస్త్రీయ ప్రయోగములు : 1 విశేష లాభమునకు 15 మి.గ్రా. స్వర్ణభస్మము, 625 మి.గ్రా. ప్రవాళ పంచామృత రసము యివ్వవలెను.

2. శుద్ధగుగ్గులు, గంధకము, రసాంజనములను సమభాగములు తీసుకుని జలముతో మర్దించి గండమాలకు లేపనము చేయుచూ కాంచనార గుగ్గులు వాడవలెను.

3. అర్శోశోథయందు కందమూల రసాయనమిచ్చుచూ, కాంచనార గుగ్గులు పగలు ఒకటి, రాత్రి ఒకటి చొప్పున ఇచ్చిన, శోథనశించి, అర్శస్సు తగ్గుటకు దోహద కారి కాగలదు.

పథ్యము : తెల్లగలిజేరు కూర, మునగ, ఉలవలు, తేనె, అల్లము.

అపథ్యము : పాలు, పెరుగు, తాంబూలము, కొత్తబియ్యము, చలి అన్నము, శీతలము, ఉప్పు ఇవి గల రసములు శీతోదక స్నానము, అతిసంచారము, శ్రమ.

అనుపానము : దేవకాంచనపుపట్ట క్వాథము, ఉలిమిడి పట్ట క్వాథము, చంద్రపట్ట క్వాథము, కరకవలుపు క్వాథము

మోతాదు : 1-2 మాత్రలు ఉదయము, సాయంత్రము ఖాళీకడుపున

సేవించ వలెను.

లభ్యము : 24 మాత్రలు.

**కైశోర గుగ్గులు (భై.ర.)**

ద్రవ్యములు : శుద్ధ గుగ్గులు,ఉసిరికాయ, తానికాయ, కరక్కాయ, తిప్పతీగ, శొంఠి, పిప్పళ్లు, మిరియాలు, వాయువిడంగములు, తెగడ వేళ్లు, నేపాలవేళ్లు, ఆవునెయ్యి.

గుణము : వాతరక్తము, వ్రణము, కాస, కుష్ఠము, గుల్మము, శోథ, ఉదర రోగము, పాండువు, 20 రకముల ప్రమేహములు, మందాగ్ని, విబంధము, ప్రమేహ పిటికలు మొదలగు సర్వరోగములను నశింపచేయును. వృద్ధాప్యమును దూరము చేయును.

వీనిని 1. సుగంధిపాల కషాయముతోగాని నీటితోగాని యుపయోగించిన యెడల వాతరక్తము, వాతశోణితము, వాత వ్యాధులు, జీర్ణించిన సవాయి వ్యాధులు, సెగ వ్యాధులు, కుష్ఠములు, భగందరము, అర్శస్సు, మేహపిటికలు వ్రణములు మొదలగునవి వెంటనే నశించును.

అనుభూత ప్రయోగములు : రక్తదోషము వలన చర్మముపై వచ్చు మచ్చలు, వ్రణములు, చర్మరోగములు, నేత్రవ్యాధులయందు మరియు భగందరమునందు గుణకారి.

1.పాండువునందు లోహభస్మము, పునర్నవాది మండూరము, క్రిమిముద్గర రసలతో కైశోరగుగ్గులు వాడిన క్రిములు పడిపోయి, రక్తవృద్ధినొంది, మేదోవృద్ధి తగ్గి, పాండురోగము నశించును.

2. ప్రమేహ పిటకలందు త్రిఫల గుగ్గులు, లశునాదివటి, కైశోరగుగ్గులు కలిపి వాడుచూ, లక్షణానుసారముగా చికిత్స చేసిన త్వరగా ఫలితము కనబడును.

3. వృద్ధాప్యమునందు కలిగే శరీరపీడ, విబంధములందు అశ్వగంధ చూర్ణము, త్రిఫల చూర్ణములతో వాడిన బాధ తగ్గును.

పథ్యము : నెయ్యి, చక్కెర, పుల్లదబ్బ, ఉసిరిక, వెలగపండు, నేరేడుపండు, ఆకు కూరలు, చేదు పదార్థములు, వ్యాయామములు, అభ్యంగనము.

అపథ్యము : నువ్వులనూనె, మునగకాయ, ఇంగువ, మేకపాలు,

కంద; ఆకలిని ఆపుట.

అనుపానము : దాల్చిన చెక్కచే సుగంధితమైన నీరు లేదా పాలు.

మోతాదు : 1-4 మాత్రలు రోజుకు రెండుసార్లు ఖాళీ కడుపుతో సేవించవలెను.

లభ్యము : మాత్రలు

**లాక్షాది గుగ్గులు (భై.ర.)**

ద్రవ్యములు : లాక్షా చూర్ణము, నల్లేరు, అర్జునపట్ట, అశ్వగంధ, నాగబల, శుద్ధ గుగ్గులు

గుణము : విరిగిన స్థాన భ్రంశము చెందిన ఎముకలు పూర్వస్థితికి వచ్చుటకు, ఎముకలకు దృఢత్వము నిచ్చుటకు దోహదము చేయును.

అనుభూత ప్రయోగములు : 1. స్థానభ్రంశము నొందిన ఎముకలను స్వస్థాన మునకు తెచ్చిన తరువాత కాంచనార గుగ్గులతో వాడిన వాపు నొప్పి శమించును.

2. ఎముకలకు దృఢత్వము తెచ్చుటకు ముత్యభస్మము, కుక్కుటాండత్వక్ భస్మము, త్రిఫల చూర్ణములను తేనెతో తీసుకొనుచూ, భోజనానంతరము లాక్షాది గుగ్గులు వాడిన బలహీనముగానున్న ఎముకలు దృఢత్వము నొందును.

3. విరిగిన ఎముకలను స్వస్థానమునకు చేర్చిన తరువాత రోపణమునకై కాంచ నార గుగ్గులతో వాడిన పూయము తగ్గి, వాపు తగ్గి త్వరితముగా ఎముకలు అతుకును.

పథ్యము : కందులు, పెసలు, పొట్లకాయ, పొట్టికాకర, లేత గలిజేరుకూర, చిర్రికూర, ఆవు మజ్జిగ

అపథ్యము : చలి అన్నము, కొత్తబియ్యపు అన్నము, కారము, శనగపప్పు.

అనుపానము : గోరువెచ్చని పాలు లేదా నీరు

మోతాదు : 1-4 మాత్రలు రోజుకు 4 సార్లు ఖాళీకడుపున సేవించవలెను.

లభ్యము : మాత్రలు

## మహాయోగరాజ గుగ్గులు (భై.ర.)

ద్రవ్యములు : త్రిఫలములు, త్రికటుకములు, చిరుబొద్ది, పెద్ద సదాప విత్తులు, మానుపసుపు, వాము, వస, ఇంగువ, బోడతరము, గజ పిప్పళ్లు, నల్లజీలకర్ర, కచ్చూర ములు, ధనియాలు, బిడాలవణము, సౌవర్చలవణము, సైంధవలవణం, మోడి, దాల్చిన చెక్క, యాలకులు, ఆకుపత్రి, నాగకేసరములు, మరువము, దవనము, లోహభస్మము, సర్జరసము, పల్లేరు, రాస్నా అతివస, శొంఠి, యవక్షారము, ఆమ్లవేతసం, చిత్రమూలం, పుష్కరమూలము,చవ్యము, వృక్షామ్లము, దానిమ్మ బెరడు, ఆముదపు వేరు, అశ్వగంధ, తెగడవేరు, నేపాళవేరు, రేగుపట్ట, దేవదారు, పసుపు, కటుకరోహిణి, చాగవేళ్లు,కలుక్రానుగ, చిన్న దూలగొండి వాయువిడంగములు, వంగభస్మము, వాము, అడ్డసరమువేరు, అభ్రక భస్మం, శుద్ధ గుగ్గులు.

గుణము : ఆమవాతముచే భగ్నములైన కటిభగ్న, ఏకాంగశోష, కుష్ఠము, క్షత కుష్ఠము, వాతజపాద విస్తృతి,గృధ్రసీ, సంధివాతము, క్రోష్టుశీర్షము, సర్వాంగవాతము, 80రకములు వాతములు, 40 రకముల పైత్యరోగములు, 20 రకముల శ్లేష్మరోగము లను నశింపజేయును. సర్వవిధ వాతహర ఔషధము.

అనుభూత ప్రయోగములు : ఆమవాతము, సంధివాతము (కీళ్లనొప్పులు), వాత రక్తము, భగంధరము, అరుచి, శ్వాస,కాస,ధాతుక్షీణత, బహుమూత్రము, ప్రమేహము, అర్శస్సు, శిరోరోగములందు గుణమిచ్చుటలో ప్రసిద్ధ ఔషధము, మలబద్దము, స్త్రీల ప్రసవరోగములందు ఉత్తమముగా పనిచేయును. వాతవాహినులందు సంచితమైన విషమును నిర్మూలించుటలో యోగరాజగుగ్గులు అత్యంత ప్రభావ శాలి. వృద్ధులకు అత్యంత హితకరము ఉదరవాతమునందు గుణకారి. వాతహర గుణము కలిగియుండి వాతవాహనాడులకు బలము నిచ్చును. స్త్రీల గర్భాశయముపై గుగ్గులు పనిచేయుటచే ఋతు దోషములను సరిచేయును. 80 రకముల వాత వ్యాధులకు ప్రసిద్ధ ఔషధము. ఉదరశూల, రక్తదోషము, వాత, పిత్త, శ్లేష్మ వికారములు, గుల్మము, అపస్మారము, పాండురోగములందు అత్యంత గుణకారి.

1. గృధ్రసీ వాతమునందు లశునాదివటి, మహావాత రాక్షసములతో ఇచ్చుచూ అశ్వగంధారిష్ట, దశమూలారిష్ట అనుపానములుగా ఇవ్వవలెను.

అభ్యంగనమునకు క్షీరబలాతైలము వాడుచూ లహసాన్ ఇంజక్షన్ 10 రోజులు క్రమము తప్పకవాడిన పీడ నశించును.

2. ఆమవాతమునందు ఏరండతైలము అభ్యంగనముగా వాడుచూ సింహనాద గుగ్గులు, చేదుకట్టు మాత్రలతో భోజనానంతరమిచ్చుచూ, అగస్త్య హరీతకీ లేహ్యము ఇచ్చిన వృశ్చికదంశను పోలిన పీడ శమించును.

3. ఏరకమైన శోథలయందైనను మహాయోగరాజ గుగ్గులు దశమూలారిష్టతో ఇచ్చుచూ, లక్షణానుసారము చికిత్స చేసిన పూర్తిగా నివృత్తి అగును.

పథ్యము : పొట్టికాకర, ముదురుగుమ్మడికాయ, పొట్లకాయ, బీరకాయ, లేత మునగకాయ, ఉసిరికవరుగు, ఆముదము.

అపథ్యము : గొడ్డిపాలు,ఉలవలు,పెరుగు,చేపలు, నూనె, అజీర్ణము చేయు పదార్ధములు, కొవ్వుపదార్థములు; అతిగా ఆందోళనపడుట,చింత, మొదలగునవి నివారించవలెను.

మోతాదు : 1-2 మాత్రలు రోజుకు రెండుసార్లు ఖాళీ కడుపున సేవించవలెను.

లభ్యము : మాత్రలు

## మహా యోగరాజగుగ్గులు (భై.ర.)

వీనిని వేడినీటితో ఉపయోగించిన యెడల యోగరాజగుగ్గులు యొక్క గుణము లనే కలిగియుండును. ఇందు అధికమగు భస్మములు చేరియున్నవి. మిక్కిలి చక్కగ పని చేయును. మరియు ప్రానిపసుపు కషాయముతో మేహములను, గోమూత్రముతో పాండువును, తేనెతో మేదోవృద్ధిని, వేపచెక్క కషాయముతో కుష్ఠమును, తిప్పతీగ కషాయముతో వాతరక్తమును, పిప్పళ్ల కషాయముతో నంజును, శూలను పొదిరివేళ్ల కషాయముతో ఎలుకవిషమును, త్రిఫలా కషాయముతో దారుణమైన నేత్రవ్యాధులను హరింపజేయును. స్త్రీలయొక్క ఆర్తనదోషములను గర్భాశయ దోషములను హరిం చును. మోతాదు 1-2 మాత్రలు.

## రాస్నాది గుగ్గులు (యో.ర.)

ద్రవ్యములు : శుద్ధ గుగ్గులు, రాస్నా.

గుణము : గృధ్రసీవాత హరము

అనుభూత ప్రయోగములు : ఆమవాతము, సంధివాతము (కీళ్ళనొప్పులు), శిరో వ్యాధులు, నాడీవ్రణములందు గుణకారి.

1. గృధ్రవాతమునందు బృహత్‌వాత చింతామణితో ఇచ్చిన ఉపయోగకరము.

2. బహుమూత్రమునందు శతావరీ చూర్ణము, అశ్వగంధలేహ్యములతో ఇచ్చిన ఉపయోగకరము.

3. దాహమునందు ఉశీరాసవము, అమృతారిష్టల అనుపానముతో వాడుచూ, తిప్పసత్తు 2 గ్రా. చొప్పున 3 సార్లు రోజునందు సేవించిన దాహము తగ్గును.

పథ్యము : గోధుమలు, యవలు, ఉలవలు, పెసలు, మజ్జిగ.

అపథ్యము : చేపలు, ఇంగువ, నూనె పిండివంటలు, వెల్లుల్లి, ఆవాలు, నువ్వులు.

మోతాదు : 1–2 మాత్రలు పాలు లేదా రాస్నాది క్వాథముతో రోజుకు రెండు, మూడుసార్లు ఖాళీ కడుపున సేవించవలెను.

లభ్యము : 25 మాత్రలు

## సింహనాద గుగ్గులు (భై.ర.)

ద్రవ్యములు : శుద్ధ గుగ్గులు, ఆవనూనె, త్రిఫలములు, త్రికటుకములు, తుంగ ముస్తలు, వాయు విడంగాలు, దేవదారు, తిప్పతీగ, చిత్రమూలము, తెల్లతెగడ, నేపాళ వేళ్లు, చవ్యము, కంద, మానకందము, శుద్ధపాదరసం, శుద్ధగంధకం, శుద్ధనేపాళ విత్తులు.

గుణము : పాచకాగ్నిని పెంపొందించును. ధాతు, బలవృద్ధి కరము, ఆమ వాతము, శిరోగత వాతరోగము, సంధిరోగ వాతరోగము, జాను, జంఘాగత వాతము, కటిగ్రహ, అశ్మరి, మూత్రకృచ్ఛ్రము, భగ్న, తిమిర, ఉదరరోగము, ఆమ్లపిత్తము, కుష్ఠము, ప్రమేహము, గుదభ్రంశము, 5 రకముల కాసలు, శ్వాస, క్షయ, విషమ జ్వరము, ప్లీహవృద్ధి, శ్లీపదము, గుల్మము, పాండువు, కామల, శోథ, అంత్రవృద్ధి, శూల, సర్వవిధముల అర్శస్సు వీనిని హరింపజేయును. అమృత తుల్యమగు ఈ ఔషధము మేదోవృద్ధి, కఫవృద్ధి, ఆమదోషములను నివర్తించును.

అనుభూత ప్రయోగములు : మేదోవృద్ధినందు త్రికటు చూర్ణము,

తేనెలతో వాడిన స్థౌల్య హరమగును.

2. ఆమవాతమునందు (స్థౌల్యముతో కూడిన) మహాయోగరాజగుగ్గులతో దశ మూలారిష్ట అనుపానముగానిచ్చిన వాపు, నొప్పి తగ్గును.

3. శ్లీపదమునందు సుదర్శన చూర్ణము, నిత్యానందరసలతో వాడిన శోథ యొక్క వేగము తగ్గును.

పథ్యము : కొరలు,జొన్నలు, యవలు, ఉలవలు, తేనె, చేపలు, వేగించిన వంకాయ, ఆకుకూరలు, తేలికగా జీర్ణమగు ఆహారము.

అపథ్యము : మధురాన్నము, చెరకురసముతో చేయబడిన అన్నము, మినుములు, మాంసము, సుఖము, దివానిద్ర (పగటినిద్ర)

అనుపానము : గోరువెచ్చని నీరు, సుర, సౌవీరము.

మోతాదు : 1-2 మాత్రలు రోజుకు రెండుసార్లు ఖాళీ కడుపున సేవించవలెను.

లభ్యము : మాత్రలు

## త్రిఫల గుగ్గులు

ద్రవ్యములు : శుద్ధ గుగ్గులు, త్రిఫలములు

గుణము : బాధాకర, పక్వమైన, స్రాపయుక్త, దుర్గంధిత, శోధయుక్త వ్రణములను రోపణము చేయును.

ఇది 1. తుంగగడ్డల కషాయముతో భగందరము, వ్రణములు, నోటిపూత, నేత్ర వ్యాధులు 2. సుగంధిపాల కషాయముతో ప్రమేహములు, శుక్లనష్టములు, కుష్ఠములు, ఆమవాతము, ప్రదరవ్యాధులు, బొల్లి, సెగవ్యాధులు మొదలగువాటిని నశింపచేయును. మోతాదు 1 మొ।। 2 మా।।వరకు.

అనుభూత ప్రయోగములు :

1. భగందరము, గుల్మము, శోథ, మలబద్ధము, మూలవ్యాధి, జలోదరము మొదలగు వానిని హరించును.

2. పూయవ్రణములందు త్రిఫల కషాయముతో పరిషేకము చేయుచూ, కాంచనా రగుగ్గులు, త్రిఫలగుగ్గులు, ఒక్కొక్కటి చొప్పున భోజనానంతరము సేవించిన స్రావము తగ్గి రోపణము జరుగును.

3. తుండికేరినందు త్రిఫల కషాయముతో రోజునకు 5 పర్యాయములు పుక్కిలించుచూ కైశోర గుగ్గులు, త్రిఫలగ్గులు, కాంచనార గుగ్గులు ఒక్కొక్కటి చొప్పున పగలు, రాత్రివాడిన శోధ తగ్గును.

4. దంత శూలనందు కాంచనార గుగ్గులతో వాడిన శూల తగ్గును.

పథ్యము : గోధుమలు, మసరలు,పెసలు, తేనె, పొట్లకాయ, బీరకాయ లేత ముల్లంగి.

అపథ్యము : పెరుగు, పాలు, పులుసు, శీతలము, ఉప్పు, ఇవి గల రసములు, శ్రమ, జాగరణము

మోతాదు : 1-2 మాత్రలు రోజుకు రెండుసార్లు ఖాళీకడుపున సేవించవలెను.

లభ్యము : మాత్రలు

## యోగరాజ గుగ్గులు

వీనిని వేడినీటితో నుపయోగించిన యెడల సమస్తమగు వాతవ్యాధులు, శుక్ల నష్టము, భగందరము, రక్తస్రావము, సవాయివ్యాధులు, సెగవ్యాధులు, వ్రణములు, అతిసారము, రక్తార్శస్సు, గ్రంథులు, ఆమవాతము, అగ్ని మాంద్యము గుల్మములు, జలుబు, ఒడలునొప్పులు, కీళ్లనొప్పులు, ఉదరవ్యాధులు, అతిమూత్రము, మొదలగు వానిని హరింపజేయును. రక్తశుద్ధిని చేయును. మోతాదు 1-2 మాత్రలు.

# ఘృతములు

## అమృతప్రాశఘృతము

200 గ్రా. జీవనీయగణం. శుంఠి, శతావరి, గలిజేరు అతిమధురం.

5-10 గ్రా. వేడిపాలతో – కాసం, శుక్రక్షయం, రక్తపిత్తం, నరముల బలహీన తను పోగొట్టును. ఇది రసాయనము, బల్యము మాంస వృద్ధికరముగా పనిచేయును.

## అర్జున ఘృతము

దీనిని 1/4 మొ॥ 1/2 తు. వరకు ఆవుపాలతో సేవించిన యెడల గుండెదడ, గుండెనొప్పి, గుండెశూల, గుండెబలహీనముగనుండుట మొదలగు సమస్తమగు గుండె వ్యాధులును నశించును. శరీరమునకు పుష్టికలుగును.

## అశోకఘృతము

200 గ్రా. అశోక,జీలకర్ర, గుంటగలగర రసం, జీవనీయగణం, మేకపాలు, శతావరి

5-10 గ్రా. వేడినీళ్ళతో/వేడిపాలతో : శ్వేతప్రదరం, రక్తప్రదరం, రజ:శ్శూల, ఋతు బద్ధకములను తొలగించును. గర్భాశయమును శుద్ధి చేయును. బల్యముబృంహణము, రసాయనము.

## అశోకఘృతము

మోతాదు 1/4 మొ॥ 1/2 తు. వరకు దీనిని కేవలము సేవించిన యెడల శ్వేతరక్త ప్రదరములు, ఋతుశూల, ఋతురక్తమునరిగ వెడలకుండుట, యోని స్రావములు, యోనిశూల వంధ్యాదోషములు, రక్తగుల్మము మొదలగునవి హరించును. ఇది గర్భాశయ వ్యాధులను నశింపచేసి సత్సంతానమును కలిగించును.

## అశ్వగంధ ఘృతము

దీనిని 1/4 మొ॥ 1/2 వరకు ఆవుపాలతో సేవించిన యెడల శరీరమునకు అమితమగుపుష్టి కలుగును. శుక్రము తక్కువగ నున్న వారలకు మిక్కిలి శ్రేష్ఠమైనది. ధాతుక్షయ, క్షయ, ఉరఃక్షతము, వంధ్యాత్వము, వీనిని నశింపజేయును.

## బ్రాహ్మీఘృతం (భై.ర.)

ద్రవ్యములు : గోఘృతము, సరస్వతీ ఆకు స్వరసం, వస, చెంగల్వకోష్టు, శంఖపుష్పి.

గుణము : జ్ఞాపకశక్తిని వృద్ధిచేయును. అపస్మారము, ఉన్మాదము, గ్రహరోగము లను హరింపజేయును.

అనుభూత ప్రయోగములు : 1. మేధ్యము, రసాయనము, బృంహణము, స్మృతి, బుద్ధిప్రదము. మాటలు సరిగ్గా రానివారికి, స్వరమునరిగా లేనివారికి ఉపయోగకరము.

2. జ్ఞాపక శక్తికై సారస్వతారిష్ట, బ్రాహ్మీ తైలములతో ఇవ్వవలెను.

3. అపస్మారమునందు రసరాజరస, బ్రాహ్మీవటిలతో ఇచ్చిన వ్యాధి యొక్క వేగము తగ్గును.

4. మానసిక దౌర్బల్యమునందు అశ్వగంధ కలిపివాడిన

ప్రయోజనముండును.

పథ్యము : గోధుమలు, మినుములు, పాలు, చేదుపొట్ల, ద్రాక్షపండ్లు, ఉసిరికాయలు.

అపథ్యము : మద్యము, చేపలు, విరుద్ధాన్నములు.

మోతాదు : 5–10 గ్రా. రోజుకు రెండుసార్లు భోజనమునకు ముందు వాడ వలెను.

లభ్యము : 100 గ్రా.

## బ్రాహ్మీ సారస్వతఘృతము

మోతాదు 1/4 మొ॥ 1/2 తు. వరకు దీనిని ఆవుపాలతోగాని, కేవలముగాని సేవించిన యెడల ఉన్మాదము, బుద్ధిమందముగ నుండుట అపస్మారము మూర్ఛ, జ్ఞాపకశక్తిసరిగ లేకుండుట మొదలగు మెదడువ్యాధులును పైత్య సంబంధమగు వ్యాధులును వేడి సంబంధమగు వ్యాధులును నశించును. దీని సేవనచే ధారణశక్తియు శరీరకాంతియు వాక్సుద్ధియు, కిన్నర కంఠస్వరమును బలమును శుక్రబలమును కలుగును. త్వరలో మాటలు రాని పిల్లలకు దీనినుపయోగించుట మిక్కిలి శ్రేష్ఠము.

## కల్యాణ ఘృతము

మోతాదు 1/4 మొ. 1/2 తు. వరకు ఆవుపాలతో సేవించిన యెడల గర్భాశయ దోషములును, ఋతు దోషములును నశించి సత్సంతానము కలుగును. గర్భస్రావము, ప్రదరములు ఇవి నశించును. దివ్యమైన పుత్రులు కలుగుదురు.

## పంచగవ్య ఘృతము

మోతాదు 1/4 మొ॥ 1/2 తు. వరకు దీనిని పంచదారతో కలిపి సేవించిన యెడల అపస్మారము ఉన్మాదము, మూర్ఛ, మొదలగునవి నశించును.

## పంచతిక్త ఘృతం (భై.ర.)

ద్రవ్యములు : గోఘృతము వేపపట్ట, చేదుపొట్ల, వాకుడు సమూలము, తిప్పతీగ, అడ్డసరము, త్రిఫలములు.

గుణము : సర్వవిధములగు కుష్ఠములు, 80 రకముల వాత వికృతులు, 40 రకముల పిత్తరోగములు, 20 రకముల ప్రమేహములు,

దుష్టవ్రణములు, క్రిమిజన్య రోగములు, అర్శస్సు, పంచవిధకాసలు హరించి పోవును.

అనుభూత ప్రయోగములు : రక్తమును శుభ్రపరచి, రక్తదోషములను హరిం చును. సర్వ చర్మరోగములందు గుణకారి.

1. పిత్తరోగములందు పంచతిక్తారిష్ట, తేనెలతో వాడిన ఫలితముండును.

2. ప్రమేహములందు లక్షణానుసార చికిత్స చేయుచూ ఈ ఘృతము భోజనా నంతర మిచ్చిన ప్రయోజనముండును.

3. దుష్టవ్రణములందు బాహ్య ప్రయోగమునకు, అభ్యంతర ప్రయోగమునకు (లోనికి) ఇచ్చిన త్వరితగతిన రోపణము జరుగును.

పథ్యము : బీరకాయ,పొట్లకాయ,చుక్కకూర,ద్రాక్షపండ్లు, నేరేడుపండ్లు, ఉసిరిక.

అపథ్యము : బఠాణీలు, వేరుశనగపప్పు, ఎండుచేపలు, గురుత్వపదార్ధములు.

మోతాదు : 6గ్రా. నుండి 12గ్రా. రోజుకు రెండుసార్లు భోజనమునకు అరగంట ముందు తీసికొనవలెను.

లభ్యము : 100 గ్రా.

## పంచతిక్త గుగ్గులుఘృతము

మోతాదు 1/4 మొ॥ 1/2 తు. వరకు త్రిఫలాకషాయముతోగాని కేవలము గాని సేవించిన యెడల రక్తదోషములు, అష్టాదశకుష్టములు, జీర్ణించిన వాయువ్యాధులు, జీర్ణ జ్వరము, భగందరము, గండమాల, నాడీ వ్రణము, ప్రమేహములు, విద్రధి, వాతరక్తము, వ్రణములు, కంఠవ్యాధులు, మొదలగునవి నశించును.

## త్రిఫల ఘృతం (భై.ర.)

ద్రవ్యములు : గోఘృతము, త్రిఫలములు, ఆవుపాలు, త్రికటుకములు, ఎండు ద్రాక్ష, అతిమధురము, కటుకరోహిణి, తెల్లతామర, చిన్నయాలకులు, వాయు విడంగ ములు, నాగకేసరములు, నల్లకలువ, సుగంధిపాల,నల్లతీగ, శ్వేతచందనము, పసుపు, మానుపసుపు.

గుణము : నేత్రరోగహరము,తిమిర, నేత్రస్రావము, కామిల, కాచ,

అర్బుదం, విసర్పి, ప్రదరము, కండు, రక్తస్రావము, శోథ, ఖాలిత్యము, ఫలితము, కేశములు రాలుట, విషమజ్వరము, సర్వవిధముల అర్మము, శుక్లము మరియు అన్ని విధముల నేత్రరోగములు, వర్మరోగమును నివర్తించును.

దీనిని 1/4 తు. మొ. 3/4 తు. వరకు పంచదారతోగాని పాలతోగాని కేవలముగ గాని సేవించినయెడల నీళ్లుకారుట, ఎఱ్ఱగనుండుట, మండుట, పుసికట్టుట, వెలుతురును చూడనివ్వకుండుట, మసకగనుండుట, పొరకమ్ముట మిక్కిలి శ్రేష్ఠమైన దని ఆయుర్వేదమునందు స్పష్టముగ చెప్పబడినది ప్రదరములు, రక్తదోషములు, వెంట్రుకలు నెరయుట, విసర్పము వీరిని కూడ నశింపజేయును.

అనుభూత ప్రయోగములు :

1. అన్నిరకముల నేత్రరోగములందు చంద్రప్రభా వటి, నారికేళాంజనములతో ఈ ఘృతమునిచ్చిన ప్రథమ చికిత్సజరుగును.

2. అభిష్యందము నందు నారికేళాంజనము బాహ్య ప్రయోగమునకై వాడుచూ ఈ ఘృతము నిచ్చిన తగ్గును.

3. రక్తస్రావమునందు రక్తస్థంభక ద్రవ్యములైన లోధ్రవంటి వానితో ఈ ఘృత మును ప్రయోగించిన రక్తస్రావము క్రమముగా తగ్గును.

పథ్యము : పొన్నగంటికూర, నేతితో వేయించిన కూరలు, తేనె, గుంటకలగరాకు కూర.

అపథ్యము : ఇంగువ, కల్లు, పిండివంటలు, తాంబూలము.

మోతాదు : 5-10 గ్రా. రోజుకు రెండుసార్లు భోజనమునకు ముందు సేవించ వలెను.

లభ్యము : 100 గ్రా.

**బృహచ్ఛాగల్యాది ఘృతము (భై.ర.)**

200 గ్రా. అజమాంసం, దశమూలములు, అశ్వగంధ, బలా, శతావరి.

5-10 గ్రా. వేడినీళ్ళతో / వేడిపాలతో - రసాయనం, బల్యం, కార్శ్యము, క్షయం, వాతపిత్త హరము.

### దాడిమాది ఘృతం (అ.హృ)

200ఎం.ఎల్. దాడిమ, ధనియాలు, చిత్రకం, పిప్పలి

5–10 గ్రా. వేడినీళ్ళతో/వేడిపాలతో – అర్శస్సు, గుల్మం, ప్లీహ వ్యాధులు, ఊపిరితిత్తులు, జీర్ణకోశ సంబంధ వ్యాధులు.

### ధన్వంతరి ఘృతం (అ.హృ)

200 ఎం.ఎల్. దశమూలములు, కాశ్మరీ, బిల్వ, చిరుబొద్ది, శోన్యాక, నెల్లిచెట్టు.

5–10 గ్రా. వేడినీళ్ళతో / వేడి పాలతో – పాండు,గుల్మం,ప్రమేహం, శోఫం,గర, విష, ఉదర రోగములను హరించును. కుష్ఠ, ఉన్మాద, అపస్మార రోగములనుకూడ నశింపచేయును.

### ధాత్ర్యాది ఘృతం ( స.యో)

200 గ్రాములు. ధాత్రి, విదారి, చెరుకు, శతావరి

5–10 గ్రా. వేడినీళ్ళతో/వేడిపాలతో – శ్వేతప్రదరం, రక్తప్రదరం, పాండు, మధాత్యయం వంధ్యత్వము, మూర్ఛలను హరించును.

### గుగ్గులు తిక్తఘృతం (అ.హృ)

200 ఎం.ఎల్. వేప, గుడూచి, చేదుపొట్ల, వాకుడు, మహిసాక్షి, గుగ్గులు.

5–10 గ్రా. వేడి నీళ్ళతో / వేడిపాలతో – సంధి, అస్థి, మజ్జాగత కుష్ఠరోగ ములు, భగందరము గుల్మము, రాజయక్ష్మ గండమాల, నాడీవ్రణములను హరించును.

### ఇందుకాంత ఘృతము (అ.హృ)

200 ఎం.ఎల్ –నేతికానుగ, దేవదారు, దశమూలములు పిప్పళ్లు, చవ్యం, చిత్రమూలము, శొంఠి.

5–10 గ్రా. వేడినీళ్ళతో / కషాయంతో – ఆమ్లపిత్తం, ఉదరశూలం, వాతరోగ ములు, గుల్మంలను శమింపచేయును. బలమును వృద్ధిచేయును.

### జాత్యాది ఘృతము (అ.హృ)

200 ఎం.ఎల్. జాజిమల్లి, ఆకులు, మోదుగాకులు, కటుకరోహిణి, గరిక, పసుపు.

పైపూతకి – వ్రణములను హరింపచేయును.

## కళ్యాణక ఘృతము (అ.హృ)

200ఎం.ఎల్. త్రిఫల, చేదుపుచ్చ, తుంగముస్తలు, సుగంధపాల వేళ్ళు, దేవదారు, పద్మకాష్ఠము చందనము.

5-10 గ్రా. వేడినీళ్ళతో / కషాయం - ఉన్మాద, అపస్మారం, పాండు, కుష్ఠ, విషదోష, గ్రహపీడ, బుద్ధిమాంద్యము, జ్వరం, వంధ్యత్వములను హరించును.

## మహాకళ్యాణక ఘృతము

200 ఎం.ఎల్. సుగంధపాల, శతావరి, మేధ, మహామేధ, కాకోలీ, క్షీరకాకోళి

5-10 గ్రా. వేడినీళ్ళతో / కషాయంతో : ఉన్మాద, అపస్మారం, పాండు, కుష్ఠ, విషదోష, గ్రహపీడ బుద్ధిమాంద్యము, జ్వరం, వంధ్యత్వములను హరించును. ఇది కళ్యాణకఘృతముకంటె అధికగుణకారి.

## మహాతిక్తఘృతము (అ.హృ)

200 ఎం.ఎల్. - ఏడాకుల పొన్న, పర్పాటకము, కటుక రోహిణి, రేలచెక్క, త్రిఫల, పుసుపు, మానిపసుపు, వేపచెక్క భూనింబ.

5-10 గ్రా. వేడినీళ్ళతో/కషాయంతో - చర్మరోగములు, కుష్ఠము,కామల, అపస్మారం,మొలలు, విస్ఫోటములను నశింపచేయును.

## మిశ్రక స్నేహము

200ఎం.ఎల్ - పాలు, ఆముదము, నెయ్యి

5-10 గ్రా. వేడినీళ్ళతో / కషాయంతో - వృద్ధి, కణుతులు, వాత వ్యాధులు.

## పంచగవ్య ఘృతము (అ.హృ)

200 ఎం.ఎల్. దశమూలములు, పెగ్గుమ్మడు, బిల్వ, చిరుబొద్ది, మంజిష్ట, ద్రాక్ష.

5-10 గ్రా. వేడినీళ్ళతో / కషాయంతో - జ్వరం, అపస్మారం, భగంధరం, అర్శస్సు, కామల, పాండు, కాసం, గుల్మంలను హరించును.

## పటోలాది ఘృతము

200 ఎం.ఎల్. పటోల,వేప, కటుకరోహిణి, మానిపసుపు,వట్టివేళ్ళు, త్రిఫల

5-10 గ్రా. వేడినీళ్ళతో / కషాయంతో - నాసా కర్ణ, నేత్రరోగములు హరిం చును. దుష్టవ్రణములు, కుష్టము, విసర్పములను నశింపచేయును.

**ఫలసర్పి**

200 ఎం.ఎల్ - మంజిష్ఠ, చంగల్వకోష్ఠం, గ్రంధితగరం, త్రిఫల

5-10 గ్రా. వేడినీళ్ళతో / కషాయంతో - యోని, శుక్రదోషములు, ప్రదరంలను నశింపచేయును. గర్భకరము గర్భిణులకు బల్యము.

**రాస్నదశమూలాది ఘృతము (అ.హృ)**

200ఎం.ఎల్. రాస్న, దశమూలములు, పెగ్గుమ్ముడు, బిల్వ, చిరుబొద్ది.

5-10 గ్రా. వేడినీళ్ళతో/కషాయంతో - వాత వ్యాధులందు ఉత్తమము.

**సారస్వత ఘృతము (అ.హృ)**

200 ఎం.ఎల్ - కరక్కాయ, పిప్పళ్ళు, శుంఠి, మిరియాలు, చిరుబొద్ది, మునగ వేరు, వస

5-10 గ్రా. వేడినీళ్ళతో/కషాయంతో - వాక్శుద్ధిని కలిగించి, మేధాశక్తిని, జీర్ణశక్తిని పెంచును.

**శతావర్యాది ఘృతము**

200 గ్రాములు. శతావరి, విదారి, గోక్షూరం, పాలు

5-10 గ్రా. వేడినీళ్ళతో / కషాయంతో - మూత్రకృచ్ఛ్రము, మూత్రము పోయు నప్పుడు మంట, ప్రదరం, సోమరోగం, యోనిదోషం, రక్తపిత్తంనందు హితము.

**మహాపైశాచిక ఘృతము**

200 ఎం.ఎల్.-జటామాంసి, ఉసిరిక, వస, కటుకరోహిణి, కాకోళి, ప్రసారిణి, గుగ్గిలము, గుడూచి మొ॥

5-10 గ్రా.వేడినీళ్ళతో కషాయంతో - బుద్ధి, జ్ఞాపకశక్తిని పెంపొందించును. బాలురు సేవించిన శరీరదారుఢ్యము పెంపొందును.

**సుకుమార ఘృతము (అ.హృ)**

200 ఎం.ఎల్. గలిజేరు, దశమూలములు, పెగ్గుమ్ముడు, బిల్వ, చిరుబొద్ది.

5-10 గ్రా. వేడినీళ్ళతో / కషాయంతో - గుల్మం,మలబంధకము, అర్శస్సు, యోని రోగములు, వృద్ధిలను శమింపజేయును.

**తిక్తక ఘృతము (అ.హృ)**

200 ఎం.ఎల్. చేదుపొట్ల, వేప, కటుకరోహిణి, మానుపసుపు.

5-10 గ్రా. వేడినీళ్ళతో / కషాయంతో - చర్మరోగములు, కుష్ఠం, దురదలు, పాండు, గజ్జి,రక్తార్శస్సు, భగంధరము,కామల, ఉన్మాదము అపస్మారములను హరించును.

**వస్త్యామయాంతక ఘృతము (స.యో)**

200 ఎం.ఎల్. మానిపసుపు, ఇప్పపువ్వు, మెట్టతామర, కొండపిండి, ద్రాక్ష, మధుయష్టి, కొలపొన్న ముయ్యాకుపొన్న.

5-10 గ్రా. వేడినీళ్ళతో / కషాయంతో - మూత్ర సంబంధరోగములు, అశ్మరీ ప్రమేహము, మేహరోగములు, వస్తిగత రోగములు శమించును.

**వరుణాది ఘృతము**

200 ఎం.ఎల్. వరుణ, ఆముదపువేరు, ఇంద్రవల్లి, కరక్కాయ, బొడతరము, గచ్చవేళ్ళు,చిత్రమూలము.

5-10 గ్రా. వేడినీళ్ళతో / కషాయంతో - వృద్ధి, ఉదర రోగములు హరించును.

**విధార్యాది ఘృతము (అ.హృ)**

200 ఎం.ఎల్. విదారి, ఆముదపువేరు, తేలుమణి చెట్టు గలిజేరు, దేవదారు, హంసపాది.

5-10 గ్రా. వేడినీళ్ళతో / కషాయంతో - శ్వాసకాసం, హృద్రోగములు, కృశ త్వము, కీళ్ళనొప్పులు, దగ్గు లందు శ్రేష్ఠము.

**శతధౌత ఘృతము**

10 గ్రా. తుమ్మచెక్క ఘృతము

చర్మంపైన రాయుటకు - విసర్ప, గజ్జి, తామర, శరీరదాహములను తగ్గించును..

## తైలములు

తైలములను సామాన్యముగ నుపయోగించు పద్ధతి.

తైలములను బాధకల ప్రదేశమునందు రోజుకు 2-3సార్లు 10-25 నిమిషముల చొప్పున అనవసరమైనంత తైలమును మర్దన చేయుచు వెంటనే ఆయా కషాయ ములతోగాని విశేషము వేడిగలేని వేడి నీటితోగాని కడగవలయును. కొన్ని వ్యాధుల యందు ఆ చమురు ఇముకుచు యుండునట్లు యుండుటకు గాను కడగకుండ కూడ వుండవచ్చును. ఆమవాతము మొదలగు కొన్ని వ్యాధులయందు విశేషము నొక్కి మర్దించిన యెడల పచ్చి చేసి వ్యాధి యెక్కువ కావచ్చును. అట్టి వ్యాధుల యందు సామాన్యముగ పూయుటయే శ్రేష్టము. కొన్ని వ్యాధుల యందు తైలములను మర్దన చేయుచు లోనికి ఆయా మందులను పుచ్చుకొనవలసి యుండును. తైలమును లోనకు సేవించు పద్ధతి విశేష సంప్రాదాయముగ లేదు.

### అణుతైలము

25 ఎం.ఎల్. జీవంతి, దేవదారు, లవంగపట్ట, రక్త చందనము, మానుపసుపు.

నస్యమునకు - కర్ణ,నాసా,శిరోరోగములందు ఉపయోగము.

### అరిమేదస్ తైలము (బిగ్)

200 ఎం.ఎల్. అరిమేద, ఏలకులు, లవంగపట్ట, పత్ర, అతిమధురం, మంజిష్ట

తలపై రాయుటకు, పుక్కిలించుకు - పంటినొప్పులు, నోటిపూతలు, చిగుళ్ళ వాపులందు పుక్కిలిపట్టుటకు వాడుదురు.

### అమృతామలక తైలము (స.యో)

ఇది భృంగామలక తైలము యొక్క గుణములనే కలిగియుండును. కాని ఇందు చలువచేయు వస్తువు లధికముగ చేరును. కాన దానికంటె నధికమగు చలువను చేయును బహుచక్కగ పనిచేయును.

### అమృతాది తైలము (స.యో)

200 ఎం.ఎల్. అమృత, ఏలాది గుణం

శరీరముపైన రాయుటకు - ఆమవాతము, వాపులు, గడ్డలను నశింపచేయును.

### అర్క క్షీర తైలము

దీనిని మర్దించుటచే పక్షవాతము, ఆర్దితవాతము, సంధివాతము, కంపవాతము, సర్వాంగవాతము, మొదలగు ఎనుబది వాతములును హరించును.

### అసన ఏలాది తైలము (స.యో)

200 ఎం.ఎల్. అసన, బిల్వ, బలా, గుడూచి

తలపై రాయుటకు - తలనొప్పి, జలుబు, చెవిరోగములందు ఉపయోగము.

### అసనమంజిష్ఠాది తైలము (స.యో)

200 ఎం.ఎల్. అసన, బిల్వమూలం, బలా, కురున్ తొట్టివేర్, మంజిష్ఠ, శారిబ

తలకి-కంటి శుక్లములు, కంటి, చెవి, తల రోగములందు

ఉపయోగము.

### అసన ఏలాది కోకోనట్ ఆయిల్ (స.యో)

200 ఎం.ఎల్. అసన, బిల్వమూలం, బలా, కురున్‌తొట్టి

తలకి - కంటి శుక్లములు, కంటి,చెవి, తల రోగములందు

ఉపయోగము.

### అసనవిల్వాది తైలము (స.యో)

200 ఎం.ఎల్. అసన, శొంఠి, బిల్వమూలం, బలా, మధుయష్ఠి, కురున్‌తొట్టి వేరు.

తలకి - తలకు, చెవులకు, కళ్ళకు సంబంధించిన రోగములందు శ్రేష్ఠము.

### బలా అశ్వగంధాది (లాక్షాది) తైలం (స.యో)

200 ఎం.ఎల్. బలా, అశ్వగంధ, లాక్ష, పెరుగు

తలకి వంటికి - సమస్త క్షయవ్యాధులు, వాత వ్యాధులు, దగ్గులను హరించి శరీరపుష్టిని కలుగచేయును.

### బలాశ్వగంధాధి కుజంబు (స.యో)

200 ఎం.ఎల్. బల, అశ్వగంధ, లాక్ష, పెరుగు

శరీరము పైన రాసేది – శరీర దారుఢ్యమును, పుష్టిని కలిగించును. వాత వ్యాధులందు మంచి ఉపయోగము.

**బలా తైలము (అ.హృ)**

దీనిని మర్దించుటచే సంధివాతము, కంపవాతము, పక్షవాతము, ఆక్షేపకవాతము, చచ్చువాతము, మొదలగు వాత వ్యాధులన్నియు నశించును. దీనిని లోపలకు సేవించిన యెడల సూతికావాతము, అంత్రవృద్ధి, ధాతుక్షీణము, వంధ్యాత్వము, శుక్ర దోషములు, ఎక్కిళ్లు, దగ్గుట, మొదలగునవి నశించునని చెప్పబడినది. బల (ముత్తనపులగము) వాతమును హరించుటలోను పుష్టిని కలిగించుటలోను మిక్కిలి శ్రేష్ఠమయినది. వాత వ్యాధులందు శాస్త్రకారులు దీనిని తరుచుగ చెప్పిరి.

25 ఎం.ఎల్. బలా, రాస్నా గుడూచి

శిరోవస్థి నస్యకర్మలకు – అన్ని వాత వ్యాధులందు ఉపయోగము.

**బలాధాత్ర్యాది తైలము (స.యో)**

200 ఎం.ఎల్. బలా, ధాత్రి, తిప్పతీగ, వట్టివేళ్ళు, హ్రీబేర, చందనం

తలకి – శరీర, నేత్ర, శిరో, అక్షిదాహములను, వాత, పిత్త వికారములను శమింపచేయును.

**బలాగుడూచ్యాది తైలము (స.యో)**

200 ఎం.ఎల్. బలా, తిప్పతీగ, చందనం, అతిమధురం

తలకి, వంటికి – వాతవ్యాధులు, శరీర దాహము, నొప్పులు, వాపులు హరించును.

**బలాగుడూచ్యాది కోకోనట్ ఆయిల్ (స.యో)**

200 ఎం.ఎల్. బలా, గుడూచి, దేవదారు, కొబ్బరినూనె

తలకి – వాత వ్యాధులు, శరీర దాహము, నొప్పులు, వాపులు హరించును.

**బలాహఠాది తైలము (స.యో)**

200 ఎం.ఎల్. బలా, తామర, తిప్పతీగ, మినుములు, పెసలు

తలకి – తలనొప్పికి, శిరోరోగముల యందు బాగుగా పనిచేయును.

## బలాహోరాది కోకోనట్ ఆయిల్ (స.యో)

200 ఎం.ఎల్. బలా, తామర, తిప్పతీగ, మినుములు, పెసలు, కొబ్బరినూనె

తలకి – తలనొప్పి యందు, శిరోరోగముల యందు బాగుగ పనిచేయును.

## బ్రాహ్మీ తైలము (ర.సి.ప్ర.సం.)

ద్రవ్యములు : నల్ల నువ్వులనూనె, సరస్వతీ ఆకు స్వరసము, భృంగరాజ స్వరసము, శంఖపుష్పి స్వరసం, మేకపాలు, వస, చెంగల్వకోష్టు, దశమూలములు, ఆముదపు వేరు, నాగకేసరములు, ఆకుపత్రి, రాతిపువ్వు, పచ్చాకు, జటామాంసి, శ్వేత చందనము, మానుపసుపు, తిప్పతీగ, ముత్తవ పులగము.

గుణము : మస్తిష్కమునకు బలము నిచ్చును. దీర్ఘకాలిక ఉన్మాద, అపస్మార రోగములయందు అత్యంత గుణకారి. జ్వరహరము, మేథస్సును, కాంతిని పెంచును.

అనుభూత ప్రయోగములు : మస్తిష్కమునందలి రుగ్మతలను పోగొట్టును. జ్ఞాపక శక్తిని పెంచును. శిరస్సునకు, మెదడునకు, నేత్రములకు చలువ చేయును. శరీర అత్యుష్ణమును శమింపజేయును. జుత్తును నల్లబరచును. కేశవృద్ధిని కలిగించును. తలపోటు, మాడుపోటు, పార్శ్వపు తలనొప్పిని తగ్గించును. శిరస్సునకు క్రమబద్ధముగా రక్తప్రసారమును చేయును.

1. మానసిక దౌర్బల్యము, వయసుతోపాటు వచ్చే తెలివితేటలు రాకపోవుట, మాటలు సరిగా రాకపోవుట వంటి లక్షణములు ఉన్నపుడు బ్రాహ్మీవటి, సరస్వతీ లేహ్యముల నిచ్చుచూ, శిరస్సుకు ఈ తైలాభ్యంగనము చేసిన ఉపయోగముండును.

2. చందనాది వటి, చందనాసనలతో ఇచ్చుచూ, ఈ తైలాభ్యంగనము చేసిన శిరస్సు, నేత్రములకు చలువ నిచ్చును.

3. మస్తిష్కమునకు బలమునిచ్చుటకై అశ్వగంధ లేహ్యము, సారస్వతాది లేహ్యము, అశ్వగంధ చూర్ణములను ఇచ్చుచూ, ఈ తైలాభ్యంగనము చేసిన ఉప యోగ ముండును.

పథ్యము : కందిపప్పు, పెసరపప్పు, మేకమాంసము, పొట్లకాయ,

బీరకాయ,ఉసిరికాయ.

అపథ్యము : మినుములు, ఆవాలు, నువ్వులు, కొత్తబియ్యపు అన్నము, జాగరణము.

ప్రయోగము : నశ్యము, శిరోవస్తి.

లభ్యము : 100 మి.లీ. 200 మి.లీ. 450 మి.లీ.

**భృంగామలక తైలము (వై.చిం.)**

ద్రవ్యములు : గుంటగలగరాకు, ఉసిరిక, నువ్వుల నూనె, అతిమధురము, శ్రీగంధము, చెంగల్వకోష్టు, దుంపరాస్నా, వట్టివేరు, చిట్టాముట్టి, పేరాముట్టి, నాగబల, కచోరములు, పసుపు, లక్క లవంగపుచెక్క, యాలకులు, ఆకుపత్రి,ధనియాలు, సదాపవిత్తులు, పెద్ద సదాప, కురువేరు.

గుణము : తలనొప్పులు, దంతరోగములు, కర్ణరోగములు, విషమ జ్వరములు, క్షయ, అపస్మారము, వాతము, కుష్ఠము శీఘ్రముగా నివర్తించును.

దీనిని శిరస్సుకు మర్దించిన యెడల తలనొప్పి, తలపోటు మొదలగు శిరో వ్యాధులును, కండ్లమంటలు, కండ్లు ఎరుపులు, కండ్లునుండి నీరుకారుట, కండ్లు అంటుకొనుట, కండ్లు సరిగకనబడకుండుట మొదలగు నేత్రవ్యాధులును, చెవిలో పోటు, చెవిలోనుండి చీముకారుట మొదలగు కర్ణవ్యాధులును, ఉన్మాదము, మూర్ఛ, అపస్మారము, జ్ఞాపకశక్తి సరిగలేకుండుట మొదలగు మెదడు వ్యాధులును హరించును. కాళ్ళకు మర్దించిన యెడల కాళ్లుమంటలు తగ్గును. వెంట్రుకలను నల్లగజేసి పట్టుకుచ్చువలె పెంచును. దీనిని ప్రతిదినము నుపయోగించుచు 5-6 రోజుల కొకసారి షీకాయతో తలరుద్దుకొనుచు అభ్యంగనము చేయుటమంచిది.

అనుభూత ప్రయోగములు : శిరస్సునకు, మెదడునకు, నేత్రములకు చలువ చేయును. శరీర అత్యుష్ణమును శమింపజేయును. జుత్తును నల్లబరచును. కేశవృద్ధిని కలిగించును. తలపోటు, మాడుపోటు, పార్శ్వపు తలనొప్పిలను తగ్గించును. శిరస్సు నకు క్రమబద్ధముగా రక్తప్రసారమును చేయును.

1. తలనొప్పి యందు మహాయోగరాజ గుగ్గులు, దశమూలారిష్ట

అనుపానముగా ఇచ్చుచూ, తలపైన చర్మమునకు తగులునట్టుగా ఈ తైలమును మర్దన చేసిన తగ్గును.

2. అపస్మారమునందు రసరాజరస, బ్రాహ్మీవటి, నెర్విటాల్ అనుపానముగా ఇచ్చుచూ, తైలమును తలకు మర్దన చేసిన అపస్మార వేగము క్రమముగా తగ్గును.

3. పిత్తదోషము వలన తల వెంట్రుకలు తెల్లబడినపుడు (అనగా చిన్న వయసు లోనే తెల్లబడుట) పిత్తశామక ద్రవ్యములను ఇచ్చుచూ (ఉదా. తిప్పసత్తు, ఉసిరిక వంటివి) ఈ తైలమును అభ్యంగనము చేసిన తెల్లబడుట తగ్గును.

పథ్యము : చుక్కకూర, పొన్నగంటి కూర, చింతచిగురు, ద్రాక్షపండ్లు, అల్లము, కరివేపాకు.

అపథ్యము : పెరుగు, పాలు, బెల్లము, మాంసము, నూనె ఎక్కువ ఉన్న పదార్థములు.

లభ్యము : 100 మి.లీ. 200 మి.లీ. 450 మి.లీ.

## భృంగరాజ తైలము

దీనిని శిరస్సుయందు మర్దించిన యెడల వెంట్రుకలు వూడిపోవుట, వెంట్రు కలు తెల్లబడుట, వెంట్రుకలు పెరుగకుండుట, వెంట్రుకలు పెళుసుగ నుండుట, బట్టతల, కర్ణ వ్యాధులు, నేత్ర వ్యాధులు, మొదలగునవి నశించును. వెంట్రుకలను నిగనిగ ప్రకాశించుచు కుచ్చువలె నధికముగ పెరుగునట్లు చేయును.

## చందనాది తైలము (భై. ర.)

ద్రవ్యములు : శ్వేతచందనము, గంధబాల, వ్యాఘ్రునఖీ, చెంగల్వకోష్టు, అతి మధురము, పద్మకం, రాతిపువ్వు, మంజిష్ట, దేవదారు, కచ్చూరములు, చిన్న యాల కులు, పూతికరంజము, నాగకేసరములు, ఆకుపత్రి, దాల్చిన చెక్క, లవంగములు, శిలారసము, జటామాంశీ, చలువ మిరియాలు, ప్రియంగు, తుంగముస్తలు, పసుపు, మానుపసుపు, సుగంధిపాల, నల్లసుగంధిపాల, లతాకస్తూరి, అగరు, కంకుమపువ్వు, లాక్షా స్వరసం, వావిలి, నాళుక, నువ్వుల నూనె, పెరుగుతేట.

గుణము : గ్రహరోగములు, అపస్మారము, జ్వరములను నశింపచేయును. శరీర వర్ణమును, బలమును, ఆయువును, పుష్టిని

పెంపొందించును.

దీనిని ఊపిరితిత్తులకును శరీరమంతకును పూసినయెడల రాజయక్ష్మ, దగ్గు, ఆయాసము, కృశించుట, శరీరమెల్లపుడు వెచ్చగ నుండుట, శరీరతాపము మొదలగు నవి నశించును. మరియు రక్తదోషములును, చర్మదోషములును, కృత్రిమ విషమును నశించును. చర్మమునకు మృదుత్వమును, శరీరమునకు కాంతియు, బలమును, కలుగును. శిరస్సునకు మర్ధించిన యెడల నేత్ర వ్యాధులును, శిరో వ్యాధులును, మెదడు వ్యాధులును నశించును. వెంట్రుకలు మృదుత్వమును నలుపును కలిగి కుచ్చువలె నతిదీర్ఘముగ పెరుగును. కాళ్ళకుమర్ధించిన యెడల కాళ్ళమంటలు నశించును.

అనుభూత ప్రయోగములు : శిరస్సునకు, మెదడునకు నేత్రములకు చలువ చేయును. శరీర అత్యుష్ణమును శమింపచేయును. జుత్తును నల్లబరచును. కేశవృద్ధిని కలిగించును. తలపోటు, మాడుపోటు, పార్శ్వపు తలనొప్పులను తగ్గించును. శిరస్సు నకు క్రమబద్ధముగా రక్తప్రసారమును చేయును.

1. గ్రీష్మ ఋతువునందలి తాపమును ఎదుర్కొనుటకై మాదీఫల రసాయనమును సేవించుచూ ఈ తైలమును శరీరమంతయు అభ్యంగనము చేసుకొంటూ మాడునకు బాగుగా తగులునటుల రాసుకొనిన ఉపయోగకరము.

2. జ్వరాంకుశ రస, అమృతారిష్ట అనుపానములతోనిచ్చుచూ ఈ తైలాభ్యంగ నము చేసిన, జ్వర వేగము తగ్గును.

3. కుంకుమపువ్వు చందనాదివటి, నాగకేసరములు వీనిని చందనాసవతో తీసుకొనుచూ ఈ తైలమును అభ్యంగనము చేసిన శరీర వర్ణము పెంపొందును.

పథ్యము : దానిమ్మ, వెలగ, నిమ్మ, పుల్లదబ్బ, చింతకాయలు, తేనె, తేలికగా జీర్ణమగు ఆహారము.

అపథ్యము : గోధుమలు, వేరుశనగపప్పు, శనగపప్పు, జీడిమామిడి, పెరుగు, పాలు.

లభ్యము : 100 మి.లీ. 200 మి.లీ. 450 మి.లీ.

### చించాది తైలము

200 ఎం.ఎల్. చింతాకులు, మునగ, సర్జరసం, లవణములు.

శరీరమునకు సర్వాంగ వాతములను పోగొట్టును.

### చంపురత్యాది కోకోనట్ ఆయిల్ (స.యో)

200 ఎం.ఎల్. మందారాకులు, బిల్వ ఆకులు, నాగవల్లిక, నీల, కృష్ణతులసి, పారంతి, వాసిని

తలకి – శరీరమునకు – చిన్నపిల్లలకు వచ్చు గజ్జి, దురద, మొదలగు చర్మ వ్యాధులందు సమర్ధవంతమైనది.

### ధన్వంతరం కుజంబు నెం.1 (అ.హృ)

100,200,450 ఎం.ఎల్. బలా, యవలు, రేగుగింజలు, ఉలవలు, దశ మూలములు, అష్టవర్గములు, అశ్వగంథ, శతావరి, ఆముదము, ఆవునెయ్యి.

శరీరమునకు – పక్షవాతం, కీళ్ళవాతము, హెర్నియా, అస్థిభగ్నం అస్థిస్థానభ్రంశం గర్భిణీలకు, బాలింతలకు ఉత్తమమైనది.

### ధన్వంతరం తైలము (అ.హృ)

200,450 ఎం.ఎల్. బలామూలం, యవలు,రేగుగింజలు, ఉలవలు, దశ మూలములు, అష్టవర్గం, అశ్వగంధ, శతావరి, నువ్వుల నూనె.

శరీరమునకు తలకి – శరీర అభ్యంగనమునకు, కండరముల నొప్పులకు, అలసట తగ్గించుటకు, బాలింతలకు, పిల్లలకు, వాత వ్యాధులందు ఉపయోగించ తగినది.

### ధన్వంతరం(101)

10/25 ఎం.ఎల్. బలామూలం, యవలు, రేగు గింజలు, ఉలవలు, దశమూల ములు, అష్టవర్గం, అశ్వగంధ, శతావరి, నువ్వులనూనె.

5–10 చుక్కలు లోపలికి తీసుకొనవలెను. పక్షవాతం, కీళ్ళవాతము, హెర్నియా, అస్థిభగ్నం, అస్థిస్థాన భ్రంశం, గర్భిణీలకు, బాలింతలకు ఉత్తమమైనది. ఇది (101) సార్లు కాచి తయారు చేయబడినది.

### ధన్వంతరం (3)

200 ఎం.ఎల్. బలామూలం, యవలు, రేగు గింజలు, ఉలవలు, దశమూల ములు, అష్టవర్గం, అశ్వగంధ, శతావరి, నువ్వుల నూనె.

శరీరమునకు – పక్షవాతం, కీళ్ళవాతము, హెర్నియా, అస్థిభగ్నం, అస్థిస్థాన భ్రంశం, గర్భిణీలకు, బాలింతలకు ఉత్తమమైనది. ఇది (3)సార్లు కాచి తయారు చేయబడినది.

**ధన్వంతరం (7)**

50 ఎం.ఎల్. బలామూలం, యవలు, రేగు గింజలు, ఉలవలు, దశమూల ములు, అష్టవర్గం, అశ్వగంధ, శతావరి, నువ్వుల నూనె.

శరీరమునకు – పక్షవాతం, కీళ్ళవాతము, హెర్నియా, అస్థిభగ్నం, అస్థిస్థాన భ్రంశం, గర్భిణీలకు, బాలింతలకు ఉత్తమమైనది. ఇది (7) సార్లు కాచి తయారు చేయబడినది.

**ధన్వంతరం మోజుపాకం (అ.హృ)**

200 ఎం.ఎల్. బలామూలం, యవలు, రేగు గింజలు, ఉలవలు, దశమూల ములు, అష్టవర్గం, అశ్వగంధ, శతావరి, నువ్వుల నూనె.

వస్తి కొరకు – పక్షవాతం, కీళ్ళవాతము, హెర్నియా, అస్థిభగ్నం, అస్థిస్థాన భ్రంశం, గర్భిణీలకు, బాలింతలకు ఉత్తమమైనది. మైనము కలిపి తయారు చేయబడి నది.

**ఛాగమాషతైలము**

దీనిని ఉపయోగించిన యెడల, పక్షవాతము, ఆర్దితవాతము, ఆపబాహుకము, చెముడు, తిమిరము, కంపవాతము, మన్యాస్తంభము, చెక్కిళ్లుపట్టుకొనుట, పంగు వాతము, చెవిలోపోటు మొదలగునవి హరించును. దీనిని త్రాగుట, వస్తికర్మ, అభ్యంగ నము, నస్యము, చెవిలో వేయుట, కంటిలో వేయుట, మొదలగువానికి నుపయోగించ వచ్చునని శాస్త్రమునందు చెప్పబడినది.

**దూర్వాది తైలము (స.యో)**

200 ఎం.ఎల్. దూర్వా, వేప, అతిమధురం

శరీరమునకు – తలలోచుండ్రునకు, గజ్జి, చర్మరోగములకు మంచి ఉపయోగము.

**దద్రుహర తైలము (తామరతైలము) (స.యో.)**

దీనిని తామరగల ప్రదేశమునందు పిడక మొదలగువానితో బాగుగా గోకి దూది చుట్టిన పుడకమొదలగు వానితో పూసిన యెడల తామర వెంటనే

హరించును. మరియు చిడుము, గజ్జిపుండు, దురద, చర్మవ్యాదులు మొదలగునవి కూడా వెంటనే హరించును. పై వ్యాధులను హరించుటలో అత్యుత్తమమైనదని స్వానుభవముచే చెప్పగలము. చాల దినములనుండి యున్న వ్యాధి కూడ నశించును.

**దుర్దురాది తైలము (స.యో.)**

200 ఎం.ఎల్. ఉమ్మెత్త ఆకులు, నువ్వుల నూనె, ఉమ్మెత్త గింజల కల్కం.

తలకి – చుండ్రు, దురదలు, తల వెంట్రుకలు ఊడుట తగ్గును.

**దుర్దురపత్రాది కోకోనట్ ఆయిల్ (స.యో.)**

200 ఎం.ఎల్. ఉమ్మెత్త ఆకులు, దూర్వా, తిప్పతీగ, కింశుక పత్రం.

తలకి – గజ్జి, దురదలు, చుండ్రు నివారించి జుట్టు పెరుగుట యందు బాగుగా పనిచేయును.

**దినేశ ఏలాది కోకోనట్ ఆయిల్ (స.యో.)**

200 ఎం.ఎల్. మంకెనబెరడు, క్షీర బెరడులు

తలకి శరీరమునకు – గజ్జి, దురదలు, కురుపులకు బాగా పనిచేయును.

**దినేశ వల్యాది కుజంబు (స.యో.)**

200 ఎం.ఎల్. మంకెన బెరడు, పసుపు, ఆముదము

శరీరమునకు – చర్మ రోగములకు ఉత్తమమైనది.

**ఏలాది ఆయిల్ (అ.హృ)**

200 ఎం.ఎల్. ఏలక్కాయద్వయం, తురుష్కం, చంగల్వకోష్ఠం, ప్రియంగు, జటామాంసి, వట్టివేళ్ళు, గ్రంధితగరం.

శరీరమునకు, తలకి – దురదలు, తెల్లమచ్చలు, కురుపులు, విషజంతువుల కాటులు, దీర్ఘకాలపు జలుబు, చర్మ రోగములను హరించి చర్మకాంతిని పెంపొందించు టకు దోహదపడును.

**ఏలాది కోకోనట్ ఆయిల్ (అ.హృ)**

200 ఎం.ఎల్. ఏలక్కాయద్వయం, తురుష్కం, చంగల్వకోష్ఠం ప్రియంగు, జటామాంసి, వట్టివేళ్ళు, గ్రంధితగరం

శరీరమునకు–తలకి – దురదలు, తెల్లమచ్చలు, కురుపులు,

విషజంతువుల కాటు దీర్ఘకాలపు జలుబు, చర్మ రోగములకు మరియు చర్మకాంతి పెంపొందించు టకు, కొబ్బరి నూనెతో చేయబడినది.

## ఇంద్ర తైలము

ద్రవ్యములు : శుద్ధగంధకము, రసకర్పూరము, పచ్చకర్పూరము.

గుణము : మేహసంబంధమైన అన్ని రకముల చర్మవ్యాధుల యందు, పుండ్లు, ఎండు గజ్జి, దురదలు, రక్తదోషము వలన కలిగిన అన్ని రకముల చర్మవ్యాధుల యందు ఈ లేపము మిక్కిలి గుణకారి.

అనుభూత ప్రయోగములు : 1. వ్రణరోపణమునకై వ్రణ రోపణ ద్రవ్యములను వాడుచూ, ఈ లేపమును పై పూతగా వాడిన, క్రొత్త చర్మము త్వరగా పుట్టును.

2. పామ, కండు,దాహములందైనను చందనాదివటి, గంధక రసాయనములను లోనికి ఇచ్చుచూ, ఈ లేపమును పైపూతగా వాడిన, త్వరగా తగ్గును.

3. ఉపదంశము, సంబంధిత రోగములందు గనోప్రభ వంటి ఔషధములు లోనికి వాడుచూ, పై పూతగా ఈ లేపమును వాడిన త్వరితముగా మానును.

పథ్యము : పాత బియ్యము, ఆవుమజ్జిగ, ఆవునెయ్యి, వేడినీరు.

అపథ్యము : గుమ్మడికాయ, కోడిమాంసము, ఆవనూనె, ఊరగాయలు.

లభ్యము : 15 గ్రా.

## ఇరిమేదాది తైలము (శా.సం.)

ద్రవ్యములు : తుమ్మపట్ట, నువ్వులనూనె, లవంగము, గైరికము, అగరు, పద్మ కము, మంజిష్ట, లొద్దుగచెక్క, అతిమధురము, లక్క, మర్రిపట్ట, తుంగముస్తలు,లవం గపు పట్ట, జాజికాయ, పచ్చకర్పూరము, తక్కోలములు, తెల్లచంద్ర పట్ట, పతంగపు చెక్క, ఆరెపూలు, సన్నయాలకులు, నాగకేసరములు, కాయఫలము.

గుణము : ముఖరోగములు, దంతశూల, చిగుళ్ళవాపు, నల్లని పండ్లరోగము, శీత దంతరోగములు, దంతహర్షము, దంత విద్రధి, దంత దుర్గంధము, కృమిదంతక రోగము మొదలగు సమస్త దంత రోగములు, నాలుక, పెదవులు, దౌడలు వీనియందు జనించెడి రోగములు.

అనుభూత ప్రయోగములు : 1. క్రిమి దంతమునందు (పిప్పిపన్ను) హెర్బల్ టూత్ పౌడర్ పండ్లు తోముకొనుటకు వాడుచూ, భోజనమునకు ముందు రెండు చెంచాలు ఉదయము, సాయంత్రం తీసుకొనుచు, ఈ తైలమును రాత్రి పరుండబోవు నపుడు దూదితో పండ్లపైన అద్దుతున్న, క్రిమి దంతములు నివారణ అగును.

2. దంత శూలనందు కాంచనార గుగ్గులు,దశమూలారిష్టలతో ఇచ్చుచూ, ఈ తైలముతో కబళము పట్టిన శూల క్రమముగా తగ్గును.

3. ముఖరోగములందు లక్షణానుసార చికిత్స చేయుచూ, ఈ తైలముతో పుక్కిలించిన, తగ్గుముఖం పట్టును.

పథ్యము : వేడినీరు, తృణ ధాన్యములు, కాకరకాయ, కంద, తేనె.

అపథ్యము : చేపలు, మాంసము, చెరకు, ఖర్జూరము, బెల్లము.

ప్రయోగము : ముఖమునకు, దంతములకు లేపనము.

### గంధతైలము (అ.హృ)

25 ఎం.ఎల్. నల్లనువ్వులు, నువ్వులనూనె, నలద, వాలక, లోహితాక్షిక

శరీరముపైకిరాయులకు, లోపలికి త్రాగుటకు –బెణుకులు, ఎముకలు విరుగుట, ఎముకల స్థానభ్రంశమునందు విశిష్టముగా పనిచేయును.

### గంధర్వ హస్త తైలము (అ.హృ)

50/200 ఎం.ఎల్. ఆముదము, శొంఠి, యవక్షారం, చిరిబిల్వ

లోపలికి – నడుమునొప్పులు, వంటినొప్పులు, వాతవ్యాధులందు మంచి గుణ కారి. (విరేచన గుణము కలదు.)

### హింగు త్రిగుణ తైలము

దీనిని 1/4 మొ. 1 తు. వరకు వేడినీటితో కూడ సేవించిన యెడల సుఖ విరేచనమగుచు గుల్మములు, ఉదరవ్యాధి, అంత్రవృద్ధి, క్షయ, శూల, శ్లేష్మ వ్యాధులు, వాత వ్యాధులు, నశించును. పసిపిల్లలకు సమస్త వ్యాధులందు పనిచేయును. చెవిలో వేసిన యెడల కర్ణ వ్యాధులన్నియు హరించును. ఆముదముతో తయారు చేయబడినది.

### హిమసాగర తైలము (భై.ర.)

200 ఎం.ఎల్. శతావరి, విదారి, బూడిదగుమ్మడి, ఉసిరిక, బూరుగబంక.

తలకి – జుట్టు ఎర్రబడుట, వాత, పిత్త, మానసరోగములందు ఉపయోగకారి.

**జాత్యాది తైలం (భై.ర.)**

ద్రవ్యములు : జాజిపత్రములు, వేప ఆకులు, పొట్ల ఆకులు, కానుగ ఆకులు, మైనము, అతి మధురము, చెంగల్వకోష్టు, పసుపు, మానుపసుపు, కటుకరోహిణి, మంజిష్ట, పద్మకము, లొద్దుగ చెక్క, కరక్కాయ, పద్మకేసరములు, శుద్ధతుత్తము, సుగంధిపాల, కానుగవిత్తులు, తిల తైలము.

గుణము : విషజన్య వ్రణములు, పుండ్లు, కుష్ఠము, దద్రు, విసర్పి, కీటదంశోత్థ వ్రణశోథ, సద్యోవ్రణములు, జంతువుల కాటు వలన ఏర్పడిన వ్రణములు, దంత, నఖ క్షతముల వలన ఏర్పడిన వ్రణములను రోపణము చేయును.

**జాత్యాది తైలము**

200 ఎం.ఎల్. వావిలాకులు, ఉత్తరేణి, జాజిమల్లి ఆకులు గరిక,పసుపు,పర్పాట కం, మోదుగాకులు

శరీరముపైన రాయుటకు – పుండ్లను, గాయములను మాన్పును.

అనుభూత ప్రయోగములు :

1. కాంచనార గుగ్గులు, దశమూలారిష్ట అనుపాన ముగా ఇచ్చుచూ త్రిఫల కషాయముతో పరిషేకము చేయుచూ ఈ తైలము చేత వ్రణ బంధనము చేయుచున్న, ఏ విధమైన వ్రణములైనను తగ్గును.

2. విషజ వ్రణములందు లక్షణానుసార చికిత్స చేయుచూ ఈ తైలముతో వ్రణ బంధనము చేయవలెను.

3. సద్యోవ్రణములందు తేనె కలిపి ఈ తైలమును బాహ్యా ప్రయోగమునకై ఉపయోగించిన మంచి ఫలితములిచ్చును.

పథ్యము : కందులు, పెసలు, పేలాల జావ, మాంసము.

అపథ్యము : కొత్త బియ్యపు అన్నము, పెరుగు, కారము.

లభ్యము : 50 మి.లీ. 100 మి.లీ.

**జీవంత్యాది యమకము (అ.హృ)**

200ఎం.ఎల్. జీవంతి, చెరకు, కాకోళి, అతిమధురం

పైన రాసేది – కాలి,చేతి, పెదవుల పగుళ్ళకు, సొరియాసిస్‌కు ఉత్తమము.

## కామసంజీవి తైలం

ద్రవ్యములు : నాగకేసరములు, అశ్వగంధ, ఉమ్మెత్త విత్తులు, గోమూత్ర శిలా జిత్, కర్పూరము, తిలతైలము

గుణము : నరములను ఉత్తేజపరచును, వాజీకరము, పురుషులలో లైంగిక బలహీనతయందు మిక్కిలి గుణకారి. పై పూతకు మాత్రమే.

వాడు విధానము : పురుషాంగముపై లేపనము చేసి మర్దనము చేయవలెను.

పథ్యము : ఆకలిననుసరించి వెన్న, పెరుగు, పాలు, పప్పుదినుసులు, మాంసము తీసుకొనవలెను. అజీర్ణము లేకుండా చూచుకొనవలెను.

అపథ్యము : పుల్లని, తీక్ష్ణ, చేదు పదార్థములు

లభ్యము : 50 మి.లీ. 100 మి.లీ.

## ఖజిత పిండతైలము (అ.హృ)

200 ఎం.ఎల్. మంజిష్ట, సర్జరసం, శాంబ, ఆముదము

శరీరమునకు - వాతరక్తము, నొప్పులు, చురుకుపోట్లు, కాలి పగుళ్ళు శమింప చేయును.

## కార్పసస్థ్యాది కుజంబు(సహస్రయోగము)

200 ఎం.ఎల్. ప్రత్తిగింజలు, బలా, మినుములు, ఉలవలు

పైన రాసినది - మెడ, భుజము నొప్పులకు శ్రేష్ఠము

## కార్పసస్థ్యాది తైలము (స.యో)

200 ఎం.ఎల్. ప్రత్తిగింజలు, బలా, మినుములు, ఉలవలు

పైన రాసేది - అపబాహుకం, అర్ధితవాతం, పక్షాఘాతంలను హరించును.

## కర్ణామృతము

దీనిని 4-5 చుక్కలు చొప్పున రోజుకు 2-3 సార్లు చెవిలో పోసిన యెడల చెవి పోటు,హొూరుగ నుండుట, చీముకారుట, చెముడు, కర్ణస్రావము, దిబ్బడివేయుట, గురగురలాడుట మొదలగు కర్ణవ్యాధులన్నియు నశించును.

## కేతకీ తైలము

దీనిని పైన రుద్దినచో మేహ వాత నొప్పులు, అర్దితవాము, ఆమవాతము, ధనుర్వాతము, అపబాహుకవాతము, తిమిరవాతము, సర్వాంగవాతము, మొదలగు నవి వెంటనే హరించును. వాత హరములలో శ్రేష్ఠమైనది.

## కుంకుమాది తైలము (బై.ర.)

10 ఎం.ఎల్. కుంకుమపువ్వు, పద్మకం, పుడకలక్క, చందనం, మంజిష్ఠ.

పైన రాయుటకు – ముఖము, శరీరముపైన మచ్చలు తగ్గించి, చర్మకాంతిని పెంపొందించును. మొటిమలు, తగ్గించును.

## కర్పూరాది తైలము (స.యో)

100,200 ఎం.ఎల్. కర్పూరం, అజామోదం

శరీరమునకు – వంటి నొప్పులు, కండరాల బిగింపు, మొద్దుబారుటను నివా రించును.

## క్షీరబలా తైలం (స.యో)

ద్రవ్యములు : ముత్తవపులగపు వేళ్లు, ఆవుపాలు, నువ్వులనూనె.

గుణము : ఎనుబది వాతరోగములు హరించును.

అనుభూత ప్రయోగములు : 1. ఏ రకమైన పక్షాఘాతమునందైనను, వాతహర ఔషదములులోనికి ఇచ్చుచూ, లహసాన్ ఇంజక్షన్ ఇచ్చుచూ, ఈ తైలాభ్యంగనము చేసిన వాత దోషము నివారింపబడును.

2. మాంసధాతు శోషణయందు మాంసధాతు వర్ధకములైన ద్రవ్యములను ఇచ్చుచూ, ఈ తైలమును అభ్యంగనమునకు వాడిన, మాంసధాతువు వృద్ధినొందును.

3. క్రీడాకారులకు కలిగే అభిఘాతమునందు కాంచనార గుగ్గులు ఇచ్చుచూ, ఈ తైలాభ్యంగనము చేయవలెను.

పథ్యము : కందిపప్పు, కందికట్టు, గోధుమజావ, గోధుమ రొట్టె, మేకమాంసము, వెల్లుల్లి, ద్రాక్షపండ్లు, నల్లేరు, తేనె

అపథ్యము : జొన్న అన్నము, శనగలు, బచ్చలికూర, చుక్కకూర.

లభ్యము : 50 మి.లీ. 100 మి.లీ.

## షడ్బిందు తైలం (భై.ర.)

ద్రవ్యములు : భృంగరాజస్వరసము, ఆముదపు వేరు, గ్రంధితగరము, సదాప, జీవన్తి, రాస్నా, సైంధవలవణము, దాల్చిన చెక్క, వాయు విడంగములు, అతిమధు రము, శొంఠి, తిలతైలము, మేకపాలు.

గుణము : శిరోరోగహరము, సూర్యావర్తనమునందు అత్యుత్తమ ఔషధము. కేశములు రాలుట, పండ్లు కదులుటను ఆవును. ప్రతిశ్యాయము నశించును. నేత్ర ముల దర్శనశక్తి ఇనుమడించును. భుజబలము పెరుగును.

అనుభవ ప్రయోగములు : శిరశ్శూల, జలుబు, పడిశము, పీనస, నాసార్బుదము, నాసా రోగములందు గుణకారి.

1. శిరోరోగములందు నస్యమునకై ఇచ్చుచూ, లక్షణానుసార చికిత్స చేయ వలెను.

2. ఈ తైలముతో సస్యకర్మచేయుచూ–త్రిఫల ఘృతము, ఆవునెయ్యి, వాడిన నేత్రరోగములకు ఉపయోగకరము.

3. పీనసము, ప్రతిశ్యాయము వంటి నాసాగత రోగములందు సితోపలాది చూర్ణము, మహాలక్ష్మి విలాస రసవాడుచూ ఈ తైలముతో నస్యకర్మ జరిపిన పీనసము, ప్రతిశ్యాయము తగ్గును.

పథ్యము : ఆవునెయ్యి, కందిపప్పు, పెసరపప్పు, ఆవుమజ్జిగ, ఆవుపాలు, మేక మాంసము, ద్రాక్షపండ్లు, ఉసిరికాయలు

అపథ్యము : కొత్తబియ్యపు అన్నము, చేపలు, ఉలవలు, ఆవాలు.

ప్రయోగము : 3–6 చుక్కలు చొప్పున ముక్కులలో ప్రతిరోజు రెండుసార్లు వేసుకొనవలెను.

లభ్యము : 10 మి.లీ.

## కయ్యోన్యాది తైలము (స.యో)

200 ఎం.ఎల్. భృంగరాజ, గుడూచి, అంజనం, ఉసిరిక

తలకి – తల,నేత్ర రోగములకు మంచిది.

## కయ్యోన్యాది కోకోనట్ ఆయిల్ (స.యో.)

200 ఎం.ఎల్. భృంగరాజ, గుడూచి, అంజనం, ఉసిరిక

తలకి – తల, నేత్ర రోగములకు కొబ్బరినూనెతో చేయబడినది.

## కొట్టంచుక్కాది తైలము

100,200/450 ఎం.ఎల్. శొంఠి, కుష్ఠం, వచ, దేవదారు, వెల్లుల్లి, మునగ, రాస్నా, ఆవాలు, చింతాకురసం.

శరీరమునకు అన్ని రకముల వాత వ్యాధులకు –ఆమవాతం, తిమ్మిర్లు హరిం చును.

## మహామాష తైలం (భై.ర.)

ద్రవ్యములు : మినుములు, కోలపొన్న, ముయ్యాకుపొన్న, చిన్నములక, పెద్ద ములక, పల్లేరు, మారేడు, తక్కిలి, దుందిలము, కలిగొట్టు, పెగ్గుమ్మడు వీనివేళ్లు, మేకమాంసము, దూలగొండి విత్తులు, ఆముదపు వేరు, సదాప, సైంధవ లవణం, సముద్రలవణం, సౌవర్చలవణం, బిడాలవణం, జీవకము, ఋషభకము, మేద, మహా మేద, వృద్ధి, ఋద్ధి, కాకోళి, క్షీరకాకోళి, అతిమధురము, జీవంతి, కారుమినుము, అడవి పెసలు, మంజిష్ట, చవ్యము, చిత్రమూలము, కాయఫలము, శొంఠి, పిప్పళ్లు, మిరియాలు,మోడి, రాస్నా, దేవదారు, తిప్పతీగ, చెంగల్వకోష్టు, అశ్వగంధ, వస, కచ్చూరములు, తిల తైలము, ఆవుపాలు.

గుణము : పక్షాఘాతము, ఆర్దిత వాతము, బాధిర్యము (చెముడు) హనుస్తంభము, కర్ణశూల, మన్యాశూల, శిరఃశూల, నడవలేకపోవుట, త్రిదోషజన్య తిమిరము, హస్త కంపము, పాదకంపము, శిరోకంపము, గ్రీవాకంపము, కలాయఖంజము, పాంగు ల్యము, గృధ్రసీ, అపబాహుక మొదలగు సర్వవాత వికృతులను నశింపజేయును.

అనుభూత ప్రయోగములు : ఊర్ధ్వాంగ వాతము, చచ్చువాతములను హరిం చును. కృశత్వమును పోగొట్టి, అవయవములకు బలము నిచ్చును.

1. నిర్గుండీ తైలములో ప్రతిరోజు కర్ణ పూరణము చేయుచూ, మహామాష తైలముతో శిరస్సు అంతయు అభ్యంగనము చేసిన బాధిర్యము తగ్గును.

2. కంపవాతము మొదలుగాగల అనేక పక్షాఘాతములందు వ్యాధిగ్రస్త ప్రాంత మునందు ఈ తైలముచే అభ్యంగనము చేయుచూ, వాతహర ఔషధములను ఇచ్చిన కంపము, పక్షాఘాతము తొలగును.

3. అశ్వగంధారిష్ట, వాతగజాంకుశ రస ఇచ్చుచూ ఈ తైలాభ్యంగనము చేసిన కర్ణశూల తగ్గును.

పథ్యము : మునగకాయ, కాకరకాయ, ఆవుమజ్జిగ, ఆవునెయ్యి, లేత వంకాయ, కొయ్యతోటకూర.

అపథ్యము : చలి అన్నము, బిగ్గరగా మాట్లాడుట, శిరోస్నానము.

ప్రయోగ విధానము : వేడిపాలతో పానము, వస్తి, అభ్యంగనము, నస్యము, నేత్ర, కర్ణ పూరణము.

లభ్యము : 50 మి.లీ. 100 మి.లీ.

## మందార తైలం

ద్రవ్యములు : మందార పూవులు, గుంటగలగరాకు, ఉసిరిక, పసుపు, సరస్వతీ ఆకు, తిప్పతీగ, సుగంధిపాల, చంద్ర, కచ్చూరములు, ఆకుపత్రి, దేవదారు,వట్టివేరు, జటామాంసి, కురువేరు, నాగకేసరములు, రక్తచందనము, నీలిఆకు, చెంగల్వకోష్టు, అతిమధురము, చిట్టాముట్టి, మెంతులు నువ్వుల నూనె.

గుణము : శిరస్సునకు, నేత్రములకు చలువ నిచ్చును. వెంట్రుకలను వృద్ధి చేయును. ఆ కాలములో వెంద్రుకలు తెల్లబడుటను నివారించును. జుట్టు కుదుళ్లను గట్టిపరచి, జుట్టు రాలుటను అరికట్టును. శిరోవేడిమి వలన కలుగు తలనొప్పుల యందు గుణకారి. చుండ్రు మొదలగు కేశసంబంధిత చర్మవ్యాధులను దరిజేరనివ్వదు.

అనుభూత ప్రయోగములు : 1. గంధక రసాయనము, సరసలతో ఇచ్చుచూ, ఈ తైలముతో అభ్యంగనము చేయుచూ, అవసరమైన ప్రాంతమున మందార లేప ముచే లేపనము చేసిన,రోమసముదాయమున కలిగే పేను కొరుకుడు అను వ్యాధిని నివారించవచ్చును.

2. రోమ వృద్ధికై చ్యవనప్రాశ లేహ్యము వాడుచూ ఈ తైలాభ్యంగనము చేసిన ఫలితమునిచ్చును.

3. శిరోవేడిమి తగ్గుటకై చందనాసవ, చందనాది వటిలతో ఇచ్చుచూ ఈ తైలాభ్యంగనము చేసిన శిరస్సునకు చల్లదనము నిచ్చును.

పథ్యము : తేనె, నిమ్మ, ఉసిరికాయ, తోటకూర, పులిచింతకూర, వెలగపండ్లు.

అపథ్యము : వంకాయ, గోంగూర, చేపలు, రొయ్యలు, కంద

లభ్యము : 100 మి.లీ. 200 మి.లీ. మరియు 450 మి.లీ.

## మాష తైలము

దీనిని మర్దించుటచే సంధివాతము, అపబాహుకవాతము, ఆమవాతము, చేతులు వణుకు, ఆర్దిత వాతము, పక్షవాతము, శిరస్సు వణుకు, మన్యాస్తంభము, మొదలగు నవి నశించును. మరియు నిది చెవిలో పోటు, వినపడకుండుట, తిమ్మెర్లు, మొదలగు వానిని కూడ హరింపచేయును. మేహముచేగాని వాతముచేగాని మేహవాతములచే గాని కలిగిన వ్యాధులను నశింపజేయుటలో మిక్కిలి శ్రేష్టమైనది.

## మహానారాయణ తైలం (భై.ర.)

ద్రవ్యములు : మారేడు మూలపట్ట, అశ్వగంధ, పెద్దవాకుడువేళ్లు, పల్లేరు, దుందిలపువేళ్ల పట్ట, బలవేళ్లు,వేపవేరుపట్ట, వాకుడు వేళ్లు, గలిజేరు వేళ్లు, అతిబలా వేళ్లు, అగ్నిమంద (నెల్లి) వేరుపట్ట, గంధప్రసారిణి వేళ్లు, కలిగొట్టు వేరుపట్ట, శతావరి కందస్వరసం, రాస్నా, అశ్వగంధ, సోపు, దేవదారు, చెంగల్వకోష్టు, కోలపొన్న, ముయ్యాకు పొన్న, కారుమినుము, అడవి పెసర, అగరు, నాగకేసరాలు, సైంధవ లవణము, జటామాంసి, పసుపు మానుపసుపు, రాతిపువ్వు, ఎర్రచందనం, పుష్కర మూలం, చిన్నయాలకులు, మంజిష్ట, సుగంధపాల తుంగముస్తలు, ఆకుపత్రి, దాల్చినీ, జీవకము, ఋషభకము, మేదా, మహమేదా, కాకోళీ, క్షీరకాకోళీ, ఋద్ధి, వృద్ధి, వస, మోదుగ, పునర్నవ, కచోరకము, కర్పూరము, కుంకుమపువ్వు, కస్తూరి, తిలతైలము, ఆవుపాలు.

గుణము : వాతవ్యాధిగ్రస్తమైన ఏకాంగవాతము, అర్జితవాతము, హస్తపాదకంప వాతము, పంగు, బాధిర్యం, శుక్రక్షయ, మన్యాస్తంభ, హనుస్తంభ, శిరోరుజలందు అత్యంత ఉపయోగకారి. సర్వవిధ యోని దోషములు నశింపజేసి వంధ్యాస్త్రీలకు సత్సంతానమును కలుగజేయును. శాఖాశ్రిత వాతము, కోష్ఠగత వాతము, జిహ్వాస్తంభ, దంతశూల,ఉన్మాదము, జ్వరము, కుబ్జత, వీనివలన కృశించిన వారికి ఉపయోగ కరము. శరీరకాంతి, బలము వృద్ధి చెందును.

అనుభూాత ప్రయోగములు : పక్షవాతము, ఆమవాతము, సంధివాతము, చచ్చు వాతము, కండరాలనొప్పులకు మిక్కిలి

ఉపయోగకరము.

1. ఆర్దిత వాతమునందు 7-8 వెల్లుల్లి రెబ్బలను అవునెయ్యిలో వేగించి

లోనికి తీసుకొనుచూ, ఈ తైలమును 40 రోజుల పాటు వ్యాధిగ్రస్తమైన ప్రదేశమున అభ్యం గనము చేసిన తగ్గును.

2. హనుస్తంభ వాతమునందు కేవలము ఈ తైలాభ్యంగనమే అధిక ప్రయోజన మునిచ్చును. అయినను వాతహర ఔషధములు లోనికి ఇచ్చిన అధిక గుణము కన బడును.

3. హస్తపాద కంపవాతమునందు ఈ తైలాభ్యంగనము చేయుచూ, బృహత్ వాత చింతామణి మాత్ర, లహసాన్ ఇంజక్షన్ వాడిన, కంపనములు తగ్గును.

పథ్యము : గోధుమ జావ, మేకమాంసము, వెల్లుల్లి, నీరుల్లి, గలిజేరుకూర, ఖర్జూరము.

అపథ్యము : శీతల పదార్థములు, చేదుగల పదార్థములు, జొన్నలు, పెసలు, మినుములు, బఠాణీలు.

ప్రయోగము : 50 మి.లీ. 100 మి.లీ.

## నారాయణ తైలము (భై.ర.)

ద్రవ్యములు : అశ్వగంధ, చిట్టాముట్టి, మారేడు వేరు, పాదిరి వేరు, వాకుడు, పెద్దములక, పల్లేరు, అతిబల, వేప, దుందిలపు వేరు, గలిజేరు, గొంతెమగోరు, కూరనెల్లివేరు, శతావరీ రసము, చెంగల్వకోష్టు, యాలకులు, చందనము, చాగమట్ట, వస, జటామాంసి, సైంధవలవణము, రాస్నా, పెద్దసదాప, దేవదారు, ముయ్యాకు పొన్న, కోలపొన్న, అడవి మినుము, అడవి పెసర, గ్రంధి తగరము.

గుణము : పక్షాఘాతము, హనుస్తంభము, మన్యాస్తంభము, గళగ్రహము, ఖల్లివాతము, బధిరత్వము, గతిభంగవాతము, కటిగ్రహ వాతము, హస్త పాదము లను శోషింపజేసేడి వాతము, నేత్రాది ఇంద్రియములను నశింపజేసెడి వాతము, రక్త వికారము, శుక్రధాతు క్షయము, జ్వరము, క్షయరోగము, అండవృద్ధి, కురండ ములు, దంత రోగము, శిరోగ్రహవాతము, పార్శ్వశూలలు, పంగుత్వము, బుద్ధి భ్రంశము, గృధ్రసీ వాతము, సర్వాంగ, అర్ధాంగ, విషమ వాతములు నశించును. వంధ్యా స్త్రీలకు సంతానము కలుగును.

దీనిని మర్దించుటచే ధనుర్వాతము, సర్వాంగవాతము, కంపవాతము, ఆర్దిత వాతము, పక్షవాతము, హనుస్తంభము, మన్యాస్తంభము,

పంగువాతము, కుబ్జవాతము, అపబాహుకము మొదలగు వాత వ్యాధులన్నియు నశించును.

అనుభూత ప్రయోగములు : 1. హస్తము, పాదములను శోషింపజేసెడి వాతము లందు ఈ తైలాభ్యంగనము చేయుచూ, అశ్వగంధ చూర్ణము, శతావరీ చూర్ణములను పాలతో తీసుకొనుచూ, నెర్విటాల్ ఉదయము, సాయంత్రము తీసుకొనిన మాంస ధాతువృద్ధి నొందును.

2. గృధ్రసీనందు ఈ తైలాభ్యంగనము చేయుచూ వాతవినాశక్, లహసాన్ ఇంజక్షన్‌లు ఇచ్చుచూ వాతహర ఔషధములు లోనికి ఇచ్చిన, పీడ శాంతించి వాత హరము కాగలదు.

3. అర్ధాంగ వాతమునందు వాతహర ఔషధములచే చికిత్స చేయుచూ, పంచకర్మ చికిత్స చేయాలి. ఈ తైలాభ్యంగనము చేసిన, ఉత్తమ ఫలితమును ఇచ్చును.

పథ్యము : లేత వంకాయ, లేత ఆముదపు కాయ, మునగాకు కూర, బీరకాయ.

అపథ్యము : నువ్వులనూనె, మునగకాయలు, ఇంగువ, ఎండు చేపలు, ఆవాలు.

ప్రయోగము : నస్యమునకు, శరీరలేపమునకు, పానమునకు, వస్తియందు.

లభ్యము : 50 మి.లీ. 100 మి.లీ.

## నిర్గుండీ తైలము (స.చి)

ద్రవ్యములు : వావిలి ఆకురసము, జిల్లేడాకుల రసము, మునగ ఆకు రసము, చింతాకు రసము, తులసి ఆకు రసము, ఉమ్మెత్త ఆకు రసము. కామంచి సమూల రసము, ఉత్తరేణి సమూల రసము, నేల తాడిగడ్డల స్వరసము, మంచి పసుపు, అరటి గడ్డ రసము, అల్లపు రసము, గుంటగలగరాకు రసము,నువ్వులనూనె, మేక పంచితం, వస, ఉసిరిక వరుగు, చెంగల్వ కోష్టు, శొంఠి, సైంధవలవణం,మిరియాలు, పిప్పళ్లు, సర్జరసం.

గుణము : కర్ణరోగములు, కర్ణవ్రణములు, గండమాల, కంఠవ్యాధులు, దుష్ట వ్రణములు మొదలగునవి హరించును.

అనుభూత ప్రయోగములు : 1.కీళ్లనొప్పులు,పోట్లు,వాపులు, వీనియందు పైన మర్దనము చేసి కాపడము పెట్టిన, ఉపశమనమిచ్చును. చెవిపోటునందు తైలమును వెచ్చబెట్టి నాలుగు చుక్కలు వేయవలెను.

2. కర్ణరోగములందు లక్షణానుసార చికిత్స చేయుచూ, ఈ తైలముతో కర్ణ పూరణము చేసిన ఫలితమునిచ్చును.

3. కాంచనార గుగ్గులు లోనికి ఇచ్చుచూ, ఈ తైలాభ్యంగనము చేసిన, గండ మాల క్రమముగా తగ్గును.

4. చర్మముపైన నల్లని మచ్చలు ఉన్నపుడు ఆరోగ్యవర్ధనీవటి ఇచ్చుచూ, ఈ తైలాభ్యంగనము చేయవలెను.

పథ్యము : పాతబియ్యము, గోధుమలు, పెసలు, బార్లీ, నెయ్యి, జింకమాంసము, మేకమాంసము, పొట్లకాయ, మునగకాయ, ఆవుమజ్జిగ.

అపథ్యము : కఫకరాన్నము, చలి అన్నము, శిరస్నానము, సంచారము, గాలి, మంచు వీనిలో తిరుగుట, బిగ్గరగా మాట్లాడుట.

లభ్యము : 50 మి.లీ. 100 మి.లీ.

## నీలి భృంగరాజ తైలము (స.యో)

ద్రవ్యములు : నీలి ఆకులరసము, భృంగరాజ రసము, చేదుపుచ్చరసము, ఉసిరిక రసము, మేకపాలు, తిలతైలము, కొబ్బరిపాలు, ఆవుపాలు, గేదెపాలు, అతి మధురము, గురిగింజలు, నీలాంజనము.

గుణము : వెంద్రుకలు పెరుగుటకు, నల్లబడుటకు అత్యంత ఉపయోగకరము.

అనుభూత ప్రయోగములు : 1. శిరస్సునకు, మెదడునకు, నేత్రములకు చలువ చేయును. శరీర అత్యుష్ణమును శమింపజేయును. జుత్తును నల్లబరచును. కేశవృద్ధిని కలిగించును. తలపోటు, మాడుపోటు, పార్శ్వపు తలనొప్పులను హరించును. శిరస్సు నకు క్రమబద్ధముగా రక్తప్రసారమును చేయును.

2. సన్నిపాత జ్వరము వలన కలిగే రోమశాతనమునకు పునర్నవాది మండూ రము, నెర్విటాల్‌లతో ఇచ్చుచూ ఈ తైలము అభ్యంగనముగా వాడిన రోమ సంజన నము జరుగును.

3. శిరస్సుపైన వచ్చే శీతపైత్యమునకు గంధక రసాయనము సరసతో

ఇచ్చుచూ ఈ తైలాభ్యంగనము చేసిన తగ్గును.

4. హరిద్రా చూర్ణము, పంచతిక్త చూర్ణములను కలిపి తేనెతో ఇచ్చుచూ శిరస్సు నకు ఈ తైలమును అభ్యంగనము చేసిన శిరః కండు తగ్గును.

పథ్యము : చుక్కకూర, పొన్నగంటికూర, చింత చిగురు, ద్రాక్షపండ్లు, అల్లము, కరివేపాకు.

అపథ్యము : పెరుగు, పాలు, బెల్లము, మాంసము, నూనె ఎక్కువ ఉన్న పదార్థ ములు.

లభ్యము : 100 మి.లీ. 200 మి.లీ. 450 మి.లీ.

## నేత్ర బిందు

దీనిని 3-4 చుక్కలు చొప్పున రోజుకు 2-3 సార్లు కంటిలో వేసిన యెడల కండ్లు ఎర్రగ నుండుట, మంట, పుసికట్టుట, అంటుకొనుట, నీళ్ళు కారుట, సరిగ కనబడకుండుట మొదలగు నేత్రవ్యాధులు నశించును.

## నిర్గుండ్యాది తైలము

దీనిని చెవిలో వేసినయెడల చెముడు, చెవుల యందు ధ్వని, బాధ, క్రిములు, చీము, మొదలగునవి నశించును. పైన పూసినచో వాత వ్యాధులన్నియు కూడ హరించును. వాతములను హరించుటలో శ్రేష్ఠమైనది.

## పిండ తైలం

ద్రవ్యములు : మంజిష్ట, సర్జరసం, సుగంధిపాల, మైనము, తిలతైలము.

గుణము : వాతరక్తజన్య రోగములను హరింపజేయును.

దీనిని పూయుటచే వాతరక్తము, కుష్ఠములు, చర్మవ్యాధులు, మేహవాతనొప్పులు, కాళ్లు చేతులందు వ్రణములు, వాత వ్యాధులు, కీళ్ళనొప్పులు, మొదలగునవి నశించును. చర్మమునకు మృదుత్వము కలుగును.

అనుభూత ప్రయోగములు : కీళ్ళనొప్పులు, నడుమునొప్పులు, వాతనొప్పులు, మడమశూల, వరిబీజము, బోదకాలు, అరికాళ్లు, అరిచేతుల మంటలు, తిమ్మిర్లు, బెణుకులు, వాపులు మొదలగు వానిని హరించును.

1. మధుమేహము వలన కలిగే స్పర్శనాశమునందు అభ్రకభస్మము, త్రివంగ భస్మము, అశ్వగంధచూర్ణములను ఆమలకీ స్వరసముతో ఇచ్చుచూ,

ఈ తైలముతో అభ్యంగనము చేసిన, స్పర్శ తిరిగి వచ్చును.

2. రక్తప్రసారము సరిలేక కలుగు వ్రణములందు ఈ తైలముచే అభ్యంగనము చేయుచూ, నెర్విటాల్, అశ్వగంధారిష్ట ఇచ్చిన రక్తప్రసారము సాధారణస్థితికి చేరుకొని వ్రణము తగ్గును.

3. సమస్త వాతరోగములందు అనగా అంగశైథిల్యమునందు ఈ తైలముతో అభ్యంగనము చేయుచూ బృహత్ వాత చింతామణి, అశ్వగంధారిష్టలు ఇచ్చుచూ; లహసాన్ ఇంజక్షన్ 40 రోజుల పాటు వాడిన ఉపయోగకరము.

పథ్యము : లేత వంకాయ, లేత ఆముదపు కాయ, మునగ ఆకు కూర, బీరకాయ

అపథ్యము : నువ్వులనూనె, మునగకాయలు, ఇంగువ, ఎండుచేపలు, ఆవాలు.

లభ్యము : 50 మి.లీ. 100 మి.లీ.

## రాస్నాది తైలము

దీనిని మర్దించినచో ఆమవాతము, పక్షవాతము, సంధివాతము, మన్యాస్తంభము, ఆక్షేపకవాతము, కంపవాతము, అపబాహుకవాతము, మొదలగు వాతవ్యాధులు హరించును. రాస్న వాతహరములలో శ్రేష్ఠమైనది.

## సోమరాజీ తైలము (భై.ర.)

ద్రవ్యములు : బావంచాలు, పసుపు, మానుపసుపు, ఆవాలు, చెంగల్వకోష్టు, కానుగ విత్తులు, తగిరిన విత్తులు, రేల ఆకులు, ఆవనూనె.

గుణము : నాడీవ్రణము, దుష్టవ్రణము, అష్టాదశ కుష్ఠములు, నీలిక, పిటిక, వ్యంగు, గంభీర ధాతుగత వాతరక్తము, కండు, కచ్ఛు, దద్రు, పామ ఇవి నివర్తిం చును.

అనుభూత ప్రయోగములు :

1.నాడీ వ్రణము, దుష్ట వ్రణములందు త్రిఫలా కషాయముతో పరిషేకము చేయుచూ, ఈ తైలముతో అభ్యంగనమును చేయవలెను.

2. కండు,కచ్ఛు,దద్రు,పామలందు పై పూతగా ఈ తైలమును వాడుచూ, గంధక రసాయనము, సరస వాడవలెను.

3. శ్విత్రమునందు సోమరాజీతైలమును పై పూతగా వాడుచూ,

చంద్రప్రభావటి, ఖదిరారిష్ట ఇచ్చిన ఫలితముండును.

పథ్యము : పొట్లకాయ, బీరకాయ, చెరకు రసము, తెల్లగలిజేరుకూర, పొన్న గంటికూర, పాలకూర, వెల్లుల్లి, నీరుల్లి.

అపథ్యము : మినుములు, ఆవాలు, తెలగపిండి, పులుపు పదార్థములు, కల్లు, చేపలు, మలమూత్ర వేగ నిరోధము, అధిక జలపానము.

వాడు విధానము : స్నానమునకు ఒకగంట ముందుగారాచి, తరువాత సున్ని పిండితో స్నానము చేయవలెను.

లభ్యము : 50 మి.లీ. 100 మి.లీ.

## తామర తైలము

ద్రవ్యములు : శుద్ధ గంధకము, శుద్ధ పాదరసము, రస కర్పూరము, రస సిందూరము మొదలగు తీక్ష్ణ పదార్థములతో తయారు చేయబడినది.

గుణము : గజ్జి, తామర, తీట, మొదలగు చర్మ వ్యాధులందు బాగుగా పని చేయును. 3-4 రోజులలోనే పూర్తి నివారణ కలిగించును. రాత్రి పరుండబోవు ముందు రాసుకొని, ఉదయము స్నానము చేయవలెను.

అనుభూత ప్రయోగములు : 1. సామాన్యముగ కలిగే తామరనందు చంద్ర ప్రభావటి, సరస లోనికి వాడుచూ, ఈ లేపమును లేపనముగా వాడిన అధిక గుణ కారి.

పథ్యము : పెసలు, మినుములు, బచ్చలికూర, ఆవు మజ్జిగ, మేకమాంసము.

అపథ్యము : ఆవాలు, నువ్వులు గుమ్మడికాయ, చేపలు, వంకాయ

లభ్యము : 15 గ్రా.

## విషముష్ఠి తైలం

ద్రవ్యములు : శుద్ధ విషముష్టి గింజలు, జొన్నకలి, నిమ్మపండ్ల రసము, ఆము దము, నువ్వులనూనె.

గుణము : సర్వాంగవాతము, సంధివాతము, అస్థివాతము, ఆమవాతము, కఫవాతము, వాతనొప్పులు, విలోమవాతము, అనులోమ వాతము, ఊరుస్తంభవాతము, ధనుర్వాతము మొదలగునవి నశించును.

అనుభూత ప్రయోగములు : కీళ్లనొప్పుల యందు పక్షవాతమునందు అత్యంత ఉపయోగకారి.

1. ఆమవాతమునందు ఈ తైలముతో తేలికగా మర్దనచేయుచూ వాతగజాంకుశ రస, దశమూలారిష్ట ఇచ్చిన శ్రేయస్కరము.

2. శరీరమునందలి ఏ రకమైన నొప్పులకైననూ తైలముచే అభ్యంగనము చేయుచూ, మహాయోగ రాజ గుగ్గులు వాడిన తగ్గును.

3. చలితో కూడిన సంధిగత జ్వరమునందు జ్వరహర ఔషధములిచ్చుచూ ఈ తైలాభ్యంగనము చేసిన ఫలితముండును.

పథ్యము : గోధుమలు, పెసరపప్పు, తేనె,పంచదార, పొట్టి కాకరకాయ.

అపథ్యము : కొత్తబియ్యము, ఉలవలు, పులుపు, కారము, గురుకర అన్నము.

తీసుకొనవలసిన జాగ్రత్త : ఉష్ణకాలమునందు పిత్త ప్రవృత్తి కలవారికి ఇచ్చిన, వేడి చేసి, పైత్యము అధికమై బాధ కలుగును.

ప్రయోగము : లేపనము

లభ్యము : 50 మి.లీ. 100 మి.లీ.

**విషముష్టితైలము**

దీని మర్దనచే పక్షవాతము, సర్వాంగ వాతము, ధనుర్వాతము మొదలగు వాత వ్యాధులు వెంటనే నశించును. దీనిని పూసినచో సుప్తివాతము, కుష్ఠములు, వాత రక్తము చర్మవ్యాధులు నశించును. చర్మమునకు మృదుత్వమును, కాంతియు కలుగును. ఇందు ముషిణిగింజలు కలియుటచే వాత వ్యాధులను హరింపచేయుటలో మిక్కిలి శ్రేష్ఠమైనది.

**కుంతలకాంతి కోకోనట్ ఆయిల్**

200 ఎం.ఎల్. విభీతకి, భృంగరాజరసం, ఉసిరికరసం నీలిరసం.

తలకి – జుట్టురాలుట అరికట్టును. కళ్ళకు, తలకు చల్లదనము కలిగించును.

**లాక్షాది కోకోనట్ ఆయిల్ (అ.హృ)**

200 ఎం.ఎల్. పుడకలక్క, పెరుగుమీద తేట, వట్టివేళ్ళు రక్తచందనం, కుష్ఠం, అతిమధురం.

శరీరమునకు – క్షయ, జీర్ణజ్వరములు, ఉన్మాద, అపస్మార, గర్భిణీ స్త్రీలకు ఉత్తమమైనది. పురుషులకు బలమును, పుష్టిని కలిగించును.

**లాక్షాది కుజంబు (అ.హ్య)**

200 ఎం.ఎల్. పుడకలక్క పెరుగుమీద తేట, అశ్వగంధ, పసుపు, మానిపసుపు.

శరీరమునకు–శరీర సౌష్టవమునకు, రక్తవృద్ధికి సహాయపడును.

**లాక్షాది ఆయిల్ (అ.హ్య)**

200 ఎం.ఎల్. బలా, వట్టివేళ్ళు, పుడకలక్క, ప్రసారిణి, తుంగముస్తలు

శరీరమునకు – దేహదారుఢ్యమునకు, గర్భిణీలకు, మూర్ఛరోగులకు మానసిక రోగులకు, శ్వాసకోశ సంబంధ వ్యాధులందు బాగుగా పనిచేయును.

**లింగవర్ధన తైలము**

200 ఎం.ఎల్. శారిబ, అశ్వగంధ, లొద్దుగ, స్వాదంష్ట్ర, నువ్వుల నూనె.

శరీరమునకు – మగవారి అంగపరిమాణము పెరుగును.

**మధుయష్ట్యాది కోకోనట్ ఆయిల్ (అ.హ్య)**

200 ఎం.ఎల్. అతిమధురం, పాలు, నెయ్యి, కొబ్బరినూనె

తలకు – కంటిశుక్లములకు, ఆమవాతంనందు విశిష్టముగా పనిచేయును. ఇది కొబ్బరినూనెతో చేయబడినది.

**మధుయష్ట్యాది తైలము (అ.హ్య)**

200 ఎం.ఎల్. అతిమధురం, పాలు, నెయ్యి,నువ్వుల నూనె

తలకు – కంటి శుక్లములకు, ఆమవాతం నందు విశిష్టము పనిచేయును.

**మహాకుక్కుట మాంస తైలము (భై.ర.)**

200 ఎం.ఎల్. దశమూలము, బిల్వ, కాశ్మరీ

శరీరమునకు లోపలకు – అన్ని రకముల వాత వ్యాధులందు పనిచేయును.

**మహామాష తైలము (భై.ర.)**

200 ఎం.ఎల్. మినుములు, దశమూలములు, జీవనీయ గణం.

శరీరమునకు లోపలకు – పక్షాఘాతం, అర్ధితవాతం, గృధ్రసీ, దవడపట్టుకు పోవుట వినికిడి శక్తి తగ్గుటయందు బాగుగా పనిచేయును.

**మహారాజప్రసారిణి ఆయిల్ (భై.ర.)**

25 ఎం.ఎల్. ప్రసారిణి, అశ్వగంధ, ఆముదం, బలా

శరీరమునకు– వెన్నుపూస ఎముకలు వంగిపోవుట, అరిగిపోవుట యందు బాగుగా పనిచేయును.

**మాలత్యాది కోకోనట్ ఆయిల్ ( అ.హృ)**

200 ఎం.ఎల్. జాజి, ఖరంజస్వరసం, వరుణస్వరసం.

తలకి – గజ్జి, చుండ్రు, జుట్టురాలుట, దురదలను అరికట్టును, ఇది కొబ్బరి నూనెతో చేయబడినది.

**మాలత్యాది ఆయిల్ (అ.హృ)**

200 ఎం.ఎల్. జాజి ఆకుల స్వరసం.

తలకి – గజ్జి, చుండ్రు, జుట్టురాలుట, దురదలను అరికట్టుట.

**మంజిష్ఠాది తైలము (స.యో.)**

200 ఎం.ఎల్. కుమారి రసం, మంజిష్ఠ, శారిబ

తలకి – కంటి శుక్లములను అరికట్టి, కళ్ళకు చల్లదనమును కలిగించును.

**నాల్పామరాది ఆయిల్ (స.యో.)**

200 ఎం.ఎల్. పర్పాటకం, పసుపు, ఉసిరిక, విభీతకి, మఱ్ఱి,రావి,జువ్వి, మేడిపట్టలు.

శరీరమునకు – గజ్జి,చిడుము,దురదులు, పిత్తజనిత చర్మవ్యాధులందు పైకి రాయవచ్చును.

**నాల్పామరాది కోకోనట్ ఆయిల్ (స.యో)**

100–200 ఎం.ఎల్. పర్పాటకం, పసుపు, ఉసిరిక, విభీతకి, మఱ్ఱి, రావి,జువ్వి, మేడిపట్టలు

శరీరమునకు తలకి–గజ్జి, చిడుము, దురదలు, పిత్తజనిత చర్మవ్యాధులందు పైకి రాయవచ్చును. కొబ్బరినూనెతో చేయబడింది.

**నింబామృతాది కేస్టర్ ఆయిల్ (అ.హ్ర)**

50 & 200 ఎం.ఎల్. వేప, గుడూచి, చేదుపొట్ల

శరీరమునకు, మరియు లోపలకి 1-10 ఎం.ఎల్. ఆమవాతం, చర్మరోగము లందు వాడవచ్చును.

**పంచామ్ల తైలము (స.యో.)**

200 ఎం.ఎల్. పంచామ్లములు, మజ్జిగ, గోమూత్రం.

శరీరమునకు తలకి - రక్తహీనత, శరీరమునకు గట్టిదనము కలిగించును.

**పంచవల్కాది కోకోనట్ ఆయిల్ (స.యో.)**

200 ఎం.ఎల్. పంచవల్కములు, పసుపు, కొబ్బరి నూనె.

శరీరమునకు - చర్మకాంతిని పెంపొందించి, గజ్జి, చర్మ రోగములను తగ్గిం చును.

**పారన్త్యాది కోకోనట్ ఆయిల్ (స.యో)**

200 ఎం.ఎల్. పరంతిమూలం, మేడి, న్యగ్రోధమూలం

శరీరమునకు-సర్పవిషములను తొలగించిన తరువాత గాయములను కడుగు టకు, గజ్జి, దురదలయందు పనిచేయును.

**పరిణతకేర్యాది తైలము (స.యో.)**

200 ఎం.ఎల్. పరిణత, కొబ్బరిపాలు, నిమ్మపళ్ళరసం.

శరీరమునకు - అపబాహుకము, వాతరోగములందు, చర్మకాంతి పెంపొం దించుటకు ఉపయోగపడును.

**ప్రభంజన విమర్ధన కుజంబు (స.యో.)**

200 ఎం.ఎల్. బలా, శతావరి, మునగ, జిల్లేడు, కరంజ

శరీరమునకు - పక్షాఘాతం, వాపులు,నొప్పులు, మొద్దుబారుట, శక్తికోల్పోవుట, హైడ్రోసిల్‌యందు పనిచేయును.

**ప్రభంజన విమర్ధన తైలము (స.యో)**

200 ఎం.ఎల్. బలా, మునగ, జిల్లేడు, కరంజ

శరీరమునకు - శరీరనొప్పులకు, వాత వ్యాధులందు విశిష్టముగా పనిచేయును.

**ప్రపుండరీకాది తైలము (అ.హృ)**

200 ఎం.ఎల్. ఉసిరిక, ఇప్పపువ్వు, పుండరీకవేరు

తలకి – చర్మము యొక్క ముడతలు పోగొట్టును. శిరోరోగము లందు శ్రేష్ఠము.

**ప్రసారిణి తైలము (భై.ర.)**

200 ఎం.ఎల్. ప్రసారిణి, ములుగోరింట, శతావరి, బలా

లోపలికి శరీరమునకు–ఆమవాతం, నొప్పులు, వాపులు, కీళ్ళవాతము, శరీరము శోషయందు బాగుగా పనిచేయును. సంభోగశక్తి పెంచును.

**సహాచరాది కుజంబు (అ.హృ.)**

200 & 450 ఎం.ఎల్. ములుగోరింట, దశమూలములు, శతావరి, ఆముదము.

శరీరమునకు – కణితులు, కంపవాతము, ఆక్షేపక, శోషయుక్త వాత వ్యాధు లందు, యోనిరోగములందు, కటి శూలలందు విశిష్టముగా పనిచేయును.

**సహచరాది తైలము (అ.హృ)**

100,400,450 ఎం.ఎల్. ములుగోరింట, దశమూలములు, శతావరి నువ్వుల నూనె.

శరీరముపైకి – కణితులు, కంపవాతము, ఆక్షేపక, శోషయుక్త వాత వ్యాధు లందు, యోనిరోగములందు, కటీ శూలలందు విశిష్టముగా పనిచేయును.

**శుద్ధబలా తైలము (స.యో.)**

200 ఎం.ఎల్. బలా మూలం, ఆవుపాలు

శరీరమునకు సమస్తవాత రోగములందు, గర్భిణీ స్త్రీలకు శ్రేష్ఠము.

**తేకరాజ కోకోనట్ ఆయిల్ (స.యో.)**

200 ఎం.ఎల్. భృంగరాజస్వరసం, కరక్కాయ కల్కం

తలకి – శ్వాసకాసం, తలలో వేడి, చెమటలను తగ్గించును. ఇది కొబ్బరి నూనెతో చేయబడినది.

**తేకరాజ తైలము (స.యో.)**

200 ఎం.ఎల్. భృంగరాజస్వరసం, కరక్కాయ కల్కం

తలకి – శ్వాసకారం, తలలో వేడి,చెమటలను తగ్గించును.

**త్రిఫలాది ఆయిల్ (స.యో.)**

200 ఎం.ఎల్. త్రిఫల, గుడూచి, అసన, బలా, ఆముదము, చెట్టువేళ్ళు తలకి – జలుబు, తల, కళ్ళకు సంబంధించిన వ్యాధులందు విశేషముగా పని చేయును.

**త్రిఫలాది కోకోనట్ ఆయిల్ (స.యో.)**

200 ఎం.ఎల్. త్రిఫల, గుడూచి, అసన, బలా, ఆముదము, చెట్టువేళ్ళు.

తలకి – జలుబు, తల, కళ్ళకు సంబంధించిన వ్యాధులందు విశేషముగా పని చేయును. ఇది కొబ్బరి నూనెతో చేయబడినది.

**తులస్యాది తైలము (స.యో.)**

200 ఎం.ఎల్. తులసి స్వరసం, సాంబ్రాణి

తలకి నశ్యకర్మకు – ముక్కునుండి వచ్చు దుర్గంధములకు, నశ్యకర్మ చేసిన శమించును. తలకురాసిన చుండ్రు, జలుబు హరించును.

**వచాది కోకోనట్ ఆయిల్ (స.యో.)**

200 ఎం.ఎల్. వచ, కరక్కాయ, పుడకలక్క, వావిల, రక్తచందనం.

శరీరముపైకి – అపచి, కంటి శుక్లములు, బోదకాలు యందు శ్రేష్ఠము పని చేయును.

**ఎలనీర్ కుజంబు (స.యో.)**

10 ఎం.ఎల్. దారుహరిద్ర, త్రిఫల, కొబ్బరినీళ్ళు

కంటిచుక్క మందు – కంటి శుక్లములు నివారించుటకు, కంటిచూపును పెంపొందించుటకు శ్రేష్టము.

**కాచ్యపానము కుజంబు (అ.హృ)**

10 ఎం.ఎల్. సముద్ర నురగు

కంటిచుక్కల మందు – కంటి శుక్లములందు శ్రేష్ఠము.

**నయనామృతము కుజంబు (అ.హృ)**

10 ఎం.ఎల్. మిరియాలు, పిప్పళ్ళు, అంజనము

కంటి చుక్కల మందు – నేత్రదృష్టి రక్షణకు పనిచేయును.

# భస్మములు

## అభ్రక భస్మము (బ.రా)

ద్రవ్యములు : శుద్ధ అభ్రకము

గుణములు : శీతవీర్యము, స్నిగ్ధము, దీపనము, వాత, పిత్త క్షయలను, వృద్ధాప్యమును హరింపజేయును. బుద్ధిప్రదము, వీర్యవృద్ధికరము, ఆయుర్వ వృద్ధికరము, బలమును కలుగజేయును. కఫమును హరించును. రసబంధనకారి.

5 గ్రా. ధాన్యాభ్రకము, జిల్లేడుపాలు, స్నుహిపాలు, మొ॥ వాటితో గజపుటములు వేయుదురు. 101 సార్లు

లోపలికి 100-200 మి.గ్రా. తేనెతో - హృద్యము, రక్తవృద్ధికరము, ప్రమేహ హరము, రసాయనము.

అనుభూత ప్రయోగములు : రక్తవర్ధకము, రసాయనము, సర్వరోగహరము, హార్మోనుల నిర్మాణమునందు ఉపయోగకారి, త్రిదోషహరము, ఇంద్రియ నిగ్రహము కలిగించును. ఉన్మాదము, ఓజోక్షయములను పోగొట్టి, హృదయమునకు బలమును కల్గించును.

1. వాత, పిత్త క్షయలందు అకీకపిష్టి, ద్రాక్షారిష్టలతో వాడుచూ, లక్షణానుసార చికిత్స చేసిన త్వరితగతిని దోషహరము కాగలదు.

2. వీర్యవృద్ధికై 10 గ్రా. అభ్రకభస్మము, అశ్వగంధాది లేహ్యము (స్పెషల్) నెర్విటాల్ కలిపి తీసుకొనిన, వీర్యోత్పత్తి జరుగును.

3. ఆయుర్వృద్ధికి అభ్రక భస్మము, చ్యవన్‌ప్రాశలతో తీసుకొనిన అమృత తుల్య ముగా పనిచేయును.

4. 600 మి.గ్రా. భస్మమును పిప్పిలీ చూర్ణము, తేనెలతో కలిపి పుచ్చుకొనిన మేహములు, శ్వాసకాసరోగములయందు, విషమకుష్ఠము, క్షయ, కామిల, పాండుల యందు బాగుగా పనిచేయును.

5. వింశతి మేహములను హరించును.

6. క్షయలకు స్వర్ణ భస్మముతో సేవించవలెను.

7. ధాతువృద్ధి కొరకు అశ్వగంధాది లేహ్యము, నెర్విటాల్‌లతో సేవించలెను.

8. పిత్తరోగములకు ఆవుపాలు, చక్కెరలతో సేవించవలెను.

9. ప్రదర రోగమునందు గుడూచిసత్వము, బియ్యపు కడుగునీరుతో సేవించవలెను.

10. నేత్రరోగమునందు త్రిఫల చూర్ణము, తేనెలతో సేవించవలెను.

11. క్షయనందు సితోఫలాది చూర్ణము, చ్యవనప్రాశలతో సేవించ వలెను.

12. త్రిఫలములు, నేరేడుపప్పు, పసుపు, నేలతాడి, బూరుగబంక వీనియొక్క చూర్ణమును మూడురెట్లుచేర్చి మర్రివూడలకషాయముతో అసాధ్యమగు మధుమేహము, అతిమూత్రము, మూత్రకృచ్ఛ్రము, శు క్లనష్టమునందు.

13. రెట్టింపు త్రిఫలాచూర్ణము, పంచదార వీనితో నోటిపూత, పొడిదగ్గు, ఆయాసము, గుండెదడ, వ్రణములు, భగందరములు, రక్తార్శస్సు, రక్తాతిసారము.

14. మూడురెట్ల సితోఫలాది చూర్ణము, వెన్న వీనితో మేహక్షయ, కాళ్లు చేతులు మంటలు

15. ఏలక్కాయలు, ధనియాలు,దాల్చినచెక్క, వీనియొక్క రెట్టింపు చూర్ణముతో పైత్యవ్యాధులు.

16. సమానమగు షడ్గుణము, రెట్టింపు పిల్లిపీచర చూర్ణము, గుమ్మపాలు వీనితో శరీరముశుష్కించుట, బలహీనత, శరీర మెల్లప్పుడు వెచ్చగ నుండుట. వీర్యము పలచగ నుండుట, సంభోగశక్తి సరిగలేకుండుట

17. సుగంధిపాలపొట్టు, చందనపుపొట్టు, పెన్నేరు, అతిమధురము, వీనియొక్క రెట్టింపు చూర్ణము కలబంద రసము వీనితో జీర్ణించిన సెగ వ్యాధులు, మూత్రనాళ మందలి మంట చురుకు,పోటు, మూత్రము బంధించుట మూత్రము సన్నముగ వచ్చుట.

18. కర్పూరశిలాజిత్తు భస్మము, ఏనుగపల్లేరు, ఆరెపువ్వు, మామిడి టెంకలోనిపప్పు, రెట్టింపు వీని చూర్ణము, బియ్యపు కడుగువీనితో సమస్త ప్రదరములు, యోని దోష ములు, గర్భాశయదోషములు

19. నాలుగురెట్లు సరస్వతీయాకు చూర్ణము, పంచదార వీనితో ఉ న్మాదము, మూర్ఛ, అపస్మారము, భ్రమ, జ్ఞాపకశక్తి సరిగ లేకుండుట, స్వరదోషములు

20. వరిపేలాలు పత్తిగింజలోనిపప్పు రెట్టింపు వీని చూర్ణము, తేనె వీనితో సమస్త ఛర్దులు, ఎక్కిళ్లు, గర్భ స్రావములు.

21. మూడురెట్ల త్రిఫలాచూర్ణముతో దీర్ఘకాలమునుండియున్న జిగట, వేడి వలన కలిగిన మలబంధము వీనిని నిశ్చయముగ హరించును. అభ్రకము యోగము కావున సమశీతముగ పనిచేయుచు వాతపిత్తశ్లేష్మముల వలన కలిగిన వ్యాధులను నశింపజేయును. ఇంద్రియములకు బలమునిచ్చును. కామవృద్ధిని చేయును. వంధ్యా దోషములను పోగొట్టును. కాంతిని కలిగించును. ఆయువును వృద్ధిపరచును. ఉడుకు వలన కలిగిన సమస్త వ్యాధులయందును అమోఘముగ పనిచేయును.

పథ్యము : ద్రాక్షపండ్లు, ఖర్జూరము, ఉసిరిక, పాలు, నెయ్యి మొదలగునవి అధికముగా సేవించిన మంచిది.

అపథ్యము : కొత్తబియ్యపు అన్నము, వెల్లుల్లి, కారము, దొండకాయ, బెండ కాయ, తాంబూలము.

మోతాదు : 60-250 మి.గ్రా. రోజుకు రెండుసార్లు తేనె లేదా వ్యాధ్యనుసార అనుపానముతో సేవించవలెను.

లభ్యము : 5 గ్రా. 10 గ్రా.

## అకీక పిష్టి (ర.సి.సం)

ద్రవ్యములు : శుద్ధ అకీకము

గుణములు : శీతవీర్యము హృదయ నిర్బలత్వము, ఉష్ణత, హృదయ రోగములు, మస్తిష్క ఉష్ణత, నేత్రరోగములు, రక్తప్రదములను నివారించి శరీరమునకు బలము నిచ్చును. ఉరః క్షతము, పుప్పుస వ్రణము, మానస విషాదము, హిస్టీరియాలందు ఉపయోగకారి. హృదయమునకు, మస్తిష్కమునకు బలమును కల్గించును.

శాస్త్రీయ ప్రయోగములు : 1.రక్తస్రావ శోధనమునకు అకీకపిష్టి, తృణకాంతమణి పిష్టి,అభ్రకభస్మం, తిప్పసత్తులను కలిపి ఇచ్చిన సత్వర లాభము కలుగును.

అనుభూత ప్రయోగములు :

1. హృదయ నిర్మలత్వమునకు అనగా గుండె బరువుగా ఉండుట, గుండెదడ, మొదలగు లక్షణములు లేకుండుటకు ముత్యభస్మము 500

మి.గ్రా. రెండు చెంచాల నెర్విటాల్‌తోగానీ, అశ్వగంధ లేదా శతావరీ లేహ్యము లతో కలిపి తీసుకొనవచ్చును.

2. యోషాపస్మారమునందు 250 మి.గ్రా. రసరాజరస (కాంపౌండ్) 500 మి.గ్రా.కు జతచేసి, అనుపానముగా తేనె నిచ్చుచూ అశ్వగంధ లేహ్యము, నెర్విటాల్ ఇచ్చిన, అధిక గుణకారి కాగలదు.

3. రక్తప్రదమును నివారించుటకు ప్రదరాంతకరసతో ఇచ్చుచూ, అనుపాన ముగా యుటిరిల్ లేదా అశోకారిష్ట వాడిన రక్తహీనత తగ్గుటయేగాక శరీరమునకు బలము, తేజస్సులను కలిగించును.

పథ్యము : పేలాలగంజి, ముదురు గుమ్మడికాయ, బీరకాయ, పొట్లకాయ, దానిమ్మపండు, పాతనెయ్యి, పాతబియ్యము.

అపథ్యము : కొత్తబియ్యము, నూనె, వంకాయ, కారము, దొండపండ్లు, కందులు; మలమూత్ర వేగనిరోధము, చింత, శోకము, భయము, క్రోధము, ఎండ.

అనుపానము : తేనె, వెన్న, మీగడ

మోతాదు : 125-375 మి.గ్రా. తేనెతో ఉదయము, సాయంత్రము సేవించ వలెను.

లభ్యము : 5 గ్రా. 10 గ్రా.

## అయస్కాంత భస్మము

దీనిని 1. నేలతాడి, మిరియాలు, కటుకరోహిణి, కరకబెరళ్ళు, వీనియొక్క రెట్టింపు చూర్ణముతో నంజు, అజీర్ణము, పాండువు, జీర్ణజ్వరము.

2. పిప్పళ్లు చవ్యము, సన్నరాస్నము, వీనియొక్క రెట్టింపు చూర్ణము తేనె వీనితో దగ్గు, ఆయాసము, క్షయ, శ్లేష్మ వ్యాధులు.

3. మూడు రెట్ల అతిమధురచూర్ణము, పంచదార వీనితో గుండెదడ మొదలగు గుండె వ్యాధులు, ఉన్మాదము మొదలగు మెదడు వ్యాధులు.

4. రెట్టింపు మిరియాల చూర్ణముతో బహిష్టు సరిగ కాకుండుట, శ్వేత రక్త ప్రదరములు.

5. తేనెతో స్థౌల్యరోగములు

6. వాయువిడంగములు, ముత్తవ పులగపువేళ్ళు, మోడి వీనియొక్క రెట్టింపు చూర్ణము, తేనె వీనితో సమస్తమగు వాతవ్యాధులు,

సూతికావ్యాధులు, గుల్మము, ఉదర వ్యాధులు, ప్లీహయకృద్వ్యాధులు. వీనియందియ్యవలయును. రక్తమును శుభ్ర పరచి వృద్ధిపరచుటలో మిక్కిలి శ్రేష్ఠమైనది. అనుపాన భేదముతో రక్తదోషములు, చర్మ దోషములు, జీర్ణించిన సవాయి వ్యాధులు మొదలగువాని యందు వాడవచ్చును. మోతాదు 1/4 చి॥ మొ॥ 3/4 చి. వరకు

**కాంత భస్మము (స.యో.)**

10 గ్రా. శోధితకాంతం, గోమూత్రం, కుమారి స్వరసం.

500 మి.గ్రా. 1 గ్రాము తేనెతో – గుల్మం, పాండు, క్షయ రోగములందు బాగుగా పనిచేయును.

**గంధక భస్మము**

ఇది 1. రెట్టింపు త్రిఫలాచూర్ణము, పంచదార, వీనితో అష్టాదశ కుష్ఠములు, సవాయివ్యాధులు,చర్మవ్యాధులు, రక్తదోషములు, భగందరములు, మేహవ్రణములు, బొబ్బలు, గ్రంధులు

2. తమలపాకు రసముతో రసదోషములు, వీనిని వెంటనే హరింపచేయును. రక్తశుద్ధిని చేయుటలో కడు శ్రేష్టమైనది. మోతాదు 1/4 చి॥ మొ॥1/2చి. వరకు.

**గవ్వల భస్మము**

ఇది 1. రెట్టింపు మిరియాల చూర్ణముతో అజీర్ణము, దగ్గు, ఆయాసము, శ్లేష్మ ప్రకోపము

2. నిమ్మకాయరసముతో కడుపునొప్పి, శూల

3. తేనెతో అజీర్ణ విరేచనములు, గ్రహణివిరేచనములు వీనిని వెంటనే హరిం చును. చెవిలో పోటుకు నిమ్మకాయరసములో కలిపి పోయవచ్చును.

మోతాదు 1/4 చి॥ మొ॥ 1/2 చి. వరకు.

**హేమమాక్షిక భస్మము**

ఇది 1. తేనెతో పాండువు, అజీర్ణము, గుండె వ్యాధులు, దగ్గు, ఆయాసము

2. వెన్నతో శుక్లనష్టము, నోటిపూత, బలహీనత, తిమ్మిర్లు, వీనిని నశింప జేయును.

ఇది బంగారము యొక్క గుణములను కలిగియుండునని చెప్పెదరు.

మోతాదు 1/4 చి॥ మొ॥ 1/2 చి. వరకు

**ఇంగిలీక భస్మము (వై.చిం.)**

ద్రవ్యములు : శుద్ధ ఇంగిలీకము, శుద్ధ తాళకము, లవంగములు.

గుణములు : పుష్టిని కలుగజేయుటయేగాక, పాండు, క్షయ, శూలలను హరిం చును. సర్వరోగహరము.

అనుభూత ప్రయోగములు : వీర్యవృద్ధికరము, కఫవాతములను నశింప చేయును. సవామేహము, రక్తదోషము, శ్లేష్మదోషములు మొదలగునవి హరించును. ఉష్ణవాతమును పోగొట్టును. మేహములు, కుష్ఠములను హరించును. 1. ధాతుపుష్టికై అభ్రక భస్మము, శుద్ధగంధకము, ముత్య భస్మము, వైక్రాంత భస్మము, గోమూత్ర శిలాజిత్ సమపాళ్ళలో కలిపి 2 గ్రా. చొప్పున ఉదయము సాయంత్రము చ్యవనప్రాశ లేహ్యముతో తీసుకొనిన ధాతువృద్ధి నొందును.

2. పాండువు నందు కాసీస భస్మము, పునర్నవాది మండూరము,క్రిమిముద్గర రసములతో కలిపి ఇచ్చుచూ పునర్నవారిష్ట ఇచ్చిన, పాండురోగహరము.

3. శూలయందు 500 మి.గ్రా. ఇంగిలీక భస్మము శూలకల్పమునందు కలిపి ఇవ్వవచ్చును.

పథ్యము : ఆవు లేదా గేదె నెయ్యి, ఖండ శర్కర, మధుర రసములు, ద్రాక్షపండ్లు

అపథ్యము : కొత్తబియ్యపు అన్నము, ఆవనూనె, చేపలు, ఊరగాయలు.

అనుపానము : తమలపాకు

మోతాదు : 125 మి.గ్రా. చొప్పున రోజుకు రెండుసార్లు తమలపాకుతో సేవించవలెను.

లభ్యము : 5 గ్రా. 10 గ్రా.

**జహర్ మొహర భస్మము (ర.సి.స)**

ద్రవ్యములు : శుద్ధ జహర్ మొహర

గుణము : శీతలము, పాచన సంస్థాన బల్యం, హృదయపుష్టికరం, పిల్లలకు కలుగు అతిసారము, అజీర్ణజ విసూచిక, వమనముల యందు గుణకారి. వాతవాహి నులకు, హృదయమునకు బలము నిచ్చును.

క్రిములను నశింపచేసి, అమాశయమును దోషరహితముగా ఉంచు ఉత్తమౌషధము.

శాస్త్రీయ ప్రయోగము : 1. అతిరక్తస్రావము జరుగు స్త్రీలకు జహర్‌మొహర భస్మము, ప్రవాళపిష్టి, అభ్రకభస్మము, తిప్పసత్తు మరియు కాసీసగోదంతి భస్మములను కలిపి తేనెతో రోజుకు 2-3 సార్లు ఇచ్చుట వలన రోగనివృత్తి యగును.

2. రక్తపోటు వలన తల బరువుగా ఉండుట, కళ్లు ఎఱ్రబడుట, ఆందోళనల యందు జహర్ మొహరభస్మం, సోడాబైకార్బ్, గులఖంద్‌లను కలిపి రోజుకు 3-4 సార్లు ఇచ్చుట లాభకరము.

అనుభూత ప్రయోగములు : పిల్లలకు కలుగు అజీర్ణ, అతిసారములందు దాడిమాష్టక చూర్ణముతో కలిపి మజ్జిగతో ఇచ్చిన, ఆమాశయము దీప్తినొంది, విరేచన ములు తగ్గును.

పథ్యము : దానిమ్మపండ్లు, అరటిపువ్వు, అరటి పిందెలు, వెలగకాయ, నీరుల్లి పాయ, బూడిద గుమ్మడికాయ.

అపథ్యము : గోధుమలు, బఠాణీలు, యవలు, మినుములు, అలసందలు, మునగకాయ, చింతపండు, తాంబూలము

అనుపానము : తేనె

మోతాదు : 125-500 మి.గ్రా. చొప్పున రోజుకు మూడుసార్లు సేవించవలెను.

లభ్యము : 5 గ్రా.

## కర్పూర శిలాజిత్ భస్మం (ర.సి.స.)

ద్రవ్యములు : శుద్ధ కర్పూర శిలాజిత్

గుణము : మూత్రకృచ్ఛ్రము, అశ్మరి, ప్రమేహము, కామల, మరియు పాండు రోగములు హరించును.

ఇది 1. పంచదారతో కాళ్ళమంటలు, నోటిపూత, నడుమునొప్పులు, శుక్ల నష్టము,మేహవ్యాధులు 2. కలుబందరసముతో సెగవ్యాధులు, మూత్రము పోవునపుడు బాధ, శరీరతాపము, దప్పిక 3. ద్రాక్షపండ్ల రసముతో పైత్యవ్యాధులు, తలనొప్పి, వీనిని వెంటనే నివారింపజేయును. త్వరలో చలువ చేయు మందులలో నిది శ్రేష్ఠ మైనది. కనుక వేడి వలన

కలిగిన వ్యాధులన్నిటి యందును దీనిని వాడవచ్చును. మోతాదు 1 చి॥ మొ॥ 1 1/2 చి॥ వరకు.

అనుభూత ప్రయోగములు : ప్రమేహము, జ్వరము, ప్లీహరోగము, శ్లేష్మరోగము, వాతరోగము, అగ్నిమాంద్యము, కుష్ఠము, శోఫ, రాజయక్ష్మ, ఉన్మాదము, వాపు, శర్కర, క్రిమిరోగము, రొమ్ముసొప్పి, ఆమ్లపిత్తము, ఉదరము మొదలగువానిని హరించును. శరీరమునకు కాంతి, పుష్టి, బలములను కల్గించును. గనేరియా, మరియు అత్యుష్ణములందు బాగుగా పనిచేయును.

1. మూత్ర కృచ్ఛ్రమునందు గోక్షురాది చూర్ణము, శతావరీ చూర్ణములతో కలిపి, కొబ్బరి నీళ్లు లేదా బార్లీ జావతో తీసుకొనిన నొప్పి తగ్గి, మూత్రము సాఫీగా జారీ అగును.

2. అశ్మరీనందు రాస్నాక్వాథముతో ఇచ్చిన రాళ్ళు పడిపోవును.

3. ప్రమేహమునందు పంచతిక్తారిష్ట, చంద్రప్రభావటి,చందనాది వటిలతో ఇచ్చిన, అనేక ప్రమేహముల నివారణ కలుగును.

4. గనేరియానందు నేల ఉసిరిక, కలబంద స్వరసములను అనుపానముగా తీసుకొనవలెను.

5. వేసవికాలమునందు చందనము, గుడూచీ సత్వముతో సేవించిన శీతల కారిగా పనిచేయును.

పథ్యము : పాతమంచి బియ్యము, ఆవు మజ్జిగ, ఎర్రబియ్యము, పొట్లకాయ, కొండపిండి ఆకుకూర, పల్లేరు కూర, కొబ్బరినీరు, తాటిముంజెలు, తేలికగా జీర్ణ మగు ఆహారము, కాచి చల్లార్చిన నీటిని మాత్రమే సేవించవలెను.

అపథ్యము : మలబద్ధకర అన్నము, బిరుసైన అన్నము, లవణము, ఇంగువ, నువ్వులు, ఆవాలు, వెల్లుల్లి, వాహనయానము.

మోతాదు : 150-500 మి.గ్రా. చొప్పున రోజుకు రెండుసార్లు సేవించవలెను.

లభ్యము : 10 గ్రా.

**ఆవిల్‌తోలాది భస్మం (స.యో.)**

10 గ్రా. పూతికావల్కం, శిఖరి, శామ్యాకా

లోపలికి 200-500 మి.గ్రా. తేనెతో ఉదరం, రక్తహీనతలందు ఉపయోగము.

**కళ్యాణ క్షారము (స.యో.) (అ.హృ)**

10 గ్రా. త్రికటు, దంతి, సైంధవ, సముద్ర, బిడా లవణములు.

1-2 గ్రా. నెయ్యితో - ఉదరము, మొలలు, రక్తహీనత, మూత్రబంధము, గుల్మం, క్రిమియందు ఉపయోగించవలెను.

**కస్మద భస్మము (స.యో)**

10 గ్రా. శిలాజిత్తు, పాలు

500 మి.గ్రా. 1 గ్రాము. తేనెతో – సుఖవ్యాధులు, మూత్రాఘాతము, శ్వేత ప్రదరం, ప్రమేహం నందు శ్రేష్ఠము.

**కాంతలోహ భస్మము (ర.సి.సం.)**

ద్రవ్యములు : శుద్ధ కాంతలోహము

గుణము : ధాతుక్షీణత, శోథ, సంగ్రహణి, రక్తక్షీణత, పాండువులయందు గుణకారి

ఇది బహుసౌమ్యముగ పనిచేయును. గర్భిణీ స్త్రీలకు కూడ వాడవచ్చును. 1.రెట్టింపు త్రిఫలాచూర్ణముతో పాండువు, నంజు, ప్రదరములు

2. రెట్టింపు పిప్పళ్ళ చూర్ణముతో అజీర్ణము, దగ్గు, ఆయాసము, శ్లేష్మవ్యాధులు.

3. తేనెతో గర్భిణీ స్త్రీలకు కలుగు పాండు వ్యాధి ఇవి హరించును. ఇది రక్త శుద్ధిని రక్త వృద్ధిని చేయును. మోతాదు 1/4 చి. మొ॥ 1/2 చి.వరకు.

అనుభూత ప్రయోగములు : 1 ధాతుక్షీణత యందు నారసింహలేహ్యము, (భస్మములతో కూడినది) శతావరి లేహ్యములతో కలిపి వాడుచూ, పాలు అధికముగా సేవించుచున్న, ధాతువృద్ధి కలుగును.

2. శోథయందు పునర్నవారిష్ట, పునర్నవాది మండూరములతో ఇచ్చిన శోథ హరము కాగలదు.

3. రక్తక్షీణత యందు కాశీసభస్మము, అబలసుధలతో కలిపి ఇచ్చుచూ జంబీర రసాయనముతో ఇచ్చిన రక్తవృద్ధి కరము కాగలదు.

పథ్యము : పొట్లకాయ,బీరకాయ,చెరకురసము,పాలకూర, తెల్లగలిజేరుకూర, ఉసిరికాయ.

అపథ్యము : చేపలు, ఆవాలు, మినుములు, పులుపు పదార్థములు, తాంబూలము.

అనుపానము : తేనె మరియు పిప్పలి లేదా చ్యవన ప్రాశలేహ్యము.

మోతాదు : 125 మి.గ్రా.

లభ్యము : 5 గ్రా.

## కంచుభస్మము

దీనిని 1. కరక్కాయగంధముతో గాని తేనెతోగాని యిచ్చిన యెడల శ్లేష్మ సంబంధమగు దగ్గు, ఆయాసము, క్షయ, శ్లేష్మ ప్రకోపము, వాతవ్యాధులు, అజీర్ణము మొదలగునవి హరించును. మోతాదు 1/4 మొ॥ 1/2 చి. వరకు.

## ఖడ్గలోహభస్మము

దీనిని ఉక్కులోహభస్మము లేక లోహ భస్మము అనికూడ అందురు. మిక్కిలి తీవ్రముగ చురుకుగ పనిచేయును.

1. ఉసిరికపప్పు శొంఠి వీనియొక్క రెట్టింపు చూర్ణముతో పాండువు, అజీర్ణము, తిమ్మెర్లు, కామిర్లు, కుంభకామిల

2. రెట్టింపు త్రికటుక లేక సితోఫలాది చూర్ణముతో నంజు, జీర్ణజ్వరము, క్షయ, కాసశ్వాసలు, వాత వ్యాధులు, అతిసారము

3. త్రికటుకములు పంచలవణములు, వీనియొక్క మూడురెట్లు చూర్ణముతో ఉదర వ్యాధులు, ప్లీహవ్యాధులు, యకృద్వ్యాధులు, శూలలు

4. తేనెతో శ్లేష్మవ్యాధులు, ఋతుశూలలు, మైల సరిగ వెడలకుండుట, శరీరము లావుపారుట వీనిని వెంటనే హరింపజేయును. రక్తవృద్ధిని శరీరపుష్టిని చేయును.

మోతాదు 1/4 చి. మొ॥ 1/2 వరకు.

## కుక్కుటాండత్వక్ భస్మము (ర.సి.సం.)

ద్రవ్యములు : కోడిగుడ్డు డొల్లలు, ఇంగిలీకము.

గుణము : ఉత్తమ సుధాకల్ప, హృదయ పౌష్టిక రసాయనము,

రససంస్థానము నకు బల్యము, మాంసధాతు వృద్ధికరము, వాజీకరము, ప్రమేహము, కఫ, వాత, వికారములు, శుక్రమేహములందు గుణకారి మస్తిష్కమునకు బలము నిచ్చును.

శాస్త్రీయ ప్రయోగము : 1. చిన్న వయసులో అధిక సంతానము వలన నిర్బలు లైన స్త్రీలకు సితోపలాది చూర్ణముతో నిచ్చిన శరీరమునకు బలము చేకూరును.

2. రక్తకణములు వృద్ధి అగును. జీర్ణశక్తి పెరుగును.

3. రక్త, శ్వేత ప్రదరములు, బహుమూత్రముల యందు గుణకారి స్త్రీలు ప్రసవా నంతరము సేవించుట వలన పూర్వరూపమును పొందగలరు.

అనుభూత ప్రయోగములు : ఎముకల దృఢత్వమును పెంచును. శరీరమునకు బలమును కలిగించును. బాలురలో వచ్చు అనాస రోగము, అస్థిశోషము, మరియు ప్రమేహము, బహుమూత్రము మొదలగు మూత్ర వ్యాధులందు గుణకారి.

1. హృదయ పౌష్టిక రసాయనముగా వాడవలెనన్న 1గ్రా. కుక్కుటాంత్వక్ భస్మము, ఆకీకపిష్టి, ముత్య భస్మములతో కలిపి, చ్యవనప్రాశ లేహ్యముతో తీసుకొనిన, హృదయ దౌర్బల్యము నశించును.

2. వాజీకరణముగా వాడుటకు అభ్రక భస్మము, శతావరీ చూర్ణము, అశ్వగంధ చూర్ణము, దూలగొండి విత్తుల చూర్ణములతో కలిపి, రత్నపురుష లేహ్యము అనుపాన ముగా ఇవ్వవచ్చును.

3. శుక్ర మేహమునందు చంద్రప్రభావటి, చందనాదివటి ఒక్కొక్కటి చొప్పున భోజనాంతరము ఇచ్చుచూ, ఇంగిలీక భస్మము 1 గ్రా. తేనెతో తీసుకొనిన శుక్ర మేహము నశించును.

పథ్యము : ద్రాక్షపండ్లు, ఖర్జూరము, ఉసిరిక, మామిడి, కస్తూరి, శ్వేత చందనము, పాలు, నెయ్యి

అపథ్యము : కొత్తబియ్యపు అన్నము, వెల్లుల్లి, కారము, దొండకాయ, బెండ కాయ, తాంబూలము.

అనుపానము : వెన్న,మీగడ,పాలు, చ్యవనప్రాశలేహ్యము,

ఉసిరికరము లేదా దానిమ్మరసము.

## లోహభస్మము (వై.చి.)

ద్రవ్యములు : శుద్ధలోహము

గుణము : పాండురోగము, జంతువికారము, వాయువు, క్షీణత, పిత్తవ్యాధి, స్థూలత్వము, మూలవ్యాధి, సంగ్రహణి, కఫము, వాపు, ప్రమేహము, గుల్మము, ప్లీహము, విషము, ఆమవాతము, శరీరమునందు తెలుపు, మేహము, కుష్టము, వలీపలితములు, రక్తవాతము, జరామరణము, వలి, కామిల, క్షయ వీనిని నశింప చేయుటయేకాక, బలము, స్త్రీలయందిష్టము, సౌఖ్యము, రసాయనము, దృష్టి నైర్మ ల్యము, రూప సంపత్తులను కలుగజేయును.

రసాయనము, దీపనము, రక్తవృద్ధికరము, గ్రహణి, అతిసారములు, కఫవాత రోగములను హరించును.

అనుభూత ప్రయోగములు :

1.పాండురోగమునందు కాశీసభస్మము, ఆబలసుధలతో కలిపి, పునర్నవారిష్ట అనుపానముగా ఇచ్చుచూ క్రిమిఘ్నమునకై క్రిమికుఠార రస లేదా, నేరేడు పండ్లు తినిపించుట చేసిన యెడల పాండురోగము తగ్గును.

2. కామిలనందు నేల ఉసిరకస్వరసముతో ఇచ్చుచూ, చ్యవనప్రాశ లేహ్యము, త్రికటుచూర్ణములతో ఇచ్చిన రక్తక్షీణత తగ్గి కామిల హరము కాగలదు.

3. క్రిములవలన కలిగే రక్తక్షీణత యందు క్రిమిఘ్న ఔషధములు ఇచ్చుచూ, లోహభస్మము, మాదీఫల రసాయనముతో ఇచ్చిన రక్తక్షీణత తగ్గును.

పథ్యము : తోటకూర, పొట్లకాయ, బీరకాయ, చెరకు రసము, పాలకూర, తెల్లగలిజేరుకూర, ఉసిరికాయ, మెంతికూర, గోంగూర.

అపథ్యములు : చేపలు, ఆవాలు, మినుములు, పులుపు, పదార్థములు, తాంబూ లము, గుమ్మడికాయ, నువ్వులనూనె, ఆవాలు, మద్యము, వంకాయ, కాకరకాయ, కారము, అధికశ్రమ.

అనుపానము :

శ్లేష్మరోగములందు – తేనె, పిప్పళ్ళ చూర్ణము

పాండురోమునందు – తెల్లగలిజేరు రసము

మూత్రకృచ్ఛ్రమునందు - శిలాజిత్ చూర్ణము

బలవృద్ధికొరకు - తెల్లగలిజేరు వేరు, ఆవుపాలు

రక్తపిత్తమునందు - కలకండ, చాతుర్జాత చూర్ణము

వలీపలితములందు - త్రిఫల

అగ్నిదీప్తికై - తమలపాకు రసము

మోతాదు : 188-375 మి.గ్రా. రోజునకు రెండుసార్లు తేనెతో భోజనమునకు గంటముందుగా ఇవ్వవలెను.

లభ్యము : 5గ్రా. 10 గ్రా.

**మండూర భస్మము (ర.సి.సం)**

ద్రవ్యములు : శుద్ధ మండూరము, త్రిఫల క్వాథము, గోమూత్రము, ఘృతకుమారి స్వరసము.

గుణము : శీతవీర్యము, పాండు, శోథ, ప్రమేహము, సంగ్రహణి, హలీమకము, కామల, కుంభకామల వీని హరించును. స్త్రీల గర్భాశయము నకు, బీజకోశములకు బలమునిచ్చును. లోహభస్మగుణములు దీనిలో న్యూనాంశమున కలవు.

శాస్త్రీయ ప్రయోగములు : 1. చిన్న పిల్లలలో కలుగు యకృత్ వృద్ధి, ప్లీహవృద్ధి రోగములను నశింపచేయుటయేకాక, శక్తివర్ధకం, రక్తవర్ధకముగా పనిచేయును.

2. చిన్నపిల్లలలో కన్పించు అస్థివక్రతయందు ప్రవాళపిష్టి, తిప్పసత్తులతో కలిపి మండూరభస్మము నిచ్చిన విశేష లాభదాయకము.

ఇది తీవ్రముగ పనిచేయును. 1. సమానమగు మిరియాల చూర్ణము తేనె వీనితోకాసశ్వాసలు, క్షయ, గుండెవ్యాధులు, ప్లీహ వ్యాధులు, యకృద్వ్యాధులు అరుచి, 2.రెట్టింపు త్రికటు చూర్ణముతో అజీర్ణము, నంజు, తిమ్మెర్లు, ఉదర వ్యాధులు, గుల్మములు, ఋతుశూలలు, శూలలు, పరిణామ శూలలు, ఋతురోధము 3. తేనెతో శ్లేష్మ వ్యాధులు, అతిసారము, స్థౌల్యరోగము, జీర్ణ జ్వరము ఇవి కడు శీఘ్రము ముగ హరించును. మోతాదు 1/4 మొ॥ 1/2 చి. వరకు.

అనుభూత ప్రయోగములు : 1. హలీమకము,కామిల,కుంభ కామిల యందు పునర్నవారిష్ట, పునర్నవాది మండూరములతో ఇచ్చిన, ఉపయోగముండును.

2. సంగ్రహణియందు దాడిమాష్టక చూర్ణము, కుటజారిష్టలతో ఇచ్చిన తగ్గును.

3. గర్భిణులకు ఆమ్లకీస్వరసము, నెర్విటాల్‌లతో కలిపి వాడిన, ఉపయోగ ముండును.

పథ్యము : పాతబియ్యము, యవలు, గోధుమలు, కందిపప్పు, పెసరపప్పు,మేక మాంసము, చెరకు రసము, పొట్లకాయ, బీరకాయ, పాలకూర, ఉసిరికాయ.

అపథ్యము : కొత్తబియ్యం అన్నం, మినుములు, ఆవాలు, పులుపు పదార్థాలు, గురుత్వ, మలమూత్ర వేగ నిరోధము.

అనుపానము: పిప్పళ్ల చూర్ణము, తేనె, మామిడి మురబ్బా, కుమార్యాసవ, శోథనందు మూత్రల ఔషధముతో త్రిదోషజ శూలనందు త్రిఫల చూర్ణం, నెయ్యి, తేనెలతో.

మోతాదు : 125-375 మి.గ్రా. రోజునకు రెండుసార్లు ఉదయము, సాయంత్రము సేవించవలెను.

లభ్యము : 5 గ్రా. 10 గ్రా.

## ముత్య భస్మము (ర.త)

ద్రవ్యములు : శుద్ధ ముత్యములు, ఆవుపాలు.

గుణము : వృష్యము, ఆయుర్వర్ధకము, మధుర రసము, అత్యంత శీతవీర్య ద్రవ్యము, అగ్నిని ప్రదీప్తింపజేయును. కాళ్లు, చేతులు, సర్వాంగముల దాహమును శాంతింపచేయును. కళ్ళకు కాంతిని, చర్మమునకు వర్ణమును ఇచ్చును. జీర్ణ జ్వర హరము, ఎముకలకు పోషణము ఇచ్చును. దంతములు త్వరగా వచ్చుటకు దోహ దముచేయును. హృదయమునకు ఉత్తమ బల్యము, ప్రమేహ హరము, మేధావర్ధకము, పండ్లు వచ్చు సమయమున వచ్చు జ్వరమును హరించును. క్షయరోగ నాశకము, కాస, శ్వాసరోగ శామకము, అస్థి శోషహరము, శరీరగత బాహ్య విషప్రభావమును నష్టపరచును. శరీరమునందు వీర్యము, బలము, బుద్ధి వీనిని వృద్ధి చేయును. మానసిక దౌర్బల్యమును హరించును. రక్తపిత్తము, రక్తాతిసారము, రక్తప్రదములందు విశేష గుణకారి. గర్భావస్థయందు శరీరమునందు ఏర్పడు ధాతులోపమును పూరిం చును.

శాస్త్రీయ ప్రయోగములు : 1. పిల్లలకు పండ్లు వచ్చు సమయమున

వచ్చు జ్వరమునందు రస సింధూరమతో కలిపి ఇచ్చిన గుణకారి.

2.భయంకర హిక్కా రోగమునందు చెంగల్వకోష్టు చూర్ణము, స్వర్ణ గైరికములతో ఇచ్చిన లాభదాయకము

ఇది సర్వోత్కృష్టమైనది. 1. తేనెతో సమస్త క్షయలు, దగ్గు, ఆయాసము, ఉర:క్షతము, గుండెవ్యాధులు. 2. వెన్నతో శుక్లనష్టము, ఇరువది ప్రమేహములు, శ్వేతరక్త ప్రదరములు, మధుమేహము, అతిమూత్రము, ఉడుకు, అజీర్ణము, వాంతి, కాళ్ళు చేతులు మంటలు, స్వరదోషములు వీనిని హరింపజేయును. దీనిని తాంబూలముతో ఉపయోగింపవచ్చును. వీర్యవృద్ధిని చేయును. ఇది కూడ సువర్ణ భస్మమువలెనే పని చేయును. మోతాదు 1/8 చి॥ మొ॥ 1/4 చి. వరకు

అనుభూత ప్రయోగములు : 1. క్షయ, శ్వాస, కాసలందు చ్యవనప్రాశలో (200గ్రా.) ముత్యభస్మము కలిపి, 5 గ్రా. చొప్పున పగలు, రాత్రి తీసుకొనిన పరోక్షముగా శ్వాస, కాసక్షయలు తగ్గుచూ, శరీరమునకు ఆపాదిపంబడిన కృశత్వమును పోగొట్టి బలము, కాంతి కలిగించును.

2. వీర్యవృద్ధికై ధాతువర్ధిని మాత్రలు, నారశింహలేహ్యములో కలిపి వాడిన ఉత్తమముగా పనిచేయును.

3. రక్త పిత్తమునందు పర్పాటకము, ఉశీరము, ఆమలకీ స్వరసములతో ఇవ్వ వచ్చును.

పథ్యము : పాతమంచి బియ్యము, గోధుమలు, వరిపేలాల పిండి, అరటిపండు, ఉసిరికాయ, ద్రాక్ష, అమృత ఫలములు.

అపథ్యము : నువ్వులు, ఆవాలు, పులుపు, శనగపప్పు, శ్రమ

మోతాదు : 62–120 మి.గ్రా. రోజుకు రెండుసార్లు సేవించవలెను.

లభ్యము : 1/2 గ్రా. 1 గ్రా.

## ముత్యపుచూరు భస్మము

ఇది 1. లవంగాలు, మిరియాలు, వీనియొక్క రెట్టింపు చూర్ణముతో దగ్గు, ఆయాసము, క్షయ, అజీర్ణము, అగ్నిమాంద్యము 2. పంచదారతో ప్రమేహ వ్యాధులు, శుక్లనష్టము, సెగవ్యాధి మొదలగు వానిని నశింపచేయును. ప్రతి దినము తమలపాకులతో ఉపయోగించుచుండిన యెడల క్షయ, అజీర్ణము మొదలగు వ్యాధులను దరికి చేరనివ్వదు. మోతాదు 1/8 మొ॥ 1/4 చి. వరకు.

## నాగ భస్మము (ర.ర.స)

ద్రవ్యములు : శుద్ధనాగము, రావిపట్ట భస్మము, చింతపట్టభస్మము, శుద్ధమణిశిల

గుణము : రసాయనము, దీపనము, క్షయ, కామలా, పాండు, ప్రమేహము, మూత్రకృచ్ఛ్రము, మూత్రాఘాతము, శూలరోగములను హరించును.

శాస్త్రీయ ప్రయోగములు : 1. క్షయ రోగమునకు అశ్వగంధ చూర్ణముతోగాని, ద్రాక్షాది చూర్ణముతోగానీ వాడవలెను.

2. శూలలకు హింగ్వాష్టక చూర్ణముతో నీయవలెను.

3. మూత్రకృచ్ఛ్ర, మూత్రాఘాతములకు రేవల్ చిన్ని, చలువ మిరియాలు, సూరే కారము, వీని చూర్ణములు, కర్పూర శిలాజిత్ భస్మము, ఇవి ఒక్కొక్కటి 300 మి.గ్రా. నాగభస్మము 200 మి.గ్రా. కలిపి 2 గ్రా. చొప్పున సేవించవలెను.

అనుభూత ప్రయోగములు : 1. సర్వమేహహరము, మధుమేహము నందు మూత్రలముగా పనిచేసి మిక్కిలి గుణమును కల్గించును. మూత్రగత వ్యాధులయందు కూడా ఉపయోగకారి.

పథ్యము : ఆవుమజ్జిగ, ఆవునెయ్యి, చక్కెర, ఎఱ్ఱబియ్యము, బూడిద గుమ్మడి కాయ, ఖర్జూరము, స్నానము, అభ్యంగనము.

అపథ్యము : తెలగపిండి, ఇంగువ, నూనెపిండి వంటకములు, వెల్లుల్లి, కోడి మాంసము; వాహనయానము, వ్యాయామము.

మోతాదు : 125-250 మి.గ్రా. ఉదయము, సాయంత్రము సేవించవలెను. లభ్యము : 5 గ్రా. 10 గ్రా.

## పగడపుచూరు భస్మము

ఇది 1. తేనెతో దగ్గు, ఆయాసము, శ్లేష్మ వ్యాధులు, అజీర్ణము. 2. వెన్నతో శుక్లనష్టము, శ్వేత ప్రదము, రక్తప్రదరము 3. మిరియాల రసముతో శూల, పరిణామ శూల, వీనిని ఖండించును. దీనిని తాంబూలముతోకూడ ఉపయోగింపవచ్చును. మోతాదు 1/8 చి. మొ 1/4 చి.వరకు.

## పగడభస్మము

దీనిని 1. తేనెతో దగ్గు, ఆయాసము, శ్లేష్మవ్యాధులు, అజీర్ణము,

స్వరభేదము. 2. వెన్నతో శ్వేతరక్తప్రదరములు, శుక్లనష్టము, ప్రమేహవ్యాధులు మొదలగు వాని యందియ్యవలయును. ప్రతిదినము తమలపాకులతో నుపయోగించిన యెడల అజీర్ణ ములను, దగ్గును దరికి చేరనివ్వదు.మోతాదు 1/8 మొదలు 1/4 చి.వరకు.

**ప్రవాళ భస్మం (బ.రా.) (ర.తం)**

ద్రవ్యములు : శుద్ధ ప్రవాళము

గుణము : రక్తపిత్త, రక్తాతిసార, ప్రదర, రక్తశూల, పైత్యరోగములను హరింప చేయును. మలబద్ధకారి. పుప్పసగత రోగములయిన అత్యంత ప్రభావము కల్గినది. శ్వాస,కాస,క్షయ,రక్తపిత్తము,ప్రదరము, శూలలను హరించును.

5 గ్రా. త్రిఫల, కషాయం, కుమారి స్వరసం, ప్రవాళం

100-200 మి.గ్రా. తేనెతో - శ్వాసకాసం, రక్తపిత్తం, రాజయక్ష్మం, ప్రదర రోగములు, మూత్ర సంబంధ రోగములయందు ఉపయోగము.

అనుభూత ప్రయోగములు : 1. అతిమధురము, ఉశీరము, ఆమలకి, ద్రాక్ష, లోధ్రల చూర్ణములు ఒక్కొక్కటి 10 గ్రా. చొప్పున ప్రవాళభస్మము 15 గ్రా.తో కలిపి తేనెతో 2 గ్రా. ఉదయము, రాత్రి ఇచ్చిన రక్తపిత్తము నశించును.

2. రక్తాతిసారమునందు దాడిమాష్టక చూర్ణము, లోధ్రచూర్ణము, అతివస చూర్ణము కలిపి మజ్జిగతో ఇచ్చిన తగ్గును.

3. రక్తప్రదరమునందు పై ద్రవ్యములతో అశోకారిష్ట, లోహాసవలను ఇచ్చుచూ పుష్యానుగ చూర్ణము కూడా కలుపవలెను.

4. ఆమ్లపిత్తము, అధిక దప్పిక, పురాణ జ్వరము మొదలగు వానియందు గుణకారి. ఇది అత్యుత్తమమైన కాల్షియమ్‌గా నిర్ధారించబడినది. బాలురలో ఎముకల పెరుగుదలకు, దృఢత్వమునకు సేవించవచ్చును.

పథ్యము : ద్రాక్షపండ్లు, క్షీరాన్నము, పొగడ పండ్లు, ఖర్జూరము, నెయ్యి, పాలు, మాంసము.

అపథ్యము : పులుసు, కారము, పెరుగు, దొండకాయ, వెల్లుల్లి, తాంబూలము

మోతాదు : 100-200 మి.గ్రా. రోజుకు 2 లేక మూడుసార్లు ఇవ్వవలెను.

లభ్యము : 5 గ్రా. 10 గ్రా.

## ప్రవాళపిష్టి (ర.తం)

ద్రవ్యములు : శుద్ధ ప్రవాళము

గుణము : ప్రవాళ భస్మముకంటె ప్రవాళపిష్టి అధిక పిత్తశామకము, క్షార, మధుర రసము, లఘువు, శీతలము, దీపనము, పాచనము, ఉప్పున వ్యాధిహరము.

శరీరమునందలి ధాతులోపమువలన ఏర్పడు వికృతులను హరించును. త్రిదోష శామకము,క్షయ,కాసహరము, రక్తపిత్తశామకము, శరీరగత విషప్రభావమును నష్టపర చును. వీర్యమును, శక్తిని చర్మమును పెంపొందించును. రక్తవృద్ధికరము, గర్భావస్థ యందు స్త్రీలకు కలుగు పాండువు మొదలగు రోగములను హరించును.

అనుభూత ప్రయోగములు : 1. ధాతువృద్ధికి అభ్రక భస్మం, నారశింహ లేహ్యా ములతో ఇవ్వవచ్చును.

2. వీర్యవృద్ధికై అశ్వగంధ చూర్ణము, శతావరీ చూర్ణము, దూలగొండి విత్తుల చూర్ణము, అతి మధురములను నెర్విటాల్,ద్రాక్షాది చూర్ణములతో యిచ్చిన శ్రేష్ఠము.

3. గర్భిణీ స్త్రీలలో ఏర్పడు పాండురోగమునందు కాశీస భస్మం, కాంత భస్మం, ఆబలసుధలను కలిపి పునర్నవారిష్ట, లోహానవలను అనుపానముగా యివ్వవచ్చును.

4. ఆమ్లపిత్తము, కండ్లమంటలు, ఉన్మాదము, శిరోరోగములు, మూత్ర కృచ్ఛ్రము, మూత్ర వ్యాధులు మరియు హృదయ రోగములయందు మిక్కిలి గుణకారి.

పథ్యము : మేకమాంసము, పాతనెయ్యి, తేనె, దొండకాయ, ద్రాక్షపండ్లు.

అపథ్యము : కొత్తబియ్యపు అన్నము, గొఱ్ఱెనెయ్యి, పాలు, కంద, ఆవాలు, చేపలు.

మోతాదు : 125-250 మి.గ్రా. ఉదయము, సాయంత్రము తేనెతో సేవించ వలను.లభ్యము : 5 గ్రా. 10 గ్రా.

## రజత భస్మము (సి.సం.)

ద్రవ్యములు : శుద్ధ రజతము, శుద్ధ హరతాళము, శుద్ధ ఇంగిలీకం.

గుణము : మధుర, కషాయ, ఆమ్లరస, శీతల, రేచన, స్నిగ్ధ ఔషధము, కఫ, వాతములను నష్టపరచును. జఠరాగ్నిని దీప్తింపజేయును. బలదాయకము, అత్యంత బుద్ధివర్ధకము, ఆయుర్వృద్ధికరము.

దీపనము, రసాయనము, వాజీకరణము, బల్యము, కఫము, వాతము, శ్వాస, కాసలు, కామిల, పాండు, శోఫ, గుల్మోదరములను హరించును.

ఇది 1. నేలతాడి, దూలగొండివిత్తులు, పిప్పళ్లు వీనియొక్క రెట్టింపు చూర్ణము సమానమగు తిప్పసత్తు మీగడ వీనితో శుక్లనష్టము. నడుము నొప్పులు,కాళ్ళులాగుట, వీర్యముపలచగనుండుట, శీఘ్రస్ఖలనము, మధుమేహము, అతిమూత్రము, దగ్గు, ఆయాసము. 2. తుంగగడ్డలు, తానిక్కాయ బెరళ్లు, జీలకర్ర, వీనియొక్క రెట్టింపు చూర్ణము, మేడిచెక్క కషాయము వీనితో శ్వేతరక్త ప్రదరములు, సోమరోగము నోటి పూత, యోని దోషములు, రక్తస్రావము, రక్తపిత్తము ఇరువది ప్రమేహములు. 3. పంచదారతో శరీరమువెచ్చగ నుండుట, బలహీనము, తిమ్మిర్లు, గుండె వ్యాధులు, వీనిని నశింపజేయును. పలచనగనుండు శుక్రమును చక్కపరుచును. శుక్ర దోషముచే కలిగిన రుగ్మతల నన్నిటిని నశింపజేయును. మోతాదు 1/4 చి. మొ॥ 1/2 చి.వరకు.

అనుభూత ప్రయోగములు :

1.శతావరీ లేహ్యముతో కలిపి వాడినస్తన్య వృద్ధి కరము కాగలదు.

2. ధాతుపుష్టికై వంగ భస్మము, ముత్యభస్మము, గోమూత్ర శిలాజిత్, తిప్పసత్తు, అశ్వగంధ చూర్ణములతో కలిపి వాడుచూ, రత్నపురుష లేహ్యము కూడా యిచ్చిన ఉచితముగా నుండును.

3. కాస,శ్వాస, క్షయలందు లక్షణానుసార చికిత్స చేయుచూ, చ్యవన ప్రాశలేహ్య ముతో యిచ్చిన బలము కలుగును.

4. ప్రమేహము, క్షయ, ధాతుక్షీణత, దృష్టిమాంద్యము, మస్తిష్క దౌర్బల్యము లందు గుణకారి. వాతవహ నాడీ సంస్థానమునకు బలమునిచ్చు మహత్తర ఔషధము, పక్షవాతము, ఏకాంగ వాతములందు మిక్కిలి గుణకారి.

5. అభ్రక భస్మము, త్రికటు చూర్ణములతో సేవించిన శ్వాస కాసలు హరిం చును. అగ్ని దీప్తి, ధాతువృద్ధి కలుగును.

6. శుక్ర నష్టమునందు స్వర్ణవంగము, తిప్పసత్తు, సీమతవాక్షీరి, పిప్పలీ చూర్ణ ములతో సేవించవలెను.

పథ్యము : పాతబియ్యము, గోధుమలు, బార్లీ, అరటిపండ్లు, ఉసిరి, ద్రాక్ష, ఆపిల్ పండ్లు

అపథ్యము : నువ్వులు, ఆవాలు, పులుపు, శనగపప్పు, శ్రమ.

మోతాదు : 100–200 మి.గ్రా. రోజుకు రెండుసార్లు తేనెతో సేవించవలెను.

లభ్యము : 1 గ్రా. 2 గ్రా.

## రాతినార భస్మము

ఇది 1. పంచదారతో నుపయోగించిన యెడల మూత్రకృచ్ఛము, సెగవ్యాధులు, శుక్లనష్టము మొదలగు వేడివలన కలిగిన వ్యాధులను వెంటనే హరింపచేయును. మోతాదు 1/2 మొ॥ 1 చి॥ వరకు.

## రసభస్మము

దీనిని 1. నీటితో మెత్తగ నూరి మాత్రలుచేసి నీటితో ముద్దగా నూరబడిన శొంఠి చూర్ణముచే నామాత్రలకు కవచమిచ్చి (పైనకప్పి) మ్రింగించిన యెడల అజీర్ణ ములు, అజీర్ణవాతములు, శూలలు, కడుపుబ్బరము, మలబంధము, నీళ్ళవిరేచన ములు, అజీర్ణ విరేచనములు సమస్తమగు వాత వ్యాధులు, శ్లేష్మ ప్రకోపములు, దగ్గు, ఆయాసము, గుల్మములు, సవాయి వ్యాధులు, సవాయిపుండ్లు, ప్లీహ వ్యాధులు, యకృద్వ్యాధులు, ఉదరవ్యాధులు, ఋతుబంధములు, ఋతుశూలలు 2. తేనెతో లేక ఆముదములో కలిపి యిచ్చిన యెడల చంటిపిల్లలకు కలుగు అజీర్ణ విరేచనములు, అజీర్ణము, కడుపుబ్బరము, మలబంధము, ఎగరొప్పు, శ్లేష్మప్రకోపము, దగ్గు, ఆయాసము, జలుబు ఇవి వెంటనే హరించును. మోతాదు 1/4 చి॥ మొ॥ 1 చి॥ వరకు.

## శుక్తి భస్మము

దీనిని (1) తేనెతో దగ్గు, ఆయాసము, శ్లేష్మ ప్రకోపము, అజీర్ణము, శూల, పరిణామశూల, గుండె వ్యాధులు, అగ్నిమాంద్యము మొదలగువాని యందు ఉపయోగింపవలయును. మోతాదు 1/4 మొ॥ 1/2 చి॥ వరకు.

## శృంగభస్మము (ర.తం)

ద్రవ్యములు : శుద్ధ మృగశృంగములు

గుణము : హృదయశూల, పార్శ్వశూల, హిక్కా, శ్వాసరోగములందు అత్యంత ఉపయోగకారి

ఇది 1. తేనెతో శ్లేష్మదగ్గు, ఆయాసము, గొంతుకలో వుండ పెట్టినట్లుండుట, వాత వ్యాధులు 2. నేతితో గుండె వ్యాధులు, శూల, పరిణామశూల అజీర్ణము, గ్రహణి అతిసారము ఉదరము 3. వెన్నతో ప్రదరవ్యాధులు 4. పటికబెల్లపు చూర్ణముతో పొడిదగ్గు వీనిని నశింప జేయును. శూలలు మీద బహు చక్కగ పనిచేయును.

మోతాదు 1/2 మొ॥ 1 చి॥వరకు.

అనుభూత ప్రయోగములు :

1. మహాలక్ష్మీ విలాస రస ఇచ్చుచూ, శృంగ భస్మమును త్రిఫల చూర్ణముతో కలిపి యిచ్చిన, హిక్కా శ్వాసనందు అధిక ప్రయోజనకారి.

2. హృత్‌శూలనందు అర్జున చూర్ణము 10 గ్రా. ముత్యభస్మం, జటామాంసి, అతివస, శృంగభస్మం ఒక్కొక్కటి 20 గ్రా. చొప్పున కలిపి 2 గ్రా. మోతాదులో తేనె, లేదా అల్లపు రసముతో ఇచ్చిన హృత్‌శూల తగ్గును.

3. శూలకల్పము, భాస్కరలవణము, శృంగభస్మము కలిపి యిచ్చిన ఉదరశూల తగ్గును.

4. హృదయ శూలనందు గోఘృతము మరియు పాలతో సేవింపవలెను.

పథ్యము : పేలాలగంజి, ముదురు గుమ్మడికాయ, బీరకాయ, పొట్లకాయ, దానిమ్మ, పాతనెయ్యి, పాత బియ్యము.

అపథ్యము : కొత్తబియ్యము, చేపలు, నూనె, వంకాయ, కారపు పదార్థములు, దొండపండ్లు, మినుములు, కందులు, కొవ్వు పదార్థములు, వీనిని సేవింపరాదు. మలమూత్ర వేగ నిరోధము, ఎండ, చింత క్రోధము, శోకము, భయము ఇవి నిషిద్ధము.

మోతాదు : 360–750 మి.గ్రా. తేనెతో రోజుకు రెండు సార్లు సేవించవలెను.

లభ్యము : 5 గ్రా. 10 గ్రా,

## శంఖ భస్మం

ద్రవ్యములు : శుద్ధ శంఖములు

గుణము : ఆమ్లపిత్తము, ఉదరశూల, పరిణామశూలలను హరించును. దీపన, పాచనకారి.

ఇది 1. శుంఠి లేక వాముర‌సముతో శూల, అజీర్ణము, కడుపుబ్బరము, కడుపు నొప్పి, పరిణామశూల, వాంతి, ప్రేగులరచుట 2. తేనెతో శ్లేష్మ వ్యాధులు, దగ్గు, ఆయాసము 3. నిమ్మకాయరసముతో పోసిన యెడల చెవిలో పోటు, వీనిని వెంటనే హరింపజేయును. మోతాదు 1/4 చి॥ మొ॥ 1/2 వరకు.

అనుభూత ప్రయోగములు : యకృత్ ప్లీహరోగములు, ఉదర రోగములు, అజీర్ణ రోగములయందు వాడదగినది.

1. పరిణామ శూలయందు యష్టిమధు, గంగాధర చూర్ణము, అవిపత్తికర చూర్ణములతో యిచ్చుచూ చల్లనిపాలు, కొబ్బరినీళ్లు ఎక్కువగా త్రాగుతూ ఉండవలెను.

2. ఆమ్ల పిత్తమునందు భాస్కరలవణము 50గ్రా. జటామాంసి 20 గ్రా. కలిపి భోజనమునకు ముందుగా మజ్జిగతో యిచ్చుచూ భోజనానంతరము కార్మిక్స్, డైజిటాల్ యిచ్చిన ఆమ్ల పిత్తము తగ్గును.

3. ఉదరశూలనందు శూలకల్పముతో మరియు కార్మిక్స్ (కాప్స్యూల్స్) ఇచ్చుచూ లక్షణానుసార చికిత్స చేయవలెను.

4. యకృత్ప్లీహోదరములకు వరాటభస్మము, టంకణ భస్మములతో సేవించ వలెను.

పథ్యము : గోధుమలు, బార్లీ, ఉలవలు, పెసలు, మజ్జిగ, అల్లము, చక్కెర, ఖర్జూరము, టెంకాయ, ఉదరశూల, ఉదర రోగములందు తేలికగా జీర్ణమగు ఆహార మును మాత్రమే భుజించవలెను.

అపథ్యము : చేపలు, నూనె పిండివంటలు, నువ్వులు, ఆవాలు, పప్పు పదార్థ ములు, మాంసము, కొవ్వు పదార్థములు పూర్తిగా నిషిద్ధము.

మోతాదు : 500 మి.గ్రా. –1 గ్రా. ఉదయము, సాయంత్రము సేవించవలెను.

లభ్యము : 5 గ్రా. 10 గ్రా.

## సత్తుభస్మము

దీనిని 1. చలవమిరియాలు, అతిమధురము, తెల్లచందనము పొట్టు, వీని యొక్క రెట్టింపు చూర్ణము, పంచదార వీనితో సెగవ్యాధులు, మూత్రము బొట్లుగ పడుట, మూత్రనాళమందలిమంట, మూత్రము తొందరగవచ్చుట 2. మీగడతో శుక్ల నష్టము, శ్వేతరక్తప్రదములు మొదలగు మేహవ్యాధులు వీని యందియ్యవలయును. దీనిని కొన్ని నేత్రవ్యాధులయందు పైకి నుపయోగించెదరు.

మోతాదు 1/4 మొ॥ 3/4 చి. వరకు.

## సీస భస్మము

1. నాగకేసరములు, తాలీసపత్రి వీనియొక్క రెట్టింపు చూర్ణము, పటికబెల్లపు చూర్ణము వీనితో దగ్గు, ఆయాసము, అజీర్ణము 2. రెట్టింపు త్రిజాతచూర్ణము, పంచదార వీనితో నోటిపూత, శుక్లనష్టము ప్రదర వ్యాధులు 3. మంజిష్ట ఎర్రచందనము, జాజికాయ, ఏలక్కాయలు, రెట్టింపు వీనియొక్క చూర్ణము, వెన్న వీనితో ప్రదర వ్యాధులు, సెగవ్యాధులు, రక్తదోషములు, నోరుదుర్గంధముగ నుండుట, పైత్య వ్యాధులు, కాళ్లు చేతులుమంటలు, ఇవి వెంటనే హరించును. అధికమగు వీర్యవృద్ధిని, నరములకు బలమును కలిగించును. సీసభస్మము శరీరమునకు బలమును కలిగించును. బాల వ్యాధులను నశింపచేయునని కొందరు చెప్పెదరు. మోతాదు 1/4 చి॥ మొ॥ 1/2 చి. వరకు.

## సువర్ణ భస్మము

సుమారు వడ్లగింజ మోతాదులోనే అద్భుతముగా పనిచేయును. 1. వెన్నతో సమస్తక్షయలు, దగ్గు, ఆయాసము, కృశించుట, గుండె వ్యాధులు 2. తేనెతో నరముల బలహీనత, పాండువు, అజీర్ణము, శ్లేష్మవ్యాధులు, వాత వ్యాధులు 3. పంచదారతో పైత్య వ్యాధులు, ప్రదర వ్యాధులు, మూర్ఛ, అప స్మారము, ఉన్మాదము, రక్తపిత్తము, గుండెవ్యాధులు, శరీరము వెచ్చగ నుండుట, జీర్ణ జ్వరము, శుక్లనష్టము 4.నేతితో మధుమేహము, అతిమూత్రము, జీర్ణించిన సెగ వ్యాధులు, వీనిని దివ్యముగ నశింప జేయును. వీర్యవృద్ధిని, శరీరపుష్టిని, కామోద్రేక మును, శరీరకాంతిని, ముఖవర్చస్సును, రక్తశుద్ధిని చేయును. ఫలాన వ్యాధులను నశింపచేయునని దీని విషయమై వ్రాయనవసరములేదు. సమస్త వ్యాధులను నశింప జేయును. మోతాదు 1/8 చిన్నము మొదలు 1/4 చిన్నము వరకు.

## సూరేకార భస్మము

దీనిని 1. పంచదార లేక నెయ్యి లేక నీటితో నిచ్చిన యెడల మూత్రకృచ్ఛ్రము, మూత్రనాళమందలి మంట, సెగ వ్యాధులు మూత్రము బంధించుట, మూత్రము బొట్లు బొట్లుగ వచ్చుట మొదలగు వ్యాధులు వెంటనే నశించును. మోతాదు 1/2 మొ॥ 1 చి॥వరకు.

## స్వర్ణమాక్షిక భస్మము (ర.సి.సం)

ద్రవ్యములు : శుద్ధస్వర్ణమాక్షికము, మర్దన కొరకు ఉలవల కషాయము, ఏరండతైలం, మజ్జిగ, మేక మూత్రము.

గుణము : స్వాదు, తిక్త, వృష్యం, రసాయనం, శామకము, రక్తవర్ధకము, పిత్తశామకం, శీతవీర్యం, శక్తివర్ధకం, స్తంభకం, యోగవాహి.

పాండు,కామల,జీర్ణజ్వరము, నిద్రానాశము, మస్తిష్క, ఉష్ణత, పిత్తవికారము, కళ్లుమండుట,కళ్లు ఎరుపెక్కుట, వమనము, వ్రణదోషము, పిత్తప్రమేహము, ప్రదరము, మూత్రకృచ్ఛ్రము, శీర్షశూల, విషవికారము, అర్శస్సు, ఉదరరోగము, కండు,కుష్ఠము, కృమి, అశ్మరి మొ॥ రోగములను నశింపజేయును.

కఫ,పిత్త వికృతుల యందు విశేష గుణకారి.

పిత్తజ శీర్షశూల, పిత్తజ ఆమ్లపిత్తము, పిత్తజ పరిణామశూల, పిత్తజ గుల్మము లందు అనుపానభేదముచే వాడిన సర్వశ్రేష్ఠము

శాస్త్రీయ ప్రయోగములు : 1. మదాత్యయమునందు కటుకరోహిణి, పునర్నవ, తిప్పతీగ క్వాథములతోనిచ్చిన అత్యంత ఉపయోగము.

2. అజీర్ణ జనిత విశూచిక నందు సూతశేఖర రసముతో కలిపి అల్లపు రసముతో నాకించుచుండిన రోగతీవ్రత తగ్గి, వాంతులు ఉపశమించును. రోగము తగ్గిన తరు వాత కన్పించు బలహీనతయందు శంఖభస్మము, స్వర్ణమాక్షిక భస్మములను కలిపి మామిడి లేదా ఉసిరిక మురబ్బా అనుపానముగా నీయవలెను.

3.మూత్రకృచ్ఛ్రమునందు స్వర్ణ మాక్షిక భస్మము, శిలాజిత్‌లను కలిపి అశ్వగంధ, మంజిష్ట చూర్ణములతో నీయవలెను.

4. శుక్రక్షయ, రజఃక్షయములందు వంగభస్మముతో వాడిన ప్రయోజనకరము.

5. శరీరముపై నల్లని మచ్చలు వచ్చుట మొ॥ చర్మ రోగములందు గంధక రసాయనముతో కలిపి వాడవలెను.

పథ్యము : తోటకూర, గోంగూర, మెంతికూర, లేతమునగకూర, పొట్లకాయ, బీరకాయ, చెరకు రసము, పాలకూర, తెల్లగలిజేరుకూర, ఉసిరికాయ, తేలికగా జీర్ణమగు ఆహారములను సేవించవలెను.

అపథ్యము : మాంసము, చేపలు, నూనె పదార్థములు, తాంబూలము, వెన్న, నెయ్యి కల్గిన పదార్థములు, పులుపు పదార్థములను సేవించరాదు.

అనుపానము : పాలు, తేనె, గుల్‌కంద్, తిప్పసత్తు, త్రిఫల, కటుకరోహిణి, వెన్న.

నిర్దిష్ట అనుపానము : 1. పాండువు, హలీమకము, కామలయందు పిప్పళ్లు తేనె లేదా ముల్లంగి రసము.

2. జీర్ణజ్వరము, స్వప్న దోషము, మస్తకశూల, పిత్త ప్రమేహము, మూత్రకృచ్ఛ ములందు వెన్న లేదా తేనెలతో, వమనమునందు జీలకర్ర, తేనెలతో.

3. నిద్రానాశమునందు శొంఠి, ఉసిరి మురబ్బాలతో

4. వృద్ధుల బలహీనత, కుష్టువు, ప్రమేహము, పాండు, క్షయలందు ఆవుపాలతో

మోతాదు : 125-375 మి.గ్రా. రోజుకు రెండుసార్లు పరగడుపున సేవించవ లెను.

లభ్యము : 5గ్రా. 10 గ్రా.

## స్ఫటిక (పటిక) భస్మము

దీనిని 1. వెన్నతోగాని కలుబందరసముతోగాని నుపయోగించిన యెడల సెగ వ్యాధులు, శుక్లనష్టము, నోటిపూత, ప్రదర వ్యాధులు, ప్రమేహములు మొదలగునవి వెంటనే హరించును. మోతాదు 1/4 మొ॥ 1 చి॥ వరకు.

## తామ్రభస్మము (వై.చిం.)

ద్రవ్యములు : శుద్ధ త్రామము, శుద్ధ గంధకము

గుణము : కుష్ఠము, ప్లీహ, జ్వరము, కఫము, వాతము, శ్వాస, దగ్గు, వాపు, తంద్ర, శూల, క్రిమి, వాంతి, పాండు, మోహము,

అతిసారము, మూలవ్యాధి, గుల్మము, క్షయ, శిరోవ్యాధి, మేహము, ఎక్కిళు ్ళ వీనిని నివర్తించి అగ్నివృద్ధిని చేయును.

ఇది బహుపరిశుద్ధముగ తయారు చేయబడినది. 1. తాలీసపత్రి, లవంగాలు, సన్నరాస్నము, వీనియొక్క మూడురెట్ల చూర్ణము తేనె వీనితో దగ్గు, ఆయాసము, క్షయలు, గుండె వ్యాధులు 2. రెట్టింపు పిప్పళ్ల చూర్ణముతో ఉదరవ్యాధులు, గుల్మ ములు, ప్లీహవ్యాధులు, యకృద్వ్యాధులు 3. నాలుగురెట్ల త్రికటు చూర్ణముతో అజీర్ణ ములు, శూలలు, నంజు, తిమ్మెర్లు 4. మూడురెట్ల త్రిఫలా చూర్ణముతో భగందరములు వ్రణములు, మూలవ్యాధి, వీనిని కడు శీగ్రముగ హరింపచేయును. వేడి తత్త్వముల మీదకంటె, శ్లేష్మ వాతత్వముల మీదనే చక్కగ పనిచేయును. కుష్ఠము, బొల్లి మొదలగు కొన్ని వ్యాధులయందు కొందరు దీనిని ప్రధానముగ వాడెదరు. మోతాదు 1/8 చి. మొ॥ 1/4 చి.వరకు ప్రత్యేకముగ వాడునప్పుడు మోతాదు ఇంతకంటె తగ్గింప వలయును.

అనుభూత ప్రయోగములు : 1.ఫిరంగిచెక్క చూర్ణము 25 గ్రా. సుదర్శన చూర్ణం 50 గ్రా. తాళక భస్మము 10 గ్రా. టంకణభస్మం 10గ్రా. చొప్పున కలిపి 2 గ్రా. చొప్పున తేనెతో భోజనానంతర మిచ్చుచూ, సరస 2 చెంచాల చొప్పున పగలు, రాత్రి 40 రోజులపాటు ఇచ్చిన కుష్ఠమును మరియు సర్వవిధ చర్మరోగములను హరించును.

2. పాండు రోగము నందు కలిగే హృదయ దౌర్బల్యమునందు, తామ్రభస్మం 1 గ్రా. చొప్పున పగలు రాత్రి ద్రాక్షాసవ, అర్జునారిష్టల అనుపానముతో నిచ్చిన తగ్గును.

3. హిక్కానందు బ్రాహ్మీవటి, జటామాంసిలతో కలిసి యివ్వవచ్చును.

4. విషమజ్వరము నందు శుద్ధనాభితో, రక్తక్షయనందు లోహభస్మముతో సేవిం చిన ఫలప్రదము

పథ్యము : ఉసిరిక, నిమ్మపండ్లు, పెరుగుతోటకూర, పొట్లకాయ, నీరుల్లిపాయ, ముల్లంగి, తాటికలకండ, చక్కెర, తేలికగా జీర్ణమగు పదార్థములు, కాచి చల్లార్చిన నీరు.

అపథ్యము : కొయ్యతోటకూర, గుమ్మడికాయ, మామిడికాయ, కోడిమాంసము

మోతాదు : 125 మి.గ్రా. భోజనానంతరము రోజుకు రెండుసార్లు

యివ్వవలెను. లభ్యము : 5 గ్రా.

**తాళకభస్మం (ర.సి.సం)**

ద్రవ్యములు : శుద్ధ హరతాళము, జిల్లేడుపాలు

గుణము : వాతరక్తము, సర్వవిధ కుష్టువులు, ఫిరంగ జనితకుష్ఠము, విసర్పి, కండు, విస్ఫోటకము, 80 రకముల వాతరోగములు, కఫరోగము, ప్రమేహము, గుద రోగములు, గళత్కుష్టువు, సుప్తకుష్టువు, సామ, ఉపదంశము, మరల మరళ ప్రకోపించు జ్వరము, శీతాంగ సన్నిపాతము, శ్వాస, కఫప్రకోపములందు పని చేయును.

ఈ భస్మము స్నిగ్ధ, ఉష్ణ, కటు, అగ్ని దీపక మరియు కుష్ఠఘ్న గుణములు కలిగినది. ఈ ఉత్కృష్ఠ ఔషధమును సేవించుట వలన వృద్ధాప్యమునందలి బలహీన తను అధిగమించవచ్చును. కాంతిని పెంపొందించును. అకాల మృత్యువును దూరము చేసి ఆయుర్వృద్ధి కలుగజేయును.

శాస్త్రీయ ప్రయోగములు : 1. కఫ ప్రధాన వాత రక్తమునందు గచ్చ ఆకుల రసము, నెయ్యి లేదా బెల్లమును కలిపి ఈ భస్మముతో నిచ్చిన ఉపయోగకరము.

2. వాత ప్రధాన వాతరక్తమునందు నెయ్యి అనుపానముగా ఇచ్చిన శ్రేష్ఠము.

3. పిత్త ప్రధాన వాత రక్తమునందు ఈ ఔషధ సేవన నిషేధము. సేవించినచో రోగ తీవ్రత పెరిగి, పిత్తము ప్రకోపించి రక్తపిత్తము వచ్చును.

4. పామ, కచ్ఛు,దద్రు మొదలగు ఉపకుష్ఠువులందు (చర్మరోగములు) గంధక రసాయనముతో నీయవలెను. దీర్ఘకాలికముగా వుండి బాధాకరముగా ఉండు పై చర్మ రోగములందు మంజిష్టాది అర్కముతో సేవించవలెను.

5. పిత్తదోషము, రక్తదూష్యము ఉన్నపుడు పిత్తశామక, రక్తప్రసాదక ఔషధములతో వాడవలెను.

6. ఉపదంశ ఉపద్రవముల నుండి ఉద్భవించిన ప్రమేహము, అర్శస్సులను తాళక భస్మ సేవన తగ్గించును.

7. సన్నిపాతమునందు కఫవాత ప్రకోపములను దూరము చేసి రోగిని

చైతన్య వంతము చేయును. ఈ సందర్భముతో తాళక భస్మమును అల్లపు రసముతో నీయ వలెను.

అనుపానము : 1. విషమ జ్వరము మరియు కఫవాత ప్రధాన జ్వరములందు అల్లపు రసము.

2. కుష్ఠమునందు – బావంచాల చూర్ణం లేదా మంజిష్ఠాది అర్కము

3. తమక శ్వాసనందు – తేనె మరియు పిప్పళ్ళ చూర్ణము

4. జ్వరము, క్షయ మరియు పాండువునందు – చక్కెర

5. ప్రసూతి శూల మరియు వాతరోగములందు – అల్లపు రసము

6. శైత్యమునందు – కుంకుమపువ్వు, జాపత్రి

7. సంధివాతము నందు – ఫిరంగి చెక్క చూర్ణము, తేనె

8. రక్త వికృతులందు – కారు పసుపు

9. కుష్ఠువు మరియు వాతరక్తము నందు – తిప్పతీగె క్వాథము

10. వాతరోగము నందు – చక్కెర

పథ్యము : గోధుమ, కందిపప్పు, ఉసిరి, వెల్లుల్లి, పంచదార, సైంధవలవణము, మేకమాంసం, బీరకాయ, పొట్లకాయ.

అపథ్యము : ఉప్పు, పులుసు, కారము,నూనె; సూర్యరశ్మి

సూచన : దీర్ఘకాలిక, చర్మరోగములందు తక్కువ మోతాదులో యివ్వవలెను. 10–14 రోజులు వాడిన పిదప 3 రోజులు వ్యవధితో తిరిగి వాడవలెను.

మోతాదు : 100–200 మి.గ్రా. ఉదయము,సాయంత్రము సేవించవలెను.

లభ్యము : 10 గ్రా.

## తారమాక్షిక భస్మము

దీనిని 1. తేనెతో అజీర్ణము, పాండువు, నంజు, గుండె వ్యాధులు 2. వెన్నతో శుక్లనష్టము ప్రమేహములు, దగ్గు, ఆయాసము, క్షయ, రక్తార్శస్సు, మొదలగు వ్యాధుల యందుపయోగింపవలెను. మోతాదు 1/4 మొ॥ 1/2 చి. వరకు.

## టంకణ భస్మము (ర.తం)

ద్రవ్యములు : వెలిగారము

గుణము : కటురసము, ఉష్ణము, తీక్ష్ణము రూక్షము, సారకము, హృద్యము, వాతరోగహరము, శ్వాస, కాసరోగహరము, స్థావర విషనాశకము, దీపనము,యకృత్ క్రియావృద్ధి కరము, గర్భాశయ సంకోచకము, వ్రణరోపకము, పిత్తక్రియలను ఉత్తే జింపచేయును. గర్భాశయ ముఖమును విస్తృతము చేయును.

అనుభూత ప్రయోగములు : 1. నోటిపూట, నంజుపొక్కులు, ఇన్ఫ్లుయెంజా, ప్రదర వ్యాదులు, తుండికేరి, గళశోథ మొదలగువాని యందు బాగుగా పనిచేయును.

2. అగ్నితుండివటి, పంచామృత పర్పటిలతో వాడిన యకృత్ జన్య వికారములు తగ్గును.

3. గర్భాశయ వికృతులందు ఇంగువ, కలబంద స్వరసములతో యిచ్చుచు, యుటిరిల్ వాడిన ప్రశస్తముగా పనిచేయును.

4. దీర్ఘకాలిక వ్రణములందు కేవలము పైన చల్లుతూ, లోనికి లక్షణానుసారం చికిత్స చేసిన తగ్గిపోవును.

పథ్యము : తేనె, నెల్లికూర, తెల్లగలిజేరుకూర, చెరకు, అల్లము

అపథ్యము : కందిపప్పు, శనగపప్పు, పెసరపప్పు,కొత్తబియ్యపు అన్నము, వ్యాయామము, అభ్యంగనము

మోతాదు : 125-500 మి.గ్రా. తేనెతో రోజుకు రెండుసార్లు సేవించవలెను.

లభ్యము : 10 గ్రా.

## త్రివంగ భస్మం (సి.సం)

ద్రవ్యములు : శుద్ధనాగము, శుద్ధవంగము, శుద్ధ జసదము, గంజాయి, నల్ల మందు.

గుణము : మధుమేహము, జీర్ణపూయమేహములందు గుణకారి

దీనిని 1. రెట్టింపు త్రిజాత లేక త్రిఫలాచూర్ణము, పంచదార వీనితో నోటిపూత గుండెలలో మంట, కాళ్లచేతులుమంట, నేత్రవ్యాధులు, సమస్తమగు ప్రమేహములు, నడుమునొప్పులు, శుష్కించుట 2. వెన్నతో

శుక్లనష్టము శ్వేతరక్తప్రదరములు, యోని స్రావములు 3. కలబందరసముతో సమస్తమగు సెగవ్యాధులు, మూత్రకృచ్ఛ్రము, మూత్రనాళమందలి మంట, శరీర మెల్లప్పుడు వెచ్చగనుండుట, బలహీనత మొదలగు వ్యాధులయందియ్యవలయును. ఇందు సీసము వంగము సత్తు ఈ మూడును కలిసి యుండుటచే మేహసంబంధమగు ప్రతివ్యాధియందును అమోఘముగ పనిచేయును.

మోతాదు 1/4 చి॥ మొ॥ 3/4 చి. వరకు.

అనుభూత ప్రయోగములు : ప్రమేహములు, మధుమేహము, శుక్రనష్టము, రక్తప్రదరము, గనేరియా, మూత్రదోషములందు బాగుగా పనిచేయును. అతిమూత్రము, మూత్ర వికారములు, సోమరోగము, స్వప్నస్కలనము మొదలగువాని యందు పని చేయును. గర్భాశయ వికృతిని తొలగించి, గర్భాశయమునకు బలమును కలిగించి గర్భధారణకు యోగ్యముగా చేయును.

1. మధుమేహమునందు త్రివంగ భస్మము 10 గ్రా. తారకేశ్వర రస 10 గ్రా. గోమూత్ర శిలాజిత్ తిప్పత్తు 20 గ్రా. చొప్పున కలిపి, నేరేడు గింజల చూర్ణము 50 గ్రా. కలిపి, ఆమలకీ స్వరసముతో యిచ్చిన మధుమేహమును నియంత్రించ వచ్చును.

2. జీర్ణ పూయమేహమునందు గనోప్రభతో యిచ్చుచూ, మధున్నుహి రసాయ నము కూడా వాడిన పూయమేహము తగ్గును.

3. మూత్ర కృచ్ఛ్రము నందు ఉశీరాసవ, పునర్నవారిష్టల అనుపానముతో యివ్వ నగును.

పథ్యము : ఉలవకట్టు, పెసరకట్టు, ఆవునెయ్యి, పొట్లకాయ, పల్లేరు కూర

అపథ్యము : ఇంగువ, నువ్వులు, తాంబూలము, వ్యాయామము.

అనుపానము : తేనె లేదా తాజా వెన్న

మోతాదు : 125 మి.గ్రా. ఉదయము,సాయంత్రము భోజనానంతరము సేవించ వలెను.

లభ్యము : 5 గ్రా. 10 గ్రా.

## వంగ భస్మము (వై.చిం)

ద్రవ్యములు : శుద్ధవంగము, శుద్ధ తాళకము

గుణము : సకల మేహములు, సకల వాయువులు, భ్రమ, కఫము, క్షయ, పాండువు, శ్వాస, శూల, యకృత్, వమనము, ప్రదరములను హరించును. శక్తి వర్ధకము, దీపనము, పాచనము, రుచి, బుద్ధి, శీతలము, సౌందర్యము, ధాతుపుష్టి, వీనిని పెంచును. శుక్రనష్టము, గుల్మము, రక్తపిత్తము, శ్వాసకాస, మందాగ్ని తాపము, అజీర్ణము, చర్మరోగములు నశించును.

ఇది 1. చందనపు పొట్టు, చలవమిరియాలు, అతిమధురము వీనియొక్క రెట్టింపు చూర్ణము, వెన్న వీనితో శుక్లనష్టము,సెగవ్యాధులు, మూత్రనాళ మందలి బాధ, పొడి దగ్గు, కాళ్ళు చేతులు మంటలు, కండ్లుమంటలు 2. సమానమగు అభ్రకభస్మ, మీగడ వీనితో మధుమేహము, బహు మూత్రము, ఇరువది ప్రమేహములు, శ్వేత రక్త ప్రదరములు, శుక్లము నీరువలెనుండుట, బలహీనత, శీఘ్రస్ఖలనము 3. ఏలక్కాయలు, జాపత్రి వీనియొక్క రెట్టింపు చూర్ణము భస్మమునకు సమానమగు పచ్చకర్పూరము వీనితో నోటి దుర్గంధము, అరుచి, నోటిపూత, స్వరభేదములు వీనిని వెంటనే హరించును. ఉడుకును తగ్గించుటలో మిక్కిలి శ్రేష్ఠమైనది కనుక ఉడుకు వ్యాధుల నన్నిటిని నశింపజేయును.

మోతాదు 1/4 చి॥ మొ॥ చి. వరకు.

అనుభూత ప్రయోగములు : మూత్రములము,వస్తి శోధనము, వీర్యస్తంభనము చేయును. రక్తహీనతల యందు మిక్కిలి గుణకారి.

1. సుదర్శన చూర్ణము, ఫిరంగి చెక్క చూర్ణము, తామ్రభస్మములకు తోడుగా వంగ భస్మమును కలిపి, సరస అనుపానముగా యిచ్చిన, అనేకమైన చర్మ రోగములు నివారణ అగును.

2. వీర్య స్తంభనకు నెర్విటాల్‌తో యిచ్చిన గుణప్రదము.

3. ధాతుపుష్టి, శుక్రనష్టములందు పంచబాణకల్ప, రత్నపురుష లేహ్యములతో యివ్వవచ్చును.

4. మూత్రవికారములు, శుక్రబలహీనత, స్వప్న స్ఖలనములు, పురాణ రక్తదోష ములందు మిక్కిలి గుణకారి. వివాహమై 5 సం॥ల వరకు సంతానము లేని దంపతు లిరువురూ మూడు వారముల చొప్పున మధ్య

2 వారముల విరామమిచ్చుచూ 3 సార్లు సేవించిన తప్పక సంతానమును పొందగలరు.

పథ్యము : పుష్టికర ఆహారము

అపథ్యము : వ్యాయామము, అతిమైథునము

మోతాదు : 100–500 మి.గ్రా. తేనెతో ఉదయము, సాయంత్రం సేవించ వలెను.

లభ్యము : 5 గ్రా. 10 గ్రా.

**వరాట భస్మము (ర.సి.సం)**

ద్రవ్యములు : శుద్ధవరాటము

గుణము : పరిణామశూల, అన్నద్రవశూల,రసాజీర్ణము, గ్రహణి, ఆమ్లపిత్తము, రసక్షయము, ఉదరమునందు వాయువు చేరుట, శ్వాస,గుల్మము, ఉదర వాతము, మందాగ్ని, జీర్ణజ్వరము, నేత్రరోగములు, కర్ణరోగములను హరించును.

అనుభూత ప్రయోగములు : పిల్లలో కలుగు యకృత్ మరియు అనాస వ్యాధుల యందు మిక్కిలి గుణకారి.

1. భోజనమునకు ముందు భాస్కర లవణము, ఆవిపత్తికర చూర్ణములను కలిపి మజ్జిగతో చెంచాడు చొప్పున ఇచ్చుచూ, భోజనానంతరము కార్మిక్స్ కాప్స్యూల్‌తో వరాట భస్మము 2 గ్రా. యిచ్చిన పరిణామ శూల తగ్గును.

2. అగ్ని తుండివటి భోజన మధ్య సమయమున రెండుమాత్రలు, వరాట భస్మం 2 గ్రా. తీసుకొనిన అన్నద్రవ శూల తగ్గును. అగ్నితుండి వటి మాత్రలను నమిలి మ్రింగవలెను.

3. గ్రహణియందు దాడిమాష్టక చూర్ణము మజ్జిగతో యిచ్చుచూ, కుటజారిష్టకు 2 గ్రా. వరాట భస్మము కలిపి యిచ్చిన గ్రహణి తగ్గును.

పథ్యము : గోధుమలు, ఉలవలు, బార్లీ, పెసలు, మజ్జిగ, అల్లము, చక్కెర, ఖర్జూరము, టెంకాయ, తాటిముంజెలు, తేలికగా జీర్ణమగు ఆహారము, కాచి చల్లార్చిన నీటిని తీసుకొనవలెను.

అపథ్యము : చేపలు, ఇంగువ, నూనె పిండివంటలు, నువ్వులు, ఆవాలు, వెల్లుల్లి.

అనుపానము : నెయ్యి, మజ్జిగ, గోరువెచ్చని నీరు,నిమ్మరసము, తేనె, తిప్పసత్తు, వరాట భస్మము సేవించునపుడు అనుపానసేవన అతిముఖ్యము.

మోతాదు : 250 -500 మి.గ్రా. రోజుకు 2-3 సార్లు తేనెతో సేవించవలెను.

లభ్యము : 5 గ్రా.

## వైక్రాంత భస్మము (ర.సి.సం.)

ద్రవ్యములు : శుద్ధ వైక్రాంతము, శుద్ధ గంధకం, నిమ్మపండ్ల రసం.

గుణము : వృద్ధావస్థ యందు కలుగు బలహీనత, యక్ష్మ, పాండువు, అర్శస్సు, శ్వాస, కాస, దుష్టగ్రహణి, ఉరఃక్షతము, ముఖరోగములు మొదలగు వానిని హరిం చును. శరీరమునకు బలమునిచ్చును. త్రిదోషహరము, షడ్రసయుక్తము, రసాయనము, ధాతునష్టము, ఉదరరోగము, జ్వరము, క్షయ, ప్రమేహములను దూరము చేయును. ఆయుర్వృద్ధి కలుగజేయును.

**అనుభూత ప్రయోగములు :** ఇది 1. పెన్నేరు, నేలములగ, పిల్లిపీచర, వీనియొక్క మూడురెట్లు చూర్ణము వెన్న వీనితో క్షయలు, శుక్లనష్టము, దగ్గు, ఆయాసము, మధుమేహము, అతి మూత్రము 2. రెట్టింపు చవ్యపు చూర్ణము,తేనె వీనితో అజీర్ణము, శ్లేష్మ వ్యాధులు, గుల్మములు, 3. రెట్టింపు మోడి చూర్ణముతో ఋతుబద్ధకము; ఋతుశూల అగ్నిమాంద్యము వీరిని హరింపజేయును. దగ్గుల మీదను మేహ వ్యాధుల మీదను చక్కగ పనిచేయును.

మోతాదు 1/4 చి॥ మొ॥ 1/2 చి. వరకు.

అనుభూత ప్రయోగములు : 1.చ్యవన ప్రాశలేహ్యము, అశ్వగంధ లేహ్యములతో వైక్రాంత భస్మము 10 గ్రా. చొప్పున కలిపి ఉదయము సాయంత్రం పాలతో తీసు కున్న వృద్ధాప్యమునందు కలుగు అనేక బలహీనతలను నివారించవచ్చును.

2. రాజమృగాంకరస, వైక్రాంత భస్మములను సితోపలాది చూర్ణముతో యిచ్చుచూ, ద్రాక్షాసవ అనుపానముగా యిచ్చిన ఉరఃక్షతము తగ్గును.

3. దూలగొండి విత్తుల చూర్ణము, అశ్వగంధ చూర్ణము, ఉసిరిక వరుగులను కలిపి, నారసింహలేహ్యముతో యిచ్చిన, ధాతు వృద్ధి కలుగును.

పథ్యము : ధాతుపుష్టికర ఆహారములైన మాంసము, మినుములు, మధుర పదార్థముల సేవన

అపథ్యము : కారము,పులుపు,మసాలా

మోతాదు : 16-63 మి.గ్రా. తేనెతో ఉదయము, సాయంత్రము సేవించవలెను.

లభ్యము : 5 గ్రా. 10 గ్రా.

## ద్విగుణ సింధూరము

ఇది 1. రెట్టింపు సుగంధపాల చూర్ణముతో జీర్ణించిన సవాయి వ్యాధులు, కొరుకు, పొడలు, దురద, ఉడుకు వ్యాధులు, కాళ్ల చేతులుమంట, శుక్లనష్టము, శరీరమెల్లప్పుడు వెచ్చగ నుండుట, రక్తదోషమును, కృశించుట, దగ్గు మొదలగు వ్యాధులను నశింపచేయును. రక్తశుద్ధిని చేయుచు జీర్ణించిన సవాయి వ్యాధులను తగ్గించుటలో మిక్కిలి శ్రేష్ఠమైనది. మోతాదు 1/4 మొ ॥ 1/2 చి. వరకు.

## ఇంగిలీక సింధూరము

దీనిని 1. తమలపాకుల రసముతో చంటిపిల్లలకు కలుగు దగ్గు, జలుబు, ఆయాసము, జ్వరము, శ్లేష్మ ప్రకోపము 2. తేనెతో గాని చనుపాలతోగాని చంటిపిల్లలకు శరీరమెల్లప్పుడు వేడిగనుండుట, చిక్కిపోవుట, మొదలగు వ్యాధులు 3. తేనెతో పెద్దవారలకు కాళ్లుచేతులు మంటలు ఉడుకు వ్యాధులు మొదలగు వాని యందు ఇయ్యవలయును. మోతాదు 1/4 మొ ॥ 1/2 చి.వరకు.

## అన్నభేది (కాశీస) సిందూరము (బ.రా.) (స.యో)

ద్రవ్యములు : శుద్ధ కాశీసము

గుణము : రక్తవర్ధకము, స్రోతశ్శోధనము,రుచ్యము,జ్వరము,కామిల, అరుచి లందు ఉపయోగకారి, పుల్లనిది, నేత్రహితకారి, స్తనరంజనకారి, విష,శ్లేష్మ, వాత,వ్రణ దోషములను హరించును. (బసవరాజీయం) పాండు,క్షయ,మూత్రకృచ్ఛ్రము, అశ్మరి, యకృత్, ప్లీహోదరము, నేత్రరోగములు, ఉదర వాతయుక్త సంగ్రహణి, అతిసారము, ప్రవాహిక, మధుమేహము, ఆమవికారము, కఫప్రకోపము, అర్శశూల, వాతజ గుల్మము, స్త్రీల గర్భాశయ దోషములను హరించును. ఏదేని రోగము వలన గానీ, విచారము వలనగానీ బలహీనులైవారికి బలమును, కాంతిని

కలిగించును.

ఇది 1. రెట్టింపు శొంఠిచూర్ణముతో అజీర్ణములు, అజీర్ణ విరేచనములు కడుపు నొప్పి 2. రెట్టింపు మోడి చూర్ణముతో ఋతుబద్ధకము, ఋతుశూల 3. తేనెతో పాండువు, కామిర్లు, జీర్ణజ్వరము, వీనిని హరింపజేయును. వేడి చేయకుండగ అజీర్ణ ములను హరింపచేయుటలో నిది మిక్కిలి శ్రేష్ఠమైనది. మోతాదు 1/8 చి. మొ॥ 1/4 చి. వరకు.

అనుభూత ప్రయోగములు : శ్వేత కుష్టువు, కేశములు, కన్నులయందలి దురదను హరించును.

1. పర్పటి ప్రయోగములో కాశీససిందూరము తేనెతో కలిపి ఇచ్చిన, యకృత్ ప్లీహవృద్ధి తగ్గును.

2. గర్భాశయ దోష నివృత్తికై తేనెతో ఇచ్చుచూ యుటిరిల్ ఇచ్చుచుండవలెను.

3. పాండువునందు తేనెతో ఇచ్చుచూ పునర్నవాది మండూరము, పునర్నవారిష్ట ఇచ్చిన, రక్తవృద్ధి జరుగును.

4. క్షయయందు తామ్రభస్మము, ముత్యభస్మము, అకీక పిష్టిలను కలిపి తేనెతో ఇచ్చిన వ్యాధి క్షమత్వ శక్తి పెరుగుట ద్వారా క్షయ తగ్గును.

5. లివర్ వ్యాధులయందు భాస్కర లవణము, దాడిమాష్టక చూర్ణములతో సేవించవలెను.

పథ్యము : పొట్లకాయ, బీరకాయ, చెరకు రసము, పాలకూర, తోటకూర, తెల్లగలిజేరు కూర, ఉసిరికాయ, మెంతికూర, గోంగూర, తేలికగా జీర్ణమగు ఆహా రము, కాచి చల్లార్చిన నీరు తీసుకొనవలెను.

అపథ్యము : చేపలు, ఆవాలు, మినుములు, పులుపు పదార్ధములు, తాంబూ లము, వెన్న, నెయ్యి కల్గిన పదార్ధములను తాత్కాలికముగా త్యజించవలెను.

మోతాదు : 125–375 మి.గ్రా. రోజుకు రెండుసార్లు.

తీసుకోవలసిన జాగ్రత్త : కాశీసభస్మ సేవన వలన కొందరికి వాంతులు, కళ్లు తిరుగుట జరుగవచ్చును. అట్టి పరిస్థితులలో మోతాదును తగ్గించి స్వర్ణ మాక్షిక భస్మమును కలిపి ఇవ్వవలెను.

లభ్యము : 10 గ్రా.

## లోహాభ్రక సింధూరము / కాంతాభ్రక సింధూరం

ఇది 1. లవంగాలు, తాలీసపత్రి, శుంఠి, వీనియొక్క మూడురెట్ల చూర్ణముతో దగ్గు, ఆయాసము, క్షయలు, శ్లేష్మ వ్యాధులు, అజీర్ణములు, నంజు 2. రెట్టింపు చాతుర్జాతక చూర్ణము, పంచదార వీనితో నోటిపూత, గుండెవ్యాధులు పైత్యవ్యాధులు, వాంతులు, ఎక్కిళ్ళు 3. అతిమధురము, ఉసిరికపప్పు, వట్టివేళ్ళు వీనియొక్క మూడు రెట్ల చూర్ణము, వెన్న వీనితో నోటిపూత, ప్రమేహవ్యాధులు, ప్రదర వ్యాధులు, బలహీనత, కాళ్ళుచేతులు మంటలు, సెగవ్యాధులు 4. తేనెతో చచ్చువాతము, పక్ష వాతము మొదలగు వాత వ్యాధులు, తిమిరవాతము, చర్మవ్యాధులు, రక్తదోషములు, వీనిని నిస్సందేహముగ హరింపచేయును. మేహ పాండువు, మేహనంజు మొదలగు మేహ ప్రధాన వ్యాధుల యందు మేహప్రకృతి కలవారలకు, లోహజాతి వేడి చేయునని తోచినప్పుడు దీనిని కొంతకాలముపయోగించినచో చాల బాగుగ పనిచేయగలదు. ఇది సగము అభ్రకము, సగము లోహము కలసి పుటములు వేయునదగుటచే తగిన అనుపానములతో సమస్త వ్యాధులను నశింప జేయుననుటలో ఎంత మాత్రము సందేహములేదు.

మోతాదు 1/4 చి॥ మొదు 1/2 చి.వరకు.

## తాళక సిందూరము

దీనిని 1. తేనెతో నుపయోగించిన యెడల శ్లేష్మ వ్యాధులు, క్షయ, దగ్గు, ఆయాసము, కుష్ఠములు, చర్మవ్యాధులు, సవాయి వ్యాధులు, మొదలగునవి వెంటనే హరించును. మోతాదు 1 మొ॥ 2 యవలు వరకు.

ఇంకా అనేక భస్మసిందూరాది యోగాలు అనుపానాలు నాచే రచించబడిన ధాతు వైద్యమను గ్రంథమును సంప్రదించగలరు.

## రసౌషధములు

### అగ్నికుమార రస (ర.సి.సం.)

ద్రవ్యములు : శుద్ధపాదరసం, శుద్ధ గంధకం, శుద్ధ టంకణం, శుద్ధ వత్సనాభి, శంఖ భస్మం, వరాటికా భస్మం, నల్ల మిరియాలు, నిమ్మపండ్ల రసము.

గుణము : అగ్ని దీపనము, వాతప్రకోపొత్పన్న అజీర్ణము, విషూచిక, కఫరోగము లను హరించును. అజీర్ణమువలన జనించు ఉదరవాతము. గుదమార్గమునందు వాతసంచయము, గుల్మజనిత వాతము మరియు ఇతర కోష్ఠగత వాత వికారములను నశింపజేయును. ఆమాశయము, పక్వా శయము మరియు గ్రహణిలయందు వాయువు చేరుట, ఉదర శూలల యందు బాగుగా పనిచేయును.

అనుభూత ప్రయోగములు : 1. ఉదర శూలనందు శూలకల్పము తగు మాత్రలో యిచ్చుచూ, అగ్నికుమార రసము, డైజిటాల్‌లతో వాడిన శూల హరించును.

2. అగ్నిదీప్తికై అగ్నితుండివటితో వాడిన పాచకాగ్ని ఉత్తేజము నొంది అగ్ని మాంద్యము నశించును.

3. ఏ విధమైన ఉదర రోగములనందైనను అవసరార్ధముగా అగ్నితుండివటితో వాడిన మరింత బలముగా పనిచేయును.

పథ్యము : పాతబియ్యము, చిన్న చేపలు, లేత ముల్లంగి, వెల్లుల్లి, పొట్ల, బీర కాయలు, అల్లము, ఉసిరిక, వేడినీరు, వ్యాయామము.

అపథ్యము : గురుకరమగు పదార్థములు, చేపలు, అమిత జలపానము, కంద మొదలగు దుంపలు, ఉడకని అన్నము; వెంటవెంటనే భోజనము, జాగరణ, మల మూత్ర నిరోధము.

మోతాదు : 1 మాత్ర చొప్పున ఉదయము, సాయంత్రము భోజనానంతరము సేవించవలెను.

లభ్యము : 20,40 మాత్రలు

### అగ్ని కుమారము

ఇది 1. వామురసముతో లేక శుంఠిరసముతో సమస్తాజీర్ణములు, కడుపుబ్బరము, అగ్నిమాంద్యము, ప్రేగులరచుట, కడుపునొప్పి 2. అల్లపు

రసముతో అజీర్ణ జ్వరము, పైత్యజ్వరము, వాతజ్వరము 3. దాల్చినచెక్క, వాము, మిరియాలు, వీనియొక్క రసముతో విషూచి (కలరా), అజీర్ణ విరేచనములు, వాంతులు, నీళ్ళవిరేచనములు 4. వాయువిడంగముల రసముతో క్రిమి వ్యాధులు 5. చనుపాలు లేక తమలపాకుల రసముతో చంటిపిల్లలకు కలుగు జ్వరము, అజీర్ణము, జలుబు, దగ్గు మొదలగు వానిని వెంటనే నశింపచేయును.

మోతాదు 1/2 చి. మొ॥ 1 చి. వరకు.

## అగ్నితుండివటి (వై.చి.)

ద్రవ్యములు : శుద్ధపాదరసము, శుద్ధ గంధకము, శుద్ధ వత్సనాభి, వాము, త్రిఫలములు, త్రికటుకములు, సర్జక్షారము, యవక్షారము, చిత్రమూలము, సైంధవ లవణము, జీలకర్ర, సముద్రలవణము, శుద్ధ ముషిణి విత్తులు, సౌవర్చలవణము, వాయు విడంగములు.

గుణము : అగ్నిమాంద్య హరము

అనుభూత ప్రయోగములు : అజీర్ణము, కడుపుబ్బరము, మలబద్ధకము మరియు అజీర్ణము వలన కలుగు వివిధ రోగముల యందు గుణకారి.

1. ఆమ్లపిత్తమునందు (ఏకారణముచేతనైనను కలిగిన) దాడిమాష్టక చూర్ణము, శూల కల్పము, గంగాధర చూర్ణములను మజ్జిగతో యిచ్చుచూ, భోజనానంతరము అగ్నితుండివటి యిచ్చిన అగ్నిమాంద్యము నశించి ఆమ్లత్వము తగ్గును.

2. అరుచినందు భావన జీలకర్ర లేదా భావన అల్లం వాడుచూ, అగ్నితుండి వటి వాడిన నోటికి రుచి కలుగును.

3. అన్నద్రవ శూలనందు భోజనమునకు ముందుగా 2 మాత్రలు వేసుకొనుచూ, భోజనానంతరము శూలకల్పము యిచ్చిన శూల నశించును.

పథ్యము : తేలికయిన పాతబియ్యము, పెసలు, పేలాలు, పెసరకట్టు, లేత ముల్లంగి, వెల్లుల్లి, లేత అరటికాయ, పొట్లకాయ, బీరకాయ, అల్లము, వ్యాయామము.

అపథ్యము : కొత్తబియ్యము, చేపలు, అమిత జలపానము, బచ్చలికూర, దుంపకూరలు, మాంసము, పాలు; నూనె పదార్థములు; జాగరణము, మలమూత్ర నిరోధము.

మోతాదు : 1 మాత్ర చొప్పున ఉదయము, సాయంత్రం సేవించవలెను.

లభ్యము : 20,40 మాత్రలు

## అజీర్ణ గజకేసరి

ఇది 1. రెట్టింపు త్రికటుచూర్ణము, వేడినీరు వీనితో సమస్తమగు అజీర్ణములు, ఆమ్లపిత్తము, శూల, మలబంధము, పరిణామశూల, కడుపుబ్బరము, వాంతులు, ప్రేగులరచుట, అతిసారము, గ్రహణీ రోగము, శ్లేష్మవ్యాధులు మొదలగువానిని నశింప చేయును. మోతాదు 1/4 మొ॥ 3/4 చి. వరకు.

## ఆనందభైరవి (బ.రా.)

ద్రవ్యములు : శుద్ధవెలిగారము, శుద్ధ ఇంగిలీకము, పిప్పళ్లు, శుద్ధ వత్సనాభి, మిరియాలు, వేపచెక్క రసము.

గుణము : సర్వజ్వరములను హరించును.

అనుభూత ప్రయోగములు : 1. విషమ జ్వరమునందు విషమ జ్వరాంతకవటితో ఇచ్చుచూ, పంచతిక్త పానకముతో రోజుకు 4 సార్లు చొప్పున యిచ్చిన విషమ జ్వరము శమించును.

2. శ్లేష్మక జ్వరమునందు త్రిభువన కీర్తిరసతో యిచ్చిన జ్వరవేగము తగ్గును.

3. సమస్త రకములైన జ్వరములందు లక్షణానుసారముగా ఆనందభైరవితో నిస్సందేహముగా వాడవచ్చును.

పథ్యము : బార్లీజావ, నూకలజావ, వేయించిన బియ్యపు అన్నము, తేనె, బీరకాయ,పొట్లకాయ

అపథ్యము : చేపలు, మాంసము, శీతలకర ఫలములు, నూనెపదార్థములు.

అనుపానము : అల్లపు రసముతో సేవించవలెను. జ్వర తీవ్రతగా ఉన్న యెడల అల్లపు రసము, తేనెలతో ప్రతి 4 గంటలకు ఒకసారి సేవించిన జ్వరతీవ్రత తగ్గును.

మోతాదు : 1-2 మాత్రలు అల్లపు రసముతో ఉదయము, సాయంత్రము సేవించవలెను. లభ్యము : 20 మాత్రలు

## ఆనందభైరవి (కా.స) (భై.ర.)

ద్రవ్యములు : శుద్ధ ఇంగిలీకము, శుద్ధ వత్సనాభి, శొంఠి, మిరియాలు, పిప్పళ్లు, టంకణ భస్మం, శుద్ధ గంధకము, నిమ్మపండ్ల రసము.

గుణము : కాస,శ్వాస,అతిసారము, గ్రహణి, సన్నిపాతము, అపస్మారక, వాతిక ప్రమేహము, అజీర్ణము, అగ్నిమాంద్యము మొదలగు రోగములందు శ్రేష్ఠము.

ఇది 1. అల్లపురసముతో సన్నిపాతజ్వరము, విషమజ్వరము, పైత్య వ్యాధులు, అజీర్ణము, తలనొప్పి 2. తేనెతో జ్వరమునందు విరేచనములగు చుండుట, దగ్గు, ఆయాసము, కడుపుబ్బరము, ప్రేగుల రచుట 3. రెట్టింపు కొడిశపాలగింజలరసముతో అతిసారం, గ్రహణికి 4. 2,3 తులముల చవ్యపుకషాయము, 1/2 తు. సైంధవ లవణము, వీనితో గుల్మము, శూల, పరిణామశూల, ఉదరవ్యాధులు వీనిని నశింపజేయును. దోషజ్వరములు, జలుబు, శిరోభారము, తలనొప్పి మొదలగువాని యందు తేనెతో అరగదీసి కంటిలో కలికముగ నుపయోగింపవచ్చును.

మోతాదు 1/2 చి. మొ॥ 3/4 చి. వరకు

అనుభూత ప్రయోగములు : 1. కాస, శ్వాసలందు నాకాస్‌తో పాటుగా యిచ్చుచూ, చ్యవనప్రాశ లేహ్యము వాడనగును.

2. అతిసారమునందు కుటజారిష్ట అనుపానముతో యిచ్చిన ఫలదాయకము.

3. అగ్నిమాంద్యమునందు త్రికటు చూర్ణము, రోహితకారిష్టలతో యిచ్చిన జఠర దీప్తి కలుగును.

పథ్యము : గోధుమలు, మద్యము, తేనె,ద్రాక్షపండ్లు, పొట్లకాయ, బీరకాయ, వెల్లుల్లి, వేడినీరు.

అపథ్యము : గొర్రెపాలు, చల్లనినీరు, దుంపకూరలు, ఆవాలు, నూనె పదార్థ ములు, చల్లని గాలి, మంచు

అనుపానము : అల్లపు రసము, తేనెలతో సేవించవలెను.

మోతాదు : 1–2 మాత్రలు ఉదయము, సాయంత్రం సేవించవలెను.

లభ్యము : 20 మాత్రలు

కందమూల రసాయనముతో కలిపి వాడిన రక్తస్రావము తగ్గి, అర్శస్సు తగ్గును.

పథ్యము : ఉసిరికాయ, కంద, గలిజేరు ఆకుకూర, ఆవుమజ్జిగ, ఇంగువ, లేత మామిడి పిందెలు, పెసరపప్పు వేడినీరు.

అపథ్యము : చారకంద, మినుములు, చేపలు, వంకాయ, పిండివంటలు, మాంసము, కఠిన పదార్థములు, అతివాహనయానము.

అనుపానము : మజ్జిగ, దానిమ్మపండ్ల రసము,పుటపక్వము చేసిన కంద యొక్క స్వరసము.

మోతాదు : 1 మాత్ర చొప్పున ఉదయము,సాయంత్రం సేవించవలెను.

లభ్యము : 20,40 మాత్రలు

## అర్శకుఠార రస (ర.ర.స.)

ద్రవ్యములు : శుద్ధపాదరసము, శుద్ధగంధకము, తామ్రభస్మం, లోహభస్మం, త్రికటుచూర్ణం, శుద్ధపొత్తిదుంప చూర్ణం, దంతీమూలచూర్ణం, వరరోగు వేళ్ళచూర్ణం, చిత్రమూల చూర్ణం, యవక్షారము, శుద్ధ టంకణ చూర్ణము, సైంధవలవణము.

గుణము : అర్శస్సును హరించును.

అనుభూత ప్రయోగములు : విరేచనకారి, అర్శస్సును ఎండిపోవునట్లు చేయును. రక్తార్శస్సునందు వుపయోగకారి.

1. అర్శస్సునందు కందమూల రసాయనము చెంచాడు భోజనమునకు ముందు తీసుకొనుచూ, భోజనానంతరము అర్శకుఠార రసము రెండు చెంచాల సరసతో తీసుకొనిన, అర్శరూపములైన ఆమ్లపిత్తము, ఆటోపము, శూల, గ్రహణి, లక్షణములు తొలగి, అర్శస్సు తగ్గుముఖం పట్టును.

2. అగ్నిమాంద్యమునందు భాస్కర లవణముతో తీసుకొనవచ్చును.

3. రక్తార్శస్సునందు రక్తస్తంభక ద్రవ్యములైన లొద్దుగ చూర్ణము, ఉశీర చూర్ణము, పర్పాటక చూర్ణములను ఉద్దీపింపజేయును. హృదయమునకు హితకరము, మేదో వినాశకరము, మలశోధకము, ఆకలిని పుట్టించును.

అనుభూత ప్రయోగములు : జలోదరము, యకృత్, ప్లీహ రోగములు, మధు మేహము, రక్తక్షీణత, పాండువు, కామిల మొదలగు వ్యాధులందు గుణకారి. శరీరము పచ్చబడి, క్రమముగా బలహీనమగుచున్న సమయమున ఈ ఔషధమును వాడిన గుణమును కల్గించును.

1. అనేకమైన చర్మరోగములందు శారిబాద్యరిష్ట, ఖదిరారిష్టలను

అనుపానముగా వాడవచ్చును.

2. యకృత్‌వృద్ధినందు నేలవేము, పిప్పలీ చూర్ణము, తామ్రభస్మము, వరాట భస్మము, అవిపత్తిక చూర్ణములను కలిపి 2 గ్రా॥లుగా చేసి భోజనమునకు ముందు మజ్జిగతో తీసుకొనుచూ, భోజనానంతరము ఆరోగ్యవర్ధనీవటి 40 రోజులు వాడిన యకృత్ సహజమైన రీతిలోనికి వచ్చును.

3. శ్విత్రమునందు చంద్రప్రభావటితో వాడవచ్చును.

పథ్యము : చెరకు రసము, పొట్ల, బీరకాయలు, తెల్లగలిజేరు కూర, పొన్నగంటి కూర, పాలకూర, వెల్లుల్లి, నీరుల్లి.

అపథ్యము : మినుములు, ఆవాలు, తెలగపిండి, పులుపు పదార్థములు, కల్లు, చేపలు, మలమూత్ర వేగ నిరోధము అమిత ఉదక పానము.

మోతాదు : 1 మాత్ర ఉదయం, సాయంత్రం సేవించవలెను.

లభ్యం : 20,40 మాత్రలు

## బాల సూర్యోదయము

ఇది 1. తేనెతో జీర్ణజ్వరము, దగ్గు, ఆయాసము, వాంతి, పాండువు, ప్లీహ వ్యాధులు, క్షయ 2. శొంఠిరసముతో గుల్మము, అజీర్ణము, ఉదర వ్యాధులు 3 రెట్టింపు తానిక్కాయ బెరళ్ళ చూర్ణముతో ప్రదరములు యోని దోషములు, లింగదోషములు వీనిని హరింపజేయును. మోతాదు 1/4 చి॥ మొ॥ 1/2 వరకు.

## భేదీజ్వరాంకుశ రస (వై.చిం.)

ద్రవ్యములు : శుద్ధపాదరసము, శుద్ధ ఇంగిలీకము, శుద్ధ నాభి, శుద్ధ గంధకము, శుద్ధ వెలిగారము, మిరియాలు, శుద్ధనేపాళము, మర్దనకొరకు ములకపండ్ల రసము.

గుణము : మలదోషము నివర్తించును. జ్వరహరము

అనుభూత ప్రయోగములు : తీవ్రవిరేచనకారి, పాచనము కాని ఆహారము వలన కలుగు అన్నిరకముల ఉదర వ్యాధులందు ఈ ఔషధమును సేవించిన, ఉదరము నందలి మలినపదార్థములను బయటకు వెడలించును. తద్వారా అజీర్ణ జ్వరం, అపాన వాయువు మొదలగు లక్షణములను హరించును.

1. సన్నిపాత జ్వరమునందు (ఆంత్రిక జ్వరము) సుదర్శన చూర్ణము, వైశ్వానర చూర్ణము, తిప్పసత్తులను అమృతారిష్టతో ఇచ్చుచూ, భేదీజ్వరాంకుశ రసము 10-15 రోజులపాటు ఇచ్చిన శమించును.

2. పిత్తాధిక్య జ్వరమునందు శారిబాద్యరిష్ట, ఉశీరాసనలతో వాడిన బలముగా ఉన్న పిత్త దోషము శమించును.

3. కఫాధిక్య జ్వరమునందు పిప్పలీ చూర్ణము, రోహితకారిష్టలతో వాడిన కఫము శమించును.

పథ్యము : లఘు ఆహారము అనగా బీరకాయ, పొట్లకాయలు, పలుచని పాలు, గోధుమరొట్టె, గోధుమనూకల జావ, బార్లీజావ.

అపథ్యము : కర్బూజా, పనస మొదలగు శీతలకర ఫలములు, పాలు,నెయ్యి, మాంసము, పుష్టికర, విదాహకర, గురుత్వ పదార్థములు.

అనుపానము : అల్లపు రసముతో గానీ, వేడి నీటితోగానీ ఇవ్వవలెను. పిల్లలకు చనుబాలు, తేనెలతో కలిపి ఇవ్వవలెను. తాలీసాది చూర్ణముతో సేవించిన శీఘ్రముగా వికారము లేకుండా విరేచనమును చేయును.

మోతాదు : 1-2 మాత్రలు శరీరతత్వమునసరించి వాడవలెను. విరేచనములు ఎక్కువ అగుచున్నచో చల్లని నీరు లేదా మజ్జిగ త్రాగినచో అరికట్టును.

లభ్యము : 20 మాత్రలు

**బోలబద్ధ రస (ర.సా.)**

ద్రవ్యములు : తిప్పసత్తు, శుద్ధగంధకము, శుద్ధపాదరసము, గంధక బోలము, బూరుగ పట్ట స్వరసము.

గుణము : రక్తార్శస్సు, పిత్తజ అర్శస్సు పిత్తజ, విద్రధి, రక్తప్రమేహము, వాత రక్తము, ప్రదరము, భగందరములను నశింపజేయును.

అనుభూత ప్రయోగములు : 1. లొద్దుగచెక్క చూర్ణము, తిప్పసత్తులను చ్యవన ప్రాశలేహ్యముతో కలిపి తీసుకొనుచూ, బోలబద్ధరసమును, ఉశీరాసవ అనుపానముగా వాడిన, పిత్తజ విద్రధి తగ్గును.

2. రక్తార్శస్సునందు అర్శకుఠార రస, కందమూల రసాయనములను ఇచ్చుచూ, బోలబద్ధ రసమును సరసతో అనుపానముగా ఇచ్చిన తగ్గును.

3. ప్రదరాంతకరస, అశోకారిష్ట, యుటిరిలతో పాటుగా బోలబద్ధ

రసము నిచ్చిన, ప్రదర రోగము తగ్గును.

పథ్యము : గలిజేరు ఆకుకూర, మజ్జిగ, ఉసిరికాయ, సైంధవలవణము, చల్లని నీరు.

అపథ్యము : ఆనపకాయ, వంకాయ, పిండివంటలు, వేడినీరు.

మోతాదు : ఒకమాత్ర చొప్పున రోజుకు రెండుసార్లు సేవించవలెను.

లభ్యము : 20,40 మాత్రలు.

## బహుమూత్రాంతక రస (భై.ర.)

ద్రవ్యములు : రససిందూరం, బూరుగు వేరు చూర్ణం, అరటిగడ్డ, మేడిబీజముల చూర్ణం, లోహభస్మం, వంగభస్మం, ప్రవాళభస్మం, ముత్య భస్మం, నల్లమందు, మాలతీ పుష్పస్వరసం.

గుణము : బహుమూత్రము, బహుమూత్రమువలన జనించు అన్య రోగములను నశింపచేయును. మధుమేహమును సోమరోగమును హరించును.

అనుభూత ప్రయోగములు : మూత్రపు ప్రమాణమును తగ్గించును.

1. సోమ రోగము నందు ఉశీరాసవ, అమృతారిష్టలను అనుపానముగా వాడ వచ్చును.

2. బహుమూత్రమునందు అశ్వగంధ చూర్ణము, శతావరీ చూర్ణమ, త్రివంగ భస్మములను (10గ్రా.) కలిగి భోజనానికి ముందు తేనె లేదా పంచదార నీటితో తీసుకుంటూ, భోజనానంతరము బహు మూత్రాంతక రెండు మాత్రల చొప్పున పగలు, రాత్రి సేవించవలెను.

3. మధుమేహమునందు తారకేశ్వర రసముతో వాడవచ్చును.

4. మూత్రాశయములో రాళ్లు కరిగిపోవుటకు రాస్నాది క్వాథముతో వాడ వచ్చును.

5. బలహీనత వలన కలిగే బహు మూత్రమునందు అశ్వగంధ లేహ్యము, నెర్విటాల్‌లతో వాడిన అత్యంత గుణకారి.

పథ్యము : మాంసరసము, పొట్లకాయ, బీరకాయ, లేతమునగకూర, మెంతి కూర, మీగడ తీసిన ఆవుపాలు, నిమ్మపండ్లు, నేరేడుపండ్లు.

అపథ్యము : ఆలస్యముగా జీర్ణమగు పదార్థాలు, వేడిచేయు స్వభావము కలిగిన వెల్లుల్లి, నువ్వులు, గుమ్మడికాయ, ఆవనూనె. అతినిద్ర,

సోమరితనము.

మోతాదు : 1-2 మాత్రలు రోజుకు రెండుసార్లు పాలతో సేవించవలెను.

లభ్యము : 20,40 మాత్రలు

**బృహత్ వాత చింతామణి రస (భై.ర.)**

ద్రవ్యములు : స్వర్ణ భస్మము, రజతభస్మము, అభ్రకభస్మము, లోహభస్మము, ప్రవాళ భస్మము, ముత్య భస్మము, రససిందూరం, మర్దన కొరకు కలబంద స్వరసం.

గుణము : అనుపాన భేదముచే సర్వరోగహరముగా ఉపయోగించుకొనవచ్చును. వాతరోగమును, పిత్తరోగమును హరించును. వృద్ధులు సహితం యవ్వనశక్తిని పొంద గలరు. సంభోగ శక్తిని పెంపొందించును.

అనుభూత ప్రయోగములు : మెదడునందలి జ్ఞాన వాహినీ నాడుల వికృతిచే కలుగు వ్యాధులయందు మిక్కిలి గుణకారి. హృదయము, మస్తిష్కములకు శక్తినిచ్చును. కఠిన వాత రోగములు, సర్వశరీరగత వేదనలందు గుణకారి.

1. శరీరము కంపమునొందుట, మాటసరిగా రాకుండుట వంటి వాత ప్రధాన రోగములందు వాతశమనములైన దశమూలారిష్ట, అశ్వగంధారిష్టలతో తీసుకొన వచ్చును.

2. ఆర్దిత వాతమునందు రోజూ నెర్విటాల్‌తో పాటు ఉదయము సాయంత్రము భోజనము తరువాత వాడుతూ లహసాన్ ఇంజక్షన్ రోగికి కండకు సుమారుగా 20 రోజులు వాడుతూ, దుష్టినొందిన ప్రదేశములో వాతహర తైలములతో మర్దన చేయుచూ, ఉష్ణోదకముతో సేకము చేయవలెను.

3. మధుమేహమునందు కలిగే అంగశైథిల్యమునందు అమలకీస్వరసముతో తీసుకొనిన ఉపయోగకరము.

పథ్యము : మాంసమువేసి వండిన అన్నము, ఆవునెయ్యి, ఆవుపాలు, ఆవు పెరుగు, కందిపప్పు, పెసరపప్పు, మేకమాంసము, మాంసరసము లేదా కోడిమాంసము

అపథ్యము : కొత్తబియ్యపు అన్నము, చలి అన్నము, పులుసు, మత్స్యములు, ఆవనూనె, ఆకు కూరలు, వంకాయ.

మోతాదు : 1–2 మాత్రలు ఉదయము, సాయంత్రము సేవించవలెను.

లభ్యము : 10 మాత్రలు

## చంద్రకళారస (భై.ర.)

ద్రవ్యములు : శుద్ధపాదరసము, తామ్రభస్మము, అభ్రకభస్మము, శుద్ధగంధకము, మర్దనకు నాగముస్తస్వరసం, దానిమ్మస్వరసం, కతకస్వరసం, సహదేవి స్వరసం, కలబంద స్వరసం, పర్పాటకము, వట్టివేరు, పిప్పలి, చందనము, సుగంధిపాల, ద్రాక్షపండ్ల కషాయము.

గుణము : ఆమ్లపిత్తము, ప్రదరము, బాహ్య అంతర దాహములు, రసజన్య మూర్ఛ, రక్తపిత్త, పిత్తజ్వరం, సమస్త మూత్రకృచ్ఛ్రములు, సమస్త ప్రమేహములు నశించును.

అనుభూత ప్రయోగములు : 1. ఆమ్లపిత్తమునందు భాస్కర లవణము, శూల కల్పము, త్రిఫల చూర్ణము ఒక్కొక్కటి 50 గ్రా. చొప్పున కలిపి, భోజనమునకు ముందుగా అరచెంచాడు పొడిని అరకప్పు మజ్జిగతో కలిపి సేవించుచూ, భోజనా నంతరము చంద్రకళారసము ఒక మాత్ర చొప్పున ఉదయము సాయంత్రం 40 రోజులపాటు తీసుకొనిన యెడల ఆమ్లపిత్తము శమించును.

2. మూత్ర కృచ్ఛ్రమునందు రాస్నాది క్వాథముతో రోజుకు నాలుగుసార్లు 3–4 చెంచాలు చొప్పున చంద్రకళారసము ఒక మాత్రతో తీసుకొనిన ఉత్తమ ఫలితము నిచ్చును. (40రోజులపాటు)

3. ప్రదరరోగమునందు హేమసుందర రసముతో పాటుగా చంద్రప్రభావటి, అశోకాదివటి, చంద్రకళారసము ఒక్కొక్కమాత్ర చొప్పున, కుమార్యాసన రెండు చెం చాలు, అశోకారిష్ట రెండు చెంచాలు చొప్పున భోజనానంతరము పగలు రాత్రి నెల రోజులు వాడిన నివారించవచ్చును.

పథ్యము : పెరుగు, మజ్జిగవంటి చలువచేయు పదార్థములు, నిమ్మరసము, పండ్ల రసాలు, పంచదార, బార్లీ, సగ్గుబియ్యం జావ, ఎక్కువగా నీరు త్రాగుతూ ఉండవలెను.

అపథ్యము : మునగకాయ,చేపలు,కారము,మసాలా,ఊరగాయలు.

మోతాదు : ఒకమాత్ర చొప్పున రోజుకు రెండుసార్లు సేవించవలెను.

లభ్యము : 20,40 మాత్రలు

## దంతోద్భేద గదాంతకరస (భై.ర.)

ద్రవ్యములు : పిప్పలి, పిప్పలీ మూలము, చవ్యము, చిత్రకము, శొంఠి, అజా మోదము, వాము, పసుపు, ఇప్పపువ్వు, దేవదారు, మానుపసుపు, విడంగములు, చిన్నయాలకులు, నాగకేసరములు, ముస్తలు, కచ్చూరములు, కర్కాటక శృంగి, బిడా లవణము, అభ్రకభస్మము, శంఖభస్మము, లోహభస్మము, స్వర్ణమాక్షిక భస్మము,పాలు.

గుణము : పసిపిల్లలలో పాలపళ్లు సులువుగా, త్వరగా వచ్చుటకు దోహదము చేయును. పాలపళ్లు వచ్చునపుడు సామాన్యముగా వచ్చు జ్వరము, ఆక్షేపము, నీళ్ల విరేచనములు, కడుపునొప్పి, మరియు అతిసారము వాంతులు వంటి వ్యాధులను హరించును. పండ్లు పూర్తిగా వచ్చువరకు పిల్లలకు ప్రతిరోజూ ఇచ్చుట మంచిది.

అనుభూత ప్రయోగములు : 1. పసిపిల్లలకు దంతోద్భేద సమయమునందు వచ్చు అతిసారము, జ్వరములందు దాడిమాష్టక చూర్ణముతో ఇచ్చిన జ్వరము, విరేచన ములు తగ్గును.

2. పాలవలన కలిగే అతిసారమునందు హీనమాత్రలో పిప్పలీ చూర్ణము, కస్తూరీ మాత్రలతో ఇచ్చిన అతిసారము తగ్గి, వాంతులు పోయి ఆకలి పుట్టును.

3. ఫక్కారోగమునందు కళ్యాణ ఘృతముతో సేవించిన మాంసధాతువు వృద్ధి నొందును.

పథ్యము : పలుచని పాలు, మజ్జిగతేట, సగ్గుబియ్యం, బార్లీ, ఎక్కువ ద్రవ పదార్థములు.

అపథ్యము : గురుపదార్థములు, చిక్కని పాలు.

మోతాదు : 1-2 మాత్రలు తేనెతో ఇచ్చుచూ, తల్లిపాలనుగానీ, ఆవుపాలను గానీ ఇవ్వవలెను.

లభ్యము : 10 మాత్రలు.

## ఏకాంగవీరరస

ద్రవ్యములు : రససింధూరము, శుద్ధగంధకం, కాంతలోహ భస్మం,

వంగభస్మం, శతపుట నాగభస్మం, తామ్రభస్మం,శతపుట అభ్రకభస్మం, లోహభస్మం, శొంఠి, మిరి యాలు, పిప్పళ్లు మరియు త్రిఫల,త్రికటు, నిర్గుండి, అల్లము, చిత్రమూలము, మునగ పట్ట, చెంగల్వకోష్టు, ఉసిరి, విషముష్టి గింజలు, అర్కమూలము, ఏరండమూలము, పారిజాతము వీని క్వాథములు.

గుణము : పక్షాఘాతము, ఆర్దితము, ధనుర్వాతము, అర్ధాంగవాతము, గృధ్రసీ, విశ్వాచీ, అపబాహుక మొదలగు వాత రోగములను నిస్సందేహముగా హరించును. వాత ప్రధాన, వాత కఫ ప్రధాన రోగములను నశింపజేయును. ఇందు బృంహణ, వాతశమన, రసాయన, విషఘ్న మరియు సూక్ష్మక్రిమి నాశక గుణములు కలవు. పిత్త సంబంధ వాతరోగములందు ప్రవాళపిష్టి, శిలాజిత్‌లతో సేవించుట క్షేమకరము

దీనిని ఒక మాత్ర చొప్పున కేవలము సేవించిన యెడల అష్టాదశకుష్ఠములు, జీర్ణించిన సవాయి వ్యాధులు, భగందరము, పుండ్లు, చర్మదోషములు, కొరుకు, దురద, విషదోషము, కరిమేహము, మేహ వ్యాధులచే శరీరము నల్లపడుట, మొదలగు వ్యాధులయందు అమోఘముగ పనిచేయును. రక్తశుద్ధిని చేయు మందులలో నద్వితీయ మైనది. బహు పరిశుభ్రముగ తయారు చేయబడినది. తిప్పతీగ కషాయముతోగాని సుగంధిపాల కషాయముతోగాని సేవించినయెడల నింకను అమోఘముగ పని చేయును. పైత్య ప్రకృతికలవారు జీలకర్ర లేక ధనియాల రసముతో పుచ్చుకొనుట మంచిది. దీనిని సేవించునప్పుడు నూనె ఆవ మొదలగు పైత్యమును చేయు వస్తువులను సేవింపరాదు. 1 తులము 10 మాత్రలగును.

అనుభూత ప్రయోగములు : 1. ఆర్దిత వాతమునందు లశునాదివటి లోనికి ఇచ్చుచూ, మహావాత విధ్వంసిని ఇంజక్షన్ రోజూ యిచ్చుచూ ఏకాంగవీర రస భోజనానంతరము రోజుకు 2సార్లు యిచ్చుచున్న మూతి వంకర పోవుట వంటి వాత లక్షణములు తగ్గును.

2. గృధ్రసీ వాతమునందు కటి ప్రదేశము నుండి దూషింపబడిన భాగమంతయు వాతహర తైలములతో అభ్యంగనము చేయుచూ, లహసాన్ ఇంజక్షన్ రోజుకు ఒకటి చొప్పున యిచ్చుచూ, అలిశట్ కాప్స్యూల్ భోజనానంతరము ఏకాంగవీర రసముతో నిచ్చిన శరీరమునందు శోధన క్రియ జరిగి గృధ్రసీ వాతము తొలగిపోవును.

3. కంప వాతమునందు దశమూలారిష్టతో రెండు ఏకాంగవీర రసమాత్రలు భోజనానంతరము పగలు, సాయంత్రము వాడిన శ్రేష్ఠము.

పథ్యము : మేకమాంసము, పొట్టేలు, దుప్పి, మొసలి, ఉడుము, ఎంద్రకాయ, అడవిమృగ, పక్షిమాంసములు లేత వంకాయ, లేత మునగకాయ, ఖర్జూరము, పాతబెల్లము, తేనె, అంగమర్దన.

అపథ్యము : జొన్న అన్నము, అలసందలు, పెసలు, మినుములు, కోడిమాం సము, పిండివంటలు, కాకరకాయ,మామిడి,చేపలు; నిద్రమేల్కొనుట, శీతోదక స్నానం, ఉపవాసము, ఎక్కువ శ్రమ, మంచు.

మోతాదు : 1-2 మాత్రలు రోజుకు రెండు లేదా మూడుసార్లు సేవించవలెను.

లభ్యము : 20,40 మాత్రలు

## గంధక రసాయనము (బ.రా)

ద్రవ్యములు : శుద్ధగంధకము మరియు భావనకు యాలకులు, లవంగాలు, దాల్చినచెక్క, నాగకేసరములు, తిప్పతీగె, కరక్కాయ, తానికాయ, ఉసిరికవరుగు, శొంఠి, గుంటగలగర, అల్లముల రసము, పంచదార.

గుణము : ధాతుక్షయము, సర్వమేహములు, అగ్నిమాంద్యము, శూల, కోష్ఠగతోప ద్రవములు, సర్వకుష్ఠువులు నశించును. శరీరమునకు పరాక్రమము, పుష్టి, బలము కలుగజేయును.

అనుభూత ప్రయోగములు : రక్తదోషములను హరించి, రక్తమును శుభ్రము చేయుట ద్వారా సర్వ చర్మరోగములు, మేహములను, దురదలను నశింపచేయును.

1. కండు, దాహము (మంట) లందు తేనె, ఆవునెయ్యి,కలిపిన మిశ్రమము పై పూతగా వాడుతూ గంధక రసాయనము అమృతారిష్టతో యిచ్చిన తగ్గును.

2. పామనందు సరస,గంధక రసాయనము యిచ్చుచూ, పైపూతగా టంకణ భస్మమును చల్లవలెను.

3. పేను కొరుకుడునందు మందార లేపమును పై పూతగా వాడుతూ, లోనికి గందక రసాయనముతో ఖదిరాదివటి, శారిబాదివటి వాడనగును.

పథ్యము: పాలు,బెల్లము,పులుపు,ఉప్పు, కారము, చెరకు రసము, పానకము, చేపలు, వ్యాయామము.

మోతాదు : ఒకమాత్ర చొప్పున ఉదయము, సాయంత్రం వాడవలెను. ఈ రసాయనమును యిచ్చుటకు ముందు వమన,రేచన కర్మలచే శరీరమును శోధించిన అత్యంత గుణవంతముగా నుండును.

లభ్యము : 20,40 మాత్రలు

## గంధక పుష్పము

దీనిని 1/2 మొ॥ 1 చిన్నము వరకు జీలకర్ర లేక ధనియాల రసముతోగాని పంచదారతో గాని సేవించిన యెడల సవాయి వ్యాధులు జీర్ణించుటచే కలిగిన బొబ్బలు, మచ్చలు, పుండ్లు, ముఖనాసిక, చేతులునల్లగ నుండుట, అంగముమీది పుండ్లు, మొదలగునవియు అష్టాదశ కుష్ఠములు, భగందరములు, సమస్తమగు రక్త దోషములు, సమస్తమగు చర్మ దోషములు, మొదలగునవియు నిశ్చయముగ నశిం చును. ఇందు ఆముదము కలియుటచే సుఖవిరేచనమును చేయుచు పని చేయును.

## గర్భపాల రస (ర.సి.ప్ర)

ద్రవ్యములు : శుద్ధ ఇంగిలీకము, శతపుట నాగభస్మం, దాల్చినచెక్క, యాల కులు, తేజోపత్రి, త్రికటు, ధనియాలు, నల్లజీలకర్ర, చవ్యము, ద్రాక్ష, దేవదారు, లోహభస్మం, మర్దనకు తెల్లదింటెన స్వరసం.

గుణము : గర్భస్రావము, గర్భపాతములను నిరోధించును. గర్భిణుల యందు అతిసారము, జ్వరము, ప్రదరము, శ్వాస, కాస, వమన, మందాగ్ని, అరుచి, వాత వృద్ధి, శూల, మలావరోధము, శిరోరుజ మొదలగు వానిని నష్టపరచును. గర్భము నకు బలమునిచ్చి, రోగరహితముగా ఉంచును.

అనుభూత ప్రయోగములు : 1. రక్తశోధక ఔషధముతో గర్భపాల రసము యిచ్చిన, గర్భిణికి, గర్భమునకు కూడా శ్రేష్ఠము.

2. బీజకోశములు పూర్తిగా అభివృద్ధి చెందకపోవుట వలన గర్భస్రావము లేదా గర్భపాతము అగుచున్నదో వంగ లేదా త్రివంగ భస్మముతో నీయవలెను.

3. గర్భధారణ జరిగిన తరువాత కొందరు స్త్రీలలో కన్పించు లక్షణములు, ఉదా : ఆహారము తీసుకున్న వెంటనే వాంతులు అగుట, కళ్లుతిరుగుట, ఆందోళన, వణుకు, తలనొప్పి నడుము నొప్పుల యందు

కామదుఘారస, ప్రవాళభస్మం, స్వర్ణ మాక్షిక భస్మములతో గర్భపాలరసను యిచ్చిన ఆ వికారములన్నియు శమించును.

4. కోష్టబద్ధతయందు రాత్రిపూట త్రిఫల చూర్ణముతో ఒక మాత్ర తీసుకున్న యెడల ప్రయోజనకారి.

పథ్యము : పేలాలతో చేసిన వంటకములు, వెన్న, నెయ్యి, పాలు, ఎండుకొబ్బరి సీతాఫలము, పనసపండు, ఉసిరికాయలు, ద్రాక్ష, దానిమ్మ, ఆపిల్.

అపథ్యము : కల్లు,సారాయి, ఊరగాయలు, ఆవనూనె, దుంపకూరలు.

మోతాదు : ఒకమాత్ర చొప్పున రోజుకు రెండు సార్లు పాలతో సేవించవలెను.

లభ్యము : 20,40 మాత్రలు.

## గుల్మకాలానల రస (భై.ర.)

ద్రవ్యములు : శుద్ధపాదరసము, శుద్ధగంధకము, శుద్ధ హరతాళము, తామ్ర భస్మము, శుద్ధటంకణము, యవక్షారము, నాగముస్తలు, పిప్పలి, శొంఠి, మిరియాలు, గజపిప్పళ్లు, కరక్కాయ వలుపు, చెంగల్వకోష్టు మర్దన కొరకు పర్పాటక క్వాథము, ముస్తాక్వాథము, శొంఠిక్వాథము, ఉత్తరేణి క్వాథము, చిరుబొద్ది క్వాథము.

గుణము : వాతజ, పిత్తజ, శ్లేష్మజ, సన్నిపాతజ మరియు ద్వంద్వ దోష జనిత అన్నిరకముల గుల్మములు నశించును. ప్రత్యేకముగా వాతజ గుల్మములందు ఉప యోగకారి.

అనుభూత ప్రయోగములు : 1. ఆరోగ్యవర్ధనీవటి, అగ్నికుమార రసములతో భోజనానంతరము రోహితకారిష్ట అనుపానముగా వాడిన వాతజగుల్మము నశించును.

2. రక్తజ గుల్మమునందు ద్రాక్షాది చూర్ణము, ఉశీరాసవలతో వాడిన గుణకారి.

3. పిత్తజ గుల్మమునందు చందనాసవతో వాడవచ్చును.

పథ్యము : ఉలవకట్టుచారు, మద్యము, ఆవు, మేక వీనిపాలు, ద్రాక్ష, దానిమ్మ, వెల్లుల్లి, లేత ముల్లంగి, లేత మునగకాయ.

అపథ్యము : కొత్తబియ్యం, ఎండినమాంసము, మత్స్యములు, మధుర

పదార్థ ములు, దోస, కంద, పెండలము, మలమూత్ర నిరోధము.

అనుపానము : అల్లపు రసము.

మోతాదు : ఒక మాత్ర చొప్పున రోజుకు రెండుసార్లు వాడవలెను.

లభ్యము : 20,40 మాత్రలు.

## గోమూత్ర శిలాజతు

దీనిని ఆవుపాలతోగాని ఆయా కషాయములతో గాని తేనెతో గాని సేవించిన యెడల శుక్లనష్టము, మధుమేహము, అతిమూత్రము, పాండువు, అజీర్ణము, ప్రదర వ్యాధులు, వాతవ్యాధులు, శ్లేష్మ వ్యాధులు, వీనిని నశింప చేయును. వీర్యవృద్ధిని చేయును. ముసలితనమును వ్యాధులను నశింపచేయును. సమస్తమగు వ్యాధులు దీనిచే నశించుననియు, దీనిని సేవించునప్పుడు వేడిచేయు వస్తువులను తినకూడ దనియు, శాస్త్రమునందు చెప్పబడినది. మోతాదు 1/4 చి.మొ॥1/2

## హృదయార్ణవ రస (భై.ర.)

ద్రవ్యములు : శుద్ధ రసము, శుద్ధ గంధకము, తామ్రభస్మము, మర్ధనకు త్రిఫల కషాయము, కామంచి స్వరసము.

గుణము : హృద్రోగహరము

అనుభూత ప్రయోగములు : 1. అర్జున త్వక్ చూర్ణము, మహాద్రాక్షాది చూర్ణము, గోక్షురాది చూర్ణము, అకీక పిష్టిలతో భోజనానంతరము తీసుకొనిన హృదయమునకు ఉపయోగము.

2. కఫజనిత హృద్రోగమునందు గోక్షురాది గుగ్గులు, పిప్పల్యాసవములతో వాడిన కఫోద్రేకము తగ్గును.

3. హృద్యముగా వాడవలెనున్న, నెర్వీటాల్‌తో వాడిన అలసట, గుండె దడ తగ్గి విశ్రాంతిగా ఉండవచ్చును.

పథ్యము : పాతమంచి బియ్యము, ఎర్రబియ్యము, అరటికాయ, పాత గుమ్మడికాయ, మామిడి, దానిమ్మ, ద్రాక్షపండ్లు, కాకరకాయ, వెల్లుల్లి, అల్లము, మంచి తేనె, ఆవునెయ్యి.

అపథ్యము : కొత్తబియ్యపు అన్నము, మేకపాలు, పులుసు,పెరుగు, మలమూత్ర నిరోధము, పొగత్రాగుట, మద్యము, తాంబూలము.

మోతాదు : ఒకమాత్ర చొప్పున ఉదయము, సాయంత్రము సేవించవలెను. లభ్యము : 20,40 మాత్రలు.

## హుతాశనము

ఇది 1. శుంఠిరసముతో త్రేనుపులు, కడుపుబ్బరము, అజీర్ణము 2. అల్లపు రసముతో అరుచి, వాంతి, జ్వరము, తలనొప్పి, మలబంధము 3. శుంఠి, దాసిన చెక్క వీనియొక్క రసముతో అజీర్ణవిరేచనములు గ్రహణి విరేచనములు 4. వాము రసముతో గుల్మము, ఉదరము, యకృద్వ్యాధులు 5. మిరియాలు మిరపకాయలలోని గింజలు వీనియొక్క కషాయముతో విషూచి (కలరా) 6.భోజనమైన వెంటనే పుల్లని మజ్జిగ సైంధవలవణము వీనితో పరిణామశూల 7. చనుపాలతోగాని వేడినీటితో గాని చంటిపిల్లలకు కలుగు అజర్ణీము, అజీర్ణ జ్వరము మందజ్వరము, మలబంధము 8. తేనెతో కఫవ్యాధులు, వీనిని వెంటనే హరింపజేయును. మోతాదు 1/2చి. మొదలు 1 చి.వరకు.

## ఇచ్ఛాభేది రస (వై.చి.)

ద్రవ్యములు : శుద్ధ పాదరసము, శుద్ధ గంధకము, శౌంఠి, మిరియాలు, శుద్ధవెలిగారము, శుద్ధ నేపాళము

గుణము : తీవ్రవిరేచనకారి

వీనిని 1. రాత్రిపరుండునప్పుడు ఒక మాత్రను మ్రింగినచో ఉదయమునే సుఖవిరేచనము అగును. 2. ఉదకమున మూడు లేక నాలుగు మాత్రలను మ్రింగి కొద్దిగ వేడినీళ్లను త్రాగినయెడల అయిదు లేక ఆరు విరేచనములు సుఖముగా అగును. వీనిని వేడినీటితో ఉపయోగించిన యెడల గుల్మము, ఉదర వ్యాధులు, ప్లీహ వ్యాధులు, యకృత్ వ్యాధులు, మలబంధము, కడుపుబ్బరము, మూలవ్యాధి, పైత్య వ్యాధులు, అజీర్ణము మొదలగునవి వెంటనే హరించును. ఇందు నేపాళములు కలిసినను దుర్లక్షణములను కలిగింపకయే పనిచేయును.

మోతాదు 1 మొదలు 4 మా॥ వరకు.

అనుభూత ప్రయోగములు : తీవ్ర విరేచనకారి. పాచనము కాని ఆహారము వలన కలుగు వివిధ రకముల ఉదర వ్యాధుల యందు ఈ ఔషధమును సేవించిన ఉదరము నందలి మలిన పదార్థములను బయటకు వెడలించును. తద్వారా అజీర్ణ జ్వరము, అపాన వాయువు మొదలగు లక్షణములను హరించున.

1. తీవ్రమైన కోష్ఠ బద్ధతయందు రాత్రి పడుకునే ముందు ఒక

మాత్రవాడిన కోష్ఠ బద్ధత తొలగిపోవును.

2. క్రిమిరోగమునందు క్రిమికుటార రసముతో సేవించిన క్రిములన్నియు పడిపోవును.

3. కోష్ఠబద్ధత వలన కలిగే అరుచి, అగ్నిమాంద్యములందు అగ్నిదీప్తికై అగ్ని తుండివటిని ఇచ్చుచూ, ఇచ్ఛాభేది రసమునిచ్చిన (రాత్రిపూట) కోష్ఠ బద్ధత తొలగి నోటికి రుచి కలిగి ఆకలి పుట్టును.

పథ్యము : వరిపేలాలగంజి, సగ్గుబియ్యపు జావ, బార్లీజావ, గేదె, ఆవు,మేక, గొఱ్ఱె వీని పెరుగు, మజ్జిగ, వెన్న,దానిమ్మపండ్లు, ద్రాక్షపండ్లు, నేరేడుపండ్లు.

అపథ్యము : కొత్త బియ్యపు అన్నము, గోధుమలు, బఠాణీలు, మినుములు, మునగకాయ, పులుసు కూరలు, తాంబూలము, జాగరణము, ధూమపానము.

మోతాదు : శరీర తత్వమును అనుసరించి 1-2 మాత్రలు సేవించవలెను.

విరేచనములు ఎక్కువగా అగుచున్నచో చల్లని నీరు లేదా మజ్జిగ త్రాగినచో అరికట్టును.

లభ్యము : 10 మాత్రలు.

### జ్వరాంకుశ రస (భై.ర.)

ద్రవ్యములు : శుద్ధ రసము, శుద్ధ గంధకము, శుద్ధ వత్సనాభి, శుద్ధ దత్తూర బీజముల చూర్ణము, శొంఠి, పిప్పలి, మిరియములు, మర్దనకై నిమ్మపండ్ల రసము.

గుణము : ఏకాహిక, ద్వాహిక, త్రైహిక, చాతుర్థిక, విషమ, త్రిదోషజ మొదలగు సర్వజ్వరములయందు ఎంతో ఉపయోగకారి.

దీనిని 1. మిరియాల రసముతో కఫజ్వరములు, జలుబు,దగ్గు, ఒడలు నొప్పులు 2. అల్లపురసముతో ఏకాహిక ద్వ్యాహికాదిజ్వరములు, దోషజ్వరములు, సన్నిపాత జ్వరములు, వాతజ్వరములు వీనియందియ్య వలయును. జ్వరములకు నిజముగ యంకుశమే. మోతాదు 1/4 మొ॥ 1/2 చి॥ వరకు.

అనుభూత ప్రయోగములు : 1. అభిఘాతము వలన వచ్చిన జ్వరమునకు కాంచనారగుగ్గులు, మహాయోగరాజు గుగ్గులు, దశమూలారిష్ట అనుపానముగా వాడ వచ్చును.

2. కాస సంబంధముగా వచ్చిన జ్వరమునందు త్రిభువన కీర్తిరస, జ్వరాంకుశ రస, ఇస్నోఫాల్ కలిపి నాకాస్‌తో గాని, కఫరాల్‌తోగాని (రెండుచెంచాలు) ఉదయము సాయంత్రము తీసుకొన్న ఉపశమించును.

3. సంతత, సతత, అన్యేద్యుష్క, తృతీయక, చతుర్ధక జ్వరములందు సుదర్శన చూర్ణము చెంచాడు 2–3గ్రా. భోజనానికి ముందు తేనెతో తీసుకుని, భోజనము తరువాత జ్వరాంకుశ రసము 1.మలేరియా పిల్స్ 1.చొప్పు పంచతిక్తారిష్టతో తీసు కొనిన అత్యంత లాభకారి.

పథ్యము : లఘు ఆహారము అనగా బీరకాయ, పొట్లకాయలు, పలుచటిపాలు, గోధుమరొట్టె, బియ్యము వేయించి, విసిరి చేసిన జావ, గోధుమ నూకల జావ, బార్లీ గింజల గంజి మొదలగు తేలికగా జీర్ణమగు ఆహారమును తీసుకొనవలెను. కాచి చల్లార్చిన నీటిని మాత్రమే ఉప యోగించవలెను.

అపథ్యము : కర్బూజా, పనస, మొదలగు శీతలకరఫలములు, పాలు, నెయ్యి, మాంసము, పుష్టికర, శీతలకర, విదాహకర గురుత్వ పదార్థములు, చేపలు, దుంప కూరలు.

మోతాదు : ఒకమాత్ర చొప్పున రోజుకు రెండు లేదా మూడుసార్లు.

లభ్యము : 20 మాత్రలు.

## జయమంగళ రస (భై.ర.)

ద్రవ్యములు : హింగుళోత్థపాదరసము, శుద్ధగంధకము, శుద్ధటంకణం, శుద్ధ తామ్రభస్మం, వంగము, శుద్ధ స్వర్ణమాక్షికము, సైంధవలవణము, మిరియాలు, స్వర్ణ భస్మము, శుద్ధ కాంతలోహభస్మం, రజితభస్మం, మర్దనకొరకు దత్తూర పత్ర స్వరసం, నల్లవావిలి ఆకురసం, దశమూల క్వాథము, నేలవేము క్వాథం.

గుణము : అత్యంత భయంకరపురాణ జీర్ణ జ్వరము, సాధ్య మరియు అసాధ్య అష్టవిధ జ్వరములు, సర్వవిధములైన విషమజ్వరములు, మేదోగత జ్వరము, మాంస గత, అస్థిగత, మజ్జాగత జ్వరములు, అంతర్వేగజ్వరము, బహిర్వేగ జ్వరము, అనేక దోషోత్పన్న జ్వరములు, శుక్రగత జ్వరము మరియు అన్ని ప్రకారములైన జ్వరముల యందు, అనుపాన భేదముచే అన్ని రోగములను నివారించును.

అనుభూత ప్రయోగములు : 1. పంచతిక్తారిష్ట, ఉశీరాసవము,

అమృతారిష్ట రెండు చెంచాలు చొప్పున అనుపానముగా రోజుకు మూడుసార్లు వాడిన జ్వరోపశాంతి కలుగును.

2. త్రిదోషజ జ్వరములందు సన్నిపాత భైరవి, జ్వరహారిలతో వాడవచ్చును.

3. పిత్తజ దాహమునందు 10 మి.లీ.తిప్పతీగ స్వరసముతో వాడవచ్చును. (రోజుకు 4-5సార్లు)

పథ్యము : లఘు ఆహారము, బీరకాయ,పొట్లకాయ, లేత ఆకుకూరలు, ద్రాక్ష పండ్లు, ఖర్జూరపు పండ్లు, పంచదార తేనె.

అపథ్యము : గురుపదార్ధసేవన, అనగా మాంసము, పప్పు దినుసులతో కూడిన పదార్థములు, నూనె, నెయ్యి, పిండి వంటలు మొదలగునవి.

అనుపానము : తిప్పసత్తు, తేనె.

మోతాదు : ఒకమాత్ర చొప్పున రోజుకు రెండుసార్లు సేవించవలెను.

లభ్యము : 20 మాత్రలు.

## కఫ చింతామణి

దీనిని 1. నల్లేరురసముతో కఫ మెదుర్కొని ప్రాణాపాయస్థితి యందుండుట, దగ్గు, గురక, ఆయాసము, కఫము అడ్డుపడుట, క్షయ, శ్లేష్మ వ్యాధులు 2. మోడి రసముతో వాతవ్యాధులు 3. తమలపాకులరసము మొదలగువానితో చంటిపిల్లలకు కలుగు శ్లేష్మ వ్యాధులు మొదలగు వానియందియ్యవలయును. చక్కని వేడిమిని వెంటనే కలిగించును. మోతాదు 1/8 మొ॥ 1/4 చి॥వరకు.

## కఫకుఠార రస (ర.సి.ప్ర)

ద్రవ్యములు : శుద్ధ పాదరసము, శుద్ధ గంధకము, శొంఠి, నల్లమిరియాలు, పిప్పళ్లు, తామ్రభస్మం, లోహభస్మం.

గుణము : ఇది అత్యంత తీక్ష్ణ ఔషధము. ఛాతీనందు కఫము ఎక్కువగా చేరుట, దగ్గు ఎక్కువగా వచ్చుచూ కఫము వెడలుట, జ్వరములయందు అత్యంత ఉపకారి. కఫనిస్సారము నొందించి, శ్వాసవాహికకు ఉపశమనము కల్గించును.

అనుభూత ప్రయోగములు :

1. కఫజ కాసనందు వాసారిష్ట,వాసావలేహము లతో వాడదగును.

2. కఫజ శ్వాసనందు కస్తూరి, తాళకభస్మం, శుక్తిభస్మం, శృంగి భస్మం, అశ్వగంధ చూర్ణములను కలిపి తేనెతో భోజనమునకు ముందు తీసుకొనుచూ, భోజనానంతరము కఫకుఠార రసము కనకాసవముతో వాడనగును.

3. కఫజ క్రిముల వలన కలిగే శ్వాసకాసలందు మోదుగ చూర్ణము, వాయు విడంగ చూర్ణము, పిప్పలీ చూర్ణములను క్రిమి కుఠార రసమునకు అనుపానముగా వాడుతూ, భోజనానంతరము కఫకుఠార రసము వాడిన ఫలితము కన్పించును.

పథ్యము : తేలికగా జీర్ణమగు ఆహారము.

అపథ్యము : దుంపకూరలు, పప్పుపదార్థములు, పెరుగు, నెయ్యి, నూనె ఎక్కు వగా ఉన్న పదార్థములు, చేపలు, రొయ్యలు, మాంసము, మాంసరసము తగ్గించి వాడవలెను.

మోతాదు : 1-3 మాత్రల వరకు రోజుకు రెండు లేదా మూడు సార్లు యివ్వ వలెను.

లభ్యము : 20-40 మాత్రలు.

## కనకబాల సూర్యోదయము

ఇది 1. నేలతాడి, బూరుగ బంక, ఏలక్కాయలు, దాల్చినచెక్క, వీనియొక్క రెట్టింపు చూర్ణము వెన్న వీనితో సమస్తమగు ప్రదరములు, శుక్లనష్టము, యోనిస్రావనములు, 2. మిరియాలు, గుంటకలగరాకు (ఎండునది) చూర్ణము, వీనిని రెట్టింపు చేర్చి తిప్పతీగ కషాయముతో జీర్ణ జ్వరములు, శీతపైత్య జ్వరములు, అజీర్ణములు, అరుచి 3. లవంగాలు,దాసెనచెక్క, తాలీసపత్ర, వీనియొక్క రెట్టింపు చూర్ణము, తేనె వీనితో ఆయాసము దగ్గు, క్షయ, శ్లేష్మ వ్యాధులు, వాత వ్యాధులు వీనిని నశింప చేయును. మోతాదు 1/4 మొ॥ 1/2 చిన్నము వరకు.

## కనక సుందర రసము

దీనిని 1. రెట్టింపు పిప్పళ్ళ చూర్ణము, తేనె వీనితో గాని రెట్టింపు మిరియాల చూర్ణము,నెయ్యి,వీనితోగాని క్షయ, దగ్గు, ఆయాసము, శ్లేష్మ ప్రకోపము 2. అల్లపు రసముతో సన్నిపాతము, సమస్త జ్వరములు 3. శుంఠిరసముతో అజీర్ణము, అతి సారము, గ్రహణి 4. సమానమగు నేపాల చూర్ణముతో గుల్మము, ఉదరము, యకృద్వ్యా ధులు,శూల, వీనియందియ్య

వలయును. దీనిని సేవించునప్పుడు వేడిచేయు వస్తువు లను తినకూడదు. మోతాదు 1/4 మొ॥ 1/2 చి॥వరకు.

## కాంతవల్లభ రసము

క్రమ ప్రకారము ఏడురోజులు వండబడినది. దీనియందు శాస్త్రముల యందు మహామహిమకలదిగ చెప్పబడిన గోమూత్ర శిలాజితు చేర్పబడినది. అందుచే బహు చక్కగ పనిచేయును. 1. తాలీసపత్రి, శొంఠి, మిరియాలు నాగకేసరాలు, దాసినచెక్క, వీనియొక్క చూర్ణము 1/2 తు. కారతవల్లభరసము 1/4తు. వీనిని 15 పొట్లములు కట్టి ఉదయము సాయంకాలము వేడినీటితో సేవించిన యెడల పాండువు నందు కామెర్లు, అజీర్ణము, తిమ్మెర్లు, ఉదరవ్యాధులు, యకృత్ వ్యాధులు, ప్లీహ వ్యాధులు, జీర్ణ జ్వరాలు, అగ్నిమాంద్యము మొదలగు వ్యాధులు దగ్ధమగును. 2. చెంగల్వకోష్టు తవాక్షీరి, ఏలక్కాయలు, లవంగాలు, మిరియాలు, వీనియెడలచూర్ణము 3/4 తు. కాంతవల్లభరసము 1/4 తు. వీనిని 15 పొట్లములుకట్టి ఉదయం సాయంకాలము మందు పొట్టమునకు రెట్టింపు పటికబెల్లపు చూర్ణము కలిపి సేవించుయెడల క్షయ, దగ్గు, ఆయాసము, గుండెవ్యాధులు, శ్లేష్మ వ్యాధులు 3. సన్నరాస్నము, వాయు విడంగాలు, గంటుభారంగి వీనియొక్క చూర్ణమును సమానముగ చేర్చి తేనెతో సేవిం చిన యెడల పక్షవాతము, చచ్చువాతము, సర్వాంగవాతము, ఆర్దితవాతము, సూతికావాతము, మొదలగు సమస్త వాతములు 4. పంచకోల చూర్ణమును రెట్టింపు చేర్చి వేడినీటితో సేవించినచో ఋతుశూల, బహిష్టు సరిగా కాకుండుట, ఋతు దోషము, రక్తగుల్మము 5. తేనెతో సేవించినయెడల దీర్ఘకాలగతమగు గ్రహణి, అతి సారము, ఆమవిరేచనములు, స్థౌల్యరోగము (శరీరములావుపారుట) 5. రెట్టింపు మేడికాయల చూర్ణముతో సేవించి వెలగ వేళ్లకషాయమును త్రాగిన యెడల వాత తత్త్వమునకుగాని శ్లేష్మ తత్త్వమునకుగాని కలిగిన మధుమేహము అతిమూత్రము, ప్రమేహ వ్యాధులు, ఇవి నిశ్చయముగ సింహ స్వప్నముచే ఏనుగువలె నశించును. సామాన్యమగు మలబంధము కలవాడు సమస్త వ్యాధుల యందు 2–3 రెట్లు త్రిఫలా చూర్ణము తోడను, అధికమగు మలబంధకము కలవారు రెట్టింపు తెల్ల తెగడ చూర్ణము తోడను సేవించి కొద్దిగ వేడినీటిని త్రాగిన యెడల విరేచనము చక్కగనగుచు వ్యాధు లన్నియు నశించును. మోతాదు 1/4 మొ॥1/2 చి. వరకు.

## కామదుఘా రస (ర.యో.సా)

ద్రవ్యములు : మౌక్తిక భస్మం, ప్రవాళ భస్మం, శుక్తిభస్మం, వరాటభస్మం, శంఖ భస్మం, గైరికము, గుడూచీ సత్వము,

గుణము : జీర్ణ జ్వరము, భ్రమ, ఉన్మాదము, పిత్తరోగము, ఆమ్లపిత్తము, సోమ రోగములు నివర్తించును.

అనుభూత ప్రయోగములు : 1.ఆరోగ్య వర్ధనీవటి, భేది జ్వరాంకుశములతో యిచ్చిన యకృత్ నందలి వికారము తగ్గి అంత్రమునందలి దోషము తొలగి చెమట పట్టి జీర్ణ జ్వరము తగ్గుటకు ఆస్కారము కలుగును.

2. భ్రమ, ఉన్మాదములందు రసరాజరసముతో కలిపి యిచ్చుచూ, అశ్వగంధ లేహ్యము రాత్రి భోజనానంతరము క్రిమికుఠార రస యిచ్చిన లాభకారి.

3. క్రిమిజనిత కోష్ఠ శూలనందు వాత విధ్వంసినీ రసముతో కలిపి యిచ్చిన శూల తగ్గి, క్రిములు పడిపోవును.

పథ్యము : గలిజేరు ఆకుకూర, మునగాకుకూర, కాకరకాయ, నేరేడుపండ్లు, తేనె.

అపథ్యములు : గురుత్వ, మలబద్ధకర పదార్థములు, కంద, ఆలుదుంపలు, పిండి వంటలు, పాలతో వండిన పదార్థములు, తీపి పదార్థములు.

అనుపానము : ఉమ్మెత్త కషాయము.

మోతాదు : ఒక మాత్ర చొప్పున రోజుకు రెండుసార్లు సేవించవలెను.

లభ్యము : 20,40 మాత్రలు.

## కాల కూటము

ఇది 1. అల్లపురసముతో పదుమూడు సన్నిపాతములు, దోషజ్వరములు, విష జ్వరములు, సమస్త జ్వరములు, శ్లేష్మ జ్వరము 2. వెల్లుల్లి రసముతో లేక మునగ చెక్క రసముతో సూతికాజ్వరములు, కఫ మెదుర్కొనుచున్న జ్వరములు, మాంద్య జ్వరములు, వీనిని వెంటనే హరింపజేయును. దీనిని వాత రాక్షసము, సన్నిపాత భైరవి. మొదలగువానితోకలిపి వాడెడి సాంప్రదాయము కలదు. మోతాదు 1/4 చి॥ మొ॥1/2 చి॥ వరకు.

## క్షయకుఠారము

దీనిని 1. నేలమునగవేళ్ళ రసముతో క్షయ, దగ్గు, ఆయాసము, శ్లేష్మ వ్యాధులు, క్షయవలన కలిగిన వ్యాధులు 2. రెట్టింపు గలిజేరు వేళ్ళ చూర్ణముతో నంజు, కామిర్లు, పాండువు, జీర్ణజ్వరము, అజీర్ణము, గుల్మము, వాత వ్యాధులు మొదలగు వాని యందియ్యవలయును. మోతాదు 1/4 మొ॥ 1/2 చి. వరకు.

## క్రమవృద్ధి మహాలక్ష్మీవిలాస రసము

ఇందు సువర్ణభస్మము, సీసభస్మము, పగడభస్మము, ముత్యభస్మము, మొదలగు దీప్యములైన భస్మములు భాగోత్తరవృద్ధిగ చేరియున్నవి. ఉడుకు వ్యాదులను నశింప జేయుటలో నింతటి ఔషధ రాజము వేరొకటి లేదు. 1. పెన్నేరు, నేలగుమ్మడి, ఏల క్కాయలు, తాలీసపత్రి, అడ్డసరపువేళ్లు, వీనియొక్క రెట్టింపు చూర్ణముతో క్షయలు, దగ్గు,ఆయాసము, శరీరబలహీనత, శుష్కించుట, ఉరఃక్షతము 2. అడ్డసరపు రసముతో రక్తపిత్తము 3. ధనియాలరసముతో పైత్య వ్యాధులు 4.జీలకర్ర రసముతో అరుచి, నోరు అసహ్యముగ నుండుట 5. జాజికాయ జాపత్రి సమానమగు వీనియొక్క చూర్ణము తేనె వీనితో నోరు దుర్గంధముగనుండుట 6. నేలతాడి, బూరుగబంక, సుగంధిపాల వీనియొక్క చూర్ణమును రెట్టింపు కలిపి పంచదారతో సేవించిన యెడల శుక్లనష్టము, శ్వేతప్రదరము, రక్తప్రదరము, ప్రమేహములు, శుక్రము క్షీణించుట శుక్రము నీరువలెనుండుట, నాడి నీరసముగ నుండుట 7. రెట్టింపు త్రిఫలా చూర్ణము కలిపి చన్నీటితో సేవించిన గ్రహణి విరేచనములు, రక్తాతిసారము, మొదలగువానిని నశింపజేయును. ఉడుకువలన గలిగిన వ్యాధులను నశింపజేయుటలో నింతటి మందులేదని స్వానుభవముగ చెప్పగలము. దీనినే ఏకోత్తర వృద్ధి మహాలక్ష్మి విలాస రసమనియు, భాగవృద్ధి మహాలక్ష్మి విలాసరసమనియు కూడ అనెదరు.

మోతాదు 1/4 చి. మొ॥ 1/2 చి. వరకు

## క్రవ్యాదరస (భై.ర.)

ద్రవ్యములు : శుద్ధపాదరసము, శుద్ధగంధకము, తామ్రభస్మం, లోహభస్మం, ఆముదపు పత్రము, మర్దనకై నిమ్మపండ్ల రసము, పంచకోల క్వాథము, ఆమ్లవేతన క్వాథము మరియు టంకణ భస్మం, బిడాలవణం,

మిరియాల చూర్ణం, శనగక్షారో దకము.

గుణము : పాచకాగ్నిని మిక్కిలి పెంపొందించును. రసకృశత వ్యాధులయందు, స్థౌల్యరోగము, ఆమదోషము, గుల్మము, విషదోషము, ప్లీహ వృద్ధి, జలోదరము, అర్శస్సు, సంగ్రహణి, వాత, శ్లేష్మ వికారములు, అతిసారము, వాతగ్రంధి రోగము, భయంకర ఉదర రోగముల యందు అత్యంత ఉపకారి.

అనుభూత ప్రయోగములు : పాచనము, పాచక పిత్తమందలి పాచకాంశము లను పెంపొందించుటచే గురు ఆహారములను కూడా శీఘ్రముగా పచనము అగునట్లు చేయును.

1. అగ్నిమాంద్యమునందు మజ్జిగతో యిచ్చిన ఉపయోగకరము.

2. ఆమవాతమునందు ఆమ పచనమునకై ఇచ్చుచూ, వాతహరౌషధ ములు, అనగా మహాయోగరాజ గుగ్గులు లేదా సింహనాద గుగ్గులు వాడిన పీడ, వాపుతగ్గును.

3. ఊరుస్తంభమునందు పాచకౌషధముగా దీనినిచ్చిన అధిక లాభకరము.

పథ్యము : ఈ ఔషధము పాచకాగ్నిని బాగుగా ప్రదీప్తింపజేయును. కావున ఈ ఔషధము సేవించు కాలమున గురు ఆహార పదార్థములైన మాంసము, పాల మీగడ, వెన్న, పాయసము, పిండిరొట్టెలు, పూరీలు, నేతితో కాల్చిన మినపరొట్టె, నెయ్యి, పండ్లు మొదలగునవి తీసుకొనవలెను.

అపథ్యము : అపథ్యము లేదు.

మోతాదు : 1-2 మాత్రల చొప్పున రోజుకు రెండు సార్లు భోజనము తరువాత తీసుకొనవలెను.

లభ్యము : 20,40 మాత్రలు

## క్రిమికుఠార రస (వై.చిం.)

ద్రవ్యములు : రసకర్పూరము, కొడిశపాల, కలుక్రానుగ, ఓమము, వాయు విడంగాలు, ఇంగువ, నాభి, నాగకేసరములు, మోదుగ విత్తులు, మర్దనకొరకు గుంట గలిజేరు ఆకురసము, ఎలుకచెవి ఆకురసము, బ్రాహ్మీరసము

గుణము : కృమి నాశకము

ఇది 1. వాము రసముతో క్రిములు, అజీర్ణము, అగ్నిమాంద్యము, అరుచి, కడుపుబ్బరము, శూల, మలబంధము, వాంతి మొదలగు వానిని నశింపచేయును. క్రిమి వ్యాధులను హరించుటలో మిక్కిలి శ్రేష్ఠమైనది. సమస్త క్రిమి వ్యాధుల యందు ఉపయోగింపవచ్చును. మోతాదు 1/2 మొ॥ 1 చి. వరకు

అనుభూత ప్రయోగములు : నులిపురుగులందు మిక్కిలి గుణకారి.

1. అతిసారముతో కూడిన క్రిమి రోగమునందు కుటజఘనవటికి కుటజారిష్ట అనుపానముగా యిచ్చుచూ, క్రిమికుఠార రస భోజనానంతరము యిచ్చిన ప్రయోజన కరం. గ్రహణితో కూడిన క్రిమిరోగమునందు కుటజత్వక్ చూర్ణము, త్రికటు చూర్ణము మజ్జిగతో యిచ్చుచూ,పరుండబోవునపుడు, ఉదయము పరగడుపున యిచ్చుచూ, తైలాభ్యంగనమునకు చందనాది తైలము లేదా సరస్వతీ తైలమును మాడునకు బాగుగా మర్దించవలెను.

3. ఆమ్లపిత్తమునందు శృంగ భస్మము, శంఖ భస్మము, భాస్కరలవణములను కలిపి, భోజనమునకు ముందు యిచ్చుచూ, భోజనానంతరము కామదుఘారస యిచ్చిన కోష్ఠబద్ధత తొలగి, పైత్తిక వికారము తొలగి, రుచి పుట్టును.

పథ్యము : గోధుమలు, చల్లార్చిన, నీళ్లు, పొట్టికాకర, అరటిపువ్వు, పొట్లకాయ, బీరకాయ ఉసిరిక వరుగు.

అపథ్యము : ఉప్పు, పులుపు, కారము, మద్యము, చేపలు

అనుపానము : 3 గ్రా. జీలకర్ర 3 గ్రా. పంచదారతో

మోతాదు : 1–2 మాత్రల చొప్పున రోజుకు రెండు లేదా మూడుసార్లు సేవించ వలెను.

లభ్యము : 20 మాత్రలు

## క్రిమి ముద్గర రస (వై.చిం.)

ద్రవ్యములు : శుద్ధ పాదరసము, శుద్ధ గంధకము, అజామోదము, వాయు విడంగాలు, విషముష్టి విత్తులు, మోదుగ విత్తులు.

గుణము : క్రిమి నాశకము

దీనిని తేనెతో సేవించి వెంటనే తుంగగడ్డలు లేక వాము కషాయమును త్రాగిన యెడల సమస్తమగు క్రిములును, క్రిములవలన కలిగిన

వ్యాధులును, అజీర్ణము మొద లగునవియు నశించును. మోతాదు 1/4 మొ॥ 1 చి॥ వరకు.

అనుభూత ప్రయోగములు : అంకుశముఖ కృమి రోగమునందు బాగుగా పనిచేయును. నులి పురుగులు, ఎమురుకలు మొదలగు క్రిములను హరించును.

1.కోష్ఠమునందలి ఏ రకమైన క్రిములనందైనను త్రికటు చూర్ణము, కాకర చూర్ణము, నేరేడు విత్తుల చూర్ణము కలిపి భోజనమునకు ముందుగా తీసుకొని, భోజనానంతరము క్రిమి ముద్గర రస ఒక మాత్ర చొప్పున ఉదయము, సాయంత్రం తీసుకొనిన క్రిములు పడిపోవును.

2. క్రిమి జనిత పాండురోగమునందు పునర్నవాది మండూరము, పునర్నవారిష్ట లతో వాడిన రక్తహీనత తగ్గి క్రిములు నశించును.

3. క్రిమి జనిత చర్మరోగములందు (కండు) సోమరాజి తైలము అభ్యంగనముగా వాడుచూ, లోనికి సరస, గంధక రసాయనములతో వాడిన తగ్గును.

పథ్యము : గలిజేరు ఆకుకూర, మునగాకు కూర, కాకరకాయ, నేరేడు పండ్లు, తేనె.

అపథ్యము : గురుకర, మలబద్ధకర పదార్థములు, కంద, బంగాళాదుంప, పిండి వంటలు, పాలతో వండిన పదార్థములు తీపి పదార్థములు.

అనుపానము : తేనె, తుంగముస్తల కషాయము

మోతాదు : 1-2 మాత్రల చొప్పున రోజుకు రెండు లేదా మూడుసార్లు సేవించ వలెను.

లభ్యము : 20,40 మాత్రలు.

## మహాకామసంజీవనీ రసము

జాజికాయలు, జాపత్రి, చంద నపుపొట్టు, లవంగాలు, ఏలక్కాయలు, పిప్పళ్లు, వీనిని సమభాగములుగ గ్రహించి చూర్ణముచేసి, మాత్రకు 3 రెట్లు గ్రహించి, ఆ చూర్ణముతో సమానమగు పంచదారను గ్రహించి యీ రెండింటిని కలపి అందు కొద్దిగ తేనెవేసి ముద్దగచేసి దానిని మాత్ర చుట్టును పొదిగి అరటిపండు ముక్కయందుంచి రాత్రి పరుండునప్పుడు పుచ్చుకొన వలయును. ఈ విధానమంతయు సందర్భము కాని యెడల వీలైనంత

వరకు చేయ వలయును. లేదా వట్టి మాత్రను వేసుకొని కొద్దిగ ఆవుపాలను త్రాగవలెను. ఆవు పాలు కూడ సందర్భముకానియెడల చన్నీటినే కొద్దిగ త్రాగవలెను. దీనిసేవనచే గుర్రపు దండమువలె నివారింప శక్యముగాని దండము (అంగము) కలవాడై మన్మధో ద్రేకముతో మదించిన గొప్ప ఏనుగువలె ఎల్లప్పుడును మహాగాఢమైన రతిని చేయుట యందు సామర్థ్యము కలవాడై మూడు జాములలో నూర్గురు స్త్రీలను రమించి జయించును. పంచదార వేయబడిన పాలను తర్చుగ త్రాగవలయును. పచ్చకర్పూరముతో కూడిన తాంబూలము నెల్లప్పుడు సేవించవలయును. ఈ యౌషధము వృద్ధునకు కూడ వీర్యస్తంభనము చేయును. నిమ్మకాయ రసమునుగాని పుల్లని పండ్ల యొక్క రసమునుగాని నోటియందుంచు కొనినచో క్షణకాలములో నీ మందు యొక్క ఉద్రే కము నశించును. మరియు దీనిని రాజౌషధముగ అనగా సందర్భానుసారముగ కొంత కాలము సేవించిన యెడల లింగము కృశించుట, నపుంసకత్వము, లింగ దోషములు, నడుమునొప్పి శుక్ర దోషములు, ఇరువది ప్రమేహములు, ఏకాదశ క్షయలు, అగ్నిమాంద్యము, గ్రహణీ వ్యాధులు, అజీర్ణము, దగ్గు, అతిమూత్రము, మధుమేహము, శ్వేతప్రదరము, రక్తప్రదరము, బలహీనత మొదలగునవి నశించును. దీనిని బహు జాగరూకతగలవాడై సమస్త వ్యాధుల యందును ప్రయోగింపవలయును. మోతాదు 1 మొదలు 2 మా.వరకు.

## లఘుక్రవ్యాది

శాస్త్రప్రకారము భావనలన్నియు యధావిధిగా చేయబడినది. అజీర్ణములను నశింపజేయుటలో నత్యుత్తమమైనదని అందరికిని తెలిసినవిషయమే.దీనిని 1. 3-4 తులముల పుల్లనిమజ్జిగ 1/2 తులము సైంధవలవణము, వీనితో కలిపి భోజనమైన వెంటనే సేవించిన యెడల కఠినమైన అజీర్ణము, అగ్నిమాంద్యము, పుల్లనిత్రేనుపులు, కడుపుబ్బరము, ప్రేగులరచుట, ఉదరవ్యాధులు, అరుచి, వాంతి 2. వాము రసముతో సమస్త శూలలు 3. శుంఠి రసముతో ఆమవిరేచనములు 4. అల్లపు రసముతో తల తిరుగుట మొదలగు పైత్యవ్యాధులు, తిమ్మెర్లు, ఇవి వెంటనే నశించును. ఇందు తామ్ర భస్మము మొదలగు తీక్ష్ణ గుణముగల వస్తువులు కలియుటచే కొందరికి కొద్ది వేడిని చేయును. కాన నోటిపూత మొదలగు ఉడుకు లక్షణములు కల అజీర్ణ వ్యాధుల యందు వేడిచేయకుండుటకై సమానమగు పైత్యాంతకమునుగాని అభ్రకభస్మమును గాని కలిపి

వాడవలయును. దీనిని సేవించునప్పుడు రాత్రుల యందైనను భోజనమును మాని త్వరలో జీర్ణమగు జావలు, పాలు మొదలగు వానిని తీసికొనుట శ్రేష్ఠము. మోతాదు 1/4 చి. మొ॥ 1/2 చి. వరకు.

### లఘుమేహాంతకము

1.దాసినచెక్క, ఏలక్కాయలు, వీని చూర్ణమును మూడు రెట్లు చేర్చి పంచదారతో సేవించినచో సెగవ్యాధి, శుక్లనష్టము, మూత్రకృచ్ఛ్రము, నోటిపూత, ఇరువది మేహ ములు 2. రెట్టింపు పుష్యానుగచూర్ణముతో స్త్రీలకు గలుగు యోని దోషములు, శ్వేత ప్రదరము, రక్తప్రదరము, నడుమునొప్పులు, కాళ్లులాగుట, 3. రెట్టింపు త్రిఫలా చూర్ణమును కలిపి మీగడతో సేవించినచో కడుపులోమంట, శరీరమెల్లప్పుడును వెచ్చగ నుండుట, కళ్లుమంటలు, కాళ్లు మంటలు, నిస్సత్తువ శిరస్సు వేడిగ నుండుట 4. నాల్గురెట్లు పటిక బెల్లపు చూర్ణముతో సేవించినచో పొడిదగ్గు. ఇవి శీఘ్రముగ హరించును. మోతాదు 1/4 చి. మొ॥ 3/4 చి. వరకు.

### లఘు లక్ష్మీవిలాస రసము

దీనిని 1. తేనెతో నిచ్చిన యెడల పసిపిల్లలకు కలుగు దగ్గు, జలుబు, ఎగరొప్పు, ఉడుకు, వాంతి, మొదలగునవియు 2. ద్రాక్షపండ్ల రసముతో నిచ్చిన యెడల పెద్ద వారలకు కలుగు కాళ్ళుచేతులు మంటలు, ఉడుకు వ్యాధులు, పైత్య వ్యాధులు 3. తేనెతో ఇచ్చిన యెడల వాత వ్యాధులు మొదలగునవియు నశించును. మోతాదు 1/4 చి. మొదలు 1/2చి. వరకు.

### లఘు సిందూర భూషణము

ఇది 1. రెట్టింపు సితోపలాది చూర్ణమును చేర్చి పటికబెల్లపు చూర్ణముతో సేవించినచో పొడిదగ్గు ఆయాసము, కాళ్లు చేతులు మంటలు 2. రెట్టింపు త్రిఫలా చూర్ణముతో నోటిపూత, శుక్లనష్టము, గుండెదడ, కడుపులోమంట, కాళ్లులాగుట, బలహీనము, శరీరము వెచ్చగనుండుట, ఇరువది ప్రమేహములు రక్తార్శస్సు రక్తాతి సారము 3. సమానమగు త్రివంగభస్మమును రెట్టింపు దాసెనచెక్క చూర్ణమును, కలిపి మీగడతో సేవించినచో శ్వేతప్రదరము, రక్తప్రదరము, సెగ వ్యాధులు, మూత్ర కృచ్ఛ్రము మొదలగు ఉడుకు సంబంధమగు వ్యాధులను వెంటనే నశింపజేయును. 4. మాదీఫల రసాయనముతో గర్భిణీ స్త్రీలకు కలుగు సమస్త వ్యాధులను నశింప జేయును. మరియు సుఖప్రసవమును చేయును. గర్భములు తరుచుపోవు వారు గర్భము వచ్చినది మొదలు దీనిని 2-3 నెలలు.

సేవించుట అనేక విధముల మంచిది. మోతాదు 1/2 చి. మొదలు 3/4 చి.వరకు.

## లఘుసూర్యావర్తి

ఇది (1) మాదీఫల రసాయనముతో అరుచి నోరూరుట పసరువాంతి అగుట వికారముగ నుండుట, ఛర్ది, ఎక్కిళ్లు, గుండెదడ, ఒడలుతిరుగుట, నోరు అసహ్యముగ నుండుట 2. అల్లపురసముతో అజీర్ణము, ఆకలి సరిగ లేకపోవుట, దద్దుర్లు, తలనొప్పి, మలబంధము, తలతిరుగుట, 3. రెట్టింపు పంచదారతో ఉడుకు, దగ్గు, ఆయాసము, శ్వేతప్రదరము, రక్తప్రదరము 4. ద్రాక్షపండ్లరసముతో తిమ్మెర్లు, ఉన్మాదము, దద్దుర్లు, శరీరతాపము, మూర్ఛ, అపస్మారము వీని యందమోఘముగ పనిజేయును. పైత్యము చేతను, వేడిచేతను కలిగిన వ్యాధులయందు చక్కగ పనిచేయును. తేనెతోగాని మాదీ ఫలరసాయనముతోగాని యుపయోగించినయెడల గర్భిణీ స్త్రీలకు కలుగు వ్యాధులన్నిటిని నివారింపజేయును. దీనిని గర్భిణీ స్త్రీలకు తరుచు వాడుట అనేక విధముల మంచిది. మోతాదు 1/4 చి. మొ 1/2 చి. వరకు.

## లక్ష్మీవిలాస రస(నారదీయ) (భై.ర.)

ద్రవ్యములు : వజ్రాభ్రక భస్మం,శుద్ధగంధకం, వంగభస్మం, శుద్ధపారదము, హరతాళము, తామ్రభస్మం, పచ్చకర్పూరం, జాజికాయ, జాపత్రి, సముద్రపాల బీజ ములు, దత్తూర బీజములు, స్వర్ణ భస్మం.

గుణము : సన్నిపాతము, కంఠరోగములు, అంత్రవృద్ధి, అతిసారము 17 రకముల కుష్ఠములు 20 రకముల ప్రమేహములు, కఫ, వాతజ, పురాణ మరియు అనువంశిక శ్లీపదము, నాడీ వ్రణము, వ్రణము, గుదరోగము, భగందరము, కాస, పీనస, యక్ష్మ, అర్శస్సు, స్థూలత, శరీర దుర్గంధము,రక్తవికారము,సంపూర్ణ లక్షణ ములు కలిగిన ఆమవాతము, జిహ్వాస్తంభ, గళగ్రహ, ఉదరరోగము, కర్ణరోగము, నాసికారోగములు, నేత్రరోగము, ముఖరోగము, అన్ని విధముల శూల రోగములు, శిరఃశూల, స్త్రీ రోగములు మొదలగునవి నశించును. శరీరమునకు, శక్తి, పుష్టి కలుగును.

అనుభూత ప్రయోగములు : అన్ని రకములైన తరుణ, జీర్ణ జ్వరములందు, శుష్క, కఫయుక్త కాసలయందు, జలుబు, పడిశము వలన కలిగిన జ్వరము, తల నొప్పి, సర్వ శరీరమునందు నొప్పులు, శ్వాస

ఆడకపోవుట మొదలగు రోగములందు మిక్కిలి గుణకారి.

1. సితోపలాది చూర్ణం, తాళకభస్మం, అకీక పిష్టి,యష్టిమధు, టంకణ భస్మం కలిపి భోజనానికి ముందు తేనెతో ఇచ్చుచూ, భోజనానంతరం లక్ష్మీ విలాస రసం ఒక మాత్రతో 20-40 రోజులు వాడిన, కాస శ్వాసలు హరించును.

2. క్షయనందు రాజమృగాంక రసముతోపాటు వాడిన వ్యాధి నిరోధక శక్తి కలిగి బలము చేకూరును.

3. మానసిక వ్యాధుల యందు బ్రాహ్మీవటి, సరస్వతీ లేహ్యము, అశ్వగంధ చూర్ణములతో వాడిన మానసిక జాడ్యము నశించును.

పథ్యము : లఘువుగా నుండు ఆహార పదార్థములు, పాత పెసలు, బఠానీలు, పాత యవలు, వీని గంజి, ఆవుపాలు, మేకమాంసము, దానిమ్మ, ద్రాక్షపండ్లు.

అపథ్యము : దొండపండ్లు, మినుములు, కందులు, మజ్జిగ, మద్యపానము, కొత్తబియ్యం.

మోతాదు : ఒకమాత్ర చొప్పున రోజుకు రెండు లేదా మూడుసార్లు.

లభ్యము : 20,40 మాత్రలు.

## లోకనాథము

ఇది 1.రెట్టింపు గుంటకలగరాకు చూర్ణము, తేనె, వీనితో అజీర్ణము, జీర్ణ జ్వరము, నంజు, తిమ్మెర్లు, కామిర్లు, దగ్గు, ఆయాసము, గుండె వ్యాధులు 2. రెట్టింపు లవంగాల చూర్ణము తేనె వీనితో క్షయ, జలుబు, శ్లేష్మ వ్యాధులు, వాంతి, కడు శీఘ్రముగ హరింపజేయును. జఠరదీప్తిని కలిగించును.

మోతాదు 1/4 చి. మొ।। 1చి. వరకు.

## లోహరసాయనము

ఇందధికమగు లోహము కలదు. 1. సమానమగు గలిజేరు వేళ్ల చూర్ణము,తేనె వీనితో ఆయాసము, దగ్గు,క్షయ,పాండువు,నంజు,కామిర్లు 2.పల్లేరు చూర్ణము వీనితో శ్లేష్మవ్యాధులు, మలబంధము, గుల్మములు, ఉదరము,ప్లీహవ్యాధులు, యకృద్వ్యాధులు, శూలలు 3. తేనెతో తిమ్మెర్లు వాతవ్యాధులు అజీర్ణము వీనిని వెంటనే ఖండించును.

మోతాదు 1/4 చి. మొ।। 1/2 చి.వరకు.

## మహాజ్వరాంకుశ రస (బ.రా.)

ద్రవ్యములు : శుద్ధ పాదరసము, శుద్ధ గంధకము, తామ్రభస్మం, శుద్ధ ఇంగి లీకము, శుద్ధ తాళకము, లోహభస్మం, వంగభస్మం, శుద్ధ హేమమాక్షికము, శుద్ధ కఫరి, శుద్ధ మణిశిల, అభ్రక భస్మము, కావిరాయి, వెలిగారము, నేలదంతి విత్తులు.

గుణము : అగ్నిదీపనము కలుగజేయును. వాత, పిత్త, శ్లేష్మ జ్వరములు, ద్వంద్వ జ్వరములు, పురాణ జ్వరములు, ఏకాహిక, ద్వాహిక, చాతుర్ధిక జ్వరములు, అత్యుగ్రజ్వరము, జలదోషము వలన జనించిన జ్వరములను నశింపచేయును.

అనుభూత ప్రయోగములు : 1. పిత్తాధిక్యత వలన కలిగిన జ్వరమునందు ప్రవాళ భస్మము, ఉశీరాసవములతో వాడిన మంచిది.

2. విషమజ్వరములందుమలేరియా పిల్స్, అమృతారిష్టలతో వాడిన విషమ జ్వరహరము కాగలదు.

3. జలదోషము వలన కలిగిన జ్వరములందు త్రికటు చూర్ణము, శంఖ భస్మము, ఇంగిలీక భస్మములతో వాడిన జలదోషము నివర్తించి, జ్వరము తగ్గుటకు దోహదము కాగలదు.

పథ్యము : బీరకాయ, పొట్లకాయ, గోధుమరొట్టె, పలుచని పాలు, గోధుమ నూకల జావ, బార్లీజావ.

అపథ్యము : కర్బూజా, పనస మొదలగు శీతలకర ఫలములు, పాలు, నెయ్యి, మాంసము మొదలగు గురు పదార్థములు.

అనుపానము : అల్లపు రసము

మోతాదు : ఒకమాత్ర చొప్పున రోజుకు రెండుసార్లు భోజనమునకు ముందు సేవించవలెను.

లభ్యము : 20 మాత్రలు.

## మహాపైత్యాంతకము

ఇది 1. శుంఠిరసముతో అజీర్ణము, అగ్నిమాంద్యము, అరుచి, నోటనీరూరుట, తలతిరుగుట, వాంతి, సమస్తమగు పైత్యవ్యాధులు, ఎక్కిళ్ళు, ఉడుకు వ్యాధులు, వికారముగ నుండుట, కడుపులో మంట, నోటిపూత,

మొదలగు వానిని వెంటనే హరింపచేయును. మోతాదు 1/4 మొ. 1 చి. వరకు.

## మహాలక్ష్మీ విలాస రసము (భై.ర.)

ద్రవ్యములు : లోహభస్మము, అభ్రక భస్మము, శుద్ధ వత్సనాభి, ముస్తక, త్రిఫల, త్రికటు, శుద్ధ దత్తూర బీజములు, సముద్రపాల బీజములు, భంగా చూర్ణము, చిన్న పల్లేరు, పెద్దపల్లేరు, పిప్పలీ మూలము.

గుణము : శిరో రోగములందు బాగుగా పనిచేయును.

1. రెట్టింపు త్రికటు చూర్ణముతో క్షయ, ఆయాసము, దగ్గు, కృశించుట, అజీర్ణము, అగ్నిమాంద్యము 2. రెట్టింపు త్రిఫలా చూర్ణముతో శుక్లనష్టము, సమస్త మగు ప్రమేహములు, వ్రణములు, నోటిపూత, కాళ్ళులాగుట, కృశించుట, సమస్త మగు ప్రదరములు, వీనియందు ఇయ్యవలయును. ఇది శరీరకాంతిని, బలమును, ఇంద్రియ పుష్టిని కలిగించును. మోతాదు 1/4 మొ. 1/2 చి. వరకు.

అనుభూత ప్రయోగములు : జలుబు, పడిశము, దుష్టప్రతిశ్యాయము, నాసా ర్బుదము లందు ఉపయోగకారి.

1. దశమూలారిష్టతో తీసుకొనుచూ చందనాది తైలమును అభ్యంగనమునకు వాడిన సూర్యావర్తము తగ్గును.

2. క్షయజకాసనందు ద్రాక్షారిష్ట, అర్జునారిష్టలు అనుపానముగా వాడుచూ, రాజమృగాంకరస వాడవలెను.

3. యోషాపస్మారము మొదలగు మస్తిష్క సంబంధిత వ్యాధులందు సరస్వతీ లేహ్యము, సారస్వతారిష్ట, బ్రాహ్మీవటిలతో వాడవచ్చును.

పథ్యము : ఆవుమజ్జిగ, ఆవుపాలు, ఆవునెయ్యి, కందిపప్పు, ద్రాక్షపండ్లు, కొబ్బరి కాయ, ఉసిరికాయ, వెన్నెల, చందనం.

అపథ్యము : పెరుగు, వెన్న, చేపలు, మినుములు, ఉలవలు, చల్లని నీటి స్నానము, జాగరణ, వేగనిరోధము.

మోతాదు : 1-2 మాత్రలు రోజుకు రెండుసార్లు సేవించవలెను.

లభ్యము : 20,40 మాత్రలు.

## మహాలోకనాథము

దీనిని 1. త్రిఫలాకషాయముతో నంజు, ఆయాసము, క్షయ, దగ్గు,

పాండు,కామెర్లు 2.సన్నరాస్నపు గంధముతో వాత వ్యాధులు, అగ్ని మాంద్యము సూతికలు వాతము 3. వాము రసముతో శూల, అజీర్ణము, గుండె వ్యాధులు, క్రిమివ్యాధులు వీనియందియ్య వలయును. మోతాదు 1/4 మొ. 1/2 చి. వరకు.

## మహా మేహాంతకము

ఇందు సువర్ణభ్రక మౌక్తికాది భస్మములు గలవు. 1. చందనపు పొట్టు, కురువేరు, తుంగగడ్డలు, వీనియొక్క రెట్టింపు చూర్ణము వెన్న వీనితో ఇక్షుమేహము, అతిమూత్రము, మధుమేహము, సురా మేహము, వసామేహము, హరిద్రా మేహము, శుక్ల మేహము 2. యష్టిమధుకము, నేలగుమ్మడి, అడ్డసరపు వేళ్ళు, వీనియొక్క మూడురెట్ల చూర్ణము తేనె వీనితో పాండువు, రాజయక్ష్మ కృశించుట, ఆయాసము, దగ్గు, దౌర్బల్యము, ఉత్థాపనశక్తి లేకపోవుట, రక్తపిత్తము, కాళ్ళు చేతులు మంటలు 3. మిరియాలు, జీలకర్ర, వాయువిడంగములు, వీనియొక్క రెట్టింపు చూర్ణము కలిపి అరటి దుంపరసముతో తలపోటు, నడుమునొప్పులు, మూత్రమునకు పోవునపుడు మంట. జీర్ణజ్వరము, అజీర్ణము, రక్తార్శస్సు, గ్రహణి, ప్రదరములు, వీనిని హరింప జేయును. దీని సేవనచే శరీరకాంతి, బుద్ధి బలము, ఇంద్రియ బలము కలుగును. మోతాదు 1/4 చి. మొ॥ 1/2 చి. వరకు.

## మహా సిందూర భూషణము

ఇందు బంగారు భస్మము మొదలగునవి కలిసినవి. 1. చ్యవన ప్రాశతో క్షయలు, దగ్గు, ఆయాసము, బలహీనత 2. త్రిఫలా చూర్ణముతో శుక్లనష్టము. నోటిపూత, మధుమేహము, అతిమూత్రము, రక్తవమనము, కాళ్లు చేతులు మంటలు, ఇరువది ప్రమేహములు 3. రెట్టింపు సుగంధి పాల చూర్ణముతో శరీరతాపము, రక్తదోషములు 4. నేరేడు చెక్క కషాయముతో స్త్రీలకు కలుగు రక్తప్రదరము, శ్వేత ప్రదరము, గర్భ స్రావము 5. జీలకర్ర రసముతో పైత్య వ్యాధులు 6.కొబ్బరికాయ నీటితో సెగవ్యాధులు, మూత్రనాళమందలి మంట, మూత్రము ఆగి ఆగి వచ్చుట, మొదలగు వ్యాధులను వెంటనే మొదలంట త్రుంపివేయును. దీనిని సువర్ణ సిందూర భూషణమని కూడ యందురు. మోతాదు 1/4 చి. మొ॥ 1/2 చి. వరకు.

**మహావాత రాక్షసం (వై.చిం.)**

ద్రవ్యములు : రసభస్మము, శుద్ధ గంధకము, కాంత భస్మము, అభ్రక భస్మము, తామ్ర భస్మము, మరియు మర్దనకై తెల్లగలిజేరు, తిప్పతీగ, చిత్రమూలము, తులసి, త్రికటుకములు వీని కషాయములు.

గుణము : శ్రేష్ఠమైన సర్వవాతహర ఔషధము, వాతరక్తము, గాత్ర భంగము, ఆమవాతము, ధనుర్వాతము, పక్షవాతము, కంపవాతము, వేదనావాతము, సంధిగత వాతము, సుప్తవాతము, వాతశూల, ఉన్మాదము, తూని, ప్రతితూని, ఊరుస్తంభము, సూతికా వాతము, అశీతివాతములను నాశనము చేయును. అనుపాన భేదముచే 80 వాతములను నశింపజేయును.

అనుభూత ప్రయోగములు : 1.కాంచనార గుగ్గులు, దశమూలారిష్టలతో ఇచ్చిన, వాత రక్తము శమించును.

2.ఆమవాతమునందు సింహనాద గుగ్గులు, అశ్వగంధారిష్ట, దశమూలారిష్ట లతో ఇచ్చుచూ మహావాత రాక్షసమును ఉదయము, రాత్రి ఇచ్చుచూ, లహసాన్ ఇంజక్షన్ ఇచ్చిన ఆమవాతము తగ్గును.

3. ఊరుస్తంభమునందు క్షీరబలా తైలమును లోనికి తీసుకొనుచూ, మహావాత రాక్షసము, వాతగజాంకుశము ఇచ్చిన సర్వవిధముల శ్రేయస్కరము.

పథ్యము : గోధుమ రొట్టె, గోధుమజావ, మేక, పక్షిమాంసములు, లేత వంకాయ, లేత మునగకాయ, వెల్లుల్లి.

అపథ్యము : పెసలు, మినుములు, శనగలు, పెరుగు మీది మీగడ, నేరేడు, ద్రాక్షపండ్లు

మోతాదు : 1 మాత్ర చొప్పున రోజుకు రెండు లేదా మూడుసార్లు సేవించవలెను.

లభ్యము : 20,40 మాత్రలు

**మహావాత విధ్వంసినీ రస (ర.సి.సం.)**

ద్రవ్యములు : శుద్ధ పాదరసము, శుద్ధ గంధకము, శతపుటనాగభస్మం, వంగ భస్మం, లోహభస్మం, తామ్రభస్మం, అభ్రకభస్మం, పిప్పళ్లు, వెలిగార భస్మం, మిరియాలు, శొంఠి, శుద్ధ వత్సనాభి, మర్దనకొరకు త్రికటు కషాయం, త్రిఫల కషాయం, చిత్ర మూల క్వాథము, గుంటగలగర స్వరసం,

వావిలాకు రసం, అల్లపురసం, నిమ్మపండ్ల రసం, చెంగల్వ కోష్టు కషాయం, జిల్లేడుపాలు, ఉసిరి స్వరసము.

గుణము : వాత వికారములు, శూల, కఫప్రకోపోత్పన్న రోగములు, గ్రహణి, సన్నిపాతము, మూఢత్వము, అపస్మారము, మందాగ్ని, శరీరము చల్లబడుట, పిత్తోదర ప్లీహవృద్ధి, కుష్ఠము, స్త్రీగర్భాశయ రోగములను హరించును.

అనుభూత ప్రయోగములు : కఠినవాత వ్యాధులు, అంగశైథిల్యము, దౌర్బల్యము, గ్రంధిక సన్నిపాతము (ప్లేగు), ఆమవాతము మొదలగు వ్యాధులందు అత్యంత గుణకారి.

1. వాత వికారములందు లహసాన్ ఇంజక్షన్ 40 రోజులు వరుసగా ప్రతిరోజూ కండరమునకు ఇచ్చుచూ, అభ్యంగనమునకు వాతహర తైలములేవైనను వాడిన తక్షణ ఫలితములు కనబడును.

2. అపస్మారమునందు మహాలక్ష్మీ విలాస రస, బ్రాహ్మీవటిలతో పాటుగా అశ్వగంధారిష్ట, అశ్వగంధ లేహ్యములతో వాడిన అపస్మారమునందలి వేగలక్షణములు తగ్గును.

3. స్త్రీ రోగములందు అశోకాదివటి, చంద్రప్రభావటిలతోపాటుగా భోజనానంత రము వాడుచూ, భోజనమునకు ముందుగా యుటిరిల్; అశోకారిష్ట కలిపి వాడిన గర్భాశయమునకు కలుగు అనేక వ్యాధులు తొలగును.

పథ్యము : చేదుపొట్ల, బీర, పొట్లకాయలు, తీయదానిమ్మ, ద్రాక్ష, ఉసిరికాయ, పాతనెయ్యి, తాబేలు మాంసము.

అపథ్యము : మద్యము, చేపలు, విరుద్ధాన్నములు, తీక్ష్ణ ఉష్ణ పదార్థములు, కందులు, దొండపండ్లు; చింత, శోకము, భయము, క్రోధము.

మోతాదు : ఒకమాత్ర చొప్పున రోజుకు రెండుసార్లు తేనెతో సేవించవలెను.

లభ్యము : 20, 40

## మకరధ్వజ రస (భై.ర.)

ద్రవ్యములు : శుద్ధ సువర్ణము, శుద్ధ పాదరసము, శుద్ధ గంధకము, భావన, మర్దనలకై ఎర్రపత్తిపూల స్వరసము, కలబంద స్వరసము.

గుణము : ఉత్తమ వాజీకర రసాయనము, పాచకాగ్ని పెంపొందించును. వలీ పలితలములను నశింపజేయును. మేధస్సు, ఆయువు, తేజస్సులను పెంపొందించును. ఈ ఔషధమును సంవత్సర కాలము సేవించిన, కృత్రిమ విషము, స్థావర విషము, జంగమ విషము, కలుషిత జలముల దుష్ప్రభావము శరీరముపై ఉండదు.

అనుభూత ప్రయోగములు : 1. వాజీకరణముగా ఉపయోగించుటకు మకర ధ్వజ అనుపాన చూర్ణముతో యిచ్చిన అధిక గుణములతో పని చేయును.

2. రసాయనముగా ఉపయోగించవలెనన్న ఆమలకీ స్వరసము, చ్యవనప్రాశ లేహ్యములతో కనీసము సంవత్సర కాలము ఉదయము ఒకటి చొప్పున వాడదగును.

3. దీర్ఘ వ్యాధులయందు, యక్ష్మవంటి మాంసధాతువు శుష్కించు రోగములందు, పాలతో ఇచ్చుచూ అశ్వగంధ లేహ్యము, నెర్విటాల్ వాడిన, ఉత్తమ ఫలితము లిచ్చును.

పథ్యము : మధుర పదార్థములు, నూనె పదార్థములు, మెత్తని మాంసము, ఆవాతల పదార్థములు (వాయువును పెంచనివి) ఆవుపాలు, పంచదార, తేనె, బలవర్ధక పదార్థములు.

అపథ్యములు : ఉష్ణకర, మలబద్ధకర పదార్థములు, మిక్కిలి కారముగా నుండు పదార్థములు, ఉలవలు, ఆవాలు, నువ్వులు.

మోతాదు : 1 మాత్రచొప్పున తాంబూలము నందు ఉంచి సేవించవలెను.

## మల్ల సిందూరము (ర.సి.స)

ద్రవ్యములు : శుద్ధమల్లము, శుద్ధ పాదరసము, శుద్ధగంధకము, భావనకై కలబంద స్వరసం.

గుణము : శ్వాస,కాస, సన్నిపాతము, ఉన్మాదము, ఆపతంత్రక, హిస్టిరియా, ఆమవాతము, విశూచిక, వాతరోగములు ప్రమేహము మరియు సర్వవిధ కఫరోగము లను నశింపజేయును.

అనుభూత ప్రయోగములు : 1. హిస్టీరియానందు మల్లసిందూరము, కస్తూరి, కుంకుమపువ్వు, శుద్ధముషిణి విత్తులు, తెల్ల మిరియాలు, అక్కలకర్రలతో జటామాంసి అర్కము, అనుపానముగా ఇచ్చిన ఉ

ప్రయోగకరము.

2. జీర్ణ పక్షాఘాతమునందు శుద్ధముషిణి విత్తులు, అశ్వగంధ, మల్లసింధూరము లను తేనె, నెయ్యిలతో రోజుకు రెండుసార్లు ఇచ్చుచూ, రాస్నాది అర్కమును అనుపాన ముగా నీయవలెను.

3. ఆమవాతమునందు వాత గజాంకుశ రసతో యిచ్చుచూ, దశమూలారిష్ట అనుపానముగా యిచ్చిన శోథ తగ్గును.

పథ్యము : దానిమ్మపండ్లు, ఉసిరిక పండ్లు, నిమ్మపండ్లు, పాతనెయ్యి, లఘువుగా నుండు అన్నము.

అపథ్యము : మినుములు, మత్స్యములు, ఆవనూనె, దొండపండ్లు.

తీసుకోవలసిన జాగ్రత్తలు : పిత్తప్రధాన రోగములందు ఈ ఔషధసేవన నిషిద్ధము. గ్రీష్మ ఋతువునందు జాగ్రత్త వహించి యివ్వవలెను. జ్వర తీవ్రత అధిక ముగా ఉన్నపుడు (100.ఫా. కంటే అధికము) యివ్వరాదు. మూత్రశుద్ధి సరిగా జరగని వారికి (వృక్క వికారము) యివ్వరాదు.

అనుపానము : తేనె, పిప్పళ్ల చూర్ణము.

మోతాదు : 1 మాత్రచొప్పున రోజుకు రెండుసార్లు సేవించవలెను.

లభ్యము : 10 మాత్రలు.

## మేహవంగ రాజీయము

ఇది 1.సమానమగు పిప్పళ్ల చూర్ణము తేనె. వీనితో ఇరువది ప్రమేహములు మేహక్షయ, కాసశ్వాసలు 2. రెట్టింపు త్రిఫలాచూర్ణము, కలబంద రసము వీనితో శుక్లనష్టము. కాళ్ళు మంట, నోటిపూత, శుక్లము నీరువలె నుండుట, ప్రదర వ్యాధులు 3. రెట్టింపు త్రిజాత చూర్ణముతో అరుచి, నోరు దుర్గంధముగ నుండుట, శరీరతాపము, వీనిని వెంటనే నశింపజేయును. మోతాదు 1/4 చి. మొ॥ 1/2 చి. వరకు.

## మృత్యుంజయ రస (బ.రా.)

ద్రవ్యములు : శుద్ధనాభి, మిరియాలు, పిప్పళ్లు, మోడి, శుద్ధ గంధకము, వెలిగారము, శుద్ధ ఇంగిలీకము.

గుణము : సమస్త జ్వరములను హరించును.

అనుభూత ప్రయోగములు : పిత్త జ్వరములయందు తప్ప, అన్ని జ్వరముల యందు బాగుగా పనిచేయును. ఆమ దోషమును పచనము

చేసి స్వేదమును కలిగించి జ్వరమును తగ్గించును.

1. ఋతు సంధి యందు సామాన్యముగ కనబడే జ్వరములందు పంచతిక్త క్వాథ చూర్ణము, త్రిఫల చూర్ణములతో తయారు చేసిన కషాయముతో తీసుకొనిన జ్వరము తగ్గును.

2. కాస జనిత జ్వరమునందు ఆనందభైరవి రస (కాస)తో వాడిన ఫలప్రదము కాగలదు.

3. ఏ కారణము చేతనైనను వచ్చిన జ్వరమునందు చందనాది వటి, చంద్రప్రభా వటిలతో వాడవచ్చును.

పథ్యము : బార్లీజావ, నూకలజావ, తేనె, బీరకాయ, పొట్లకాయ, తేలికగా జీర్ణమగు ఆహారము, కాచి చల్లార్చిన నీటిని సేవించవలెను.

అపథ్యము : శీతలకర ఫలములు, చేపలు, మాంసము, దుంపలు, అజీర్ణకర పదార్థములు.

అనుపానము : సమస్త జ్వరములందు తేనెతో నాకించవలెను. వాత జ్వరము లందు పెరుగు, ఉదకము అనుపానముగాను, దారుణ సన్నిపాత జ్వరములందు అల్లపురసముతోను, అజీర్ణ జ్వరములందు నిమ్మపండ్ల రసముతోడను, విషమ జ్వర ములందు జీలకర్ర,బెల్లము అనుపానముగా నిచ్చిన నివర్తించును. వాతపిత్తము వలన జనించిన తాపమునందు పంచదార, కొబ్బరినీటితో సేవించవలెను. ఈ ఔషధము అనుపాన భేదముచే సమస్త రోగములను పోగొట్టును.

ఉష్ణము అధికమైన జ్వరములయందు తులసి ఆకు స్వరసముతో సేవించవలెను. ఆమజ్వరములయందు అల్లపురసము, తేనె చేర్చి పుచ్చుకొనవలెను. పడిశపు భారము గల జ్వరములకు మిరియాల కషాయముతో సేవించవలెను.

మోతాదు : 1-2 మాత్రలు చొప్పున రోజుకు రెండు మూడుసార్లు సేవించవలెను.

లభ్యము : 20 మాత్రలు

## మృగాంకరస (భై.ర.)

ద్రవ్యములు : శుద్ధ పాదరసము, స్వర్ణభస్మము, ముక్తభస్మము, శుద్ధ గంధకం, శుద్ధ టంకణం, కాంజికము,

గుణము : యక్ష్మహరము

అనుభూత ప్రయోగములు : దీర్ఘకాలిక కాస జ్వరములందు విశేష గుణకారి, పుప్పుసమునకు, హృదయమునకు బలము కలిగించును. రక్తపిత్తమునందు, కఫము నందు రక్తము పడుటను నివారించును.

1. రాజయక్ష్మ యందు మృగాంకరస ఉదయం ఒకటి, రాత్రి ఒకటి ఇచ్చుచూ, నెర్విటాల్ మూడు పూటలా రెండు చెంచాల చొప్పున పాలు లేదా పండ్ల రసముతో ఇచ్చుచూ, చ్యవనప్రాశ లేహ్యము కుంకుడు కాయంత రాత్రి పరుండ బోవునపుడు, ఉదయం పరగడుపున ఇచ్చిన చాలా లాభదాయకము, ఈ విధముగా కనీసము 5-6 నెలలు వాడవలెను.

2. స్వర్ణ భస్మం 1గ్రా. శృంగి భస్మం 10 గ్రా. తామ్రభస్మం 2.5గ్రా. టంకణ భస్మం 10 గ్రా. యష్టి మధుచూర్ణం 25గ్రా. త్రికటు చూర్ణ 10గ్రా. శతావరీ చూర్ణము 50 గ్రా. కలిపి, 12 గ్రా. చొప్పున తేనె లేదా మాంసరసముతో (మేక) భోజనానికి ముందు లేదా ఏ సమయమునందైనను ఉదయము ఒకసారి, రాత్రి ఒకసారి తీసు కొనుచూ, భోజనానంతరము ఒకమాత్ర చొప్పున ఒక సంవత్సరముపాటు వాడిన రాజయక్ష్మ నశించును.

3. ఏవిధమైన శారీరక దౌర్బల్యమునందైనను ఉదయము 1. రాత్రి 1 చొప్పున నెర్విటాల్‌తో వాడిన ప్రశస్తము.

పథ్యము : గోధుమలు, మేకమాంసము, మాంసరసములు, మధుర రసములు, అరటి, పనస, మామిడి, ఉసిరిక, ఖర్జూర, ద్రాక్ష, ఎల్లప్పుడు మేకల మధ్య నివసించుట.

అపథ్యము : గొఱ్ఱెమాంసము, వెల్లుల్లి, పులుసు, కారము, దొండ, బెండకాయలు, తాంబూలము, కర్బూజా, జాగరణము, శ్రమ.

మోతాదు : ఒకమాత్ర చొప్పున రోజుకు రెండుసార్లు, పిప్పలి చూర్ణము, తేనెతో సేవించవలెను.

లభ్యము : 20,40 మాత్రలు

## నాగార్జునాభ్రరస (భై.ర.)

ద్రవ్యములు : సహస్రపుటాభ్రక భస్మము, అర్జునపట్టక్వాథము

గుణము : సర్వవిధములైన హృద్రోగములు, అన్ని విధములైన శూలలు, అర్శస్సు, వమనము, అరుచి, అతిసారము, అగ్నిమాంద్యము, రక్తపిత్తము, ఉరఃక్షతము, క్షయ, శోథ, ఉదర రోగములు, ఆమ్లపిత్తము,

విషమజ్వరము మొదలగు అనేక రోగములను హరించును. బల్యము, వృష్యము, రసాయనము

అనుభూత ప్రయోగములు : 1. ముత్యభస్మము 2 1/2 గ్రా. అకీక పిష్టి 5 గ్రా. గోమూత్ర శిలాజిత్ 10 గ్రా. శృంగ భస్మం 10 గ్రా. ద్రాక్షాది చూర్ణం 25 గ్రా. కలిపి ఒక గ్రా. చొప్పున తేనెతో భోజనమునకు ముందు తీసుకొనుచూ, భోజనానంత రము నాగార్జునాభ్రరసము వాడిన హృద్రోగనిరోధకము కాగలదు.

2. రక్తపిత్తమునందు ఉశీరాసన అనుపానముగా వాడవచ్చును.

3. వమనము, అరుచి, అతిసారములందు పిప్పల్యాసవ, రోహితకారిష్టలను అనుపానముగా తీసుకొనిన వికారము తగ్గి రుచి పుట్టుచూ అతిసారాంతకము కాగలదు.

పథ్యము : వెల్లుల్లి, ఆవునెయ్యి, పెరుగుతోటకూర, చుక్కకూర, బీరకాయ, పొట్లకాయ, దానిమ్మ, వెలగపండ్లు, అల్లము, తేనె, పంచదార, మేకమాంసము.

అపథ్యము : కల్లు, సారాయి, శనగపప్పు, వేరుశనగ పప్పు, మినుములు, ఉలవలు, కందులు, చేపలు, కోడి, పంది మాంసములు; ఎండ, సంచారము, కోపము.

మోతాదు : ఒకమాత్ర చొప్పున రోజుకు రెండు లేదా మూడుసార్లు సేవించ వలెను.

లభ్యము : 20,40 మాత్రలు.

## నష్టపుష్పాంతక రస (భై.ర.)

ద్రవ్యములు : శుద్ధపాదరసము, శుద్ధగంధకం, లోహభస్మం, వంగభస్మం, టంకణ చూర్ణము, రజతభస్మం, అభ్రకభస్మం, తామ్రభస్మం, మర్దనకై, గుడూచీస్వర సం, త్రిఫలాకషాయం, దంతీమూల కషాయం, నిర్గుండి స్వరసం, కంటకారి స్వరసం, దారు హరిద్రకషాయం, జీవంతి కషాయం, కోష్ఠకషాయం, బృహతి కషాయం, రాస్నాకషాయం, గోక్షుర కషాయం, జయంతి స్వరసం, తులసిస్వరసం, కాకమాచి స్వరసం, హరిద్రాస్వరసం, తాళిసపత్రికషాయం, వెద్రమూల కషాయం, వాసాస్వర సం, బలాకషాయం మరియు సైంధవ లవణం, యష్టి, దంతీమూలం, లవంగం, తవాక్షీరి.

గుణము : నష్టార్తవము, నష్టశుక్ర, యోనిశూల, ఋతుశూల, మరియు

ఆమవాతములను హరించును.

అనుభూత ప్రయోగములు : తీక్షణమైన ఉష్ణమైన ఔషధము, ప్రదరరోగము, కష్టార్తవ రోగములను హరించును.

1. నష్టార్తవమునందు పుష్యానుగచూర్ణము, వైశ్వానర చూర్ణములను యుటిరిల్, అశోకారిష్టల అనుపానముగా భోజనమునకు ముందు సేవించుచూ, భోజనానంత రము అశోకాదివటితో నష్టపుష్పాంతక రస సేవించిన తగ్గుముఖం పట్టును.

2. కష్టార్తవమునందు ఋతుశూలతో వాడిన శూల శమించును.

3. ఆమవాతమునందు (ప్రత్యేకముగా స్త్రీలయందు కలిగెడి) మాహాయోగరాజ గుగ్గులతో దశమూలారిష్ట అనుపానముగా వాడుట శ్రేష్ఠము.

పథ్యము : లేత అరటికాయ, బెండకాయ, పొన్నగంటికూర, అరటిపువ్వు, బూడిదగుమ్మడికాయ, దానిమ్మ, ద్రాక్ష, ఖర్జూరము, పంచదార, తేనె.

అపథ్యము : ఉలవలు, ఉలవకట్టు, కోడిమాంసము, వంకాయ, మునగకాయ, చేపలు, గురుత్వము చేయు పదార్థములు.

మోతాదు 1-2 మాత్రలు రోజుకు రెండుసార్లు వేడినీటితో సేవించవలెను.

లభ్యము : 20,40 మాత్రలు

## నిత్యానంద రస (భై.ర.)

ద్రవ్యములు : హింగుళోత్థపాదరసము, శుద్ధగంధకము, తామ్రభస్మం, కాంస్య భస్మం, వంగభస్మం, శుద్ధహరతాళం, శుద్ధతుత్థము, శంఖభస్మము, వరాటికాభస్మము, శొంఠి, పిప్పలి, మిరియాలు, కరక్కాయలు, తానికాయలు, ఉసిరికాయలు, లోహభస్మం, వాయువిడంగాలు, పంచలవణములు, చవ్యము, పిప్పలీ మూలం, హపుష, వచ, కచ్చూరాలు, చిరుబొద్ది, దేవదారు, యాలకులు, సముద్ర పాల, తెల్లతెగడపట్ట, చిత్రమూలము, శుద్ధదంతి, కరక్కాయ క్వాథము.

గుణము : కఫ మరియు వాత ప్రకోప, రక్త, మాంస, మేదో ఆశ్రిత శ్లీపద రోగమును హరించును. గండమాల, అర్బుదము, దారుణ

వాతరక్తము, కఫము మరియు వాతవికారము వలన ఉత్పన్నమగు రోగములు, పురాణ అంత్రవృద్ధి మొద లగు వానిని హరించును. వాతరక్తము, వాత,కఫ వికారములు, గుదరోగములు, కృమి రోగములను నశింపజేయును. పాచకాగ్నిని పెంపొందించును. శరీరమునకు బలమును, రంగును కలిగించును. రక్తజ,పిత్తజ శ్లీపదమును నశింపచేయును. శ్లీపద రోగమునకు ఇంతకంటే శ్రేష్ఠమైన ఔషధము మరియొకటి లేదు.

అనుభూత ప్రయోగములు : 1. నింబత్వక్ చూర్ణము 25గ్రా. చేదుపొట్ల 10గ్రా. నేలవేము 10గ్రా. త్రిఫలచూర్ణము 50 గ్రా. కలిపి 2 గ్రా. చొప్పున భోజనము తరువాత పగలు రాత్రి నిత్యానందరసముతో వాడిన శ్లీపదము తగ్గుముఖం పట్టును.

2. రక్తజ శ్లీపదమునందు లాక్షాది చూర్ణము, పంచదారలతో కలిపి 2గ్రా. చొప్పున సరస 4 చెంచాల అనుపానముగా పగలు, రాత్రి భోజనానికి ముందుగా ఇచ్చుచూ, భోజనానంతరము నిత్యానందరసము ఇచ్చిన ఉప యోగకరము.

3. పిత్తజ శ్లీపదమునందు తిప్పసత్తు, గోదంతి భస్మము, శారి బాద్యరిష్టలతో వాడిన పిత్తదోషము శమించును.

పథ్యము : పాతమంచి బియ్యము, ఉలవలు, ఉల్లిపాయలు, పొట్లకాయలు, బీరకాయ, తెల్లగలిజేరు ఆకుకూర, బచ్చలికూర, కారము, ఆవునెయ్యి, ఆవు చల్ల.

అపథ్యము : ఉప్పుడుపిండి, పిండితోను లేక పాలతోను చేయబడిన పదార్ధములు, బెల్లము, జలప్రాంత జంతు మాంసములు, గురు పదార్ధములు.

మోతాదు : ఒక్కొక్క మాత్ర చొప్పున రోజుకు రెండుసార్లు భోజనమునకు ముందు చల్లని నీటితో సేవించవలెను.

లభ్యము : 20,40 మాత్రలు.

## నవగ్రహి

ఇందు తీవ్రగుణముగల విషవస్తువులు కలియును. వెంటనే వేడిచేయును. శ్లేష్మమును తగ్గించును. నాడికి పుష్టినిచ్చును. కరపాద శీతలము తగ్గించును. 1. అల్లపు రసముతో అరగతీసి యిచ్చిన యెడల కఠినస్థితి యందున్న సన్నిపాతజ్వర ములు, దోష జ్వరములు,

విషమజ్వరములు, ఏకాహిక ద్వ్యాహిక చాతుర్థిక జ్వర ములు. 2. తేనెతో అరగదీసి యిచ్చిన యెడల సూతికాజ్వరములు, వాత వ్యాధులు, శ్లేష్మ వ్యాధులు 3. జిట్టవరగోగురసముతో అరగదీసి యిచ్చిన యెడల కరపాద శీత లము, రోగికి స్ప్రుహతప్పుట నాడినీరసగతిగ నుండుట కఫ మెదుర్కొనుట 4. చనుపాలతో ఇచ్చినచో చంటిపిల్లలకు గలుగు శ్లేష్మ జ్వరము, ఎగరొప్పు, ఆయాసము, పొట్ట ఉబ్బరము, మగత 5. తేనెతో అరగదీసి యిచ్చిన యెడల జీర్ణించిన సవాయి వ్యాధులు, చర్మదోషములు, దగ్ధమైపోవును. జాగ్రత్తగ వాడవలయును. దీనిని జీర్ణిం చిన సవాయి వ్యాధులయందు కూడ ప్రధానముగ వాడెదరు. మరియు జీర్ణించిన చలిజ్వరమునందు కూడ వాడెదరు.

మోతాదు 1/3 చి. మొ. 1/4 చి. వరకు

**నవలోహచింతామణి**

దీనిని 1. అడ్డసరపు రసముతో ఏకాదశ క్షయలు, దగ్గు, ఆయాసము, శ్లేష్మ వ్యాధులు, వాతవ్యాధులు 2.అల్లపు రసముతో అజీర్ణములు, అగ్నిమాంద్యము, జ్వరము, శూల 3. రెట్టింపు చంద్ర చూర్ణముతో కుష్టములు, చర్మ వ్యాధులు మొదలగువాని యందియ్యవలయును. మోతాదు 1/4 మొ. 1/2 చి.వరకు

**పంచబాణ రస (ర.సా)**

ద్రవ్యములు : శుద్ధపాదరసము, అభ్రకభస్మం, లోహభస్మం, శుద్ధ గంధకం, వంగభస్మం, వరాటికా భస్మం, స్వర్ణ భస్మం, భావనకొరకు ఆవుపాలు, భృంగరాజ స్వరసం, ఉమ్మెత్త, లవంగాలు, జాజికాయ, కుంకుమపువ్వు, నల్లజీలకర్ర, అక్కల కర్ర, గజపిప్పలి, పిప్పలి, శ్వేత చందనం, కస్తూరి, వీని స్వరసములు.

గుణము : వీర్యవృద్ధి కలుగజేయును. ఇంద్రియ వికృతులను హరించును.

అనుభూత ప్రయోగములు : కామిల, పాండువు, సర్వవిధములగు క్షయలు, శుక్రమేహాది సమస్త మేహములయందు మిక్కిలి గుణకారి. మధుమేహము కలవారికి వాజీకర రసాయనముగా పనిచేయును. అతిమైథునము వలన నీరసించిన వారికి బలమును, ధాతుపుష్టిని కలిగించును.

1. మధుమేహ ఉపద్రవముగా కలిగే నపుంసకత్వమునందు మకర ధ్వజ అనుపాన చూర్ణముతో వాడవచ్చును.

2. అతిమూత్రము, శీఘ్రస్ఖలనములందు కపికచ్ఛు చూర్ణము, అశ్వగంధచూర్ణ ములతో వాడిన చాలా ఉపయోగకరము.

3. రాజయక్ష్మ నందు కలిగే దేహశోషయందు నెర్విటాల్‌తో వాడిన మేదో ధాతువు, మాంసధాతువులు వృద్ధినొందును.

పథ్యము : చక్కెర పొంగలి, ఆవుపాలు, నెయ్యి, పెరుగు, మేక మాంసము, లేత కోడిమాంసము.

అపథ్యము : ముదుకైన బియ్యపు అన్నము, పులుసు, చేపలు, ఆవనూనె, వంకాయ, పులిహోర; అధిక శ్రమ, జాగరణము.

మోతాదు : ఒకమాత్ర చొప్పున రోజుకు రెండుసార్లు పాలతో సేవించవలెను.

లభ్యము : 20,40 మాత్రలు

## పంచలోహరసాయనము

దీనిని 1. వెన్నతో శుక్లనష్టము మొదలగు సమస్త మేహములు 2. తేనెతో నంజు, గుండెవ్యాధులు, కామిర్లు, పాండువు, తిమ్మెర్లు 3. రెట్టింపు త్రిజాత చూర్ణ ముతో దగ్గు, ఆయాసము, వీనియందియ్యవలయును. ఇందు వంగ లోహ అభ్రకాదులు చేరియున్నవి. మోతాదు 1/4 మొ. 1/2 చి. వరకు.

## పంచవక్త్ర రసము

ఈ మాత్రలను 1. జిల్లేడు వేళ్ళు, త్రికటుకములు వీనియొక్క కషాయముతో సన్నిపాతజ్వరములు, దోషజ్వరములు, శీతజ్వరములు 2. తేనెతో దగ్గు, ఆయాసము, కఫరోగములు 3. అల్లపురసముతో అజీర్ణములు, అగ్నిమాంద్యము మొదలగువాని యందియ్యవలయును. మోతాదు 1,2 మాత్రలు.

## ప్రతాపలంకేశ్వరము

దీనిని 1. అల్లపురసముతో సూతికావాతములు, సూతికాజ్వరములు 2. తిప్పతీగ, అల్లము, త్రిఫలములు వీనియొక్క కషాయము గుగ్గులు వీనితో వాత వ్యాధులు, శ్లేష్మ వ్యాధులు, అర్శస్సు 3. శొంఠిరసముతో

సన్నిపాత జ్వరములు, కఠిన జ్వరములు, గ్రహణి, అజీర్ణము, శ్లేష్మదగ్గు, ఆయాసము, అతిసారము వీనియందియ్యవలయును. మోతాదు 1/4 మి. 1/2 చి.వరకు.

## పూర్ణచంద్రోదయం

ద్రవ్యములు : శుద్ధపాదరసము, శుద్ధ గంధకము, శుద్ధ సువర్ణము, నిమ్మరసం, సైంధవలవణం, భావన, మర్దనలకై ఎర్రపత్తిపూల స్వరసం, కలబందస్వరసం.

గుణము : హృదయ పౌష్టికము, వాజీకరణము, రసాయనము, బల్యము, రక్త ప్రసాదకము, జంతుఘ్న, సేంద్రియ విషశామకము, యోగవాహి, రాజయక్ష్మ, కఫ ప్రకోపజన్య వ్యాధులు, శుక్ర బలహీనతలను నశింపజేయును. వీర్య స్రావము, స్వప్న దోషము, ధాతుక్షీణత, మానసిక బలహీనత, నపుంసకత్వం, హృదయ దౌర్భ ల్యము, జీర్ణజ్వరము, క్షయ, శ్వాస, ప్రమేహము, విషవికారములు, మందాగ్ని, అప స్మారము, మున్నగువానిని నశింపజేసి బలమును, వీర్యమును, ఆయువును వృద్ధి చేయును.

శాస్త్రీయ ప్రయోగములు : 1. సన్నిపాతమునందు కఫము ప్రకోపించినపుడు, పూర్ణచంద్రోదయము, శృంగిభస్మము, ప్రవాళపిష్టి, స్వర్ణమాక్షిక భస్మములను కలిపి, తేనెతో రోజుకు 3 సార్లు స్వల్ప మోతాదులో యిచ్చుచూ, అతిమధురము, తానికాయ, ఎండుద్రాక్ష, అడ్డసరము, పటికబెల్లముల అష్టమాంశ క్వాథము నిచ్చిన కఫశుద్ధి జరుగును.

అనుభూత ప్రయోగములు : 1. అపస్మారము నందు రసరాజరస, బ్రాహ్మీవటి, పూర్ణచంద్రోదయము కలిపి, అశ్వగంధారిష్ట అనుపానముగా యిచ్చిన వేగము తగ్గును.

2. వాజీకరణముగా వాడవలెనన్న. శతావరీచూర్ణము, దూలగొండి విత్తుల చూర్ణములతో కలిపి, ఆమలకీ స్వరసము లేదా చిక్కని పాలతో తీసుకొనిన, బాగుగా పనిచేయును.

3. ధాతుశోషనందు రజిత, ముత్యభస్మములతో ఇచ్చుచూ, నెర్విటాల్ వాడిన, కండ పెరుగును.

పథ్యము : కందికట్టు, కందిపప్పు, సైంధవలవణము, అడవి మృగమాంసము, మేక మాంసము.

అపథ్యము : గుమ్మడికాయ, మిక్కిలి కారముగల పదార్థములు; లంఘనము, స్త్రీ సంగమము.

సేవన విధి : 1. పూర్ణ చంద్రోదయము, కర్పూరములను కలిపి నూరి, జాజికాయ సముద్రపాల విత్తులు, లవంగములు, కస్తూరిలను కలిపినూరి సేవించవలెను.

2. పూర్ణ చంద్రోదయము, అభ్రకభస్మము, కర్పూరము, కుంకుమపువ్వు, అక్కల కర్ర, సముద్రపాల విత్తులు, పిప్పళ్లు, కస్తూరిలను కలిపి మర్దించి సేవించవలెను.

సూచన : నాడి, హృదయము మందగతిన ఉన్న కఫ ప్రధాన ప్రకృతిగల వారికి ఈ రసాయనము అనుకూలముగా ఉండును. పిత్త ప్రకృతి కలిగి, నాడి, హృదయముల గతి వేగముగా నున్న వారికి ఈ ఔషధము నిషిద్ధము.

అనుపానము : తేనె 125-375 మి.గ్రా.

మోతాదు : ఒక మాత్ర చొప్పున రోజుకు 1-2 సార్లు సేవించవలెను.

లభ్యము : 10 మాత్రలు

## పూర్ణచంద్రోదయం (భై.ర.)

ద్రవ్యములు : తాళకభస్మం, లోహభస్మం, అభ్రకభస్మం, శుద్ధ పాదరసము, శుద్ధ గంధకము, కర్పూరము, జాజికాయ, జటామాంసి, ఆకుపత్రి, కచ్చూరములు, తాళిసపత్రి, నాగకేసరములు, శొంఠి, మిరియాలు, పిప్పళ్లు, దాల్చినచెక్క, మోడి, లవంగములు.

గుణము : సర్వ రసాయనములందు శ్రేష్ఠమైన, ఉత్తమమైన వాజీకరణ ఔషధము. అనేక విధములైన అతిసారము, గ్రహణి, ఆమ్లపిత్తము, శూల మరియు పరిణామ శూలలను హరించును.

అనుభూత ప్రయోగములు : 1. పంచభాణ కల్పను తేనెతో తీసుకొనుచూ, భోజనానంతరము మదన కామేశ్వరీ లేహ్యముతో అనుపానముగా తీసుకొనిన కామోద్దీపనము కలిగించును.

2. ధాతువృద్ధికై ధాతువర్ధిని (పొటెంట్) మాత్రలతో వాడిన ధాతుపుష్టి కలుగును.

3. వీర్యవృద్ధికై నారసింహ లేహ్యముతోవాడుచూ, శతావరీ చూర్ణము, అశ్వగంధ చూర్ణము, అభ్రక భస్మము, గోమూత్ర శిలాజిత్‌లను కలిపి 2

గ్రా. చొప్పున 40 పొట్లములుగా చేసి, తేనెతో కాని, పాలతోకాని పండ్లరసముతోగాని తీసుకొనిన ఉప యోగము.

పథ్యము : చక్కెర కలిపిన ఆవుపాలు, పాత బియ్యపు అన్నము, మాంసము వేసి వండిన అన్నము, లేత కోడిమాంసము,

అపథ్యము : పులుపు, చేపలు, ఆవనూనె, కారము, ధూమపానము, మితిమీరిన మద్యపానము.

మోతాదు : 1-2 మాత్రల చొప్పున రోజుకు రెండుసార్లు సేవించవలెను.

లభ్యము : 20,40మాత్రలు.

**ప్రదారంతక రస (భై.ర.)**

ద్రవ్యములు : శుద్ధ పాదరసం, శుద్ధగంధకం, వంగభస్మం, రజతభస్మం, కపరి భస్మం, వరాటికా భస్మం, లోహభస్మం, కలబంద స్వరసం.

గుణము : అసాధ్య ప్రదర రోగములను నశింపచేయును.

అనుభూత ప్రయోగములు : శ్వేతప్రదరము, రక్తప్రదరములను నశింపజేయును. ఋతు క్రమమును సరిజేయుచూ, శరీరములోని అంతర్దాహమును తగ్గించును.

1. లాక్షాది చూర్ణము 25 గ్రా. పంచదార 25 గ్రా. వైశ్వానర చూర్ణము 50 గ్రా. పుష్యానురాగ చూర్ణము 50 గ్రా. కలిపి 3గ్రా. చొప్పున భోజనమునకు ముందు తీసుకుంటూ, భోజనము తరువాత ప్రదరాంతక రసము ఒక బిళ్ల చొప్పున అశోకారిష్ట అనుపానముగా వాడిన రక్తప్రదరము తగ్గును.

2. బియ్యపు కడుగు నీళ్ళతో ప్రదారాంతక రసము భోజనానంతరము వేసు కున్నచో శ్వేత ప్రదరమును నివారించవచ్చును.

3. అబలసుధ, ప్రదారాంతక రసము కలిపి వాడిన, రక్తప్రదరము, రక్తక్షీణతలను నివారించవచ్చు.

పథ్యము : బెండకాయ, పెరుగుతోటకూర, మెంతికూర, బూడిదగుమ్మడికాయ, దానిమ్మ, ద్రాక్ష, ఖర్జూరము, పంచదార, తేనె.

అపథ్యము : కొత్తబియ్యం, శనగలు, ఉలవలు, కోడిమాంసము, మునగకాయ, చేపలు, నూనె, గురుత్వము చేయు పదార్థములు.

మోతాదు : 1-2 మాత్రల చొప్పున రోజుకు రెండుసార్లు భోజనము తరువాత సేవించవలెను.

లభ్యము : 20 మాత్రలు.

## ప్రదరాంతక రసము

దీనిని 1. రెట్టింపు త్రిఫలాచూర్ణము, మేడి చెక్క కషాయము, వీనితో సేవించిన యెడల సమస్తమగు ప్రదర వ్యాధులు నశించును. 2. వెన్నతో సేవించిన యెడల శుక్లనష్టము, దగ్గు, క్షయ, మొదలగునవి నశించును. ప్రదర వ్యాధులకు నిదిచెప్ప బడినది. మోతాదు 1/4 మొ. 1/2 చి. వరకు.

## ప్రదరారి రసము

దీనిని అశోకపట్ట కషాయముతో సేవించిన యెడల శ్వేత ప్రదరమును, రక్త ప్రదరమును, వెంటనే నశించును. అశోకపట్ట, తిప్పతీగ, కొడిశపాలపట్ట, రసాంజనము, తుంగగడ్డలు, ఎర్రచందనము వీనియొక్క కషాయముతో సేవించిన యెడల రక్తస్రావము, జ్వరము, అతిమూత్రము, శ్వేతప్రదరములు, రక్తప్రదరములు మొదలగు నవి వెంటనే నశించును. మోతాదు 1- 2 మాత్రలు.

## ప్రతాప లంకేశ్వరము (ర.సి.సం)

ద్రవ్యములు : శుద్ధ పాదరసము, శుద్ధగంధకము, శుద్ధ వత్సనాభి, మిరియాలు, అభ్రక భస్మము, లోహభస్మము, శంఖ భస్మము, కచ్చిక.

గుణము : సూతికా రోగములకు ఉత్తమ ఔషధము,సూతికలకు కలుగు తాపము, ఉన్మాదము, కాస, శిరశ్శూల, వమనము, కఫదోషము, దంతబంధము, గృధ్రసీ, ధనుర్వాతము, జలుబు, శూల, త్రిదోష అతిసారములను నశింపజేయును. దీనిని సేవించిన, ప్రసూతి స్త్రీల గర్భాశయమునందలి దుష్ట రక్తము బయటకు వెడలును.

అనుభూత ప్రయోగములు : మూలవ్యాధి, సన్నిపాతము, విషజ్వరము, దోష జ్వరములు, ఇన్ఫ్లూయెంజాలను హరించును.

1. కఫదోష నివృత్తికై త్రికటు చూర్ణము, రోహితకారిష్టలతో ఇచ్చిన దోష ఉప శమనము జరుగును.

2. ధనుర్వాతమునందు దశమూలారిష్ట అనుపానముగా ఇచ్చుచూ, పిండతైల ముతో పంచ కర్మలను చేసిన తగ్గును.

3. గృధ్రసీ నందు వాత గజాంకుశరసతో దశమూలారిష్ట అనుపానముగా ఇచ్చుచూ, లహసాన్ ఇంజక్షన్ రోజునకు రెండుసార్లు, ఇచ్చుచూ, 20 దినములు వాడిన, గృధ్రసీ వాతము క్రమముగా తగ్గును.

పథ్యము : గోధుమజావ, మేకమాంసము, పొట్లకాయ, లేత వంకాయ, వెల్లుల్లి, ఉల్లిపాయ.

అపథ్యము : జొన్న అన్నము, మినుములు, బచ్చలికూర, చుక్కకూర, పెరుగు, శీతలకర పదార్థములు.

మోతాదు : 1-2 మాత్రలు రోజుకు రెండుసార్లు అల్లపురసము-తేనెలతో గానీ, తులసీ స్వరసముతోగానీ సేవించవలెను.

లభ్యము : 20, 40 మాత్రలు.

## ప్రవాళ పంచామృత రస (ర.సి.సం)

ద్రవ్యములు : శుద్ధ ప్రవాళము, ముక్తాభస్మం, శంఖభస్మం, శుక్తిభస్మం, వరాటికా భస్మం, ఆవుపాలు.

గుణము : ఆనాహము, గుల్మము, ఉదరరోగము, ప్లీహోదరము, బద్ధోదరము, కాస, శ్వాస, మందాగ్ని, కఫవాత ప్రకోపోత్పన్న రోగములు, అజీర్ణము, ఉద్గారము, హృద్రోగము, గ్రహణి, అతిసారము, బాలగ్రహోపద్రవములు, ప్రమేహము, మూత్ర రోగములు, మూత్రకృచ్ఛ్రము, అశ్మరీలను హరించును.

పుల్లని త్రేన్పులు, భోజనానంతరము ఉదరము భారీగా నుండుట, ఉదర శూల ఆందోళనలయందు నిమ్మరసము లేదా ఇతర ఆమ్లవర్గ పదార్థములతో ప్రవాళ పంచామృత రసమును సేవించవలెను.

దాహము, పుల్లనిత్రేన్పులు మొదలగు లక్షణములుగల ఆమ్లపిత్తమునందు దానిమ్మ రసము లేదా దాడిమావలేహముతో వాడవలెను.

అనుభూత ప్రయోగములు : 1. గ్రహణీ రోగమునందు కలిగే యకృత్ వృద్ధి నందు ఆరోగ్యవర్ధనీవటి, దాడిమాష్టక చూర్ణములతో ఇవ్వవచ్చును.

2. అతిసారమునందు మజ్జిగతో తీసుకొనవలెను.

3. మూత్రరోగములు, ప్రమేహములందు గోక్షురాది చూర్ణము, కర్పూర శిలాజిత్, పునర్నవారిష్టలతో వాడిన ఉపయోగము.

పథ్యము : సగ్గుబియ్యపు జావ, బార్లీజావ, ఆవు,గేదె, మేక,గొఱ్ఱె వీని

పెరుగు, మజ్జిగ, నేరేడు, దానిమ్మపండ్లు, అరటిపూవు, వెలగకాయ, ఉష్ణోదకము; నిద్ర.

అపథ్యము : చలి అన్నము, మునగకాయ, చింతపండు, దుంపకూరలు, తాంబూ లము; శీతోదకపానము, జాగరణము ధూమపానము.

మోతాదు : ఒకమాత్ర చొప్పున రోజుకు రెండుసార్లు సేవించవలెను.

లభ్యము : 10 మాత్రలు.

## పాషాణవాత రాక్షసము

ఇది 1. అల్లపురసముతో పదుమూడు సన్నిపాతములు, దోషజ్వరములు, శీతపైత్య జ్వరములు 2. నల్ల ఉప్పి చెక్క రసముతో సూతికాజ్వరములు, సూతికా వాతములు 3. నేలగొలిమిడి వేళ్ళ రసముతో ఆర్దిత వాతము, పక్షవాతము, సర్వాంగ వాతము, చచ్చువాతము, కంపవాతము మొదలగు వానిని వెంటనే నశింప చేయును. ఇందు ఉల్లి పాషాణము చేరుటచే పై వ్యాధుల యందు చురుకుగ బహు చక్కగ పని చేయునని వేరుగ వ్రాయనవసరములేదు. మోతాదు 1/8 మొ. 1/4 చి. వరకు.

## పైత్యాంతకము

దీనిని 1. అల్లపురసముతో సేవించినచో పైత్యవ్యాధులు, అగ్నిమాంద్యము, మలబంధము, వాంతి. అరుచి, తలతిరుగుట, తలనొప్పి, నోట నీరూరుట, పైత్యా జీర్ణము 2. జీలకర్ర రసముతో లేక ధనియాల రసముతో నుపయోగించినచో కడుపులో మంట, వికారముగ నుండుట, నోటిపూత, ఎక్కిళ్లు, ఉడుకు వ్యాధులు ఇవి వెంటనే నశించును. దీనిని రసములు లేకయే వట్టిదే చప్పలించినను చప్పలించవచ్చును. మోతాదు 1/2 చి. మొ।। 1చి. వరకు.

## రాజమృగాంక రసము

దీనిని 1. మిరియాలు, పిప్పళ్లు, వీనియొక్క రెట్టింపు చూర్ణము,నెయ్యి వీనితో దగ్గు, ఆయాసము, క్షయ 2. అడ్డసరపురసముతో కఫ మెదుర్కొనుట, శ్లేష్మ ప్రకోపము 3. రెట్టింపు శుంఠిచూర్ణముతో అజీర్ణము, శూల, పరిణామశూల, అగ్నిమాంద్యము, ఆమ్లపిత్తము, వీనియందియ్యవలయును. ఇది క్షయలకు ప్రసిద్ధమైనది. మోతాదు 1/4

మొ 1/2 చి. వరకు.

## రజత లోహరసాయనము

ఇందు వెండియు లోహమును అధికముగ చేరియుండును. అందుచే మేహవాత వ్యాధులన్నిటి మీదను బహు చక్కగ పనిచేయును. 1.రెట్టింపు త్రికటుచూర్ణముతో అజీర్ణము, పాండువు జీర్ణజ్వరము, నంజు, తిమ్మెర్లు 2. లవంగాలు, సన్నరాస్నము, తవాక్షీరి వీనియొక్క మూడురెట్లు చూర్ణము తేనె వీనితో దగ్గు, ఎగరొప్పు, గుండెలో బరువు, శ్లేష్మవ్యాధులు, కంఠమందు వుండవలెనుండుట, క్షయ, శరీరము లావు పారుట, 3. రెట్టింపు త్రిజాతక చూర్ణముతో ప్రదరవ్యాధులు, శుక్లనష్టము, గుండె వ్యాధులు,కామెర్లు, కుంభకామిల 4. సమానమగు త్రిఫలాచూర్ణముతో పక్షవాతము, ఆర్దిత వాతము, హనుగ్రహము మొదలగు వాత వ్యాధులు 5. తులసియాకు మొదలగు వానియొక్క రసముతో చంటిపిల్లలకు కలుగు ఎగరొప్పు మొదలగు శ్లేష్మ వ్యాధులు, వీనిని వెంటనే నశింపజేయును. రక్తవృద్ధిని చేయును. దీనిని మేహనంజు, శ్లేష్మ వ్యాధులు, వాతముతో కూడిన ప్రదరవ్యాధులు శుక్లనష్టముతో కూడిన పాండువు. ప్రసవమైన పిదప కలుగు నంజు, పాండువు, అజీర్ణము, ఆయాసము, వాత వ్యాధులు మొదలగు వానియందు  ఆయా అనుపానములతో వాడెదరు.

మోతాదు 1/4 చి. మొ॥ 1/2 చి. వరకు.

## రజతమేహ వంగ రాజీయము

దీనిని 1. ద్రాక్షపండ్లరసముతో మేహవ్యాధులు, నోటిపూత, పైత్యవ్యాధులు 2. వెన్నతో శుక్లనష్టము, శీఘ్రస్ఖలనము, శుక్రముపలుచగ నుండుట, నడుము నొప్పులు, కాళ్లులాగుట, దగ్గు, బలహీనత, శ్వేతరక్త ప్రదరములు 3. కలబందగుజ్జుతో సెగవ్యాధులు, మూత్రనాళమునందలి మంట, వీనియందియ్యవలయును. ఇందు వంగమును వెండియుకూడ ప్రధానముగ కలియుటచే  మేహవ్యాధుల యందు అమోఘముగా పనిచేయును. మోతాదు 1/4 మొ. 1/2 చి. వరకు.

## రసమాణిక్య రస

ద్రవ్యములు : వంశపత్రమనెడు హరతాళము, శ్వేతాభ్రక పత్రములు, కూష్మాండ  స్వరసము, పెరుగుతేట, కాంజికము.

గుణము : స్ఫుటిత కుష్ఠము, గళత్కుష్ఠము, వాతరక్తము, భగందరము,

నాడీ వ్రణము, దుష్టవ్రణము, ఉపదంశము, విచర్చిక, నాసా మరియు ముఖరోగములు, భయంకర క్షతము, పుండరీకము, చర్మకుష్ఠము, విస్ఫోట మరియు మండల కుష్ఠము లను హరించును.

అనుభూత ప్రయోగములు : రక్తదోషములను నివారించి, చర్మవ్యాధులను పోగొట్టును.

1. స్ఫుటిత కుష్ఠమునందు సుమారు 250 మి.గ్రా. (2రత్తిలు) తేనెతో కలిపి పగలు, రాత్రి భోజనాంతరము తీసుకొనవలెను.

2. నాడీవ్రణము లందు తేనె, నెయ్యి, కలిపిన మిశ్రమమును సూది తీసివేసిన 2 మి.లీ. డిస్పోజబుల్ సిరెంజి ద్వారా నాడీ వ్రణములోనికి సాధ్యమైనంతవరకు రోజున కొకసారి ఇచ్చుచూ రసమాణిక్య రసము 10గ్రా. త్రిఫల చూర్ణము 50గ్రా. ఆమలకీ చూర్ణము 25 గ్రా. చొప్పున కలిసి దానిని 2గ్రా. చొప్పున కడుపులోనికి తీసుకొనవలెను.

3. అన్నిరకముల కుష్ఠములందు మధుస్నుహీరసాయనము, సరలసలతో పాటుగా, గంధకరసాయనము రసమాణిక్య రసములను వాడిన మంచి ఫలితము నిచ్చును.

పథ్యము : గోధుమలు, పొట్లకాయ, నెయ్యి, తేనె, మేకమాంసము, ఆవుమజ్జిగ, పేలాల జావ.

అపథ్యము : కందిపప్పు, శనగపప్పు, పెసరపప్పు, కర్బూజా పండు, దోసపండు, దబ్బపండు; గాలి, మంచు అభ్యంగనము.

మోతాదు : 1 మాత్ర చొప్పున రోజుకు రెండుసార్లు నెయ్యి, తేనెలతో మర్ధించి సేవించవలెను.

లభ్యము : 20,40 మాత్రలు.

## రసరాజ రస

ద్రవ్యములు : రససిందూరం, అభ్రకభస్మం, స్వర్ణ భస్మం, లోహభస్మం, రజత భస్మం, వంగభస్మం, అశ్వగంధ, లవంగములు, జాపత్రి, శతావరి, కలబంద స్వరసం, కాకమాచి స్వరసం.

గుణము : పక్షాఘాతము,ఆర్ధితవాతము, హనుస్తంభ, అపతంత్రక, ధనుస్తంభ, అవతానక, శిరోభ్రమణము వంటి సర్వవాత వ్యాధులను హరించును. ఈ ఔషధము బల్యము, వృష్యము మరియు ఉత్తమ

వాజీకరణము.

అనుభూత ప్రయోగములు : మూతివంకరపోవుట, కంటనీరు కారుట, పార్శ్వమునందు గల జాయింట్లు యందు కలకలు, అధైర్యము, ఒడలు తెలియక పోవుట, నోటనురుగు వచ్చుట, వెర్రి చూపు చూచుట, అకారణముగా నవ్వుట, ఏడ్చుట, మత్తుగా నుండుట, అసందర్భ ప్రలాపములు, ఎటువంటి మొండి వ్యాధుల నైను నివారించగల గొప్ప ఔషధము.

1. పక్షాఘాతమునందు వాతగజాంకురసము, బృహత్‌వాత చింతామణి ఒక్కొక్క మాత్రచొప్పున దశమూలారిష్ట, అశ్వగంధారిష్టలతో రసరాజసము తీసుకొన్న గుణకారి.

2. వాజీకరణ ద్రవ్యముగా కపికచ్ఛు చూర్ణము మొ॥ వానితో కలిపి వాడవచ్చును.

3. మూర్ఛ, హిస్టీరియాలందు, రసరాజరసము అశ్వగంధ లేహ్యంతో కలిపి రాత్రి పడుకోబోయే ముందు, ఉదయం పరగడుపున వాడుతూ, భోజనానంతరము రెండు చెంచాలు నెర్విటాల్ వాడిన, శరీర కంపము క్రమముగా తగ్గి, కొంతకాలము నకు తగ్గిపోవును. ఈ విధముగా కనీసము 6 నెలల నుండి సంవత్సర కాలము వాడవలెను.

పథ్యము : పేలాల గంజి, ముదురు గుమ్మడికాయ, బీరకాయ, పొట్లకాయ, దానిమ్మపండు, పాతనెయ్యి, పాత బియ్యము.

అపథ్యము : కొత్తబియ్యము, చేపలు, నూనె, వంకాయ, కారపు పదార్థములు, దొండపండ్లు, మినుములు, కందులు, మలమూత్ర వేగనిరోధము; ఎండ, చింత, శోకము, భయము, క్రోధము.

మోతాదు : ఒకమాత్ర చొప్పున రోజుకు రెండుసార్లు పాలతోగాని, పంచదార నీటితో కాని సేవించవలెను.

లభ్యము : 20,40 మాత్రలు.

## రససిందూరము

ద్రవ్యములు : శుద్ధ పాదరసము, శుద్ధ గంధకము, భావనకై కలబంద స్వరసం.

గుణములు : ధాతుక్షయ, హృద్రోగము, కఫప్రధాన ప్రమేహము,

క్షయ, శ్వాస, కాస, వాతరోగము, ఉదర రోగము, మూర్ఛ, అర్శస్సు, భగందరము, పాండురోగము, దుష్టవ్రణము, శూల, వమనము, జ్వరము, సంగ్రహణి, సన్నిపాతము, మందాగ్ని, మస్తిష్క దౌర్బల్యము, గర్భాశయదోషములు, శోథ, గుల్మము, వికారము, త్రిదోష ప్రకోపములను శమింపజేయును. కఫ ప్రధాన రోగముల యందు దీనిని కఫస్రావ ఔషధముతో నీయవలెను. హృదయమునకు బలమునిచ్చును. రక్తప్రసరణను ఉత్తేజితము చేయును. నరములకు పటుత్వము నిచ్చును.

శాస్త్రీయ ప్రయోగములు : 1. ఉరఃస్తోయము నందు రస సిందూరముతో పాటు ఆరోగ్య వర్ధనీవటి, శృంగిభస్మము, మధుమాలినీ వసంతములనిచ్చిన శ్వాస కోశములలో చేరిన నీరు తగ్గి, కఫవృద్ధి, జ్వరము శమించును.

2. సూక్ష్మ క్రిమి జన్య క్షయ మూడవ దశ అయిన ఉరఃక్షతము ప్రారంభదశ నందు కఫము ప్రకోపించినపుడు స్వర్ణ భస్మము, అభ్రక భస్మములతో రససింధూర మును యివ్వవచ్చును.

3. కఫ ప్రధాన జీర్ణ అమాతిసారము, జీర్ణ ఆమ సంగ్రహణిలయందు కుటజారిష్ట లేదా అన్యగ్రాహి ఔషధములతో రససింధూరమును యిచ్చిన శ్రేష్ఠము.

అనుభూత ప్రయోగములు : ఇది ఉష్ణవీర్యము, యోగవాహి, రసాయన గుణ ములను కలిగి ఉండును. ఉరః స్తోయం, న్యుమోనియా సన్నిపాతములందు అత్యంత గుణకారి.

1. భగందర,దుష్టవ్రణములందు రససింధూరమును కాంచనార గుగ్గులతో ఇచ్చుచూ, త్రిఫల కషాయముతో పరిషేకము చేసిన పీడ తగ్గును.

పథ్యము : గోధుమలు, పాతబియ్యపు అన్నము, ఆవుపాలు, నెయ్యి, మజ్జిగ, బీరకాయ, పొట్లకాయ.

అపథ్యము : గుమ్మడికాయ, వంకాయ, కాకరకాయ, మినుములు, నువ్వులు, ఆవాలు.

సూచన : పిత్త ప్రకృతి కలవారికి, పిత్త ప్రధాన శుష్కకాసనందు అన్యపిత్త ప్రధాన రోగములందు రససిందూర సేవన నిషిద్ధము.

అనుపానము : అభ్రక భస్మము, పిప్పలీ చూర్ణము–తేనె.

మోతాదు : 1 మాత్రచొప్పున రోజుకు రెండుసార్లు సేవించవలెను.

అపథ్యము : 10 మాత్రలు.

## షడ్గుణము

ఇది ఆరురెట్లగంధకము చేర్చబడి శాస్త్రప్రకారము వండబడినది. ఉడుకు వ్యాధుల యందమోఘముగ పనిచేయును. 1. సుగంధిపాలపొట్టు, కరక్కాయలబెరళ్లు, నేల గుమ్మడి, తుంగగడ్డలు వీనియొక్క మూడురెట్ల చూర్ణము పంచదార వీనితో నోటి పూత, శరీరమెల్లపుడు వెచ్చగనుండుట జీర్ణించిన సవాయి వ్యాధులు, జీర్ణించిన సెగ వ్యాధులు 2. మిరియాలు, తాలీసపత్రి, వీనియొక్క రెట్టింపు చూర్ణము పటిక బెల్లపు చూర్ణము వీనితో పొడిదగ్గు, ఆయాసము, మేహక్షయ, నోటరక్తముపడుట, 3. పిల్లితేగలు, పెన్నేరు, అతిమధురము, వీనియొక్క మూడురెట్ల చూర్ణము వెన్న వీనితో శుక్లనష్టము, శుక్లముపలచగ నుండుట, ఇరువది ప్రమేహములు; శరీరము శుష్కించుట, పైత్యవ్యాధులు, ప్రదర వ్యాధులు 4. గుమ్మపాలతో పసిపిల్లలకు కలుగు శరీరము శుష్కించుట, అజీర్ణము, ఉడుకు, కాసశ్వాసలు, బలహీనత, నరముల పటుత్వము లేకపోవుట వీనిని వెంటనే నశింపజేయును. ఆరురెట్లు గంధకముతో వండబడుటచే రక్తశుద్ధి బాగుగ చేయును. కాన సమస్త చర్మవ్యాధుల యందును, రక్తవ్యాధుల యందును, సవాయి వ్యాధుల యందును వాడనగును. సరియైన షడ్గుణ మును 2-3 నెలలు వాడినచో ఉడుకుతగ్గి రక్తశుద్ధియు రక్తవృద్ధియు శరీర పుష్టియు కలిగి తత్త్వము ఫిరాయించి (మార్పుచెంది) ఉడుకు వలన కలిగిన వ్యాధు లన్నియు మొదలంట తగ్గగలవు.

మోతాదు 1/4 చి. మొ॥ 1/2 చి. వరకు.

## సమీర పన్నగ రస

ద్రవ్యములు : శుద్ధపాదరసము, శుద్ధగంధకము, శుద్ధ మల్లము, శుద్ధ మణిశిల, శుద్ధతాళకము, భావనకై కలబంద స్వరసము.

గుణము : త్రిదోషములు, న్యుమోనియా, సంధివాతము, ఉన్మాదము, కాస, శ్వాస, జ్వరము, పడిశములను నశింపజేయును. వాత, కఫ ప్రధాన జీర్ణకాస యందు అత్యంత గుణకారి.

శాస్త్రీయ ప్రయోగములు : 1. వాత, కఫ ప్రధాన శ్వాస నందు సమీర పన్నగరస 62-125 మి.గ్రా. పొంగించిన పటిక 375 మి.గ్రా. కలిపి తేనెతో యిచ్చుచూ, అతి మధురము, తానికాయ, పటికబెల్లము, మరియు

అడ్డసరపు ఆకుల క్వాథమును యిచ్చుట వలన కఫనిస్సారము జరిగి ఉపశమనము కలుగును.

2. పాండువు, విషమ జ్వరముల తరువాత వచ్చు బలహీనత యందు 15 మి.గ్రా. సమీరపన్నగ రసను (అత్యల్పమోతాదు) లోహభస్మముతో కలిపి యిచ్చిన బలవర్ధకముగా పనిచేయును.

3. శ్వాస వాహినులలో ఏర్పడు కఫాత్మక, వాతాత్మక, దుష్టవ్రణములను కఫ నిస్వారక్రియచే నశింపజేయును.

4. ఉపదంశ ఉపద్రవములైన సంధివాతము, రక్తవికారము, చర్మరోగము, జీర్ణ పక్షాఘాతము మొ.వానిని నశింపజేయును.

5. కలరా వలన బలహీనుడయిన రోగికి కాళ్లు, చేతులు చల్లబడుట, నాడి మందగించుట, నిశ్చేష్టత, సర్వాంగ ప్రస్వేదము మొదలగు లక్షణములందు శొంఠి, కాయఫలములచే మర్దనచేయుచూ, సమీరపన్నగ రస, మండూర భస్మము, స్వర్ణ మాక్షిక భస్మము, ప్రవాళపిష్టిలను తులసీ రసము, అల్లపురసము, తేనెలతో పది నిముషల కొకసారి యిచ్చిన,రోగి చైతన్యవంతుడుగను, తరువాత రోగికి సూతశేఖర రస, సంజీవని వటి యివ్వవలెను.

6. దీర్ఘకాలిక మలబద్ధకము వలన జనించు క్రిమిరోగములందు 30 మి.గ్రా. సమీర పన్నగ రస, వెల్లుల్లి, రసముతో నీయవలెను. దీనికి ముందు ఆముదపు నూనెతో ఉదర శుద్ధి కావించవలెను.

7. సేంద్రియ విషప్రకోపము వలనగానీ, అతిగా భుజించుటవలన గానీ వచ్చు త్రేన్పులవలన ఏర్పడు గుండెనొప్పి, అగ్నిమాంద్యము, అశక్తతలయందు సమీర పన్నగ రస, శంఖభస్మము, యష్టిమధు చూర్ణములను మామిడి మురబ్బాతో కలిపి భోజన ముతో కలిపి తీసుకొనిన విశేష లాభదాయకము.

అనుభూత ప్రయోగములు : సన్నిపాతమునందు నాడిగతి పూర్తిగా మందగించి నపుడు వాడదగినది. కఫవృద్ధి యందు గుణకారి, స్నాయు మండలమునకు శక్తిని కలిగించును. శ్వాస వేగమును నియంత్రణ చేయును.

పథ్యము : గోధుమలు, ఆవుమజ్జిగ, ఆవునెయ్యి, ఆవుపాలు, పొట్లకాయ, తేలికగా జీర్ణమగు ఆహారము,కాచి చల్లార్చిన నీటిని త్రాగవలెను.

అపథ్యము : గుమ్మడికాయ, ఆవుమజ్జిగ, ఆవునెయ్యి, పొట్లకాయ,

తేలికగా జీర్ణమగు ఆహారము. కాచి చల్లార్చిన నీటిని త్రాగవలెను.

అపథ్యము : గుమ్మడికాయ, కాకరకాయ, శనగలు, ఉలవలు, ఆవాలు, నువ్వులు.

అనుపానము : అల్లపురసము, తేనె, శ్వాసావరోధము నందు శ్వాసనిస్వారము కొరకు అడ్డసరపు ఆకులు, యష్టిమధు, తానికాయ, భారంగి, పటిక బెల్లముల క్వాథము.

మోతాదు : 1మాత్ర చొప్పున రోజుకు రెండుసార్లు సేవించవలెను.

లభ్యము : 10 మాత్రలు.

### సన్నిపాత భైరవి

దీని గుణములు అందరికిని తెలియును. ఇది 1.అల్లపురసముతో పదుమూడు సన్నిపాతములు, దోషజ్వరములు వాత జ్వరములు, శ్లేష్మ జ్వరములు. 2. తేనెతో అతిసారము, జ్వరాతిసారము, ఒడలు నొప్పులు, కఫవ్యాధులు, శిరోభారములు, జలుబు, దగ్గు, వీనిని వెంనే నశింపజేయును. తేనెతో గాని నీటితో గాని కంటి యందు కలికముగ నుపయోగింపవచ్చును.

మోతాదు 1/4 చి. మొ॥ 1/2 చి. వరకు.

### శూలగజకేసరి

దీనిని 1. తమలపాకులతో పుచ్చుకొని వెంటనే శు. ఇంగువ, శొంఠి, జీలకర్ర, వస, మిరియాలు వీనియొక్క మూడురెట్ల చూర్ణమును పుచ్చుకొని వేడినీళ్ళు త్రాగిన యెడల సమస్త శూలలు, అజీర్ణము, కడుపుబ్బరము, అరుచి, అగ్నిమాంద్యము, దగ్గు, ఆయాసము, శ్లేష్మ వ్యాధులు, అతిసారము మొదలగునవి హరించును. శూలకు దివ్యౌషధము. మోతాదు 1/4 మొ॥ 3/4 చి.వరకు.

### సూతికాభరణము

నిజముగ నిది సూతికా స్త్రీలను రక్షించునదే. 1. పిప్పళ్లు మోడి, సన్నరాస్నము, శొంఠి, చవ్యము, వీనియొక్క కషాయముతో నుపయోగించిన యెడల సూతికాస్త్రీకి మైల సరిగ వెడలకుండుట, అధికముగ వెడలుట, నడుము నొప్పులు, తలనొప్పి, వళ్లు నొప్పులు, ఆకలి సరిగ కలగకుండుట, జ్వరము మొదలగు వ్యాధులన్నియు హరించును. 2. తమలపాకురసముతో నిచ్చిన యెడల దగ్గు, వగర్పు, శ్లేష్మము, అజీర్ణము 3. తేనెతో నిచ్చిన యెడల పక్షవాతము, ఆర్దితవాతము, మొదలగు వాత వ్యాధులు 4. శు

ంతిరసముతో నిచ్చిన యెడల సన్నిపాత జ్వరము, దోష జ్వరములు, కలరా మొదలగు వాని యందు శీతలము ఏర్పడినప్పుడు వేడి కలుగు మోతాదు 1 మొ॥ 2 గురివింద గింజల వరకు.

## స్థూలాంతక రసము

ద్రవ్యములు : శుద్ధ తాళకము, తామ్రభస్మము, మర్దన కొరకు గొడ్డుకాకర రసము.

గుణము : స్థౌల్యరోగహరము

అనుభూత ప్రయోగములు : 1.మేదోధాతు వృద్ధి నందు గుగ్గులుతో ఉపయో గించిన, స్థౌల్యనాశకము కాగలదు. (మేదోహరము)

2. హృద్రోగములందు లక్షణానుసార చికిత్సచేయుచూ, మేదోహరముగా పిప్పలీ చూర్ణముతో పాటుగా ఉపయోగించిన, హృద్రోగ నాశకము కాగలదు.

3. మధుమేహము నందు మధు మేహనాశకద్రవ్యములతో పాటుగా గోక్షురాది చూర్ణము, స్థూలాంతక రసములను ఇచ్చిన, మేదోధాతు, క్షయము కాగలదు. తద్వారా మధుమేహ నాశకము కాగలదు.

పథ్యము : పాతబియ్యము, బార్లీ, ఉలవలు, పెసలు, కందులు, తేనె, కారము, చేదు, వగరు, మజ్జిగ, ఆకుకూరలు, వేడి నీరు.

అపథ్యము : కొత్తబియ్యము, తీపి పదార్థములు, పాలు, మినుములు, మాంసము, క్రొవ్వు పదార్థములు, దేహ పుష్టికర పదార్థములు, తృప్తికర భోజనము, సుఖము, పగటి నిద్ర.

అనుపానము : తేనెతో సేవించిన పిదప ఉప్పు నీటిని త్రాగవలెను.

మోతాదు : ఒక మాత్ర చొప్పున ఉదయము, సాయంత్రము సేవించవలెను.

లభ్యము : 20,40 మాత్రలు

పథ్యము : గోధుమ రొట్టె, గోధుమజావ, మేకమాంసము, పక్షిమాంసము, లేత వంకాయ, లేత మునగకాయ, లేత ఆముదపు కాయ, వెల్లుల్లి.

అపథ్యము : అలసందలు, పెసలు, మినుములు, శనగలు, పెరుగుమీది మీగడ, నేరేడుపండ్లు, ద్రాక్ష, కాకరకాయ, మామిడిపండ్లు, మామిడికాయ, శీతల పదార్థములు.

మోతాదు : ఒకమాత్ర చొప్పున రోజుకు రెండుసార్లు సేవించవలెను.

లభ్యము : 20, 40 మాత్రలు.

**సూత శేఖర రస**

ద్రవ్యములు : శుద్ధ పాదరసము, స్వర్ణభస్మం, శుద్ధ అతివస, శుద్ధ టంకణం, రజతభస్మం, త్రికటుకములు, శుద్ధ దత్తూర బీజములు, శుద్ధ గంధకము, తామ్రభస్మం, దాల్చిన చెక్క, ఆకుపత్రి,చిన్నయాలకులు, నాగకేసరములు, శంఖభస్మం, మారేడు గుజ్జు, కచ్చూరములు, మర్దనకొరకు భృంగరాజ స్వరసము.

గుణము : ఆమ్లపిత్తము, గుండెమంట, కళ్లుతిరుగుట, మూర్ఛ, ఉదరశూల మొదలగు పిత్త వికృతి ప్రధాన రోగములందు గుణకారి.

అనుభూత ప్రయోగములు : ఆమ్లపిత్తము, వమనము, శూల, గుల్మము, కాస, సంగ్రహణి, దాహము, త్రిదోషజ అతిసారము, శ్వాస, మందాగ్ని, హిక్కా, ఉదావర్త నము, జ్వరములను నశింపజేయును.

1. ఆమ్లపిత్తమునందు 2.5 గ్రా. తామ్రభస్మం 10 గ్రా. శృంగి భస్మం, శంఖ భస్మం 10గ్రా. భాస్కర లవణం 50 గ్రా. హింగ్వాష్టక చూర్ణము 50 గ్రా. కలిపి 3 గ్రా. చొప్పున మజ్జిగతో భోజనానికి ముందు తీసుకొనుచూ, భోజనానంతరము సూత శేఖరరసము వాడిన అమోఘముగా పనిచేయును.

2. మూర్ఛ, ఉదర శూలలయందు అశ్వగంధ చూర్ణం 50 గ్రా. అతి మధురము 25 గ్రా. అతివస చూర్ణం 10 గ్రా. భాస్కర లవణం 50గ్రా. జటామాంసి చూర్ణము 10 గ్రా. కలిపి 4 గ్రా. చొప్పున భోజనమునకు ముందు మజ్జిగతో తీసుకొనుచూ, భోజనానంతరం సూతశేఖర రసము వాడిన సత్ఫలితమునిచ్చును.

3. కళ్లు చీకట్లు కమ్మినట్లుండుట మొ॥ లక్షణములందు తేనెతో వాడిన ఉపయోగకరము.

పథ్యము : పాతబియ్యము, ఎర్రబియ్యము, గోధుమలు, పెసర, కందిపప్పు, వీని కట్లు, కాచి, చల్లార్చిన నీరు, శర్కర, తేనె, పొట్లకాయ, బీరకాయ.

అపథ్యము : పెరుగు, పులుపు, కారము, చేపలు, గొఱ్ఱెపాలు, ఉలవలు, క్రొత్త బియ్యము.

అనుపానము : 1 గ్రాము తేనె, 3 గ్రా. ఆవునెయ్యి, దానిమ్మపండ్లు,దానిమ్మ రసము.

మోతాదు : 2 మాత్రల చొప్పున రోజుకు రెండుసార్లు సేవించవలెను.

లభ్యము : 20, 40 మాత్రలు.

## శ్వాస చింతామణి రస

ద్రవ్యములు : లోహభస్మం, శుద్ధగంధకం, అభ్రకభస్మం, శుద్ధ పాదరసము, స్వర్ణమాక్షిక భస్మం, ముత్యభస్మం, స్వర్ణభస్మం, కంటకారి పుటపక్వ స్వరసం, అల్లపు రసం, మేకపాలు, యష్టిమధు కషాయం.

గుణము : శ్వాస,కాస, యక్ష్మములను హరించును.

అనుభూత ప్రయోగములు : దీర్ఘకాలిక, నవీన శ్వాసరోగముల యందు గుణ కారి. పిల్లలకు కలుగు కోరింత దగ్గునందు ఉపయోగకారి. హృదయజన్య శ్వాసనందు ప్రఖ్యాతి చెందిన ఔషధము.

1. శ్వాసనందు తాళకభస్మము 10గ్రా. యష్టిమధు చూర్ణం 15 గ్రా. కుక్కుటాండ త్వక్ భస్మం 5గ్రా. టంకణ భస్మం 10గ్రా. కలిపి 2గ్రా. చొప్పున తేనెతో తీసుకొనుచూ శ్వాస చింతామణి రస 6 గం॥లకు ఒకటి చొప్పున శ్వాస వేగము ఉధృతముగా ఉన్నపుడు వాడిన అధికప్రయోజనకారి కాగలదు.

2. కాసనందు సితోపలాది చూర్ణం 50 గ్రా. శృంగి భస్మం 10 గ్రా. అశ్వగంధ చూర్ణం 50 గ్రా. కలిపి 2 గ్రా. చొప్పున ద్రాక్షారిష్టతో సేవిస్తూ, భోజనానంతరము శ్వాస చింతామణి రస పగలు ఒకటి, రాత్రి ఒకటి వేసుకొనిన గుణకారి.

3. యక్ష్మనందు ద్రాక్షారిష్ట, అర్జునారిష్టలతో వాడిన హృదయ, శ్వాసకోశములకు బలము కలుగుటయేకాక శ్వాస,కాసలను బాగుగా నిరోధించును.

పథ్యము : కుందేలు, నెమలి, చిలుక, నిర్జల ప్రదేశమృగములు, పక్షులు, వీని మాంసము, మేకమాంసము,తేనె, బీరకాయ, వెల్లుల్లి, ఉ ష్ణోదకము.

అపథ్యము : వాతకర, శ్లేష్మకర అన్నపానములు, చేపలు, కంద, ఆవాలు, చల్లని గాలి, మంచు.

మోతాదు : ఒక మాత్ర చొప్పున రోజుకు రెండు లేదా మూడుసార్లు తానికాయ చూర్ణము, తేనెలతో కలిపి తీసుకొనవలెను.

లభ్యము : 20,40 మాత్రలు.

## శ్వాస కాళేశ్వర రసము

ఇది అల్లపు రసముతో పంచకాసలు, శ్వాస, క్షయ, శ్లేష్మ వ్యాధులు, అజీర్ణము, అగ్ని మాంద్యము, మలబంధము, మొదలగు వానిని నశింపజేయును. శ్వాసలకు దీనిని ప్రధానముగ వాడెదరు. మోతాదు 1/4 మొ. 3/4 చి. వరకు.

## శ్వాసకుఠార రస

ద్రవ్యములు:శుద్ధ రసం, శుద్ధ గంధకం, శుద్ధ వత్సనాభి, శుద్ధ టంకణము, శుద్ధ మణిశిల, నల్ల మిరియాలు, శొంఠి, మిరియాలు, పిప్పళ్లు.

గుణము : వాత, కఫ, ప్రకోపముల వలన ఉత్పన్నమైన శ్వాస, కాస, స్వరక్షయ ములను హరించును.

దీనిని 1. తమలపాకుల రసముతో శ్వాస, కాస, అగ్నిమాంద్యము, వాత వ్యాధులు, శ్లేష్మవ్యాధులు 2. అల్లపురసముతో గుండెవ్యాధులు, అజీర్ణము సన్నిపాత జ్వరము, తిమ్మెర్లు, వాంతి, వీనియందియ్యవలయును. సన్నిపాతము, మూర్ఛ, అప స్మారము, వీనియందు స్పృహతప్పినప్పుడు దీనిని నస్యము చేయవలసినదిగా శాస్త్రము నందు చెప్పబడినది. మోతాదు 1/4 మొ. 3/4 చి. వరకు.

అనుభూత ప్రయోగములు : దీర్ఘకాలికశ్వాస, కాసలు, ఇస్నోఫీలియాలందు బాగుగా పనిచేయును.

1. తామ్రభస్మముతో వాడిన, రక్త క్షయము, ఆమ్లపిత్తము తగ్గి, శ్వాసకాసలు తగ్గుముఖం పట్టును.

2. ముత్యభస్మంతో వాడిన, శ్వాసకాసజనిత తాపము తగ్గి, క్షయ, కాసలు తగ్గును.

3. తమకశ్వాసయందు కనకాసవతో వాడిన అధిక ప్రయోజనకారి కాగలదు.

పథ్యము : పాలపిట్ట, తిత్తిరి, లావుకపిట్ట వీని మాంసము, పొట్లకాయ, దొండ కాయ, ద్రాక్షపండ్లు

అపథ్యము : చలి అన్నము,కొత్త బియ్యపు అన్నము, చల్లని నీరు, గొఱ్ఱెనెయ్యి, చల్లని గాలి.

మోతాదు : 1-2 మాత్రల చొప్పున రోజుకు రెండు లేదా మూడుసార్లు అల్లపు రసము లేదా తేనెతో మర్దించి సేవించవలెను.

లభ్యము : 20,40

## శీతాంశురస

ద్రవ్యములు : శుద్ధ మణిశిల, శుద్ధ తాళకము, త్రికటుకములు

గుణము : శీతజ్వరములు, సన్నిపాత పాండువు, కామిల, ఐదు గుల్మములు, సమస్త కాస శ్వాసలు, ఉదరరోగ పూర్వరూపములు, సన్నిపాతములు, వాంతి, 80 వాతములు, 40 పిత్తరోగములు, శూల, శూక రోగము, పరిణామశూల, నాభికుక్షుల యందు జనించెడు బల్లలు, కడుపుబ్బరము, అనాహవాతము, విష్టంభము, తాపము, సర్వాంగముల దాహము, స్థావర, జంగమ విషములు,ఎక్కిళ్లు, అగ్నిమాంద్యము, శోఫ, భ్రమ, తిమ్మిరి, మూర్ఛ, తిమిర రోగము హరించును.

వేపాకు రసముతో చాది, లేపనము చేసిన గజచర్మము, విసర్పి, మండల కుష్ఠము, శరీరమున పొట్టువలె చర్మము ఊడు రోగము హరించును. గ్రంధులు, అర్బుధములందు ఉపయోగకారి. వేపరసముతో నూరి దంతరోగములందు లేపనము చేసినదంత, జిహ్వా, నేత్ర రోగములు హరించును. అల్లపు రసముతో సేవించిన 13 సన్నిపాతములు, సప్తవిధ దోషములు, కామిల, ధనుర్వాతము, భూత చేష్టలను హరిం చును.

ఇది 1. అల్లపురసముతో శీతపైత్య జ్వరములు, పైత్యజ్వరములు, సన్నిపాత జ్వరములు, దోషజ్వరములు, ఏకాహిక ద్వ్యాహిక త్ర్యాహిక చాతుర్థిక జ్వరములు, 2. తేనెతో దగ్గు, ఆయాసము, శ్లేష్మ జ్వరము వీనిని వెంటనే నిశ్చయముగ హరింప జేయును. దోషజ్వరములు, జలుబు, శిరోభారము మొదలగు వానియందు నీటితో గాని, తేనెతోగాని అరగదీసి కంటిలో కలికముగ నుపయోగింపవచ్చును.

అనుభూత ప్రయోగములు : 1. మలేరియా (విషమజ్వరము) నందు మృత్యుం జయరసతో వాడుతూ, ఆరుగంటలకొక పర్యాయము ఉ శీరాసవము, అమృతారిష్ట రెండురెండు చెంచాల చొప్పున కలిపి తీసుకొన్న శమించును.

పథ్యము : బీర, పొట్లకాయ, పలుచనిపాలు, గోధుమరొట్టె, బియ్యము వేయించి, విసరి జావ, గోధుమ నూకల జావ, బార్లీ గింజల గంజి మొదలగు తేలికగా జీర్ణ మగు ఆహారము, కాచి చల్లార్చిన నీటిని సేవించవలెను.

అపథ్యము : శీతలకర ఫలములు, పాలు, నెయ్యి, మాంసము, చేపలు, దుంపలు, పుష్టికర, విదాహకర, గురుత్వ పదార్థములు.

అనుపానము : తేనె, కరక్కాయ చూర్ణము,ఉష్ణోదకము, అల్లపురసము.

మోతాదు : 1-2 మాత్రలు చొప్పున రోజుకు రెండుసార్లు సేవించవలెను.

లభ్యము : 20 మాత్రలు.

## శ్లేష్మ చింతామణి

దీనిని 1. ఆకుజెముడాకుసరముతో గురక, కఫము ఎదుర్కొనుట, ఆయాసము, శ్వాస 2. తమలపాకు రసముతో సన్నిపాత జ్వరము. కఫవ్యాదులు, సూతికావాతము, సూతికాజ్వరము, దోషజ్వరములు, కఫజ్వరములు, విషమజ్వరములు, వీనియందియ్య వలయును. కఫమును వెంటనే ఖండించును. తక్కువ మోతాదులో చంటిపిల్లలకు పై వ్యాధులలో వాడవచ్చును. మోతాదు 1/8 మొ॥ 1/4చి. వరకు.

## శ్లేష్మ విధ్వంసి

దీనిని సెగ లేక అడ్డసరపురసముతో నుపయోగించిన యెడల దగ్గు, ఆయాసము, క్షయ,కాసశ్వాస, శ్లేష్మ ప్రకోపము మొదలగు శ్లేష్మ వ్యాధులు వెంటనే నశించును. మోతాదు 1/4 మొ. 1/2 చి. వరకు.

## సిద్ధమకరధ్వజ

ద్రవ్యములు : శుద్ధపాదరసము, శుద్ధగంధకము,స్వర్ణ భస్మం, భావన, మర్దనలకై ఎర్రపత్తిపూల స్వరసం, తెల్లఅంకోల స్వరసం, కలబంద స్వరసం.

గుణము : సర్వరోగహరము, సన్నిపాతజ్వరము, మందాగ్ని, అరుచి, ఆమశూల, కటిశూల, హృదయశూల, పంక్తిశూల, కాస,శ్వాస, యక్ష్మ, శూల, కుష్ఠము, గళరోగ ములు, అంత్రవృద్ధి, అతిసారము, కఫము, వాతజ, దీర్ఘకాలిక వంశానుగత శ్లీపదము, నాడీవ్రణము, అర్శస్సు, భగందరము, సర్వవిధ వాతరోగములు, వలీపలితములను నశింపజేయును. అగ్ని,బలము వీర్యములను వృద్ధిచేయును. మేధస్సు,

కాంతి,ఆయువు లను వృద్ధిచేయును. కామోద్దీపకము.

అనుభూత ప్రయోగములు : శారీక మానసిక దుర్బలతను పోగొట్టి, నూతన శక్తిని కలిగించును. నాడీమండలమునకు శక్తిని కలిగించును.

1. ఆవునెయ్యితో సేవించుచూ, రత్నపురుష లేహ్యాము యిచ్చిన కామోద్దీపనము కలుగును.

2. వర్ధమాన పిప్పలీ చూర్ణము, అశ్వగంధారిష్టలను కలిపి యిచ్చిన మేథస్సు, ఆయువులను, వృద్ధి చేయును.

3. కుంకుమపువ్వు, ఆమలకీ రసాయనములతో యిచ్చిన వలీ పలితములు నశించును.

పథ్యము : కందిపప్పు, కందకట్టు, పాలు, పెరుగు, వెన్న, మేకమాంసము, మధుర పదార్థములు, నూనె పదార్థములు, వాయువును పెంచని పదార్థములు, పంచదార మొదలగు బలవర్ధక పదార్థములు.

అపథ్యము : ఉష్ణకర, మలబద్ధక పదార్థములు, మిక్కిలి కారముగా నుండు పదార్థములు, ఆవాలు, నువ్వులు.

మోతాదు : 1 మాత్ర చొప్పున రోజుకు రెండుసార్లు ఉదయము, సాయంత్రము పాలతో సేవించవలెను.

లభ్యము : 10 మాత్రలు.

## సింహప్రతీపాలనము

ఇందు గరళమధికముగ కలదు అందుచే బహుతీవ్రముగ పనిచేయును. సన్నిపాత జ్వరము, దోషజ్వరము, సూతికాజ్వరము విషూచి (కలరా) వీనియందు కర పాదశీలమును మగతయు ఏర్పడి నాడి సరగతినున్నపుడు 2 మాత్రలు చొప్పున చనుపాలతో 1-2 రెండు గంటలకొకసారి చొప్పున బాగుగ వేడి వచ్చువరకు నుప యోగింపవలయును. కఫ మెదుర్కొనుచున్నచో తమలపాకులు లేక తులసియాకులు రసముతో ఇయ్యవలయును. దోషజ్వరముల యందు వీనిని కొందరు మొదటి నుండియు కూడ అప్పుడప్పుడు వాడుచుందురు. ఇందు గరళము కలదు. కాన మాత్రను రసములో కలుపునపుడు ఆ వ్రేలికి ఏవిధమగు పుండును వుండకూడదు. ఆ పుండు గుండ గరళము మాత్రకలుపువాని శరీరములోనికెక్కి ప్రమాదము కలిగింప వచ్చును. మోతాదు 1-2 మాత్రలు.

## సువర్ణ భూపతి

ఇందధికమగు బంగారము కలదు. కాన క్షయల యందు అమోఘముగా పని చేయును. 1 వాకుడువేళ్లు, పిప్పళ్లు, రెట్టింపు వీనియొక్క చూర్ణము తేనె వీనితో క్షయలు, దగ్గు, ఆయాసము 2. సమానమగు త్రికటుచూర్ణముతో అజీర్ణము, గుల్మము, తిమ్మెర్లు నంజు, ఆఢ్యవాతము, పంగువాతము, సర్వాంగవాతము, శూలలు, కడుపుబ్బ రము 3. రెట్టింపు కొండపిండిచూర్ణముతో అశ్మరి మూత్రబంధము 4. శొంఠి రసముతో ప్లీహవ్యాదులు, యకృద్వ్యాధులు, ఉదరవ్యాధులు 5 జంబీరాది పానములతో కామెర్లు, కుంభకామిల 6. గుంటగలగర రసముతో పాండువు, శిరోవాతము జీర్ణజ్వరము ఇవి విష్ణు చక్రముచే రాక్షములువలె నశించును. మోతాదు 1/4 చి. మొ॥ 1/2చి.వరకు.

## సువర్ణ కాంతవల్లభ రసము

గుణములు, అనుపానములు, మొదలగువానికి కాంతవల్లభరసమునకు వలెనే చూచుకొనుడు. ఇందు బంగారము,వెండి,తామ్రము మొదలగునవి కలయుటచే కాంతవల్లభరసము కంటే బహుచురుకుగ సమముగ పనిచేయును.

## సువర్ణక్రవ్యాది

ఇందు సువర్ణభస్మము మొదలగు కొన్ని భస్మములు అధికముగ కలియుటచే కొంత అధికముగ పనిచేయును. గుణములు, అనుపానములు, మొదలగువానికి లఘుక్రవ్యాధికి వలెనే తెలిసికొనుడు.

## సువర్ణమాల్యవసంతము

ఇది ఉడుకువలనకలిగిన వ్యాధులనన్నిటిని నశింపజేయునని అందరికిని తెలిసిన విషయమే. 1. రెట్టింపు పిప్పళ్ళచూర్ణము, తేనె వీనితో క్షయ, దగ్గు, ఆయాసము, జీర్ణ జ్వరము, ధాతుగతజ్వరము, జీర్ణాతిసారము 2. రెట్టింపు ఉసిరికపప్పు చూర్ణము, వెన్న, వీనితో రక్తాతిసారము, రక్తార్శస్సు, రక్తదోషములు, పైత్యవ్యాధులు, ప్రదరములు, నేత్రవ్యాధులు 3. తెక్కలి పుష్పరసముతో గర్భిణీ స్త్రీలకు కలుగు సమస్త వ్యాధులు 4. తేనెతో పసిపిల్లలకు కలుగు సమస్త ఉడుకు వ్యాధులు, వీనిని హరింపజేయును. గర్భమునకు బలమునిచ్చును. శరీరపుష్టిని, శరీరకాంతిని, ఇంద్రియబలమును చేయును, శుక్రమును చిక్కపరచును. పాలు

చిలకగవచ్చిన వెన్నతో దీనిని వాడుట శ్రేష్ఠము. మోతాదు 1/4 చి. మొ॥ 1/2 చి. వరకు.

## సువర్ణ మేహవంగరాజీయము

స్వర్ణవంగమునకు గాని మేహవంగ రాజీయమునకుగాని రజితమేహవంగ రాజీయమునకు గాని చెప్ప బడిన అనుపానములతో ఆయా వ్యాధుల యందు బహు చక్కగ పనిచేయును. సువర్ణము కలయుటచే వీర్యవృద్ధి, నరముల పటుత్వము మొదలగు వానిని కూడ కలిగించును. మరియు క్షయ, అతిమూత్రము మొదలగు వానినికూడ నశింపచేయును. సువర్ణము కలిసిన మందు లభించుట దుర్లభము. మోతాదు 1/4 మొ॥ 1/2 చి. వరకు.

## స్వర్ణసమీర పన్నగ రస (సి.యో.సం)

ద్రవ్యములు : శుద్ధపాదరసము, శుద్ధ గంధకము, శుద్ధ మల్లము, శుద్ధ మణిశిల, శుద్ధతాళకము, శుద్ధ సువర్ణము.

గుణము : సర్వవిధముల వాతరోగముల యందు, విశేషముగ ఆర్దిత, పక్షాఘాత, కటిస్తంభ, పార్శ్వశూలలయందు, కఫాధిక్య తమక శ్వాసనందు, సన్నిపాత జ్వరము నందు ఏర్పడు తంద్ర, ప్రస్వేదము, శరీరముచల్లబడుట మొదలగు వాని యందు అత్యంత లాభకారి. ఫిరంగోపదంశము వలన జనించు వాతరోగమునందు విశేష గుణకారి.

అనుభూత ప్రయోగములు : 1. సన్నిపాతమునందుఏర్పడు తంద్ర, ప్రస్వేదము, శరీరము చల్లబడుట మొదలగు వానియందు చందనాది వటి, చందనానవలను కూడా కలిసి వాడిన ఉపశమనము కల్గును.

2. ఫిరంగోపదంశమునందు గనోప్రభతో ఇచ్చుచూ, అనుపానముగా సరస, పంచతిక్తారిష్టలను కలిపి యిచ్చుచూ, చ్యవన ప్రాశలేహ్యము యిచ్చిన వ్రణములు మానును.

3. ఆర్దిత వాతమునందు లశునాది వటితో యిచ్చుచూ, ఇంజక్షన్ లహసాన్ 1 మి.లీ. మహావాత విధ్వంసిని ఇంజక్షన్ 1మి.లీ. కలిసి కండకు 40 రోజులు యిచ్చిన మూతి వంకర తగ్గును.

పథ్యము : కందిపప్పు, కందికట్టు, ఆవుమజ్జిగ, ఆవునెయ్యి, బీరకాయ, పొట్ల కాయ, మేకమాంసము.

అపథ్యము : ఉలవలు, పులుసు, పెరుగు, కోడిమాంసము, ఆవాలు;

సంభోగము.

అనుపానము : అల్లపు రసము, తేనె

మోతాదు : 1 మాత్ర చొప్పున రోజున కొకసారి సేవించవలెను.

లభ్యము : 10 మాత్రలు.

## సువర్ణ సూర్యావర్తి

ద్రవ్యములు : అభ్రకభస్మం, హేమమాక్షికభస్మం, టంకణ భస్మం, శంఖభస్మం, ఇంగిలీకము, తిప్పసత్తు, లవంగములు. కాకిదొండవిత్తులలోని పప్పు, ముత్యభస్మం, పమిడి ప్రత్తివిత్తులపప్పు, కాసీసము, వైక్రాంతము, రససింధూరము, త్రికటుకములు, నాగ కేసరములు.

గుణము : రసాయనము, దీపనము, పైత్యరోగములు, వాతపైత్య రోగములు, ఆమ్లపైత్యము, సామాన్యమైన త్రిదోషవికారములు, గర్భిణులకు కలుగు వాంతి వికార ములను హరించును.

ఎక్కిళ్లు, వాంతులు, శ్వాస, కాసలు, అజీర్తి, నోటిపూత, పాండువు, కామిల, ఉన్మాదము, మూర్ఛ, అపస్మారము, మూత్రకృచ్ఛ్రము, సామాన్య జ్వరములు, ప్రమే హము, అశ్మరివ్యాధి, చేతులు, కాళ్ళు మంటలు మొదలగు వానిని నివారించును.

ఇందు కస్తూరియు బంగారమును చేరియున్నవి. అందుచే పై లక్షణముల యందు పై అనుపానములతో బహుచక్కగను చురుకుగను, పనిచేయును. కాని పై లక్షణములు మేహవాతములచేగాని వాతపిత్తములచేగాని కలిగినప్పుడే బహు చక్కగ పనిచేయును. మోతాదు 1/4 చి. మొ. 1/2 చి. వరకు.

అనుభూత ప్రయోగములు : 1. పైత్యరోగములందు మాదీఫల రసాయనముతో ఇచ్చిన ఉపశమనము పొందవచ్చును.

2. ఆమ్లపిత్తమునందు అల్లపురసము, భాస్కర లవణములతో ఇచ్చిన పులి త్రేన్పులు తగ్గును.

3. నోటిపూత యందు ఖదిరాదివటితో ఇచ్చిన ఫలప్రదము.

పథ్యము : కందిపప్పు, గోధుమలు, తేనె, ముదురు గుమ్మడికాయ, పొట్లకాయ, బీరకాయ.

అపథ్యము : మద్యము,చేపలు, నూనె, ఉలవలు.

మోతాదు : ఒకమాత్ర చొప్పున రోజుకు రెండుసార్లు సేవించవలెను.

లభ్యము : 20,40 మాత్రలు

## స్వచ్ఛన్నము

ఇది 1. తమలపాకురసముతో లేక తులసియాకు రసముతో చంటిపిల్లలకు కలుగు జలుబు, దగ్గు, జ్వరము, కడుపుబ్బరము, వాంతి, అజీర్ణము, విరేచనములు, ఎగరొప్పు 2. తుమ్మిపువ్వులరసముతో లేక అల్లపురసముతో విషూచి (కలరా) సన్నిపాత జ్వరము, విషజ్వరము, జలుబు, దగ్గు, జ్వరములు 3. శుంఠిరసము, తేనె వీనితో అజీర్ణము, అతిసారము, వాంతులు, శిరోవ్యాధులు, వీనిని నశింపజేయును. మోతాదు 1/2 చి. మొ॥ 1 చి. వరకు.

## స్వర్ణవంగము (హేమసుందర రసము)(ర.సి.ప్ర)

ద్రవ్యములు : శుద్ధ పాదరసము, శుద్ధ గంధకము, శుద్ధ వంగము, నవాసాగరము

గుణము : బల్యము,ప్రమేహహరము, తేజస్సు, మేధస్సు, అగ్నిలను పెంపొం దించును. మధుమేహము, ప్రమేహము, స్వప్నదోషములు, కాస, ధాతు క్షీణత మొద లగు వానిని నశింపజేసి, శరీరమునకు బలమును చేకూర్చును. పొడి దగ్గును హరిం చును. మందాగ్ని, యకృత్ దోషము, మూత్రకృచ్ఛ్రములను హరించును. వంగ సింధూరము, వెన్నలతో యిచ్చిన శ్వాస,కాసహరము.

జీర్ణపూయమేహము, పూయమేహయుక్త ఉపదంశము, ఉపదంశ దంతవేష్ఠము, నపుంసకత్వము, చర్మరోగములను హరించును. రక్తమునందలి విషపదార్థములను మూత్రము ద్వారా వెడలించును. సంధివాతము, ఆమవాతము, పిత్తప్రధాన కాస, శుష్కకాస, కంఠదాహము లను నశింపజేయును. వాతపిత్త దోషములను, రక్తమాంస దూష్యములను నశింపజేయును. మూత్రేంద్రియ, జననేంద్రియ, వృక్కస్థానములందు ఉపయోగమును చేకూర్చును.

సమస్త మేహములు, మూత్ర కృచ్ఛ్రము, శుక్రమేహము, శ్వేతప్రదరము, రక్త ప్రదరము, పైత్య వ్యాధులు, కాళ్లు, చేతల మంటలు, నోటిపూత, శరీరమునందు మంట, కండ్లనందు మంట మొదలగు వానిని హరించును.

ఇది 1. చలవమిరియాలు, సుగంధిపాలపొట్టు, ఏలక్కాయలు,

దాసెనచెక్క, వీనియొక్క మూడురెట్ల చూర్ణము పంచదార వీనితో సెగవ్యాధులు, మూత్ర నాళమందలి మంట, పొడిదగ్గు, ఆయాసము. 2. చందనంపొట్టు, వట్టివేళ్ళు వీనియొక్క రెట్టింపు చూర్ణము, వెన్న వీనితో శరీరతాపము, కాళ్లు చేతులు మంటలు, కండ్లు మంటలు, శుక్లనష్టము, ఇరువది ప్రమేహములు 3. ఉసిరికపప్పు, వట్టివేళ్లు, కర్పూర శిలాజితు భస్మము వీనియొక్క మూడురెట్ల చూర్ణము పంచదార వీనితో నోటిపూత, రక్తవమనము, పైత్యవ్యాధులు, దప్పిక 4. లొద్దుగచెక్క, మంజిష్ట, వీని యొక్క రెట్టింపు చూర్ణము చిర్రకూర రసము వీనితో ప్రదరవ్యాధులు, యోనిశూల గర్భస్రావములు, గుండెదడ, బలహీనత,నడుమునొప్పులు, కాళ్ళులాగుట, సోమరోగము, వీనిని కడు శీఘ్రముగ హరింపజేయుటలో ఎంతమాత్రము సందేహములేదు. దీనియొక్క గుణములు అందరికిని తెలియును. గాన ఇంతకంటే వ్రాయలేదు. కొందరు చర్మ వ్యాధు లకును రక్తవ్యాధులకును కూడ వాడెదరు.

అనుభూత ప్రయోగములు : 1. నేలవేము, అశ్వగంధ, నేరేడు విత్తుల చూర్ణము, మెంతుల చూర్ణము ఒక్కొక్కటి 25గ్రా. చొప్పున కలిపి, అందు 100 గ్రా. స్వర్ణవంగ మును కలిపి, ఆమలకీ స్వరసము అనుపానముగా యిచ్చిన మధుమేహము తగ్గును.

2. ధాతు క్షీణతనందు శతావరీ చూర్ణము, అశ్వగంధ చూర్ణము, అభ్రక భస్మము ఒక్కొక్కటి 25గ్రా. చొప్పున తీసుకుని దానికి 10 గ్రా. స్వర్ణ వంగము కలిపి రోజుకు రెండుసార్లు 1 గ్రా. చొప్పున భోజనానంతరము పాలు లేదా తేనెతో తీసుకొనిన, ధాతు వృద్ధి నొందును.

3. మూత్రకృచ్ఛ్రము నందు చందనాసవ, ఉశీరాసవలను అనుపానముగా స్వర్ణ వంగమునకు యిచ్చుచున్న మూత్రము యొక్క విబంధత తొలగి,సాఫీగా జారీ అగును.

పథ్యము : అల్లము, తియ్యని పదార్థములు, పల్లేరుకూర, కొండపిండి ఆకుకూర, ఖర్జూరము, తాటి ముంజులు

అపథ్యము : మలబద్ధకర పదార్థములు, తాంబూలము, మత్స్యములు, నూనె.

మోతాదు : 1 మాత్ర చొప్పున రోజునకొకసారి వెన్నతో సేవించవలెను.

లభ్యము : 20,40 మాత్రలు.

## తారకేశ్వర రస (బ.రా)

ద్రవ్యములు : రసభస్మము, వంగభస్మము, లోహభస్మము, అభ్రక భస్మము.

గుణము : బహుమూత్రమును హరించును. రసాయనము, దీపనము, ప్రమేహ హరము.

అనుభూత ప్రయోగములు : 1. మధుమేహమునందు రెండు చెంచాల మెంతు లను (దోరగా వేయించినవి) పుల్లటి పెరుగునందు 1 గంట నానబెట్టి భోజనాంతరము పగలు,రాత్రి తీసుకొనుచూ, తారకేశ్వర రస మాత్రలు ఉదయము రెండు, రాత్రి రెండు తీసుకొనిన మధుమేహమేకాక ఉపద్రవములను కూడా హరించును.

2. మేహ జనిత చర్మరోగములందు త్రివంగ భస్మము, అభ్రక భస్మము, శతావరీ చూర్ణము, మహా ద్రాక్షాది చూర్ణం, సుదర్శన చూర్ణములను ఆమలకీ స్వరసముతో తీసుకొనుచూ, తారకేశ్వర రసము వాడిన దురద తగ్గి క్రమముగా చర్మరోగము నశించును.

3. మధుమేహజనిత స్పర్శనాశనమునందు క్షీరబలా తైలముతో మర్దన చేయుచూ, తారకేశ్వర రస వాడిన స్పర్శ తిరిగి వచ్చును.

పథ్యము : పెసలు, ఉసిరిక పప్పుల కట్టును మజ్జిగతో కలిపి సేవించవలెను. పాత బియ్యము, గోధుమలు, పాతవియగు చింత, నిమ్మ, పుల్లదబ్బ, నారదబ్బ, ఉసిరికాయ, పచ్చళ్లు, ఆకుకూరలు, ఉసిరికాయ, కాకరకాయ, చేదుగల పదార్థములు, వ్యాయామము, అభ్యంగనము.

అపథ్యము : బెల్లము, తీపి పదార్థములు, చేపలు, పనసపండ్లు, దుంపకూరలు, నెయ్యి, నిద్ర, జాగరణము, ఎండ, ఆకలిని ఆపుట.

అనుపానము : మేడిపండ్ల చూర్ణము, తేనె.

మోతాదు : ఒకమాత్ర చొప్పున రోజుకు రెండు లేదా మూడుసార్లు సేవించవలెను.

లభ్యము : 20,40 మాత్రలు

## తామ్రలోహ రసాయనము

దీనిని 1. గంటుభారంగి, పిప్పళ్లు, లవంగాలు, మోడి వీనియొక్క కషాయముతో శ్లేష్మ సంబంధమగు దగ్గు, ఆయాసము, క్షయ, శ్లేష్మ వ్యాధులు, శ్లేష్మ ప్రకోపము 2.రెట్టింపు ఫిరంగిచెక్క చూర్ణముతో కుష్ఠములు,

చర్మవ్యాధులు, వాత వ్యాధులు 3. సోపు, మిరియాలు,ఉత్తరేణి వేళ్ళు వీనియొక్క కషాయముతో అజీర్ణము, శూల, కడుపుబ్బరము 4. తేనెతో పాండువు, కామిర్లు, నంజు, తిమ్మిర్లు, ఉదరము, వీని యందియ్యవలయును. మోతాదు 1/4 మొ. 1/2 చి. వరకు.

## తిప్పసత్తు

మోతాదు 1/2 మొ॥ 1 చిన్నము వరకు పంచదారతో సేవించిన యెడల శరీర తాపము, నోటిపూత, ప్రదరవ్యాధులు, మేహవ్యాధులు, కాళ్ళు చేతులు మంట, దగ్గు, పైత్యవ్యాధులు మొదలగునవి హరించును. వంగ భస్మమును సగము పరిమితిగ కలిపి వెన్నతో సేవించిన యెడల మధుమేహమును, అతిమూత్రమును, సగము పరిమితిగల కాంతలోహమును రెట్టింపు త్రిఫలాచూర్ణమును కలిపి వేడినీటితో సేవించిన యెడల జీర్ణ జ్వరమును హరించును.

## త్రిభువన కీర్తి రస

ద్రవ్యములు : శుద్ధ ఇంగిలీకము, శుద్ధ వత్సనాభి, త్రికటుకములు, శుద్ధ టంకణము, పిప్పలీ మూలము, మర్దన కొరకు అల్లపురసము,తులసి, ఉమ్మెత్త ఆకుల రసము.

గుణము : అనుపాన భేదముచే సర్వవిధ తరుణ జ్వరములను హరించును. వాత, కఫ,ప్రదాన, జ్వరములందు విశేష గుణకారి.

అనుభూత ప్రయోగములు : ఇది ఉష్ణవీర్యము కలిగిన జ్వరహర ఔషధము, జ్వరతీవ్రతను తగ్గించి, హృదయగతిని క్రమము చేయును. ఇన్ఫ్లూయెంజా జ్వరము, నాడీ గతులను నియంత్రణ చేయును. స్వేదనమును కల్గించుట ద్వారా జ్వరమును అత్యుత్తమముగా తగ్గించును. ఒడలు నొప్పులు, తీవ్రజ్వరము, జలుబు, దగ్గు,గొంతు నొప్పి, పొడి దగ్గులయందు విశేష గుణకారి.

1. కఫాధిక్యత వలన కలిగే పీనస, ప్రతిశ్యాయమునందు దశమూలారిష్ట అనుపానముగా నిచ్చిన కఫాధిక్యత.

2. శ్లేష్మక జ్వరమునందు త్రికటు చూర్ణముతో ఇచ్చిన జ్వరము తగ్గి ఆకలి పుట్టును.

3. విషమ జ్వరమునందు సింకోనాబెరడుతో వాడిన జ్వర వేగము నశించును.

పథ్యము : బీరకాయ, పొట్లకాయ, పలుచనిపాలు, గోధుమరొట్టె, బియ్యము వేయించి, విసిరి చేసిన జావ, బార్లీ నీరు మొదలగు తేలికగా జీర్ణమగు ఆహారము, కాచిచల్లార్చిన నీటిని సేవించవలెను.

అపథ్యము : పాలు,నెయ్యి, మాంసము, పుష్టికర, విదాహకర, గురుత్వకర పదార్ధములు, చేపలు, దుంపకూరలు

అనుపానము : అల్లపురసము, తేనెలతోగాని, తులసి, బిల్వపత్రముల ఫాంట ముతోగాని, ఇతర జ్వరఘ్న క్వాథముతోగాని సేవించవలెను.

మోతాదు : 1 –2 మాత్రలు రోజుకు రెండుసార్లు సేవించవలెను.

లభ్యము : 20 మాత్రలు.

## త్రైలోక్య చింతామణి

దీనియొక్క మహామహిమ అందరికిని తెలిసినదే. అమోఘముగా పనిచేయును. దీనిని తేనెతో గాని అల్లపు రసముతోగాని శొంఠిరసముతోగాని సేవించినయెడల శ్లేష్మము ఎదుర్కొనుట, ఎగవూపిరి, ఆయాసము, నాడిసన్నగిల్లుట, శీతలముక్రమ్ముట మొదలగు లక్షణములను వెంటనే తగ్గించి ఎట్టి అపాయ స్థితిలోనున్న రోగినైనను జీవింపచేయును. మరియు దగ్గు, శ్లేష్మవ్యాధులు, క్షయ, సూతికావ్యాధులు, దోషజ్వరములు, వాత వ్యాధులు, బలహీనత, అజీర్ణము, అగ్నిమాంద్యము, గుండె వ్యాధులు, మొదలగువానిని కూడ వెంటనే నశింపచేయును. మోతాదు 1/2 మొ.

## ఉన్మాద గజకేసరి (భై.ర.)

ద్రవ్యములు : శుద్ధ రసము, శుద్ధ గంధకము, శుద్ధ మణిశిల, శుద్ధ దత్తూర బీజములు, వచస్వరసము, బ్రాహ్మీస్వరసము

గుణము : ఉన్మాదము, అపస్మారము, భూతోన్మాదము, జ్వరములను నశింప జేయును.

అనుభూత ప్రయోగములు : కఫజన్య మస్తిష్క వికృతులు, అతినిద్ర, తంద్రల యందు గుణకారి.

1. ఉన్మాదమునందు సర్పగంధ ఇంజక్షన్ రోజునకు ఒకసారి ఇచ్చుచూ, బ్రాహ్మీ వటి, ఉన్మాద గజకేసరిలను ఒక్కొక్కటి చొప్పున భోజనానంతరము పగలు,రాత్రి 4 చెంచాల నెర్విటాల్‌తో సేవించవచ్చును.

2. అపస్మారమునందు రసరాజరస, అశ్వగంధ లేహ్యాము,

నెర్విలాట్‌లతో వాడిన (40 రోజులు) అపస్మారజనిత బలహీనతలందు ఉన్మాదగజకేసరి, మకరధ్వజ వటిలకు, జంబీర రసాయనము అనుపానముగా యిచ్చిన దౌర్బల్యము నశించును.

3. ఉన్మాద, అపస్మార జనిత బలహీనతలందు ఉన్మాదగజకేసరి, మకరధ్వజ వటిలకు, జంబీర రసాయనము అనుపానముగా యిచ్చిన దౌర్బల్యము నశించును.

పథ్యము : ఎర్రబియ్యము, గోధుమలు, అపుడే కాచిన నెయ్యి, ఉ సిరికాయ, వెలగపండు, దానిమ్మ, పనసపండ్లు, చన్నీటి స్నానము.

అపథ్యము : చేదు పదార్థములు, కారపు పదార్థములు, గంజాయి, అతి సంభా షణము, వేగనిరోధము.

మోతాదు : 1-2 మాత్రలు చొప్పున రోజుకు రెండుసార్లు ఆవుపాలతో సేవించ వలెను.

లభ్యము : 20,40 మాత్రలు

## వంటబాలసూర్యోదయము

ఇది ఉడుకు వ్యాధులను ప్రదరవ్యాధులను హరింపచేయుటలో శ్రేష్ఠమైనది. 1.పిప్పళ్లు,జీలకర్ర, వీనియొక్క రెట్టింపు చూర్ణముతో జీర్ణజ్వరములు, పురాణ జ్వర ములు, దగ్గు, ఆయాసము, పైత్యవ్యాధులు, శ్లేష్మ వుడుకు వ్యాధులు 2. మేడిచెక్క, త్రిఫలములు, వీనియొక్క రెట్టింపు చూర్ణము పంచదార వీనితో నోటిపూత, సమస్త మగు ప్రదర వ్యాధులు, యోనిదోషములు, మూత్రకృచ్ఛ్రము, శుక్లస్రావము, మధు మేహము, శుష్కించుట శరీరమెల్లపుడు వెచ్చగనుండుట, బలహీనత కాళ్ళులాగుట, నడుమునొప్పులు, కాళ్ళు చేతులు మంటలు. 3. ఎండు ఖర్జూరపు కాయల రసముతో బాలురకు కలుగు ఉడుకు వ్యాధులు. వీనిని వెంటనే హరింపజేయును.

మోతాదు 1/4 చి. మొ॥ 1/2 చి. వరకు.

## వసంత కుసుమాకరము (బ.రా.)

ద్రవ్యములు : సువర్ణభస్మము, రజతభస్మము, వంగభస్మము, సీసభస్మము కాంత లోహభస్మము, రసభస్మము, అభ్రకభస్మము, పగడభస్మము, ముత్యపు భస్మము, ఆవు పాలు, చెరకు, కషాయము,

అడ్డసరము, కషాయము, చందనము, వట్టివేరు, కురు వేరు, పసుపు వీని కషాయములు, కస్తూరి.

గుణము : మేహము, వృద్ధాప్యము, క్షయ, కాస, దప్పి, ఉన్మాదము, శ్వాస, రక్త విష దోషములు, పాండువులు, శూలలు, మూత్రాఘాతము, అశ్మరీ రోగములను హరింపజేయును. కామసుఖము, పుష్టి, వీర్యవృద్ధి, ఆయుర్వృద్ధి, ప్రజోత్పత్తి, కాంతి, బలములను కలుగుజేయును. పంచదార, చందనముల అనుపానముతో సేవించిన ఆమ్ల పిత్తాది రోగములను హరించును.

అనుభూత ప్రయోగములు : 1.మధుమేహము వలన కలిగే ఉప ద్రవములైన స్పర్శనాశనమునందు సర్పగంధ చూర్ణము, గోమూత్ర శిలాజిత్ కలిపి ఇచ్చిన ఉప కారి.

2. చర్మ వ్యాధులందు గంధక రసాయనము వాడుతూ, తువరక లేపము పై పూతగా వాడవలెను.

3. వాజీకరణముగా ఉపయోగించవలెను. వర్ధమాన పిప్పలితో వాడిన అధిక లాభకారి.

4. రక్తము నందలి చక్కెర నియంత్రణలో ఉండవలెనన్న తారకేశ్వర రసము, బహుమూత్రాంతక రసములతో వాడవచ్చును.

పథ్యము : పాతబియ్యము, పెసరపప్పు, పాత కందిపప్పు, శనగపప్పు, లేతకోడి, మేకమాంసములు, మాంసరసము, లేత మునగకూర, మెంతికూర, మీగడతీసిన పాలు, ఆవుమజ్జిగ, ఆవునెయ్యి, ఉసిరికాయ.

అపథ్యము : శ్లేష్మ వృద్ధికర పదార్థములు,నీటి ఒడ్డున నివసించు మృగ, పక్షి మాంసములు, ఎండు, పచ్చి చేపలు, బెల్లము, పంచదారలను సేవించరాదు. సోమరి తనము పనికి రాదు. ఆకలిని ఆపరాదు.

మోతాదు : ఒక మాత్ర చొప్పున ఉదయము, సాయంత్రము సేవించవలెను.

లభ్యము : 20,40 మాత్రలు.

## వంగేశ్వర రసము

ఇది 1. రెట్టింపు తంగేడు పువ్వుల చూర్ణము, పంచదార వీనితో శు క్లనష్టము, పొడిదగ్గు, గుండెదడ 2. సమానమగు తిప్పసత్తు, వెన్న వీనితో శ్వేతప్రదరము, రక్త ప్రదరము, యోనిస్రావము, రక్తార్శసు,

మూత్రకృచ్ఛ్రము, అతిమూత్రము, మధు మేహము 3. బూరుగబంక, పెన్నేరు, పల్లేరువిత్తులు, నేలతాడి దూలగొండి విత్తులు, అతిమధురము వీనియొక్క మూడురెట్ల చూర్ణము పంచదార వీనితో శుక్రము నీరు వలె పలచగ నుండుట, శీఘ్రస్ఖలనము, ఉత్థాపనశక్తి సరిగ లేకుండుట, మొదలగు వానిని నశింపచేయును. మోతాదు 1/4 మొ॥ 3/4 చి.వరకు.

## వైష్ణవీ రసము

ఇది 1. అల్లపురసముతో సమస్త జ్వరములు పైత్యజ్వరములు, ధ్వంద్వజ్వరములు, సన్నిపాత జ్వరములు, విషమ జ్వరములు, పురాణ జ్వరములు, 2. తేనెతో జ్వరము నందు విరేచనములగు చుండుట, చంటిపిల్లల సమస్త జ్వరములు, వీనిని వెంటనే ఖండించును. మోతాదు 1/2 చి. మొ॥ 1 చి. వరకు.

## వాతాగ్ని కుమారము

దీనిని 1. రెట్టింపు మిరియాల చూర్ణముతో జీర్ణజ్వరము, దగ్గు, ఆయాసము, క్షయ, శ్లేష్మ వ్యాధులు, శ్లేష్మ జ్వరము 2. తుమ్మిపువ్వుల రసముతో శీతజ్వరము 3. తమలపాకు రసముతో అపబాహుకము, సర్వాంగవాతము, గృధ్రసీవాతము మొద లగు వాత వ్యాధులు 4. రెట్టింపు వాకుచీ చూర్ణముతో సమస్తమగు కుష్ఠములు, సప్తమగు చర్మవ్యాధులు మొదలగు వానియందియ్యవలయును. రక్తశుద్ధిని చేయును. మోతాదు 1/4 మొ॥ 1/2 వరకు.

## వాత గజాంకుశ రస (బ.రా.)

ద్రవ్యములు : శుద్ధపాదరసము, శుద్ధ విషముష్టి గింజలు, శుద్ధ గంధకము, త్రికటుకములు, త్రిఫలములు, నిమ్మపండ్లరసము.

గుణము : ఊరుస్తంభవాతము మొదలగు ఎనుబది వాతములు హరించును.

ఇందు ముషిణిగింజలు కలియును, కావున అనేక వ్యాధుల మీద పనిచేయును. దీనిని నూరి పొట్లములు కట్టి 1 తేనెతో సేవించిన యెడల ఊరుస్తంభము, కంపవాత ములును గుండె వ్యాధులును నరముల బలహీనతయు 2 శొంఠిరసముతో జీర్ణము, మలబంధము, ఆకలిసరిగ లేకపోవుట, మొదలగునవియు నశించును. మాత్రలుకట్టి వేడి నీటితోకూడ నుపయోగింపవచ్చును.

మోతాదు 1/4 చి. మొ।। 1 చి. వరకు.

అనుభూత ప్రయోగములు : నరములకు బలమునిచ్చును. చచ్చువాతము, ఊరుస్తంభము, సంధివాతము, ఆమవాతము మున్నగు వాత రోగములను నశింప జేయుటకు దివ్యౌషధము.

1. పీడతో కూడిన పక్షాఘాతమందు మహావాత రాక్షసముతో కలిపి భోజనానంత రము పగలు, సాయంత్రము అశ్వగంధారిష్ట, దశమూలారిష్టలు అనుపానముతో వాడిన పీడ శమించును.

2. తిమ్మిర్లనందు అభ్యంగనమునకు క్షీరబలాతైలము వాడుచూ, భోజనానంత రము అశ్వగంధ చూర్ణముతో వాడిన తగ్గును.

3. అనేక రకములైన వాతరోగములందు లహసాన్ ఇంజక్షన్‌తో లక్షణాను సారముగా వాడిన, శక్తివంతముగా పనిచేయును.

పథ్యము : గోధుమరొట్టె, గోధుమజావ, మేక, పక్షిమాంసములు, లేతవంకాయ, లేత మునగకాయ, వెల్లుల్లి.

అపథ్యము : పెసలు, మినుములు, శనగలు, పెరుగు మీది మీగడ, నేరేడు, ద్రాక్ష.

అనుపానము : నెయ్యి, మిరియపు చూర్ణము.

మోతాదు : ఒకమాత్ర చొప్పున రోజుకు రెండుసార్లు సేవించవలెను.

లభ్యము : 20,40 మాత్రలు.

## వాతకులాంతక రస (ర.సి.ప్ర)

ద్రవ్యములు : కస్తూరి, శుద్ధ మణిశిల, నాగకేసరములు, తానికాయలు, శుద్ధ పాదరసము, శుద్ధగంధకము, జాజికాయ, యాలకులు, లవంగములు.

గుణము : అపస్మారము, యోషాపస్మారము, మూర్ఛ, ఆక్షేపయుక్త వివిధ వాత రోగములు, నిద్రానాశము, ప్రబల హిక్కా, ధనుర్వాతము, సూతికా రోగములు మొదలగు వానిని నశింపజేయును. సన్నిపాత న్యుమోనియా నందు కలుగు బుద్ధిభ్రంశ మూర్ఛాకంపము, ఆక్షేపము, ప్రలాపము మొదలగు ఉపద్రవములను శమింప జేసి రోగికి నిద్రను కలుగజేయుటలో హితకారి మానసిక శాంతిని కలుగుజేయును.

శాస్త్రీయం ప్రయోగములు : 1. మానసిక వికృతి జన్య అపస్మారమునందు అభ్రక భస్మముతో నిచ్చిన అత్యంత లాభదాయకము.

2. పిల్లలకు పాలపండ్లు వచ్చు సమయమున కలుగు తీవ్ర ఆక్షేపము, కంఠము, అమాశయము, అంత్రము, మూత్రనాళము, పిత్తనాళము,పిత్తాశయము మొ.వానికి సంబంధించు రోగములందు అత్యంత ఉపకారి.

అనుభూత ప్రయోగములు : 1. అపస్మారము, యోషాపస్మారము, మూర్ఛలందు రసరాజరస, అశ్వగంధారిష్టలతో వాడుతూ, నెర్విటాల్ రాత్రిపరుండబోవు ముందు నాలుగు చెంచాలు త్రాగిన క్రమముగా ఆయా వ్యాధుల యొక్క వేగము తగ్గి ఆరోగ్యము చేకూరును.

పథ్యము : గోధుమలు, మేకమాంసము, లేతవంకాయ, లేత మునగకాయ, లేత ఆముదపు కాయ, వెల్లుల్లి.

అపథ్యము : పెసలు, మినుములు, శనగలు, పెరుగుమీగడ, నేరేడు, ద్రాక్ష, మామిడిపండ్లు, శీతలపదార్థములు.

మోతాదు : ఒకమాత్ర చొప్పున రోజుకు రెండుసార్లు జటామాంసి క్వాథముతో నీయవలెను

లభ్యము : 20,40 మాత్రలు.

**వాత రాక్షసము**

దీనిని 1. శుంఠి, పిప్పళ్ళు, గంటుభారంగి, వీనియొక్క చూర్ణము సమానముగ చేర్చి చిత్రమూలరసముతో నూరి కందిగింజలవలె మాత్రలుచేసి వేడినీటితో నుపయో గించిన యెడల చచ్చువాతము, ధనుర్వాతము, ఆక్షేపక వాతము, పక్షవాతము మొద లగు సమస్తవాత వ్యాధులు 2. అడ్డసరమును నీటి ఆవిరిమీద ఉడికించి రసముపిండి యా రసముతో ఉపయోగించినచో ఆయాసము, దగ్గు, క్షయ, వంటి పిల్లలకు కలుగు ఎగరొప్పు, మొదలగు శ్లేష్మవ్యాధులు 3. కాలకూటములగు వానితో కలిపి నూరి తులసి యాకురసముతో లేక తమలపాకు రసముతో మాత్రలు కట్టి అల్లపు రసము తోడను వేడినీటితోడను సమయానుకూలముగ ఉపయోగించినచో దోషజ్వరములు, వాత జ్వరములు, సన్నిపాతజ్వరములు, శ్లేష్మజ్వరములు, సూతికాజ్వరములు మొదలగు కఠినజ్వరములు (ఈ జ్వరములు కొంచెము నున్నచో ఈ మాత్రలయందు కొద్ది కస్తూరినికూడ కలుపుకొనుట మంచిది) తేనెతో రెండుపూటల యందునుపయో గించినచో తిమ్మెర్లు, వాతాజీర్ణము, నొప్పులు, జలుబు, కీళ్ళనొప్పులు మొదలగు వ్యాధులు రామబాణముచే

రావణునియొక్క శిరస్సులువలె ఖండింపబడును. ఇందు తామ్రము లోహము మొదలగు వస్తువులు కలవుగాన చక్కగ వేడిచేయుచు వాతశ్లేష్మ వ్యాధుల నన్నిటిని పారద్రోయును. మోతాదు 1/4 మొ. 1/2 చి. వరకు

## వాత విధ్వంసినీ రస (బ.రా.)

ద్రవ్యములు : శుద్ధ పాదరసం, శుద్ధగంధకం, సీసభస్మం, వంగభస్మం, లోహ భస్మం, తామ్రభస్మం, అభ్రకభస్మం, పిప్పళ్లు, వెలిగారభస్మం, మిరియాలు, శొంఠి, శుద్ధ వత్సనాభి.

గుణము : వాతరోగము, శూల, శ్లేష్మరోగము, గ్రహణి, సన్నిపాతము, మూక వాతము, అపస్మారము, అగ్నిమాంద్యము, శీతపిత్తము, ప్లీహోదరము, కుష్ఠువులను హరించును.

అనుభూత ప్రయోగములు : 1. ప్లీహోదరమునందు ఏదైనా పర్పటితో వాడిన బాగుగా పనిచేయును.

2. ఏరకమైన శూలనందైనను (ఉదర) అగ్నికుమారరసతో వాడుచూ, భోజనా నంతరము గంగాదర చూర్ణము, అతిమధురము చూర్ణములు వాడిన ప్రయోజనకరము.

3. మూక వాతమునందు సారస్వతాది లేహ్యము ఉదయము, సాయంత్రము వాడుచూ, భోజనానంతరము అతివస చూర్ణము 10 గ్రా. యష్టిమధు చూర్ణము10గ్రా. అశ్వగంధ చూర్ణం 50గ్రా. కలిపి 2గ్రా. చొప్పున తేనెతో తీసుకొనిన, మూకత్వము క్రమముగా తగ్గుముఖం పట్టును.

## వ్యాధిహరణ రసం (ర.సి.సం.)

ద్రవ్యములు : శుద్ధపాదరసము, శుద్ధగంధకము, రసకర్పూరము.

గుణము : ఉపదంశము, సంబంధిత వ్రణములు, ఫిరంగరోగము, నపుంసకత్వ ములను దూరము చేయును. హృదయశూల, వాత, శ్లేష్మ వికృతులు, వలీపలితము లను నశింపచేయును. ఉపదంశమును, ఉపదంశ ఉపద్రవములు అనగా శరీరము నందు ఎర్రని మచ్చలు, స్వరభేదము, నోటియందు వ్రణములు, గుదశూకములు, కేశములు ఊడిపోవుట, జ్వరము, శిరఃశూల, అనిద్ర, పాండురోగము, కళ్లు ఎర్రబడుట, పదేపదే కండ్ల కలక వచ్చుట, కండ్ల యందు చిన్నచిన్న పొక్కులు వచ్చుట, అస్థిగత వ్రణములు, వృక్కశోథ, గోళ్లు వంగిపోవుట, సంధివాతము, వృషణ శోథ మొదలగునవి మొదటి రెండు సంవత్సరములలోపు చికిత్సించిన

నశించును.

వాతము, పిత్తము, కఫము అను త్రిదోషములందు, సప్తధాతువులందు దీని ప్రభావము ఉండును. వ్యాధిహరణ రసము ఉపదంశ విషఘ్నము, బల్యము.

దీనిని తేనెతో గాని ఇతర అనుపానములతోగాని సేవించిన యెడల కొరుకు ముఖనాసిక, మచ్చలు, పొక్కుసవాయి మొదలగు సమస్త సవాయి వ్యాధులను నశించును. సవాయి వ్యాధులు జీర్ణించుటచే కలిగిన దుర్లక్షణముల నన్నిటిని తగ్గిం చును. సవాయి వ్యాధి జీర్ణించుటచే కలిగిన నపుంసకత్వమునకు అమోఘముగా పని చేయును. ఇప్పటి కాలములో సంతానము కలుగకుండుటకుగాని కలిగిన సంతా నము వెంటనే నశించుటకుగాని సవాయి వ్యాధులే చాలవరకు కారణము. అట్టి వ్యాధులకు మొదలంట నశింపజేసి సంతానమును కలిగించుటయేగాక కలిగిన సంతానము నశింపకుండ కూడ చేయును. తమలపాకుల రసముతో ఉ పయోగించిన యెడల వాతశ్లేష్మ వ్యాధులు, శూలలు, బాలురకు కలుగు శ్లేష్మ జాతి వ్యాధులు మొదలగువానిని కూడ నశింపచేయును. ఈ కాలమున దీనిని చాలామంది వాడవచ్చును. మోతాదు 1/4 మొ. 1/2 చి.వరకు.

అనుభూత ప్రయోగములు : 1. చంద్రప్రభావటి, గనోప్రభలతో ఇచ్చుచూ, సరస అనుపానముగా యిచ్చిన, ఉపదంశ వ్యాధిని నివారించవచ్చును.

2. వృక్కశోథయందు త్రివంగ భస్మము, చందనాదివటి, తిప్పసత్తులకు చందనాసవ అనుపానముగా యిచ్చుచూ, ఉదయము, రాత్రి వ్యాధిహరణ రస ఆమలకీ స్వరముతో యిచ్చిన తగ్గును.

3. శరీరమునందలి ఎర్రని మచ్చలు, నోటియందు వ్రణములు వంటి ఉప దంశ ఉపద్రవములందు లక్షణానుసార చికిత్సచేయుచూ, పైన పేర్కొనబడినట్లుగా ఉపదంశమును చికిత్సించవలెను.

పథ్యము : పెరుగుతోటకూర, బీరకాయ, పొట్లకాయ,నీరుల్లిపాయ, పటికబెల్లం, పంచదార, తాటిబెల్లము, తాటిముంజెలు.

అపథ్యము : మాంసము, మామిడికాయ, కాకరకాయ, నువ్వులు, ఆవాలు.

అనుపానము : తేనె- నెయ్యి

మోతాదు : 1 మాత్ర చొప్పున రోజుకు రెండుసార్లు సేవించవలెను.

లభ్యము : 10 మాత్రలు.

**రజిత నవనీత మాత్రలు**

వీనిని వేడినీటితో ఉపయోగించిన యెడల అతిమూత్రము, నడుము నొప్పులు, దగ్గు, మధుమేహము, అజీర్ణము ఇవి నశించును. చందనాస వముతో ఉపయోగించిన యెడల శుక్లనష్టము నశించును. కుమార్యాస ముతో సమస్తమగు ప్రదర వ్యాదులు నశించును. సంభోగశక్తిని వృద్ధి పరచును. మోతాదు 1 మాత్ర.

**మాదీఫల రసాయనము**

దీనిని 1/2 మొ. 1 తు. వరకు కేవలముగాని రెట్టింపు నీటిలో కలిపిగాని సేవించిన యెడల నోటిపూత, అజీర్ణము, అరుచి, మలబంధము, వికారముగ నుండుట పుల్లని త్రేనుపులు, వాంతి, సమస్తమగు పైత్యవ్యాధులు, కడుపులోమంట, తలతిరు గుట, దద్దుర్లు, తాపము, దప్పిక, రక్తదోషములు, కామిర్లు, నోటనీరూరుట, నోరు అసహ్యాముగ నుండుట, ఎక్కిళ్లు, ఉడుకు మొదలగు వ్యాధులు హరించును. గర్భిణీ స్త్రీలకు కలుగు నోట నీరూరుట, అజీర్ణము, వాంతి, మొదలగు సమస్తమగు వ్యాధు లను హరింపజేయును. దీనిని తరుచు ఉపయోగించినయెడల సుఖప్రసవమును ఆరోగ్య సంతానమును కలుగును. కాన మొదటి నుండి వాడుటశ్రేష్ఠము.

**కందమూల రసాయనము**

ద్రవ్యములు : సూరణ కందము, ఉసిరికాయ, కరక్కాయ, తానికాయ

గుణము : మొలలను హరింపజేయును. మలబద్ధకము,రక్తార్శస్సు మొదలగు వాని యందు గుణకారి.

1. అర్శస్సు నందు కలిగే ఆటోప, ఆనాహములందు జీరకాద్యరిష్ట లేదా అభయారిష్టతో ఇచ్చిన ఈ లక్షణములు పోయి, అర్శస్సు తగ్గును.

2. అర్శస్సు నందు కలిగే మలబద్ధతను హరించుటకై అర్శోహర లేహ్యాముతో ఇచ్చిన మలబద్ధత తగ్గుట ద్వారా అర్శస్సు తగ్గును.

3. రక్తార్శస్సునందు లొద్దుగ చూర్ణముతో కలిపి ఇచ్చిన తగ్గును.

పథ్యము : వరిపేలాల గంజి, మజ్జిగ, బార్లీ గింజల జావ, ద్రాక్ష,దానిమ్మ, కంద, నీరుల్లిపాయ, పీచుపదార్థములు.

అపథ్యము : బంగాళాదుంపలు, పప్పులు, ఊరగాయలు, కోడిమాంసము.

అనుపానము : మజ్జిగ

మోతాదు : 3-5 గ్రా. చొప్పున రోజుకు రెండు లేదా మూడుసార్లు మజ్జిగతొ౦ట సేవించవలెను.

లభ్యము : 50 గ్రా.

## సూతికా మాత్రలు

ఇవి బహుశ్రమతో తయారుచేయబడినవి. సూతికా స్త్రీలకు ప్రాణమునిచ్చు ననుటలో సందేహములేదు. ప్రసవమైనది మొదలు వాడుచుండిన యెడల యే వ్యాధిని దరికికూడ చేరనివ్వవు. కాన ప్రసవమైన వెంటనే మామూలుగ వాడుకునే రస కర్పూరము లేక కస్తూరి మొదలగువానిని వాడి ఆ సాయంకాలము మొదలు మూడు రోజులవరకు ప్రతిసాయంకాలముసను, పథ్యమునిచ్చురోజు ఉదయమునను, స్నానము చేయించురోజు ఉదయమునను ఒక్కొ మాత్రచొప్పున వేడినీటితో నుపయోగింపవలయును. ఇట్లు చేసినచో ఏ వ్యాధియు దరికిచేరదు. మైల సరిగ కాకున్నయెడల పిప్పళ్లు, మోడి,చవ్యము, శుంఠి, సన్నరాస్నము, వీనియొక్క కషాయముతో నియ్యవల యును. జ్వరము వచ్చుచున్న యెడల వేప ఈనెలు,అడ్డసరము, శుంఠి, తిప్పతీగ, నేలవేము వీనియొక్క కషాయముతో నియ్యవలయును. దోషజ్వరములు, సన్నిపాత జ్వరములు, కలరా మొదలగువానియందు కాళ్లుచేతులు చల్లబడుట, ఆయాసము మొదలగు అపాయలక్షణములు కలిగినప్పుడు జిట్టవరగోగు లేక మునగ చెక్క కషాయముతో 2,3 గంటల కొకసారి చొప్పున వాడవలయును. అధికమగు వేడిని కలిగించును. మోతాదు 1 మాత్ర.

## కస్తూరి మాత్రలు

ఇవి చక్కని వేడిమిని కలిగించును. వీనిని వేడినీటితోగాని ఆయా రసములతో గాని ఉపయోగించిన యెడల అజీర్ణము, అగ్నిమాంద్యము, వాత ప్రకోపము, శ్లేష్మ ప్రకోపము, వాత వ్యాధులు, అతిసారము, కాళ్లు చేతులు చల్లబడుట, చెమటలు కలుగుట, సూతికావాతము, పక్షవాతము, జ్వరము, సన్నిపాత జ్వరము, జలుబు, దగ్గు, పడిశము, ఒడలునొప్పులు, కడుపుబ్బరము, దోషజ్వరము, మొదలగువానిని నశింపజేయును.

వాతమునుబోగొట్టి వేడిమిని కలిగించును. మరియు వీనిని తమల పాకుల లేక తులసియాకుల రసముతో ఉపయోగించిన యెడల చంటిపిల్లలకు కలుగు ఎగరొప్పు తగ్గును.

## బాలసంజీవి మాత్రలు

ద్రవ్యములు : శుద్ధపాదరసం, శుద్ధగంధకము, శుద్ధనాభి, జాజికాయ, చెంగల్వ కోష్టు, పిప్పళ్లు, మిరియాలు, శొంఠి, ఉసిరిక, కరక్కాయ, తానికాయ, తమలపాకు స్వరసము, అల్లపు స్వరసము.

గుణము : చిన్నపిల్లలకు కలుగు అజీర్ణము, జలుబు, దగ్గు, వమనము, ఆకుపచ్చ విరేచనములు, మందజ్వరము మొదలగు వ్యాధులను హరించును. ఈ ఔషధము నందు క్రిమినాశక, గ్రాహి, విషహర, యకృత్‌పోషక, మస్తిష్క శామక, దీపన, పాచన గుణములు కలవు.

అనుపానము : జ్వరము యొక్క లక్షణములను బట్టి వివిధ అనుపానములతో సేవించవలెను. దీర్ఘకాలిక జ్వరములందు నేలవేముతో, కఫ జ్వరములందు మిరియాల కషాయముతో, పిత్త జ్వరములందు అల్లపు రసముతో సేవించవలెను.

మోతాదు : 1–2 మాత్రలు ఉదయము, సాయంత్రము కాచి చల్లార్చిన నీటితో తీసుకొనవలెను.

లభ్యము : 20 మాత్రలు

అనుభూత ప్రయోగములు : 1. కఫ ప్రకోపము అధికముగా ఉన్నచో శృంగి భస్మముతో నీయవలెను.

2. శిశువుల నందు సరియైన పోషణలేక వచ్చు పాండురోగమునందు మండూర మాక్షిక భస్మముతో నిచ్చిన అత్యంత శ్రేష్ఠము.

3. చిన్నపిల్లలకు వచ్చు అనేక కారణముల వలన కలిగే అతిసారములందు దాడిమాష్టక చూర్ణముతో ఇవ్వవచ్చును.

4. కౌమార దౌర్బల్యమునందు కస్తూరి మాత్రలతో ఇచ్చిన ఉపయోగము కలదు.

5. పిల్లలకు కలిగే విబంధము, అగ్ని మాంద్యములందు భాస్కర లవణముతో ఇవ్వవలెను.

పథ్యము : ఘనాహారము తీసుకొను పిల్లలలో అజీర్ణము కలిగిన,

అన్నము, నెయ్యి తగ్గించి పాలు, ఫలరసములను అధికముగా ఇవ్వవలెను. తేలికగా జీర్ణమగు ఆహారమును ఇవ్వవలెను.

అపథ్యము : పప్పు దినుసులు, మాంసము, చేపలు, దుంపకూరలు మానివేయ వలెను.

అనుపానము : 6 మాసములలోపు బిడ్డలకు తల్లిపాలతో లేదా తేనెతో ఇవ్వ వలెను. పిల్లలకు పెద్దలకు వాము రసము లేదా అల్లపు రసముతో ఇవ్వవలెను.

మోతాదు : శిశువులకు అరమాత్ర చొప్పున, పిల్లలకు ఒకమాత్ర చొప్పున రోజుకు రెండు లేదా మూడుసార్లు ఇవ్వవలెను

లభ్యము : 20 మాత్రలు.

**వీర్యస్తంభనవటి**

వీనిని ఆవుపాలతో నుపయోగించిన యెడల శుక్లనష్టము, శుక్లము పలచగ నుండుట, శీఘ్రస్ఖలనము, దగ్గు, కాళ్ళులాగుట, నడుమునొప్పులు, మధుమేహము అతి మూత్రము, వీనిని నశింపచేయును. శుక్రదోషములను పోగొట్టును. శుక్రమును స్తంభింపజేసి సంభోగశక్తిని వృద్ధిపరచును. మోతాదు 1 మాత్ర.

**సుఖవిరేచన వటి**

వీనిని వేడినీటితో ఉపయోగించిన యెడల గుల్మము, అజీర్ణము, పైత్యవ్యాధులు ఉదరము, ప్లీహవ్యాధులు యకృద్వ్యాధులు, అరుచి, అగ్నిమాంద్యము,నంజు, మల బంధము, కడుపుబ్బరము, కడుపునొప్పి, శూల, వాత వ్యాధులు శ్లేష్మ వ్యాధులు.

ఇవి వెంటనే హరించును. ఇవి వికారము, వాంతి మొదలగు దుర్లక్షణముల నేమియు కలిగింపక సుఖవిరేచనమును చేయును. మోతాదు 1-2 మాత్రలు.

సూచన- నాల్గు మాత్రలను, ఒకే దఫా ఉదయముననే ఉ పయోగించినచో సుమారు 5-6 విరేచనములగును. పైత్య ప్రకృతి కలవారు అల్లపురసముతో పుచ్చు కొనుటమంచిది. 5-6 విరేచనములు అయినచో చారు అన్నమును మాత్రమే తిన వలయును.

## నారికేళాంజనము

దీనిని కొద్దిగ కంటియందుపయోగించిన యెడల నీళ్ళు కారుట, పుసికట్టుట, ఎరుపులు, మంటలు, సరిగ కనబడకుండుట మొదలగునవి నశించును.

## తామ్రు మైనము

దీనిని 1/4 మొ. 1 చిన్నము వరకు మంజిష్ట, సుగంధిపాల పొట్టు, జీలకర్ర, వీని యొక్క కషాయముతో సేవించిన యెడల సవాయి వ్యాధులు జీర్ణించుటచే కలిగిన వ్యాధులు, కొరుకు, చేతులయందును శరీరమందును మచ్చులు, బొబ్బలు, మొదలగునవి సమస్తమగు కుష్ఠములును సమస్తమగు చర్మవ్యాధులును, రక్తదోషము లును, భగందరములును, వ్రణములును హరించును. కేవలము మాత్రలుగచేసి సేవించిన యెడల జీర్ణము, నంజు, దగ్గు, వాత వ్యాధులు, శ్లేష్మవ్యాధులు కరిమేహము మొదలగున్నవి వెంటనే హరించును. అనేక వ్యాధులను రూపుమాపును.

## శంఖద్రావకము

దీనిని 5 మొదలు 8 చుక్కలు వరకు ఆయా ద్రావకములలోగాని వాము మొదలగు వాని కషాయములలోగాని నీటిలోగాని కలిపి సేవించిన యెడల శూల, అజీర్ణము, కడుపుబ్బరము, ప్లీహాభివృద్ధి, యకృత్ వ్యాధులు, పరిణామశూల, ప్రేగుల రచుట, మొదలగునవి హరించును. పైన పూసిన యెడల తామర, తేలు పాము యెలుక మొదలగు వాని విషయమును కూడ హరించును.

## పంచతిక్త పానకము

దీనిని 1/2 మొ. 1 1/4తు. వరకు 2-3 తులముల నీటిలో కలిపి సేవించిన యెడల పురాణ జ్వరములు, జీర్ణ జ్వరములు, విషజ్వరములు, శీతపైత్య (చలి) జ్వరములు, యకృద్వ్యాధులు, ప్లీహవ్యాధులు, స్ఫోటకమును,అరుచి, అగ్నిమాంద్యము, నోటిపూత, ప్లేగు మొదలగు వ్యాధులను నశింపచేయును. మరియు శరీర మెల్లపుడు వెచ్చగనుండుట, సవాయి వ్యాదులు జీర్ణించుటవలన కలిగిన వ్యాధులు, చేతులునల్లగ నుండుట, చిడుము, దురద, కామిర్లు, మలబంధము, అజీర్ణము, చర్మవ్యాధులు, రక్త దోషములు, బలహీనత, శరీరతాపము, వీనిని కూడ హరింపచేయును.

### జంబీరాది పానకము

దీనిని 1/2 మొ. 1 1/4 తు. వరకు 2-3 తులముల నీటిలో కలిపి సేవించిన యెడల సమస్తమగు పైత్య వ్యాధులు, అగ్నిమాంద్యము, అరుచి, నోటిపూత, అజీర్ణము, నోటనీళ్ళూరుట, కడుపులోమంట, పుల్లనిత్రేనుపులు, తలతిరుగుట, వాంతి, వేడిమి, దద్దుర్లు, తాపము, దప్పిక, రక్తదోషములు, యకృద్వ్యాధులు, కామిర్లు, వికారముగ నుండుట, మొదలగు వ్యాధులు వెంటనే హరించును. ఇది గర్భిణీ స్త్రీలకు కలుగు ఆయా లక్షణములను పైవ్యాధులను పోగొట్టుటయేగాక సుఖప్రసవమును ఆరోగ్య సంతానమును కూడ కలిగించును. మిక్కిలి శ్రేష్టమయినది.

## లేపములు

### అండవృద్ధి లేపం

ద్రవ్యములు : గచ్చపప్పు, ఆముదపు గింజలు, గవ్వపలుకు సాంబ్రాణి, ముద్ద కర్పూరము.

గుణము : శోథహరము, వరిబీజమునకు బాగుగా పనిచేయును. చెడు నీటిని తీసివేయును.

వాడు విధానము : వరిబీజమునకు పట్టీగా వేయవలెను. లేపమునకు కొంచెము సెగచూపి తెల్లని శుభ్రమైన గుడ్డకు రాచి పట్టీగా వేయవలెను. మూడు, నాలుగు రోజులకొకసారి పట్టీని మార్చుచుండవలెను. పైపూతకు మాత్రమే.

పథ్యము : పాతబియ్యము, మేకమాంసము, గలిజేరుకూర, పల్లేరుకూర, మునగ ఆకు కూర, వెల్లుల్లి, నీరుల్లి, బీరకాయ, పొట్లకాయ, కందికట్టు, పెసరకట్టు.

అపథ్యము : పులుపు, పెరుగు, గోంగూర, బచ్చలి, చేపలు, మినుములు, గురు పదార్ధములు; వేగనిరోధము.

లభ్యము : 15 గ్రా.

### కుంకుమాది లేపం

ద్రవ్యములు : కుంకుమ కేసరము, రససిందూరము, సైంధవలవణం, పచ్చకర్పూ రము, చందనతైలము, మంజిష్ట, పసుపు, లొద్దుగపట్ట, కరక వలుపు, కురువేరు, తుంగముస్తలు, కళింగరాష్ట్రము,

వట్టివేరు, తానికాయవలుపు, చంద్ర, చెంగల్వ కోష్ఠ, కదంబ అత్తరు, కొబ్బరినూనె.

గుణము : మొటిమలను, మచ్చలను పోగొట్టి ముఖమునకు కాంతిని ఇచ్చును.

అనుభూత ప్రయోగములు : 1. సరస, గంధక రసాయనములను లోనికి ఇచ్చుచూ,ఈ లేపనమును లేపనము చేసిన మొటిమలుతగ్గును. శరీరకాంతి పెరుగును.

పథ్యము : తేనె,పేలాలజావ, బీరకాయ, పొట్లకాయ, ముల్లంగి.

అపథ్యము : పాలు,నెయ్యి,క్రొవ్వు పదార్థములు

వాడువిధానము : రాత్రి పరుండబోవునపుడు కొంచెము రాచుకొని ఉదయము సున్నిపిండితో కడుగువలెను. పైపూతకు మాత్రమే.

లభ్యము : 10 గ్రా.

## మందార లేపం

ద్రవ్యములు : శుద్ధపాదరసము, శుద్ధ గంధకము, వాము, వస, నల్లజీలకర్ర, కొబ్బరి పెంకులు.

గుణము : చుండ్రు, పేనుకొరుకుడు మొదలగు వానికి రోజుకొకసారి రాత్రి పడుకునే ముందు తలకు రాసి, మరుసటిరోజు ఉదయము తలస్నానము చేయవలెను. ఈ విధముగా 3-5 రోజులు చేసిన, దీర్ఘకాలిక చుండ్రు, పేనుకొరుకుడు పూర్తిగా నశించును. పైపూతకు మాత్రమే.

అనుభూత ప్రయోగములు : 1. మందార తైలమును వెంట్రుకలకు, మాడుకు తగులునట్లుగా రాసుకొని, రాత్రి పరుండబోవునపుడు ఈ లేపమును లేపనము చేసిన పేనుకొరుకుడు, వెంట్రుకలు రాలుట తగ్గును.

పథ్యము : ఆవుమజ్జిగ, ఆవుపాలు, మేకమాంసము, కాకరకాయ, ద్రాక్షపండ్లు, ఉసిరికాయ, కొబ్బరికాయ.

అపథ్యము : ఎండుచేపలు, వంకాయ, గోంగూర, ఆవాలు.

లభ్యము : 15 గ్రా.

## మధూచ్ఛిష్టాది లేపము

దీనిని కొబ్బరినూనెలో కలిపి పూసిన యెడల దురద పుండ్లు, కాలుపు పుండ్లు, చిడుము, సర్పి, శిరస్సునందు పుండ్లు, శరీరము ప్రేలుట,

కాళ్ళపగుళ్లు, మొదలగు నవి నశించును. సవాయి పుండ్లు గూడ నుపయోగింపవచ్చును. గుడ్డకు పూసి పట్టీలుగ వేసినచో వ్రణములు నశించును. నోటికిని కంటికిని తగిలినను ప్రమాదము లేదు. కావున పసిపిల్లలకు కూడ పై వ్యాధులయందు నిర్భయముగా నుపయోగింప వచ్చును.

## రసోత్తమాది లేపం

ద్రవ్యములు : శుద్ధ పాదరసము, తెల్లజీలకర్ర, నల్లజీలకర్ర, పసుపు, మాను పసుపు, మిరియాలు, గిరిసిందూరము, శుద్ధగంధకము, శుద్ధ మణిశిల.

గుణము : పామ, కండు, విచర్చికాహరము

చర్మవ్యాధులను నశింపజేయుటలో మిక్కిలి శ్రేష్ఠమైనది. దీనిని కొబ్బరి నూనెతో గాని బర్రె వెన్నతోగాని పూసిన యెడల తీట, గజ్జి, పుండ్లు, దురద, విసర్పము (చప్పి) కురుపులు, కొరుకువ్యాధి, మొదలగు చర్మవ్యాధులన్నియు నశించును. ప్రారంభ దశలో నున్న కుష్ఠముకూడ నశించునని చెప్పవచ్చును. నిమ్మకాయ పులుసులో కలిపి పూసిన యెడల కొద్దిగ మండును. కాని తామర వెంటనే చిత్రముగ హరించును. ఇందు పాదరసము, గంధకము, మొదలగునవి కలసియుండును. కాన కన్ను,నోరు మొదలగువానికి తగలకుండుట మంచిది.

అనుభూత ప్రయోగములు : మేహము వలన కలిగిన చర్మవ్యాధులు, జిల, గజ్జి, కురుపులు, పొడలు మొదలగు వానియందు ఉత్తమముగా పనిచేయును. రోజుకు రెండుసార్లు పై పూతకు వాడవలెను.

1. పామనందు గంధక రసాయనము కాప్స్యూల్స్ ఇచ్చుచూ ఈ లేపనము చేసిన తగ్గును.

2. కండునందు టంకణభస్మము, యష్టిమధు చూర్ణము కలిపి లోనికి తీసు కొనుచూ, ఈ లేపమును లేపనము చేసిన తగ్గును.

3. విచర్చికనందు త్రిఫల కషాయముతో పరిషేకము గావించి ఈ లేపనమును లేపనము చేసిన, తగ్గును.

పథ్యము : గోధుమలు, కందిపప్పు, బీర,పొట్ల,ఉసిరి, తెల్లగలిజేరుకూర, తేనె, వెల్లుల్లి, చందనము, మేకమాంసము.

అపథ్యము : పాలు, బెల్లం,పులుపు,ఉప్పు,కారము, చెరుకు రసము,

పానకము, చేపలు, వ్యాయామము.

లభ్యము : 15గ్రా.

## సిందూరాది లేపం

ద్రవ్యములు : నాగసిందూరము, రససిందూరము, రసకర్పూరము, మృదారు శృంగి.

గుణము : విచర్చిక, విపాదిక, వ్రణహరము

అనుభూత ప్రయోగములు : 1. అగ్ని దగ్ధ వ్రణములందు ఈ లేపమును పై పూతగా వాడుచూ, కాంచనార గుగ్గులు అభ్యంతర ప్రయోగమునకై వాడవచ్చును.

2. యవానపిడకలందు గంధకరసాయనమును సరసతో వాడుచూ, ఈ లేప మును పైపూతకు వాడిన ఉత్తమము.

3. పరస్పర విరుద్ధ ఔషదసేవనచే కలిగే కండునందు ఆవునెయ్యి, తేనెలతో కలిపి ఈ లేపనమును లేపనము చేసిన తగ్గును.

పథ్యము : కందులు, పెసలు, బీరకాయ, పొట్లకాయ, బచ్చలికూర.

అపథ్యము : పులుపు, నూనె, చేపలు, వంకాయ, ఆవాలు, గుమ్మడికాయ

లభ్యము : 15 గ్రా.

## తువరక లేపం

ద్రవ్యములు : నీరుడువిత్తులు, కొబ్బరినూనె

గుణము : దీర్ఘకాలిక చర్మరోగములయందు దీనిని వాడుట మిక్కిలి శ్రేష్ఠము. శోభి, కుష్ఠము, మేహపొడలు, మొదలగువాని యందు ఆరునెలలనుండి సంవత్సరము వరకు వాడవలెను. సామాన్య చర్మవ్యాధులను ఇది త్వరితగతిన మాన్పును.

వాడువిధానము : రోజుకు 1-2 సార్లు స్నానమునకు ముందు రెండు గంటలు లేపనమును మర్దించి, తరువాత స్నానము చేయవలెను.

అనుభూత ప్రయోగములు : 1. తెల్లశోభియందు ఆర్ అండ్ హెచ్ మాత్రలు వాడుచూ, తువరకలేపమును పై పూతగా ఇచ్చిన తగ్గును.

2. క్షుద్ర కుష్ఠమునందు ఖదిరారిష్ట, పంచతిక్తారిష్టలను ఇచ్చుచూ, తువరక లేపనమును పైపూతగా ఇచ్చిన కుష్ఠము నశించును.

3. ప్రమేహ చర్మవ్యాధులందు లక్షణానుసార చికిత్స చేయుచూ, పై పూతగా ఈ లేపనము వాడిన మంచి ఫలితమునిచ్చును.

పథ్యము : బార్లీ, పెసలు, బీరకాయ, పొట్లకాయ, ఆవు మజ్జిగ.

అపథ్యము : చేపలు, ఉలవలు, ఉప్పు, పులుపు, కారము.

లభ్యము : 15 గ్రా.

## ఇతరములు

### సిద్ధమకర ధ్వజము (భై.ర)

ఇది ఆ బాలవృద్ధులు సర్వ సాధారణంగా ఉపయోగింపదగిన అత్యుత్తమ బలవర్ధకౌషధము. రక్త క్షీణము, వీర్యదోషము, పాండువు, క్షయ, శ్వాసకాసలు, మధుమేహ బహుమూత్రములు, జీర్ణజ్వరము, స్త్రీలకుసుమలు, ఋతుదోషం, అతి సంభోగముచేగాని, సుఖవ్యాధులు జీర్ణించుటచేగాని గలుగు, బలహీనత, శీఘ్రస్ఖలనం, మధ్య నపుంసకత్వము మొదలగు వ్యాధులను సంపూర్ణముగ బోనడచి శరీరమునకు మంచి పాటవము, నరములకు పటుత్వము, జ్ఞాపకశక్తి బలము, కండపుష్టి కలిగించును.

(1) 5 మిరియములను రాత్రిపూట 10గ్రా. మజ్జిగలో నానవేసి ఉదయమున మిరియములను మాత్రమే తీసి, 3 గుంటకలగర చిగుళ్లు ఒకమోతాదు ఔషధమును చేర్చి నూరి ఉదయమునను, అట్లే ఉదయమున నానవేసిన మిరియములతో సాయంత్రము సేవించినచో జీర్ణజ్వరము క్షయ జ్వరము, రక్తహీనత, బలహీనత

(2) సిద్ధమకరధ్వజము 5గ్రాములు అభ్రకభస్మము 5గ్రా. తిప్పసత్తు 3 గ్రా. శితో ఫలాది చూర్ణము 10గ్రా. కల్పి 60 పొట్లములు కట్టి చ్యవన ప్రాశ్యావలేహ్యముతోగాని, వాసకతోగాని, అల్లపు రసము తేనె కల్పి కాచిన పానకముతోగాని, క్షయ, రక్త పిత్తమునకు

(3) వేయించిన పిప్పలి చూర్ణముగాని, తాలీసాది చూర్ణము గాని ఔషధమునకు రెట్టింపు కల్పి తమలపాకురసము తేనెతో శ్వాస, కాస, ఎల్లప్పుడు రొంప పట్టి నట్లుండుటకును

(4) సి.మ. 5గ్రా. వంగభస్మము 10గ్రా. తిప్పసత్తు 10గ్రా. చేర్చి 50 మోతాదులు కట్టి చందనగాని శారివగాని, రసాయనితోగాని, శుక్రనష్టము, అతివేడి, తలదిమ్మునకు

(5) సి.మ. 3గ్రా అభ్రక భస్మము 3గ్రా ఎండు ద్రాక్షపండ్లు 10గ్రా కల్పి నూరి 40 మాత్రలు చేసి, అశ్వగంధ లేక సారస్వతతోగాని మూర్ఛ, అపస్మారము, నరముల బహీనత జ్ఞాపకశక్తికి

(6) రెట్టింపు త్రివంగ భస్మము 4 రెట్లు తెల్లకలువదుంపల చూర్ణము చేర్చి, కొబ్బరిపూల రసముతో నూరి 80 మాత్రలు చేసి అశోకతో స్త్రీల కుసుమలకు

( 7) శారివతో రక్త దోషమునకు

(8) అర్జునతో హృద్రోగమును

(9) సి.మ. 3గ్రా పచ్చకర్పూరము 3గ్రా కుంకుమపూవు 2 గ్రా ఏలకగింజలు 3గ్రా. జాపత్రి 2గ్రా తవాక్షరి 2 గ్రా కస్తూరి 1/4 గ్రా చేర్చి ఆవుపాలతోనూరి 40 మాత్రలు చేసి తాంబూలముతోగాని, ఊరకగాని, సేవించిన సర్వ వ్యాధులు హరించును. బలము, రక్తవృద్ధి కండపుష్టి కలుగును.

(10) ఈ మాత్రలను జంబూ పానకముతో సేవించిన బహుమాత్రము, మధుమేహము నివారించును. ఆవుపాలు పంచదారతో బలమునకు, శుక్రవృద్ధికి వాడదగిన జగత్పసిద్ధమైన ఔషధము పంచదారతో బలమునకు, శుక్రవృద్ధికి వాడదగిన జగత్ర్ప సిద్ధమైన ఔషధము.

**మహాలక్ష్మి విలాసరసము ( యో. ర.)**

10గ్రా. 50 మోతాదులు

(1) లవంగాలు, వేయించిన జీలకర్ర, ధనియాలు చూర్ణము ఔషధమునకు రెట్టింపుచేర్చి, వాసకతోగాని, మాధీపల రసాయనముతోగాని, అల్లపురసము తేనె పటికబెల్లము కల్పి కాచిన పానకముతోగాని క్షయ, శ్వాస కాసలు, వాంతి, అరుచి, కామలకు

(2) కనకతో ఉబ్బసమునకు

(3) తేనెతో పాండువునకు

(4) వేయించిన జీలకర్ర చూర్ణము తేనెతో జీర్ణజ్వరము

(5) పిత్త భంజన చూర్ణము చేర్చి తేనెతో ఎక్కిళ్ళకు

(6) ఫిరంగి చెక్క సుగంధి కషాయముతో వాతరక్తమునకు, భగంధరము, రాచకురుపులకు

(7) కొండపిండి వేళ్లరసంతో అశ్మరి, మూత్రకృచ్ఛ్రలు నివర్తించును.

## మహాలక్ష్మీవిలాసము

1. పొంగించిన అల్లపురసముతో నిచ్చిన, అన్ని విధములగు పైత్యజ్వరములు, జీర్ణజ్వరములు
2. పొంగించిన ఓమము రసముతో నిచ్చిన, సర్వవాతజ్వరములు
3. కళింగరాష్ట్రము, దుంపరాష్ట్రము, వేపవీనెలు' వీనిని సమముగా జేర్చిపెట్టిన కషాయముతో నిచ్చిన, ఒక సంవత్సరము మొదలు నూరు సంవత్సరములు వరకు కలిగెడు అన్ని విధములగు శ్లేష్మజ్వరములు, శీతపైత్యజ్వరములు
4. సహజీరారసము అరతులము, కరివేపాకు రసము అరతులములో ఈ ఔషధము అరచిన్నము నూరి, ఉదయము 6 గంటలకు, మధ్యాహ్నము, 12 గంటలకున్ను 40 దినములు పుచ్చుకొనిన యెడల వంశపరంపరగా వచ్చెడు గుండెదడ, గుండెనొప్పియైనను నివారణమవును.
5. తవాక్షీరి, నెమలి ఈకెల భస్మము, నాగకేసరములు, వీని చూర్ణమును దీనికి సమముగ కలిపి గింజలు తెగకుండా కోసిన నిమ్మపండ్ల రసములో కలిపి ఇచ్చిన యెడల, ద్వాదశ వర్షము నుండి శరీరమున ఆశ్రయించి యుండుచర్ది (వాంతి) యైనను 7 దినములలో కట్టును.
6. కస్తూరి, కుంకుమపువ్వు, దీనికి సమము కలిపి నూరి, అరచిన్నము చూర్ణమును తేనెతో కలిపి, అరగంట కొకసారి యిచ్చినయెడల, కావలసిన వేడిని చేసి, వాత, పైత్య, శ్లేష్మములను క్రమస్థితికితెస్తూ అప్పుడిచ్చిన ఆహారమును జీర్ణింపజేసి, ఇతర వికారమును పుట్టనీయక, శరీరస్థితి బాగుపరచి, ప్రాణమును రక్షించును.
7. దీనికి సమభాగము పచ్చకర్పూరమును జేర్చి, తేనెతోగాని, పటిక పంచదార ఆవు వెన్న'తో గాని, పుచ్చుకొనిన, ప్రమేహములు, నిక్కాకలు, ఇంద్రియవేడి, వీర్యపలచన, శుక్లనష్టము, నివారణయై విశేషమగు సంభోగశక్తిని గలిగించును. రక్తమునకు, బుద్ధికి బలము నిచ్చును. శరీరపుష్టి, కాంతి, బలము, కలుగును.
8. మరియు దీనిసేవవలన, త్రిదోషములు, పాండువు, కామిల, జీర్ణజ్వరము గ్రహణి అతిసారము మొదలగు సర్వరోగములు నివృత్తియవును.

(ఇందు సువర్ణ రౌప్య, మౌక్తి కాది భస్మములు చేర్చబడినవి)

## విజయ చింతామణి

10 గ్రా. 60 మోతాదులు

(1) కఫము కంఠమున కెగదాసి యున్నప్పుడు ఆకుచెముడాకు రసముతోను
(2) శరీరము చల్లబడి కఫము ఎగదన్నినపుడు వెల్లుల్లిరసము తేనెతోను
(3) సన్నిపాతాదులయందు తమలపాకు రసముతోను
(4) కౄరవాత రోగములందు వావిలివేరు రసము తేనెతోను
(5) బాలపాప చిన్నెలకు చనుబాలతోను యివ్వవలెను. మంచి వేడిచేయు ఔషధము.

## సూతికా భరణము (భై.ర.)

10గ్రా. 50 మోతాదులు

(1) మిర్యాల రసముతో ధనుర్వాతము, గంటుభారంగి కషాయము కంపవాతము
(2) మైల వెడలకవచ్చు సూతికాజ్వరమునకు జిల్లేడు పువ్వు వాము కషాయముతోను
(3) మైల హెచ్చుగా నున్న మోదుగచెక్క కషాయముతోను
(4) సూతికాభరణము 2గ్రా. కస్తూరి 1/2 గ్రాము, గోరోజనము 1/2 గ్రా. రోపీత 1/2 గ్రా. పావుదారు 1/2 గ్రా. జున్ను 1/2 గ్రా. నల్ల ఉప్పిచిగుళ్లు 9 వీనిని నూరి 20 మాత్రలు చేసి పురుడు వచ్చినది లగాయితు పదిరోజులు రోజుకు రెండు చొ॥న సేవించిన సూతికావ్యాధులు కలుగవు.
(5) ప్రసవించిన వెంటనే ఒక మోతాదును తమలపాకులోబెట్టి నమిలి మ్రింగించిన సూతికా వాతము రాకుండ కాపాడును. శీఘ్రఫలప్రదమగు ఔషధము.

## సూతికాభరణము

1. బేడయెత్తు ఈ ఔషధములో11 మిరియములున్ను, బేడయెత్తు తెల్ల ఉప్పిచిగుళ్లున్న వేసి నూరి, మిరియముల వలె మాత్రలుచేసి, రోగ బలానుసారముగ, కాలము నిర్ణయించి, ఒక్కొక్క మాత్ర చొప్పున ఇచ్చిన యెడల, సూతికారోగ సముదాయమెల్లను శీఘ్రముగ నివర్తించును.
2. " ఉప్పిచిగుళ్ళు దొరకనియెడల, ఉప్పి ఆకు రసము లేక అల్లము లేక తమలపాకులు లేక చిత్రమూలము, అనుయే రసముతో నైనను మాత్రలు చేయవచ్చును" మరియు నిది సన్నిపాతములు, ప్లీహ, గుల్మము, ఉదరము, గ్రహణి, అతిసారము, కలరా, అపస్మారము, మాంద్యజ్వరములు, సర్వ

వాతములను నివారించును. (1/8 తులం) బేడయెత్తు, 15 మోతాదులు ఇవ్వవలెను. రోగ బలానుసారముగ మోతాదు హెచ్చింపవచ్చును.

## నవలోహచింతామణి( బ.రా.)

10గ్రా. 50 మోతాదులు

(1) సితోఫలాది చూర్ణము రెట్టింపు చేర్చి కనకతోగాని, వాసకతోగాని, అల్లపురసము తేనె కలిపి కాచిన పానకముతో గాని క్షయ, శ్వాసకాసలు, ఉబ్బసములకు

(2) యష్టీమధుకము కషాయము తేనెతో గుండె బరువు, ఎగ ఊపిరికి

(3) సుగంధి, జీలకర్ర, చిత్రమూలము సమభాగచూర్ణము రెట్టింపు చేర్చి తేనెతో తిమిరవాతమునకు

(4) లోహతో గాని, పునర్నవతోగాని రక్త క్షీణతకును వాడవలెను.

## మహావాతరాక్షసము (ర.యో.ర.)

10 గ్రా. 60 మోతాదులు

(1) మిరియాల రసముతో సూతికాజ్వరము

(2) తమలపాకురసము తేనెతో పక్షవాతము

(3) అల్లపురసముతో సన్నిపాతమునకు

(4) వెల్లుల్లిరసముతో శరీరము చల్లబడిన వాతమునందు

(5) నాడిసన్నగిల్లి శరీరము చలువగ్రమ్మి రోగి అపాయస్థితిలోనున్నపుడు 1/4 గ్రామ కస్తూరి చేర్చి తులసి రసంతో దినమునకు 2,3,4 సార్లు వరకు యివ్వవచ్చును. వేడిచేసి ప్రాణాపాయస్థితి తగ్గినవెనుక క్రమముగా మోతాదులు తగ్గించవలెను.

## మహావాత రాక్షసము

1. బేడయెత్తు యీ ఔషధమునందు 9 మిరియములు వేసి, అల్లము, చిత్రమూలము, తమలపాకులు అనువాని యే రసముతో నైనను కందుల వలె మాత్రము చేసి, దారుణమగు వాతము వలన శరీర మాద్యంతము, చల్లబడి, స్మృతిదప్పి మాటలేకున్న సమయమున, పావుగంటకుగాని, తక్కువ కాలమునకు గాని, రెండేసిమాత్రలచొప్పున "అల్లము, వెల్లుల్లి, ములగవేరుచెక్క, తమలపాకులు అను వీనిలో యేరసముతోనైనను యిచ్చిన యెడల (యీ రసములలో అరుగదీసియు యివ్వవచ్చును.) అతిశీఘ్రముగ మిక్కిలివేడిని గలుగజేసి మాట్లాడించి, సన్నిపాతాదిదోషములను బోనణచి, ప్రాణమును రక్షించును. మరియు, సూతికావాతము, కంపవాతము, పక్షవాతము, శుష్కవాతము మొదలగు యెనుబదివాతములు, వాత

జ్వరములు, సన్నిపాతముజ్వరము, ద్వంద్వ జ్వరములకు, శీఘ్రముగ నివారణజేయును.
2. ఊపిరితిత్తులు, హృదయము, కార్జము అను శరీరమందలి ముఖ్యభాగములు చెడి, గొంతుకవరకు కఫము వృద్ధిజెంది, ప్రాణిపోవుటకు సిద్ధముగనున్నప్పుడు, చిత్రమూలరసములో చిన్న మెత్తు చొప్పున 5 మోతాదులిచ్చుసరికి కావలసినంత వేడిచేసి, ఔషధబలమున మాట్లాడించును.
3. తెల్లజిల్లేడు వేళ్లరసములో చిన్న మెత్తు అరుగదీసి 5 లేక 10 నిముషములకొకసారి యిచ్చిన యెడల యితర ఔషధములకు లక్ష్యము చేయని (కలరా) వాంతి భేది జాడ్యములు 3 మోతాదులకు తప్పక కట్టును.
4. "దుంప రాష్ట్రము, కళింగ రాష్ట్రము, లవంగములు" వీని చూర్ణము రెట్టింపు జేర్చి అల్లపు రసముతో నూరి, కందులవలె మాత్రలు చేసిన జామున కొక మాత్ర చొప్పున యిచ్చిన యెడల, వాతజ్వరములు, ద్వంద్వజ్వరములు 2 దినములలోనివారణమవును.
5. తేనెలోగాని, అల్లపురసములో గాని, అరుగదీసి 5 నిముషములు మొదలు ఒక జామువరకు రోగబలముననుసరించి కాలములను నిర్ణయించి యిచ్చిన పక్షమున, దారుణమగు వాతాదిరోగములను, వెంటనే నివారణజేయును. శ్లేష్మోద్రేకమును రానీయక శరీర వేడినినిల్పును
6. చనుబాలలో పావుచిన్నము గాని, అంతకుతక్కువ గాని, యరుగ దీసి యిచ్చిన యెడల, శ్లేష్మోద్రేకము, అజీర్ణము, డొక్కలెగరవేయుట అనుగుణములు గలిగెడు చంటి బిడ్డలకు 'బాలపాపచిన్నెలు' అనెడు వాయువువచ్చెడు జ్వరములు నివర్తించును.
7. తమలపాకురసముతో అరుగదీసి, గంటకొకసారి యిచ్చిన యెడల, 3,4 మోతాదులలో యెట్టిరుగ్మతమీదపుట్టిన, బహిశ్శీతలము (శరీర చల్లదనము) నైనను బారదోలి చర్మకాకనునిల్పును
8. స్థాళీ చూర్ణాను పానమును జేర్చి తేనెతో సేవించిన, శరీరమంతయునొప్పి, కీళ్ళనొప్పి, విడువని వాతజ్వరమును పారదోలును
9. దీనికి సమము శతపుర ఖడ్గలోహభస్మమును, వీనికి రెట్టింపు స్థాళీచూర్ణమును కలిపి, తేనెతో నిచ్చిన, వాతమున కీళ్ళు స్వాదీనముతప్పి, కీళ్ళయందునొప్పి, బాధకలుగుట, శ్లేష్మోద్రేకముగల (వాతనంజు) దారుణమగు శరీర ఉబ్బు, తిమ్మెర వాతమును, కంపవాతమును, నివారణజేసి, తేనెతో పుచ్చుకొనిన మూర్ఛ, చిరకాల మునుండి

విడువకుండు జీర్ణ జ్వరమును హరించును
11. “నెల్లివరుగు, కరక్కాయ, తానికాయ” వీని చూర్ణము రెట్టింపుజేర్చి, తేనెతో సేవించిన, మదమూర్ఛ, కాస, కామిల, మేహము నివర్తించును.
12. “పిప్పళ్ళు, తెల్లజీలకర్ర” వీని చూర్ణము లేక “కరక్కాయ, పిప్పళ్ళు, వీని చూర్ణము లేక “జీలకర్ర చూర్ణము, పంచదార” గాని రెట్టింపు జేర్చి అల్లపురసముతో నిచ్చిన వెంటనే వేడినీళ్ళనిచ్చుచు, ఉదయము, సాయంకాలముయిచ్చిన, మన్యపుజ్వరములు, చలి, వణుకు, విశేష తాపముతో కూడుకొనియుండు “చలిజ్వరము” తప్పక నివారణమవును.
13. “నెమలియీకెలబూడెద, ప్రత్తిగింజలలోని పప్పు, మాడ్చినజీలకర్ర”ను వీని చూర్ణమును సమముగా జేర్చి తేనెతో నిచ్చిన, దోషముల మీద పుట్టిన వాంతి వెంటనేకట్టును.
14. “లవంగములు, కళింగ రాష్ట్రము” కొద్దికొద్దిగను, పూటకు అరచిన్న మీ ఔషధమును, తేనెతో అరుగదీసి రాత్రులయందు సేవించుచు, శ్లేష్మవృద్ధికరములగు వస్తువులను విడచి భుజించుచు మూడుమాసములు సేవించిన, యెట్టికఠిన కాసశ్వాసలైనను, యెంతకాలమునుండి విడువకున్నను తప్పక నివారణమవును.
15. తేనెలో అరుగదీసి పావుచిన్నము ఔషధమును సదా రాత్రి పరుండబోవునప్పుడు పుచ్చుకొనుచుండువారికి జీవితకాలమంతయు, వైద్యావసరముండనేరదు. (ఇందు కస్తూరి, సువర్ణ మౌక్తి కాదులు చేర్చబడియున్నవి.)

## మహాకనకసిందూరము (వై.చిం.)

10 గ్రా. 100 మోతాదులు

క్షయకు ప్రఖ్యాతి వహించిన ఔషధము. ఇందు ప్రతి మోతాదునందున సగముకంటె హెచ్చు స్వర్ణ భస్మముకలదు. సకలోపద్రవ సహితమగు క్షయ, పాండువు, కామల, శ్వాసకాసలు, ఛర్ధి, అరుచి, జీర్ణ జ్వరము అపస్మారము, రక్తపిత్తము, ప్రమేహము, మొదలగు అనేక వ్యాధులు నివారించి బలము, వర్ణము, కాంతి, పుష్టి, శుక్రము, ఆయువు కలుగజేయు దివ్యౌషధము.

సితోఫలాదిచూర్ణము లేక తాలీసాదిచూర్ణము లేక లవంగాలు, వేచిన జీలకర్ర, దాల్చినచెక్క, ఏలకులు సమభాగ చూర్ణముతో గాని మజ్జిగలో నానవేసిన 3 మిరియములు, 3 గుంటగలగరచిగుళ్ళు ( సిద్ధమకర

ధ్వజమునకు చెప్పబడిన ప్రకారము) ఒక మోతాదు ఔషధముచేర్చి నూరిన మాత్రలను వాసక, చ్యవన ప్రాశ్యావలేహ్యాము, రసాయనితోగాని, సేవించవలెను.

**రస చింతామణి (వై.చిం.)**

10గ్రా. 50 మోతాదులు

(1) తులసిరసము తేనెతో శ్వాసకాసలు
(2) శొంఠి పిప్పలి మిరియాల కషాయంతో సన్నిపాతము
(3) అల్లపురసం తేనెతో పక్షవాతము అర్ధిత వాతములకు
(4) ఆకుచెముడాకురసంతో కఫము కంఠమున కెగదాసి గురక కలిగినపుడును బాలపాపచిన్నెలకు
(5) అతిమధురం కషాయం తేనెతో గుండెబరువు ఆయాసంనకు
(6) సదాపాకు రసముతో గురకతో కూడిక కఫమునకు
(7) శొంఠి, కరక్కాయ, లవంగాలు, వేచిన జీలకర్ర, సైంధవలవణము సమభాగ చూర్ణము ఔషధమునకు రెట్టింపు చేర్చి తేనెతో గొంతుకలోగురక, పిల్లి కూతలు గల దగ్గు "కనక" అనుపానముతో ఉబ్బసమునకు
(8) త్రిఫలకషాయముతో పాండు, ఉబ్బులకు
(9) తమలపాకురసము, మిరియాల చూర్ణముతో శరీరము చల్లబడినప్పుడును
(10) బాలపాపచిన్నెలు వచ్చు పిల్లలకు 2 వడ్ల గింజలయెత్తు ఔషధం చనుబాలతో కలపి యివ్వవలెను. ఎక్కువ వయస్సు గల పిల్లలకు బాలపాప చిన్నెలు వచ్చు నెడల శొంఠి, మిరియాల రసంతో కొంతకాలము వాడిన యెడల వ్యాధి తిరుగ ఎన్నటికిని రానేరదు. వాతశ్లేష్మహరమగు ప్రశస్తౌషధము.

## అష్టలోహపూర్ణచంద్రోదయము

10 గ్రా. 40 మోతాదులు

1) చాతుర్జాతక చూర్ణము ఔషధమునకు రెట్టింపు చేర్చి అల్లపురసము తేనెపటికిబెల్లము కలిపి కాచిన పానకముతో గాని, చ్యవన ప్రాశ్యావ లేహ్యాముతో గాని శుక్రనష్టము వలన గలిగిన క్షయ, శ్వాసకాసలకు
(2) వేపబంక, ఉసిరిక పప్పు, ఇండుపగింజలు వేయించిన మినపప్పు, నేలగుమ్ముడు సమభాగ చూర్ణము రెట్టింపు పంచదారతో శుక్రనష్టము, శీఘ్రస్ఖలనమునకు

(3) పెన్నేరు నేలతాడి, పిల్లి తేగలు, నేలగుమ్మడు, పల్లేరు దూలగొండి విత్తులు సమభాగ చూర్ణము ఔషధమునకు మూడు రెట్లు చేర్చి పంచదార కలిపిన పాలతో కండపుష్టికి, సంభోగశక్తిని వాడవలెను.

**రాజశిరోభూషణము ( ర.సా.సం.)**

10.గ్రా. 50 మోతాదులు

పక్షవాతమునకు పరమౌషధము

(1) అల్లపురసము తేనెతో పక్షవాతము మాట స్పష్టముగా రాని వాతము, మూతివంకర వాతమునకు

(2) సారస్వతతో బుద్ధి భ్రంశమునకు

(3) ఆముదపు వేరు కషాయముతో క్షణవాతమునకు, నరముల వాపునకును వాడవలెను.

**కనకబాల సూర్యోదయము ( వై. చిం.)**

10 గ్రాములు 50 మోతాదులు

1) తాలీసాది చూర్ణము రెట్టింపు చేర్చి తేనెతో క్షయ, కాసలకు

(2) చాతుర్జాతక చూర్ణము రెట్టింపు చేర్చి తేనెతో పాండువు, రక్త క్షీణత, జీర్ణజ్వరములకు

(3) నేల ఉసిరిక వేరు రసముతో కామలకు, అందువచ్చు జ్వరమునకు

(4) త్రిఫల కషాయముతో పాండు, ఉబ్బు, కామెర్లకు

(5) గుడూచి లేక కిరాత లేక పంచతిక్త పానకముతో అస్థిగత జ్వరము

(6) రెట్టింపు పొంగించిన వెలిగారము చేర్చి చనుబాలతో పిల్లల కడుపులో బల్లలు యకృత్ ప్లీహవృద్ధులకు

(7) అల్లపురసము తేనెతో అరుచికి వాడవలెను.

**విషమజ్వరాంతక లోహము (పుటపక్వము) ( భై.ర.)**

10 గ్రా. 60 మోతాదులు

ప్రతి మోతాదునకు సమం వేచిన జీలకర్ర చూర్ణము చేర్చుకోవలెను.

(1) మిరియాల రసముతో వాతజ్వరము

(2) అల్లపురసముతో పిత్తకఫ జ్వరములు

(3) తులసిరసముతో చలిజ్వరములు 1,2,3 రోజులకు వచ్చు వరుస జ్వరములు

(4) కిరాతతో గాని పంచతిక్త పానకముతో గాని సమస్త విషమజ్వరములు

(5) రోహితకతోగాని, గోమూత్రముతోగాని, జ్వరబిళ్లలు అగ్ని మాంద్యము, ఆమదోషము

(6) లోహాసవతోగాని, పునర్నవతోగాని, పాండు కామిలలు

(7) తమలపాకురసము, తేనెతో శ్వాసకాసలు హరించును. వరుస జ్వరములందు సుదర్శన చూర్ణము చేర్చి సేవించుట మంచిది.

**నారాయణ కవచము**

10 గ్రా. 50 మోతాదులు

ఔషధము 3గ్రా. వైక్రాంతము 5గ్రా. తాలీసాది చూర్ణము 10గ్రా. చేర్చి 25 పొట్లములు కట్టి అల్లపురసము తేనె కలిపి కాచినపానకముతో క్షయ, శ్వాసకాసలు, ఉబ్బస దగ్గు

(2) ఆకు చెముడాకు నిప్పుపై వెచ్చ చేసి తీసినరసంతో గొంతుకకురాసిన కఫమును దింపుటకు

(3) తమలపాకు లేక తులసియాకు రసముతో తేనెజేర్చి శిశువుల శ్వాసకాసలకు

(4) రెట్టింపు సితోఫలాది చూర్ణము చేర్చి తేనెతో గుండెబరువు, పురాణకాస, క్షయ కాసలకు వాడవలెను.

2. కరివేపాకు రసములో అరుగదీసి యిచ్చిన యెడల, దారుణమగు అజీర్ణము మీద కడుపు ఉబ్బి, చతుర్విధవాయువులు బంధించి, శ్వాసమందక మిక్కిలి ఆయాసమును గలుగజేయుచున్న కాస, శ్వాసలకు 5 లేక 10 నిమిషముల కొకసారి చొప్పున 3 మోతాదులు యిచ్చుసరికి "వారాంగనల యొక్క క్రీగంటిచూపు, పురుషుల చిత్తములనపహరించు చందంబున" కడుపు ఉబ్బుతీసి, కఫమును హరింపజేయును.

3. చనుబాలతోనూరి ఇచ్చిన, తాపయుక్త మగు కాస, శ్వాసలు;

4. చంటిబిడ్డలకు చనుబాలలో అరుగదీసి మోతాదు తగ్గించియిచ్చిన, గొంతునందు గురక, శ్లేష్మము నివర్తించును

5. అడ్డసరపాకు లేక తులసిఆకు లేక జిల్లేడు పువ్వుల రసములో అరుగదీసి యిచ్చిన యెడల, శ్లేష్మ మెదుర్కొని శ్వాస మందనీయక ప్రాణభీతిని గలిగించుచుండు కఠినకాస, శ్వాసలు 5 లేక 10 నిముషములకొకసారి చొప్పున 3 మోతాదులిచ్చుసరికి, కఫమును "బ్రహ్మాస్త్రమువలె" ఖండించి, జీవమును నిలుపును (ఇందు సువర్ణము చేర్చబడినది)

**లఘు నారాయణ కవచము**

1. ఈ ఔషధము అరచిన్నమున్ను, కొద్దిగ దుంపరాష్ట్రమున్ను, తేనెలో అరగదీసి యిచ్చిన యెడల, కాస, శ్వాసలు,

2. కరివేపాకు రసముతో నిచ్చిన, అజీర్ణముతో కూడుకొనిన శ్వాసలు; 3. పల్లేరు రసముతో అరుగదీసి యిచ్చిన యెడల, కఫోద్రేకముగల, దారుణ కాసశ్వాసలు నివారణమవును.

## నారాయణ కవచము

1. ఈ ఔషధము అరచిన్నమున్ను, సన్న రాష్ట్రము, కరక్కాయ, లవంగమొగ్గలు" కొద్దికొద్దిగను, తేనెతో అరుగదీసి ఇచ్చిన యెడల, కఫము తెగిపడక, ఊపిరినందనీయకుండుట, గొంతుకునందు వుండవలెనుండుట గుటకనేయుట కష్టతరముగానుండుట గల కఠినమగు దగ్గు. వగరపును, విష్ణు చక్రము పాపులను ఖండించునట్లు పరిహరించును

## స్వర్ణకాంతవల్లభరసము (ర.యో.ర.)

10గ్రా. 40 మోతాదులు

(1) సితోఫల లేక తాలీసాది చూర్ణము రెండు రెట్లు చేర్చి తేనెతో క్షయ శ్వాసకాసలు

(2) తేనెతో కళ్లెదగ్గు

(3) చాతుర్జాతకచూర్ణము రెట్టింపు చేర్చి తేనెతో పాండు, అరుచి, రక్తవృద్ధికి

(4) త్రిఫల కషాయముతో ఉబ్బు

(5) ద్రాక్షపండ్ల రసముతో రక్తహీనత, నరముల బలహీనత

(6) త్రికటుచూర్ణము తేనెతో తిమ్మెరలు

(7) రెట్టింపు పొంగించిన వెలిగారము తేనెతో యకృత్ప్లీహవృద్ధులు

(8) వావిలి చిగుళ్ళు కషాయముతో జీర్ణజ్వరము

(9) సుగంధి, జీలకర్ర, లవంగాలు, ధనియాలు చూర్ణము రెట్టింపు జేర్చి తేనె పంచదారలతో రక్తశుద్ధికి, బలమునకు, ఆరోగ్యమునకు ప్రసస్తమైనది.

## వైక్రాంత చంద్రోదయము (ర.త.)

10గ్రా. 35 మోతాదులు

(1) రెట్టింపు సితోఫలాది లేక తాలీసాది చూర్ణము చేర్చి తేనె అల్లపురసము పటికిబెల్లం వేసి కాచిన పానకముతో క్షయకు

(2) ద్రాక్షపండ్ల రసముతో శ్వాసకాసలు రక్తహీనత, నరముల బలహీనత

(3) పటికిబెల్లముతో పొడిదగ్గు

(4) వాసకతో గుండె బరువు, ఆయాసము, రక్తపిత్తము

(5) చందన కషాయముతోగాని, మద్దిచెక్క రసము లేక అర్జునతో హృద్రోగము

(6) చ్యవనప్రాశలో సమస్త కఫదోషములు, గుండెలా రుకుపోవుట, ఊపిరితిత్తులలోని దోషములకు వాడవలెను.

**కాంత వల్లభరసము (బ.రా.)**

10.గ్రా. 40 మోతాదులు

1) తాలీసాది, సితోఫలాదిచూర్ణము రెట్టింపుచేర్చి తేనెతో కళ్ళెదగ్గు, శ్వాస, కాసలకు

(2) చాతుర్జాతక చూర్ణము చేర్చి తేనెతో పాండు అరుచి, రక్త వృద్ధికి

(3) త్రిఫల కషాయముతో ఉబ్బు

(4) త్రికటు చూర్ణముతో తిమ్మెరలకు

(5) రెట్టింపు పొంగించిన వెలిగారము తేనెతో యకృత్ప్లీహవృద్ధులను తగ్గించి రక్తము పట్టించును.

**కాంత వల్లభరసము**

1. దీనికి రెట్టింపు స్థాలీ చూర్ణమును జేర్చి, తేనెతో నిచ్చిన, పాండువు, (శోఫ) మేహవాతనంజు

2. పెన్నేరు త్రిఫలములు" వీని చూర్ణమును రెట్టింపుచేర్చి, నెయ్యి, తేనె లేక మేకపాలతో నిచ్చిన ఉబ్బసము, కాస, శ్వాసలు

3. చాతుర్జాతక చూర్ణమును రెట్టింపు చేర్చి తేనెతో నిచ్చిన జ్వరములు అరుచి, అగ్నిమాంద్యములు

4. నేలగుమ్మడి, నేలతాడి, ధనియాలు వీని చూర్ణమును రెట్టింపు చేర్చి, పటిక పంచదార చూర్ణము, ఆవు వెన్నతోపుచ్చు కొనిన, వీర్యవృద్ధి, శరీరపుష్టి, శరీరకాంతి, బలము కలుగును.

5. దీనికి సమము శతపుటఖడ్గలోహ భస్మము కలిపి, స్థాలీ చూర్ణముతో నిచ్చిన, వాతజబ్బు నివర్తించును. ఇది సర్వపాండువుల, క్షయలనుహరింపజేసి, దేహమున కారోగ్యమునుగలుగజేయును. ఆదివిష్ణువుచే నిర్మింపబడిన కాంతవల్లభరస మనంబడును.

**చతుర్లోహ రసాయనము**

10గ్రా. 50మోతాదులు

1) తేనెతో శ్వాస కాసలు, ఉబ్బసము, మేహవాత నొప్పులు, తిమిర వాతము, కీళ్ళపట్లు, అగ్నిమాంద్యములకు

(2) తిప్పతీగ, శొంఠి, నేలవేము కషాయముతో చిరకాల జ్వరమునకు

(3) తమలపాకురసము తేనెతో కఫ ప్రకోపమునకు వాడవలెను.

చతుర్లోహరసాయనము

1.ఈ ఔషధము అరచిన్నము, కొంచెము కరక్కాయ తేనెతో అరుగదీసి యిచ్చిన యెడల, వాత శ్లేష్మములు, శ్వాసకాసలు, నివర్తించును

2. దీనికి రెట్టింపు "రేవల్ చిన్ని, కరక్కాయ, కరివేపాకు, కటుక రోహిణీ" వీని చూర్ణమును చేర్చి, అల్లపురసముతో నిచ్చిన, మూత్ర విరేచనములను, క్రమముగ జరుపుచు ఉబ్బుజాడ్యములను నివారణచేసి ఆకలిని గలిగించును

3 . చాతుర్జాతక చూర్ణమును రెట్టింపుచేర్చి, తేనెతో నిచ్చిన, కాసశ్వాసలు, ఆమ్లవాతము, ఆమ్లపైత్యాదిరోగములు

4. దీనికి రెట్టింపు స్థాళీచూర్ణమును చేర్చి, తేనెతోనిచ్చిన, కఫయుక్త మగుశోఫ, (ఉబ్బు) పాండువు, కుంభకామిల, నివారణమవును

5. త్రికటుకములు, పంచలవణములు, చిత్రమూలము, పొంగించిన వెలిగారము, నీలివేరు, యవక్షారము వీని చూర్ణమును రెట్టింపు చేర్చి నేతితో పుచ్చుకొనిన, శూలగుల్మము నివారణమవును.

## ప్రవాళచంద్రోదయం

10గ్రా. 50 మోతాదులు

1) వాసకతో గుండెబరువు, రక్త పిత్తముకు

(2) తాలీసాది లేక సీతోఫలాదిచూర్ణము చేర్చి అల్లపురసం తేనెతో క్షయకు

(3) పటికబెల్లము తో పొడిదగ్గుకు

(4) చ్యవన ప్రాశ్యావలేహ్యంతో సమస్త కఫ దోషములకు వాడవచ్చును.

## కఫకేసరి (బ.రా.)

10 గ్రా. 40 మోతాదులు

1) తమలపాకు రసం తేనెతో ఆయాసము, కఫశూల, గుండెబరువునకు

2) రెట్టింపు లవంగాల చూర్ణము చేర్చి అల్లపు రసము తేనెతో గట్టిపడిన కఫము కరిగి గుండెబరువు తగ్గుటకు గొంతులో గురక, రొమ్మునొప్పి, కఫ, ప్రకోపము శ్వాసకాసలకు

(3) చనుబాలతో శిశువుల కాస, ఎగరోప్పు నివారించును.

## వంటబాలసూర్యోదయము (బ.రా.)

10గ్రా. 40 మోతాదులు

1) గుంటకల్గరరసముతోగాని, పంచతిక్త పానకముతోగాని సేవించిన జీర్ణజ్వరము

(2) జీలకర్ర రసముతో గర్భిణీ జ్వరములకు
(3) వేచిన జీలకర్ర, లవంగాలు, ఏలకులు, ధనియాలు చూర్ణము రెట్టింపు చేర్చి తేనెతో శ్లేష్మ జ్వరము, క్షయ, శ్వాసకాసలకు
(4) అల్లపురసము తేనెతో ఆరుచి, పీనస, పాండువు
(5) శొంఠి ధనియాలు జీలకర్ర చూర్ణము రెట్టింపు చేర్చి పటికి పంచదారతో గర్భిణులకు కలుగు వేవిళ్లకు వాడవలెను.

**వ్యాధిహరణరసము (వై. చిం.)**

10 గ్రా. 40 మోతాదులు

ఒక మోతాదు తమలపాకులో చుట్టి నమలి మ్రింగుచుండిన సమస్త సవాయిలు, సవాయి మచ్చలు, పరిణామశూల
(2) ఫిరంగి చెక్క, ధనియాలు, సుగంధి కషాయముతో కొరుకు బగ్గి, పుండు మొదలగు సవాయిలన్నిటికిని
(3) సమము వంగభస్మము కలిపి సుగంధి కషాయముతో తెల్లకుసుమ
(4) మధుస్ను హీరసాయనము లేక సుగంధాది లేహ్యముతో శరీరము అరచేతులు, అరకాళ్ళు, వీనిపై గలుగు మచ్చలకు వాడవలెను.

**దివ్య సింధూరము (ర.సా.ప్ర.సం.)**

10 గ్రా. 50 మోతాదులు

1) శారివ, ఖదిర, సుగంధాది లేహ్యము, మధుస్నుహీరసాయనము వీనిలో దేనితోనైనను సవామేహము, మచ్చలు, పొడలు
(2) తమలపాకులో చుట్టి నమిలి మ్రింగుచున్న సవామేహ సంబంధమగు మచ్చలు తగ్గి రక్తశుద్ధి కలుగుటకును
(3) వెన్నతో కామవృద్ధికి బలమునకు
(4) చనుబాలతో కఫశరీరముగల పిల్లలకు చిక్కినపిల్లలకు
5) ద్రాక్ష పండ్లరసము లేక పాల మీది మీగడ పంచదారతో కండపుష్టి, ఉత్సాహము కాంతికి వాడవలెను. రక్తమును పట్టించురాజౌషధము.

**ప్రళయాగ్ని రుద్రరసము**

1) గుంటకలగరాకు 5గ్రా. మిరియాలు 9, ఔషధము 2గ్రా. నూరి 15మాత్రలు చేసి సన్నిపాతమునందును
2) ఉప్పిచిగుళ్ళు 5గ్రా. మిరియాలు 1గ్రా. ఔషధము 2గ్రా. కలిపి 15 మాత్రలు చేసి వేడినీళ్ళతో సూతికాజ్వరము

3) మిరియాలరసముతో తరుణజ్వరము
(4) ఔషధము 2గ్రా. మునగ పూవులు 6, తమలపాకులు 3 నూరి 11 మాత్రలు చేసి జామునొక మాత్ర చొప్పున యిచ్చిన సంగమ దోషజ్వరము కఫవాత జ్వరములు నివారించును.

## శ్వాసకుఠారము (వై.చిం.)

10 గ్రా. 40 మోతాదులు

1) వెల్లుల్లి రసము తేనెతో ఊర్ధ్వ శ్వాస, వాతకాస, కఫము పలచబడుటకు, సన్నిపాతమునందును
2) అడ్డసరపాకురసము తేనెతో ఉబ్బసము
3) అతిమధురకషాయము తేనెతో గుండె బరువు, ఎక్కిళ్ళు నివర్తించును.

## రసరాట్టు

10గ్రా. 40 మోతాదులు

1) చనుబాలు లేక తేనెతో చంటిబిడ్డ దగ్గు, పడిశము, జ్వరము
2) జీలకర్ర, లవంగాలు కొంచెము వేయించిన చూర్ణము రెండురెట్లు చేర్చి తమలపాకురసము తేనెతో కఫవాతములు, గొంతుకలో గురక, కఫప్రకోపము రొమ్ము నొప్పి, శ్వాసకాసలు
(3) మిరియాలు, శొంఠి కషాయముతో గర్భకఫము పలచబడి దగ్గు తెగుటకును వాడవలెను.
1. ఈ ఔషధము అరచిన్న మున్ను, దుంపరాష్ట్రము, కరక్కాయ కొంచెము కొంచెమున్ను, తేనెతో అరుగదీసి ఇచ్చిన యెడల, వాత శ్లేష్మములు కాస, శ్వాసలు, గొంతునందు వుండవలెనుండుట, రొమ్మునందు భారముగా నుండుట, నివారణమవును
. 2. దీనికి రెట్టింపు మిరియముల చూర్ణము జేర్చి అరటిపండులోవుంచి పుచ్చుకొనిన, చిరకాలము నుండి యుండు క్షయ,
3. జిల్లేడు వేళ్లరసముతో గాని అడ్డసరపాకురసముతో గాని, అరుగదీసి శ్లేష్మమెదుర్కొని శ్వాసము విడుచుటకష్టతరముగా నున్న సమయమున యిచ్చిన యెడల వెంటనే శ్లేష్మమును ఖండించును.
4. దీనికి సమము “శతపురఖడ్గలోహభస్మము”న్ను రెండెంటికి సమము స్థాలీచూర్ణము జేర్చి, అల్లపురసము, తేనెతో పుచ్చుకొనిన, కఫయుక్తమగు కాళ్ళు, చేతులు స్వాధీనము తప్పిన తిమ్మెర, నరములబారుతో కూడుకొని యుండు వాత ఉబ్బును నివారణచేసి, జఠరదీప్తినిచ్చి శరీర దారుఢ్యమును గలిగించును.

## లోకనాథరసము (బ.రా.)

10 గ్రా. 30 మోతాదులు

1) అడ్డసరపాకు రసము తేనెతో క్షయ

(2) తేనెతో జీర్ణజ్వరము, ఉబ్బు శ్వాసకాసలు, పాండువునకు

3) శొంఠిరసముతో అగ్నిమాంద్యమునకు వాడవలెను.

## మేహవంగరాజీయము (వై.చిం.)

10 గ్రా. 40 మోతాదులు

1) తెల్లకలువదుంపల చూర్ణము రెట్టింపు చేర్చి బియ్యపు కడుగు తేనెతో తెల్లకుసుమ

(2) మోదుగ చెక్క రసముతో ఎర్ర కుసుమ

(3) రేవల్చిన్ని లేక పల్లేరువేళ్ళ కషాయముతో మూత్రకృచ్ఛ మూత్రాఘాతములకు

4) రక్త చందనము లొద్దుగ చెక్క కషాయముతో యోని దోషములకు

(5) వెన్న, పంచదార అనుపానముతో మేహములకు వాడవలెను.

## హేమ సుందరరసము (ర.త.)

10 గ్రా. 40 మోతాదులు

1) చలవమిరియాలు, చందనము, కచ్చూరాలు, పచ్చ కర్పూరము చూర్ణించి ఔషధమునకు రెట్టింపు చేర్చి పల్లేరువేళ్ళ రసము లేక చందనతో సెగ

2) చందనాదిచూర్ణము రెండు రెట్లు చేర్చి బియ్యపు కడుగు తేనె లేక పంచదారతో తెల్లకుసుమ

(3) ప్రత్తి గింజలపప్పు జీలకర్ర, ఏలకులు, వీని చూర్ణము రెట్టింపు కలిపి తేనెతో ఛర్ది అరుచికి

(4) మంచిగంధము సుగంధి ఏలకులు చూర్ణము రెట్టింపు చేర్చి పేరిన నేతితో నోటిపూతకు

(5) వేచిన జీలకర్ర చూర్ణము రెట్టింపు చేర్చి పంచదారతో చిడుము, గజ్జి, వంటిపై నల్లని మచ్చలు, దురదలకు

(6) సుగంధికషాయముతో కీళ్ళనొప్పులకు

(7) శారివ సుగంధాది లేహ్యము, మధుస్నుహీరసాయనము, శైలూషాది రసాయనములతో కలిపి సేవించిన రక్తశుద్ధి, బలము కలిగించును.

1. దీనికి రెట్టింపు చలువ మిరియముల చూర్ణమును చేర్చి పటిక పంచదార వెన్న లేక చందిని అత్తరువుతో సేవించిన సగ, ప్రమేహము

2. దీనికి రెట్టింపు సుగంధి చూర్ణమును చేర్చి పటికపంచదార చూర్ణముతో నిచ్చిన, సవా మేహవాతము 3. రెట్టింపు తెల్లజీలకర్ర చూర్ణము జేర్చి పటికపంచదార పొడి, వెన్నతో యిచ్చిన శేష్మవుడుకు, కాళ్ళమంటలు, పైత్యపు వుడుకు, నివారణమవును.

## శ్లేష్మాంతకరసము (బ.రా.)

10గ్రా. 35 మోతాదులు

వేచిన లవంగాలు, జీలకర్ర, దుంపరాష్ట్రం చూర్ణము రెట్టింపు చేర్చి తేనెతోగాని తమలపాకు రసముతోగాని, కనకతోగాని వాడిన కఫమును పలుచన చేసి ఊపిరితిత్తులకు విశ్రాంతి నొసగును. కఫము, దగ్గు ఆయాసము తగ్గించును.

## శ్లేష్మ గజాంకుశము (వై.చిం.)

10 గ్రా. 45 మోతాదులు

1) తమలపాకురసము తేనెతో దగ్గు ఒగర్పు స్వర భేదము, జ్వర సంబంధమగు దోషములు

(2)చనుబాలతో ప్రస్తుతము పిల్లలకు ఆనాసలని చెప్పబడు వ్యాధులకు గురక, దగ్గులకు

(3) కఫము తెగక మిగుల ఆయాసముగా నున్నపుడు సమము లఘులక్ష్మి విలాసరసమును కల్పి అల్లపురసము పటికిబెల్లం కలిపి కాచిన పానకముతో వాడిన కఫమును కరిగించి శ్వాసను తగ్గించును

(4) తేనెతో ఉబ్బు, తిమ్మెరలు కూడా నివర్తించును.

## నవగ్రహి (భై.ర.)

10 గ్రా. 100 మోతాదులు

1. ఆకుచెముడాకురసముగాని, వెల్లుల్లి రసముగాని, అల్లపురసముతో గాని కఫము కంఠమున కెగదాసి శరీరము చల్లబడినపుడు

2. మిరియాలు గుంటకలగర చిగుళ్ళతో కల్పి నూరిన మాత్రలు రోజుకు రెండు సేవించిన భయంకరమైన సవాయిలు మహాజ్వరములు, సమస్త వాతములు

(3) వెన్నతో పరిణామశూల, భగంధరము గ్రంధులకు వాడవలెను

4. చనుబాలతో సన్నిపాతములందును వాడవలెను. తరుచు చనుబాలను, బార్లీ గంజిని ఆహారముగ నిచ్చుట మంచిది.

## నవగ్రాహి

1. అల్లపు రసముతో నూరి, గురిగింజలవలె మాత్రలు చేసి, అల్లపురసము అనుపానముగ జేర్చి రోగబలాను సారముగ కాలమును నిర్ణయించి ఒక్కొక్క మాత్ర చొప్పున ఇచ్చిన గాని

2. అల్లపు రసములో అరుగ దీసి ఇచ్చిన గాని, ప్రాణాపాయ స్థితియందున్న సన్నిపాత రోగానైనను ప్రాణమును రక్షించును మరియు మహావాతము, దోషయుక్తమగు ఎనుబది విధములగు జ్వరములు నివర్తించును

3. తేనెతోగాని, అల్లపు రసముతో గాని అరుగదీసి యిచ్చిన యెడల, కఫమెదుర్కొని శ్వాసఅందక ప్రాణభీతిని గలిగించుచుండు శ్వాసను "విష్ణు చక్రము పాపాత్ముల శిరస్సుల ఖడించునట్లు; మన" కఫమును ఖండించి ప్రాణ రక్షణజేయును.

4. చంటిపిల్లలకు తేనెతో గాని చనుబాలలో గాని అరుగదీసి యిచ్చిన యెడల, కఫము, వాతము, నివారణమవును ఈ ఔషధమువిశేష వేడిని కలుగజేయును గనుక జబ్బు స్థితి కఠినముగా నున్నప్పుడే దీనినుపయోగింపవలెను. విస్తారకాలముపయోగించితే అతి వేడిచేయును. చంటిపిల్లలకు స్వల్పమోతాదు నివ్వవలెను.

## షడ్గుణ సింధూరము (ర.త.)

10గ్రా. 40 మోతాదులు

1. రాత్రి ఆవు మజ్జిగతో 5 మిరియపు గింజలు నానవేసి ఉదయమున తీసి 3 గుంటకలగర చిగుళ్ళు ఒక మోతాదు ఔషధము చేర్చి నూరి ఉదయంనను ఇట్లే ఉదయమున నానవైచిన మిరియాలు గుంటకలగర చిగుళు నూరిన మాత్ర సాయంకాలమున సేవించిన జీర్ణజ్వరము, అగ్నిమాంద్యము, పాండు, అరుచి, రక్త క్షీణము

2. రెట్టింపు జీలకర్ర చూర్ణము వెన్న కలిపి సేవించిన గుండెల లోను, కడుపులోనుపుట్టు మంటకు

3. అభ్రకభస్మము, శిలాజిత్తు, షడ్గుణ సిందూరము, కలిపి వేచిన జీలకర్ర చూర్ణము 1/2 గ్రాము చేర్చి వెన్న పంచదారతో సకల మేహములు నివర్తించి బలము, పుష్టి, ధాతువృద్ధి, రక్తశుద్ధి కాంతి, ఆయుర్వృద్ధి కలిగించును.

4. సుగంధి కషాయము లేక శారివతో చిడుము, మొ॥ చర్మ వ్యాధులకు

5. లేత కొబ్బరి కాయ నీళ్లతో మూర్ఛ, అపస్మారములకు

6. ద్రాక్షపండ్ల రసముతో గర్భవృద్ధికి, గర్భస్రావము రాకుండా కాపాడుటకు వాడవలెను.

## షడ్గుణము

1. త్రిసుగంధ చూర్ణము రెట్టింపు చేర్చి పటికబెల్లము చూర్ణము, వెన్నతో పుచ్చుకొనిన, నిక్కాక వలన కలిగిన రక్త క్షయమును నివర్తింపచేసి రక్తమును బుట్టించును.
2. త్రికటుక చూర్ణమును సమముగ జేర్చి, అల్లపురసము లేక తేనెతో పుచ్చుకొనిన, అగ్నిమాంద్యము;
3. చాతుర్జాతక చూర్ణము రెట్టింపు చేర్చి తేనెతో పుచ్చుకొనిన, క్షయ, పాండువు, మేహతిమ్మెర, నివారణమవును.

## వాతాగ్ని కుమారము (బ.రా.)

10గ్రా. 40 మోతాదులు

1. తమలపాకురసము తేనెతో కఫవాతములు
2. తులసి ఆకురసము తేనెతో లేక పంచతిక్త పానకముతో చలి జ్వరము, జీర్ణ జ్వరము
3. మిర్యాల రసముతో కీళ్ళ నొప్పులు, నరముల తీపు హరించును.

## దరదపర్పటి (యో.ర.)

10 గ్రా. 60 మోతాదులు

1. చనుబాలతో పెసరబద్దంత ముక్క చాదియిచ్చిన చంటిబిడ్డల దగ్గు ఆయాసము, జలుబు, డొక్కలెగురవేయుట, వాంతులకు
2. కరక్కాయ దుంపరాష్ట్రము అరగదీసిన గంధముతో పెద్దవారల దగ్గుకు
3. రసరాట్టుతో చేర్చి అరుగదీసి వాడినచో కఫము పలుచబడుటకు వాడవలెను.

## పంచబాణరసము (యో.ర.)

10గ్రా. 50 మోతాదులు

1. వేచిన మినపప్పు, పెన్నేరు, గొబ్బి గింజలు, నేల గుమ్ముడు సమభాగచూర్ణము 10గ్రా. 100గ్రా. కాచిన ఆవుపాలలో కలిపి కొద్దిగ పంచదార కలిపి ఉదయము ఒకమాత్రతో సేవించుచుండిన వీర్యము చిక్కబరచి సంభోగానంతరము కలుగు నడుమునొప్పి, కాళ్ళతీత నివారించును కామకుతూహలమొసగును. సాయంత్రమున ద్రాక్ష పండ్ల రసముతో సేవించవలెను.. తెల్లచక్ర కేళీ అరటిపండు సగములో ఒక మాత్ర నుంచి పంచదార అద్దుకొని సేవించుచుండిన వీర్యము స్తంభించును, చిక్కబడును

.3 అతి సంభోగము, హస్త ప్రయోగము మొదలగు కారణములచే పురుషావయవము సోలిపోయి లేపనశక్తి లేనివారు మదనకామేశ్వరి లేహ్యముతో సేవించుచు ప్రమేహమిహిరతైలము దినమునకు రెండుసార్లు మర్ధన చేయుచున్న పురుషాంగమునకు మంచిపటుత్వము, బలము కలుగును

4. ఉదయమున ఒక మాత్రవేసుకొని నేతితోచేసిన మినపప్పు గారెలు రెండును, సాయంకాలమున మెత్తగాచేసిన రెండు గోధుమ రొట్టెలను తిని పంచదార కలిపిన పాలను త్రాగుచుండిన అధికమైన శరీరపుష్టి, నరములయందు పటుత్వము సంభోగశక్తి కలుగును. మలబద్ధము తొలగును.

5. ఎండు ఖర్జూరపు కాయను తొలచి గింజను తీసివైచి అందొక మోతాదు ఔషధమునుంచి నమిలి మ్రింగి పంచదార కలిపిన పాలతోకూడా సేవించవచ్చును.

## స్వర్ణ మాలినీవసంతము (యో.ర.)

10గ్రా. 50 మోతాదులు

1. రెట్టింపు పిప్పలి చూర్ణము తేనెతో క్షయ, శ్వాసకాసలు
2. ఖర్జూరపు పండ్లరసముతో రక్తకాస, రక్తపిత్తము
3. సమము మిరియాల చూర్ణము చేర్చి గుంటకలగరాకు రసంతో జీర్ణజ్వరము ధాతుగత జ్వరములు
4. నేలయుసిరికవేరు రసంతో పాండు, కామల
5. లేత దానిమ్మ కాయలరస మందు తేనెగాని పంచదార గాని చేర్చి రక్తార్మస్సు, రక్త ప్రదరము, రక్తదోషమునకును
6. తేనెతో పసిపిల్లలకు గలుగు సమస్త వ్యాధులును
7. వెన్న పంచదారతోగాని ధనియములు జీలకర్ర రసముతోగాని గర్భిణులకు వాడవలెను. ఔషధ సేవన కాలమందు పాలు, అన్నము తినుట మంచిది.

## శ్రీజయమంగళరసము (బ.రా.)

10గ్రా. 50 మోతాదులు

1. మిర్యాలరసముతో వాతజ్వరము, అల్లపురసముతో పిత్తజ్వరము పిప్పలిచూర్ణము తేనెతో కఫజ్వరమునకు
2. తులసి రసముతో చలిజ్వరమునకు

3. వేచిన జీలకర్ర చూర్ణము తేనెతో వాంతిగల జ్వరమునకు కడుపులో మంటతో వచ్చు జ్వరమునకు
4. గుడూచి లేక కిరాత లేక పంచతిక్త పానకముతో రసరక్తాది సప్తధాతుగతజ్వరములు, క్రిమిజ్వరములు అంతర్గత జ్వరములందు పుట్టు రక్త క్షీణత, దగ్గు, కఫములకు వాడవలెను.

## మహామేహాంతకరసం

10గ్రా. 50 మోతాదులు

1. వేచిన జీలకర్ర చూర్ణము, తిప్పసత్తు రెట్టింపు చేర్చి, వెన్న, పంచదారలతో మేహవుడుకు, శుక్రనష్టము, శరీరపుమంట, తలనొప్పి, హృదయ దౌర్బల్యమును తగ్గించును. మధుమేహాది సమస్త మేహములకు వాడవచ్చును.

## మహాసింధూర భూషణము

10గ్రా. 50 మోతాదులు

అనుపానము : 1. మాదీఫలరసాయనముతో గర్భిణులకు కలుగు వేవిళు ్ళ, కడుపులో త్రిప్పు, వమనములకు

2. ఔషధమునకు రెట్టింపు చాతుర్జాతకచూర్ణము లేక వేచిన జీలకర్ర చూర్ణము చేర్చి ద్రాక్షపండ్ల రసముతో గర్భిణుల వేవిళ్ళు వమనములకు, ఉడుకు, గ్రీష్మ తాపము, పొడిదగ్గుకు
3. ధనియములు జీలకర్ర రసము పటికిబెల్లముతో కడుపు, గుండెలయందు పుట్టు మంటకు
4. అల్లపురసము తేనె పటికిబెల్లము కలిపి కాచిన పానకముతో కఫము, దగ్గు, ఆయాసము, శ్లేష్మ పైత్యమునకు
5. వెన్నతో శుక్రనష్టమునకు వాడవలెను.

## ఏకోత్తరవృద్ధి మహాలక్ష్మి విలాసరసము

దీనికే క్రమవృద్ధి లేక భాగవృద్ధి మహాలక్ష్మి విలాసరసమనియు వాడుకగలదు.

10గ్రా. 50 మోతాదులు

1. రెట్టింపు తాలీసాది చూర్ణము చేర్చి తేనె అల్లపురసము పటికిబెల్లము కలిపి కాచిన పానకముతో క్షయ, శ్వాసకాసలు
2. సమము తిప్ప సత్తుచేర్చి నిప్పుపై కాచితీసిన అడ్డసరపాకురసమునందు తేనె చేర్చి కళ్లెయందు రక్తముపడు దగ్గు, రక్తపిత్తమునకు

3. రెట్టింపు సితోఫలాది చూర్ణము జేర్చి లవంగములు దాచినచెక్క ఉ సిరికవరుగు కషాయము నందు పటికిబెల్లం చేర్చి మొండిదగ్గులకు

4. రసాయనితో కృశత్వమునకు, రక్తహీనతకు వాడవలెను. అన్ని తత్వములకు అనుపాన విశేషములచే సర్వరోగములు నివారించగల దివ్యౌషధము క్షయరోగులు ఔషధ సేవనానంతరము 10గ్రా. చ్యవనప్రాశము సేవించవలెను. వాసకను కూడా వాడవచ్చును.

## యోగేంద్రరసము (భై.ర.)

10 గ్రా. 55 మోతాదులు

1. పటికిబెల్లం చేర్చిన బియ్యపు కడుగుతో నరముల బలహీనత నష్టేంద్రియ వాతము, నడుమునొప్పులకు

2. ద్రాక్షపండ్ల రసము లేక రసాయనితో గుండెదడ, నొప్పి, రక్తహీనతకు, శుక్రవృద్ధికి

3. లోహతో పాండువునకు

4. సారస్వతతోగాని, సరస్వతీ లేహ్యముతోగాని బుద్ధి వికాసమునకు అశ్వగంధతో మూర్ఛ, అపస్మారములకు వాడవలెను. ఈ ఔషధము సేవించుచున్నంతకాలము రాత్రులందు పటికిబెల్లము కలిపిన ఆవుపాలు సేవించుట
మంచిది.

## రసరాజరసము (భై.ర.)

10గ్రా. 50 మోతాదులు

1. అశ్వగంధతో యోషాపస్మారమునకు

2. దూలగొండి వేరు కషాయముతో నేయి కలిపి మూర్ఛకు

3. అల్లపురసము తేనెతో పక్షవాతమునకు

4. మారేడాకు రసముతో బుద్ధిమాంద్యము, చిత్త భ్రమకు వాడవలెను.

5. వాతవ్యాధులకు దశమూలకూడా అనుపానముగా వాడవచ్చును. మూర్ఛ, అపస్మారములకు ప్రశస్తిగాంచిన ఔషధము.

## బృహత్ కస్తూరీభైరవి (భై.ర.)

10గ్రా. 60 మోతాదులు

1. అల్లపురసముతో సన్నిపాతము

2. తులసి లేక గుంటకలగర రసము లేక గుడూచి, లేక కిరాతతో చలిజ్వరము, విషమజ్వరములు

3. మిర్యాల రసముతో వాతజ్వరములు
4. తమలపాకు లేక అక్కలకర్ర రసముతో సూతికా జ్వరము
5. 9 మునగ మొగ్గలు, 15 మిరియాలు, 5 తమలపాకు ముచికలు, 5 మోతాదులు ఔషధము కలిపి నూరి 5మాత్రలు చేసి గంటకొక మాత్రచొ॥న తమలపాకు రసముతో సంగమదోష జ్వరమునకు
6. ఆకు చెముడాకు రసముతో శ్లేష్మ ప్రకోపమునందును వాడవలెను.

## బృహద్వాత చింతామణి (భై.ర.)

10 గ్రా. 50 మోతాదులు

1. బియ్యపు కడుగు తేనెతో నరముల తీపు పోట్లకు, రక్తపోటునకు
2. వావిలిచిగుళ్ల కషాయముతో గర్భవాతము
3. శొంఠి, తిప్పతీగె, కళింగ రాష్ట్రము కషాయముతో ఆమవాతము
4. దూలగొండివేరు కషాయమున నేయిజేర్చి మూర్ఛ, మతిభ్రమణము వాతవుపొలలకు
5. సోపు మంచి గంధము కషాయముతో నిద్ర కలిగించుటకు
6. ఆముదపు వేరు కషాయముతో క్షీణవాతము, నరముల వాపునకు వాడవలెను.

## శ్వాస చింతామణి (భై.ర.)

10 గ్రా. 50 మోతాదులు

1. తమలపాకు రసము తేనెతోగాని, ఆకు చెముడాకురసము తేనెతో గాని తీవ్రమగు శ్వాస
2. అల్లపురసము తేనెతోగాని, వాకుడు వేరు రసము తేనెతోగాని, మేకపాలు తేనెతోగాని శ్వాస హిక్కలకు
3. రెట్టింపు తాడి కాయలు కాల్చి చేసిన చూర్ణము తేనెతో సామాన్య శ్వాస, ఉబ్బసదగ్గులకు
4. కనక అనుపానముతో గూడ వాడవచ్చును.

## బృహత్ సోమనాధరసము (భై.ర.)

10గ్రా. 50 మోతాదులు

1. పెద్ద ఉసిరికాయల రసము లేక ఉసిరికపప్పు కషాయమునందు అరటిపండు కలిపి సోమరోగమునందును
2. జంబూ పానకముతో బహుమూత్రమునకు
3. పిల్లి తేగల రసముతో శుక్రనష్టమునకు వాడవలెను.

## గురు (స్వర్ణ) క్రవ్యాదరసము (వై.చిం.)

10 గ్రా. 45 మోతాదులు

1. మజ్జిగ తేటతో అజీర్ణమునకు

2. వాము, శొంఠి, మిర్యాలు రసముతీసి పొంగించి 1/2 గ్రాము సైందవలవణము చేర్చి సేవించిన చిరకాలా జీర్ణము, కడుపు ఉబ్బు, ప్రేగులరచుటకు

3. ఎండు ఖర్జూరపు కాయల రసము నందు మిర్యాలు లవంగాలు చూర్ణము 1/2 గ్రాము చేర్చిన దానితో పులి త్రేనుపులు శూల, కడుపులో గుడగుడలాడుటకును

4.పొంగించిన వెలిగారము 1/2 గ్రాము కలిపిన మేకపాలతో జలోదరము, గుల్మమునకు వాడవలెను. ఉదర గుల్మరోగులు పాలు ఆహారముగా సేవించవలెను.

## అజీర్ణ బలకాలానలరసము (బ.రా.)

10గ్రా. 40 మోతాదులు

1. భోజనమైన వెంటనే ఒకమాత్ర సేవించిన ఆహారము శీఘ్రముగ జీర్ణమగుటకు

2. శొంఠి, సైంధవలవణ చూర్ణము కలిపిన మజ్జిగ తేటతో అజీర్ణము, కడుపునొప్పి, ఆమ్ల పిత్తము, మలబద్ధకమునకు

3. శొంఠి తిప్పతీగె కళింగరాష్ణ కషాయముతో ఆమవాతమునకు వాడవలెను.

## చంద్రావర్తి రసము

10గ్రా. 50 మోతాదులు

1.స్వర్ణ సూర్యావర్తికి చెప్పిన అనుపానములన్నియు వాడుకొనవచ్చును.

2. వేచిన జీలకర్ర, ఏలకులు, దాల్చిన చెక్క, లవంగాలు చూర్ణము ఔషధమునకు సమంగాచేర్చి ధనియాలరసం పటికిబెల్లంతో చిరకాలమునుండి బాధించు శిరోరోగములకు వాడవలెను.

## మేహాంతక రసము (యో.ర.)

10గ్రా. 35 మోతాదులు

1. పల్లేరు వేరు, కొండపిండివేరు, రేవల్చిన్ని, దోసగింజలు కషాయముతో మూత్రకృచ్ఛ్ర,ఘాత, అశ్మరులకు

2. నేల ఉసిరిక, పాత, కొబ్బరి పూవులు, దోసవిత్తులు, పల్లేరు కాయలు వీని చూర్ణము రెట్టింపు చేర్చి వెన్న, పంచదారతో పురాతన ప్రమేహములు
3. రెట్టింపు శిలాజిత్తు చేర్చి పల్లేరు వేరు రసముతో మూత్రపు మంట, నొప్పికి
4. వేచిన జీలకర్ర చూర్ణము రెట్టింపు చేర్చి ధనియముల రసముతో నోటి అరుచి, జ్వరము వచ్చినట్లుండు వేడికి వాడవలెను.

## మేహాంతక రసము

1. దీనికి రెట్టింపు స్థాళీ చూర్ణమును జేర్చి తేనెతో నిచ్చిన, శోఫ, పాండువు, నరముల బారు, తిమ్మెర;
2. త్రిఫలములు ఏలకులు, షహజీరా" వీని చూర్ణమును చేర్చి "పటికె పంచదార, ఆవువెన్న" తో పుచ్చుకొనిన, మేహక్షయము, కాసము,
3. శొంఠి, దాచిన చెక్క, మిరియాలు, వీని చూర్ణమును చేర్చి, తేనెతో పుచ్చుకొనిన, అగ్నిమాంద్యము, అజీర్ణము;
4. చాతుర్జాతక చూర్ణము రెట్టింపు చేర్చి "ధనియాలు, తిప్పతీగె" వీని కషాయముతో నిచ్చిన, మేహపైత్యజ్వరములు;
5. త్రిఫలములు, శిలాజిత్తు భస్మము" వీని చూర్ణమును రెట్టింపు చేర్చి తెలగపిండి ఆకురసముతో నిచ్చిన, బహుమూత్రము;
6. త్రిసుగంధ చూర్ణమును రెట్టింపు చేర్చి తేనెతో పుచ్చుకొనిన,మేహ కాకనునివారణజేసి, ఇంద్రియబలము, శరీరపుష్టి, కాంతిని గలుగజేయును.

## చతుర్ముఖోదయ భాస్కరము

1.వేయించిన లవంగాలు, వేయించిన జీలకర్ర, దాల్చిన చెక్క, ఏలకులు, సుగంధి చూర్ణము రెట్టింపు చేర్చి గుంటకలగరరసము తేనెతో తిమ్మెరలు
2. అల్లపురసము తేనెతో పక్షవాతము, జిలవాతము, రక్తపోటుకు వాడవలెను.

## శృంగారాభ్రకరసము (భై.ర.)

మోతాదు పూటకు 1లేక 2 మాత్రలు

1.పటికిబెల్లము చేర్చిన ఆవుపాలలో 1/2గ్రా. కుంకుమ పూవు చేర్చి శుక్ర నష్టము, వీర్యము పలుచబడుట తగ్గి సంభోగశక్తి, పటుత్వము కలుగును.
2. పండ్ల రసములు, వెన్న మీగడ, పంచదార, పాలు వీనిలో దేనితోనైనను సేవించిన నీరసము బలహీనత నివర్తించును 3. ఆవుపాలలో

పటికి బెల్లము, కొంచెము కుంకుమపువ్వు చేర్చి కాచినదానితో గర్భిణీ వ్యాధులు తగ్గుటయేకాక గర్భస్థ శిశువు బలముగ, కాంతివంతముగ పెరుగును
4. చందన లేక శారివతో జీర్ణించిన సుఖవ్యాధుల వలన కలిగిన బలహీనత, చర్మ రోగములు మూత్రనాళవ్యాధులు హరించును, రక్తశుద్ధికరౌషధము.

## చంద్రకళారసము

10 గ్రా. 35 మోతాదులు

1. జీలకర్ర లేక ద్రాక్షపండ్ల రసముతో శ్లేష్మ ఉడుకు పొడి దగ్గులకు
2. దాచినచెక్క రసముతో పిత్తగ్రహణికి
3. మాదీఫలరసాయనముతో దుస్తరమగువాంతికి
4. కొబ్బరిపూలరసముతో తెల్లకుసుమకు వాడవలెను.

## జీర్ణ జ్వరాంకుశం (యో.ర.)

10 గ్రా. 45 మోతాదులు

1. నేలవేము, పర్పాటకము, గుంటకలగర కషాయముతో జీర్ణ జ్వరము పాండువు, శ్వాసకాసలు
2. తేనెతో రక్త క్షీణత
3.నేలఉసిరిక రసముతో కామలకు వాడవలెను.

## ఖజ్జలి బాల సూర్యోదయము (బ.ర.)

10గ్రా. 55 మోతాదులు

1. తమలపాకు రసము తేనెతో శ్వాసకాసలు
2. గుంటకలగర రసముతో జీర్ణ జ్వరము
3. అల్లపు రసముతో తరుణ జ్వరములు
4.పల్లేరు వేరు ఉలిమిరి చెక్క కషాయముతో మూత్రకృచ్ఛ
5. మట్టివూడల కషాయముతో తెల్లకుసుమకు వాడవలెను.

## పూర్ణ చంద్రరసము (భై.ర.)

10 గ్రా 50 మోతాదులు

1. తమలపాకు రసము తేనెతో శ్వాసకాసలు
2. అల్లపురసము తేనెతో ఆమ్లపిత్తము, శూల
3. సోపు రసముతో స్త్రీల గర్భాశయ దోషములు
4. త్రిఫల కషాయముతో పాండువు 5. శొంఠి రసముతో అజీర్ణము
6. తిప్పతీగె శొంఠి ఆముదపు వేరు కషాయముతో ఆమవాతము
7. కొబ్బరిపూల రసముతో తెల్లకుసుమకు వాడవలెను.

## వాతవిధ్వంసి (వై.చిం.)

10 గ్రా. 50 మోతాదులు

1. మిర్యాల రసముతో వాతజ్వరము
2. శొంఠి మిరియాల రసముతో బాలింతల ఒడలినొప్పులకు
3. నల్లఉప్పి వేరు కషాయముతో గాని, తెల్లజిల్లేడుపువ్వు వాము మిర్యాల కషాయముతో మైలరక్తము జారీకానందున కలుగు కడుపునొప్పి, జ్వరము మొ॥ గర్భవాతములకు
4. అక్కల కర్ర రసముతో సూతికాజ్వరమునకు
5. త్రికటు కషాయముతో సన్నిపాతమునకు
6. ప్రసవించిన వెంటనే ఒక మోతాదు తమలపాకుతో చుట్టి చమిలి మ్రింగిన సూతికావ్యాధులు రాకుండుటకును వాడవలెను.

## కామోద్దీపనరసము

పూటకొక మాత్ర

1.పంచదార కలిపిన ఆవుపాలతో సంభోగానంతరము కలుగు నడుమునొప్పి కాళ్ళతీతకు
2. ఎండు ఖర్జూరపు కాయలో గింజతీసి అందొక మాత్ర నుంచి కొంచెము ఆవు నేతితో వేయించి పంచదార చేర్చి సేవించిన శుక్రనష్టము స్వప్న స్ఖలనము నివారించును.

## ప్రదరాంతకరసము (భై.ర.)

10గ్రా. 40 మోతాదులు

1. పుష్యానుగ చూర్ణము సమంచేర్చి బియ్యపు కడుగు తేనెతో శ్వేత ప్రదరము
2. చందనాది చూర్ణము చేర్చి బియ్యపు కడుగు పంచదారతో మంటతోకూడిన ప్రదరమునకు వాడవలెను.

## క్రవ్యాదరసము ( వై. చిం.)

10గ్రా. 35 మోతాదులు

1. 1/2 గ్రాము శొంఠి చూర్ణము సైంధవలవణము కలిపిన మజ్జిగ తేటతో అజీర్ణము, త్రేనుపులు, అగ్ని మాంద్యం శూలకు
2. వాము రసముతో పులి త్రేనుపులు, అజీర్ణ విరేచనములు, కడుపుబ్బరము
3. అల్లపురసమునందు 1/4 గ్రాము యవాక్షారము కలిపి శూలకు, యకృత్వృద్ధికి
4. వేడినీటితో సమము మజ్జిగ కలిపి గుల్మమునకు వాడవలెను. వేడి తత్వము గలవారు సమము పైత్యాంతకర రసము కలిపి సేవించుట

మంచిది.

## క్రవ్యాధి రసాయనము

1. తేనెతో అరుగదీసి ఇచ్చిన యెడల, పైత్యజ్వరములు, చర్ది, అరుచి;
2. "జీలకర్ర, ధనియాలు" వీని చూర్ణమును సమముగ చేర్చి, అల్లపురసము, లేక అక్కల కర్ర రసముతో నిచ్చిన, వాంతి, తలత్రిప్పు, ఆమ్ల పైత్యాది సర్వ పైత్యములు;
3. త్రికటుక చూర్ణమును సమముగ జేర్చి నేతితో నిచ్చిన, పైత్యాజీర్ణము;
4. జీలకర్ర, తాళిస పత్రికం వీని చూర్ణమును రెట్టింపు జేర్చి అల్లపు రసము, తేనె; సమముగ కలిపిన దానితో నిచ్చిన, అరుచి; అజీర్ణము, తల శరీరముత్రిప్పుట, పైత్య వికారములు నివారణమవును.

## సిందూర భూషణము

1.జీలకర్ర చూర్ణమును సమముగ జేర్చి "పంచదార, ఆవునేతి"తో నిచ్చిన, కడుపులోమంట, తలత్రిప్పుట, శరీరము త్రిప్పుట, పైత్య జ్వరము, పొడిదగ్గు, నిక్కాక;
2. జీలకర్ర రసముతో నిచ్చిన, వాంతి
3. ఇందు సగభాగము నల్లమందు జేర్చి గురిగింజల వలె మాత్రలు చేసి గాని
4. ఒక చిన్నము చూర్ణమును పంచదారతో గాని అరటిపండులో వుంచి గాని, యిచ్చిన గ్రహణి, రక్తాతి సారము, జిగట విరేచనములు నివారణమవును.

## సింధూర భూషణం ( ర.యో.ర.)

10గ్రా. 35 మోతాదులు

1. వేచిన జీలకర్ర చూర్ణము రెట్టింపు చేర్చి, వెన్న గాని పటికిబెల్లముతోగాని, మాధీఫలరసాయనముతో గాని గర్భిణుల వేవిళ్ళు, కడుపులోమంట, నిద్రపట్టకుండుట, ఉడుకు మొ॥వానికి
(2) లవంగాల రసముతో దగ్గుకు 3. ద్రాక్షపండ్ల రసముతో శ్లేష్మ ఉడుకుకు వాడవలెను.

## వాత గజాంకుశము (బ.రా.)

10గ్రా. 55 మోతాదులు

1. అల్లపురసము తేనెతో నరముల లోని నంజు, నరములు లాగుట.
2. తిప్పతీగె, ఆముదపు వేరు, సన్న రాష్ణము కషాయముతో ఆమవాతము,

ఏకాంగ పక్ష, ఊరుస్థంభ వాతములకు
3. మిరియాల రసముతో అజీర్ణ విరేచనములకు
4. శొంఠి మిరియాల రసముతో అజీర్ణ జ్వరములకు వాడవలెను.

## ప్రమేహచంద్రకళారసము (వై.చిం.)

10గ్రా. 25 మోతాదులు

1. బియ్యపు కడుగు పంచదారతో మూత్ర నాళమునందలి మంట చురుకు బొట్టుబొట్లుగా మూత్రముపడుబాధకు
2. పల్లేరువేరు, తెలగపిండి వేరు, ఉలిమిరి చెక్క కషాయముతో మూత్రకృచ్ఛ, ఘాత అశ్మరీలకు
3. మామిడిచెక్క లేక మర్రియూడల రసముతో తెల్లకుసుమ
4. తేనెతో శుక్ర నష్టము, బహుమూత్రమునకు వాడవలెను.

## శూలకుఠారము (బ.రా.)

10గ్రా. 20 మోతాదులు

1. నారింజ పండ్లరసము లేక పుల్లని మజ్జిగ లేక తరవాణి తేటలో ఒక మోతాదు ఔషధము కలిపి భోజనమైన వెంటనే ఒకసారి, తరవాత 3 గంటలకొకసారి మోతాదును సేవించుచున్న పరిణామ శూల, కడుపునొప్పి, అజీర్ణము తగ్గును.

## ప్రతాపలంకేశ్వరము (యో.ర.)

10 గ్రా. 55 మోతాదులు

1. వావిలి వేరు రసము లేక త్రికటు కషాయముతో సూతికావాతము
2. అల్లపు రసముతో సన్నిపాతము 3. మిరియాల కషాయముతో ఒడలు నొప్పులకు 4. రాత్రి పరుండబోవునప్పుడు ఒకమాత్ర సేవించుచున్న చో పురాతన నడుము నొప్పులు 5. బాలింతలకు ప్రసవించినది మొదలు స్నానమగువరకు వాడుచుండిన సూతికా వ్యాధులు రాకుండా కాపాడుచు శరీరమునకు తేలికనిచ్చును.

## ప్రతాపలంకేశ్వరము

1. గురిగింజల వలె అల్లపురసముతో నూరి మాత్రలు చేసి, ఓమము లేక అల్లపురసముతో నిచ్చిన, జ్వరములు, వాతజ్వరములు, సూతికా జ్వరములు, హరించును.
2. నల్లమందులో కలిపి యిచ్చిన, నీళ్ళ విరేచనములు, అజీర్ణ భేదులు కట్టును.

3. నడక, శరీరాయాసము వలన గలుగు శరీరనొప్పులు, రాత్రి పరుండబోవునప్పుడు ఒకమాత్రను వేసికొనిన, నివర్తించి ఉదయ మునకు శరీరము తేలికనిచ్చును.

## నిత్యానందరసము (భై.ర.)

పూటకు 1 లేక 2 మాత్రలు

1. కరక్కాయరసముతో బోదకాలు వాపు బిళ్ళగట్టివచ్చు జ్వరము, అండవృద్ధి హరించును.

2. శొంఠి, పిప్పలి, తిప్పతీగెకషాయమున తేనెజేర్చి సేవించిన శ్లీపదము, క్రిమిరోగములు హరించును.

## శూల దావానలరసము (బ.రా.)

పూటకు 1లేక 2 మాత్రలు

1. గోమూత్రముతో ఉదరము

2. అల్లపు రసము తేనెతో గుల్మము

3. వాము రసముతో శూల, అగ్ని మాంద్యము అజీర్ణమునకు వాడవలెను.

## ఆనందభైరవి (బ.రా.)

పూటకు 1 లేక 2 మాత్రలు

1. మిరియాల రసముతో వాత జ్వరము ఒడలి నొప్పులు

2. అల్లపురసముతో అజీర్ణము, అగ్నిమాంద్యము

3. శొంఠి రసముతో ప్రయాణబడలిక జలదోషము

4. గసగసాలు లేక దాచినచెక్క రసముతో గ్రహణి జిగటవిరేచ నములకు వాడవలెను.

## ఆనంద భైరవి

1. గురిగింజంత మాత్ర నిచ్చిన, జ్వరములు, నడక మొదలగు ఆయాసము వల్ల గలిగెడు శరీరనొప్పులు;

2. "శొంఠి, దాచిన చెక్క" వీని రసముతో నిచ్చిన, కడుపు నొప్పి, అజీర్ణము;

3. ధనియాలరసముతో నిచ్చిన, పైత్య జ్వరములు

4. దీనిలో సగము భాగము నల్లమందు జేర్చి మిరియము వలె మాత్రలు చేసియిచ్చిన, అజీర్ణ విరేచనములు, నీళ్ళ విరేచనములు

5. నీళ్ళతో అరుగదీసి కండ్లకు కలికంవేసిన, తలబరువు, నొప్పితో కూడుకొనిన వాత పైత్య జ్వరములు నివారణమవును

## శీతాంశురసము (బ.రా.)

పూటకు 1 లేక 2 మాత్రలు

1. అల్లపురసముతో పిత్త జ్వరము
2. నల్లతులసిరసముతో చలిజ్వరము
3. అల్లపురసము తేనెలో అరగదీసి నాలుకకు రాచిన జిహ్వాదోషము
4. సమము సూర్యావర్తి చేర్చి తేనెతో నిచ్చిన పిత్త జ్వరము, ఛర్ధి, అరుచి, వమనమునకు
5. పంచతిక్త పానకముతో చలి, పొలి, జ్వరములకు
6. వేపచెక్క గంధంతో చాదిపైకి పూసిన తామర మున్నగు చర్మ వ్యాధులకు
7. నీటితో అరగదీసి కలికము వేసిన తల దిమ్ము, నొప్పి అన్నదోషము, మైకమునకు వాడవలెను.

## శీతాంశురసము

1. గురిగింజంత మాత్ర, ధనియాలు, లేక జీలకర్ర, లేక అల్లపు రసముతో నిచ్చిన, వాంతి, నోటియందు నీరూరుట, కడుపులో మంట, త్రిప్పుట, పైత్య జ్వరములు, తాపజ్వరములు నివారణమవును.
2. నీళ్ళతో అరుగదీసిన కండ్లకు కలికంవేసిన, తలనొప్పితో గూడుకొనిన పైత్య జ్వరములు
3. నీళ్లతో అరుగదీసి మర్థించిన తామర, పైత్యదద్దుర్లు
4. నాలుక పైరాసిన, జింహ్వా దోషములు నివారణమవును.

## పైత్యాంతకరసము (ర.యో.ర.)

10గ్రా. 30 మోతాదులు

1. జీలకర్ర రసముతో ఛర్థి
2. ధనియాల రసముతో కడుపులో మంటకు
3. పులి మజ్జిగతో అజీర్ణమునకు వాడవలెను.

## పైత్యాంతక రసము

1. పంచదార లేక తేనె, లేక "పంచదార, పాలు" తో గాని
2. పంచదార కలిపి యష్టిమధుక కషాయముతో గాని,
3. రెట్టింపు కూతురుబుడమ చూర్ణమును జేర్చి, చన్నీళ్ళతో నిచ్చిన, అవర్ణాది ఇరువది నాలుగు పైత్యములు పిత్తజ్వరములు, క్షయ, దాహము, దప్పి, శోష, పార్శ్వపు తలనొప్పి నివారణమవును.

## గ్రహణికవాటము (వై.చిం.)

మోతాదు 1 లేక2 మాత్రలు

1. దాచినచెక్క, గసగసాలు, బిల్వ శొంఠి, నేరేడు చెక్కమామిడిచిగురు, కొడిశపాలు, తుంగముస్తలు వీని రసములలో దేనితోనైనను యిచ్చిన జ్వరాతిసారము, గ్రహణి, అజీర్ణ విరేచనములు నివర్తించును.

గ్రహణి కవాటము

1. గురిగింజంత మాత్రను, గసగసాలు, బిల్వశొంఠి, వీనిలోయేరసముతో నిచ్చినను, గ్రహణి, ఆమ్లాతి సారము, (జిగట విరేచనములు) రక్తాతి సారము, దోషయుక్తమగు సర్వాతి సారములు, అనగా నీళ్ళ విరేనములు, అరకవిరేచనములు వగైరాలు శీఘ్రముగనివర్తించును. "గ్రహణ్యాతి సారాదులు నివర్తించుటకు దీనికంటే శ్రేష్ఠతరమగు ఔషధమెద్దిమునులేదు".

## లఘులక్ష్మివిలాసరసము

10గ్రా. 40 మోతాదులు

1. వేచిన జీలకర్ర, లవంగాల చూర్ణము రెట్టింపు చేర్చి తేనె లేక పటికిబెల్లం పానకముతో వాంతి, పొడిదగ్గు, హృదయ తాపము శ్లేష్మ ఉడుకు తగ్గును.

## సర్వజ్వరాంకుశము ( భై.ర.)

మోతాదు 1 లేక 2 మాత్రలు

అల్లపు రసము, జీలకర్ర రసము, మిర్యాల రసముతో సర్వ జ్వరములయందు వాడవచ్చును.

## అగ్ని కుమారరసము (బ.రా.)

మోతాదు 1 లేక 2 మాత్రలు

1. ఒక మోతాదును తమలపాకు లోనుంచి నమిలి మ్రింగి చన్నీళ్ళు తాగిన కలరా వాంతి విరేచనములకు

2. శొంఠి రసముతో అజీర్ణము, అగ్నిమాంద్యము, కడుపుబ్బరము, పులి త్రేనుపులకు వాడవలెను.

## ఏకాంగవీరరసం ( ర.సా.సం.)

10గ్రా. 50 మోతాదులు

1. అల్లపు రసం, తేనెతో పక్షవాత, ఆర్థిత వాతములకు
2. తులసి ఆకురసం తేనెతో ధనుర్వాతమునకు
3. మిర్యాలచూర్ణం కలిపి తమలపాకు రసం తేనెతో కంపవాతమునకు
4. వావిలివేరు కళింగరాష్ట్రం మిర్యాలు కల్పి కాచిన కషాయముతో సమస్త వాతములకు వాడవచ్చును.

## కాలాకూటరసము (బ.రా.)

10గ్రా. 60 మోతాదులు

1. దోషానుసారము అనుపానములతో జ్వరములకు సన్నిపాతమునకు
2. వెల్లుల్లి రసముతో సన్నిపాతమునందు సర్వాంగ శీతలము కలిగినపుడు వాతశూలకు
3. గ్రంధితగరము, చిత్రమూలముల రసముతో 13 సన్నిపాతములందును వాడవలెను.

## కాలకూటరసము

1. చిత్రమూలము, వెల్లుల్లి, జిల్లేడు వేళ్ళరసము, అనుయేరసముతో నైనను నూరి, గురిగింజలవలె మాత్రలు చేసి, అల్లపు రసముతో రోగబలాబలము ననుపయోగించి 1/2 గంట మొదలు రెండు జాముల కొకసారి వరకు కాలమును నిర్ణయించి, ఒక్కొక్క మాత్ర చొప్పున ఇచ్చిన గాని
2. అల్లపురసముతో అరగదీసి ఇచ్చిన గాని అసాధ్యములగు సన్నిపాత సమూహమును "వాయువుచే మేఘపంక్తి తొలగు చందంబున" దొలంగును. మరియు, నూతికావాతములు మాంద్యజ్వరములు, వాతములు నివారణ మవును.

## స్వచ్ఛందభైరవి(బ.రా.)

పెద్దలకు 1,2 మాత్రలు, పిల్లలకు 1/2 మాత్ర

1. తమలపాకు లేక అల్లపురసము తేనెతో జలుబు దగ్గు పడిశములకు
2. వాము రసముతో అజీర్ణమునకు 3. కళింగరాష్ట్రము తేనెతో పిల్లల కఫరోగములకు వాడవలెను.

## మాలినీవసంతము (యో.ర.)

పూటకు 1 లేక 2 మాత్రలు

1. శొంఠి జీలకర్ర ధనియాల కషాయముతో తరుణజ్వర, పైత్య జ్వరములకు
2. కిరాత, గుడూచి, పంచతిక్త, పానకము వీనిలో దేనితోనై నను చలిజ్వరము జీర్ణజ్వరములకు
3. దాచిని చెక్క రసముతో అతిసారము గ్రహణికి వాడవలెను.

## మహాచంద్రకళారసము (బ.ర.)

10గ్రా. 30 మోతాదులు

1. యష్టిమధుకము, వట్టివేరు మంచి గంధం పొట్టు, ధనియాలు, కలువకాడలు వీనికషాయములో తేనె పంచదార కలిపి సేవించిన ఊర్ధ్వా ధోగత రక్త పిత్తము, రక్తవాంతి, కడుపులోమంట, దాహము

2. జీలకర్ర రసముతో తాపజ్వరము, శోష
3. పల్లేరు వేరు, ద్రాక్ష కషాయముతో మూత్రకృచ్ఛ్రము
4. అడ్డసరపాకురసము మోదుగ చెక్క కషాయమునందు 1/2 గ్రాము కవిరిచేర్చి ఎర్ర కుసుమకు వాడవలెను.

## గంధకరసాయనం ( వై.చిం.)

పూటకు 1గ్రాము 1. ఆవునెయి లేక తేనెతోచర్మరోగములు
2. ఖదిరతో తరుణ కుష్టమునకు వాడవలెను.

## త్రిభువనకీర్తి రసము (భై.ర.)

మోతాదు 1 లేక 2 మాత్రలు

1. అల్లపురసము లేక గుడూచితో సమస్త జ్వరములు, శ్వాసకాసలు, వాతనొప్పులకు
2. సుదర్శన చూర్ణముతో (ఇన్‌ఫ్లూయెంజా) కఫవాత జ్వరమునకు
3. శొంఠి తిప్పతీగ ఆముదపు వేరు కషాయముతో ఆమవాతమునకు వాడవలెను.

## గండభేరుండరసము (స.యో.)

మోతాదు పూటకు 1 మాత్ర

1. మిరియాలు, శొంఠి, అల్లము వీనిలో దేనిరసముతోనైనను అన్ని జ్వరములు, ఒడలు నొప్పులు
2 కటుక రోహిణి రసములో పంచదార చేర్చి తాపజ్వరమునకు
3. మంచినీళ్ళతో రొంప, జలుబు దగ్గులకు వాడవలెను.

## మహాపైత్యాంతకరసము (వై.చిం.)

10గ్రా. 50 మోతాదులు

1. అల్లపురసము తేనెతో పైత్య జ్వరము కామల
2. జీలకర్ర రసము తేనెతో వాంతి అరుచి ఆమ్లపిత్తము
3. ఎండించిన కూతురుబుడమచూర్ణము చన్నీటితో ఆవర్ణ పైత్యము మొ॥ 24 పైత్యములకు
4. యష్టిమధుక కషాయమునందు తేనె, పంచదార చేర్చి ఎక్కిళ్ళు, రక్తపిత్తము పిత్తతాపము
5. మాదీఫలరసాయనముతో సమస్త పైత్య వ్యాధులకు వాడవలెను.

## మహాపైత్యాంతకరసము

1. రెట్టింపు నెమలికన్నుల భస్మమును జేర్చి, తేనెతో కలిపి 3 గంటలకొకసారి ఇచ్చిన యెడల, వాంతులు

2. అరచిన్నం ఔషధమును, ఒక లవంగము, ఒక వాయు విడంగమున్ను, తేనెతో నూరి ఇచ్చిన యెడల, నీరసము మీదపుట్టెడు శ్వాసను, గుండెదడను, కట్టును. 3.పొంగించిన జీలకఱ్ఱ రసముతో అరుగదీసి గాని, దీనికి సమము జీలకఱ్ఱ చూర్ణమును చేర్చి "పంచదార, వెన్నతో గాని, అక్కలకఱ్ఱ రసముతో గాని " సూర్యోదయము కాకముందు పుచ్చుకొనిన యెడల, పైత్యసంబంధమగు తలనాదు, పోటు, క్షయ, దాహము, జ్వరము, శరీరత్రిప్పు, కండ్లు మంటలు, కాళ్ళు చేతులు మంటలు, పైత్య దద్దుర్లు, పార్శ్వపు తలనొప్పి, మొదలగు వింశతి పైత్యములు నివారణమవును.

## కాలాగ్ని రుద్రరసము (బ.రా.)

10గ్రా. 55 మోతాదులు

1. మిరియపు చూర్ణము ఆవునేతితో 80 వాతములకు
2. బియ్యపు కడుగు తేనెతో నరముల తీపునకు
3. ఆవుపాలతో నరముల దుర్బలత్వము, పురాతన నడుము నొప్పులు, మలబద్ధమునకు
4. వాముకాటు నీళ్ళతో అజీర్ణ విరేచనములకు వాడవలెను.

## ఇందు శేఖర రసము (భై.ర.)

10గ్రా. 40 మోతాదులు

1. పన్నీటితో అరగదీసిన మంచిగంధం 10 గ్రా. పంచదార 10గ్రా. ఏలకగింజల చూర్ణము 1/2 గ్రా. మంచినీళ్ళు 50 గ్రా.లలో కలిపి సేవించిన నూతనసెగ, దానియందలిమంట, చీము
2. చందనతో సేవించిన జీర్ణించిన సెగ, కుసుమరోగములు నివారించును.

## అభ్రక పంచామృతము

10గ్రా. 40 మోతాదులు

1. వెన్న, పటికిబెల్లముతో మేహుడుకు
2. ద్రాక్ష పండ్ల రసముతో మేహజ్వరము, అరుచి, రక్తహీనత
3. జీలకఱ్ఱ, ధనియాల రసముతో తలదిమ్ము, పోటు
4. రెట్టింపు మంచి గంధం లేక సుగంధి చూర్ణము పేరిన నేతితో అత్యుష్ణత
5. రెట్టింపు అశ్వగంధాది చూర్ణము కలిపి ఆవుపాలతోగాని, రసాయనితోగాని బలహీనత
6. పిల్లి తేగల రసముతో శుక్రనష్టము, మూత్రస్ఖలనము, శీఘ్రస్ఖలనమునకు
7. మఱ్ఱివూడల రసముతో కుసుమ 8. జంబూ పానకముతో బహుమూత్రమునకు వాడవలెను.

## తారకేశ్వర రసము (యో.ర.)

10 గ్రా. 35 మోతాదులు

1. తేనె లేక వెన్నతో శుక్రనష్టము
2. జంబూ పానకముతో బహుమూత్రము దానివలన కలిగిన అతి ఆకలి దప్పులు కాళ్ళు చేతులు పీకుట మంటలు తగ్గించును, రక్తవృద్ధి, బలము కలిగించును.

## సూతికావినోదరసము (బ.రా.)

ప్రసవించినది మొదలు 3 దినములు వేడినీటి అనుపానముతో ఉదయం 1 మాత్ర, సా॥ 1 మాత్ర అటుపైన స్నానమగువరకు సాయంకాలమునందు ఒక మాత్ర చొ॥న వాడవలెను. బాలింతలకు మంచి యుపయోగము.

## సవామేహకులాంతకము

పూటకు 1 మాత్ర 1. సుగంధి పెన్నేరు ధనియాలకషాయముతో సవాయి వ్యాధులన్నింటికి, అరచేతులు అరకాళ్ళుయందు కలుగు నల్లనిమచ్చలకును
2. షోడాపొడుముతో కడుపునొప్పి, చిరకాలా జీర్ణమునకును
3. శొంఠి, తిప్ప తీగె, ఆముదపు వేరు కషాయముతో అమవాతమునకు
4. మంచి నీళ్ళతో రసపట్లు, రక్తశెగ, ధనుర్వాతమునకు వాడవలెను.

## కర్పూర రసము (భై.ర.)

పూటకు 1 లేక 2 మాత్రలు

దాచినచెక్క, గస గసాలు , బిల్వ శొంఠి దానిమ్మ బెరడు వీనిలో దేని రసముతో నైనను అతిసారము, గ్రహణి,రక్తాతి సారము, జ్వరాతి సారమునకు వాడవలెను.

## కృమిముద్గర రసము ( భై.ర.)

మోతాదు ఒక మాత్ర

తేనెతో మాత్రను మ్రింగి తుంగదుంపల కషాయము త్రాగిన నులిపురుగులు, ఏటికలు చచ్చును.

## శ్లీపద గజకేసరి (భై.ర.)

పూటకు ఒక మాత్ర

మంచినీళ్ళతో సేవించిన బోదకాలు వాపు, సలుపు, పోటు నివర్తించును.

## చిత్రకాదివటి (వై.చిం.)

10గ్రా. 16 మోతాదులు

1. పుల్లని మజ్జిగ తేటతో అజీర్ణము, శూల, పులి త్రేనుపులు, అమిత భోజనము వలన కలిగిన ఆయాసము వెంటనే తగ్గును.

## ఆమవాతారివటి (భై.ర.)

పూటకు ఒక మాత్ర

1. శొంఠి, దేవదారు, తిప్పతీగ, కళింగ రాష్ట్రము, ఆముదపు వేరు కషాయముతో గాని, దశమూలతోగాని ఆమవాతమునకు వాడవలెను.

## అగ్నితుండివటి (వై.చిం.)

10గ్రా. 50 మోతాదులు

1. వాము రసముతో అజీర్ణము, అజీర్ణ విరేచనములు

2. శొంఠి రసము లేక అల్లపురసముతో శూల, నరముల తీపు, ఒడలి నొప్పులు నివర్తించును.

## భేదీజ్వరాంకుశము (బ.రా.)

మోతాదు ఒక మాత్ర

1.వేడినీటితో జ్వరమునందు విరేచనావశ్య కత కలిగినపుడు

2. వాయు విడంగాల కషాయముతో క్రిమిజ్వరమునకు

3. మిరియాల కషాయముతో వాత కఫజ్వరములకు వాడవలెను.

## భేది జ్వరాంకుశము

గురిగింజంతమాత్ర,అల్లపు రసముతోజ్వరపక్వకాలమందిచ్చిన,మలబద్ధాది జ్వరములను, విరేచనమును జేసి, శీఘ్రముగ నివారణజేయును.

## భేదియౌషధము

1. సుమారు శనగగింజమాత్రము, రెండు డబ్బుల యెత్తు ఓమము లేక అల్లపురసముతో తెల్లవారుజామున నాలుగు గంటలకు పుచ్చుకొనిన (రసము సందర్భము కాని యెడల, వేడినీళ్ళతో పుచ్చుకొనవచ్చును). 4 లేక 5 విరేచనములను సులభముగ జేసి శరీరమందలి కుట్రను బోకడచి, ఆరోగ్యముఇచ్చును దేశబేధము, నీటి భేదము, మొదలుగా గల కారణమువలన, శరీరమునకు బట్టిన నీరును తీసి వేయును. భోజనము చేయు వేళకు, కోరినన్ని విరేచనములు కాని పక్షమున, చింతపండు చారుతో భోజనము చేసిన యెడల, భోజనాంతరమును, 1-2 విరేచనములవును విరేచనములు కట్టవలెనని తలంచినపుడు, అన్నమును ముందుగ వట్టి నేతితో 4-5 కబళములను భుజించి, పులుసుచేరని కూరతో, మజ్జిగ మాని, భుజించిన యెడల కట్టును లేక నీరుల్లినలియ గొట్టి కాలిచోటనే వేసి కట్టినగాని, బొడ్డునందు నల్లమందుంచిన గాని కొద్దిగ నల్లమందు వేసికొనిన గాని కొంచెము నేయి త్రాగినంగానికట్టును.

## సుఖవిరేచనవటి (ర.సా.సం.)

మోతాదు 1 లేక 2 మాత్రలు

మాత్ర మ్రింగి తేనెగాని, బెల్లము ముక్కగాని అతిసారము, అజీర్ణ విరేచనములు, కడుపునొప్పి, గ్రహణికి వాడవలెను.

## చంద్రప్రభావటి (శా.సం.)

పూటకు 1 లేక 2 మాత్రలు

1. మంచిగంధము, చలవమిరియాలు కషాయముతో సెగరోగము
2. పొగడ చెక్క రసముతో బహుమూత్రము
3. ఉలిమిరిచెక్క కషాయముతో మూత్రకృచ్ఛ్ర, మూత్రాఘాత, అశ్మరులు
4. శారివతో రస గ్రంధులు, కణుతులు, రాచకురుపులు
5. ఆవుపాలతో రజ:శుక్రదోషములు,
6. మజ్జిగ తేటతో మూలశంఖ,
7. తమలపాకు రసం, తేనెతో శ్వాసకాసలు నివర్తించును.

## ప్రదరారిలోహము లేకవటి (భై.ర.)

పూటకొకమాత్ర

1. అశోకతోగాని, మర్రివూడల కషాయము కొబ్బరి పూలరసము మారేడు వేరు రసము, మామిడిచెక్కరసము వీనిలో దేనితో నైనను తెలుపు, ఎరుపు, పసుపు నలుపు రంగుల కుసుమ రోగములు కుక్షిశూల, కటిశూల దేహశూల సర్వాంగశూల నివర్తించును.

## బోళబద్దవటి

మోతాదు 1లేక 2 మాత్రలు

రోజుకు 3,4 సార్లు వాడవచ్చును. గసగసాలు, దాచినచెక్క, బిల్వశొంఠి, కొడిశవిత్తులు వీనిలో దేనిరసముతో నైనను యిచ్చిన అతిసారము, రక్తాతిసారము గ్రహణి నివర్తించును.

## రజః ప్రవర్తినీవటి (భై.ర.)

పూటకొక మాత్ర

1. నువ్వులు, మెంతులు సదాపాకు ఒక్కొక్కటి 5గ్రా. చొ॥న చేర్చి కషాయముతో ఋతుబద్ధము, ఋతుశూల, నివర్తించుటయేగాక అశోకతో సేవించిన ఋతువు సరిగాకాక వచ్చెడు స్థౌల్యము, నిస్సత్తువ కూడ నివారించును.

## మహాశంఖవటి (భై.ర. )

1. వాము శొంఠి రసముతో అజీర్ణము, అజీర్ణ శూల, అగ్ని మాంద్యము
2. మిరియాల రసముతో పార్శ్వశూల
3. అల్లపు రసముతో పరిణామశూల
4. ఏలక గింజల రసముతో వాంతిభేదికి వాడవలెను.

## ఋతుశూల సంహారిణి

పూటకొక మాత్ర :- 1. వేడినీటి అనుపానముతో ఋతుశూలకు వాడవలెను. చప్పిడి పథ్యము చేయుట మంచిది. నొప్పి తగ్గినతరువాత వాడనక్కరలేదు. మామూలు శూలకుకూడా వాడవచ్చును.

## చందనాదివటి (వై.చిం.)

పూటకొకమాత్ర 1. చందనతో వాడిన సెగరోగము నివారించును.

## అర్శోహరచంద్రప్రభావటి (వై.చిం.)

పూటకు 1 లేక 2 మాత్రలు :- సాధారణానుపానము మజ్జిగతేట మూలవ్యాధి యందు రక్తము పడుచుండునపుడు అరసోలెడు ఆవుపాలు కాగుచుండగా 2గ్రా. పటికిచూర్ణము ఒకనిమ్మకాయ చెక్క రసము కలిపి విరిగిన తర్వాత ఆ పాలను వడకట్టిన నీటితో సేవించుచు ఒక గంట తాళి 20 గ్రా॥లు సగ్గుబియ్యమును దోరగా వేయించి పెరుగులోవేసి నాననిచ్చి తినుచుండిన రక్తస్రావము వెంటనే తగ్గును. రక్తము తగ్గినపిదప మజ్జిగతో వాడవలెను. మూలవ్యాధి గలవారు ఇంగువ, వెల్లుల్లి, వేపుడు కూరలు, ఎక్కువ కారము వేడిచేయునవి, మలబద్ధమును చేయునవియగు పదార్థములు మానవలెను. తరుచు మజ్జిగవాడుట మంచిది.

## మహాయోగరాజగుగ్గులు (శా.సం.)

పూటకు ఒక మాత్ర

1. శొంఠి, తిప్పతీగె, ఆముదపు వేరు, కళింగ రాష్ట్రము కషాయముతో ఆమవాతము, కీళ్ళనొప్పులు
2. ఆవుపాలతో రజోశుక్రదోషములు
3. చంద్రచేవ కషాయముతో వాతరక్తము
4. శొంఠి, వాము కషాయముతో అగ్ని మాంద్యము, నాభిశూల నివర్తించును.

## కైశోరాదిగుగ్గులు (శా.సం.)

పూటకు 1 లేక 2 మాత్రలు 1. చంద్రచేవ, తిప్పతీగె, కషాయముతో

వాతరక్తము, కుష్ఠము, దద్రులు, పొడలు, నల్లని మచ్చలు నివర్తించును. ఖదిర, పంచతిక్త పానకము కూడా అనుపానమునకు వాడవచ్చును.

## గంధకకల్పము (బ.రా.)

10గ్రా. 30 మోతాదులు

తేనె లేక నేయితో కుష్ఠ, బొల్లి, సవాయి మచ్చలు రసదోషము, సమస్త చర్మరోగములు తిమిరవాతము నివర్తించి రక్త శుద్ధి చేయును.

## శ్వాసాంతక రసం (ర.ర.స.)

పూటకు 1 మాత్ర

1.మాత్రను నోటిలో నుంచి చప్పరించి ద్రవమును మ్రింగుచున్న ఉబ్బసము, ఆయాసము మొ॥ వానియందు చిక్కబడిన (ఇగిర్చిన) కఫమును కరిగించి తేలికనిచ్చును.

## హిక్కాంతకరసము (వై.చిం.)

10 గ్రా. 40 మోతాదులు

1. తేనెతో ఉపద్రవములతో కూడిన సమస్త విధములగు ఎక్కిళ్ళు తక్షణమే నివారించును.

## శూలహరి (స.యో.)

10గ్రా. 30 మోతాదులు

పేరిన నేతితో శూల, పరిణామ శూలలకు వాడవలెను. ఔషధముకన్న కొంచెము నేయి ఎక్కువ వాడుట మంచిది.

## స్వయమగ్ని ముఖమాండూరము (బ.రా.)

10గ్రా. 30 మోతాదులు

1. ఆవుమజ్జిగతోగాని, తేనెతోగాని దూల గొండివేళ్ళ కషాయముతోగాని పాండువు, మృత్పాండువు, చిరకాలము నుండి యున్న ఉబ్బు నివర్తించి రక్తవృద్ధి చేయును.

## లవణమాండూరము (వై.చిం.)

10గ్రా. 30 మోతాదులు

1. ఆవు మజ్జిగ లేక తేనెతో పాండువు మృత్పాండువు
2. గోమూత్రముతో కఠిన ఉబ్బు రోగములందును
3. వాము రసముతో జీర్ణశక్తికి వాడదగును.

## హృద్రోగచింతామణి (ర.సా.సి.సం.)

10 గ్రా. 50 మోతాదులు

1. గోధుమగంజి లేక బార్లీ గంజితో గుండెబరువు ఆయాసము మొదలగు ఊపిరితిత్తుల వ్యాధులకు

2. ద్రాక్ష యష్టిమధుక కషాయంతోగాని "అర్జున"తోగాని గుండె దడకు వాడవలెను.

## మధుమేహమృగాంకరసము (వై.చిం.)

మోతాదు పూటకొక మాత్ర

1. మంచినీటితోగాని "జంబూ పానకం"తో గాని సేవించినచో మధుమేహము (షుగరు) జీర్ణించిన సవాయి వ్యాధులు ఆమవాతము, శూలలను నివారించును. "చంద్రప్రభావటి" మాత్రలతో కలిపి వాడినచో సయోటికా (దండినరములాగుట) నివారించును "గుడూచి" అనుపానముతో వాడవలెను. ఔషధసేవన కాలమందు మినుము వంకాయ, టమాటా, పులుపు, దుంపకూరలు మానవలెను. గోధుమ, చోడి జావ మంచిది.

## బాలసంజీవి

10గ్రా. 50 మోతాదులు

1.ఆముదముతో నిచ్చిన చంటిబిడ్డల తాత్కాలికాజీర్ణము, దగ్గు, రొంప, ఒగర్పు, పాలుఉబ్బస, పడిశము, జ్వరము మలబద్ధములకు

2. తేనెతో కఫము, ఆయాసము, జ్వరము, జలుబునకు వాడవలెను.

3 సం॥లోపు పిల్లలకే వాడవలెను. పెద్దలకు ఉపయోగములేదు.

## కస్తూరిమాత్రలు ( స.యో)

మోతాదు 1 లేక 2 మాత్రలు

1. చనుబాలతో చంటిబిడ్డల సమస్త వ్యాధులకు వాడవచ్చును.

2. మిరియాల రసముతో 2,3 మాత్రలు పెద్దలు సేవించిన జలుబు, దగ్గు, నివారించును.

## మృతవంధ్యాసంజీవని (ర.త)

10గ్రా. 30 మోతాదులు

1. సమం పటికిబెల్లం చూర్ణము చేర్చి సేవింపవలెను. గర్భవాతము, గర్భస్రావము, బిడ్డలు బ్రతకకపోవుట, చచ్చి పుట్టుట నివారించును.

2. పొత్తి కడుపు బిగపట్టుట, నొప్పి గలవారు బియ్యపు కడుగుతో సేవించవలెను.

## ప్రదరసంజీవని (ర.త)

మోతాదు 1గ్రా:-

1. సమం పంచదార చేర్చి 30 గ్రా. (ఔన్సు) ఆవుపాలతో దుస్తర రక్త ప్రదరము ఆగిపోవును. దినమునకు 3 సార్లు యివ్వవచ్చును.

పథ్యము ఆవుపాలు, ఇగురుకూరలు, కందిపప్పు రక్తస్రావము ఆగినవెంటనే ఔషధము మానవచ్చును.

## ప్రదర చింతామణి (భై.ర.)

పూటకు 1 లేక 2 మాత్రలు :-

మజ్జిపండ్ల రసముతో పంచదార చేర్చి ఎర్రకుసుమకు

2. 'అశోకారిష్టతో'గాని 'ప్రదరారి'తో గాని వివిధ ప్రదరములకు వాడవలెను.

## రజోదర్శని

10గ్రా. 30 మోతాదులు :-

1. మజ్జిగ, వేడినీరుతో కలిపి సేవించిన స్త్రీలకు ఋతు రక్తమును జారీచేయును ఋతుబద్ధముచే కలుగు స్థూలము (లావు) ఆయాసము, కడుపు పెరుగుట, అగ్ని మాంద్యమును నివారించును.

# అంజనములు

## మహానారికేళాంజనము (వై.చిం)

కన్నులకు కాటుకవలె వాడుచుండిన కంటిపొరలు, పూవులు, దుర్మాంసము, నీరుకారుట నివారించి మంచి దృష్టినొసంగును. కండ్లకు చలువ చేయును.

## సిద్ధనాగార్జునాంజనము (భై.ర.)

తేనెతో అరగదీసి కన్నులకుంచిన పొరలు పూవులు, మసకలు నివారించును. లొద్దుగ చెక్క కషాయముతో అరగదీసి ఉపయోగించిన రేచీకటిని మాన్పును.

## నేత్రబిందు (భై.ర.)

రెండు చుక్కలు ఉదయ, సాయంకాలములందు కంటిలో వేయుచుండిన కండ్లకలక, ఎరుపు, పోట్లుమున్నగు ఉష్ణ వికారములను తగ్గించును.

# ఖజ్జలీ ఔషధములు

## వసంత కుసుమాకరము (వై.చిం.)

10 గ్రా. 80 మోతాదులు

ఇరువది మేహములు, మధుమేహము, మూత్రకృచ్ఛ్ర, ఆశ్మరి, మూత్రాఘాత బహుమూత్రము, శుక్రనష్టము, తెల్లకుసుమ, రాచకురుపులు, నివర్తించి బలము, ఉత్సాహము, వీర్యపటుత్వము, సంభోగశక్తి కలిగించును. అనుపాన విశేషములచే సమస్త వ్యాధులను హరించు దివ్యౌషధము జగత్ప్రసిద్ధమైనది.

అనుపానములు : 1. బహుమూత్రమునకు – నేరేడు గింజలు, తుంగ ముస్తలు, మంచిగంధంపొట్టు కషాయము లేక జంబూ పానకముతోను.

మధుమేహమునకు :–

1. తుంగముస్తలు, లొద్దుగ, చెక్క, కరక్కాయ, కాయఫల చెక్క కషాయముగాని
2. కరకతాడి యుసిరికలు, తుంగముస్తలు, ప్రత్తిగింజలు మ్రానిపసుపు, ఇండుపకాయ, మోదుగ చెక్క, చింతగింజలు కషాయముతో గాని
3. చందనము, రక్త చందనము, మద్దిచెక్క, నేరేడు గింజలు, శొంఠి, సుగంధి కషాయముగాని
4. వ.కు. 5గ్రా. గోమూత్ర శిలాజిత్తు 5గ్రా. అభ్రకభస్మం 5గ్రా. పచ్చకర్పూరము 3గ్రా. కల్పి తామరపూలరసముతో నూరి 60 మాత్రలు చేసి వాడవలెను.

బహుమూత్ర – శుక్రనష్ట శ్వేత ప్రదరములకు :–

వసంతకుసుమాకరము 5గ్రా. తిప్పసత్తు 5గ్రా. వంగభస్మము 5గ్రా. కుంకుమపూవు 2గ్రా. తంగేడు గింజల చూర్ణము 3గ్రా. వేపజిగురు 3గ్రా. చేర్చి పిల్లి తేగల రసముతో నూరి 60 మాత్రలు చేసి సేవించవలెను.

మూత్రకృచ్ఛ్ర, మూత్రాఘాతము, మూత్రాశ్మరిలకు :–

వసంతకుసుమాకరము 5గ్రా. వైక్రాంత భస్మము 5గ్రా. శిలాజిత్తు భస్మము10గ్రా. చేర్చి బియ్యపు కడుగుతో నూరి 40 మాత్రలు చేసికొని వట్టివేరు, పల్లేరు వేరు, కొండపిండివేరు, దూలగొండివేరు, కరక్కాయ, ఉసిరిక పప్పు కషాయముతో మూత్రకృచ్ఛ్రకు

2. పల్లేరు వేరు శొంఠి కషాయము నందు 3గ్రా. బెల్లము 1గ్రా.

యవాక్షారము కల్పి దానితో మూత్రాఘాతమునకు
3. కొండపిండి వేరు, పల్లేరువేరు , ఉలిమిరిపట్ట, ఆముదపువేరు వాకుడు వేరు నేలములకవేరు కషాయమునందు పెరుగు చేర్చి అశ్మరికి వాడవలెను.

వసంతకుసుమాకరము 5గ్రా. అభ్రకభస్మము 5గ్రా. రజిత భస్మము 5గ్రా. వంగభస్మము 5గ్రా. జాజికాయ 5గ్రా. సాలామిశ్రీ 5గ్రా. పచ్చ కర్పూరము 2గ్రా. చేర్చి ఆవుపాలతో గాని పిల్లి తేగల రసముతోగానినూరి 60 మాత్రలు చేసి రోజుకు రెండు మాత్రలు చొప్పున సేవించిన వీర్యపటుత్వము, బలము, కాంతి, ఉత్సాహము సంభోగశక్తి కలుగును. అశ్వగంధాదిలేహ్యము, రత్న పురుషలేహ్యము, మదనకామేశ్వరి లేహ్యము వీనిలో దేనినైనను తోడుగా వాడవచ్చును.

ఇతర రోగములకు :-

1. కేవలము వసంత కుసుమాకరమును 10గ్రా. 70 మోతాదులు చేసి మద్ది చెక్కరసము లేక అర్జునతో హృద్రోగమునకు
2. పిల్లి తేగలరసముతో శుక్రనష్టము
3. సోపురసముతో మూత్రమునుండి శ్వేతధాతువు పోవుట
4. వల్లేరు వేరు లేక కొండపిండి వేరు రసముతో జీర్ణించిన సెగరోగము
5. కొబ్బరిపూల రసముతో చిరకాలము నుండి బాధించు మొండి కుసుమ
(6) ద్రాక్షపండ్ల రసముతో గుండెలార్చుకుపోవుట
7. అల్లపురసము, తేనె, పటికి పంచదార కలిపికాచిన పానకముతో క్షయ
8. సారస్వతతో శిరస్సుపోటు, చిత్త చాంచల్యము మొదలగు మెదడునకు సంబంధించిన వ్యాధులకు
9. శొంఠిరసముతో అజీర్ణమునందును వాడవచ్చును.

మధుమేహరోగులు ఆచరించవలసిన విధులు :-

గోధుమాన్నము, గోధుమరొట్టెలు, బార్లీ, చోడిజావ, దంపుడు బియ్యం పచ్చజొన్నపిండి, ఆకుకూరలు, కాయకూరలు, ఆవుపాలు, ఆవుమజ్జిగ, మెట్టను సంచరించు పక్షులు మొదలగువాని మాంసములను సేవించవలెను. పంచదార, బెల్లము, మద్యము, పెరుగునీటిలో తిరుగు జంతువుల మాంసములు సంగమము ముఖ్యముగ విడువవలెను. కొద్దిగ శరీరబలముననుసరించి వ్యాయామము (కొంతదూరము నడచుట) చేయుచుండవలెను.

# వంట ఔషధములు

## వసంతకుసుమాకరము

1. ఈయౌషధమునకు సమము శొంఠి, పిప్పలి, మిరియముల" చూర్ణమున్ను, చూర్ణమునకు సమము శిలాజిత్తు భస్మమున్ను జేర్చి తేనెతో పుచ్చుకొనిన అన్ని విధములగు క్షయలు
2. దీనికి రెట్టింపు మానిపసపు చూర్ణమును జేర్చి, పంచదార, తేనెతోకలిపి సేవించిన, ప్రమేహములు,
3. దీనికి సమము మంచిగంధపుచెక్క చూర్ణమును జేర్చి పంచదార వెన్నతో గాని, ఒకడబ్బెత్తు పిల్లి తేగలరసములో తేనె చక్కెర కలిపి దానితో గాని యిచ్చిన ప్రమేహము, మూత్రకృచ్ఛ్రము, ఆమ్ల పైత్యాదిరోగములు,
4. చక్కెరకలిపిన చందనకషాయముతో సేవించిన, మిగుల ప్రకోపముగ నుండు రక్తపిత్తము,
5. "త్రిజాతకములు, గజపిప్పళ్ళు, చందనము" వీటి చూర్ణమును సమముగ చేర్చి, సిద్ధ పరచిన కషాయముతో పుచ్చుకొనిన, ఇంద్రియవృద్ధి, శరీరపుష్టి, కాంతి, కామవృద్ధి
6. అక్కలకర్ర రసము పొంగించిన దానితో పుచ్చుకొనిన జ్ఞాపకశక్తి, నిర్మలమగుబుద్ధి;
7. " దేశవాళీ శొంఠి, లవంగాలు" వీటికషాయముతో రోజుకు మూడుసార్లు యిచ్చిన యెడల దుస్తరమగు వాంతి
8. నాగకేసరముల కషాయముతో సదాసేవించిన, శరీరబలము, ఇంద్రియబలము, కలుగును. రోగము దరిజేరనేరదు.
9. "దాచినచెక్క, గసగసాలు, బిల్వశొంఠి" వీటి కషాయముతో సుకుమారులు పుచ్చుకొనిన, మూడుపూటలలో గ్రహణి కట్టును.
10. ఒక లవంగము, కొంచెము కళింగ రాష్ట్రము, అరచిన్న మీ యౌషధమున్ను, తేనెలో యరుగదీసి ఉదయము, సాయంకాలమున్ను రెండు మండలములు సేవించినపక్షమున, ద్వాదశవర్షముల (12 సంవత్సరముల) నుండి శరీరమునా శ్రయించి యుండుక్షయయైనను నివారణయై శరీరబలము, బుద్ధి బలము, కలుగును.
11. చంగల్వకోష్టకషాయముతో పుచ్చుకొనిన, శుక్ల మేహమునివారణయై, శరీరబలము, బుద్ధి బలము, ఇంద్రియబలము కలుగును.
12. "కరివేపాకు,శొంఠి వీట్ల కషాయమును రెట్టింపు చేర్చి,

కరివేపాకురసముతో నూరి శనగల వలె మాత్రలు చేసి భోజనము చేయుటకు అరగంటముందుగా ఉదయము, సాయంకాలమున్ను 40 దినములు సేవించిన, ఇతర ఔషధముల వలన విడువక శరీరము నాశ్రయించి యుండు రక్త క్షయము, బలహీనపరచు అజీర్ణము, నిస్సంశయముగ నివారణయై క్రమముగ శరీరమునకు, బుద్ధికి బలముకలుగును.

13. "పర్పాటకము" జటామాంశి, వేచిన అక్కలకర్ర" వీటి చూర్ణము మూడురెట్లు చేర్చి లవంగాలకషాయముతో కలియనూరి శనగలవలె మాత్రలుచేసి 6 గంటలకొకసారి సుమారు మూడుతులములచన్నీళ్లతో నిచ్చిన యెడల, ప్రమేహము అనగా (సెగ) రోగము జీర్ణించుట వలన కలిగెడు మేహజ్వరములు, నిక్కాకవలన శరీరము ఎల్లప్పుడు వేడిగా నుండుట నివారణయై ధాతు పుష్ఠికలిగి, శరీరమునకు బలమునిచ్చును.

14. ఎండిన గులాబీపువ్వులు, పచ్చకర్పూరము, ఏలకులు షహజీరా, మంచిగంధముపొట్టు, వీని చూర్ణము అయిదురెట్లు చేర్చి కలబందరసముతో నూరి, శనగలవలెమాత్రలు చేసి, పచ్చిగానున్నప్పుడే వట్టివేళ్ల చూర్ణములోపొర్లించి, మధ్యాహ్నము నాలుగు గంటలకు రాత్రి పరుండబోవునపుడు చల్లనినీళ్లతో ఒక్కొక్క మాత్ర చొప్పున పుచ్చుకొని "అరతులము పాలసుగంధి చూర్ణము వెసరు నీళ్లలో కలిపి, గిద్దెడు సన్న బియ్యము పోసి, అన్నము వుడికిన తరువాతను గంజివార్చి వేసి, వేడిగానుండగా కొద్దిగా ఆవునెయ్యి కలిపి రాత్రి పరుండబోవునప్పుడు అన్నముతో కండ్లపైన కాచి అదే కండ్ల పైని వేసికట్టుకట్టి, ఉదయమున తీసివేయవలెను" ఇలాజరుపుతూ ఈ ఔషదమునే సేవించిన యెడల, సవాయి మొదలగు సుఖవ్యాధుల వలన గాని దారుణకాకవలన గాని, కండ్ల యెరుపు, పోటు, శిరస్సు పోటు కలిగియుండి, ఎండచూడనివ్వని నేత్ర రోగములు నివారణమవును.

15. ఏలకులు పసుపు, తిప్పసత్తు, హేమసుందరరసము" వీటి చూర్ణము రెట్టింపు చేర్చి, తిప్పతీగెరసము లేక పల్లేరు రసములో, చక్కెర కలిపి దానితో ఉదయము, సాయంకాలము పుచ్చుకొనిన, మూత్ర నాళమందలి మంట, పోటు, నొప్పిగల ప్రమేహము అనగా (సెగ) రోగము నివారణమవును.

16. "ఎండించిన నేలవుశిరిక సమూలము" అగరు శొంఠి, కొబ్బరిపువ్వు, దోసవిత్తులు, పల్లేరు కాయలు రెట్టింపు చేర్చి పంచదార, వెన్నతో పుచ్చుకొనిన

గాని, సదరు నాలుగు వస్తువులతో సిద్ధము చేసిన కషాయముతో గాని సేవించిన, వేదనాయుక్తముగా మూత్రముబొట్లుబొట్లుగ వెడలెడు ప్రమేహము, మూత్ర కృచ్ఛము నివారించును.

17. ఈ ఔషధము ఒక భాగము, హేమమాక్షిక భస్మము అరభాగము, శిలాజిత్తు భస్మం అరభాగం పత్సకర్పూరము పావుభాగం "పసుపు, చంగల్వ కోష్టు, మంచిగంధపు చెక్క, ఏలకులు, గులాబీమొగ్గలు" వీని చూర్ణము రెండు పావుభాగం జేర్చి పటిక పంచదార, వెన్నతో పుచ్చుకొనిన, తాపయుక్తమగు అతిమూత్రము, మధుమేహము, ప్రమేహమునివర్తియై మిక్కిలి బలవీర్యాదులు కలుగును.

18. ఇది ఒక పాలు, శత పుఠకృష్ణా భ్రక భస్మము ఒక పాలు, శిలాజిత్తు భస్మము అరపాలు, తిప్పసత్తు అరపాలు, మంచిగంధపుచెక్క, చెంగల్వ కోష్టు, వట్టివేళ్లు, ఏలకులు, పసపు, గులాబీ మొగ్గలు, వీనిచూర్ణము మూడుభాగములున్న చేర్చి, పటికబెల్లము చూర్ణము, ఆవు వెన్నతో గాని, అల్లపురసముతో గాని యెఱ్ఱబియ్యపు కడుగునీళ్ళతోగాని సేవించిన, నీరస పెట్టెడు దాహయుక్త మగు బహు మూత్రము నివారణయై, శరీరపుష్టి, బలము, కాంతి, కలుగును.

అతిమూత్రమున కీయౌషధమును సేవించునప్పుడు ఉలవపప్పు గాని, పెసరపప్పు గాని చేర్చి బూడిదిగుమ్మడి కాయతో చేసిన వడియములు రెండుపూటలు పుచ్చుకొనవచ్చును. తరువాణిచారు పుచ్చుకొనవచ్చును. మైనపుగుడ్డగాని, నీలిగుడ్డగాని గోచివుంచవలెను.

19. అక్కలకఱ్ఱ చూర్ణం నాలుగుపాళ్లు, తుంగముస్తెలచూర్ణం రెండు పాళ్ళు, ఏలకుల చూర్ణం ఒకపాలు, ఈ చూర్ణములన్నిటికి సమము ఈ యౌషధమునుచేర్చి, కసివిందవేరు చెక్క రసముతో శనగలవలె మాత్రలుచేసి, ఉదయం, సాయంకాలము, రాత్రిపరుండబోవునప్పుడును, పొంగించిన మిరియాల రసముతో నిచ్చినయెడల, కుసుమరోగములునివారణమవును.

20. దీనికిసమము మేడిచెక్క, కొబ్బరిపువ్వు, చంద్రచిగుళ్ళు, నేరేడుచెక్క, లక్క, అరటి దుంప, వరి బియ్యము వీటిచూర్ణమును చేర్చి, తేనెతో నిచ్చినయెడల, ఎఱ్రకుసుమ, రక్త పిత్తము, తప్పకనివారయణయై, శరీర ధారుధ్యము కలుగును.

21. దీనికి సమం మామిడిచెక్క చూర్ణమును చేర్చి, "నేరేడు చెక్క, ఉ సిరికపప్పు, నేలతాడి, చంద్రచెక్క, పిల్లి తేగలు, పల్లేరు సమూలము" వీనిని

కొద్దిగ దంచి కాచిన కషాయముతో గాని, బియ్యపు కడుగునీళ్ళతో గాని యిచ్చిన, తెల్లకుసుమ, రక్త పైత్యము, ప్రదరము నివర్తించును.

22 పల్లేరు వేరు, మర్రిచెక్క, మేడిచెక్క, యష్టీ మధుకము వీని చూర్ణము దీనికి సమముగ జేర్చి, తగుమాత్రముగ పంచదారను కలిపి ఆవుపాలతో నిచ్చిన, ఋతుశూలహరించి, గర్భమునిలచును

23. "జాజికాయ, సాలామిశ్రి, తిప్పసత్తు, తుంగ గడ్డలు, ఏలకులు" వీని చూర్ణమును, దీనికి అయిదురెట్లుజేర్చి తేనెతో నూరి కుంకుడుగింజలవలె మాత్రలుచేసి, రాత్రి పరుండబోవుటకు ఒకగంటముందుగా ఒకమాత్ర వేసికొని, వేడిగానున్న ఆవుపాలలో తులంన్నరశుద్ధిచేసిన పెన్నేరు గడ్డచూర్ణమున్ను, తగుమాత్రము చక్కెరయును కలిపి, మూడుమాసములు పుచ్చుకొనిన, నపుంసకులకైనను పుంసత్వమునిచ్చును. మధ్యకాలమునందు కలిగిన నపుంసకత్వము నివారణయగుటకు సంధియములేదు. గొడ్రాలికైనను సంతానముకలుగును. ప్రమేహాదిరోగముల వలన కలిగిన సంతానలోపము నివారణయగుటకు సంశయములేదు.

24. దీనిని సదారాత్రి భోజనానంతరమున, జాజికాయ, జాపత్రి ఉపయోగించక, తాంబూలముతో సేవించిన రక్త క్షయము, పాండువు, కాసము, దప్పి, ఉన్మాదము, శ్వాసము, ముదిమి, మేహములు, రక్త విషదోషములు, శూలలు, మూత్రాఘాతము, మూత్రకృచ్ఛ్రము గళరోగము, ఆమ్ల పిత్తాదిరోగములు, నోటిపూత, రొమ్ము నొప్పి, ఇంద్రియవేడి, తలనొప్పి, నిద్రాభంగము, అతిమూత్రము, నడకవలన గాని, నిక్కాక వలన గాని, కాళ్లు, చేతులులాగుట, కండ్లు, కాళ్లు, చేతులుమంట, కాళ్లు, చేతులు, శిరస్సు, వీటియందు గలిగెడు అధిక చెమట, గుండెదడ, అజీర్ణము, నడుమునొప్పి, శరీర దుర్గంధము, పీనస, (అనగా ఎల్లప్పుడు ముక్కు నుండి నీరుకారుట) నివారణమవును.

25. జాజికాయ, జాపత్రి, ఖురాసానిఓమం, గంజాయి చెట్టు ఆకు, (గంజాయి కల్లీకాదు) నల్లమందు అనగా అభిని ఇవి సమభాగములుగా చూర్ణం చేసి అనగా (నల్లమందుతప్ప) తక్కినవి దేనికది చూర్ణముచేసి సమభాగములు గాకలుపవలెను. (నల్లమందు మాత్రలు చేయుటకు నూరునప్పుడు వేయవలెను). అచూర్ణం 1/2 అరతులం, వసంత కుసుమాకరం 1/2 అరతులం, టెంకాయ (కొబ్బరికాయ) నీళ్లు కొద్దిగ వేసి నూరి 50 మాత్రలుచేసి, ఉదయం రెండుమాత్రలు, సాయంత్రం రెండు మాత్రలు తేనెతో ముంచి పుచ్చుకొనిన బలహీనపరచిన

దాహాయుక్తమగు బహుమూత్రము నివారణయై బలవీర్యాదులుకలుగును. కొబ్బరికాయనీళ్లు అధికమువేస్తే మాత్ర చేయుట కుదరదు. 26. కాసీసభస్మము, తంగేడు పువ్వులు, కొండపిండి చెట్టు సమూలం (దీనిని పాషాణ భేది అని, తెలగపిండి చెట్టు అని కూడ చెప్పుదురు) దోసగింజలు, గలిజేరు వేళ్లు, నల్లమందు అనగా అభిని. ఇది దేనికది వేరు వేరుగ చూర్ణము చేసి సమభాగములుగ వేసి కలియనూరి (నల్లమందు పైవలెనే చేర్చవలెను. చేసిన చూర్ణం 1/2 అరతులం, వసంతకుసుమాకరం 1/2 అరతులం, పెద్ద పల్లేరు వేళ్ళ రసముతో గాని, తెలగపిండి ఆకురసముతో గాని మర్ధించి 50 మాత్రలు చేసి ఉదయం, సాయంత్రం రెండేసి మాత్రలు చొప్పున వేసికొని, ఒక డబ్బు యెత్తు బియ్యపు కడుగు గాని, చాయ పసపుకషాయం ఒక డబ్బు యెత్తుగాని పుచ్చుకొనిన అతిమూత్రము, మధుమేహము, శుక్ల మేహము, ప్రమేహము (సెగ) మొదలగు మేహములు నివారించి రక్తవృద్ధి, బలము కలుగును.

27. ఎండించిన పెద్ద పల్లేరు వేళ్లు లేక కాయలు, గొబ్బి గింజలు, బోడసరపుసమూలం లేక సాలామిశ్రి, బూరుగ బంక, ధనియాలు, ఇవి వేరువేరుగ చూర్ణములు చేసిన పొడి 1/2 అరతులం, వసంతకుసుమాకరం 1/4 పావుతులం కలియనూరి పదకొండు పొట్లములు కట్టి ఉదయం ఒక పొట్లము, సాయంకాలము ఒకపొట్లము తేనెతో పుచ్చుకొనిన మూత్రములో శుక్లముపోవుట, శుక్లము నీరవుట, స్ఖలనమవుట నివారణయై, ఇంద్రియపుష్టి, బలము కలుగును.

28. విష్ణుక్రాంత చెట్టు సమూలం నీడను యెండించి చూర్ణముచేసి, బర్రె (గేదె) పాలతో తడిపి నీడను ఆరబెట్టిన చూర్ణం ఒక తులం, వసంత కుసుమాకరం 1/2 అరతులం, కలియనూరి 15 పొట్లములు కట్టి, ఋతుకాలం అనగా బహిష్టు అయిన దినము మొదలు 15 దినములు ఉదయం ఒక పొట్లం, సాయంకాలము ఒక పొట్లమున్ను బర్రె (గేదె) వెన్నతో కలిపి సేవించిన, మొదట సంతానము కలిగిన పిమ్మట గర్భము గలుగని స్త్రీలకు సంతానము కలుగును.

29. గొడ్డు కాకరగడ్డకు ఎండించి చేసిన చూర్ణం ఒక తులం, (లేక ఎండిన యెర్ర కలువదుంప చూర్ణం) వసంతకుసుమాకరం 1/2 అరతులం, కలియనూరి 15 పొట్లములు కట్టి, నెలసరి అంటుయైన దినము మొదలు, ఉదయం ఒక పొట్లము, సాయంకాలము ఒక పొట్లమున్ను, రెండు డబ్బులయెత్తు ఆవు పాలలో గలిపి సేవించినయెడల గర్భవాతము అనగా

గర్భస్రావముగలుగుట నివారణయై గర్భమునిలుచును.

30. ఎండించిన తామరగడ్డల చూర్ణం, ఎర్ర నువ్వుల చూర్ణం, పాల సుగంధి చూర్ణం, పంచదార (చక్కెర) ఇవి సమభాగములు కలిపిన చూర్ణం ఒక తులం, వసంతకుసుమాకరం 1/2 అరతులం, ఇరువది యొక్క పొట్లములు కట్టి ఉదయం ఒక పొట్లం, సాయంకాలం ఒకపొట్లం తేనెతో గాని, బియ్యపు కడుగుతో గాని పుచ్చుకొనిన గర్భస్రావము అనగా గర్భముపోవుట నివారణయైు గర్భమునిలచును. మరియు నిది ఇంద్రియనష్టమును జేయు సర్వమేహరోగములను బోనణచును, పథ్యములేక యథేష్టముగ భుజించుచు నీయౌషధమును సదా సేవించుచుండిన, బహుమంది స్త్రీలతో రమించుటకు దగినశక్తి కలవాడై, కడుకామాతురుడై సుఖకరసురతముల వలన మదోన్మత్తుడై మదించిన స్త్రీల మదము నణంచువాడునైయుండును. సంసార సౌఖ్యమనుభవించువాని కీయౌషధము స్నేహితునివలె హితము చేయుచుండెను.

31. కరక్కాయ, కుంకుమపువ్వు, సుగంధి, జీలకర్ర, మిరియాలు, తిప్పసత్తు, వీనిని సమభాగములుగ చేసిన చూర్ణం రెట్టింపు చేర్చి తేనెతో సేవించిన పురాణజ్వరములు, పైత్యమేహజ్వరములు, పాండువు హరించి, రక్తవృద్ధి కాంతి, బలము కలుగును.

## పూర్ణ చంద్రోదయము

1. పూర్ణచంద్రోదయము ఒక తులమునకు, కస్తూరి పావు చిన్నము, పచ్చకర్పూరము బేడయెత్తు, జాజికాయ చూర్ణము బేడయెత్తు, పిప్పళ్ళ చూర్ణము బేడయెత్తు, లవంగముల చూర్ణము బేడయెత్తు చేర్చి, పొట్లములు కట్టి, తేనెతో సేవించిన ఇంద్రియ నష్టము, కాసశ్వాసలు పాండువు, దుర్భలత్వము, అరుచి, గుండెదడ, నిక్కాక, పురాణజ్వరము నివారణయై, ఇంద్రియవృద్ధిజేయును. గుండెకు బలమునిచ్చి, మనస్సంతోషమును కలుగజేయును

2. పైన వ్రాసిన విధమున చూర్ణాదులు మిశ్రమము చేసి కలబందరసముతో గాని, గులాబీపుష్పములరసముతో గాని, పన్నీరుతో గాని నూరి,కందుల వలె మాత్రలు చేసి, తాంబూలముతో మధ్యాహ్న మందును, రాత్రులందును, రెండేసి మాత్రలుచొప్పున సేవించిన ఇంద్రియ నష్టము, ఇంద్రియపల్చన, శీఘ్రస్ఖలనమును బోనణచి అమితముగ ఇంద్రియ వృద్ధినిచ్చి, అధిక

సంభోగేచ్ఛను గలిగించును.
3. పిప్పళ్ళు వీనిచూర్ణము చేర్చి పంచదార, తేనెతో నిచ్చిన "పంచచర్దులు" అరుచి, గాబరాపెట్టుట మనము నివారణమవును.
4. దీనికి సమము "శతపుతకృష్ణాభ్రక భస్మమును" గలిపి "ఏలకులు, తవాక్షరి, తెల్ల జీలకర్ర, నాగకేసరములు" వీని చూర్ణమును, సదరు ఔషధమునకు సమముగచేర్చి, పటికపంచదార చూర్ణము, ఆవువెన్నతో పుచ్చుకొనిన, నిక్కాకలు, కళ్ళెపడని పొడిదగ్గు, కడుపులో మంట, కాళ్ళు, చేతులు కండ్ల మంటలు, శరీరవేడి, ఇంద్రియ పల్చన, ఇంద్రియ వేడి, పైత్య వికారములు, నిక్కాకవలన నేత్ర దృష్టి తక్కువౌట నివారణయై, జఠరదీప్తికలిగి,శరీరకాంతి, బలము కలుగును.
5. పూర్ణచంద్రోదయమునకు సమము, శ్వేతాభ్రకభస్మమును చేర్చి, యీ రెంటికి సమము నాగకేసరముల చూర్ణము కలిపి, రావిచెక్కకషాయముతో 40 దినములు సేవించిన, చిరకాలమునుండి ఆశ్రయించియుండు శ్వేతరక్త కుసుమరోగములు నివారణయై, రక్త బలము, శరీర దారుఢ్యముకలుగును.
6. ఈ ఔషధము పావుతులం, తిప్పసత్తు 4 చిన్నములు, ఏలకులపొడి 2 చిన్నములు, తుంగముస్తెల చూర్ణం 2 చిన్నములు, తవాక్షీరి (వెదురుపాలు) 2 చిన్నములు, వట్టివేళ్ళచూర్ణం 2 చిన్నములు చేర్చి పొట్లములు కట్టి, ఉదయం నేతితో గాని, వెన్నతో గాని సాయంకాలము తేనెతో గాని ఇచ్చినయెడల నిక్కాకలు, కాళ్ళు చేతులు మంట, కడుపులో మంట శిరస్సు వేడి, ఇంద్రియవేడి మొదలగు అతి వేడిమీద పుట్టిన రుగ్మతలు, అరుచి, శుక్లనష్టము, కరపాదశీతలము, (అనగా యెల్లప్పుడును కాళ్లు, చేతులు, చెమట పట్టుట) అంగశూల, యోనిశూల, దడ, నిద్రపట్టుకుండుట నివర్తియై మిక్కిలి బలవీర్యాదులు కలుగును
7. దీనికి సమము "బిల్వశొంఠి, దాచిన చెక్క, గసగసాలు, హారతి కర్పూరము" వీని చూర్ణమును జేర్చి, విరేచనమైన వెంటనే యిచ్చిన పక్షమున రక్తగ్రహణి, ఆంబగ్రహణి, అతివేడిమీదపుట్టిన గ్రహణి నివారించును.
8. ఈ ఔషధము 1/4 పావుతులం, కస్తూరి అరచిన్నం, పచ్చకర్పూరం అరచిన్నాలు, జాజికాయ చూర్ణం 2 చిన్నములు, లవంగాలు చూర్ణం 3 చిన్నాలు, అక్కలకర్ర చూర్ణం 4 చిన్నాలు, శొంఠి చూర్ణం 2 చిన్నాలు, పిప్పలిచూర్ణం చిన్నం, మిరియాల చూర్ణం చిన్నం. ఇవి మిరియాలరసం పొంగించినదానితో నూరి కందులవలె మాత్రలు చేసి, వర్షకాలమునందు

జాముకొకమాత్ర చొప్పున సేవించిన పాండువు, మధ్యాహ్నము ఒకమాత్ర, రాత్రి రెండు మాత్రలు చొప్పున తాంబూలముతో సేవించిన ఇంద్రియవృద్ధి, బలము కలుగును.

9. తుంగముస్తెల కషాయముతో ఉదయం 9గంటలకు, సాయంకాలము 4 గంటలకు ఇచ్చిన పక్షమున శుక్లనష్టము నివారించును.

10. ఇది 1/4 పావుతులం, కస్తూరి చిన్నం, పచ్చ కర్పూరం అరచిన్నం, వీనిని తేనెతో నూరి కందులవలె మాత్రలు చేసి శీతాకాలమునందు వర్షకాలము'' నందేర్పరచిన అనుపానము తోడ నిచ్చిన యెడల అందుదహరించినరోగములు నివారణమవును.

11. పూర్ణ చంద్రోదయం పావుతులం, కస్తూరి అరచిన్నం, పచ్చ కర్పూరం చిన్నం, జాజికాయల చూర్ణం అరచిన్నం, లవంగాల చూర్ణం చిన్నం ఏలకుల చూర్ణం చిన్నం, అక్కల కర్ర చూర్ణం చిన్నం, శొంఠి, పిప్పలి, మిరియాల చూర్ణములు ఒక్కొక్క చిన్నం. వీనిని కలబందరసముతో నూరి కందులవలెమాత్రలు చేసి "వేసవికాలము"నందు వర్షకాలమునందు విధించిన అనుపానము నేర్పరచి నడిపిన యెడల ఇందువ్రాసిన రుగ్మతలు నివారణమవును.

12. ఈ ఔషధమును తాంబూలముతో సదాసేవించువారు అనేక స్త్రీలగర్వ మడంచుటకు తగిన శక్తి గలవారు అగుదురు మరియు నిది ముదిమిని, సమస్తరోగములనుబోనణచి వయ:స్థంభనమును గలిగించుటయే గాక, బలిష్టమగు క్షయాది రోగములనెడి ఏనుగులకు సింహము వలెనుండు, దీనిని సదాసేవించువారు కామముచే గర్వితులై స్త్రీలకు మిగుల సంతోషమును గలుగు జేయుచుందురు. దీనిని విడువక ఒక సంవత్సరము వరకు సేవించువారికి కృత్రిమ, స్థావర, జంగమ విషముల వలన యెవ్విధములైన వికారమును కలుగకుండును. ఈ పూర్ణచంద్రోదయము గృహపతి గృహమును రక్షించుచుండు చందంబున శరీరమును రక్షించుచుండును. దీనిని సదా సేవచేయువారు ఆవు నెయ్యి, ఆవుపాలు, మృదుకరమాంసములు, మీగడ, వరిపిండి లేక గోధుమపిండి చేర్చి, నేతితో తయారు చేయుబడిన పిండివంటలు, మిఠాయిలు, యెండించిన గుంటగలకర సమూలం, పర్పాటకము, కరక్కాయ, వీని చూర్ణమును రెట్టింపు జేర్చి తేనెతో పుచ్చుకొనిన, శోఫ, పురాణజ్వరములు, అంతర్గతజ్వరము నివర్తించి బలవీర్యాదులు కలుగును. రక్తమును శుద్ధి పరచును.

## పూర్ణ చంద్రోదయం మాత్రలు

పూటకు రెండుమాత్రలను పుచ్చుకొనిన గాని, తాంబూలముతో పుచ్చుకొనినగాని, ఇంద్రియనష్టమును, ఇంద్రియపలచన, అతిశీఘ్ర స్ఖలనమునుబోగొట్టి ఇంద్రియ వృద్ధి, రక్తవృద్ధినిచేసి, యధిక సంభోగేచ్ఛను గలిగించును.

## పూర్ణ చంద్రోదయము (వై.చిం.)

10గ్రా. 50 మోతాదులు

(1) పూ.చం. 10గ్రా॥ పచ్చకర్పూరము 3గ్రా॥ కుంకుమపూవు 3గ్రా॥ యాలకగింజలు 3గ్రా॥ లవంగాలు 3గ్రా॥ జాజికాయ 3గ్రా॥ కస్తూరి 1/2గ్రా వీనిని కలబంద రసముతోనూరి 60 మాత్రలు చేసి రోజుకు రెండు మాత్రలు తాంబూలముతో సేవించిన క్షయ, శుక్లనష్టము, శ్వాసకాసలు, పురాణ జ్వరము, రక్తహీనత, గుండెదడ నివారించి బలపుష్టులను నిచ్చును. సాధారణముగా అందరునూ వాడవచ్చును.

(2) శుక్రనష్టము, శీఘ్ర స్ఖలనము, మూత్రస్ఖలనము, అతివేడికి-సంభోగశక్తికి :- పూ.చం. 5గ్రా. వంగభస్మము 5గ్రా. అభ్రకము 5గ్రా. పచ్చ కర్పూరము 3గ్రా సాలామిశ్రి 3గ్రా. గొబ్బి గింజలు 3గ్రా. ఇందుపుగింజలు 3గ్రా. కల్పి పిల్లి తేగల రసముతో గాని, మంచిగంధం కషాయముతోగాని నూరి 60 మాత్రలు చేసి రోజుకు రెండు మాత్రలు రత్న పురుషలేహ్యముతోగాని, మదన కామేశ్వరి లేహ్యముతో గాని, అశ్వగంధతోగాని సేవించవలెను.

(3) క్షయ - శ్వాసకాసలకు- ఔషధము 5గ్రా. 20గ్రా. సితోఫలాది చూర్ణము చేర్చి 40 పొట్లములు కట్టి అల్లపురసము, తులసిరసము, తమలపాకు రసము, పటికిబెల్లము కల్పి కాచిన పానకముతోను

(4) హృద్రోగమునకు అర్జునతోగాని ఆవు గుమ్మ పాలతోగాని సేవించవలెను. క్రమాభ్యాసముచే ముదిమిని పోగొట్టును.

## రజిత చంద్రోదయము

1. చాతుర్జాతక చూర్ణము రెట్టింపు జేర్చి, తేనెతో పుచ్చుకొనిన పైత్యజ్వరము, జీర్ణజ్వరము, క్షయ, పాండువు, అగ్నిమాంద్యము నివారణమవును.
2. తమలపాకుల రసముతో నిచ్చిన అరుచి.
3. ఏలకులు చూర్ణమును రెట్టింపుజేర్చి ఇచ్చిన, దడ
4. దాచినచెక్కగసగసాలు,వీనిచూర్ణము రెట్టింపు జేర్చి బిల్వశొంఠిరసముతో

గాని, నేతితో గాని ఇచ్చిన, రక్త గ్రహిణి, జిగటవిరేచనములు. 5. 1 నెల మొదలు 5 సంవత్సరముల వరకు వయస్సు గల చంటిబిడ్డలకు, పావుచిన్నం మొదలు అరచిన్నం వరకు చనుబాలతో గలిపి యిచ్చినపక్షమున అంబవిరేచనములు, అరకవిరేచనములు, పైత్య సంబంధమగు వాంతి కట్టును.

6. కుంకుమపువ్వు, ఏలకులు, లవంగాలు, వీని చూర్ణమును రెట్టింపుకలిపి, ఉదయం, సాయంకాలము తేనెతో పుచ్చుకొనినయెడల, రక్తమును శుద్ధిపరచి, రక్తవృద్ధి, ఇంద్రియవృద్ధి, బలమును గలిగించి, క్షయను నివృర్తిజేసి, శరీరకృశత్వము నీరసమును బోనడచును

7. "లవంగాలు, శొంఠి" కషాయముతో గాని, "ధనియాలు, దాచినచెక్క జీలకర్ర'' వీని రసముతో గాని యిచ్చిన వాంతులు, పైత్య సంబంధమగుశరీరత్రిప్పు, గుండెలలోమంట

8. చనుబాలతో నిచ్చిన శరీరతాపము నివారణమవును.

9. అరటి పువ్వు, నాగకేసరములు, పసపు, మామిడి టెంకలలోనిపప్పు, తుంగముస్తెలు'' వీని చూర్ణమును రెట్టింపు జేర్చి తేనెతో నిచ్చిన కుసుమజాడ్యము 10 పూటకు అరచిన్న మియౌషధమున్ను, ఒక చిన్నము పటికిబెల్లము చూర్ణమున్ను జేర్చి, పావుశేరు మొదలు అర్ధశేరు వరకు పుచ్చు కొనగలిగన్ని ఆవుపాలలో పంచదారకలిపి, రాత్రి పరుండబోవునప్పుడు(పథ్యము లేకయే) 3 మాసములు సేవించిన, ఇంద్రియవృద్ధి రక్త పుష్టి కలిగి శరీరమునకు బుద్ధికి, బలమునిచ్చి మనస్సంతోషమును కలిగించును.

## రజితరసాయనము

1. గొబ్బిగింజలు, చింత గింజలలోనిపప్పు, పెద్ద పల్లేరు కాయలు, సాలామిశ్రి, వీనిచూర్ణము రెట్టింపుజేర్చి యిచ్చినయెడల, శుక్లనష్టము నివర్తించి, శుక్లమందలి దోషమును బోనణచి, శుక్లమునుచిక్క పరచి, బలమును కలిగించును,

2. చాతుర్జాతక చూర్ణమును రెట్టింపు జేర్చి, అల్లపురసము, తేనె సమముగకలిపి యిచ్చిన యెడల, పొడిదగ్గు, శ్లేష్మము, జీర్ణజ్వరము, శ్లేష్మవుడుకు, నివారణమవును.

3. దీని సమము వరిపేలాలపిండిని జేర్చి పంచదార, తేనెతో సేవించిన యెడల అన్న హితవు లేక భోజనముజేయునప్పుడు గలుగువాంతి, పైత్య వికారములను హరించును.

4. చనుబాలలో కలిపి వుగ్గువలె చంటిపిల్లలకు పట్టించిన యెడల, తాపము, కడుపులో వుడుకు, పాలు గ్రక్కుటను కట్టును.
5. దీనికి రెట్టింపు జీలకర్ర చూర్ణము జేర్చి ధనియాలు, జీలకర్ర, దాచిని చెక్క, వీనిని సమముగ కలిపి నీళ్ళుపోసి తీసినరసముతో పుచ్చుకొనినయెడల, వాంతి, కడుపులోవుడుకు, శరీరవేడి,కడుపులోమంట, జీర్ణజ్వరము, పైత్యజ్వరం.
6. కుంకుమపువ్వు, ఏలకులు, లవంగాలు, గొబ్బిగింజలు వీని చూర్ణము రెట్టింపుజేర్చి అల్లపురసం, తేనెగ్రాహి చేసిన రసములో గలిపి, ఉదయం సాయంత్రంయిస్తే, రక్తమునుశుద్ధిపరచి, రక్తవృద్ధి, ఇంద్రియవృద్ధి, బలమును కలిగించి, మేహక్షయను నివర్తింజేసి, శరీరకృశత్వమును నీరసము బోనణచును.
7. చనుబాలతో నిచ్చిన, శరీర తాపము, కడుపులోమంట
8. అరటిపువ్వు, నాగకేసరములు, పసుపు మామిడిటెంకలోని పప్పు, తుంగముస్తెలు, వీని చూర్ణమును రెట్టింపుజేర్చి, తేనెతో నిచ్చిన, తెలుపు, యెరుపు కుసుమ జాడ్యములు
9. వీనికి సమము తిప్పసత్తు, ఈరెంటిసమము వెత్సజేసిన తెల్ల జీలకర్ర చూర్ణమును జేర్చి యిచ్చిన, పొడిదగ్గు, కడుపులో మంట, నిక్కాక మీదగలుగు శరీరవేడి, శ్లేష్మవుడుకు, మేహజ్వరమును నివారణయై, రక్తమును శుద్ధిజేసి బలము, శరీరపుష్టి, మేహజ్వరమును నివారణయై, రక్తమును శుద్ధిచేసి బలము, శరీర పుష్టి, కాంతి కల్గించును.

## రజిత చంద్రోదయము (ర.త.)

10గ్రా. 40 మోతాదులు

(1) తిప్పసత్తు, పంచదారతో అత్యుష్ణము
(2) జీలకర్ర రసముతో దడ, తాపము, చర్ధి చిత్త భ్రమకు
(3) అశ్వగంధాదిచూర్ణముతో పుంస్త్వమునకు
(4) ద్రాక్షపండ్లరసము లేక చనుబాలు లేక రసాయనితో చిక్కిన శిశువులు పుష్టి చెందుటకు
(5) వేచిన జీలకర్ర చూర్ణము పంచదారతో గుండెదడ, గుండెనొప్పికి
(6) బియ్యపు కడుగుతో నూరి తీసిన దనియాల రసముతో కొంచెము పంచదారచేర్చి కడుపులో మంట, కండ్లమంటలు, కాళ్ళు చేతులు మంటలకు
(7) రజితచంద్రోదయము 10గ్రా. వంగభస్మము 10గ్రా. సాలామిశ్రి

10గ్రా. వేపబంక 10గ్రా. కలిపి ఆవుపాలతో మర్ధించి 100 మాత్రలు చేసి పూటకు రెండు మాత్రల చొప్పున మంచినీళ్ళతో సేవించిన శుక్ల నష్టము, వీర్యము పలచబడుట నివర్తించి సంభోగశక్తి, బలము, పుష్టి, కాంతి నొసగును.

## రజిత రసాయనం

10గ్రా. 50 మోతాదులు

1) జీలకర్ర చూర్ణము, పంచదారతో అమితవేడి, దద, తాపమునకు
(2) అశ్వగంధాది చూర్ణముతో ధాతుపుష్టికి
(3) రసాయనితో చిక్కిన శిశువులకు
(4) ధనియాలరసము, పంచదారతో కడుపులోని మంటకు, కండ్ల మంటకు, వాడవచ్చును. వీర్యమును చిక్కబరచును.

## రజితలోహరసాయనము (ర. యో.ర. )

10 గ్రా. 35 మోతాదులు

1) గంటు భారంగి కషాయముతో అస్థిగత జ్వరము
(2) వేపచెక్క కషాయముతో పిత్త కఫజ్వరములు
(3) తమలపాకు రసము తేనెతో శ్వాసకాసలు
(4) సమము వంగభస్మము చేర్చి వెన్న పంచదారతో శుక్ర నష్టము, తెల్లకుసుమ, పొడిదగ్గు, గుండెదడ, కళ్లెదగ్గు
(5) సమము షడ్గుణ సింధూరము రెట్టింపు చాతుర్జాతకచూర్ణము చేర్చి తేనెతో తిమ్మెరలు, మేహనంజు
(6) సమము సితోఫలాది చూర్ణము చేర్చి రసాయనితో క్షయ, కాసలకు వాడవలెను.

## త్రిపాదచంద్రోదయము

1. త్రిఫలచూర్ణమును రెట్టింపుజేర్చి, తేనెతో సేవించిన, శరీరపుష్టి,
2.పచ్చకర్పూరమును జేర్చి తేనెతో పుచ్చుకొనిన, అతికాక, శరీరత్రిప్పు, మొదలగు పైత్యరోగములు
3. త్రికటుకములు గంటుబారంగి" వీని చూర్ణమును సమముగా జేర్చి తేనెతో సేవించిన, కాసశ్వాసలు, శూల
4. త్రిఫలములు, త్రికటుకములు" వీని చూర్ణమును సమముగా జేర్చి తేనెతో సేవించిన, కామిల, పాండువు అగ్ని మాంధ్యము.
5. "లవంగముల చూర్ణము, కుంకుమపువ్వు" వీని చూర్ణమును సమముగా

జేర్చి, తాంబూలముతో సేవించిన, ఇంద్రియవృద్ధి
6. దీనికి సమము తిప్పసత్తును జేర్చి యిచ్చిన, పొడిదగ్గు నివర్తియై శరీరపుష్టికలుగును.
7. త్రికటుకములు, చిత్రమూలము" వీని చూర్ణమును సమముగా జేర్చి తేనెతో నిచ్చిన దారుణమగు కఫరోగములు.
8. దీనికి సమము వరిపేలాలపిండినికలిపి పంచదార తేనెతో సేవించిన సర్వపైత్యములు, వాంతులు, నివారించును.
9. దీనికి సమము "శతపుర కృష్ణాభ్రకభస్మము" రెంటికి సమము చాతుర్జాతక చూర్ణమును జేర్చి, తేనెతో గాని, పటిక బెల్లంచూర్ణము, వెన్నతో గాని పుచ్చుకొనిన, పొడిదగ్గు, కపయుక్తమగు క్షయ నివర్తించును.
10 "జీలకర్ర ధనియాలు" వీని రసముతో నిచ్చిన, పైత్య చర్ది
11. తేనెతో నిచ్చిన జ్వరము, అరుచి
12. చనుబాలతో చంటిబిడ్డలకిచ్చిన, పాలుగ్రక్కుట, విరేచనములు, జ్వరముకట్టును.

## బాలచంద్రోదయము

1. ఈ ఔషధములో సగంభాగము, నల్లమందు చేర్చి నలిపి, పెసరగింజల వలె మాత్రలు చేసిన చంటిబిడ్డలకిచ్చిన, విరేచనములు కట్టును
2 చనుబాలలో, అరుగదీసియిచ్చిన, పాలుగ్రక్కుట, వాంతి, జ్వరముకట్టును.
3. తేనెలో యరుగదీసి యిచ్చిన జ్వరము, శరీరత్రిప్పు,
4."ధనియాలు, జీలకర్ర" వీని రసముతో నిచ్చిన, పైత్యజ్వరము, శరీరత్రిప్పు వాంతి, అరుచి, నివర్తించును. (చంటిప్లిలకు వయస్సును బట్టి మోతాదు తగ్గించవలెను.)

## మహావాతవిధ్వంశి

1. బేడయెత్తు ఔషధముమందు 11 మిరియములు చేర్చి, చిత్రమూలము లేక తమలపాకుల రసముతో నూరి, కందులవలెమాత్రలు చేసి, వాతోద్రేకము వలన శరీరము చల్లబడి స్మృహలేక యున్న వారికి సహా 5 లేక 10 నిముషముల కొకసారి రెండేసి మాత్రల చొప్పున "అల్లము, వెల్లుల్లి, తమలపాకులు'' అనువీనిలోయే రసములో నైనను, 3 మోతాదులిచ్చు సరికి తగినంత వేడిచేసి సన్నిపాతాది దోషములను బోనడచి జీవమును నిల్పును. (ఆయారసములతో ఔషధము అరుగ దీసి కూడ యివ్వవచ్చును)

2. తులసి యాకురసముతో మాత్రలు చేసి వేడినీళ్ళతో గాని, అల్లపురసముతో గాని పూటకొకమాత్ర చొప్పున యిచ్చిన శీతజ్వరములు, వాతజ్వరములు
3. మిరియముల చూర్ణమును చేర్చి అగరు శొంఠి, పిప్పళ్ళు, మిరియములు" వీని చూర్ణమును చేర్చి చెరకు బెల్లముతో నిచ్చిన గాని మన్యపుజ్వరములు, చలిజ్వరములు, పాలీజ్వరములు, శీఘ్రముగ నివర్తించును.
5. కరక్కాయ, కొడిశపాల" వీని చూర్ణమును చేర్చి బెల్లముతో నిచ్చిన దినమునకు 3,4 సార్లు వచ్చుచు, విడుచుచుండెడు చలిజ్వరము నివారణమవును.
6. దీనికి సమము త్రికటుక చూర్ణమును జేర్చి తేనెతో నిచ్చిన వాతమువలనబుట్టెడు నడుముజబ్బులు మొదలగు కీళ్ళయందలినొప్పులు, కీళ్ళు పట్టుతప్పుట, సలుపుట నివారించును.
7. పిప్పలి చూర్ణమును చేర్చి తేనెతో నిచ్చిన మహా జ్వరములు, చిరకాలాశ్రితములగు జీర్ణజ్వరములు.
8. ఒకబేడయెత్తు ఔషధమందు, అరచిన్నము కస్తూరియు 9. మిరియములను చేర్చి ఉప్పిచిగుళ్ళ రసముతో నూరి కందుల వలె మాత్రలుచేసి, గంటకు రెండు మాత్రలు చొప్పున యిచ్చిన, కఠినమగు నూతికావాతములు
9. చిత్రమూలము చూర్ణము సమముగ చేర్చి, చిత్రమూలమురసముతో నూరి మాత్రలు చేసి, పూటకు రెండేసిమాత్రలు చొప్పున యిచ్చిన యెడల ద్వంద్వ జ్వరములు, సన్నిపాత జ్వరములు, విషజ్వరములు, వాతజ్వరములు, ఎనుబదివిధములగు వాతములను ఖండించును.
10. రోగ బలానుసారముగ కాలములను నిర్ణయించి అల్లపురసములో గాని , తేనెలో గాని, అరుగదీసి యిచ్చిన యెడల, పైన వ్రాసిన రోగములు నిర్వర్తించును.
11. "గసగసాలు, పొంగించిన వెలిగారము, కొడిశపాల విత్తులు" వీని చూర్ణమును సమముగ జేర్చి, గంజాయి ఆకురసముతో నూరి, కందుల వలె మాత్రలు చేసి రెండేసి మాత్రల చొప్పున యిచ్చిన యెడల; అజీర్ణాది సర్వాతిసారములను, "కలరా వ్యాధిని కూడ నిలుపును" (పావుతులం 11 లేక 15 మోతాదులు).

## సువర్ణలోహరసాయనము

1. ఈ ఔషధము అరచిన్నమున్నూ "కరక్కాయ, లవంగ మొగ్గలు, కళింగరాష్ట్రము" కొద్దికొద్దిగ అరుగదీసి యిచ్చిన ఎడల, కఠినమగు కాస, శ్వాసలను, వగరపు వచ్చినప్పుడు గొంతునందు పిల్లి కూతవలె ధ్వని కలుగుట, గుండెలలో భారము, నొప్పికలుగుట, గొంతునందు వుండవలెనుండుట, నాలుకయందు ద్రవము లేకుండుట యను దుర్గుణములు గల కఠినమగు కాస, శ్వాసలను, సూర్యతేజస్సు తిమిరసంఘమును బోకడచు చందంబున" నివారణచేయును. 2.ఎ)ఈ ఔషధము పావుతులం, బి)జతామాంశి 4 చిన్నములు సి) వెదురుపాలు 4 చిన్నములు డి) గంటుభారంగి 4 చిన్నములు ఇ) యవక్షారము 2 చిన్నములు ఎఫ్) దానిమ్మకాయ బెరడు 4 చిన్నములు, జి) జీలకర్ర చూర్ణము 2 చిన్నములు. వీటి అన్నిటి యెత్తుకు రెట్టింపు పారుచెరుకు బెల్లము కలిపి నూరి, కుంకుడుగింజవలె మాత్రలు చేసి, రోజుకు అనగా దివారాత్రములలోగా 5మాత్రలు చొప్పున బుగ్గనుంచుకొని ద్రవము మ్రింగుచుండినయెడల, చిరకాలాశ్రితమైన శరీరమును కృశింపజేయు కఠినమగు కాస, విడువక బాధించుచుండెడు ఆంబవిరేచనములు, రక్త విరేచనములు కట్టును. (ఇందు సువర్ణము మిశ్రమము చేయబడినది)

## రజితలోహరసాయనము

1. ఈ ఔషధము అరచిన్నమున్ను, కొద్దిగ సన్నరాష్ట్రమున్ను, తేనెతోగాని, లవంగముల రసముతో గాని అరుగ దీసి యిచ్చిన యెడల, దగ్గు, వగరపు గుండెలలో బారు, కంఠమునందుండవలె నుండుట

2. "రేవల్ చిన్ని లవంగాలు, శొంఠి" వీని చూర్ణమును రెట్టింపు చేర్చి, తేనెతో ఉదయము, సాయంకాలము, రాత్రి పరుండబోవునపుడున్ను "శతపురఖడ్గలోహ భస్మము" వీనికి రెట్టింపు చాతుర్జాతక చూర్ణము చేర్చి, తేనెతో నిచ్చిన, మేహవాతము వలన కలిగిన శరీరము, కీళ్ళనొప్పులు, తిమ్మెరలు, పైత్యశ్లేష్మమును, కాస శ్వాసలు, అగ్నిమాంద్యమును నివారణచేసి రక్తమును, ఇంద్రియమును వృద్ధిపరచి శరీరధారుఢ్యమును గలుగజేయును.

దీనికి సమము "మహావాత రాక్షసము"ను గాను "వాత రాక్షసము"ను గాని చేర్చి స్థాళీచూర్ణమును వీనికి రెట్టింపు చేర్చి, తేనెతో సేవించిన

"పక్షవాతము"ను శీఘ్రముగ నివారణ చేయును. 5. దీనికి సమము "అయస్కాంత భస్మము" ను చేర్చి, వీనికి సమము చాతుర్జాతక చూర్ణము చేర్చి, తేనెతోపుచ్చుకొనిన, తిమ్మెరలు, నరముల బారు; 6. చనుబాలతో నిచ్చిన తాపమునివారణమవును. (ఇందధికముగా రజితము చేర్చబడినది)

## తామ్రలోహరసాయనము

1. తేనెతోగాని, అల్లపురసముతోగాని, తులసి ఆకురసముతో గాని అరుగదీసి ఇచ్చిన యెడల, వాత శ్లేష్మములు, కాసశ్వాసలు;
2 దీనికి సమము కటుక రోహిణి చూర్ణము జేర్చి తేనెతో నిచ్చిన శ్వాసము, ఆరోచికము
3. మిరియములు, దానిమ్మగింజలు, పాత చెరకు బెల్లము, వీనిని కలియనూరినది, ఔషధమునకు రెట్టింపు వుండలో నుంచి ఇచ్చినయెడల, అయిదు విధములగు శ్వాసలు ;
4. దీనికి సమము గుంటకలగరాకు చూర్ణమును జేర్చి తేనెతో నిచ్చిన, కంఠజి హ్వికాసము;
5. దీనికి సమము స్థాలీ చూర్ణమును జేర్చి తేనెతో సేవించిన, కీళ్లనొప్పులతో కూడుకొనిన ఉబ్బుజాడ్యమును నివారణమవును.

## తామ్రరసాయనము

1.తేనెతో అరుగదీసి ఇచ్చిన గాని, చాతుర్జాతక చూర్ణమును జేర్చి తేనెతో నిచ్చిన గాని, వాత శ్లేష్మములు, దగ్గు, వగరపు నివర్తించును. ఈ. రెట్టింపు స్థాలీ చూర్ణమును జేర్చి తేనెతో నిచ్చిన, కఫయుక్తమగు కీళ్ల నొప్పులతో కూడుకొనిన ఉబ్బు నివారణమవును.

## లోహరసాయనము

1. తేనెతో అరగదీసి ఇచ్చినయెడల, వాత శ్లేష్మముల, దగ్గు, వగరపు
2. స్థాలీచూర్ణమును రెట్టింపుజేర్చి, తేనెతో నిచ్చిన, కీళ్లనొప్పులు గల ఉబ్బుజాడ్యము, కాస, శ్వాసలు నివారణమవును.

## స్వర్ణభూపతి

1.దీనికి సమము పిప్పలి చూర్ణము అల్లపురసము లేక తేనెతో నిచ్చిన సన్నిపాత క్షయము
2.అల్లపురసముతో అరుగదీసి యిచ్చిన 23 సన్నిపాతములు
3. అల్లపురసమును జేర్చి తేనెతో నిచ్చిన ఆమ్లవాతము, ధనుర్వాతము, శృంఖవాతము, ఆఢ్యవాతము, పంగువాతము, కఫవాతము, కటివాతము
4. రెట్టింపు త్రికటు చూర్ణమును జేర్చి, అల్లపురసముతో గాని, దాచిన

చెక్క రసముతోగాని, యిచ్చిన, అజీర్ణము అగ్నిమాంద్యము
5. పంచలవణములు, త్రికటుకములు వీని చూర్ణమును రెట్టింపు జేర్చి వేడినీళ్లలో కలిపి యిచ్చిన సర్వశూలలు
6. అగరుశొంఠి, పిప్పళ్ళు కొడిశపాలవిత్తులు, బూరుగబంక వీని చూర్ణమును జేర్చి బిల్వశొంఠి (ఎండినమారేడు పిందెలు) రసముతో యిచ్చిన, బలిష్టమగు అతిసారము
7. దీనికి సమము పసపు చూర్ణమును జేర్చి ఆవు వెన్న, పంచదారతో పుచ్చుకొనిన ప్రమేహము,
8. త్రికటుక చూర్ణము లేక చాతుర్జాతక చూర్ణము జేర్చి తేనెతో సేవించిన, కాస శ్వాసలు, 8 విధములగు జ్వరములు
9. కుంకుమపువ్వు, చంగల్వకోష్టు, కురువేరు, పాలసుగంధి వీని చూర్ణమును రెట్టింపు చేర్చి తేనెతో పుచ్చుకొనిన,శిరోవాతము మొదలగు కఫాలరోగములు
10. తుంగముస్తెలు, కటుకరోహిణి, శొంఠి, వీని చూర్ణమును సమముగ జేర్చి తేనెతో పుచ్చుకొనిన, కామిల
11. చాతుర్జాతక చూర్ణమును రెట్టింపు జేర్చి తేనెతో పుచ్చుకొనిన, పాండువు, సూర్యుడుదయించుట వలన అంధకారము నశించుభంగి" నివర్తించును. (సువర్ణ మిశ్రమము)

## బాలసూర్యోదయము

1. దీనికి సమము "త్రిఫలములు, పాలసుగంధి" వీని చూర్ణమును సమముగ జేర్చి తేనెతో నిచ్చిన, మేహజ్వరములు, పురాణజ్వరములు;
2. త్రికటుక చూర్ణమును జేర్చి, దాచినిచెక్క రసముతో నిచ్చిన, అగ్నిమాంద్యము, అజీర్ణము
3. దీనికి సమము శొంఠి చూర్ణమును జేర్చి సముద్ర లవణము, నెయ్యితో నిచ్చిన శూలరోగము;
4. కరకపువ్వు, వస, త్రికటుకము" వీనిచూర్ణమును సమముగ జేర్చి, తేనెతో పుచ్చుకొనిన, కాసశ్వాసలు;
5. తామరదుంప, అగరు శొంఠి, పిల్లితేగలు, పసపు" వీని చూర్ణమును రెట్టింపుచేర్చి తేనెతో నిచ్చిన కుసుమ రోగములు
6. చాతుర్జాతక చూర్ణము రెట్టింపు జేర్చి తేనె, లేక పటికె పంచదార, వెన్నతో పుచ్చుకొనిన, పైత్యజ్వరములు, క్షయ, పాండువు, అరుచి, నివారణజేసి, రక్తమును వృద్ధిపరచి, బలమును గలుగజేయును.

7. జీలకర్ర, పర్పాటకము, వీని చూర్ణమును రెట్టింపుజేర్చి, అల్లపురసముతో నిచ్చిన, చలితాపముగల జ్వరము నివారణమవును.

## మృత సంజీవని రసము

1. అల్లపురసముతో గాని, చిత్రమూలరసముతో గాని, నూరి, గురిగింజల వలె మాత్రలు చేసి, రోగ బలాను సారముగ, అయిదు నిమిషములకొకసారి మొదలు గంటకొకసారి వరకు రెండేసి మాత్రలు చొప్పున, అల్లపురసాను పానముగ నిచ్చుట వలన గాని, అల్లపు రసంలో అరుగదీసి ఇచ్చుట వలనగాని దారుణమగు సన్నిపాత దోషయుక్తుడై ప్రాణాపాయము తటస్థించియున్న వాడైనను, నిస్సంశయముగ జీవించును.
రసము నుమ్రింగ వీలు లేనప్పుడు, పట్టమాత్ర నివ్వవలెను.
(సన్నిపాతములహరింపజేయుటకు దీనికంటె శ్రేష్టమగు ఔషధంబెద్దియును లేదని శివునిచే వచియింపబడిన "మృతసంజీవనీరస" మనంబడును)

## రసభూపతి

1. దీనికి సమము స్థాలీ చూర్ణమును చేర్చి అల్లపురసముతో గాని, తేనెతో గాని సేవించిన, ఉబ్బు జాడ్యము చాతుర్జాతక చూర్ణమును, చేర్చి తేనెతో యిచ్చిన, పాండువు, శోఫ, జీర్ణజ్వరము, అగ్నిమాంద్యము నివర్తించును. (ఇది అగ్ని కుమారము అని రసభూపతి, యనియు కూడ చెప్పబడును).

## ఖజలీ ఔషధములు

## శ్రీవిష్ణు చక్రరసము

1. చిత్రమూల రసముతో నూరి, సుమారు పెద్ద ఆవగింజవలె మాత్రలు చేసి. అల్లపురసముతో రెండేసి మాత్రల చొప్పున యిచ్చిన యెడల, ఎనుబది విధములగు కఠిన వాతములు, దోషజ్వరములు, నివర్తించును. దారుణమగు సన్నిపాతము వలన స్మృహతప్పి, మాటలేక, ప్రాణాపాయస్థితి యందున్న వారికి అల్లపు రసముతో రెండేసి మాత్రలను గాని, అల్లము లేక తమలపాకు రసముతో రెండు గింజల ప్రమాణము అరుగదీసి గాని, రోగబలమునుబట్టి కాలమునునిర్ణయించి యిచ్చిన యెడల "వారాంగనల యొక్క క్రీగంటి చూపు పురుషుని చిత్తమపహరించు చందంబున" రోగమునుహరింపజేసి, వెంటనే మాట్లాడించి ప్రాణరక్షణజేయును.
2. ఉప్పి చిగుళ్ళ రసముతో నూరి, పెసరగింజలవలె మాత్రలు చేసి,

ప్రసవ మైన స్త్రీలు సూతికావాతములచే ప్రాణాపాయ స్థితిలోనున్నప్పుడు 2 గంటలకొకసారిచ్చిన యెడల వెంటనే రోగము నివర్తించును.
3. ఏ ఔషధమువల్లనూ శ్లేష్మము దిగక ఎదుర్కొనియున్న సమయమున, రెండు ఆవగింజల ప్రమాణమును, అల్లపురసము, నల్లేరు రసము ఆకు చెముడాకు రసముయను వీని యే రసముతో నైనను, అరుగదీసి యిచ్చిన యెడల "చంద్రాయుధమువలె" కఫమును ఖండించి తక్షణము కాసశ్వాసలను నిలుపును. మరియు, నిది జ్వరబల్లలు, ఉదరములు, శూలలు, గుల్మములు మొదలగు సర్వరోగములను ఖండించును. రోగస్థితిని బట్టి మోతాదు హెచ్చింపవచ్చును.

స్మృతిదప్పి, మాటలేకయున్న నిరాశగలరోగి, ఏ కారణము చేతనైనను మాట్లాడించు అవసరము కలిగినప్పుడీషధమును నాలుగు అయిదు పెసర గింజల ప్రమాణమును, ప్రయోగించిన యెడల, పేరు సార్థక పడునటుల వెంటనే మాట్లాడించును. (సువర్ణ రౌప్య, మౌక్తి కాదిభస్మములు,కస్తూరి, గరళము, మొదలగు అధిక విలువగల వస్తువులు, కష్ట సాధ్యములగు "చేదుకట్లు" మిశ్రమముతో) యీ యౌషధమును మిక్కిలి ప్రయాసమును పొందితయారు చేయబడినది. అపాయస్థితియందున్న రోగుల ప్రాణరక్షణచేయుట కీయౌషధముకంటే శ్రేష్టతరమగు యౌషధబెద్దియును లేదు.

## మహాతరుణార్కము

1.అల్లము లేక చిత్రమూలరసముతో నూరి, కందులవలె మాత్రలుచేసి గాని, అల్లపు రసముతో అరుగదీసిగాని ఇచ్చిన యెడల, ప్రాణాపాయ స్థితికి దెచ్చియుండు 13 సన్నిపాతములు, ఎనుబదివాతములను, దోషజ్వరములనుతక్షణం నివారణచేయును.
2. దీనికి ఆయారసములలో అరుగ దీసియు నివ్వవచ్చును. (సువర్ణ మిశ్రమము)

## సూతికాముఖము

1. సన్నిపాతము, సూతికావాతము, మొదలగు రోగములవలన స్మృహతప్పి, ఔషధము దిగకయున్నప్పడీ యౌషధమును బ్రహ్మరంధ్రము అనగా నడితయందుగొరిగి, రక్తము వచ్చునటుల అతిస్వల్పకత్తెనాటు వేయించి నాలుగు వడ్లగింజలు యెత్తు ఔషధమును, వేపనూనెతో గాని, వేప వేరు

చెక్క రసముతోగాని అరగదీసి మర్దించిన యెడల, సన్నిపాతాది దోషములు వెంటనే నివారణయై జ్ఞప్తికలుగును. ఈ ఔషధము లోపలికివ్వకూడదు.

## ఖజ్జలీ వాతవిధ్వంశి

1. చిత్రమూలము లేక అల్లపు రసముతో నూరి, గురిగింజప్రమాణము మాత్రలు చేసి, అల్లపురసముతో నిచ్చిన, వాతములు, సన్నిపాత జ్వరములు, అపస్మారము, శీతపిత్తము, అగ్నిమాంద్యము, అజీర్ణము, సూతికావాతము;
2. ఇందు నాలుగవవంతు నల్లమందు జేర్చి గురిగింజల వలె మాత్రలు చేసి, ఒక్కొక్క మాత్రయిచ్చిన యెడల, అరక, నీళ్ళ విరేచనములు, వెంటనే కట్టును.
3. దూరము నడచుట వలన గాని, శరీరము మిక్కిలి అయాసపడునటులపనిచేయుట వలన గాని, కలుగు శరీర నొప్పులు, ఒక్క మాత్ర వల్ల నివారణయై తేలిక నిచ్చును. సర్వవాతములపై బాగుగ పనిచేయును.

## సన్నిపాతభైరవి

1. గురిగింజల మాత్ర చొప్పున అల్లపురసముతో గాని, వట్టిమాత్రలనుగాని రోగముబలముగా నున్న పక్షమున 15 నిమిషములకొకసారి మొదలు గంటకొకసారి చొప్పున యున్ను, సాధారణముగానున్నయెడల, గంటకొకసారి మొదలు, రెండు జాములకొకసారి వరకు వేళను నిర్ణయించియిచ్చిన యెడల, సన్నిపాత దోషములు, సన్నిపాత జ్వరములు, దోషజ్వరములు, మొదలగు జ్వరములు నిర్వర్తించును.
2. తమలపాకు రసములోగాని, నీళ్ళలోగాని, అరుగదీసి కండ్లకు కలికం వేసిన యెడల, సన్నిపాత దోషములు, విషజ్వరములు, నివారణమవును.
3. ఇందు సగభాగమునల్లమందు జేర్చి, నలిపి గురిగింజంతమాత్ర యిచ్చిన యెడల, నీళ్ళ విరేచనములు, అజీర్ణ విరేచనములు కట్టును.

## సన్నిపాతభైరవి (బ.రా.)

10 గ్రా. 55 మోతాదులు

1. మిరియాలరసముతో వాతజ్వరము
2. అల్లపురసముతో సన్నిపాతజ్వరము
3. దుంప రాష్ట్రము శొంఠి కషాయముతో కఫజ్వరము
4. గసగసాలు, దాచినచెక్క, దానిమ్మ బెరడు వీనిలో దేనిరసముతో నైనను గ్రహణి

5. సారాయితో అరగదీసి పట్టివేసిన పురాతన నడుమనొప్పి
6. బ్రాందీతో చాది బొడ్డుకు పట్టు వేసిన కడుపునొప్పి
7. కాకరాకు రసముతో అరగదీసి కలికము వేసిన సన్నిపాతమునందలి తలవిసురు, మాంద్యము తగ్గుటకు వాడవలెను.

## ఖజలీ, వాత రాక్షసము

1.గురిగింజల వలె చిత్రమూలము లేక అల్లపురసముతోనూరి, ఓమము లేక అల్లపు రసముతో ఇచ్చిన, వేడి చేసి, మాత్రకొక విరేచనమును జేయును. వాతజ్వరములు, మలబద్ధజ్వరములు నివారణమవును

## వాతరాక్షసము (వై.చిం.)

10గ్రా. 50 మోతాదులు

1) అల్లపురసము తేనెతో పక్ష, అర్ధితవాతములకు
2) మిరియాల రసముతో వాతజ్వరములకు
(3) శొంఠి తిప్పతీగ ఆముదపు వేరు కషాయముతో ఆమవాతము ఊరుస్తంభవాతము
(4) అక్కలకర్ర రసముతో సూతికాజ్వరము
(5) నల్లతులసి రసముతో ధనుర్వాత కంపవాతములకు
6) తమలపాకు రసము తేనెతో శ్వాసకాసలు
(7) పిప్పలికట్టె రసముతో వాతశూలకు వాడవలెను.

## వాతరాక్షసము

1. అల్లము లేక చిత్రమూల రసముతో కందులవలె మాత్రలు చేసి, పొంగించిన ఓమము రసముతో నిచ్చిన, శరీర నొప్పులు కలిగియుండు వాతజ్వరములు.
2. "దుంపరాష్ట్రము, కళింగరాష్ట్రము ఓమము" వీని యొక్క పొంగించిన రసముతో ఇచ్చిన శ్లేష్మవృద్ధి చేయు శీలపైత్య జ్వరములు.
3. పొంగించిన అల్లపు రసముతో నిచ్చిన, పైత్య జ్వరములు.
4. "ఓమము, కటక రోహిణి, వేప వీనెలు" వీని పొంగించిన రసముతో నిచ్చిన, మలబద్ధముతో కూడుకొనయున్న కేవలవాతజ్వరములు నివారించును.
5. ఓమము లేక అల్లపు రసముతో నిచ్చిన కఠినమగు వాతజ్వరములు, సూతికావాతము సర్వాంగ శుష్కవాతము, కంపవాతము, మొదలగుయెనుబది వాతములను ఖండించును.

6. పిప్పలి చూర్ణమును జేర్చి తేనెతో నిచ్చిన జీర్ణ జ్వరములు నివారణమవును.

7. "ఓమము, మిరియములు" వీటి చూర్ణము రెట్టింపు చేర్చి తేనెతో నిచ్చిన కడుపుఉబ్బు వెంటనే తీయును.

8. " దీనికి సమము, అయస్కాంత భస్మము"ను గాని "కాంతలోహభస్మము" ను గాని జేర్చి స్థాలీచూర్ణమును కలిపితే తేనెతో నిచ్చిన తిమ్మెర, కీళ్ళనొప్పులు, వాతజబ్బు, నివారణమవును (పొట్లములు కట్టి కూడ పైన వ్రాసిన ఆయారోగములయందు యివ్వవచ్చును.)

## లఘువాత రాక్షసము

1. త్రికటుకములు చూర్ణమును సమముగజేర్చి, అల్లపురసముతో నూరి సుమారు కందిగింజలవలె మాత్రలు చేసి, ఓమము లేక అల్లపురసముతో నిచ్చిన వాతజ్వరములు

2. తుంగముస్తెలు, పర్పాటకము" వీని చూర్ణమును జేర్చి తేనెతో నిచ్చిన జ్వరములు

3. మిరియముల చూర్ణమును నాలుగవ భాగము చేర్చి అల్లపు రసముతో నూరి మాత్రలు చేసి యిచ్చిన, సర్వజ్వరములు, ఊరుస్థంభవాతము, గాత్రభంగవాతము, ఆమవాతము కంపవాతము, సుప్తవాతము హరించును. (ఇది పుతమున తయారు చేయబడినది.)

## ఖజలీ, బాలసూర్యోదయము

1.జాజికాయ చూర్ణమును సమముగ జేర్చి, ఆవు నేతితో పుచ్చుకొనిన, అతిసారము, గ్రహణి

2. "లవంగములు, జీలకర్ర" వీని చూర్ణమును రెట్టింపుజేర్చి తేనెతో నిచ్చిన, కాసశ్వాసలు, పైత్యజ్వరములు

3. సమముగ మేడిచెక్క చూర్ణము జేర్చి, మేడికాయల రసముతో నిచ్చిన గాని

4. రెట్టింపు మామిడిచెక్క చూర్ణమును జేర్చి, పంచదార వెన్నతో, పుచ్చుకొనిన గాని, శ్వేత, రక్త కుసుమలు ప్రమేహము

5. రెట్టింపు శొంఠి చూర్ణమును జేర్చి, సముద్ర లవణము కలిపి ఉ ష్ణోదకముతో ఇచ్చిన సర్వశూలలు

6. రెట్టింపు చాతుర్జాతక చూర్ణమును జేర్చి, తేనెతో నిచ్చిన జీర్ణ జ్వరములు, జ్వరములు అగ్నిమాంద్యము, పాండువు నివారణమవును.

## మేహభంజని

1. రెట్టింపు నాగకేసరముల చూర్ణమునుజేర్చి "పంచదార, వెన్నతో పుచ్చుకొనిన, శ్వేత, రక్తకుసుమలు, మేహక్షయ అరుచి, నివారణమవును.

## రాజమృగాంకరసము

1.ఈ ఔషధము అరచిన్నము, "కరక్కాయ, దుంపరాష్ట్రము" కొంచెము కొంచెము, అరుగదీసి యిచ్చిన యెడల, రాజయక్ష్మ, ఉబ్బసము మొదలగు కఠిన కాసశ్వాసలు,

2.కరివేపాకు లేక అల్లపురసముతో అరుగదీసియిచ్చిన, అజీర్ణయుక్తమై శ్లేష్మ మెదుర్కొని, శ్వాసమందక, కడుపు ఉబ్బుటను వెంటనే కఫమును ఖండించి, శ్వాసను ఆపును.

3. అల్లపు రసముతో నిచ్చిన మాంద్య జ్వరములు;

4. "తుంగముస్తెలు, శొంఠి" వీని చూర్ణమును సమముగ చేర్చి నేతితో నిచ్చిన, కామిల నివారణమవును. (సువర్ణ మిశ్రమము)

## స్వర్ణసూర్యావర్తి (వై.చిం.)

10గ్రా. 50 మోతాదులు

(1) మాదీఫల రసాయనముతో గాని, రెట్టింపు పిత్త భంజన చూర్ణము చేర్చి తేనెతో దుస్తరమైన వాంతి, పిత్త తాపము, అరుచి, ఎక్కిళ్ళు, ఆమ్లపిత్తమునకు

(2) ధనియాల రసముతో తల త్రిప్పు, గుండెదడ, కడుపులో మంట

(3) వెన్న పటికిబెల్లముతో శుక్రనష్టము, తెల్లకుసుమ

(4) వేచిన జీలకర్ర, ధనియాల చూర్ణము రెట్టింపు చేర్చి తేనెతో చలి జ్వరము విడిచిన తరువాత కలుగు తలదిమ్ము, రక్తహీనతకు,

(5) మాదీఫల రసాయనముతో గాని, అల్లపురసము, ఎండు ద్రాక్ష, నిమ్మకాయ రసము, తేనె, పంచదార కలిపి కాచిన పానకముతో గర్భిణుల వాంతులు, వికారము, తాపము, బలహీనత మున్నగువానికి, ప్రబల పైత్యములకు

(6) స్వర్ణ సూర్యావర్తి 3గ్రా. అభ్రకభస్మము 3గ్రా. మంచిముత్యముల భస్మముగాని ప్రవాళ పంచామృతముగాని 2 గ్రా. కల్పి పటికిబెల్లముతోగాని, ఎండు ద్రాక్ష కషాయముతో గాని రక్త చాపము (బ్లడ్ ప్రెషరు)నకు

(7) సారస్వతతో మెదడునకు సంబంధించిన వ్యాధులందును వాడవలెను.

# సువర్ణ సూర్యావర్తి

1. అరచిన్నము ఈ ఔషధమును, పొంగించిన జీలకర్ర రసముతో అరుగదీసి గాని

2. దీనికి రెట్టింపు "జీలకర్ర, తాళిసపత్రము, రేగు గింజలోని పప్పు" వీని చూర్ణమును జేర్చి, తేనెతో కలిపి ఇచ్చిన గాని, అరుచి, ఆమ్ల పైత్యము (నోటనీరూరుట) కఠినవాంతి, తలవళ్ళుత్రిప్పుట, పార్శ్వపునొప్పి, శిరస్సు నందధిక చెమట, గుండెదడ, దద్దుర్లు, మనస్సు వికారముగ నుండుట, కడుపులో మంట మొదలగు వింశతి పైత్యములు, స్వరహీనముగల రోగమునునివర్తి జేసి మనస్సునకు, బుద్ధికి, ఇంద్రియములకు, గుండెకు బలమునిచ్చును.

3. సమముగ నాగకేసరములచూర్ణమును జేర్చిగాని, యష్టి మధుకము, నెమలియీకల భస్మము, తిప్పసత్తు" వీని చూర్ణమును, రెట్టింపుజేర్చి గాని, తేనెతో ఉదయము మొదలు సాయంకాలములోగా 7 మోతాదులిచ్చిన యెడల, క్షుద్ర, గంభీరమహాహిక్కలు, (ఎక్కిళ్ళు) వెంటనే కట్టును.

4. రెట్టింపు "దాచిన చెక్క, పిప్పళ్ళు" వీని చూర్ణము చేర్చి, తేనెతో నిచ్చిన యెడల, అజీర్ణవిరేచనము వెంటనే కట్టును.

5. రెట్టింపు సన్నరాష్ట్రము చూర్ణమును చేర్చి తేనెతో నిచ్చిన, మేహపైత్యకాకలు;

6. కలకండ చూర్ణముతో నిచ్చిన, కేవలము మేహపైత్యకాకలు 24 గంటలలోకట్టును.

7. అడ్డసరపాకురసములో నూరి ఇచ్చిన యెడల, అధిక దగ్గు మీద పుట్టెడు వగరపు 3 గంటలలో కట్టును.

8. ఇది ఒక వంతు కర్కాటక శృంగి, గంటుభారంగి, "సన్నరాష్ట్రము, దానిమ్మ కాయల బెరడు" వీని చూర్ణమును, నాలుగేసిరెట్లు, పాతచెరుకు బెల్లం 10 రెట్లు చేర్చి, బాగుగ కలియనూరి, కుంకుడు గింజలవలె మాత్రలు చేసి, పుక్కెటనుంచుకొని ద్రవము మ్రింగుచుండిన, రాత్రులయందు నిద్రపట్టనీయక రొమ్ము మొదలు శిరస్సు వరకు చెమటను బుట్టించుచు అధికముగ బాధించుచుండునట్టి, మేహ, పైత్య, కాసలను, ఉబ్బసమును, శీఘ్రముగ నివర్తింపజేయును.

9. సమముగ యష్టిమధుకచూర్ణమునుగాని, అక్కల కర్ర చూర్ణమును గాని చేర్చి, పర్పాటకము కషాయముతో గాని, చనుబాలతో గాని ఇచ్చిన,

అధిక దాహము, నాలుకిగురు, జింహ్వాతీపు, జింహ్వాదోషము, కండ్లు, కాళ్లు, చేతులు, మంటలు, పార్శ్వపు తలనొప్పి, శిరోరోగములు, తాపము;
10. రెండు రెట్లు "తాళిస పత్రికము, జీలకర్ర, వరి పేలాలపిండి" వీని చూర్ణమును జేర్చి తేనెతో నిచ్చిన రక్తపైత్యము, దుస్సహమగువాంతి, తలనాగు పార్శ్వపు తలనొప్పివర్తించును.
11. ధనియాలు, లవంగాలు, శొంఠి వీని చూర్ణము రెట్టింపు జేర్చి, అరగిద్దెడు (అర ఔన్సు) వేడినీళ్ళలో కలిపి ఇచ్చిన యెడల, దారుణ జ్వరములు, పైత్య జ్వరములు, అగ్నిమాంద్యము, అజీర్ణము, శ్వాస హరించును.
12. ఏలకులు, కన్నెకోమలి, లవంగాలు, ఉసిరికాయ, రక్త చందనము వీని చూర్ణమును రెట్టింపు జేర్చి, పటికెపంచదార పొడితో ఇచ్చిన యెడల, దాహము కట్టును;
13. గొబ్బి గింజలు, చింత గింజలలోని పప్పు, పెద్దపల్లేరు కాయలు, సాలామిశ్రి, వీనిచూర్ణము రెట్టింపు జేర్చి ఇచ్చిన యెడల, శుక్ల నష్టమునివర్తించి, శుక్లమందలి వేడి, పలచన మొదలగు దోషములను బోకడచును.
ఇది కస్తూరి, సువర్ణ మౌక్తికాది భస్మములు చేర్చి సిద్ధపరుపబడినది

## సూర్యావర్తి (ర.యో.ర.)

10గ్రా. 50 మోతాదులు

1. అల్లపురసము పైత్య జ్వరము
2. జీలకర్రరసము తేనెతో వాంతి, అరుచి, ఆమ్లపిత్తము, పిత్త వికారమునకు
3. ధనియాల రసముతో కడుపులోమంట, తలత్రిప్పుటకు
4. మాదీఫలరసాయనముతో దుస్తరమగు వాంతి, ఎక్కిళ్ళు, చిత్త చాంచల్యము, సమస్త పైత్య వికారములకు
5. ఒక మోతాదు బుగ్గనుంచుకొని ఊటమ్రింగుచున్న క్షయ, దగ్గు, ఉబ్బసము నందు కఫము పలచబడి కళ్లె తెగిపడుచు ప్రాణమునకు హాయినిచ్చును.

## లఘు సూర్యావర్తి

1. రెట్టింపు ధనియాలు, దాచినచెక్క, జీలకర్ర చూర్ణమును చేర్చి, "పంచదార వెన్నతో" పుచ్చుకొనిన, మేహ పైత్యములు, నిక్కాకమీద పుట్టెడు దగ్గు, తల త్రిప్పుట, పైత్య జ్వరములు
(2 జీలకర్ర రసము పొంగించి చినదానితో నిచ్చిన యెడల, వాంతి మొదలగు పైత్య రోగములు నివారణమవును.

పుష్ప ధన్వంత్రి రసము

1. యష్టిమధుక చూర్ణమును సమముగ జేర్చి, వాతతత్వమునకు ఆవు నెయ్యి తోడను;
2. శ్లేష్మ తత్వమునకు తేనెతోడను;
3. పైత్య మేహతత్వములకు పంచదారతోడనున్ను, ఇచ్చిన యెడల, వీర్య నష్టము తొలంగి, యింద్రియము చిక్కబడి, మిక్కిలి వీర్యవృద్ధి కలుగును;
4. చాతుర్జాతక చూర్ణమును రెట్టింపు జేర్చి తేనెతో నిచ్చిన, కాసశ్వాసలు, అగ్నిమాంద్యము, పాండువు నివర్తించును.

**మహాక్షయకుఠారము**

1."త్రిఫలములు, తాళిసపత్రికము" వీని చూర్ణమును సమముగ జేర్చి తేనెతో నిచ్చిన గాని, తేనెతో అరుగదీసి యిచ్చిన గాని, వింశతిక్షయలు, శ్వాస, శ్లేష్మ పైత్యములు; సమముగ "పెన్నేరు గడ్డ, అక్కల కర్ర" వీని చూర్ణమును జేర్చి మేకపాలతో నిచ్చిన ఉబ్బసము నివారణమవును.

**శూల గజ కేసరీ రసము**

1. పంచలవణముల చూర్ణమును, లేక శొంఠి చూర్ణమును సమముగ జేర్చి, రెండు చిన్నముల చూర్ణమును, నాలుగు తులముల వేడినీళ్ళలో కలిపి యిచ్చిన యెడల, అకస్మాత్తుగ వచ్చెడు దారుణమగు శూలలను, వెంటనే నిలుపును
2. "త్రికటుకములు, తెల్ల జిల్లేడు వేళ్ళు, లేక ఆకు పత్రికము" వీని చూర్ణమును చేర్చి తేనెతో గాని, ఇంగువతో గాని సేవించిన, దీర్ఘ కాలమునుండి బాధించుచుండు సర్వశూల రోగములు నిస్సంశయముగ హరించును.

**మహాజ్వరాంకుశము**

రెండు గురిగింజలంత మోతాదు చొప్పున, అల్లపురసముతో సేవించిన తాపజ్వరములు, ఐకాహిక, త్రాహిక, చాతుర్థిక, విషజ్వరములు, త్రిదోష జ్వరములు, చలి జ్వరములు, మొదలగు జ్వరములు నిస్సంశయముగ, శీఘ్రముగ నివారణమవును.

**తాపజ్వరాంకుశము**

1. జీలకర్ర చూర్ణమును రెట్టింపు జేర్చి, పంచదారతో నిచ్చిన, చలిజ్వరముయొక్క;
2. మిరియములు లేక అల్లపు రసముతో నిచ్చిన, లంఘనములందుకలుగు తాపము, తాపజ్వరము కట్టును.

3. చనుబాలతో గాని, అల్లపు రసముతో గాని యిచ్చిన, దోషము మీద పుట్టెడు తాపము;
4. జీలకర్ర రసముతో గాని తేనెతో గాని యిచ్చిన, వాంతి;
5. నల్లమందు జేర్చి యిచ్చిన, గ్రహణికట్టును.

## అజీర్ణ కంటకము

1. త్రికటు చూర్ణమును సమముగ జేర్చి అల్లపురసముతో సేవించిన, చిరకాల శ్రితమైయుండు కడుపు ఉబ్బుతో కూడుకొనియుండు అజీర్ణము, అగ్నిమాంద్యము;

2. ఓమము , దాచినచెక్క, శొంఠి, మిరియాలు, వేడి నీళ్ళు అనువీని యేరసముతో నైనను, మిరియపు గింజంత మాత్రనిచ్చిన, అయిదు విధములగు అజీర్ణములు, వెంటనే నివారణమవును. భోజనాంతరము ఒక మాత్ర వేసికొనిన, ఆహారము జీర్ణమవును.

## ఆమకుఠారరసము

1. రెండు గింజంతమాత్రను, బిల్వశొంఠి (మారేడు పిందెల) రసము, లేక కషాయము, లేక దాచిన చెక్క రసము, లేక గసగసాల రసముతో నిచ్చిన ఆమశూల (జిగట) అతిసారము, చిరకాలముగనుండు గ్రహణికట్టును.

## లక్ష్మీవిలాస రసము

1. తేనెతో అరుగదీసి యిచ్చిన యెడల, దగ్గు, జ్వరము;
2. జీలకర్ర రసముతో నూరియిచ్చిన, వాంతి;
3. దీనియందు సమభాగముగ నల్లమందు జేర్చి గురిగింజ ప్రమాణము మాత్రల చేసి ఒక్కమాత్రయిచ్చిన నీళ్ళ విరేచనములు;
4. చనుబాతో అరుగదీసి చంటిపిల్లలకిచ్చిన దగ్గు, వాంతులు, జ్వరములు కట్టును.

## ఆయుర్వేద మూల సిద్ధాంతములు

ఆయుర్వేదము ప్రాచీన భారతీయ వైద్య విధానము,ఆయుర్వేద శబ్దము 'ఆయు' మరియు 'వేద' అను రెండు పదములతో ఏర్పడినది. 'ఆయు' అనగా జీవము, 'వేద' అనగా విజ్ఞానము, జీవవిజ్ఞానమునకు సంబంధించిన శాస్త్రమును ఆయుర్వేదము అందురు.

శరీరము, ఇంద్రియములు, మనస్సు మరియు ఆత్మల కలయిక 'ఆయువు'గా నిర్వచింపబడినది. జ్ఞానేంద్రియములు, మనస్సు, ఆత్మలే నటు వంటి శరీరము మృతప్రాయము. 'స్వస్థ' అనగా సమస్థితిలో ఉన్న అగ్నులు (పాచకాగ్నులు) దోషములు, ధాతువులు మరియు సరియగు మలమూత్ర ప్రవృత్తి కలిగి ఆత్మ, ఇంద్రియములు, మనస్సు సమస్థితిలో ఉన్నవాడు, ఈ స్థితినే 'ఆరోగ్యము' అని చెప్పడం జరిగినది. ఆయుర్వేదము యొక్క ప్రధాన ఉద్దేశ్యం కేవలం వ్యాధుల చికిత్స మాత్రమేకాదు, ఆరోగ్యవంతుని సంపూర్ణ ఆరోగ్య పరిరక్షణ ఆయుర్వేదము యొక్క ప్రధాన ఉద్దేశ్యము. ఆయుర్వేదము వ్యాధులు, చికిత్సలు లేదా కేవలం మందులకు సంబంధించిన శాస్త్రము మాత్రమే కాదు, మానవ జీవనమునకు సంబంధించి అన్ని అంశాలను సమగ్రంగా స్పృశించు జీవన విధానము ఆయుర్వేదము.

**పంచ మహాభూతములు :** భారతీయ తత్త్వశాస్త్రముననుసరించి, విశ్వములోని అన్ని పదార్థములు ఐదు రకముల మౌలిక అంశములతో నిర్మింపబడినవి వీనినే పంచమహాభూతములు అంటారు. అవి ఆకాశము, వాయు, తేజస్సు, జలము మరియు పృథ్వి.

**పురుషుడు :** పంచమహాభూతాత్మక శరీరము ఆత్మతో కలసినపుడు ఆ శరీరమును పురుషుడు అంటారు. ఆయుర్వేదములో 'పురుష' శబ్దము 'మనిషి' అను పదమునకు పర్యాయవాచకముగా వాడుట జరిగినది. పంచ మహాభూతములు ధాతువులు, జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు, మనస్సు మొదలగునవి పురుషుడు తయారవడానికి ముఖ్య అంశములు.

**దోషములు** : సజీవ నిర్జీవ పదార్థముల వ్యత్యాసమును స్పష్టముగా అవగాహన చేసుకొనుటకు దోషముల వర్ణన చేయబడినది. దోషములు శారీరక జీవప్రక్రియలను నిర్దేశించు దైవిక అంశములు. దోషములు మూడు రకములు అవి వాతము,పిత్తము,కఫము, దోషములో ఆయా మహాభూత ప్రాధాన్యతనుబట్టి, వాతము ఆకాశ, వాయు మహాభూత ప్రధానముగా పిత్తము

అగ్ని మహాభూత కఫము పృథ్వి జలమహాభూత ప్రధానముగా ఉండునని నిర్వచించబడినవి.

దోష శబ్దము 'దుశ్' అనగా చెరుపునది, పాడుచేయునది అను అర్ధము నకు ధాతువునుండి పుట్టినది. దోషములు సహజ స్థితిలో శరీరమును ఆరోగ్యముగా ఉంచుతాయి. దూషించినపుడు అనారోగ్యమును కలుగ జేస్తాయి. దోషములు వ్యాధి ఉత్పత్తిలో,నిర్ధారణలో మరియు చికిత్స చేయుటకు అత్యంత ప్రధానము.

**వాతము :** వాతము 'వా' అనగా కదలిక (గతి) మరియు గంధన అనగా ఇంద్రియ గ్రహణము అను అర్ధము కల సంస్కృత ధాతువు నుండి ఉత్పత్తి అయినది. ప్రాణవాతము, ఉదానవాతము, సమానవాతము, వ్యాన వాతము మరియు అపానవాతము అను ఐదు రకముల వాతములు వర్ణింపబడినవి.

ప్రాణవాతము యొక్క స్థానము తల, ఛాతీ, గొంతు, నాలుక, నోరు మరియు ముక్కు, లాలాజలము ఉత్పత్తి అగుట, త్రేన్పులు, తుమ్ములు, శ్వాస క్రియ, మింగుట మొదలగు శారీరక ప్రక్రియలు ప్రాణవాత సహాయముతో జరుగుతాయి.

ఉదానవాత స్థానము నాభి (బొడ్డు ప్రదేశము), ఛాతీ మరియు గొంతు. ఉదానవాత ప్రధాన కర్మలు శబ్ధము, మాట్లాడుట, ఉత్సాహము కల్గించుట శరీరములో పటుత్వము, శరీరకాంతి పెంపొందించుట మొదలగునవి.

సమాన వాతము యొక్క కార్యములు అగ్నిని పోలి ఉంటాయి. సమాన వాతము కడుపులో స్రావములను ఉత్పత్తి చేస్తుంది. ఆహారము పచనముగనంతవరకు కడుపులో,ప్రేవులలో ఉంచుతుంది. దీనివలన ఆహారము జీర్ణమగుట మరియు పోషకాంశములు సరిగ్గా శరీరములోనికి ఇంకుట జరుగును.

వ్యానవాతము శరీరములో అన్ని భాగములలో సంచరించును. హృదయగతి (గుండెకొట్టుకోవడం) శరీరంలో అన్ని భాగములకు రక్త ప్రసరణ జరుగుట మరియు కాళ్ళు చేతులు యొక్క కదలికలన్నీ వ్యాన వాతముచే నియంత్రించబడతాయి.

అపానవాతము వృషణాలు, మూత్రశయము,నాభిప్రదేశము, తొడలు, గజ్జలు మొదలగు ప్రాంతాలలో తన ప్రభావము చూపును. మూత్రము,

మలము, శుక్రము, ఆర్తవము, గర్భస్థ శిశువు మొదలగునవి బయటకు వెడలుటకు తోడ్పడును.

**పిత్తము :** పిత్తము తప అనగా వేడి అను అర్ధము కల ధాతువునుండి ఏర్పడినది. పిత్తము శరీరములోని అన్ని జీవప్రక్రియలకు ఆధారము. పాచక పిత్తము, రంజకపిత్తము, భ్రాజక పిత్తము, ఆలోచక పిత్తము మరియు సాధక పిత్తమలని పిత్తము ఐదు రకములు.

పాచక పిత్త స్థానము గ్రహణి (ఆమాశయము మరియు స్త్రీలు) ఆహారము జీర్ణమగుట, పోషకాంశములు ఇంకుట మరియు ఇతర పిత్తముల ప్రక్రియలను నియంత్రించుట పాచకపిత్తము యొక్క ముఖ్య కార్యములు.

రంజకపిత్తము యొక్క స్థానము కాలేయము మరియు ప్లీహము. ఆహార రసమును ఎర్రగా, రక్తకణములుగా మార్చునది రంజక పిత్తము. భ్రాజక పిత్తము యొక్క స్థానము చర్మము. చర్మమునకు రంగును, కాంతిని, ఉష్ణో గ్రతను ఇచ్చునది భ్రాజక పిత్తము.

ఆలోచన పిత్తము నేత్రములలో ఉండి, కంటిచూపు, వివిధ రంగుల మధ్య వ్యత్యాసము తెలుసుకొనుట అను కార్యములకు తోడ్పడును. సాధక పిత్తము యొక్క స్థానము హృదయము మనస్సు మరియు మేధస్సునకు సంబంధించిన పనులు, శరీరము మరియు మనస్సును అనుసంధానము చేయుట, సాధక పిత్తము యొక్క పనులు.

**కఫము :** కఫమునే శ్లేష్మమునే అని కూడా పిలుస్తారు. శరీర ధాతువులకు పోషణకల్పించుట కఫము యొక్క ముఖ్య కర్మ, క్లేదక కఫము, ఆవలంబక కఫము, తర్పక కఫము, బోధక కఫము, శ్లేషక కఫము అను ఐదు రకముల కఫములు వర్ణింపబడినవి.

క్లేదక కఫము యొక్క స్థానము కడుపు, క్లేదము అనగా తడిగా, చిక్కగా, తీపిగా ఉండునది. ఆహారమును తడిగాజేసి జీర్ణమగుటకు సహాయపడును. తీక్ష్ణమైన జీవరసాయనముల నుండి ఆమాశయమును కాపాడుకు క్లేదక కఫము తోడ్పడును.

ఆవలంబక కఫము యొక్క స్థానము ఛాతీ. ఇది ఉరస్సులోని హృదయమునకు పోషణము,రక్షణను కల్గించును. బోధక కఫము నాలుకపై ఉండి రుచి తెలుసుకొనుటకు ఉపయోగపడును. శ్లేష్మక కఫము యొక్క స్థానము కీళ్ళు, కీళ్ళలో కందెనవలె పనిచేసి అవిసరిగ్గా కదులునట్లు చేయుటకు

శ్లేష్మక కఫము దోహదపడును. తర్పక కఫము మెదడు చుట్టూ ఉంటుంది. తలలోని  సున్నితమైన భాగములకు పోషణ మరియు రక్షణను కలుగ జేస్తుంది.

**మానసిక దోషములు :** వాత, పిత్త,కఫములను శారీరక దోషములకు అదనముగా రజోగుణము తమోగుణము, అను మానసిక దోషములు గుర్తింపబడినవి. మానసిక వ్యాధులకు ఈ దోషముల వైషమ్యమే కారణము.

**దూష్యములు :** దోషములు మొదట తమంత తాముగా దూషింపబడి తదుపరి ధాతువులను, మలములను పాడుచేస్తాయి. కనుక వీనిని దూష్య ములు అని పిలుస్తారు. సాధారణ పరిస్థితులలో దోషములు ధాతువులు మరియు మలములు శరీర ఆరోగ్యాన్ని కాపాడుతాయి. అవి దూషించినపుడు వ్యాధిని కలుగజేస్తాయి.

**ధాతువులు :** 'ధా' అనగా గ్రహించునని, పట్టి ఉంచునని అని అర్థము. ఈ ధాతువునుండి 'ధాతు' శబ్దము పుట్టినది. సామాన్యార్థములో శరీరము యొక్క స్రావములు, కణజాలములు మొదలగు వానిని ధాతువులుగా పేర్కొన వచ్చును. ఏడు రకములుగా ధాతువులు వర్ణింపబడినవి.

**రసధాతువు :** (శరీరమును పోషించు పోషకాంశములు, ప్లాస్మా) రక్తము, మాంసము, మేద (కొవ్వు పదార్థము), అస్థి (ఎముకలు, మరియు శరీర భాగము కలిపి ఉంచు కణజాలము.) మజ్జ (మూలుగ) శుక్రము (సంతానోత్పత్తికి సంబంధించిన సత్త్వము.)

ధాతువులలో మూడు విధములైన విషమ స్థితులు కలుగుతాయి. అవి క్షయ (తరగుట), వృద్ధి (పెరుగుట) మరియు ప్రదోష (దోషము ద్వారా దూషింపబడుట.)

ఒకే వ్యక్తిలో వ్యాధి స్థితిలో ఒక ధాతువు యొక్క వృద్ధి మరొక ధాతువు యొక్క క్షయము ఒకే సమయములో కలుగవచ్చును. ఇట్టి పరిస్థితులలో ఒక ధాతువు యొక్క తరుగుదల ఇంకొక ధాతువు పెరుగుదలకు దారి తీయవచ్చును.

**ఉపధాతువులు :** ఉపధాతువులు శరీరపోషణ తమంత తాముగా చేయ లేవు. ఇవి ముఖ్యధాతువుల యొక్క ఉత్పత్తులుగా ప్రత్యేక అవసరాలకు ఉపయోగపడతాయి. అవి స్తన్యము(పాలు), అర్తవము, కండరములు, శిరలు, వసా (కొవ్వులోని నూనె పదార్థము) త్వక్ (చర్మము) స్నాయువులు

మొదలగు నవి. ఇవి కూడా దోషములచే దూషింపబడతాయి.

**మలములు :** శరీరములో ఉత్పన్నమగు వివిధ వ్యర్థ పదార్థములు మల రూప కఫము, మలరూప పిత్తము, వివిధ భాగములలో నుండి కలుగు స్రావములు, చెమట, గోర్లు, వెంట్రుకలు, చర్మంనుండి స్రవించు జిడ్డు పదార్థము మొదలగునవి మలములు. దోషములచే ఇవికూడా దూషింపబడును.

**స్రోతస్సులు :** 'సృ' అనగా స్రవించుట లేదా కారుట అని అర్థము. ఈ ధాతువునుండి స్రోతస్సు అను శబ్దము ఏర్పడినది. స్రోతస్సులు అనగా పోషక పదార్థములు మల పదార్థములు ప్రసరించు సూక్ష్మ మార్గములు, సంపూర్ణ శరీరము స్రోతస్సుల యొక్క సమూహము. అవగాహన సౌలభ్యం కొరకు స్రోతస్సులు 13 రకములుగా వర్ణింపబడినవి. అవి ప్రాణావహ స్రోతస్సు, ఉదకవహ స్రోతస్సు, అన్నవహ స్రోతస్సు, రసవహ స్రోతస్సు, రక్తవహ స్రోతస్సు, మాంసవహ స్రోతస్సు, మేదోవహ స్రోతస్సు, అస్థివహ స్రోతస్సు, మజ్జావహ స్రోతస్సు, శుక్రవహ స్రోతస్సు, మూత్రవహ స్రోతస్సు, పురీషవహ స్రోతస్సు మరియు స్వేదవహ స్రోతస్సు.

స్రోతస్సులలో అతి ప్రవృత్తి (ఎక్కువగా స్రవించుట) సంగ (ఎక్కువగా ద్రవములు నిలుచుట), విమార్గగమనము (వేరే మార్గములలో సంచరించుట) మరియు సిరాగ్రంధి (గడ్డలు, పెరుగుదల) మొదలగు వానితో అడ్డగించ బడుట అను వికారములు కల్గును. వ్యాధులలో ఒకటి లేదా అన్ని రకముల వికారములు కన్పించవచ్చును.

**అగ్ని :** కొన్ని ప్రత్యేక వ్యాధులను విడిచి, ఇంచుమించు అన్ని వ్యాధు లకు అగ్ని యొక్క దుష్టియే కారణముగ ఆయుర్వేదము భావిస్తుంది. కనుకనే అగ్ని ఆయుర్వేద పద్ధతులను అర్థము చేసుకోవడానికి అత్యంత ప్రధానము. శరీరములో అన్నిరకముల జీవప్రక్రియలు, జీర్ణక్రియ మరియు ఉష్ణము జనించుటకు అగ్ని మూలాధారము. అగ్ని 13 రకములుగా తెలుపబడినది. అవి జఠరాగ్ని, (జీర్ణప్రక్రియలోని ఎంజైములు), ఏడు ధాత్వాగ్నులు, ఐదు రకముల మహాభూతాగ్నులు అవి ఆకాశ, వాయుతేజస్సు,జలము మరియు పృథ్వి మహాభూతములు. వీటన్నింటిలో జఠరాగ్ని అత్యంత ముఖ్యమైనది మరియు ఇతర అగ్నులను నియంత్రించు సామర్థ్యము కలది.

అగ్ని వైకృతి–విషమాగ్ని, తీక్ష్ణాగ్ని మరియు మందాగ్ని అను మూడు విధములుగా తెల్పబడినది. వీని వికృతి వలన వివిధ వ్యాధులు ఉత్పన్నమగు

తాయి. సాధారణముగ మందాగ్ని వలన ఎక్కువ రకముల వ్యాధులు కల్గుతాయి.

**ఆమము :** ఆమము మూడు విధములుగా నిర్వచించబడినది. అవి

1. జీర్ణము కాని లేదా సగము జీర్ణమైన ఆహారం
2. మలసంచయము (వ్యర్థపదార్థములు, స్రావములు ఒకచోటచేరుట)
3. దోషముల యొక్క ప్రథమ దూషితస్థాయి

సాధారణముగా ఆమము మందాగ్ని వలన కల్గుతుంది. ఆమము భూతాగ్నులుమరియు ధాత్వాగ్నుల మాంద్యము వలన కూడా కలుగవచ్చును.

ఆమము ఏవిధమైన పాచక ప్రక్రియలోనైనా లేదా జీవ ప్రక్రియలో నైనా కలుగవచ్చును. ఆమమే వివిధ రకముల వ్యాధులకు కారణము కనుక అగ్ని మరియు జీర్ణక్రియ సరిగ్గా ఉంచుకొనుట అను అంశములపై ఆయుర్వేదము అత్యంత ప్రాధాన్యతను ఇస్తుంది. 'కాయ' అనగా 'అగ్ని' అని కూడా అర్ధము కలదు. కాయచికిత్స అనగా అగ్నియొక్క చికిత్సగా పేర్కొనుట జరిగినది.

**వ్యాధి మరియు వ్యాధి కారణములు :**

శరీరమునకు, మనస్సునకు ఇబ్బంది కల్గించునది వ్యాధి లేదా రోగము అని నిర్వచించబడినది. వ్యాధి 1. అసాత్మేంద్రియార్థ సంయోగము 2. ప్రజ్ఞాపరాధము 3. పరిణామము అను మూడు విధముల కారణముల వలన కల్గుతుంది.

**1. అస్యాత్మేంద్రియార్థ సంయోగము :** జ్ఞానేంద్రియములు (చెవి,ముక్కు, కండ్లు,నాలుక,చర్మము) అతిగా పనిచేయుట, తక్కువగా పనిచేయుట లేదా పనిచేయకపోవుట మరియు విషమముగా పనిచేయుటను అస్యాత్మేందియార్ధ సంయోగము అని పిలుస్తారు. ఉదాహరణకు తీక్ష్ణ కాంతికల వస్తువులను అదే పనిగా చూచుట, తక్కువ వెలుతురులో చదువుట, అస్సలు చూడకుండా ఉండుట మొదలగునవి దృష్టి సంబంధ అసాత్మేంద్రియార్ధ సంయోగ కారణాలు.

**2.పరిణామము (కాలము) :** ఋతువులు శరీరము యొక్క ఆరోగ్య ముపై, వ్యాధులు కలుగుటపై తమ ప్రభావాన్ని కలిగి వుంటాయి. ఆయా ఋతువులలో ఋతు స్వభావము ఉదా. శీతాకాలములో చలి విపరీతముగా ఉండుట, వర్షఋతువులో వర్షాలు అత్యధికముగా వుండుట అతియోగము;

శీతాకాలములో చలి, వర్షాకాలములో వాన తక్కువగా ఉండుట హీన యోగము (అయోగము); గ్రీష్మ ఋతువులో చలి, చలికాలంలో ఎండ వుండుట మిథ్యా యోగము.

**3. ప్రజ్ఞాపరాధము :** చేయకూడని పనులను చేయకూడదు అని తెలిసి కూడా చేయుట ప్రజ్ఞాపరాధము. ప్రజ్ఞాపరాధమే అసాత్మేంద్రియార్థ సంయోగమునకు కూడా మూలకారణము.

బాహ్య కారణముల వలన కలుగు వ్యాధులు, అభ్యంతర కారణముల వలన కలుగు వ్యాధులని రెండు విధములుగా వ్యాధులు వర్గీకరింపబడినవి. ఆహార సేవనలో తప్పులు, కాలము, ఋతువు, జ్ఞానేంద్రియములను, కర్మేంద్రియములను అసహజముగా వాడుట మొదలగునవి బాహ్య కారణములు. దోషముల, దూష్యముల, స్రోతస్సుల మరియు అగ్ని మొదలగు వాని దుష్టి వలన వ్యాధులు కల్గుట అభ్యంతర కారణములు.

**వ్యాధుల వర్గీకరణ :**

అన్ని రకముల వ్యాధులు ముఖ్యమైన మూడు ప్రకారములుగా వర్ణింపబడినవి. అది 1. నిజరోగములు 2. అగంతుజరోగములు 3. మానసరోగములు. వాత, పిత్త మరియు కఫ దోషముల దుష్టివలన కలుగు వ్యాధులు నిజరోగములు. దెబ్బలు తగులుట, జంతువులు కరచుట మొదలగునవి ఆగంతుజ రోగములు, మనస్సునకు సంబంధించిన వ్యాధులు మానస రోగములు.

ఆధ్యాత్మిక, ఆది భౌతిక మరియు ఆది దైవికములుగా కూడా వ్యాధులు వర్గీకరింపబడినవి.

**1. ఆధ్యాత్మిక వ్యాధులు :** ఆధ్యాత్మిక వ్యాధులు ఆదిబల ప్రవృత్తములు (అనువంశికముగా కల్గునవి), జన్మబల ప్రవృత్తి (పుట్టుకతో కల్గునవి) దోషబల ప్రవృత్తి (దోషములవికృతి వలనకలుగనవి) అని మూడు రకములు.

– ఆది బల ప్రవృత్త లేదా అనువంశిక వ్యాధుల మాత్రజ–తల్లివైపు నుండి సంక్రమించునవి, పిత్రుజ – తండ్రి నుండి సంభవించునవి అని రెండు రకాలు.

– జన్మబల ప్రవృత్త (పుట్టుకతో కలుగునవి) వ్యాధులు రసకృతము అనగా రసధాతు వికృతి వలన కల్గునవి, దౌహృదాపచార కృతములు అనగా గర్భిణీ స్త్రీ సరియైన జాగ్రత్తలు తీసుకోక పోవుట వలన కలుగునవి

అని రెండు రకములు.

– దోష బల ప్రవృత్తి వ్యాధులు – మూడు రకములు దోషముల వలన కలుగును.

**2. ఆది భౌతిక వ్యాధులు :** దీనినే సంఘాతబల ప్రవృత్తి వ్యాధులు అంటారు. దెబ్బలు తగులుట, జంతువులు కరచుట మొదలగు బాహ్యకారణ ములచే ఇవి ఉత్పన్నమగును.

**3. ఆది దైవిక వ్యాధులు :** మానవుని నియంత్రణలేని వాతావరణ మార్పులు, మరియు ఇతర కారణముల వలన ఈ వ్యాధులు కలుగును. ఇవి మూడు రకములు కాలబల ప్రవృత్త, దైవబల ప్రవృత్త మరియు స్వభావ బల ప్రవృత్త వ్యాధులు.

ఋతువులలో వ్యాపన్న (దుష్టికల్గుట) అవ్యాపన్న (సహజమైన) మార్పుల వలన కలుగు వ్యాధులు కాలబల ప్రవృత్త వ్యాధులు. సంక్రమణము, కాలు ష్యము (సంసర్గము) లేదా ఉరుములు మెరుపులు వంటి ఆకస్మిక కారణముల వలన ఉత్పన్నమగు వ్యాధులు దైవబల ప్రవృత్తములు.

స్వభావబల ప్రవృత్త వ్యాధులు–వృద్ధాప్యము, నిద్ర, ఆకలి, దప్పిక మొదలగు సహజమైన జీవన ప్రక్రియలు కలుగు మార్పులు.

**షట్క్రియా కాలములు :** వ్యాధి ఉత్పత్తి అగు పరిణామములలో ఆరు రకముల స్థాయిలు గుర్తించబడినాయి. అవి 1. సంచయము (దోషములు ఒకచోట చేరుట) 2. ప్రకోపము (దోషములు దూషింపబడుట) 3. ప్రసర (దోషములు వ్యాపించుట) 4. స్థానసంశ్రయము (దోషములు ఒకస్థానములో స్థిరపడుట) 5. వ్యక్తావస్థ (వ్యాధి లక్షణములు కనిపించుట) 5. భేదావస్థ (వేరే వ్యాపత్తులను కల్గించుట లేదా ప్రభావిత స్థానమును పూర్తిగాచెరచుట).

చికిత్సా సౌలభ్యము కొరకు షట్క్రియాకాలములు తెల్పబడినవి. వ్యాధు లను సాద్యమైనంత ముందుగా గ్రహించి వ్యాధ్యావస్థ ననుసరించి చికిత్స చేయుటకు ఇవి తోడ్పడతాయి. 'వ్యాధి చికిత్స కన్నా వ్యాధి నివారణ లాభ దాయకము' అను నానుడి అందరికీ తెలిసినదే.

**చికిత్స :** వ్యాధి నివారణకు లేదా వ్యాధిని తగ్గించుట చేయు అన్ని ప్రయత్నములను చికిత్స అంటారు. చికిత్స నాలుగు రకాలు అవి దైవవ్యపా శ్రయ చికిత్స, యుక్తి వ్యపాశ్రయ చికిత్స, శోధన చికిత్స సత్త్వావజయము.

**దైవవ్యపాశ్రయ చికిత్స :** ఔషధములను, మణులను ధరించుట, మంత్ర

ములు, హోమములు, పూజలు మొదలగు వానితో చికిత్స చేయుట దైవ వ్యపాశ్రయ చికిత్స.

**సత్త్వావజయ చికిత్స :** వ్యాధి నివారణకు, వ్యాధిని తొలగించుటకు ఆయుర్వేద వైద్యులచే ప్రాచీన కాలమునుండి వాడుకలో నున్నది. ఈ పద్ధతిలో యోజన అనగా ప్రణాళికాబద్ధమైన ఆహారము, ఔషధము మరియు విహారముల ద్వారా వ్యాధి చికిత్స చేయబడుతుంది.

**యుక్తి వ్యపాశ్రయ చికిత్స :** ప్రత్యేక ప్రణాళికా బద్ధమైన చర్యలతో కూడిన చికిత్స. ఇందులో వైద్యుడు దోషదూష్యముల యొక్క, వ్యాధియొక్క, స్వభావను సారము ఆహారము. ఔషధముల యొక్క, మోతాదు, ఔషధసేవన కాలము మొదలగునవి నిర్ణయిస్తారు. వీనిని నిర్ధేశించుటకు దేశము, కాలము, వ్యాధి కారణములు, లక్షణములు, వ్యాధి, చిహ్నాములు, వ్యాధిస్థితి, ఉపద్రవములు, సాధ్యాసాధ్యత మొదలగు వివిధ అంశముల ఆధారముగా చికిత్స యొక్క ప్రణాళిక నిర్ణయించబడుతుంది.

వైద్యుని యొక్క విచక్షణ మరియు ప్రణాళిక ఆధారముగా చికిత్సలు శోధనము లేదా శమనముగా చేయబడతాయి.

**శోధన చికిత్స :** శరీరములో దూషించిన దోషములను బయటకు పంపుటకు చేయు చికిత్స శోధన చికిత్స, వీనినే పంచకర్మలు అని కూడా పిలుస్తారు. వమనము, విరేచనము, అనువాసనవస్తి, ఆస్థాపనవస్తి మరియు శిరోవిరేచనము (నస్యము) అని ఐదు రకముల పంచకర్మలు వివరింప బడినవి.

ప్రధాన కర్మలయిన పంచకర్మలలో ఏ ఒక్కదానినైనను ఆచరించుటకు మునుపు చేయు స్నేహకర్మ,స్వేదకర్మ అను ఉపచారములను పూర్వకర్మలు అంటారు. ప్రధాన శోధన ప్రక్రియ ముగిసిన తరువాత వ్యక్తి కోలుకోవడానికి చేయు చికిత్స సంసర్జన క్రియ అంటారు.

**శమన చికిత్స :** కుపితములైన దోషములను తొలగించకుండా వాని స్థానములోనే శమింపజేయుటను శమన చికిత్స అంటారు. ఆపతర్పణ చికిత్స సంతర్పణ చికిత్స అని శమన చికిత్స రెండు రకములు. ఆపతర్పణ చికిత్స మూడు రకములు అవి లంఘనము, రూక్షణము, స్వేదనము. సంత ర్పణ చికిత్స మూడు రకములు అవి బృంహణ, స్నేహన మరియు స్తంభన చికిత్సలు.

**లంఘనము :** కఫము, ఆమము పెరిగినపుడు లంఘనము చేయవలెను. దప్పికతో ఉంచుట, ఎండను సేవించుట, గాలిని సేవించుట, పాచనము, ఉపవాసము, వ్యాయామము మరియు శోధన చికిత్సలు (వమనము, విరేచనము, ఆస్థాపనవస్తి, శిరో విరేచనము) మొదలగునవి.

**లంఘన చికిత్సలు :** ఆయుర్వేద పరిభాషలో లంఘనము అనగా కేవలము ఉపవాసము చేయుట మాత్రమే కాదు. పైన పేర్కొనబడి వానిలో దేనినాచరించినను అవి లంఘనము అని చెప్పబడినవి. ఈ చికిత్సలు వ్యక్తి యొక్క బలముననుసరించి చేయవలెను.

**రూక్షణ చికిత్స :** ఆమము, ఉరుస్తంభ వ్యాధి మొదలగు స్థితులలో ఈ చికిత్స ప్రయోజనకారి. ఇందులో రూక్షము కల్గించునవి, తీక్ష్ణమైనవి మరియు తేలికదనమును కల్గించు ఔషధములు ఉపయోగించబడతాయి.

**స్వేదన చికిత్స :** చెమటను పుట్టించు చికిత్సలన్నింటినీ స్వేదన చికిత్స అంటారు. వాతవ్యాధులు మరియు కఫ వ్యాధులలో ఈ చికిత్స ఉపయుక్తము.

**బృంహణ చికిత్స :** ధాతువులను పెంపొందించు చికిత్సను, బృంహణ చికిత్స అంటారు. శరీరము కృశించినపుడు, నీరసించినపుడు ఈ చికిత్స ఉపయోగపడుతుంది.

**స్నేహన చికిత్స :** వాత దోషములు యొక్క చికిత్సకు ప్రత్యేకముగా ఉపయోగకరము స్నేహ ద్రవ్యములు, నూనెపదార్ధములు ఈ చికిత్సకై ఉపయోగిస్తారు.

**స్తంభన చికిత్స :** ఈ చికిత్స పిత్తవ్యాధులకు, వళ్ళు కాలినవారికి, విరేచనములకు, వాంతులకు, ఉపయోగకరము. శీత, మంద, మృదు, శుక్ల రూక్ష, సూక్ష్మ, ద్రవ, స్థిర మరియు లఘు గుణముల కల ద్రవ్యములు ఈ చికిత్సకు ఉపయోగపడతాయి.

**పథ్యము :** పథ్యము అనగా వాడదగిన ఆహారము, అలవాట్లు ఏ వ్యక్తి అయిన వ్యాధి కలిగినపుడు పథ్యమును (వాడదగిన ఆహారము, చేయదగిన విహారము) సరిగ్గా పాటించినచో అతనికి ఔషధముల అవసరమే, కలుగదని ఆయుర్వేదం చెపుతుంది. ఔషధాలు వాడినప్పటికీ పథ్యము పాటించనట్లయిన, ఔషధము యొక్క ప్రభావము కూడా తగ్గిపోతుంది.

తీసుకోవల్సిన ఆహారము యొక్క నిర్ధారణ చేయుటకు రసము (రుచి), గుణము, వీర్యము (శక్తి), విపాకము(అంతిమముగా కల్గు మార్పులు),

ప్రభావము (ప్రత్యేకమైన కార్యములు), సాత్మ్యము, అసాత్మ్యము (శరీరమునకు అనుకూలించునవి) మొదలగు అంశములను పరిగణించ వలెను. ఇవి కాకుండా ఆహారము సేవించు పద్ధతులు, ఆహారము సేవించు సమయము, సాత్మ్యము, వాతావరణము యొక్క పరిశుభ్రత, నీటిని దూషిత ముకాకుండా ఉంచుకొనుట, దేశము (నివసించు ప్రదేశము) కాలము, జనవదోధ్వంసము (సాంక్రామిక వ్యాధులు, అసహజ పరిణామములు) మొద లగునవి పరిగణించవలెను.

## స్వస్థ వృత్తము

ఆరోగ్యకరమైన జీవనము గడుపుటకు ఆచరించవలసిన పద్ధతులను స్వస్థవృత్తము అంటారు. ఆధునిక కాలములో ఆరోగ్యవంతుని నిర్వచించు టకు ఎన్నో రకముల ప్రయత్నములు చేయబడినవి. కానీ ఏ ఒక్కటి కూడా సంపూర్ణ అర్థంలో ఆరోగ్యమును, నిర్వచించలేకపోయినవి. మన పూర్వ ఆచార్యులు సుశృత సంహితలో తెల్పిన నిర్వచనము అన్నిటికన్నా ఉత్తమ మైనదిగా పరిపూర్ణమైనదిగా పరిగణింపబడినది.

**సమదోషః సమాగ్నిశ్చ సమధాతు మలక్రియ ।**
**ప్రసన్నాత్మేంద్రియ మనాః స్వస్థ ఇత్యభిధీయతే ॥**

(సుశృతసంహిత, సూ.స్థా)

ఈ నిర్వచనం ప్రకారము, శారీరక, మానసిక, ఆధ్యాత్మిక స్వాస్థ్యములు వివరింపబడినవి. ఆరోగ్యమనగా కేవలము వ్యాధులు లేకుండా ఉండడము కాదు. ఆరోగ్యమనగా మనస్సు, ఆత్మల యొక్క ప్రసన్నత సంపూర్ణ మానసిక శారీరిక సమతుల్యము.

**ఆరోగ్యము సంపాదించుటకు పద్ధతులు**

సంపూర్ణ ఆరోగ్యము పొందుటకు శారీరక మరియు మానసిక సమతు ల్యము అత్యంత ప్రధానము. శారీరిక ఆరోగ్యమును పొందుటకు దినచర్య, రాత్రిచర్య మరియు ఋతుచర్యలు వివరింపబడినవి. సంపూర్ణ మానసిక ఆరోగ్యమునకు సదాచారము మూలము. సామాజిక పరిశుభ్రత, మానవ స్వాస్థ్యమునకు, జీవనమునకు అత్యంత ప్రధానము. సరియైన సామాజిక ప్రవర్తన, నైతిక బాధ్యతవలన ఒక గ్రామము, పట్టణము మరియు దేశము యొక్క అభివృద్ధి జరుగుతుంది.

**దినచర్య :** ప్రాతఃకాలము నిద్రలేచినప్పటి నుండీ రాత్రి పడుకునే వరకు, ప్రతిదినము చేయవలసిన, చేయకూడని వివిధ చర్యల వివరణ దినచర్యలో తెలుపబడుతుంది.

**నిద్రమేల్కొనుటకు సరియైన సమయము :** ప్రాతఃకాలమున సూర్యోదయమునకు ముందు బ్రాహ్మీ ముహూర్తములో నిదురలేవవలెను. ఈ విధముగా మేల్కొనుట వలన అర్ధనిద్రావస్థలో వచ్చు కలలు, అనవసర శుక్ర ప్రవృత్తి మొదలగు వానిని అరికట్టవచ్చును. ఈ సమయములో మనస్సు నిర్మలముగా ఉంటుంది. కావలసినంత సమయం చిక్కుతుంది కనుక శరీరానికి తగిన బలము కలుగును.

**ఉషఃపానము (నీరు త్రాగుట) :** ప్రాతఃకాలమున లేచిన వెంటనే నీటిని త్రాగుట వలన మలమూత్రములు సాఫీగా జారీ అగును.

**మలమూత్రముల విసర్జన :** ఉదయము నిద్దుర లేవగానే మలమూత్ర విసర్జన చేయు అలవాటు చేసుకొనుట మంచిది.సహజమైన మలమూత్ర వేగములను అడ్డగించుట వివిధ రకముల వ్యాధులను మూలకారణము.

**దంతధావనము :** ముఖమును శుభ్రపరచుకొనుట తప్పనిసరి. ప్రతి ఉదయము నోటిని, నాలుకను, పండ్లను శుభ్రము చేయవలెను. నల్ల తుమ్మ వంటి కషాయరసము, క్రిమి సంహారక గుణము,మురికిని తొలగించు గుణము, పండ్లపాచిని తొలగించు గుణముకల మూలికల పండ్లపొడిని ఉపయోగించవలెను. దంతములు, చిగుళ్లపై ఏమైనా వ్యాధులున్నట్లయిన చిగుళ్ళను నూనెతో మృదువుగా మర్ధన చేయవలెను. నాలుకను గీచుకొనుటకు ఉపయోగించు జింహ్వానిర్లేఖని మృదువుగా కోసుకొనునట్లుగా ఉండ వలెను. ముఖము కడుగుటకు ముందు, తరువాత కాళ్ళు, చేతులు శుభ్ర ముగా కడుకొనవలెను.

**తైలాభ్యంగము :** శరీరమంతయు నూనెతో మర్దించుట చాలా ముఖ్యము. మర్దనకు నువ్వులనూనె, కొబ్బరినూనె, లేదా ఆవాల నూనెను వాడవచ్చును. దీనిలో ఆవాలనూనె అన్నిటికన్నా శ్రేష్ఠము. ఔషధ తైలములను కూడా వాడవచ్చును.

**తైలాభ్యంగము వలన ప్రయోజనములు**

1. చర్మము మృదువుగా, కోమలముగా తయారగును, ఇందువలన చర్మ వ్యాధులు కలుగవు.

2. కీళ్ళు, కండరాలలో కదలికలు చక్కగా జరుగును.

3. రక్త ప్రసరణ పెరుగును.

4. చర్మము ద్వారా, మలపదార్ధములు త్వరగా తొలగింపబడును.

5. ఆరోగ్యము సంపూర్ణముగా రక్షింపబడును. కొంతమేరకు అభ్యంగము వ్యాయామముగా కూడా ఉపయోగపడుతుంది.

**వ్యాయామము :** చక్కటి ఆరోగ్యమునకు వ్యాయామము చాలా అవసరము. ఇందువలన శరీర పటుత్వము పెరుగును, వ్యాధినిరోధకశక్తి పెరుగును. శరీరములో స్రోతస్సులు నిర్మలమగును. రక్తప్రసరణ పెరుగును మరియు ఊపిరితిత్తులు బలపడును. వ్యాయామము కొరకు దేశీయ యోగ విధానములు లేదా పాశ్చాత్య పద్ధతులను అవలంబించవచ్చును. ఏ వ్యాయామమైనను అర్ధశక్తి పర్యంతము అనగా నుదుటిపై చెమట వచ్చునంతవరకు చేయవలెను. దగ్గు, ఆయాసము, క్షయ, గుండె జబ్బులు కలవారు వైద్యసలహామేరకు వారికి అనుకూలమైన వ్యాయామముచే చేయవలెను.

**స్నానము :** సాధారణముగా గోరువెచ్చని నీటితో స్నానము చేయవలెను. తల స్నానము శరీర ఉష్ణోగ్రతకు సమముగా కలనీటితోనే చేయవలెను. (హెచ్చు ఉష్ణోగ్రత కలనీటిని వాడకూడదు.) స్నానము వలన జఠరాగ్ని పెరుగును, రోమకూపములు, స్వేద రంధ్రములు, చర్మము శుభ్రపరచబడి శరీరము నిర్మలముగా ఉండును.

**ఆహారము :** నివసించు ప్రదేశము, కాలము మరియు అలవాట్ల ననుస రించి ఆహారమును నిర్ణయించవలెను. తీపి, పులుపు, ఉప్పు, కారము, చేదు, వగరు అను ఆరు రుచులు కలిగివుండు ఆహారమును తినవలెను. జీర్ణశక్తికి అనుకూలముగా ఆహారము యొక్క మోతాదు నిర్ణయించుకొని అన్ని పోషకాంశములు కల సమతుల్య ఆహారమును ఉపయోగించవలెను.

**సూచనలు :**

1. భోజనము చేయుటకు 10-15 ని॥ ముందు పచ్చి అల్ల ముక్కలను కొద్దిగా ఉప్పుతో కలిపి తినవలెను.

2. గట్టిగా ఉండు పదార్థములను బాగా నమిలి తినవలెను.

3. సాధ్యమైనంతమేరకు ఆహారసేవన తరువాత పెరుగు లేదా మజ్జిగ

సేవించవలెను.

4. ఆహారము రుచిగా, తాజాగా మరియు చక్కగా ఉండవలెను.

5. బాగా చల్లగా లేదా అతివేడిగా ఉండరాదు.

6. ఆహారము తినుటకు 15 ని.లోపు నీరు తీసుకోరాదు. తిన్నవెంటనే అధిక మోతాదులో నీటిని తీసుకోరాదు. మధ్యమధ్యలో కొద్దికొద్దిగా సేవించ వచ్చును.

7. ఆలస్యముగా జీర్ణమగు భారీ ఆహారము (గురు ఆహారము) కొద్ది మోతాదులోనే తీసుకొనవలెను.

8. గురు ఆహారమును రాత్రివేళలో తినకూడదు. నిద్రించుటకు రెండు నుండి మూడు గంటలకు ముందే భోజనము చేయవలెను. రాత్రి భోజనం చేసిన పిదప కనీసం వంద అడుగులు, నెమ్మదిగా నడువవలెను.

9. అధిక శారీరక వ్యాయామము చేయకూడదు. మానసిక వత్తిడికి లోనుకాకూడదు. భోజనము చేసిన పిదప కొంత విశ్రాంతి నిచ్చుట ఆహారము జీర్ణమగుటకు చాలా ప్రధానము.

**నిద్ర :** మానవుని ఆరోగ్యమునకు మరియు దీర్ఘ జీవనమునకు నిద్ర అత్యంత ప్రధానమైన అంశము. నిద్రను జగద్ధాత్రీ అనగా ప్రపంచమునకు తల్లివంటిది అని పేర్కొన్నారు. శారీరక శ్రమ మరియు మానసిక అలసట, శరీరమునకు కల్గిన అన్ని రకాల నష్టమును తగ్గించుటకు, తిరిగి కోలుకొను టకు నిద్ర అత్యంత ఆవశ్యము.

1. పూర్వ ఉత్తర దిశలందు శిరస్సు ఉంచి నిదురించవలెను.
2. శయన కక్ష (గది) అత్యంత స్వచ్ఛముగా గాలివీచునటుల, నిశ్శబ్దముగా, ప్రశాంతముగా ఉండవలెను.
3. మంచము ఎత్తువంపులు లేకుండా స్థిరంగా ఉండవలెను.
4. గది వాతావరణపు దుష్ప్రభావము లేకుండ నుండవలెను.

5. మెదడును ఉత్తేజపరచు పనులు ఉదా:- గట్టిగ చదువుట, ఆలో చించుట మద్యపానము, కాఫీ, టీలు సేవించుట మొదలగు వాని తర్వాత వెంటనే పడుకోకూడదు.

6. నిదురించు సమయమున మన సంసారిక విషయములను విడనాడి, ఆలోచనలకు స్వస్తి చెప్పి నిదురించుటకు ఉపక్రమించవలెను. మరియు నిదురించుటకు ముందు దైవ ప్రార్థనచేయుట వలన వీటిని

నివారించ వచ్చును.

7. రాత్రి ఆలస్యముగా నిదురించుట వలన ఆరోగ్యము పాడగును.

8. శారీర మానసిక అలసట, ఒత్తుడులను తట్టుకొనుటకు కనీసము రోజుకు 7 గంటల నిద్ర అవసరము.

9. సాధారణముగా దినమున నిదురించరాదు. కాని రాత్రి జాగరణము చేసినవారు దినమున కొంత సమయము వరకు నిదురించవచ్చును. వేసవి కాలమున దినమున నిదురించవచ్చును. కాని శీతాకాలమున దినమున నిదురించుట వలన కఫము వృద్ధిచెంది, దాని ద్వారా శ్వాసన మరియు పాచన వికారములు కల్గించును.

10. శిరస్సు, అరిచేతులు, కాళ్ళను నిదురించుటకు ముందు తైల ముచే మర్ధన చేయవలెను. దీనివలన కలలు నియంత్రింపబడును.

**మైథునము :** మైథునము సమస్త ప్రాణులకు అత్యంత సహజమైన కోరిక మరియు స్వభావము.జీవులు తమ సంతతిని అభివృద్ధి పరచుకొను టకు మైథునము తప్పనిసరి. నిమ్నస్థాయి జీవులు కూడా లైంగిక ప్రవర్తనలో వానికి సముచితమైన పద్ధతిని పాటిస్తాయి. మానవుని విషయంలో ఈ నియంత్రణ చాలా సందర్భాలలో అస్తవ్యస్తంగా ఉంటుంది. అతిగా సంభో గించుట, అసహజ లైంగిక ప్రవర్తన మొదలగునవి మానవ ప్రవర్తనలో ఒక భాగంగా మారినవి కనుక లైంగిక జీవనంపై కొంతమేరకు నియం త్రణ అత్యంత ఆవశ్యకము.

**మైథున నిర్ధేశము :**

1. అధిక మైథునము వలన శరీరమునకు హాని కారకముగ నుండును. దీని వలన క్షయ మొదలైన వ్యాధులు కలుగును.

2. మైథునము రాత్రి మొదటి భాగమున చేయుట ఉత్తమము. ఎందు కనగా మైధునకర్మ అనంతరము రాత్రియంతయు విశ్రాంతి లభించును.

3. కామశాస్త్రమున అనేక రకముల భంగిమలు తెల్పినప్పటికినీ ఉత్తా రన (లిధాటామి) స్థితి సంభోగమునకు అనుకూలముగా ఉండును.

4. హస్త మైథునము,గుదమైథునము వంటి అసహజమైథునములు హాని కారకములు.

5. సాంక్రామిక యౌవన వ్యాధులతో పీడింపబడు వ్యక్తులతో సంభోగము వర్జించి తద్వారా వ్యాధి సంపర్కము లేకుండా ఉండవలయును.

6. ఆరోగ్యము వృద్ధి మరియు బలవృద్ధి కొరకు మైథునము తర్వాత 1 గ్లాసు పాలు (ఇంచుమించు 250మి.లీ.) త్రాగవలెను.

7. వ్యాధులు ఉన్నపుడు, చికిత్సా సమయములో, వ్యాధుల నుండి కోలుకొను సందర్భములో మైథునము చేయకూడదు. ఈ విధముగా చేసిన రోగ నిరోధకశక్తి సన్నగిల్లి అనేక ఇతర వ్యాధులు కలుగును.

**అధారణీయ వేగములు :** పదమూడు రకముల ఆధారణీయ వేగములు పేర్కొనబడినవి. ఈ వేగములను ఆపివేసిన వివిధరకముల వ్యాధులు కలుగును. అవి.

1. మూత్రము 2. మలము 3. శుక్రము 4. అపానవాయువు 5. వాంతి 6. తుమ్ములు 7. త్రేన్పులు 8. ఆవలింతలు 9. ఆకలి 10. దప్పిక 11. కన్నీరు 12. శ్వాస 13. నిద్ర.

**వేగధారణము వలన కలుగు లక్షణములు**

**1. మూత్రము ఆపుట వలన**

అ) మూత్రము పోయుటలోబాధ ఆ) మూత్రంలో రాళ్ళు ఇ) మూత్రాశయము యొక్క కండరాలు పటుత్వము కోల్పోవుట ఈ) మూత్ర మార్గములో వాపు మంట కలుగును.

**2. మల విసర్జన ఆపుట వలన**

అ) కడుపులో నొప్పి ఆ) కడుపుబ్బరము ఇ) అజీర్ణము ఈ) అపాన వాయువులు ఉ) తలనొప్పి ఊ) కడుపులో పుండ్లు.

**3. శుక్రము నిరోధించుట :** శుక్రము బయల్వెడలు సమయంలో నిరోధించినచో అ) శుక్రాశ్మరి ఆ) వృషణములలో నొప్పి ఇ) సంభోగము చేయుట యందు నొప్పి కలుగును.

**4. వాంతి నాపుట వలన కలుగు లక్షణములు**

సాధారణముగా అజీర్ణము కల్గినపుడు వాంతి కల్గి దోషములు బయటకు పంపివేయబడును. ఇట్టి పరిస్థితిలో వాంతి నాపుట వలన – దద్దుర్లు, తల తిరుగడము, రక్తహీనత, కడుపులో మంట, చర్మరోగములు మరియు జ్వరము కలుగును.

**5. తుమ్ము నాపుట వలన కలుగు లక్షణములు**

ముక్కులోనున్న మలినాలు, అనవసర పదార్థములను తొలగించుటకు

తుమ్ములు సహాయపడతాయి. వీనిని ఆపుట వలన జలుబు, దీర్ఘకాలము పాటు ఉండే పీనసము, తలనొప్పి, పార్శ్వపునొప్పి మొదలగు సమస్యలు కలుగును.

**6. త్రేన్పుల నాపుట వలన కలుగు లక్షణాలు :** ఎక్కిళ్ళు, ఛాతీలో నొప్పి,దగ్గు, ఆకలి మందగించుట,రుచి లేకపోవుట కలుగును.

**7. ఆవలింతలనాపుట వలన కలుగు లక్షణాలు :** కండ్లు, గొంతు, చెవి, ముక్కు సంబంధ వ్యాధులు ఉత్పన్నమగును.

**8. ఆకలి మరియు దప్పిక నాపుట :** ఆకలి దప్పికలు శరీరమునకు కావలసిన పోషకాంశాలు మరియు నీటి ఆవశ్యకతను తెలియచేస్తాయి. వీనిని అతిగా ఆపుటవలన శరీరమునకు కావలసిన పోషకాలు అందక శరీరము క్షీణించిపోతుంది. శరీరమునకు కావల్సిన రోగనిరోధక శక్తి తగ్గి రకరకాల సాంక్రామిక వ్యాధులు కల్గుతాయి. ఆకలి మందగించును మరియు శరీరము పొడిగా మారిపోవును.

**9. కన్నీటిని ఆపుట వలన కలుగు లక్షణాలు :** సంతోషము, దుఃఖము వంటి మానసిక స్థితులలో కన్నీరు ఉబికి వస్తుంది. కన్నీటిని ఆపడం అనగా ఈ భావనలను బలవంతముగా అణిచివేయడమే. దీనివలన మానసిక వ్యాధులు, ఛాతీలోనొప్పి, తలతిరుగుట మరియు జీర్ణకోశ వ్యాధులు కలుగుతాయి.

**10. శ్వాస ప్రక్రియను ఆపుట :** ఉచ్ఛ్వాసనిశ్వాసములను అకారణంగా ఆపుట వలన శ్వాసకోశ వ్యాధులు, గుండెజబ్బులు కలిగి మనిషిని ఉక్కిరి బిక్కిరి అయి మృత్యువు కూడా సంభవించవచ్చు.

**11. నిద్రనాపుట వలన కలుగు లక్షణాలు :** మెదడు, మనస్సు,జ్ఞానేంద్రియములు, శరీరము అలసినపుడు వ్యక్తికి విశ్రాంతి అవసరము ఈ విశ్రాంతి నిద్రద్వారా లభిస్తుంది. బలవంతంగా నిద్రనాపుట వలన నిద్రలేమి, మానసిక వ్యాధులు, జీర్ణకోశ వ్యాధులు మరియు జ్ఞానేంద్రియములకు సంబంధించిన వ్యాధులు ఉత్పన్నమగును.

**సదాచారము** (మంచి నడవడి) **మంచి నడవడికి సూచనలు**

1. ప్రతి ఒక్కరూ సంతోషంగా ఉండడానికి పనిచేస్తారు. అందుకే సంతోషాన్ని అందరితో పంచుకోవాలి. అందరినీ ఆనందంగా ఉంచడానికి ఎంతటి పరిశ్రమనైనా చెయ్యాలి. ఈవిధమైన ప్రవర్తన కల్గి ఉండడాన్ని

హితాయు అంటారు. అందరూ సుఖంగా సంతోషంగా ఉండాలని కోరటం మన సంస్కృతి.

2. మన మంచికోరే వారితో ఇగురు పొరుగు వారితో ప్రేమగా మసలు కొనవలెను. దుర్మార్గులు, శతృవులు, బాధ్యతాయుతంలేని ప్రవర్తన గల వారికి దూరంగా ఉండవలెను.

3. శారీరకంగా, మానసికంగా వాచికంగా ఏ విధమైన పాపములు చేయ కూడదు. దొంగతనముచేయుట, ఇతరులను గాయపరచుట, వ్యభి చారము, మానభంగముచేయుట మొదలగునవి శారీరక పాపములు. అసత్యము పలుకుట, పరుషమైన మాటలు మాట్లాడుట, ఇతరుల రహస్యా లను వేరొకరికి తెలియజేయుట, అసంబద్ధమైన మాటలు మాట్లాడుట మొద లైనవి వాచిక పాపములు. అసూయాద్వేషములు, చెడు ఆలోచనలు మానసిక పాపములు.

4. అవసరార్ధులకు, వికలాంగులకు సాధ్యమైన మేరకు సహాయపడ వలెను.

5. చదువుకున్న వారిని, జ్ఞానులను, పెద్దవారిని, వృద్ధులు, వైద్యులను, అతిధులను, ఆవులను గౌరవించవలెను.

6. మానవత్వంతో మసలుట నేర్చుకోవలెను.

7. అవసరంలో ఉన్న శత్రువునైనను ఆదుకోవలెను.

8. అన్నివేళలలో సమస్థితి కలిగి వుండవలెను. ధనం కల్గినపుడు మిడిసిపాటు, దారిద్ర్యంలో దుఃఖం, అసూయ కల్గి వుండరాదు.

9. ఎప్పుడూ కారణముల మీదనే దృష్టిసారించవలెను. కాని వాని ఫలితాలపై కాదు.

10. అసంబద్ధముగా, అర్ధరహితముగా మాట్లాడరాదు.

11. శతృత్వమును, సాన్నిహిత్యమును బహిర్గతము చేయరాదు.

12. జ్ఞానేంద్రియములను అదుపులో ఉంచుకొనుట అభ్యాసము చేయవలెను.

13. ధర్మ, అర్ధ, కామములు సాధ్యమగునట్లు మన కార్యకలాపము లను నిర్ధారించుకోవలెను.

14. కేవలము ఒకే ఒక విషయముపై ఆసక్తి పెంపొందించు కోవడం

హానికరము.

15. గడ్డము, మీసములు శుభ్రపరచుకొని, క్షవరము చేసుకోవలెను.

16. ప్రతిరోజు స్నానము చేయవలెను. పరిశుభ్రమైన బట్టలను ధరించ వలెను. లోకవిరుద్ధమైన వేషధారణ చేయరాదు.

17. తుమ్మినపుడు, దగ్గినపుడు, ఆవలించినపుడు జేబురుమాలును అడ్డుపెట్టుకోవలెను.

18. విపరీతంగా అలసిపోక మునుపే పనిని ఆపివేయవలెను.

19. రాత్రివేళలో చెట్లక్రింద పడుకోరాదు.

20. మద్యము సేవించుట, మద్యమును విక్రయించుట మంచిది కాదు. వ్యసనాలు హానికరములు కనుక త్యజించవలెను.

21. నీచ బుద్ధి కలవానివద్ద, నైతిక విలువలు లేని వానివద్ద పనిచేయ రాదు.

22. సంధ్యాసమయంలో చదువుట, భుజించుట, సంభోగించుట, నిద్రించుట చేయరాదు.

23. ఇంటివద్ద ఉండే చెత్తను సరియైన ప్రదేశంలోనే వేయవలెను.

24. సమయాను కూలంగా, ప్రజాభిప్రాయానికి అనుకూలంగా నడత కలిగి వుండవలెను.

25. దైనందిన కార్యకలాపములను రోజూ క్రమానుసారముగా ఒక పుస్తకములో వ్రాయవలెను. అలవాట్లలో చెడుపోకడలు విడిచిపెట్టవలెను.

**సాంఘిక పారిశుధ్యము :** మానవుడు సంఘజీవి కనుక అతడు సమాజ మునకు అనుకూలముగా పరిసరాలను పరిశుభ్రంగా ఉంచుకుంటూ జీవిం చాలి. ఈ విధమైన పరిస్థితి కలగడానికి వ్యక్తి తనకు తానుగా మరియు సంబంధిత సంస్థలు, అధికారులతో కలసి క్రింద పేర్కొన్న కార్యక్రమములు చేపట్టవలెను.

1. ఇంటివద్ద పోగయ్యే చెత్తను వానికి నిర్దేశించిన ప్రదేశంలోనే వేయ వలెను.

2. మురికి కాల్వలు మూసుకుపోకుండా చూడవలెను.

3. మూత్రశాలలు, మరుగుదొడ్లు పరిశుభ్రముగా ఉంచుకొనవలెను.

4. నీటిని నిల్వ ఉంచుపాత్రలు, సేవించు పాత్రలను పరిశుభ్రముగా ఉంచుకోవలెను.

సాంక్రమిక వ్యాధులు ఎక్కడనైనా కల్గినట్లు తెలిసినట్లయితే వెంటనే సంబంధిత అధికారులకు తెలియజేసి సత్వర చర్యలను చేపట్ట వలెను. ఇందు వలన వ్యాధియొక్క వ్యాప్తి అరికట్టబడి ఎంతో ధన, ప్రాణ, నష్టం నివారింపబడుతుంది.

**ఋతుచర్య :** వ్యక్తి ప్రవర్తన మరియు ఋతుమార్పులు వ్యాధికి కారణాలౌతాయి. కాశ్మీర్ నుండి కన్యాకుమారి వరకు, కచ్ నుండి బెంగాల్ వరకు విస్తరించిన విశాల భారతదేశంలో, సూర్యగమనాన్ననుసరించి ఋతువులు ఏర్పడతాయి. ఈ ఋతువులు దక్షిణాయనము, ఉత్తరాయణములని రెండు భాగములుగా విభజించడం జరిగింది. అవి హేమంత, శిశిర, వసంత, గ్రీష్మ, వర్ష శరత్ ఋతువులు.

స్వస్థవృత్తము దినచర్య ఋతుచర్య మొదలగునవి సంక్షిప్తముగా ఇచ్చట వివరింపబడినవి. ఈ పరిచర్య ఆరోగ్యమును పెంపొందించుటకు, అనారోగ్యమును నివారించుటకై నిర్దేశింపబడినవి. వీనిని సరిగ్గా ఆచరించిన వారికి చక్కటి శారీరిక, మానసిక ఆరోగ్యం చేకూరుతాయి. మరియు చాలా కాలం ఎటువంటి వ్యాధులు లేకుండా జీవించగలరు.

హేమంత, శిశిర ఋతువులు శీతాకాలము, గ్రీష్మ ఋతువు ఎండా కాలము, వర్షఋతువు వానలతో కూడి ఉంటుంది. శరదృతువు, వసంత ఋతువులు మధ్యరకమైన వాతావరణాన్ని కలిగి వుంటాయి.

**ఋతు ప్రభావం వలన దోషముల యొక్క మార్పులు**

ఋతువుల గతి ననుసరించి దోషగతులు మూడు రకాలు : 1. సంచయము 2. ప్రకోపము 3. ప్రశమము. ఈ దోషము గతి ఋతు ప్రభావము వలన ప్రాకృతికముగా కలుగును. వీనిపై పూర్తి అదుపు సాధ్యముకాదు. సరియైన ఋతుచర్యను పాటించుట ద్వారా ఈ దోష గతులను కొంతమేరకు అనుకూలంగా మరల్చుకోవచ్చును. ఋతువులననుసరించి దోష పరివర్తన.

| ఋతువుల ననుసరించి ఆహారము, విహారము మరియు శోధన చికిత్సలు | | | |
|---|---|---|---|
| ఋతువులు | ఆహారము | విహారము | శోధనచికిత్స |
| హేమంత మరియు శిశిర ఋతువు | తీపి, ఉప్పు, పులుపు, రుచులు కల పౌష్టిక ఆహారము | అభ్యంగము,వ్యాయామం చలినుండి కాపాడుకొనుటకు దుప్పట్లు మొ॥ | |
| వసంత ఋతువు | తేలికైన, రూక్షగుణం కల్గిన, పేలాలు వేపిన శనగలుమొ॥ | అభ్యంగము వ్యాయామము కాపడము | వమనము |
| గ్రీష్మ ఋతువు | తీపి, తేలికైన చమురుకల (స్నేహ) పదార్థాలు | చల్లటి వాతావరణం, మామిడి,అల్లనేరేడు, చల్లని గాలి మొ॥ | |
| వర్ష ఋతువు | వగరు, తీపి, పులుపు, ఉప్పు మరియు చమురుకల పదార్థలు, తేలికగా జీర్ణమగు ఉడికించిన ఆహారం, వేడిచేసి చల్లార్చిన శుభ్రమైన నీరు, పెరుగు, మజ్జిగ, నిమ్మ, క్షారములు మరియు సున్నపు పదార్థాలు | నేలపై పడుకోవడం మానివేయాలి, బురద ఎక్కువ నీరు మొ॥ తొలగించాలి. | బస్తి చికిత్స |
| శరద్రుతువు | తీపి,వగరు, స్నిగ్ధ పదార్థాలు ముఖ్యంగా నెయ్యి,పాలు, పాతబియ్యం మరియు పాయసం మొ॥ | రాత్రి మొదటి భాగంలో చంద్రకాంతిలో కూర్చొడం వ్యాయామం చేయడం పులుపు పదార్థాలు,పెరుగు వదలివేయడం | విరేచన మరియు రక్తమోక్షణ |

హేమంత ఋతువులో ఏ దోషము యొక్క సంచయముకానీ ప్రకోపము కాని కలుగవు కావున ఈ ఋతువు బలాన్ని రోగనిరోధక శక్తిని పెంపొందించుటకు అనుకూలము.

గ్రీష్మ ఋతువులో అధిక ఉష్ణోగ్రత వలన, శరీరము బలహీనపడును, జీర్ణక్రియ మందగించును. చెమటవలన అధికంగా నీరు నష్టమగును. మరియు చర్మ వ్యాధులు కూడా సంభవించును. అధికమైన తేమ వలన

వర్ష ఋతువులో జీర్ణశక్తి క్షీణించును, శరదృతువులు ఆహ్లాదకరంగా ఉన్నప్పటికినీ బలహీనమైన శరీరము కలిగి ఉండుటవలన (పూర్వ ఋతువుల ప్రభావము వలన) విషమ జ్వరము, విశూచిక మొదలైనవి కలుగుతాయి.

వివిధ ఋతువులలో ఆచరించవలసిన నియమాలు, పంచకర్మ, ఆహార విహార నియమాలు తదుపరి అధ్యాయములలో పేర్కొనబడినాయి.

**ఋతువుల ననుసరించి దోషములలో కలుగు మార్పులు**

| ఋతువు | సంచయము | ప్రకోపము | ప్రశమనం |
|---|---|---|---|
| హేమంత | – | – | పిత్తము |
| శిశిర | కఫ | – | – |
| వసంత | – | కఫ | – |
| గ్రీష్మ | వాత | – | – |
| వర్ష | వాత | వాత | – |
| శరదృతువు | – | పిత్త | వాత |

## భైషజ్య కల్పన
### (ఔషధముల నిర్మాణము మరియు మాత్ర)

రోగుల చికిత్స కొరకు తయారు చేయు ఔషధములకు సంబంధించిన మూలికలను సేకరించుట, భద్రపరచుట, మరియు వివిధ రకముల ఔషధ నిర్మాణ పద్ధతులను వివరించు శాస్త్రమును భైషజ్య కల్పన అంటారు.

**ఔషధ మూలికలను, ద్రవ్యములను సేకరించు విధానము**

ఔషధముల ఉత్పత్తి స్థానము మరియు ఔషధ సంగ్రహణ కాలము అను ఈ రెండు విషయములు ఔషధ ద్రవ్యముల గుణములపై ప్రభావాన్ని కలిగి వుంటాయి. బాగా పరిణతి చెందిన, అనుకూలమైన ఋతువులో లభించిన మరియు వానికి ప్రతీకలైన రంగు, రుచి, వాసన కలిగి ఏవిధమైన పురుగులు, విషము మురికి మొదలగు వానితో దూషితముకాని ఔషధములు యోగ్యములు, సర్వ సాధారణముగా శరదృతువు, ఔషధములు సేకరించు టకు అనుకూలముగా ఉండును. పాలు, మూత్రము వంటి జంతువుల ఉత్పత్తులు అవి ఆహారమును జీర్ణించుకొన్న పిదపనే సేకరించవలెను.

**ఔషధమును భద్రపరచు విధానము**

ఔషధములను సేకరించిన తరవాత వానిని డబ్బాలలో, సంచులలో వేసి వేడి, పొగ, నీరు, దుమ్ము, ధూళి, క్రిమికీటకాదులు, జంతువులు మొదలగు వానికి దూరముగా పొడిగా ఉండు ప్రదేశములో భద్రపరచవలెను.

## పంచకర్మ

ఆయుర్వేద చికిత్సలు ప్రధానంగా శమన చికిత్స, శోధన చికిత్స అని రెండు విధములు. దూషిత దోషములను శరీరమునుండి బయటకు పంప కుండా వాని స్వస్థానములోనే చికిత్స చేయుటకు శమన చికిత్స, దోషములను శరీరము బయటకు పంపివేయు చికిత్స శోధన చికిత్స. శమన, చికిత్సలలో శోధన చికిత్స, శ్రేష్ఠమయినదిగా చరక సంహిత మొదలగు వానిలో పేర్కొన బడినది. చరకమతానుసారము లంఘనము, పాచనము వంటి శమన చికిత్సల ద్వారా తాత్కాలికముగా ఉపశమనము పొందిన దోషములు తిరిగి ప్రకోపించి వ్యాధులను కల్గించే అవకాశము కలదు. శోధన చికిత్సలలో దోషములను పూర్తిగా తొలగించుట వలన అవి తిరిగి వ్యాధులను ఉత్పన్నము చేయలేవు.

దోషములను తొలగించుటకు ఐదురకముల శోధన చికిత్సలు తెలుప బడినవి. వీనినే పంచకర్మలుగా పేర్కొనుట జరిగినది. అవి వమనము, విరేచనము, అనువాసనవస్తి, ఆస్థాపనవస్తి లేదా నిరూహవస్తి మరియు శిరో విరేచనము. కొందరు ఆయుర్వేద విశేషజ్ఞుల ననుసరించి, అనువాసన, ఆస్థాపనవస్తులు ఒకే చికిత్స యొక్క ప్రకారములుకాగా, రక్తమోక్షణ అను ఇంకొక పద్ధతి కలిపి మొత్తం ఐదు చికిత్సా పద్ధతులుగా పేర్కొనబడినవి. అవి వమనము, విరేచనము, వస్తి, శిరో విరేచనము మరియు రక్తమోక్షణము.

పంచకర్మలు ప్రధానకర్మలు కాగా, వీనికి అదనంగా చేయు పూర్వ కర్మలు– స్నేహము, స్వేదము మరియు పశ్చాత్కర్మ–సంసర్జన క్రమము పంచకర్మ చికిత్సలోని భాగములే. పూర్వకర్మలైన స్నేహ స్వేదకర్మలు దోషము లను వాని స్థానముల నుండి కోష్ఠములోనికి తీసుకొని వచ్చి బయటకు పంపుటకు వీలుగా తయారు చేస్తాయి. ప్రధాన కర్మల ద్వారా దోషములు తొలగింపబడిన తరువాత అలసి బలహీనపడిన రోగి కోలుకొనుటకు సంసర్జన క్రియ మొదలగు పశ్చాత్కర్మలు ఉపయోగపడతాయి.

శరీరము యొక్క సంపూర్ణ ఆరోగ్యమును పరిరక్షించుకొనుటకు మరియు వ్యాధుల నివారణకు పంచకర్మ చికిత్సలు ఉపయోగపడతాయి. ఋతువుల ననుసరించి కలుగు సంచయ, ప్రకోపావస్థలకు అనుగుణంగా ఆయా ఋతువులలో ప్రకోపించు దోషములను తొలగించుటకు పంచకర్మలు ప్రత్యేకముగా వివరింపబడినవి. వసంత ఋతువులో ప్రకోపించు కఫమును తొలగించుటకు వమనము, శరదృతువులో ప్రకోపించు పిత్తమును తొలగించుటకు విరేచనము,రక్తమోక్షణము,వర్ష ఋతువులో ప్రకోపించు వాతమునకు వస్తి, ఉపయోగపడతాయి.

ఆయుర్వేద పంచకర్మలు వాని పూర్వ మరియు పశ్చాత్కర్మల వివరములు ఇచ్చట వివరించబడినవి.

**పూర్వకర్మ :** సాధారణ పరిస్థితులలో వ్యాధికారక దోషములు అవి ఉత్పన్నమగు ప్రదేశములో కేంద్రీకృతమై ఉంటాయి. ఈ దోషములను తొల గించుటకు వీనిని కోష్ఠము (జీర్ణాశయము)లోనికి తీసికొని రావడము తప్పనిసరి. దోషములను కోష్ఠములోనికి తీసుకొని రావడానికి స్నేహకర్మ మరియు స్వేదనకర్మ (చెమటపట్టిం2చుట) చేయడం జరుగుతుంది. పూర్వ కర్మల వలన వ్యక్తిని చికిత్సకై సంసిద్ధము చేయుటకు వీలు కల్గుతుంది. ఈ పూర్వకర్మలు, పంచకర్మలోనే కాకుండా, చికిత్సకై ఇతర సందర్భములలో

కూడా ఉపయోగించబడతాయి.

## స్నేహన చికిత్స

వివిధరకముల చమురు పదార్థముల ద్వారా చికిత్స చేయుట స్నేహకర్మ. ఈ చమురు పదార్థములు, జంతువులు నుండి లేదా మొక్కల నుండి సేకరించ వచ్చు. స్నేహ పదార్థములు ఘృతము (నెయ్యి), వసా (జంతువుల కండరా లలోని కొవ్వు), మజ్జా (మూలుగ), మరియు తైలము (విత్తనముల నుండి తీయబడిన నూనె) అని నాల్గు రకములుగా వర్గీకరించబడినది.

స్నేహకర్మ చేయుటకు, ఆహారము ద్వారా స్నేహము వాడుట, స్నేహ ద్రవ్యములు త్రాగుట, అభ్యంగనము చేయుట మరియు బస్తి అను పద్ధతులు అనుకూలము. చమురు పదార్థములను (స్నేహ ద్రవ్యముల) ఆహార పదార్థ ములలో కలపి, లేదా నేరుగా కూడా సేవించ వచ్చును. వీనికి అదనంగా గండూషము (పుక్కిలిపట్టుట) కర్ణపూరణము( చెవిలో వేయుట), నస్యము (ముక్కు ద్వారా వేయుట) అను పద్ధతుల ద్వారా కూడా స్నేహకర్మలు ఆచరించవచ్చును.

## స్నేహకర్మ యోగ్యులు

స్వేదనకర్మ చేయుటకు ముందు, శోధన కర్మలకు ముందు స్నేహ కర్మ తప్పనిసరి, బలహీనముగా, మృదుత్వము లేక , రూక్షముగా ఉండు వ్యక్తులకు, వాత వ్యాధి పీడితులకు, అధికముగా వ్యాయామము, సంభోగము చేయువారికి , మద్యపానము మరియు ఇతర వ్యసనములు కలవారు స్నేహ కర్మకు యోగ్యులు.

## స్నేహకర్మకు అయోగ్యులు

కఫప్రకోపము కల్గినవారు, రూక్ష చికిత్స అవసరమైనవారు,బాగా బలహీనముగా ఉన్నవారు, లావుగా ఉండువారు, జీర్ణశక్తి మందగించిన వారు, నోటినుండి, గుద ప్రాంతము నుండి స్రావములు కారువారు, దప్పికతో బాధపడువారు, మూర్ఛరోగులు, తాలు (అంగిలి) ప్రదేశము శుష్కించిన వారు, ఆహారము ఇష్టపడనివారు, వాంతులయ్యే స్వభావం కలవారు, ఆమ దోషము, ఉదర వ్యాధులు కలవారు, దీర్ఘకాలము పాటు విషప్రభావమునకు లోనైన వారు స్నేహకర్మకు అయోగ్యులు.

## స్నేహ ద్రవ్యములను సేవించు పద్ధతి

వ్యక్తియొక్క జీర్ణశక్తి అనుసారము స్నేహద్రవ్యముల మోతాదు నిర్ణయించ

వలెను. 24 గంటలలో జీర్ణమగునది ప్రధాన మాత్ర, పన్నెండు గంటలలోపు జీర్ణమగునది మధ్యమ మాత్ర, మరియు ఆరు గంటలలో జీర్ణమగునది హ్రస్వమాత్రగా పరిగణిస్తారు.

స్నేహపానము కనీసము మూడు రోజులపాటు లేదా, అధికముగా ఏడు రోజుల వరకు వ్యక్తియొక్క కోష్ఠముననుసరించి చేయించవచ్చును. ఏడు రోజులకన్నా ఎక్కువగా చేసిన స్నేహపానము అలవాటుగా మారుట వలన ప్రత్యేక ప్రయోజనములు చేకూరవు కనుక ఏడురోజులకన్నా ఎక్కువగా స్నేహపానము చేయించరాదు.

స్నేహపానము చేయుటకు ముందు రోజు రాత్రి తేలికైన ఆహారము తీసుకొని, అది సంపూర్ణముగా జీర్ణమైన పిదపనే స్నేహపానము చేయించ వలెను. శమనమునకు, స్నేహద్రవ్యములు భోజనసమయములోనే తీసుకొన వలెను. శోధనమునకు ఉద్దేశించిన స్నేహము రాత్రి భుజించిన ఆహారము సంపూర్ణముగా జీర్ణమయిన పిదప ప్రాతఃకాలముననే వాడవలెను.

**సమ్యక్ స్నేహలక్షణములు**

స్నేహపానము యొక్క పనితీరు అయోగము, సమ్యక్ యోగము మరియు అతి యోగములు అను మూడు విధములుగా గ్రహించవచ్చును.

**అయోగము –**స్నేహపానము తరువాత, పొడిగా, గట్టిగా మలము విసర్జించుట, అపానవాతము పెరుగుట, అజీర్ణమగుట, శరీరము పొడిగా, గరుకుగా తయారగుట సమ్యక్ యోగలక్షణములు, సమ్యక్ యోగము తరువాత రోగి ఇతర ప్రధాన పంచకర్మలు ఆచరించవచ్చును.

**అతియోగము –**శరీరము పాలిపోవుట, బరువుగా ఉండుట, అలసత్వము, మలము పలుచగా వెడలుట, లావుదనము,రుచిలేకపోవుట, వాంతి వచ్చినట్లుండుట మొదలగునవి స్నేహ అతియోగ లక్షణములు.

అతియోగములో స్నేహమును ఆపివేసి, తగిన చికిత్సలను చేయవలెను.

స్నేహపానము తరువాత రోగి కేవలము గోరువెచ్చని నీటిని మాత్రమే ఉపయోగించవలెను. సహజవేగములైన మలము, మూత్రము, అపాన వాతము, త్రేన్పులు మొదలగు వానిని అపకూడదు. అధికముగా శారీరక శ్రమ, వ్యాయామము, కోపగించుకొనుట, దుఃఖించుట, అతిగా మాట్లాడుట, అతి చల్లని వాతావరణములో ఉండుట, అధికవేడి మొదలగువానిని విడిచి పెట్టవలెను.

## స్నేహపానము యొక్క ఉపద్రవములు

అయోగ్య వ్యక్తికి స్నేహపానము చేయుట వలన స్థూలకాయము, వాంతి, మలబద్ధకము, జ్వరము, శరీరము బిగుసుకొనిపోవుట, చర్మ రోగ ములు, పాలిపోవుట, వాపు, అర్శస్సు, ఆకలి మందగించుట, దప్పిక, గ్రహణీ రోగము, మాట్లాడుటకు కష్టముకల్గుట, మెలిపెట్టినట్లు నొప్పి, ఆమదోషము మొదలగునవి కల్గుతాయి.

పైన పేర్కొన్న ఉపద్రవములు చికిత్స వమనము, విరేచనము స్వేద నము మొదలగు వానితో చేయవలెను. వీనికి అదనంగా తక్రారిష్ట, పొడి ఆహారము, త్రిఫలాలు మొదలగు వానిని ఇవ్వవలెను.

## స్వేదన చికిత్స ( చెమట పట్టించుట )

స్నేహకర్మ తరువాత స్వేదకర్మ తప్పనిసరిగా చేయడం సర్వసాధార ణము, సుశ్రుత సంహితానుసారము స్వేదకర్మ నాల్గు రకములు అవి తాప స్వేదము, ఊష్మ స్వేదము, ఉపనాహ స్వేదము మరియు ద్రవస్వేదము.

తాపస్వేదము పొడిగా ఉంటుంది. బాగా చేతులతో రుద్దుట, వేడిగా ఉండు లోహము, ఇటుక లేదా ఇసుకతో కాపుట మొదలగు పద్ధతులలో తాపస్వేదము చేయవచ్చును. ప్రభావితమైన భాగమును పైన పేర్కొన్న వస్తువులచే కప్పుట మొదలగునవి తాపస్వేదములో భాగములు.

ఊష్మస్వేదము–బాగా ఎర్రగా కాల్చిన లోహము, ఇటుక లేదా రాయి వంటి పదార్థమును నీరు, కషాయము వంటి ద్రవ పదార్థములలో ముంచి ఆ నీటిని శరీరముపై పోయటము ద్వారా చేయు చికిత్స. సంపూర్ణ శరీర మునకు స్వేదనము చేయవలసిన, రోగిని మంచముపై పడుకోబెట్టి, ఆ నీటిని ధారగాపోసి, శరీరమును దుప్పటితో కప్పి ఉష్మస్వేదము చేయవలెను.

ఉపనాహస్వేదము (కావడము) –నొప్పి లేదా వ్యాధికల భాగముపై లేపము చేసి పట్టీ కట్టుట ఉపనాహ స్వేదము.

ద్రవ స్వేదమనగా ఒక తొట్టి తీసుకుని అందులో కావలసిన కషాయము వేసి ప్రభావితమైన భాగమునుకానీ, లేదా పూర్తి శరీరమును కానీ అందులో ముంచి కాపడము పెట్టుట.

తాప,ఉష్మ స్వేదములు కఫవ్యాధులలో, ఉపనాహ స్వేదము వాత వ్యాధులలో మరియు ద్రవ స్వేదము పిత్త వ్యాధులలో ఉపయుక్తము.

చరక సంహిత ననుసరించి స్వేదము అగ్నిస్వేదము మరియు నిరగ్ని స్వేదము అని రెండు రకములు. 13 రకముల అగ్ని స్వేదనములు తెల్ప బడినవి. అవి పైన పేర్కొన్న నాల్గు రకములలో ఏదో ఒక దానికి చెందు తాయి.

నిరగ్ని స్వేదములు అనగా వ్యాయామము, గాలి చొరబడని గదులలో ఉండుట, శరీరమును దుప్పట్లతో కప్పుకొనుట, చాలాసేపు ఆతపసేవన మొదలగు ప్రక్రియల ద్వారా చెమట పుట్టించుట మొదలగునవి.

**స్వేదన కర్మకు యోగ్యులు**

జలుబు (ప్రతిశ్యాయము), దగ్గు (కాస), ఎక్కిళ్ళు (హిక్కా), దమ్ము (శ్వాస), చెవి, మెడ, తలలో నొప్పి మొదలగునవి. గొంతు బొంగురుపోవుట, గొంతునొప్పి, పక్షాఘాతము, ముఖము వంకరపోవుట,నడుంనొప్పి, అపాన వాతము, కడుపులో నొప్పి, మూత్రము ఆగిపోవుట, తొడలు, కాలిలో నొప్పి, ఏ భాగములోనైనా వాపు, బిరుసుదనము, బరువుగా ఉండుట, శరీరము మొద్దువలె ఉండుట, చలి, వణుకుట మొదలగు వ్యాధులలో స్వేదకర్మ చేయించవలెను.

**స్వేదకర్మకు అయోగ్యులు**

గర్భిణి, రక్తస్రావము, అతిసారము, పొడిదనము, మధుమేహము, హెర్నియా, మద్యము, విషము సేవించినవారు, అలసట, దప్పిక, ఆకలితో ఉండుట, కోపములో ఉన్నవారు, ఆత్రుతతో ఉన్నవారు, కడుపు సంబంధ వ్యాధులు కలవారు, తిమిరము, కామలావ్యాధి కలవారు, పిత్తవ్యాధి పీడి తులు, బాగా లావుగా ఉన్నవారికి, దెబ్బలు తగిలినవారికి, బాగా సన్నగా ఉన్నవారికి స్వేదకర్మ చేయకూడదు.

**సమ్యక్ స్వేద లక్షణములు**

చెమట పట్టుట, శరీరములో తేలికదనము కల్గుట, చలి, నొప్పి, మొద లగు లక్షణములు తగ్గుట సమ్యక్ స్వేద లక్షణములు.

స్నేహకర్మ వాతాన్ని తగ్గిస్తుంది. శరీరములో మృదుత్వాన్ని పెంచుతుంది. మలాలను శిథిలముచేసి బయటకు పంపుటకు ఉపయోగ పడుతుంది. స్వేదకర్మ వలన దోషములు బహిర్గతమవుతాయి. కోష్ఠములోనికి తేబడతాయి. అక్కడ నుండి పంచకర్మ పద్ధతుల ద్వారా బయటకు పంపుటకు వీలుకల్గుతుంది.

**ప్రధాన కర్మలు :**

**వనము (వాంతి చేయించుట)**

ప్రకోపించిన కఫము, సంబంధిత దోషములను తొలగించుటకు వమన కర్మ ఉపయోగపడుతుంది. వమన కర్మలో దోషములు ఆమాశయము నుండి నోటిద్వారా బయటకు పంపబడతాయి. స్నేహ, స్వేదకర్మలను ఆచరించిన పిదప వమనకర్మను ఆచరించవలెను.

వమనకర్మ చేయుటకు ముందురోజు వ్యక్తికి కడుపునిండా కఫకర, అభివ్యందకర ఆహార పదార్ధములను తినిపించి, మరుసటి దినము ప్రాతః కాలమున వమన ద్రవ్యము ఇవ్వవలెను. తరువాత చెరుకు రసము, యష్టి మధుకషాయము లేదా ఉప్పునీటిని ఆకంఠము త్రాగించవలెను. ఇందు వలన వాంతి ప్రారంభమగును. వమన ఔషధము యొక్క మోతాదు దోష ముల ఉత్క్లేశము, వమన సమయము, మరియు వమన సమ్యక్ లక్షణముల ఆధారముగా నిర్ధారించవలెను. వమనమునకు మదన ఫలము, బీజములు 3-5గ్రా॥ల మోతాదులో తేనెలో కలిపి ఇవ్వడం అన్నిటికన్నా ఉత్తమమైనది.

**వమనకర్మకు యోగ్యులు**

జలుబు (పీనస,) చర్మవ్యాధులు (కుష్ఠ), నవీన జ్వరము, దగ్గు(కాస), దమ్ము (శ్వాస), గొంతు సంబంధ వ్యాధులు, గలగండము, బోదకాలు (శ్లీపదము), మూత్ర సంబంధ వ్యాధులు (ప్రమేహము), మందాగ్ని అజీర్ణము, తీవ్రమైన విషప్రభావము, దీర్ఘకాలిక విషప్రభావము, అధోగత రక్తపిత్తము, అర్శస్సు, వాంతి వచ్చునట్లుండుట, రుచి లేకుండుట (అరుచి), సొమ్మ రోగము (అపస్మారము), పిచ్చి (ఉన్మాదము), అతిసారము, వాపు, రక్తహీనత (పాండు), స్తన్యదోషము, కఫరోగములు వమన కర్మకు అనుకూలము.

**వమనకర్మ అయోగ్యులు**

స్థూలకాయము, బాగా కృశించిన రోగి, చిన్నపిల్లలు, శిశువులు, వృద్ధులు, బాగా నీరసించినవారు, అలసినవారు, దప్పికతో, ఆకలితో బాధ పడువారు. బాగా అలసిపోయినవారు అనర్హులు.

ఉపవాసము చేయువారు, నిరుహ, అనువాసనవస్తి చేయించుకున్న వారు, అధికముగా సంభోగము, వ్యాయామము చేయువారు, గర్భిణి, బల హీనముగా ఉండు వ్యక్తులు వమనము చేసుకొనరాదు.

ముక్కు, నోరు మొదలగు భాగముల నుండి రక్తస్రావము కలవారు, వాంతులయినవారు, ఉదావర్తము, గుండెజబ్బులలో బాధపడువారు, మూత్ర మార్గవ్యాధులు, ప్లీహవ్యాధులు, గుల్మము, పౌరుష గ్రంధి వాపుకలవారు, మూర్ఛిల్లినవారు, తలనొప్పితో బాధపడువారు, చెవి, నేత్రముల వ్యాధులు కలవారు వమనమునకు అనర్హులు.

**సమ్యక్ వమన లక్షణములు**

సమ్యక్ వమనములో మొదట కఫము, తరువాత పిత్తము బయటకు వెడలును. ఛాతీ, గొంతు, తలభాగము నిర్మలముగా, తేలికగా అనిపించును.

వమనము సరిగ్గా కాని పరిస్థితులలో (వమన అయోగము) రోగివాంతి చేయడు, లేదా కేవలము త్రాగించిన ఔషధమునే వాంతి చేయును.

వమనము అతిగా అయినచో రోగి రక్తము కక్కును. ఇందువలన అనేక ఉపద్రవములు కల్గును.

సమ్యక్ వమనము కల్గిన తరువాత చేతులు, ముఖము, పాదములు శుభ్రపరచి, ఒకగంటపాటు విశ్రాంతి ఇవ్వవలెను. తరువాత ధూమపానము చేయించి, వమనక్రియ ముగించి సరియగు సంసర్జన కర్మ చేయించవలెను.

**విరేచన కర్మ :** వమన కర్మ పూర్తి అయిన పిదప తిరిగి స్నేహ, స్వేద కర్మలను చేయించవలెను. తరువాత శుభదినమున తెగడవేరు (త్రివృత్) చూర్ణమును 10-15 గ్రా.ల సరియైన అనుపానములో కలిపి విరేచనము చేయించవలెను.

**విరేచనమునకు యోగ్యులు :** చర్మరోగములు (కుష్ఠ), జ్వరము, మూత్ర వ్యాధులు, ఊర్ధ్వగత రక్తపిత్తము, భగందరము, ఉదర సంబంధ వ్యాధులు, అర్శస్సు, గజ్జలలో వాపు, ప్లీహ సంబంధ వ్యాధులు, అర్బుదము, గలగండము, విసర్పము, ప్రక్కటెముకలలో తీవ్రమైన నొప్పి, తలనొప్పి, ఉదావర్తము, అపానవాతము, కండ్లలో నోటిలో మంటగా ఉండుట, గుండెజబ్బులు, మచ్చలు, నోటినుండి, నేత్రములనుండి ముక్కునుండి నీరు, స్రావములు కారుట, రక్తహీనత (పాండు), హలీమకము, దమ్ము (శ్వాస), దగ్గు(కాస), అరుచి, అపస్మారము, పిచ్చి (ఉన్మాదము) వాతరక్తము, యోని దోషములు, శుక్ర దోషము, మూర్ఛిల్లుట, ఆకలి లేకుండుట, వాంతి అగుట, వాపు, తెల్లబట్ట (ప్రదర), మరియు పిత్తజ వికారములు.

**విరేచనములకు అయోగ్యులు :** బాగా దుర్బల ప్రకృతి కలవారికి విరేచనము చేయకూడదు. గర్భిణి, గుదభాగముపై పుండుకలవారు, గుదము బయటకు వచ్చినవారు, అధోగతి రక్తపిత్తము, దీర్ఘకాలము ఉ పవాసము చేసినవారు, జ్ఞానేంద్రియములు బలహీనముగా ఉండుట, అల్పాగ్ని, నిరూహ వస్తి చేయించుకున్నవారు, నవీన జ్వరపీడితులు, మద్యము సేవించువారు, కడుపుబ్బరము కలవారు, శరీరములో ఏదైనా శల్య పదార్థములు చేరినవారు, దెబ్బలతో బాధపడువారు (క్షత), అతిరూక్షులు, క్రూరకోష్టము కలవారు, విరేచనములకు అయోగ్యులు.

**విరేచన అయోగము :** దోషములు పెరుగుట, విపరీతమైన అలసట, జీర్ణశక్తితగ్గుట, శరీరము బరువుగా మారుట, చలి, లావుదనము, ఆకలి లేకుండుట మొదలగునవి అయోగ లక్షణములు.

**సమ్యక్ యోగ లక్షణములు :** మలము, పిత్తము, కఫము, (మ్యూకస్) మరియు వాయువు ఒకదాని వెంట మరొకటి వెడలవలెను. జ్ఞానేంద్రియ ముల నైర్మల్యము, శరీరములో తేలికదనము, ఆకలి పెరుగుట, అన్నిరకము లుగా అనుకూలముగా, హాయిగా ఉండుట, సమ్యక్ విరేచన లక్షణములు.

**అతియోగ లక్షణములు :** తిమ్మిరి, వళ్ళునొప్పులు, అతిగా అలసట, శరీరము వణుకుట, మరియు కఫము, రక్తము, పిత్తక్షయ లక్షణములు, శరీరము పటుత్వము కోల్పోవుట, మూర్ఛ, మానసిక దౌర్భల్యము, నిద్రలేమి, ఎక్కిళ్ళు మొదలగునవి.

రోగికి విరేచన సమ్యర్యోగలక్షణములు కలిగిన పిమ్మట సంసర్జన కర్మ చేసి తొమ్మిదవరోజు నెయ్యి లేదా అనువాసన వస్తిని ఇవ్వవలెను.

**వస్తి (ఎనీమాథెరపి)**

గుదమార్గముద్వారా ఔషధములను ఇచ్చుటను వస్తి అంటారు. వాత దోష చికిత్సకు వస్తి చాలా ప్రయోజనకరమైన చికిత్స. వ్యాధుల చికిత్సకే కాకుండా, ఆరోగ్యము, ఆయుః ప్రమాణము, సంతోషము, శారీరక బలము, జీర్ణశక్తి, మేధాశక్తి, స్వరము మరియు శరీర వర్ణము, కాంతి పెంపొందించు కొనుటకు కూడా ఉపయోగించవచ్చును. వస్తి, అవసరమైన మలమును, కఫమును, పిత్తమును, అపానవాతమును, మూత్రమును బయటకు పంపి వేస్తుంది. వస్తి శరీరానికిపటుత్వాన్ని దృఢత్వాన్ని కల్గిస్తుంది. శుక్రమును పెంపొందిస్తుంది. శరీరానికి శక్తిని కల్గిస్తుంది.

నిరుహవస్తి, అనువాసన వస్తులని వస్తికర్మ రెండు ప్రకారములు. స్నేహ ద్రవములతో కూడిన వస్తిద్రవ్యము ప్రయోగించిన అది అనువాసనవస్తి, కేవలము కషాయ ద్రవ్యములలోనే వస్తి చేసిన అది నిరూహవస్తి (ఆస్థాపన వస్తి) అంటారు.

విరేచన కర్మ అనంతరము రోగికి స్నేహ ద్రవ్యములు ఇచ్చు సమయ ములో, తైలాభ్యంగము చేయించి నిరూహవస్తి ఇవ్వవచ్చును. నిరూహవస్తి 7 రోజులకన్నా ఎక్కువగా ఇవ్వకూడదు. అదే విధముగా నిరూహవస్తి చేయునపుడు ఏడురోజులలోపు విరేచనము ఇవ్వకూడదు.

**నిరూహవస్తి యోగ్యములు :** 80 రకముల వాత వ్యాధులలో నిరుహ వస్తి ఉపయోగించవచ్చును. పక్షాఘాతము, కుక్షిరోగములు, ఆధ్మానము, విబంధము, మూత్రాఘాతము, శుక్రనిరోధము, బలక్షయము, వర్ణక్షయము, మాంసక్షయము, అంగసుప్తి, కృమి, గుల్మ, ఉదావర్త, పర్వ భేదము, అభితాపము, ప్లీహ, హృదయ రోగములు, భగందరము, ఉన్మాదము, జ్వరము, గజ్జలలోవాపు, తలనొప్పి, ఎముకలలోనొప్పి, పిరుదులు, మోకాళ్ళ, తొడలు, మడమలు, పాదములు, చేతులు,వేళ్ళు,పండ్లు,గోళ్ళు, మొదలగు వానిలో నొప్పి, ప్రక్కలలో, వీపులో, పిరుదులలో జడత్వము, కంప, ఆక్షేప, గౌరవము, శోష, స్థంభ, కడుపులో గడబిడ, దుర్గంధము గల మలము, మూత్రము విసర్జించుట మొదలగునవి.

**నిరుహ అయోగ్యాలు :** అజీర్ణము, అతిస్నిగ్ధత, మందాగ్ని, అలసిపోవుట, బలహీనత, ఆకలి, దప్పిక, బాగా కృషించిపోవుట, భోజనము చేసిన వెంటనే విరేచనము. శిరో విరేచనము, కోపగించిన తరువాత, భయము, విషప్రభా వము, దమ్ము, ఆయాసము, ఎక్కిళ్ళు, అంత్రశోధ, వ్రణము, ఆధ్మానము, ఆలసకము, విషూచిక, గర్భస్రావము,విరేచనములు, ఆమాతీసారము, మధు మేహము, మరియు చర్మ రోగములు.

**అనువాసన వస్తి యోగ్యులు :** నిరుహవస్తి చేయదగిన అన్ని సందర్భా లలో అనువాసనవస్తి ఇవ్వవచ్చును. ప్రత్యేకించి రూక్ష శరీరము కలవారు, తీక్షాగ్ని కలవారు మరియు వాత వ్యాధి పీడితులకు అనువాసన వస్తి ఉప యుక్తము.

**అనువాసన వస్తి అయోగ్యులు :** నిరుహవస్తికి సంబంధించిన అన్ని అయోగ్యతలు, మరియు ఏవిధమైన ఆహారము సేవించక ఖాళీ కడుపుతో ఉన్నవారు, నవీన జ్వరపీడితులు, రక్తహీనత, కామెర్లు, ప్రమేహము, అర్శస్సు,

ప్రతిశ్యాయము, అరుచి, మందాగ్ని, దౌర్బల్యము,ప్లీహ రోగములు, కఫజ ఉదర రోగములు, ఉరుస్తంభ, పలుచగా మలము వచ్చుట, విషముతో కూడిన అజీర్ణము. కఫము, పిత్తము స్రవించుట, ఉరుస్తంభ, గట్టిగా మలము స్రవించుట, శ్లీపదము, గలగండము, అరుచి, ఉదరకృమి మొదలగునవి.

**వస్తిక్రమము :** నిరుహవస్తి ఇచ్చిన తరువాత, లోనికి పంపిన కషాయ మంతయూ బయటకు వచ్చిన తరువాత,మధ్యాహ్నము, సాయంత్రము ఆహా రము ఇవ్వవలెను. నిరుహవస్తి ఇచ్చిన రెండవ రోజు, మూడవ మరియు ఐదవ రోజు అనువాసన వస్తి ఇవ్వవలెను. కఫ వ్యాధులలో 1-3 వస్తులు ఇవ్వవలెను. పిత్తజ వ్యాధులలో 5-7, వాత వ్యాధులలో 9-11 వస్తులు ఇవ్వవచ్చును.

**వస్తి ప్రభావము :** నిరుహవస్తిచే నిర్మలమై, శుద్ధిచేయబడిన స్రోతస్సులు అనువాసన వస్తిచే బలపరచబడి,శరీరమునకు కాంతి, బలము కల్గించును. స్నేహవస్తి రూక్షతను, లాఘవత్వాన్ని, శీత గుణాన్ని తగ్గించి వాతాన్ని నియంత్రి స్తుంది.అనువాసన వస్తి వలన మనోనైర్మల్యము, బలము, కాంతి మరియు చక్కటి జీర్ణశక్తి లభిస్తాయి.

**నిరుహవస్తి సమ్యగ్యోగము :** మలము, మూత్రము, అపానవాతము సరిగా బయటకు వెడలుట, ఆకలి పెరుగుట, శరీరము, పక్వాశయము తేలికగా తోచుట, వ్యాధి లక్షణములు తగ్గుట, ఆరోగ్యము పునరుద్ధరింప బడుట, శరీర పటుత్వము పెరుగుట మొదలగునవి నిరుహవస్తి సిద్ధ లక్షణ ములు.

**అయోగలక్షణములు :** తలనొప్పి, గుండెభాగములో నొప్పి, కడుపు, గుద భాగములో వాపు, జలుబు, పొడిచినట్లుగా నొప్పి, వాంతి వచ్చినట్లుం డుట, అపానవాత నిరోధము, మలమూత్ర నిరోధము, శ్వాస, అయోగ లక్షణములు, విరేచన అతియోగములో చెప్పబడిన అన్ని వ్యాపత్తులు అతి యోగముగా పరిగణింపవలెను.

**అనువాసన సమ్యగ్యోగలక్షణములు :** స్నేహద్రవ్యము మలముతో కూడి తిరిగి పూర్తిగా బయటకు వచ్చుట, రక్తధాతు శుద్ధి, మేధస్సు నిర్మలమగుట, జ్ఞానేంద్రియములు నిర్మలముగా ఉండుట, నిద్రవచ్చుట, శరీరము సుఖముగా ఉండుట, పటుత్వము పెరుగుట,మలమూత్రాదులు సరిగ్గ బయటకు వెడలుట మొదలగునవి.

**అయోగలక్షణములు :** శరీరము యొక్క అధోభాగములో వేదన, కడుపు, చేతులు,వీపు,ప్రక్కటెముకలలో వేదన, చేతులు కాళ్ళు రూక్షముగా అగుట, మల,మూత్ర,అపానవాత అవరోధము అనువాసనవస్తి అయోగ చిహ్నములు.

వాంతి వచ్చునట్లుండుట, మత్తుగా ఉండుట, అలసిపోవుట, మూర్ఛ, గుద భాగములో కోసినట్లుగా నొప్పి మొదలగునవి అనువాసనవస్తి అతి యోగ లక్షణములు.

**శిరో-విరేచనము :** ముక్కు ద్వారా వివిధ ఔషధముల ప్రయోగము చేయుటను నస్యము (శిరోవిరేచనము) అంటారు. వమన విరేచనములతో నిర్మలమైన శరీరము కల వ్యక్తికి, అరచేతులలో స్నేహ పదార్ధములు తీసుకొని ముఖముపై మర్ధన చేసి దోషముల స్థితిననుసరించి నస్యము చేయించవలెను.

**శిరోవిరేచన యోగ్యములు :** శిరోరోగములు, బిగుసుకొని పోయినట్లున్న మెడ, గొంతులో మెలిపెట్టినట్లుండుట, దవడ పట్టుకుపోవుట, పీనసము, గలాయు,తిమిరము, జిహ్వాశోధ, పార్శ్వశూల, మెడరోగాలు, భుజాలు,నోరు, చెవులు, కండ్లు, నుదురు, సంబంధ వ్యాధులు, అపస్మారము, గలగండము, దంతవేదన, చలదంతములు, కంటిజబ్బులు, అర్బుదము, స్వరభంగము, మాటపడిపోవుట, ఊర్ధ్వజత్రుగత వ్యాధులు.

**శిరోవిరేచన నిషిద్ధులు :** శిరోవిరేచనము మేఘములు ఆవరించినపుడు చేయకూడదు. విరేచనము లేదా అనువాసన వస్తులు ఇచ్చినవారికి నస్యము చేయకూడదు. అజీర్ణముతో బాధపడువారు అపుడే స్నేహయుక్త ఆహారము తీసుకున్న వ్యక్తులు, దప్పికతో బాధపడువారు, శిరస్నానము చేసినవారు, ఆకలితో ఉన్నవారు, అలసినవారు, తలస్నానము చేసినారు, మూర్ఛితులు, మైధునము, వ్యాయామములలో అలసినవారు, గర్భిణి, జలుబుతో బాధపడు వారికి శిరోవిరేచనము చేయకూడదు.

**శిరోవిరేచన సమ్యగ్యోగము :** శిరస్సు మరియు ఛాతీ ప్రదేశములు, జ్ఞానేంద్రియములు, శరీరావయవములను (స్రోతస్సులను) నిర్మలముగా ఉండుట శిరోవిరేచన సమ్యక్ లక్షణముగా గ్రహించాలి. కంఠము నుండి కఫస్రావము తగ్గి, శుభ్రమగును.

శిరోగురుత్వము, లాలాస్రావము, మొదలగు లక్షణములు శిరోవిరేచన అయోగ లక్షణములు శిరస్సు, నేత్రములు, కంఠము మరియు కర్ణములందు

నొప్పి, మరియు మూర్ఛ అతియోగ లక్షణములుగా గ్రహించాలి.

**నస్యము :** నాసామార్గము ద్వారా వివిధ ప్రకారముల ఔషధములు, ఆహారము అందజేయుట ఎంతో ఉపయోగకరమైన చికిత్సా విధానము. నిపుణుడైన వైద్యుడు నాసామార్గము ద్వారా, బృంహణ, శోధన, శమన ఔషధములు ఇవ్వగలడు. చెవి, ముక్కు, గొంతు మరియు ఇతర ఊర్ధ్వ, జతృగత వ్యాధులు కూడా తగ్గించవచ్చు. బిగుతుగా ఉండుట, తిమ్మిరి, బరువుగా ఉండుట, మొదలగునవి శోధన చికిత్స ద్వారా తొలగించవచ్చు. శిరఃకంప, అర్జిత, రక్తస్రావము మరియు ఇతర వాత వ్యాధులలో తర్పణము మొదలగువానికి నశ్యము ఉపయుక్తము.

**పశ్చాత్కర్మ**

**(శోధనానంతర పరిచర్య)**

శోధనప్రక్రియ ముగిసిన తరువాత ఎక్కువగా నిలబడుట, కూర్చునుట, మాట్లాడుట, వాహనములు అధిరోహించుట, దివాస్వప్నము, మైధునము, ప్రాకృతిక సహజవేగములను ఆపుట, చల్లటి పదార్థములు సేవించుట, ఎండవేడి, చిరాకు, కోపము, ఆ సమయ భోజనములు మొదలగునవి మానివేయవలెను.

**సంసర్జన కర్మ**

శోధనప్రక్రియ ద్వారా బలహీనపడిన జీర్ణశక్తి, శరీరబలము, పటుత్వము, ఓజస్సు తిరిగి పొందుటకు సంసర్జన కర్మ తెలుపబడినది. క్రమ క్రమముగా ఆహారము, వ్యాయామములను సేవించు విధానము సంసర్జన కర్మయందు తెలుపబడినది. ఆహారమును క్రమముగా రోగి బలానుసారము పేయూ, విలేపి, కృతయూష, అకృతయూష, మాంసరసము మొదలగు వానిని ఇవ్వవలెను.

**శోధనము జరిగిన వ్యక్తికి సరిపడు సంసర్జన కర్మ వివరములు**

శోధనము జరుపబడిన రోజు సాయంత్రము యవాగు ఇవ్వవలెను. తరువాత రెండవ, మూడవ ఆహార సమయములలో యవాగు, నాల్గవమారు విలేపి ఇవ్వవలెను. తరువాత ఐదవ ఆరవ సమయములలో విలేపి ఇచ్చి ఏడవ పర్యాయము కృత అన్నము ఇవ్వవలెను. (కిచిడి) తరువాత ఎనిమిదవ, తొమ్మిదవ పర్యాయులు కిచిడి ఇచ్చి, పదవ సమయమునకు మాంసరస ముతో కూడిన అన్నమును ఇవ్వవచ్చును. తరువాత పదకొండవ మరియు

పన్నెండవ పర్యాయము ఈ ఆహారమునే ఇచ్చి తదుపరి సాధారణ ఆహారము ప్రారంభించవలెను.

(ప్రతిరోజు మూడుమార్లు భోజనసమయముగా పరిగణించి పైన తెల్పిన సంఖ్య అన్వయించుకొనవలెను.) కేవలము వమన, విరేచనములు మాత్రమే పంచకర్మకాదు. పంచకర్మ ఒక సంపూర్ణ చికిత్సా ప్రక్రియ. వివిధ వ్యాధులలో, వ్యాధి కారకరములైన దోషములను సంపూర్ణముగా తొలగింపజేసి, వ్యాధులను నివారింపజేయు శక్తి కలది కనుక పంచకర్మ అత్యంత ప్రధానమైన చికిత్సా పద్ధతి.

పంచకర్మల నుండి చక్కటి ప్రయోజనములు పొందుటకు, చికిత్సల సంపూర్ణ స్వరూపమును అవగతము చేసుకొని యోగ్యత, అయోగ్యతలు, ఉపద్రవములను సమగ్రముగా దృష్టియందుంచుకొని చికిత్సలను చేయుట చాలా అవసరము.

## రసాయన మరియు వాజీకరణ

సంక్షిప్తముగా ఆయుర్వేద వైద్యము రెండు విభాగములు. ఇందులో మొదటిది బలవృద్ధిని కల్గించుట మరియు ఆరోగ్యవంతుని యొక్క ఆరోగ్య మును పెంచుట రెండవది రోగియొక్క వ్యాధిని నశింపచేయుట. రసాయన మరియు వాజీకరణ చికిత్సలు మొదటి విభాగములోకి వచ్చును. ఈ రెండు ప్రక్రియలు బలమును పెంచి, ఆరోగ్యవంతుని యొక్క ఆరోగ్యమును పెంపొం దించును.

## రసాయనము

రసాయనమనగా దీర్ఘాయువును ప్రసాదించు చికిత్సా ప్రక్రియ. ఇందు వయఃస్థాపనము, మానసిక మరియు శారీరక ఆరోగ్యమును జ్ఞాపకశక్తి, వ్యాధి నిరోధక శక్తిని పెంపొందించును. ఈ చికిత్స మధ్య వయస్కులకు సమయానుకూలముగా చేయించినచో ఉత్తమ వయఃస్థాపన ప్రక్రియగా ఉపయోగపడును. ఈ విధంగా వాడిన చ్యవన ఋషి యవ్వనాన్ని పొందినా డని ఉదాహరణలు కలవు.

రసాయనము అనగా – ధాతువులకు సరియైన పోషణ లభించుట. మానవ శరీరములోని ధాతు, అగ్ని మరియు స్రోతస్సుల యొక్క బలమును పెంచి, శరీర బలమును పెంపొందించుటతోపాటు మానసిక శక్తి మరియు వ్యాధి నిరోధక శక్తిని పెంచుతుంది.

రసాయన చికిత్సలను రోగిని ప్రత్యేకమైన ప్రదేశములో ఉంచి చేయుట కుటీ ప్రవేశిక. వారి ఇంటివద్దనే ఉంచి మామూలు దినచర్యకు భంగము కాకుండా చేయు రసాయన చికిత్సా ఫలము పొందుటకు ముందుగా శోధన చికిత్సలు చేయుట తప్పనిసరి.

ఆయుర్వేద గ్రంధకర్తల అనుసారము రసాయనము 4 రకములుగా చెప్పబడినది. అవి

1. కామ్య రసాయన 2. నైమిత్తిక రసాయన 3. మేధ్య రసాయన 4. ఆచార రసాయనము.

**1. కామ్య రసాయనము :** ఔషధములు స్వస్థ వ్యక్తుల స్వాస్థ్యము మరియు బలములను చక్కగా నుంచునో దానిని కామ్య రసాయనమందురు.

**2. నైమిత్తిక రసాయనము :** వ్యాధి పీడితులకు బలవృద్ధి కల్గించుటకు ప్రయుక్త ఔషధములను నైమిత్తిక రసాయనమందురు. వీనిని విశిష్ట వ్యాధులందు చికిత్స కొరకై ప్రయోగము చేయవలయును. తద్వారా రోగి శీఘ్రముగా స్వస్థత పొందును.

**3. మేధ్య రసాయనము :** ఈ రసాయనౌషధములు స్మృతి మరియు మేధా శక్తిని పెంపొందించును. శంఖపుష్పి, బ్రాహ్మి, వచా మొదలగునవి ఈ కోవలోకి చెందుతాయి.

**4. ఆచార రసాయనము :** సరియైన, ఆమోదయోగ్యమైన వ్యక్తిగత ప్రవర్తనను ఆచార రసాయనము అంటారు. సత్యము పలుకుట, శారీరక, మానసిక పరిశుభ్రత, బాధ్యతాయుతమైన ప్రవర్తన, దినచర్య, ఋతుచర్యలను తు.చ తప్పకుండా పాటించుట, ఆధ్యాత్మిక జిజ్ఞాస కలిగియుండుట, అహింసా ప్రవృత్తి కలిగియుండుట. అనవసర క్రోధము, శ్రమ, విడిచిపెట్టుట, మత్తు పదార్ధముల సేవన, వ్యభిచారము, జూదము మొదలగు వ్యసనములకు బానిస కాకుండుట మొదలగునవి ఆరోగ్యకరమైన దీర్ఘజీవనానికి తప్పనిసరిగా ఆచరించవలసిన నియమములు.

రసాయన చికిత్సకై ఉపయోగపడు ఏకమూలికా ప్రయోగాలు, సామాన్య యోగములు, ఔషధ యోగములు క్రింద తెలుపబడినవి.

**ఏకమూలికా ప్రయోగము మరియు సామాన్య యోగములు**

1. భృంగరాజ (గంటగలగర) సమూల స్వరసము : 14-28 మి.లీ. ప్రమాణములో రోజుకు రెండుమార్లు ఒక మాసము వరకు ప్రయోగించ

వలయును. ఈ చికిత్సా కాలమున రోగి కేవలము పాలు మాత్రమే ఆహార
ముగా వాడవలెను.

2. భోజనమునకు ముందు 2 తానికాయ (విభీతకి ఫలమజ్జ) చూర్ణము 4 ఉసిరికాయల (ఆమలకీ ఫలమజ్జ) చూర్ణము తీసుకొని, మరియు 1 కరక్కాయ చూర్ణమును భోజనము తరువాత 2-4 గం॥కు, తేనె మరియు నెయ్యితో కలిపి ఒక సంవత్సరకాలము వరకు వాడవలెను.

3. మండూకపర్ణి (సరస్వతి ఆకు) స్వరసము 6-14 మి.లీ. యష్టిమధు (అతిమధురము) చూర్ణము 1-2 లేదా గుడూచి (తిప్పతీగ) స్వరసము 6-15 మి.లీ. లేదా శంఖపుష్పి సమూలము, కల్కము 12గ్రా. పాలతో దినమునకు రెండుమార్లు వాడవలెను.

**ఔషధ యోగములు**

**1. చ్యవన ప్రాశము :** 12-24 గ్రా. దినమునకు 3 మార్లు 100-250 మి.లీ. పాలతో వాడవలెను.

**2. బ్రాహ్మీ ఘృతము :** 12-24 గ్రా. 100-250 మి.లీ. పాలతో దినమునకు రెండుమార్లు వాడవలెను.

**3. శతావరీ ఘృతము :** 12-24 గ్రా. 100-250 మి.లీ. పాలలో దినమునకు రెండుమార్లు వాడవలెను.

**4. వసంతకుసుమాకరము :** 60-120 మి.గ్రా. తేనెతో తీసుకొని 100-250 మి.లీ. పాలు త్రాగాలి.

**5. మహాలక్ష్మి విలాస రసము :** 60-120 మి.గ్రా. తేనెతో దినమునకు 3 మార్లు వాడవలెను.

**6. మకర ధ్వజము :** 30-36 మి.గ్రా. తేనెతో దినమునకు 3 మార్లు వాడవలెను.

**7. ధాత్రీ రసాయము :** 12-24 గ్రా. 100-250 మి.లీ. పాలతో దినమునకు 3 మార్లు వాడవలెను.

**8. అమృత ప్రాశము :** 12-24 గ్రా. 100-250 మి.లీ. పాలతో దినమునకు 3 మార్లు వాడవలెను. ఇది బరువును పెంచుటకు ఉప యోగపడును.

**9. అగస్త్య హరీతకి :** 12-24గ్రా. 100-250 మి.లీ. పాలతో దినమునకు 3 మార్లు వాడవలెను. ఇది స్థూలకాయము కల వ్యక్తుల శరీర భారము తగ్గించును.

**10. పూర్ణచంద్ర రసము :** 60–120 మి.గ్రా. తేనెతో తీసుకొనిన అనంతరము 100–250 మి.లీ. పాలు త్రాగాలి.

**11. అభ్రకభస్మము :** 60–120 మి.గ్రా. తేనెతో తీసుకొనిన అనంతరము 100–250 మి.లీ. పాలు త్రాగాలి.

## వాజీకరణము

వాజీకరణ చికిత్స ఆయుర్వేద అష్టాంగాలలో ఒకటి. లైంగిక సామర్థ్యము పెంచుటకు, ఆరోగ్యము పెంపొందించుటకు, లైంగిక సామర్థ్యము సన్నగిల్లినవారికి చికిత్స చేయుటకు వాజీకరణ చికిత్స ఉపయోగపడుతుంది. శరీరమునకు పటుత్వమును, బలమును, సంభోగేచ్ఛను పెంపొందించునది. జననేంద్రియాలను ఉత్తేజపరచునది,సంభోగమునందు ఆనందమును పెంపొందించు చికిత్స వాజీకరణము.

వాజీకరణ ఔషధములు బాగా పనిచేయుటకు, వాజీకరణ చికిత్సకు ముందు శోదన చికిత్స చేయుట తప్పనిసరి. వాజీకరణ ఔషధములు నాల్గు రకాలుగా పేర్కొనబడినాయి. అవి శుక్రల, శుక్రరేచ, శుక్ర స్తంభన, శుక్ర శోషకములు.

ముందుశోధన కర్మలు ఆవశక్యముగా చేయవలయును. వాజీకరణమున ప్రయోగించు ఔషధము 4 వర్గాలలో విభజించిరి. అవి శుక్రల, శుక్ర రేచక, శుక్రస్తంభకము మరియు శుక్ర శోషకములుగా పిలుతురు.

**1. శుక్రలము :** ఏ ఔషధములు శుక్రము యొక్క మాత్ర మరియు గుణములు పెంచునో దానిని శుక్రల మందురు. అశ్వగంధ, ముసలి, పంచదార, శతావరి మొ॥నవి ఈ వర్గమునకు చెందినవి. ఈ ఔషధములు శుక్రమునందు కణముల సంఖ్య తగ్గించుట లేక అసలు లేని పరిస్థితులలో ఉపయోగపడతాయి.

**2. శుక్ర రేచకము :** ఏ ఔషధములు శుక్ర స్థలనమున సహాయము చేయునో వానిని శుక్రరేచక మందురు. బృహతి ఫలము మరియు స్త్రీలు ఈ వర్గములో చేర్చబడినవి. ఆ స్థలన శుక్రము (ఎస్పర్మియా) లాంటి స్థితులందు ఈ ఔషధములు ఉపయోగింతురు. పాలు, మినుములు, భల్లాతక ఫలమజ్జా, ఆమలకీ మొ॥నవి శుక్రలములు మరియు శుక్రరేచకములు.

**3. శుక్ర స్తంభకము :** ఏ ఔషధములు శుక్రము బయట పడకుండ మైథన సమయమును పెంచునో వానిని శుక్రస్తంభక మందురు. జాతీ

ఫలము ఈవర్గంలో చేర్చిరి. వీనిని శీఘ్ర వీర్యస్థలనమునందు ఉపయో గింతురు.

**4. శుక్ర శోషకము :** ఏ ఔషధములు శుక్రమును శోషింపచేయునో దానిని శుక్ర శోషక మందురు. కరక్కాయ ఈ వర్గమునకు చెందినది.

సామాన్యముగా ప్రయోగించు వాజీకరణ ఔషధములు క్రింద తెలుపబడినవి.

**ఏకమూలికా ప్రయోగములు**

1. అశ్వగంధవేరు చూర్ణము 1–3 గ్రా.లేదా ముసలివేరుచూర్ణము 1–3 గ్రా. లేదా శతావరీ వేరుచూర్ణము 1–3గ్రా. లేదా కపికచ్ఛు బీజ చూర్ణము 1–3 గ్రా. లేదా విదారిగంధ చూర్ణము 1–3 గ్రా.లేదా నాగబలా చూర్ణము 1–3 గ్రా. 100–250 మి.లీ. పాలతో దినమునకు రెండు మార్లు సేవించిన ఈ ఔషధములు శుక్రజననమునకు ఉపయోగపడును.

2. ఖర్జూరము 25–50 గ్రా. 100–250 మి.లీ. పాలతో దినమునకు మూడుమార్లు తీసుకొనిన ఇది శుక్రరేచనము చేయును.

3. భంగ పత్రచూర్ణము 200–500 మి.గ్రా 4–6 గ్రా. తేనెతో మరియు 100–250 మి.లీ. పాలతో దినమునకు 3 మార్లు తీసుకొనిన ఇది శీఘ్ర వీర్య స్ఖలనమున స్తంభమునకు ఉపయోగపడును.

4. జాతీఫల చూర్ణము 1–3 గ్రా. 100–250 మి.లీ. పాలతో శీఘ్ర వీర్య స్ఖలన పరిస్థితి యందు దినమునకు రెండుమార్లు వాడవలెను.

5. జాపత్రిచూర్ణము 1–3 గ్రా. 100–250 మి.లీ. పాలలో దినము నకు రెండుమార్లు సేవించుట శీఘ్ర వీర్యస్ఖలనమున ఉపయోగకరము.

6. లవంగముల చూర్ణము 1–3 గ్రా. 100–250 మి.లీ. పాలతో శీఘ్రవీర్య స్కలనమున దినమునకు రెండుమార్లు వాడవలెను.

**ఔషధ యోగములు**

1. వసంత కుసుమాకర రసము 60–120 మి.గ్రా. 100–250 మి.లీ. పాలతో దినమునకు రెండుమార్లు వాడవలెను.

2. మకరధ్వజవటి 60–120మిగ్రా.తేనె శర్కరలు జేర్చి దినమునకు రెండుమార్లు వాడవలెను.

3. అశ్వగంధఘృతము 12–24 గ్రా. 100–250 మి.లీ. పాలతో దినమునకు మూడుసార్లు వాడవలెను.

4. బృహత్ ఛాగల్యాది ఘృతము 12–24 గ్రా. 100–250 మి.లీ.

పాలతో దినమునకు మూడుమార్లు వాడవలెను.

5. మృత సంజీవని సురా 7-14 మి.లీ. సమాన మాత్రలో నీరు చేర్చి రోజుకు రెండుసార్లు భోజనము తరువాత ఇవ్వాలి.

6. ధాతుక్షయ రోగచికిత్స యందు చెప్పబడిన విశిష్ట మాంసాహార ములు మరియు ఇతర ఔషధములను కూడ వాజీకరణము నందు ఉప యోగించవచ్చును. శ్రీ గోపాల తైలమును లింగముపై రాసుకోవాలి.

**1. శరీరం యొక్క ఎత్తుననుసరించి, కనిష్ఠ మరియు గరిష్ఠ శారీరక భారము**

| ఎత్తు(సె.మీ.) | శారీరక బరువు (కి.గ్రా.) | | | |
|---|---|---|---|---|
| | పురుషులు | | స్త్రీలు | |
| | కనిష్ఠ పరిమితి | గరిష్ఠ పరిమితి | కనిష్ఠ పరిమితి | గరిష్ఠ పరిమితి |
| 144 | 34.1 | 59.0 | 32.7 | 57.2 |
| 152 | 37.0 | 64.4 | 35.6 | 62.6 |
| 160 | 42.2 | 69.9 | 40.8 | 68.1 |
| 168 | 46.4 | 76.7 | 45.0 | 74.9 |
| 175 | 50.4 | 83.5 | 49.0 | 81.7 |
| 183 | 55.7 | 91.7 | 54.3 | 89.9 |

| 2. సాధారణ నాడీ మరియు శ్వాసగతుల సంఖ్య | | |
|---|---|---|
| వయస్సు | ప్రతి నిముషమునకు | |
| | నాడీ గతి | శ్వాస సంఖ్య |
| నవజాత శిశువు (అప్పుడే పుట్టినబిడ్డ) | 140–130 | 35 |
| మొదటి సంవత్సరము | 130–115 | 35 |
| రెండవ సంవత్సరము | 115–100 | 25 |
| మూడవ సంవత్సరము | 100–95 | 25 |
| నాలుగు–పధ్నాలుగు సంవత్సరాలు | సగటు–74 | 20 |
| యుక్త వయస్కులు | సగటు–72 | 18 |
| ముసలితనము | సగటు–70 | 18 |

| 3. సాధారణ రక్త చాపము యొక్క విలువలు | | |
|---|---|---|
| వయస్సు (సం॥లలో) | రక్త చాపము (బి.పి.) మి.మీ. | |
| | సిస్టోలిక్ | డయాస్టోలిక్ |
| 15–19 | 105–129 | 73–81 |
| 20–24 | 108–132 | 75–83 |
| 25–29 | 109–133 | 76–84 |
| 30–34 | 110–134 | 77–85 |
| 35–39 | 111–135 | 78–86 |
| 40–44 | 112–137 | 79–87 |
| 45–49 | 115–139 | 80–88 |
| 50–54 | 116–142 | 81–89 |
| 55–59 | 118–144 | 82–90 |
| 60–64 | 121–147 | 83–90 |

## జాగ్రత్తలు

1. ప్రతిరోజూ కషాయము తయారుచేసికొనుచుండుట మంచిది. లేదా ఆ కషాయమును మూడురోజుల వరకు నుపయోగింపవచ్చును. అయిదు రోజులు వరకు కూడ నుపయోగించుట సామాన్య పక్షము. 3 లేక 5 రోజులు ఉంచుకునే యెడల ప్రతిరోజు ఉదయము ఒకసారి కొద్దిగ వెచ్చచేయుచుండవలయును. లేనిచో బూజుకట్టి చెడిపోవును. ఉదయము వెచ్చపెట్టిన కషాయమును మరల వెచ్చపెట్టకుండగనే రాత్రి పరుండు వరకు ఉపయోగింపవచ్చును. అయిదు రోజులు అయిన పిదప మరల క్రొత్త కషాయమును పెట్టుకొనవలయును. కషాయము కాచునప్పుడు పైన మూత పెట్ట కూడదు. ఇతర సమయములలో మూత తప్పక యుండవలయును. కషాయము క్రొత్త కుండలో పెట్టుకొనుట మంచిది. మోతాదు 3-4-5 తులముల వరకు.

2. చూర్ణములు, మాత్రలు, భస్మములు, మెత్తగ చేయబడిన రసౌషధ ములు మొదలగువానిని నోటిలోవేసుకొని మ్రింగి, వెంటనే కషాయము మొదలగు ద్రవానుపానమును త్రాగవచ్చును. లేదా దానిలో కలుపుకొని త్రాగవచ్చును.

3. ఆయా రసములనువేసి ఆయా మాత్రలు మొదలగునవి కట్టుకొన మని చెప్పినప్పుడు కొద్దిగ రసమును పోయుచు అన్నియు కలసి మెత్తనగు వరకు మర్ధించి అసలు మందు యొక్క మోతాదుకు సరిపోవునట్లు మాత్రలు మొదలగువానిని చేసికొనవలయును.

4. వసంత కుసుమాకరము మొదలగువానిని మాత్రలుగ చేయునప్పుడు చేతికి అంటుచున్న యెడల త్రిఫలాచూర్ణము మాత్రలుగ చేసి సీసాలో వేసి నప్పుడు కలసి ముద్దగ అగునని తోచినచో అందు త్రికటు చూర్ణము మొద లగువానిని చల్లవలయును.

5. క్రవ్యాది మొదలగు వానిని మాత్రలుగచేసి సీసాలో వేసినప్పుడు కలసి ముద్దగ అగునని తోచినచో అందు త్రికటుచూర్ణము మొదలగువానిని చల్లవలయును.

6. కషాయమునకు చెప్పబడిన ద్రవ్యమునకు పరిమితి చెప్పనియెడల, ఆ కషాయము ఎన్నిదినములకు ఉపయోగింపదలచినచో ఆ దినములను బట్టియు వస్తు సముదాయమునుబట్టియు ఒక్కొక్కటి సుమారు 5-6 తుల ముల చొప్పున గ్రహింపవలయును.

7. వేడినీళ్ళు, పాలు, మొదలగు సామాన్య అనుపానములను చెప్పినప్పుడు గ్రుక్కెడు వేడినీళ్ళను పావుశేరు లేక పావుసేరులో సగము ఆవు పాలును ఇట్లు యుక్తినిబట్టి వూహింపవలయును.

8. ఈమందును ఈ మోతాదులో వాడమని చెప్పినప్పుడు వ్యాధి స్వభావమును బట్టియు, మందు యొక్క స్వభావమునుబట్టియు రోజుకు 2-3-4-5-6 సార్లు వాడవలెను.

9. మాత్రలు మొదలగు కొన్నిటికి ద్రవానుపానము చెప్పనియెల కొద్దిగా వేడినీటినిగాని చన్నీటిని గాని అనుపానముగా నుపయోగింపవచ్చును.

10. వ్రాసిన అనుపానదినుసులలో కొన్ని దొరకనియెడల వానికి సమానగుణముగల వస్తువులను చేర్చుకొనవలయును. లేదా ఆ వస్తువును మాని మిగతావస్తువులను గ్రహింపవలయును. సరిగ గ్రహించుటయే శ్రేష్ఠము.

11. 2,3,4, వస్తువులను చెప్పి 2,3 రెట్లు అని చెప్పినప్పుడు అన్నిటి యొక్క చూర్ణమును కలిపియే 2,3 రెట్లు అని గ్రహింపవలయును.

12. తేనె, నెయ్యి, పంచదార మొదలగు అనుపానములను మందు బాగుగ కలియునంతవరకు నుపయోగింపవలయును.

13. వ్రాసిన అనుపానములు ఏకారణము చేతనైనను సందర్భ (సరిగాపనిచేయని) పడని యెడల సామాన్యముగ సందర్భపడు తేనె, నెయ్యి, పంచదార, వెన్న, జలము మొదలగు అనుపానములతో వాడవలయును.

14. వాసిన అనుపానములను దేని కాల తత్వాదులనుబట్టి మార్చి వేరు విధముగ పరికల్పించు కొనవచ్చును.

15. మందుల యొక్క స్వభావమునుబట్టి అనుపానములను వ్రాసితిమిగాన ఈ అనుపానములను ఇంకొకరి మందులకు సమకూర్చుట అంతమంచిదికాదు.

16. ఏదైన నొకమందును ఒక తులము నుపయోగించదలచుకొన్నను అంత మందుకు ఒకేసారి పొట్లములు కట్టుటకంటే సుమారు పావుతులము చొప్పున కట్టుకొనుచుండుట అనేక విధముల మంచిది.

17. రసౌషధములు, భస్మములు, చూర్ణములు, ఆసవారిష్టములు మొదలగు వానిని వ్యాధుల ననుసరించి 2-3-4 రకములను యేకముగ కలుపుకొని వాడవచ్చును.ఎన్నిటిని కలిపినను మోతాదు మాత్రము ఒక మందువ

కుండు మోతాదుకంటె విశేషము హెచ్చకూడదు.

18. ఒకపూట ఒక అనుపానముతోడను ఇంకొకపూట ఇంకొక అనుపానముతోడను లేక ఒక పూట కేవలము మందును ఇట్లు వాడవచ్చును.

19. కొన్నిసార్లు రసౌషధాదులను కొన్నిసార్లు ఆసవారిష్టాదులను వాడవచ్చును.

20. అల్లము, ఎండుఖర్జూరపు కాయలు మొదలగువాని యొక్క గంధములను అనుపానముగ చెప్పినప్పుడు వానిని నీటితో సానమీద గంధముగ అరగదీసి అందుమందును కలిపియివ్వవలయును.

21. 1/4 చి॥ మొ॥1/2 చి॥ వరకు అవి సామాన్యముగ చెప్పినపుడు ఆరెండిటిలో నొకదానినిగాని ఆ రెండింటికి మధ్యలోగాని మోతాదును పరికల్పించుకొనవచ్చును.

22. చెప్పిన మోతాదునకు రోగతత్వాదులనుబట్టి కొంచెము హెచ్చుగాగాని తక్కువగాగాని మోతాదును నిర్ధారణ చేసికొనవచ్చును.

23. మందులలో నొకదానియొక్క అనుపానమును ఇంకొకదానికి యుక్తిని బట్టి అనగా ఆయా లక్షణములను బట్టియు సందర్భమునుబట్టియు చేర్చుకొనవచ్చును. (అందుచేతనే) ప్రతిమందునకు ఇంకను అనేక అనుపానములను వ్రాయలేదు.)

24. మఱ్ఱిపట్ట తిప్పతీగ మొదలగు పచ్చిగనుండు ద్రవ్యములను, కషాయములకు పచ్చివిగను, చూర్ణములకు ఎండువిడగను నుపయోగింపవలయును.

25. అనుపాన చూర్ణములకుగాని కషాయమునకుగాని కొన్ని వస్తువులను చెప్పి వానికి భాగములను చెప్పకపోయినప్పుడు వానిని సమభాగములుగనే గ్రహింపవలయును.

26. అల్లము, జీలకఱ్ఱ మొదలగువాని యొక్క రసములను చెప్పినప్పుడు- వానిని కొద్దిగ నీళ్లుపోసి నూరి, 2-3 పొంగులురానిచ్చి గాని ఒట్టిదానినేగాని ఒడకట్టి ఆ రసము నుపయోగింపవలయును. మోతాదు 2-3 తులములు.

27. పొట్లములు మొదలగువానిని ఏ మోతాదున కామోతాదును కట్టుకొనుట కంటె 1/8 లేక 1/4 తులము చొప్పున వానికి చెప్పబడిన ఆయా రెట్ల ద్రవ్యములతో గాని ఒట్టివానినేగాని ఒకే దఫా కట్టుకొనుట

మంచిది.

28. గట్టిగ నుండు కాంతవల్లభరసము మొదలగువానిని మొదట మెత్తగనూరి పిదప అనుపాన చూర్ణమును చేర్చి పొట్లములను కట్టవలయును.

29. వసంతకుసుమాకరము, ఆనందభైరవి మొదలగు మందులను మాత్రలుగ కట్టునప్పుడుగాని వాతవిధ్వంసి మొదలగు మందులను ముద్దగ మర్దించి మాత్రలుకట్టునప్పుడుగాని ఒక తులము కట్టదలచినచో నాలుగు లేక ఆరు లేక ఎనిమిది ముద్దలుగ చేసి తులమును ఎన్ని మాత్రలుగ కట్టదలంచితిమో దానికి తగినట్లు ఒక్కొకముద్దను 17-15-11 మొదలుగా గల మాత్రలుగ చేసికొన్నచో హెచ్చుతగ్గులును శ్రమయు లేకుండ అన్ని మాత్రలు సరిగా రాగలవు. పొట్లముల విషయమై కూడ ఇట్టి విభాగము చేసికొనుట మంచిదే.

30. మందును ఒకపూట ఒక రకము ఇంకొకపూట యింకొక రకము యియ్యవచ్చును.

31. చాల దినములు వాడదలచిన సువర్ణ సూర్యావర్తి, రజతలోహ రసాయనము మొదలగు కొన్ని మందులను కొందరు ఆయా అనుపానము లతో అరగదీసి యిచ్చెదరు. మెత్తగ గంధమువలె అరగి పుచ్చుకొనుటకు శ్రేష్ఠముగానేయుండును. కాని ఉజ్జాయింపుగ అరగదీయబడుటచే మోతా దులో కొంత హెచ్చుతగ్గులు కలుగువచ్చును. కాన సమానమగు పొట్లములుగ కట్టి ఉపయోగించుటయే శ్రేష్ఠము.

32. కాంతవల్లభరసము, సువర్ణసూర్యావర్తి మొదలగు మందులయొక్క కుప్పెలను ఎప్పటికప్పుడు కొద్దిగా నూరుకొనుచుండుటకంటే, 1,2 తుల ములు నూరి వుంచుకొని దానినుండి కావలసినది పొట్లముల నిమిత్తముప యోగించుకొనుట మంచిది.

## ఆయుర్వేద ఔషధ ప్రయోగమునందు తీసుకొనవలసిన జాగ్రత్తలు

( రసతంత్రసారవ సిద్ధ ప్రయోగ సంగ్రహ)

1. కఫనాశక ఔషధమునకు అనుపానముగా తేనెను ఇవ్వవలసి వచ్చినపుడు పాత తేనెను ఇవ్వవలెను.
2. ధాతు పుష్టినిచ్చు ఔషధములకు అనుపానముగా తేనెను ఇచ్చునపుడు కొత్త తేనెను ఇవ్వవలెను.
3. వత్సనాభి ప్రధానముగా ఉన్న ఔషధములను శీతాంగ జ్వరము, ముద్దతీ తాపము, విశూచిక, గుండెదడలందు ఇవ్వరాదు. అవసరమైన యెడల జాగ్రత్తగా తక్కువ మోతాదులో ఇవ్వవలెను. నాభి శరీర ఉష్ణోగ్రతను, స్వేదము, మూత్రములను తెప్పించుట ద్వారా తగ్గించును. హృదయ స్పందన గతిని తగ్గించును. కనుక దేహ ఉ ష్ణోగ్రత ఎక్కువ ఉన్నప్పుడు మాత్రమే నాభియుత ఔషధమును వాడవలెను.
4. నవీన, తీక్ష్ణ వాత ప్రకోపము నందు విషముష్టి గింజలతో కూడిన ఔషధములు హాని కల్గించును. పురాణ వాత వ్యాధులందు అధిక లాభదాయకముగా పనిచేయును. దీనిని అధిక మోతాదులో వాడరాదు.
5. పాదరస మిశ్రిత ఔషధములు గర్భిణీ స్త్రీలు, బలహీనులు, వృక్క శోధ గలపాండు రోగులు, మరియు గండమాల కలవారికి తక్కువ అను కూలముగా ఉండును. స్త్రీలలో గర్భాశయ, యోని రోగములందు హితకరము.
6. మల్లముగల ఔషధమును నెయ్యి లేదా పాలు త్రాగించిన తరువాత ఇవ్వవలెను. కానీ, న్యుమోనియా, సన్నిపాతము మొదలగు రోగము లందు రోగానుసారము అనుపానముతో నీయవలెను. శుక్ర క్షయము నందు మల్లముతో కూడిన ఔషధములు హితకరము కాదు. సన్నిపాతము నందు పిత్త ప్రకోపముచే కలుగు ప్రలాపము, కళ్లు ఎర్ర బడుట, స్పృహతప్పుట, మొదలగు ఉపద్రవములందు మల్లయుత ఔషధమును వాడరాదు.
7. న్యుమోనియో మొదలగు కఫ ప్రధాన రోగములందు మల్లయుక్త ఔషధములైన మల్ల చంద్రోదయము, సమీర పన్నగ రస మొదలగునవి సత్వరము లాభమును చేకూర్చును. కఫ ప్రధాన రోగముల యందు

మల్లభస్మము నిషిద్ధమగు సందర్భములో మల్ల చంద్రోదయము లేదా సమీర పన్నగ రసను వాసా స్వరసము లేదా చూర్ణముతో ఇవ్వవచ్చును. శీతాంగ సన్నిపాతము నందు మల్లయుత ఔషధము సత్వరము ఫలప్రద ముగా ఉండును. అధిక ప్రస్వేదము వలన శరీర ఉష్ణోగ్రత విశేషముగా తగ్గకుండా ఉండుటకు అట్టి జ్వరము లందు మల్ల యుత ఔషధములు ఉపయోగకరము.

8. హరతాళ భస్మము మరియు హరతాళ మిశ్రిత ఔషధములు పిత్త ప్రధాన కుష్ఠము మరియు పిత్త ప్రధాన వాత రక్తమునందు హానికరము.
9. మూత్రపిండ శోధవలన ఉత్పన్నమగు ఉదర రోగమునందు తామ్ర భస్మము హానికరము. తామ్ర భస్మము ఉష్ణ, పిత్త విరేచకము అగుట వలన మూత్రపిండముల యొక్క క్రియలకు ప్రతి బంధకమగుటయే దీనికి కారణము. దీని వలన మూత్రము నందు పిత్తము కలియుట వలన మూత్రోత్సర్గ క్రియ (మూత్ర విసర్జన) తక్కువ స్థాయిలో జరుగును. తద్వారా ఉదరము నందు జలసంచయము ఎక్కువై, శోధ మరింత ఎక్కువవుతూ ఉండును.
10. స్వర్ణమాక్షిక భస్మము క్వినైన్ యొక్క విష ప్రభావమును దూరము చేయును. దీనిని నవీన తీవ్ర జ్వరములందు ఇవ్వరాదు. శృంగ భస్మము వాత జన్య శుష్కకాసయందు హానికరము. కఫ ప్రధాన కాస, శ్వాస, మరియు న్యుమోనియాలయందు హితకరము. జసద భస్మము ఉపదంశ జన్య కంఠరోగములందు హితకరము కాదు.
11. వరాటికా భస్మము ఆమయుక్త జీర్ణసంగ్రహణి యందు లాభదాయకము. కానీ, నూతన అనుసంగ్రహణి యందు హితకరము కాదు.
12. లోహ భస్మము రక్తార్శస్సు మరియు రక్తాతిసారముల ప్రారంభ దశలలో హానికరము. కానీ, వాతార్శస్సు, పిత్తార్శస్సులందు అధిక రక్తస్రావము జరుగుచున్నప్పటికీ వాడవచ్చును.
13. లోహభస్మమును భోజనానంతరము ఇచ్చుట వలన రక్తవృద్ధి, పుష్టిలకు దోహదము చేయును.
14. మల్లముచే మారణము చేయబడిన సువర్ణ భస్మము క్షయ రోగము యొక్క ప్రథమ దశలో ఇచ్చుట వలన శుష్క కాస పెరుగును. పాద రసము, గంధకము లేదా మూలికలచే మారణము చేయబడిన స్వర్ణ భస్మము క్షయ రోగము నందు విశేష గుణకరము.

15. పురాణ సంగ్రహణియందు ఏర్పడిన జ్వరము నందు, మానసిక వికృతుల యందు, సువర్ణ పర్పటిని ఇవ్వరాదు. సువర్ణ పర్పటిని సేవించు కాలమున క్షీరాహారము విశేష లాభదాయకము.
16. సువర్ణమిశ్రిత ఔషధములను క్షయరోగికి అధిక మోతాదులో ఇవ్వరాదు. అధిక మోతాదు వలన క్షయ కారక సూక్ష్మ జీవులు ఒక్కసారిగా నశించి, విషవృద్ధి అగుట వలన జ్వరోగ్రత పెరుగును. కావున శుద్ధ సువర్ణము యొక్క మోతాదు ఒక పర్యాయమునకు 1/100 రత్తి, మరియు సువర్ణ భస్మము యొక్క మోతాదు 1/32 రత్తి వరకు ఇవ్వవలెను. (రత్తి=125 మి.గ్రా.)
17. క్షయ నందు ఉష్ణోగ్రత $99^{0}$ఫా. ఎక్కువ ఉన్నప్పుడు సువర్ణ మిశ్రిత ఔషధమును ఇవ్వరాదు. జ్వరమును అన్యఔషధములచే తగ్గించిన పిమ్మట సువర్ణయుత ఔషధమును ఇవ్వవలెను. మంద జ్వరమునందు విషమును తగ్గించుటకు, స్థావర, జాంగల విషశమనార్థము సువర్ణ ప్రధాన ఔషధములు ఉపయోగింపవచ్చును.
18. ముసాంబ్రము కలిగి ఉన్న ఔషధములను స్త్రీలకు రాత్రిపరుండబోవు నపుడు ఇవ్వవలెను. గర్భవతులకు ఇవ్వరాదు.
19. నల్లమందు ఉన్న ఔషధములను పిల్లలకు అధిక మాత్రలో ఇవ్వరాదు. రక్తార్శస్సు,రక్తాతిసారములందు,దూషిత రక్తము, ఆమ్లములను బయటకు వెడలించిన తరువాతనే నల్లమందుఉన్న ఔషధమును ఇవ్వవలెను. గర్భవతి అయిన స్త్రీకి నల్లమందుతో కూడిన ఔషధమును ఎట్టి పరిస్థితి లోనూ ఇవ్వరాదు. బలహీనమైన అంత్రము గల ప్రమేహ రోగికి జాగ్రత్తగా ఇవ్వవలెను.
20. లోహభస్మము, మల్లము ఇంగువ, నల్లమందు, క్వినైన్ మొదలగు ఔషధములు రోగనాశకములైనప్పటికీ, అవి రోగికి అనుకూలముగా లేనపుడు ఇవ్వరాదు.
21. శోధహర ఔషధములు వాడుచున్న కాలమున ఉప్పు,సారాయి,మాంసాహార సేవనము వలన ఔషధము వలన ఆశించిన ఫలితము ఉండదు. మేదోహర ఔషధములు వాడు సమయమన నెయ్యి, తీపి పదార్థములు, పెరుగు మొదలగు మేధోవృద్ధికర ఆహార సేవన వలన ఔషధము నుండి ఆశించిన ఫలితము ఉండదు.
22. శుక్ర వర్ధక ఔషధ సేవన కాలము నందు బ్రహ్మాచర్యము పాటించ వలెను.

23. పాదరసము, మల్లము, విష ముష్టిగింజలు మొదలగు వానితో కూడిన ఔషధములను దీర్ఘకాలము వాడవలసి వచ్చినపుడు మధ్య మధ్యలో కొంత విరామమిచ్చి వాడుట శ్రేయస్కరము.
24. చూర్ణములు, గుటికలకన్నా ఆసవ అరిష్టములు, అర్కములు, కషాయములు మున్నగునవి సత్వరముగా దేహములో శోషింపబడి ఫలితముల నిచ్చును. కావున, తీవ్ర వికృతుల శమనార్ధము ద్రవరూప ఔషధముల నిచ్చుట విశేష హితకరము.
25. పరగడుపున (అమాశయము ఖాళీగా ఉన్నప్పుడు) తీసుకొనిన ఔషధము సత్వరము శరీరము నందు శోషింపబడును. ప్రయోగభేదము, రోగ భేదము, స్త్రీపురుషభేదము, వయోభేదము, ఋతుభేదము, ప్రాంత భేదము, అభ్యాస భేదము, శరీరోష్ణ భేదములపై ఔషధము శరీరములో పనిచేయు వేగము ఆధారపడి ఉండును.
26. ప్రస్వేద (చెమటపట్టించు) ఔషధములను ఇచ్చినప్పుడు రోగిని బాగుగా వస్త్రములో చుట్టి కూర్చుండబెట్టవలెను. లేదా పరుండబెట్టవలెను.
27. నెయ్యి లేదా తేనెను అనుపాన రూపములో తీసుకున్నపుడు ఒక గంట వరకూ చల్లని నీటిని త్రాగరాదు. అత్యవసర పరిస్థితిలో కొద్దిగా గోరు వెచ్చని నీటిని సేవించవచ్చును.
28. నల్ల జీడి గింజలు కలిగి ఉన్న ఔషధములకు అనుపానముగా టీ,కాఫీ లేదా వేడినీటిని సేవించరాదు. మజ్జిగ, నిమ్మరసము, కొబ్బరినీరు, చల్లని నీరు మొదలగునవి హితకరము.
29. నూతన జ్వరము నందు పగటిపూట ఎక్కువగా నిద్రించుట, స్నానము, అభ్యంగనము, మైథునము, క్రోధము, శ్రమలను వర్జించవలెను.
30. ఉష్ణోగ్రత పెరుగుతూ ఉన్న జ్వరమునందు జ్వరహర ఔషధములనీయ రాదు.
31. నూతన జ్వరము ఉన్నంతవరకు రోగికి తినుటకు ఏమియూ ఇవ్వరాదు.
32. జ్వరము నందు కాచి చల్లార్చిన నీటిని కొద్దిగా ఆవశ్యకతానుసారము ఇచ్చుచుండవలెను.
33. పురాణ జ్వరములందు రోగికి పాలు, నెయ్యి తప్పక ఇవ్వవలెను. క్వాథ, వమన, లంఘన మరియు లఘు భోజనముచే తగ్గని జీర్ణ జ్వరములందు శాస్త్రములో చెప్పబడిన ఘృత పానము హితకరముగా చెప్పబడుచున్నది. ఇట్టి రోగిని ఉపవాసము చేయనివ్వరాదు. అపథ్యము

వలన దోషము ప్రకోపించినచో, జాగ్రత్తగా లంఖణము చేయించ వలెను.

34. ముద్దతీజ్వరము (టైఫాయిడ్) నందు జ్వరశామక ఔషధములను ఇవ్వరాదు. వికారమును తగ్గించు పాచక, శోధక ఔషధములను ఇవ్వ వలెను.

35. చాతుర్థిక జ్వరము నందు జ్వరము తగ్గినప్పటికీ, రెండు మూడు నెలల వరకు బెల్లము ఉన్నపదార్థములను ఇవ్వరాదు. ఇచ్చిన యెడల జ్వరము తిరుగబెట్టును.

36. శీతల జ్వరము నందు రోగికి త్రాగుటకు చల్లని నీటిని ఇవ్వవలెను.

37. తరుణ జ్వరములందు ద్విదళ ధాన్యములను భుజించుట, మాంసము, పలుచని గంజి, స్త్రీ సేవనము మొదలగునవి ప్రమాదకరము.

38. త్రిదోష జ్వరము నందు ఘృతము, మాంసము, అన్నము సేవించ రాదు.

39. సన్నిపాతము నందు దాహమైనప్పటికీ చల్లని నీటిని ఇవ్వరాదు. చెమట పట్టుచున్న యెడల సత్వరము దానిని ఆపుటకు చికిత్స చేయవలెను.

40. తంద్రతో కూడిన సన్నిపాతము నందు తీక్షణమైన నస్యము మొదలగు తంద్రను పోగొట్టు ఔషధములిచ్చి రోగిలో వెంటనే చైతన్యము తెప్పించు టకు ప్రయత్నించవలెను.

41. సన్నిపాతము నందు కర్ణ శోధ ఉన్న యెడల వాపును వెంటనే తగ్గించు టకు చికిత్స చేయవలెను.

42. సన్నిపాతమునందు ప్రథమముగా వాత కఫములను శమింపజేసి, అనంతరము వాతపిత్తములను దూరము చేయవలెను.

43. జ్వరము తగ్గిన తరువాత, రోగికి శరరీరము నందు శక్తివచ్చునంత వరకు మైథునము, వ్యాయామము, నడచుట, ఆలశ్యముగా జీర్ణమగు ఆహారము, ఎండ, గాలి మరియు చన్నీటి స్నానములను వర్జించవలెను.

44. జ్వరహర ఔషధములను రోజునకు మూడుసార్లు ఇవ్వవలెను. విడిచి విడిచి వచ్చు జ్వరము నందు ఆరుగంటల ముందు నుండి రెండు గంటల కొకసారి చొప్పున 3సార్లు ఔషధమును ఇవ్వవలెను. సన్ని పాతమునందు రోగము అదుపులోనికి వచ్చువరకు రెండు గంటలకొక సారిచొప్పున మూడు, నాలుగు లేదా అంతకన్నా ఎక్కువసార్లు ఔషధ

మును ఇచ్చుచుండవలెను.

45. సన్నిపాతము, ముద్దతీ జ్వరము, ప్లేగు మరియు క్షయలందు రేచక ఔషధమును ఇవ్వవలెను. సన్నిపాతమునందు రోగము అదుపులోనికి వచ్చువరకు రెండు గంటలకొకసారి చొప్పున 3సార్లు ఔషధమును ఇవ్వవలెను.సన్నిపాతమునందు రోగముల అదుపులోనికి వచ్చువరకు రెండు గంటటకొకసారి చొప్పున మూడు,నాలుగు లేదా అంతకన్నా ఎక్కువసార్లు ఔషదమును ఇచ్చుచుండవలెను.

46. అతిసారరోగికి పచ్చిపాలు, గంజిలను ఇవ్వరాదు. ఉపవాసముండుట శ్రేష్ఠము. ఔషధమును తక్కువ మోతాదులో రోజుకు 3-4సార్లు ఇచ్చుట ఉచితము. ఒకేసారి ఎక్కువ మోతాదు నిచ్చుట హానికరము. అతి సారము తగ్గిన తరువాత పదిహేను రోజుల వరకూ అధిక భోజనము, గురుత్వము చేయు పదార్ధములు, ఆలశ్యముగా జీర్ణమగు పదార్థము లను సేవించరాదు.

47. విసూచిక(కలరా) నందు రోగికి పలుమార్లు ఒక్కొక్క తులము చొప్పున శీతలజలము (ఐస్‌వాటర్)ను ఇచ్చుచుండవలెను. లేదా కాచి చల్లార్చిన నీటిలో సోంపు అర్కమును కలిపి ఒక్కొక్క చెమ్చాడు ఇచ్చుచుండవలెను.

48. జీర్ణమలావరోధము (చిరకాల మలబద్ధత) నందు పలుమారులు విరేచక ఔషదములనీయరాదు. అవసరమైనపుడు వస్తికర్మచే అంత్రమును శుద్ధి చేయవలెను. ఈ క్రియను కూడా పలుమారులు ఆచరించుట తగదు.

49. ఆమ్ల పిత్తము (అసిడిటీ) నందు భోజనమునకు మధ్యలో లేదా భోజనము చేసిన వెంటనే అదిక జలమును త్రాగుట, ఆకుకూరలు ఎక్కువగా తినుట, పుల్లని మరియు పులిసిన పదార్థ సేవన, వేడి వేడి అన్నము, టీ, కాఫీ మొదలగునవి సేవించుట హానికరము.

50. మంటతో కూడిన ఆమ్ల పిత్తమునందు వమన, విరేచనములను చేయనిదే ఔషధమిచ్చు వలన గుణము ఉండదు.

51. రక్తపిత్తము నందు రోగి ధూమపానము మొదలగు వ్యసనములు మరియు పిత్త వర్ధక ఆహార విహారములను త్యజించవలెను.

52. అన్ని విధములైన ఉదర రోగములందు మజ్జిగ, గోమూత్రముల సేవన అతి లాభదాయకము.

53. క్రిమి రోగములందు తీపి పదార్థములు, బెల్లము, అధికముగా పాలను సేవించుట, పచ్చి పాలను సేవించుట మంచిదికాదు. నూనె పదార్థము లను సేవించుట హితకరము.
54. భగందరము నందు ఇంగువ, శనగపప్పు మరియు తీపి పదార్థముల సేవన తగదు.
55. రక్తగుల్మము నందు శాస్త్రానుసారము పదినెలల తరువాతనే చికిత్స చేయవలెను. కానీ ఆధునిక అభిప్రాయము ప్రకారము రోగ నిర్ణయము జరిగిన యెడల, వెంటనే చికిత్స మొదలు పెట్టవచ్చును.
56. కఫ ప్రధాన గుల్మ రోగము నందు వమన క్రియ చేయుట హానికరము.
57. శూల రోగము నందు ద్విదళ ధాన్యములను (శనగలు, బఠాణీలు మొ॥) సేవించుట మంచిదికాదు. వమనము, లంఘనము, స్వేదనము మరియు పాచనౌషధములు మిక్కిలి హితకరము. ముందుగా స్వేదన కర్మ చేయించుట విశేష హితకరము.
58. వాతజన్మ శూలనందు రేచన ఔషధములు, నిరూహవస్తి హితకరము, పిత్తజన్మ శూల నందు మధుర ఔషధములు కలపబడిన పాలు, కఫ జన్యశూల నందు చేదుగా నుండు మరియు సువాసన గల ఔషధములు మరియు వమనము మిక్కిలి శ్రేయస్కరము.
59. పరిణామ శూలనందు లంఘనము, వమనము, విరేచనము మరియు శీతలయుక్త వస్తి అత్యంత లాభదాయకము.
60. అన్నద్రవ శూలనందు పిత్తశమనార్థము, కఫమును హరించుటకు విరేచనము మరియు ఆమ్లపిత్తహర ఔషధమునిచ్చుట చేయవలెను.
61. ఆమజన్య తీవ్ర ఉదరశూలనందు ఉప్పు కలిపిన గోరువెచ్చని నీటితో వమనము చేయించవలెను. తీవ్ర శూలహర ఔషధమును యివ్వరాదు.
62. శుష్కవాతిక కాస మరియు పిత్తప్రధాన శుష్కకాసనందు రోగికి పుల్లని పదార్థములు, అజీర్ణకర ఆహారము, ఇంగువ హానికరము. అట్లే ఇంగిలీ కము, అభ్రకము, మల్లము, విషముష్టి విత్తులు, జీడిగింజలు మొదలగు ఉత్తేజక ఔషధములనివ్వరాదు.
63. క్షయరోగము నందు విరేచనము, స్త్రీ సేవనము హానికరము. క్షయ నందు సూక్ష్మక్రిములను నాశనము చేయు ఔషధము స్వర్ణము, అయి నప్పటికీ, జ్వర తీవ్రత ఎక్కువగా ఉన్నప్పుడు స్వర్ణయుక్త ఔషధములను ఇవ్వరాదు. పలుచని విరేచనములు అగుచున్నచో వెంటనే ఆపుటకు

ప్రయత్నించవలెను. ఇట్టి పరిస్థితులలో నల్లమందుతో కూడిన ఔషధ మును ఉపయోగించుట హితకరముకాదు. మల్లమున్న ఔషధమును శుష్కకాసనందు వాడరాదు. క్షయరోగిని దేవదారు చెట్లు లేదా వెదురు పొదలవద్ద ఉంచుట లేదా మేకల మధ్య ఉంచుట చేయుట వలన సత్వరము లాభము కలుగును.

64. క్షయ రోగులకు భోజనమునందు మేకపాలు, మేకనెయ్యి, వెల్లుల్లి మిక్కిలి శ్రేయస్కరము. ఉపవాసము, పరిశ్రమ, మానసిక చింత, గాలి అతిహానికరము.

65. క్షయరోగి యొక్క కఫమును నేలలో గుంటను చేసి పాతిపెట్టవలెను. వస్త్రములను,పరిసరములను పరిశుభ్రముగా నుంచవలెను. ఉమ్మివేయు టకు ఉపయోగించు పాత్రపై ఈగలు వాలకుండా దానిలో ఫినాయిల్, కిరోసిన్ లేదా బూడిదను ఉంచవలెను. లేదా పాత్రను మూసి ఉం చుట ద్వారానైనా రోగవ్యాప్తిని నిరోధించవచ్చును.

66. క్రిమిజన్య హృద్రోగమునందు వమనము నిషేధము, విరేచనము హితకరము.

67. ఊరుస్తంభమునందు వమన విరేచనములు, వస్తి, తైల మర్దనము, శిరావేధ మరియు స్నిగ్ధ పదార్థ సేవన హానికరము, లేపనము, ఇటుకను వేడిచేసి కాపడము పెట్టుట, స్వేదనము, ఉపవాసము మరియు ఆమ, మేద, కఫనాశకపదార్థములను సేవించుట మంచిది. జలాశయము నందు ఈతకొట్టుట కూడా శ్రేయస్కరము. ఈ రోగమునందు మొదట కఫ నాశక ఉపచారములను చేసిన అనంతరము వాతహర ఔషధములను యివ్వవలెను.

68. అపతంత్రకము (హిస్టీరియా) నందు లంఘనము చేయరాదు. వమ నము, అనువాసన వస్తి, ఆస్థాపనవస్తి కర్మలను కూడా చేయరాదు.

69. అపతంత్రకముచే బాధపడువారికి వాతశ్లేష్మ వికృతినందు లేదా శ్వాసావ రోధము ఏర్పడినపుడు తీక్ష్ణ నస్యమును ఇవ్వవలెను.

70. కంపవాతమునందు తైలమర్దన, పుష్టికర ఆహారము, నల్లమందు, విష ముష్టి విత్తులు, గుగ్గుల సేవనము అత్యంత హితకరము.

71. ఆర్ధిత వాతమునందు తైలమర్దన, నూనెగల పదార్థ సేవన హితకరము.

72. మన్యాస్తంభము నందు రూక్షస్వేదనము మరియు నస్యము వలన సత్వర ఫలితము లభింపగలదు.

73. జీర్ణ అమవాతమునందు లంఘనము, స్వేదనము, స్నేహపానము, విరేచనము, వస్తి కర్మలతో పాటు అగ్నిదీప్తిని కలిగించు ఔషధముల నిచ్చుట వలన సత్వరము ఫలితముండును.
74. వాతరోగమునందు వాపునకు రాత్రి సమయమున లేపనము చేయ రాదు. పగటిపూట లేపనము చేసి, ఎండిన తరువాత తుడిచివేయ వలెను.
75. అస్థిభంగము నందు లేపనము చేసి వేసిన కట్టును. రెండు మూడు రోజుల తరువాత విప్పవలెను. ముందుగా విప్పరాదు.
76. విద్రధి పక్వమగుటకు వేయు పిండికట్టును రెండు మూడు గంటలకొక సారి మార్చుచుండిన త్వరగా పక్వమగును. కట్టును ఎక్కువసేపు మార్చ కుండిన లాభదాయకము కాదు.
77. విద్రధిని శస్త్రముతో ఛేదించవలెనన్న నిలువుగా గాటు పెట్టవలెను. అడ్డముగా కోత పెట్టుట వలన అధిక రక్తస్రావము జరుగును.
78. పిత్తప్రధాన ఉన్మాదమునందు రోగికి సమోష్ణమైన పాలు, ఆవునెయ్యి లను యిచ్చుట, పుష్టికర ఆహారమును యిచ్చుట మంచిది. ఎండ, మైథునము, శోకము, క్రోధము అతి హానికరము, చల్లని నీటిలో కూర్చుండుట శ్రేయస్కరము.
79. కుష్ఠరోగమునందు మాంసము, పాలు, పెరుగులను సేవించరాదు. శనగలు, నెయ్యి హితకరము, వమనము, విరేచనము, స్వేదనము, వస్తి కర్మలను చేయించవలెను.
80. విసర్పమునందు నెయ్యి, నూనెలతో కూడిన పదార్థములు హానికరము.
81. శ్లీపదము (బోదకాలు) నందు తైలమర్దన చేయరాదు. కానీ, రక్తస్రావము జరుగుచున్నప్పుడు తైలమర్దన, స్వేదన క్రియలను జరుపవచ్చును.
82. నాడీ వ్రణమునందు వ్రణ ముఖము చిన్నదిగా ఉన్నయెడల, ముందుగా సున్నము, సైంధవలవణము లేదా ఏదైనా క్షారయుక్త లేపమును ఉప యోగించి పెద్దదిగా చేయవలెను. తరువాత నిర్దేశింపబడిన ఘృతము లేదా తైలమును పిచికారీ చేయుట ద్వారా ప్రవేశింపచేసిన, రోగము నివృత్తి అగును.
83. పిచ్చికుక్క కాటుకు గురియైనవారు ఒక సంవత్సరము వరకు వాతమును ప్రకోపింపజేయు ఆహారమును వర్జింపవలెను.
84. పాముకాటుకు గురయైనవారు పదహేను రోజులపాటు నిత్యము రోగి

యొక్క శక్తి ననుసరించి భోజనమునకు మూడు గంటల ముందు 2-4 తులముల (25-50గ్రా.) నెయ్యి సేవించుటవలన దృష్టిమంద గించదు.

85. ఎలుక కాటుకు గురియైనవారికి చల్లనిగాలి, చల్లని నీరు, శీతల గుణము గల భోజనము, పగటి నిద్ర మొదలగునవి హానికరము.

86. బహుమూత్రమునందు మూత్ర విసర్జన పలుమారులు కొద్దికొద్దిగా చేయుట, మూత్రదాహము (మంట) ఉన్నపుడు నెయ్యి,పులుపు, కొత్త బియ్యము,ఎక్కువగా తీపి పదార్థములనుతినుట, అజీర్ణమునందు భుజించుట, ఆహారము జీర్ణముకాక మునుపే మరల ఆహారమును సేవించుట, భోజన సమయమున అధికముగా నీరు త్రాగుట ఇవ న్నియు హానికరము. భోజనము చేసిన ఒక గంట తరువాత నీటిని త్రాగుట, సరళ ఆహారము తక్కువగా సేవించుట, ఆరుబయట తిరుగుట చేయదగును.

87. స్వప్న దోషమునందు రాత్రిపూట తీపి పదార్థములను సేవించుట, అజీర్ణమునందు భుజించుట, వాతల పదార్థ సేవన,పుల్లని పదార్థ ములు, పుగాకు,టీ మొదలగునవి వర్జించవలెను.నల్లమందు, మల్లము, తాళకము కలిసిన ఔషధములను సేవించుట కూడా సామాన్యముగా మంచిదికాదు. సాయంకాలమున ఆరుబయట తిరుగుట,సాత్విక ఆహారము, రాత్రి సమయమున భోజనమునకు బదులు కేవలము పాలను త్రాగుట మొదలగునవి శ్రేయస్కరము.

88. పూయమేహమునందు రక్తశోధనము చేయకపోవుట, తినకూడనివి తినుట వలన మూత్రకృచ్ఛ్రము, రక్తయుత మూత్రము, వృషణవృద్ధి, నేత్రాభిష్యందము, మందాగ్ని, సంధివాతము, ప్రమేహపిటిక మొదలగు ఉపద్రవములు వచ్చుటకు అవకాశము కలదు.

89. పూయమేహము, ఉపదంశములందు అపథ్యము చేయుట వలన, రోగమూలము శరీరమునందు బాగా దృఢపడి,విద్రధి, నేత్రవ్యాధులు, గోళ్ళుపుచ్చుట, రక్తవికారము, సంధివాతము, మందాగ్ని, మలబద్ధకము మొదలగు ఉపద్రవములు జీవితాంతము వచ్చుచుండును.

90. దంత రోగములు, నేత్రరోగములు, తలనొప్పులు, పడిశములందు అవసరమైనపుడు ఉదరశుద్ధిచేయు ఔషధములనిచ్చుచుండవలెను.

91. సాధారణముగా కదులుచున్న పై వరుస పండ్లు మరియు దంతములను శస్త్రములతో పీకరాదు. అట్లు చేయుటవలన రక్తనాళములు తెగి అధిక రక్తస్రావము జరుగుట, తలనొప్పి, కంటి బలహీనతలు మొదలగు తీవ్రమైన రోగములుత్పన్నమగును. అవసరమైనపుడు అనుభవజ్ఞుడైన వైద్యునితో మాత్రమే పీకించుకొనవలెను.

92. తీవ్ర నేత్ర రోగములందు చల్లని నీటితో కండ్లను కడుగుట, చల్లని గాలిలో తిరుగుట నిషిద్ధము. గోరువెచ్చని నీటితో కండ్లను శుభ్రపరుప వలెను. బెల్లము, కారము, తైలము, ఎండిన అన్నము, మలబద్ధకర పదార్థములు మొదలగు వానిని సేవించరాదు. జాగరణ చేయరాదు.

93. అలసినవారు, విలపించినవారు, భయభీతులైనవారు, మాదక ద్రవ్యము లను సేవించినవారు, నవీన జ్వరము కలవారు, అజీర్ణము కలవారు, మలమూత్ర వేగ నిరోధక చేయువారు నేత్రములకు అంజనము చేయ రాదు.

94. కంటిపువ్వులు, శుక్లము నందు తీక్ష్ణ ఔషధమును ప్రయోగించవలెనన్న అందు పట్టిక బెల్లము మొదలగు తీపి పదార్థములను కలుపరాదు. కేవలము తేనెను కలుపవచ్చును. అంజనము చేయుటకు రాగి సలాయిని ఉపయోగించవలెను.

95. కాటరాక్ట్ నందు రోగికి కన్నుల వెంట నీరు కారు ఔషధమును యివ్వ రాదు.

96. పిత్తజ అభిష్యందము నందు స్వేదనము చేయరాదు.

97. నేత్రములు, వృషణములు, హృదయము సున్నిత భాగములగుటచే స్వేదనము చేయరాదు. అవసరమైనపుడు సౌమ్య స్వేదనమును చేయ వచ్చును.

98. మూత్ర రోగములందు మూత్రమును వెడలించవలెనన్న ఉదయము సమయమున చేయవలెను.

99. కఫవృద్ధి నందు కఫమును బయటకు వెడలించవలెనన్న ఉదయము గంజిని త్రాగించి, వమన ఔషధమును ఇవ్వవలెను.

100. మలబద్ధకము మరియు ఇతర రోగములందు విరేచనమునకై ఔషధ మును యివ్వవలెనన్న ఉదయము యివ్వవలెను. మృదు విరేచనము నకై రాత్రి పూట యివ్వవలెను.

101. అగ్నిమాంద్యము, అజీర్ణమునకు వాడు ఔషధమును భోజనముతో పాటు తీసుకొనవలెను. అజీర్ణ నాశక ఔషధము రాత్రిపూట కూడా యివ్వబడును.

102. తృష్ణ, ఎక్కిళ్ళు, శ్వాస మరియు విషప్రకోపములందు ఔషధ సేవన పలుమార్లు చేయవలెను.

103. మానసిక చింత లేదా యితర రోగముల వలన నిద్రపట్టని వారికి మాదక ఔషధమును రాత్రి పరుండుటకు రెండు గంటల ముందు యివ్వవలెను.

104. రక్తవికారము, కఫ ప్రకోపము, జీర్ణ విషపీడ మరియు ఇతర రోగము లందు రాత్రి సమయమున స్వేదల ఔషధమును పరుండుటకు రెండు గంటల ముందు యివ్వవలెను.

105. కర్ణరోగములందు రసాది ఔషధములను ఉదయము, తైలాది ఔషధము లను రాత్రి వాడవలెను.

106. మంటతో కూడిన తలనొప్పి యందు తైలమర్ధన చేయరాదు.

107. అసాధ్య రోగనివారణ సాధ్యము కానపుడు తీవ్ర పీడ మొదలగు రోగ లక్షణములను తగ్గించుటకు ప్రయత్నించవలెను. కానీ రోగము తగ్గునని రోగికి కానీ బంధువులకు కానీ చెప్పి భ్రమలో వుంచరాదు.

108. అష్ఠీలావృద్ధినందు రోగికి శీతలము చేయకుండా, జాగ్రత్త వహించ వలెను. నియమిత పథ్యమును చేయవలెను. నియమిత కాలమునందు ఉదర శుద్ధి జరుగునటుల చూచుకొనవలెను. అధిక శ్రమను చేయ రాదు. మూత్రావరోధక ద్రవ్యములు లేదా మూత్రోత్పత్తిని తగ్గించు ఆహారము మరియు ఔషధములను (మల్లము, క్వినైన్,వంగ భస్మము, విషముష్టి విత్తులు, ఇంగువ, తైలము, జీడిగింజలు మొదలగునవి) యివ్వరాదు.

109. బాలకులకు ధనుర్వాతమునందు రోగియొక్క వస్త్రములను తీసివేయ వలెను. ముఖముపై నీటిని చిలకరించి విసరవలెను. కాళ్లను వేడినీటి యందు ఉంచవలెను.

110. ప్రసూతి ఆక్షేపము నందు గర్భాశయమునకు ఉత్తర వస్తినిచ్చి దోష మును వెడలించవలెను. కాళ్లకు వేడినీటి కాపడము పెట్టవలెను.

111. యకృత్ వికారములు, కామలనందు నెయ్యి, తైలములను వాడరాదు.

112. యకృత్తునందు రక్తసంగ్రహముచే బాధపడు రోగులకు మత్తుపానీయముల వ్యసనమున్నచో మాన్పించవలెను. వ్యాయామము, లంఘనము, విరేచనము, యకృత్‌పై కాపడము,రక్తస్రావము చేయించుట హితకరము.

113. రక్తపోటు, చర్మరోగములు, కుష్ఠము,రక్తవికారము, వృక్కశూల, మూత్రావరోధము మరియు శోధరోగములందు వీలైనంత వరకు ఉప్పును వాడుట పూర్తిగా మానవలెను. వీలుకాని పరిస్థితి నందు స్వల్ప పరిమాణములో సైంధవ లవణమును వాడవచ్చును. మలబద్ధ కము లేకుండా చూచుకొనవలెను. వేడి టీ, పుగాకు, ధూమపానము, సారాయి, కారము వీని సేవన నిషిద్ధము. మానసిక చింతను తగ్గించు కొనుటకు ప్రయత్నించవలెను.

114. నిద్రానాశము నందు నియమిత కాలమునందు ఉదరశుద్ధి జరుగునట్లు చూచుకొనవలెను. మానసికముగా బాధపడుట వలన నిద్రానాశము జరుగుచున్న,సాయంత్రము ద్రాక్షాసవము లేదా కురాసాని వామును యివ్వవలెను. నిద్రానాశమునకు రక్తపోటు కారణమైన విరేచనము హితకరము. సమశీతోష్ణ భోజనము చేయవలెను.

115. గర్భపాతము జరిగినపుడు గర్భాశయమున మిగిలిన అంగ,ఉపాంగములను వెడలించి, గర్భాశయ శోధనము చేయవలెను.

116. కర్ణశూల, పూయపాకము లందు, చెవిని శీతల వాయువు, శీతల జలముల నుండి దూరముగా ఉంచవలెను.

117. ఉరఃస్తోయ రోగికి చల్లదనము తగలకుండా చూడవలెను. రోగికి పూర్తి విశ్రాంతి అవసరము.

118. ఆమ్ల లేదా మంట పుట్టించు పదార్థముల వలన విషము ప్రకోపించినపుడు వానికి ప్రతి విషములిచ్చుటచే విషము శమించును.
నల్లమందు,నేపాళము, ముషిణి విత్తులు, సీసము, మృదారుశృంగి, సిందూరము, జసదము, వత్సనాభి, తామ్రము వీని సేవన చేసినపుడు వమనము చేయించవలెను. స్వభావికముగా వమనము జరిగిన యెడల తిరిగి వమనము చేయించనవసరము లేదు. పాదరసము, రస కర్పూరము వీని విషప్రకోపములందు వమనము చేయించరాదు. పాలు, నెయ్యిలను యివ్వవలెను.

119. సర్పవిషము, అహిఫేన విషములచే పీడింపబడు రోగికి

నిద్రరాకుండా జాగ్రత్త వహించవలెను. తీక్ష్ణ అంజనాది ప్రయోగములు చేయవలెను. హృదయ సంరక్షణార్థము హృద్య ఔషధములను యివ్వవలెను.

120. పిచ్చికుక్క కాటుకు గురియైన వారికి పదిహేను రోజుల తరువాత దత్తూర మొదలగు ఇతర ఔషధములచే విషమును హరింపజేయ వలెను.

121. మల్లమును విషపరిమాణములో తీసుకొనిన, సాధ్యమైనంత త్వరగా వమనము చేయించవలెను. విషము అంత్రములోనికి, రక్తములోనికి ప్రవేశించిన యెడల, పాలలో నెయ్యి లేదా నీటిలో ఆముదమును వేసి త్రాగించవలెను.

122. నాసారక్తస్రావము, మస్తిష్కమునందు రక్తవృద్ధి వలన జరిగిన, దానిని ఆపుటకు ప్రయత్నింపరాదు. అన్యథా పక్షవాతము, నేత్రాది మార్గముల వెంట రక్తస్రావము, ఏదేని సిర తెగుట వలన మృత్యుసంప్రాప్తి, లేదా ఇతర వికారములు ప్రాప్తించవచ్చును.

123. ఆశుకారి ఆమవాత జ్వరమునందు $104^0$F కు మించి ఉష్ణోగ్రత ఉన్న యెడల హృదయమునకు హానికలుగు అవకాశము కలదు. క్షయ రోగమునందు ఉష్ణోగ్రత పెరిగిన కొలది రోగకారక క్రిమి విషము రక్తములో కలియుచుండును. అట్లే మాంసక్షయము కూడా జరుగు చుండును.

124. కామల రోగము రక్తములో పిత్తము కలియుట వలన వచ్చును. ఈ వ్యాధినందు ఉష్ణోగ్రత పెరిగిన కొలది వ్యాధి తీవ్రత ఎక్కువగా ఉన్నటుల భావించవలెను.

125. అంత్రిక జ్వరమునందు సామాన్యముగా ఉదయముకంటే సాయంత్రం జ్వరము రెండు డిగ్రీలు ఎక్కువ ఉండును. మొదటి వారములో ఉష్ణోగ్రత క్రమముగా పెరుగును. వారాంతమున ఉ దయము$102^0$F ఉన్న యెడల రాత్రి $104^0$F జ్వరము ఉండును. రెండవ వారమునందు ఈ పరిణామము స్థిరముగా ఉండును. మూడవ వారమునందు ఉష్ణోగ్రత క్రమముగా తగ్గును.

126. జ్వర తీవ్రత వలన పెద్దవారి యందు ప్రలాపములు, చిన్నవారి యందు ఆక్షేపములు కలుగును. చిన్నపిల్లలో జ్వరవృద్ధి త్వరగా

జరు గును. అట్లే జ్వరము త్వరగా ఉపశమించును.

127. ఉదరమునందు మలము, ఆమము లేదా విషము సంచయనము చెందినపుడు జ్వరావస్థ ఎక్కువ సమయము ఉండును. తగ్గనను, మరల వెంటనే ఉష్ణోగ్రత పెరుగును.

128. నాడి వేగము పురుషులలో కంటే స్త్రీలలో అధికముగా ఉండును. ఆహారము జీర్ణమగు సమయమున పరిశ్రమ చేయుటవలన, మానసిక ఉద్వేగమునకు గురి అయినపుడు నాడి వేగము పెరుగును. భయము వలన నాడి మందగించును. హృదయము బలహీనపడినపుడు నాడి గతి బలహీనముగానూ, వేగముగాను ఉండును.

ఆరోగ్య వంతునిలో శరీర ఉష్ణోగ్రత నాడి యొక్క సంబంధము క్రింది విధముగా ఉండును. (నిమిషమునకు)

| ఉష్ణోగ్రత | నాడి స్పందనము |
|---|---|
| $98^0$F | 60 |
| $100^0$F | 80 |
| $101^0$F | 90 |
| $102^0$F | 100 |
| $103^0$F | 110 |
| $104^0$F | 120 |
| $105^0$F | 130 |
| $106^0$F | 140 |

సాధారణముగా ఒక డిగ్రీ ఉష్ణోగ్రత పెరిగినపుడు నాడీ స్పందనము నిముషమునకు 8-10 సార్లు పెరుగును.

గర్భావస్థనందు మొదటి మూడు నెలల తరువాత నాడిగతి సామాన్యముగా తగ్గును. ఉచ్ఛ్వాస,నిశ్వాసముల వేగము పెరుగును. ఆరోగ్య వంతునిలో నాడీ స్పందనము (నిముషమునకు) క్రింది విధముగా ఉండును.

| వయస్సు | నాడి |
|---|---|
| గర్భస్థ శిశువు | 140-150 |
| జన్మించినపుడు | 130-140 |
| మొదటి సంవత్సరము | 115-130 |

| | |
|---|---|
| రెండవ సంవత్సరము | 100–115 |
| మూడవ సంవత్సరము | 95–105 |
| 3 నుండి 7 సం॥ | 90–100 |
| 7 నుండి 14 సం॥ | 75–95 |
| 14 నుండి 25 సం॥ | 75–85 |
| 25 నుండి 60 సం॥ | 65–75 |
| 60 సం॥పైన | 75–85 |

సామాన్యముగా వయస్సు, బలము పెరిగిన కొలది నాడీ స్పందనము తగ్గును. వృద్ధాప్యమునందు హృదయము బలహీనపడుట వలన నాడి వేగము తగ్గును.

ఆరోగ్య స్థితిలో ఉష్ణోగ్రత, నాడిగతి, ఉచ్ఛ్వాస నిశ్వాసముల సంఖ్య నియమితముగానూ, పరస్పరమూ సంబంధము కలవిగానూ ఉండును. సాధారణముగా నాడీ స్పందనము మరియు శ్వాసయొక్క అనుపాతము 4:1 నిష్పత్తిలో ఉండును. ఈ నియమము పుప్పుస ప్రదాహము మొదలగు వ్యాధులందు వర్తించదు.

129. ఆయుర్వృద్ధికై శ్వాసకోశముల బలపడుతున్న కొలది శ్వసన సంఖ్య తగ్గుచుండును. సమవయస్కులయిన స్త్రీ పురుషులను పోల్చినపుడు స్త్రీలలో శ్వసన సంఖ్యఎక్కువగా ఉండును. గర్భావస్థలనందు మరింత ఎక్కువగును. సాధారణముగా వయస్సుననుసరించి శ్వసన సంఖ్య క్రింది విధముగా ఉండును.

| వయస్సు | శ్వసన సంఖ్య |
|---|---|
| 2 మాసముల నుండి 2సం॥వరకు | 30–35 |
| 2 సం॥ నుండి 4 సం॥వరకు | 25–35 |
| 5 సం॥ నుండి 10 సం॥వరకు | 22–25 |
| 10 సం॥ నుండి 15 సం॥వరకు | 18–22 |
| 15 సం॥ నుండి 40 సం॥వరకు | 18–20 |
| 40 సం॥ ల తరువాత | 20–25 |

న్యుమోనియా, కాస, శ్వాస మొదలగు పుప్పుస రోగములందు శ్వసన సంఖ్య పెరుగును. అట్లే జ్వరము, గుండె బలహీనత లేదా యితర కారణముల వలన కూడా శ్వసన క్రియ త్వరగా జరుగును. తద్వారా శ్వసన సంఖ్య పెరుగును.

130. ఆరోగ్య స్థితిలో హృదయము, ధనుని, సిర మరియు రక్త ప్రసారము నకు సహకరించు అవయవములు సబలముగా నున్నంత వరకు రక్తపోటు సాధారణముగా క్రమముగా ఉండును. కానీ వేడి వేడి ఆహారమును, వేడి పానీయములను సేవించుట, సారాయి వంటి ఉత్తేజక పదార్థసేవన, వ్యాయామము, విరేచనము,ఉపవాసము, రక్త స్రావము, క్రోధము, చింత మొదలగువాని వలన ఎక్కువ తక్కువలు ఉండును. మదాత్యయము మరియు ఉపదంశము మొదలగు రోగ ములందు రక్తనాళముల గోడలు మందమగుట వలన రక్తపోటు పెరుగును. పాండురోగము, దేహమునందు రక్తము లేకపోవుట, అతి హృదయ శామక ఔషధములను తీసుకొనుట మొదలగు సందర్భ ములందు రక్తపోటు తగ్గును.

సాధారణముగా రక్తపోటు వయస్సు ననుసరించి క్రింది విధముగ ఉండును

131. కండరములను ధృడపరచుటకు, అలసటను పోగొట్టుటకు అంగమర్దనము (మసాజ్) అతి ఉపయోగకరము. కండరము యొక్క స్థితిని అనుసరించి బలమును ప్రయోగింపవలెను. కండరము యొక్క ఒక చివరినుండి రెండవ చివరివరకు ఘర్షణకు ఉపయోగించ వలెను. రక్తగతి అనుసారము బలమును, ప్రయోగింపవలెను. విరుద్దదిశలో ప్రయోగింపరాదు.

| వయస్సు | అకుంచిత రక్తభారము | ప్రసారణ రక్తభారము | నాడి |
|---|---|---|---|
| 2-4 సం॥ | 81 | 45 | 36 |
| 5-10 సం॥ | 90 | 53 | 37 |
| 10-15 సం॥ | 100 | 62 | 38 |
| 15-20 సం॥ | 110 | 71 | 39 |
| 20-30 సం॥ | 120 | 80 | 40 |
| 30-35 సం॥ | 124 | 82 | 42 |
| 35-40 సం॥ | 126 | 83 | 43 |
| 40-50 సం॥ | 128 | 84 | 44 |
| 50-60 సం॥ | 132 | 86 | 46 |
| 60-65 సం॥ | 136 | 88 | 48 |
| 65-70 సం॥ | 140 | 90 | 50 |
| 80 సం॥ పైన | 145 | 92 | 53 |

అంగమర్దనము చేయుటకు ముందు చర్మమును స్నిగ్ధముగా ఉంచుటకు తైలమును లేపనము చేయవలెను. రుగ్మత గల ప్రదేశము నందు మలాము లను మర్దన చేయుట కూడా కలదు. అంగమర్దన వలన చర్మము ఉత్తేజిత మగును. కండరములు దృఢపడును. సుఖముగా నిద్రపట్టుట వలన రోగ నివారణము జరుగును. అలసట తొలగును.

132. **ఔషధముల మోతాదు :** పురుషుల కన్న స్త్రీలకు మోతాదును తగ్గించి యివ్వ వలెను. రోగమును త్వరగా తగ్గించుటకు ఎక్కువ మోతాదులో ఔషధమిచ్చుట వలన గుణవంతమైన ఔషధము కూడా నష్టము కలిగించవచ్చును.

133. విరేచన ఔషధముల యొక్క మోతాదును శరీరబలము, రోగబలము, మల సంగ్రహము మరియు ఔషధమిచ్చు సమయములపై ఆధారపడి నిర్ణయించ వలెను.

134. మాదక, నిద్రాకర ఔషధముల మోతాదును వ్యక్తి స్వభావము, వ్యసనములు, ప్రకృతిలను దృష్టిలో ఉంచుకొని నిర్ణయించవలెను.

135. గర్భిణీ స్త్రీలకు నల్లమందు, నేపాళము, ముసాంబ్రము మరియు తీక్ష్ణ ఔషధ ములను యివ్వరాదు.

136. సూతికా జ్వరము, సన్నిపాతములందు, యకృత్తు శిధిలమగుటచే ఏర్పడిన మందాగ్ని మరియు బహు మూత్రమునందు నెయ్యి సేవించరాదు.

**ఆహార – విహార సంబంధిత సూచనలు :**

137. **శీతల జలపానము** : మూర్ఛ, పిత్త, తాపము, దాహము, విషవికారము, రక్త వికారము, మదాత్యయము, శ్రమ, తమకశ్వాస, వమనము, ఊర్ధ్వ రక్తపిత్తము మొదలగు రోగములందు ఆహారము జీర్ణమయిన తరువాత చల్లని నీటిని త్రాగవలెను. రక్తపిత్తము, మూర్ఛ, రక్తవికారము మరియు పిత్త ప్రధాన రోగములయందు వేడినీటిని ఉపయోగించుట హానికరము.

138. **ఉష్ణజలపానము :** పార్శ్వశూల, ప్రమేహము, అర్శస్సు, పాండువు, జలుబు, వాతరోగము, గళరోగములు, ఉదరవాయువు, మలబద్ధకము, విరేచనము, నవీన జ్వరము, గుల్మము, క్షయ, మందాగ్ని, అరుచి, నేత్రరోగములు, సంగ్ర హణి, కఫ ప్రధాన

రోగములు, శ్వాస,కాస, వ్రణములు, ఎక్కిళ్లు మొదలగు వాని యందు వేడినీరు లేదా కాచి చల్లార్చిన నీరు త్రాగుట ఉచితము.

139. **అల్పజలపానము** : అరుచి, జలుబు, మందాగ్ని, శోధ, క్షయ, నోటియందు నీరు ఊరుట, ఉదర రోగములు, కుష్ఠము, తీక్ష్ణ, నేత్రరోగములు, నూతన జ్వరము, వ్రణములు, మధుమేహములందు కొద్ది కొద్దిగా నీటిని అవసరమైన పుడు త్రాగవలెను. విశూచిక నందు సోంపుతో మరిగించిన నీటిని చల్లారిన పిదప కానీ, లేదా శీతల జలమును చెంచాడు చొప్పున సేవించుచుండిన వమన వేగము తగ్గును.

140. **శీతల జలనిషేధము :** ఘృతపానము లేదా తైలపానము చేసిన పిమ్మట దాహము వేసిన, గోరువెచ్చని నీటిని త్రాగవలెను. చల్లని నీటిని వెంటనే త్రాగుట హాని కరము. సన్నిపాత రోగికి చల్లని నీటిని సేవించుట, స్నానము చేయుట పూర్తిగా నిషేధము.

141. **అధిక జలపానము** : ఒకేసారి ఎక్కువ నీటిని సేవించుట వలన ఆమము పెరిగి, తద్వారా అనేక రోగములు ఉత్పత్తి అగును.

142. **మధుర జలపానము :** చక్కెర కలిపిన నీటిని త్రాగుట వలన కఫము వృద్ధి అగును. వాయువు వృద్ధి అగును. పటిక బెల్లము కలిపిన నీరు దోషనాశకము, శుక్రలము, బెల్లము కలిపిన నీరు మూత్రకృచ్ఛ్రమును హరించును. పిత్తకరము, కఫమును వృద్ధి చేయును. పాతబెల్లము కలిపిన నీరు పిత్తనాశకము, పథ్యము.

143. **జలపాన నిషేధము :** మల విసర్జన తరువాత, ఎండలో తిరిగి వచ్చిన వెంటనే, వ్యాయామము లేదా శారీరక పరిశ్రమ చేసిన వెంటనే నీటిని త్రాగుట నిషిద్ధము. భోజన ప్రారంభమున నీటిని త్రాగరాదు.

144. **క్షీర నిషేధము :** తీవ్ర ఆమప్రకోపయుక్త నూతన జ్వరము, మందాగ్ని, ఆమవృద్ధి, కుష్ఠము, ఉదరశూల, కఫవృద్ధి మరియు క్రిమిరోగములందు పాలను త్రాగుట నిషేధము. అర్శస్సునందు పచ్చిపాలను త్రాగరాదు. నూతన ఉపదంశము, పూయమేహము, వ్రణముల వెంట చీముకారుట మొదలగు రోగములందు

అధికముగా పాలను త్రాగరాదు.

145. **ఉషఃపానము:** ఉదయము నిద్రలేచిన వెంటనే, మలవిసర్జనకు ముందు జల పానము చేయుట అత్యంత శ్రేష్ఠము. కఫ ప్రకోపము, మందాగ్ని, నూతన జ్వరము మొదలగు రోగములందు ఉదయము నీటిని సేవించరాదు.

146. **పాలకు విరుద్ధ పదార్థములు** : సైంధవ లవణము తప్ప మిగిలిన క్షారములు, లవణములు; ఉసిరిక తప్ప మిగిలిన పుల్లని పదార్థములు, బెల్లము, ముల్లంగి, మద్యము, చేపలు వీనితో పాలను సేవించరాదు.

147. **మజ్జిగ నిషేధము** : ఉపదంశము, పూయమేహము, ప్రమేహము, మూత్ర మార్గ దాహము, క్షతము, మూర్ఛ, భ్రమ, దాహము, తృష్ణ, రక్త పిత్తము, ఆమ్ల పిత్తముల యందు, బలహీనులు మజ్జిగను సేవించరాదు.

148. **పెరుగు నిషేధము :** రక్తపిత్తము, ఆమ్లపిత్తము, కఫ వృద్ధి, క్షయ, వాపు, ఆగంతుక క్షతరోగము, అస్థిభంగము, పీనసము, ఉపదంశము, పూయ మేహము, నేత్రముల మంటలు, నేత్రములు ఎర్రబడుట, పిత్తజమేహము, అశ్మరి, మూత్రకృచ్ఛ్రము, మూత్రాఘాతము మొదలగు మూత్ర రోగములు, మదాత్యయము, కుష్ఠము, వాతరక్తము, అంతర్విద్రధి మరియు మూత్రరోగ జనిత సంధివాతములచే బాధపడువారు పెరుగును సేవించరాదు. వసంత, గ్రీష్మ, శరదృతువులలో పెరుగును సేవించరాదు. రాత్రివేళల పెరుగును సేవించరాదు.

149. **ఘృతనిషేధము :** జ్వరయుక్త రాజయక్ష్మ రోగులు, తల్లిపాలు త్రాగు పిల్లలు, వృద్ధులు ఘృతమును సేవించరాదు. కఫ వృద్ధి, మలబద్ధకము, ఆమరక్తము, జీర్ణ జ్వరము, మందాగ్నితో కూడిన బహుమూత్రము, ప్రమేహము, అజీర్ణ జనిత విశూచికలందు నెయ్యి కొద్దిగా సేవించవచ్చును. సన్నిపాతము, నూతన జ్వరములందు పూర్తిగా నిషేధము.

150. **అల్లము నిషేధము :** కుష్ఠము, పాండు, మూత్రకృచ్ఛ్రము, వాపు, రక్తపిత్తము, వ్రణము, శుష్కకాస, దాహము, నిద్రానాశము మొదలగు రోగములందు పిత్త ప్రకృతిగల వారికి అల్లము నిషేధము,

గ్రీష్మ, శరదృతువులలో అల్లమును సేవించుట మంచిదికాదు.

151. **తేనె :** తేనెను వేడిచేసి సేవించరాదు. తేనెకు శీతవీర్యము, లఘు, కషాయయుక్త మధుర రస, రూక్ష, గ్రాహి, లేఖన, అగ్నిదీపన, స్వర వర్ధక, వ్రణ శోధక, వ్రణరోపక, కోమలత్వ ప్రసాదక, సూక్ష్మ స్రోతోగామి, స్రోతశ్శోదక, ఆహ్లాద జనక, ప్రసాదక, వర్ణకారక, మేధాజనక, కామోత్తేజక, విశద గుణయుక్త, రుచికర, నేత్రహిత, యోగవాహి మరియు స్వల్పముగా వాతకారక గుణములు కలవు. కుష్ఠము,అర్శస్సు, కాస, రక్తపిత్తము, కఫము, ప్రమేహము, కాంతి, కృమి, మేద, పిపాస, వమన, శ్వాస, హిక్కా, అతిసారము, మలబద్ధకము, దాహము, క్షతము మరియు క్షయరోగములందు తేనె యొక్క సేవనము అత్యంత శ్రేష్ఠము.

**కొత్తతేనె** బృంహణము, పౌష్టికము, స్నిగ్ధము, అసూలోమకము మరియు శ్లేష్మకరముగా పనిచేయును.

**పాతతేనె** రూక్షముగాను, మేద, కఫ నాశకము గానూ, గ్రాహి, అతిలేఖన ద్రవ్యముగానూ పనిచేయును.

ఆధునిక పరిశీలన వలన తేనెయందు వివిధ చక్కెరలు (Dextrose, Glucose and Fructose) కలవని ఋజువయినది. అనేక రోగములందు బలము నకై తేనెను యిచ్చుట జరుగుచున్నది. తేనె అంత్రము వరకూ వెళ్ళనవసరము లేకుండానే ఆమాశయములోనే శోషితమగును. అందువలననే మధుమేహ రోగులకు తేనెను యిచ్చెదరు. చక్కెరపడని వారికి ప్రతిరోజూ భోజన సమయ మున 2-4 తులముల తేనెను యిచ్చిన, హృదయమునకు బలము చేకూరును.

152. మూత్రము యొక్క ప్రతిక్రియ ఆమ్లమైనచో ఘృతము మొదలగు తైల పదార్థ ములను అధికముగా తీసుకొనరాదు.

153. ఉదయము భోజనము చేసిన తరువాత అరగంటసేపు విశ్రమించుట, సాయంకాల భోజనము తరువాత కొద్దిసేపు నడక ఆరోగ్యకరము.

154. ఉదయము భోజనానంతరము మజ్జిగను సేవించుట, రాత్రి భోజనానంతరము పాలను సేవించుట ఉత్తమము.

155. **తాంబూల సేవనము :** వ్రణము, విద్రధి, దంత రోగములు,

తాలురోగములు, ఉపజిహ్వా వికారములు, అర్బుద రోగము, గళగండము, అపచి, తాలుశోష మరియు కఫ ప్రకోపములందు తాంబూలమును సేవించుట లాభదాయకము.

156. **తాంబూల నిషేధము :** నేత్రరోగములు, రక్తపిత్తము, క్షతము, దాహము, విష ప్రకోపము, రాజయక్ష్మ మదాత్యయము, మోహము, మూర్ఛ, శ్వాస మొదలగు రోగములందు తాంబూల సేవనము చేయరాదు.

మల విసర్జన తరువాత, భోజనమునకు ముందు, నూతన ప్రతిశ్యాయము నందు, నేత్రరోగములందు, వినికిడి శక్తి నశించుటయందు, దంతరోగము లందు శ్రమచేయుట వలన చెమట పట్టినపుడు తాంబూల సేవనము చేయరాదు.

అతిగా తాంబూలమును సేవించుట వలన వివిధ రోగములు, అనగా దంత, కర్ణ, నేత్రముల శక్తి నశించుట, శోష, రక్తపిత్తము, దాహము మరియు వాత రక్తము మొదలగు రోగములు వచ్చుటకు అవకాశము కలదు.

157. శిరస్సుపై అతివేడినీటితో స్నానము చేయుట వలన నేత్రములకు హాని కలు గును. అతి ఎక్కువ లేదా అతి తక్కువ కాంతిలో చదువుట, వ్రాయుట లేదా ఇతర సూక్ష్మమైన పనులను చేయుట, నిద్రవచ్చునపుడు, కదులుచున్న వాహన మునందు చదువుట, అత్యుష్ణ పదార్థములను అతిగా సేవించుట, నేత్రములకు అత్యంత శ్రమను కలిగించు పనులను చేయుట, పొగలో కూర్చొనుట, అధిక తాంబూల సేవన, మంటవద్ద ఎక్కువ సమయము కూర్చొనుట, ఎండలో తిరుగుట మొదలగు వాని వలన నేత్రములకు హాని కలుగును.

158. **ఉపవాసము** : వాతరోగులు, దాహము ఎక్కువగా కలవారు, చిన్నపిల్లలు, వృద్ధులు, గర్భిణీ స్త్రీలు, క్షయరోగులు, జీర్ణ జ్వరము కలవారు, అనేక రోగముల వలన పీడింపబడువారు. అలసినవారు, ఆకలి ఎక్కువ కలవారు ఉపవాసము చేయరాదు. ఉపవాసము చేయుట వలన ఎముకల నొప్పులు, మానసిక భ్రమ, కండ్లు చీకట్లు కమ్ముట, హృదయావ రోధము మరియు శక్తిహీనత ఏర్పడినపుడు ఉపవాసము చేయరాదు.

159. నూతన రోగములందు వాత,పిత్త,కఫ ధాతువులు శక్తివంతముగా ఉన్నపుడు ఔషధము యొక్క మోతాదును పూర్తిగా యివ్వవచ్చును. కానీ, జీర్ణ రోగము లందు వాతాది ధాతువులు నిర్బలముగా ఉండుట వలన ఔషధము జీర్ణమగు నంతమాత్రమే యిచ్చుచూ, ఎక్కువ రోజులు యివ్వవలెను. ఉదాహరణకు, హృదయ రోగములందు లోహభస్మము, సువర్ణభస్మము, ముత్యభస్మము, ప్రవాళ పిష్టి లేదా యితర హృదయ పౌష్టిక ఔషధములను సంపూర్ణ మోతాదులో యిచ్చుట వలన హానికలుగును. కానీ అందు 16వ వంతు మోతాదును యిచ్చుట వలన అదిపూర్తిగా శోషింపబడి క్రమముగా రోగ నివారణ జరుగును.

160. **విరుద్ధాహారములు** : ఔషధ సేవమునందు సేవింపకూడని 9 రకముల విరుద్ధా హారములను అష్టాంగ సంగ్రహకారుడు పేర్కొనెను.

(అ) పాలు, ఉలవలు ఈ రెంటి యొక్క విపాకము మరియు వీర్యములందు విరోధము కలదు. ఇందు పాలు మధుర విపాక, శీతవీర్యము ఉలవలు ఆమ్ల విపాక, ఉష్ణ వీర్యము, ఈ రెంటిని ఒకేసారి సేవించుట చేయరాదు. ఇది విరుద్ధ గుణ విపాకమునకు ఉదాహరణ.

(ఆ) పాలు, పనసపండ్లు యొక్క రసము, వీర్య, విపాకములలో సమానత్వము ఉన్నప్పటికీ, పరస్పరము విరుద్ధములు. ఇది సదృశగుణ విరుద్ధములకు ఉదాహరణ.

(ఇ) పాలు, అన్నిజాతుల చేపలు పరస్పర విరుద్ధములు. పాలు, చేపలు, రెండింటిలో మధుర గుణముండుటచే ఒక అంశమున సమాత్వమున్నప్పటికీ, పాలు శీతవీర్యము మరియు చేపలు ఉష్ణ వీర్యము అగుటచే ఈ రెంటిని ఒకేసారి సేవించుట నిషిద్ధము. ఇది దేశ విరుద్ధములకు ఉదాహరణ.

(ఈ) నెయ్యి వేడిచేసి సేవించరాదు. ఇది విరుద్ధ సంస్కారమునకు ఉదాహరణ.

(ఉ) తేనె, నెయ్యిలను సమభాగములుగా గ్రహించి స్వీకరించరాదు. ఇది మాత్రావిరుద్ధమునకు ఉదాహరణ.

(ఊ) బంజరు భూమినందు గల నీరు విరుద్ధ స్వభావము కలదిగా

ఉండును.

(ఎ) వేగించి పొడిచేసిన ధాన్యము, యవలను రాత్రిసమయమున సేవించుట కాల విరుద్ధము.

(ఏ) వేగించి పొడిచేసిన ధాన్యము, యవలను (సత్తుపిండి) నీరు కలువకుండా సేవించరాదు.

(ఐ) కేవలము బార్లీ మాత్రమే సేవించుట, ఇతర పదార్ధములను పూర్తిగా సేవింపకుండుట చేయరాదు. ఇది నియమ విరుద్ధమునకు ఉదాహరణము.

161. కుటజనందలి ఆల్కలాయిడ్ జీర్ణప్రక్రియకు తోడ్పడు టయలిన్, ట్రిప్సిన్, మరియు పెప్సిన్‌ల చర్యలను నిరోధించును. కావున కుటజ ఉన్న ఔషధము లను భోజనానంతరము 2 గంటల తరువాత యివ్వవలెను.

**4. కొన్ని అంటువ్యాధులు శరీరములో ఉత్పన్నమగుటకు పట్టుకాలము**

| వ్యాధి | ఉత్పన్నమగుటకు పట్టుకాలము |
|---|---|
| కలరా | కొన్నిగంటలను నుండి, 10 రోజులవరకు (సాధారణంగా 3-6 రోజులు) |
| చికెన్ పాక్స్ | 10-21 రోజులు |
| డిప్తీరియా | 2-10 రోజులు |
| మీజిల్స్ (పొంగు) | 7-14 రోజులు లేదా కొంత ఎక్కువ సమయం |
| ఇన్లు ఫ్లుయెంజా | 1-4 రోజులు (సాధారణంగా 3-4 రోజులు) |
| గదవ బిళ్ళలు | 10-21 రోజులు |
| ప్లేగు | 2-8 రోజులు (కొద్దిమందిలో 15 రోజులు) |
| మసూచిక(స్మాల్ ఫాక్స్) | 12-14 రోజులు |
| టైఫాయిడ్ జ్వరము | 7-21 రోజులు |
| కోరింత దగ్గు | 7-14 రోజులు |
| విసర్పము (ఎరిసిఫెలస్) | 3-6 రోజులు |

## జాగ్రత్తలు :

ఎటువంటి ఓషధులు / మూలికలు సంగ్రహించి, ప్రతి వైద్యుడు / ఫార్మశీవారు/ మూలికలు సేకరించేవారు గుర్తించవలసిన కొన్ని అంశాలను అనుక్త ద్రవ్య సంగ్రహం పేరిట భైషజ్య కల్పనలోపేర్కొన్నారు. అవి.

1. ఓషధి గురించి చెపునపుడు జాంగల దేశానికి చెందిన ఓషధి గ్రహించాలి.
2. దేశం చెప్పనపుడు జాంగల దేశానికి చెందిన ఓషధి గ్రహించాలి.
3. ఓషధి భాగం చెప్పనపుడు మూలము వాడాలి.
4. వేరు చిన్నగా ఉంటే మొత్తం మొక్కను వాడాలి.
5. వేరు పొడవుగా విశాలంగా ఉన్నపుడు వేరు ఒలుపు వాడాలి.
6. మందు మోతాదు చెప్పకపోతే రెట్టింపు రెండు పూటలా వాడవచ్చు.
7. వస్తు / ఓషధి కొలత / బరువు చెప్పనపుడు అన్నీ సమభాగాలు వేసుకోవాలి.
8. మందు ఎపుడు వేసుకోవాలో చెప్పనపుడు ఉదయకాలం మాత్రం వాడాలి.
9. గిన్నె ఫలానా అని చెప్పనపుడు మట్టి పాత్రను వాడాలి.
10. ద్రవం వాడాలని చెప్పినపుడు నీటిని వాడాలి.
11. పెద్ద వృక్షాలు లోపలి భాగం వాడవలసి వచ్చినపుడు బెరడు వాడుకోవచ్చు.
12. వృక్షం ఏ భాగమో చెప్పనపుడు వేరు / బెరడు వాడుకోవచ్చు.
13. అనుపానం చెప్పనపుడు నీటిని వాడుకోవచ్చు.
14. చందనం చెప్పినపుడు తెల్ల చందనం పైకి / నోట్లోకి లేదా మందుగా ఎర్ర చందనాన్ని మందు తయారీకి వాడాలి.
15. జీరకము గురించి చెప్పినపుడు తెల్ల జీలకర్రలోనికి కృష్ణజీలకర్ర వెలుపలికి/లోనికి వాడు కోవాలి.
16. లవణం అని చెప్పినపుడు సైంధవలవణం వాడాలి.
17. పాలు అని చెప్పినపుడు ఆవుపాలు వాడాలి.
18. తైలం అని చెప్పినపుడు తిల తైలం వాడాలి.
19. నెయ్యి (ఘృతం) అని చెప్పినపుడు గోఘృతం వాడాలి.
20. మూత్రం అని చెప్పినపుడు గోమూత్రం వాడాలి.

# శబ్దార్థ దీపిక

## అ

**అంగదాహము :** శరీరమునందు మంట (Burning senstion)

**అంగశైథిల్యము :** శరీరమంతయు శిథిలమై ఏ పనినీ చేయలేకుండుట (Function less body)

**అండవృద్ధి :** అనగా వృషణముల వృద్ధి. ఇందు పోటు, వాపు కలుగును. (Orchitis)

**అంతరాయామము :** వాతప్రకోపము వలన శరీరమం తయు ముందువైపు నకువిల్లువలె వంగును. కండ్లు కదలకుండుట, దౌడలు బిగిసి మాట్లాడలేకపోవుట, ఇరుప్రక్కల నొప్పి, నోట నురుగు వాంతి కల్గును. (Emprosthotonos)

**అంతర్వేగ జ్వరము :** శరీర అంతర్భాగమునందుండు హృదయము మొదలగు అవయవములపై ప్రభావ మును చూపునది. అందు అంతర అవయవములందు ఉష్ణోగ్రత అధికమగుట,దప్పిక,ఆయాసము, అసంబద్ధ ముగ మాట్లాడుట, మతిభ్రమణము, కీళ్లయందు, ఎముకలయందునొప్పి, చెమటపట్టకుండుట మలబద్ధ కము కలుగును.

**అకాల వృద్ధాప్యము :** చిన్న వయసునుండి వృద్ధాప్య లక్షణములు కన్పించుట (Premature ageing)

**అగ్నిదగ్ధ వ్రణము :** కాలిన గాయము వలన ఏర్పడిన పుండు (Wound due to bums)

**అగ్నిమాంద్యము :** జఠరాగ్ని మందమై ఆకలి లేకుండుట. ఇందు కడుపుబ్బరము, శరీరము మొద్దుబారుట, అరుచి, వాంతులు కల్గును. (Atonic dyspepsia)

**అడ్డకర్రలు :** వైరస్ వలన సోకు వ్యాధి. ఇందు గజ్జల యందు గ్రంథులు వాచుట కలుగును. (Lympho granuloma venereum)

**అనాస :** విరేచనములు, వాంతులు కలిగెడి వ్యాధి

**అనులోమవాతము :** శిరస్సునందు దురద, శరీరము తెల్లగా పాలిపోవుట, వాంతులు, భ్రమ, చెమట, మూర్ఛ, ధాతువులు శోషించుటచే శరీరము వికార ముగానుండుట, మిక్కిలి నిద్ర, ఆయాసము కలది. (Vata moving downwards)

**అన్నద్రవ శూల :** భుజించిన ఆహారము జీర్ణమైనప్పుడు జీర్ణమగుచున్న సమయమున జీర్ణము కాకుండ సమయమున ఇట్లు నియమిత కాలము లేకుండా నిరంతరము బాధించు నొప్పి (Duodenal ulcer)
**అన్యేద్యుష్క జర్వము :** దినమునందురాత్రిగాని, పగలుగాని ఒకసారి వచ్చు విషమ జ్వరము (Quotidian fever)
**అపచి :** మెడనరములు, చంకలు, కంఠము, గజ్జలు ఈ స్థలములందు సంధి నియమము లేకుండా, మాలవలె కాకుండా పలు విధములుగా జన్మించు గ్రంథులు. (Tubercle glands)
**అపతంత్రకము :** వాతము ప్రకోపించి హృదయమున చేరి, గుండెనందు, శిరస్సునందు, కణతల యందు నొప్పిని కలిగించి అవయవముల నన్నింటిని విల్లువలె వంచి, మూర్ఛనుకలిగించును. రోగి చాలా సమయమునకు మిక్కిలి కష్టముతో ఊపిరి తీయును. కన్నులు చలించక, అరమోడ్పుగా మూసి, పావురమువలె కూయుచు, ఒళ్లెరగక క్రిందపడును. (Convulsions)
**అసతానకము :** వాతము ప్రకోపించి హృదయమున చేరి, కన్నులు చలించక, తెలివి తప్పి, కంఠమున ధ్వనిని పుట్టించును. ఈ వాతము హృదయమును విడిచినపుడు స్వస్థత కలుగును. మరల హృదయమును చేరినపుడు బాధించును. (Hysterical convulsions)
**అపబాహుకము :** భుజములను ఆశ్రయించి ఉండు సిరలు సంకోచించుట వలన చేతులు కదల్చలేకపోవుట (Paralysis of the arm)
**అభిఘాతము :** దెబ్బ, గాయము (Trauma)
**అభిష్యందము :** కండ్ల కలక (conjuctivits,opthalmia)
**అపస్మారము :** ఇందు రోగి స్మృతి లేక చీకటిలో ఉన్నటుల ఏమియు తెలియక కండ్లను వికారముగా తిప్పుచూ, కాళ్లు, చేతులు విదిలించుచూ క్రిందపడును. (Epilepsy)
**అరోచకము :** నోటికి స్వాభావికమగు రుచి చెడి, మనసునకు ఆహారమునందు వాంఛ తప్పి, రుచి తెలియకుండుట (Anorexia)
**ఆర్థిత వాతము :** శిరస్సు, ముక్కు, పెదవులు, దౌడలు, నుదురు, కన్నుల సంధుల యందు వాత ప్రకోపము వలన నోటి అర్ధభాగము వంకరగుట, మెడ ఒక ప్రక్కకు ఒరుగుట, తల కదులుచుండుట, పట్టి పట్టి మాట్లాడుట, కన్నులు, కనుబొమ్మలు వంకరగుట, ప్రక్క మెడల యందు, దౌడలయందు,

దంతముల యందు నొప్పి, చర్మమునకు స్పర్శ జ్ఞానము లేకుండుట, సూదులతో పొడిచినటుల పోట్లు, మెడ నరములు లాగుట మొదలగు లక్షణములు కలది. (Facial Paralysis)
**అర్ధావభేదము :** వాతప్రకోపము వలన శిరస్సు అర్ధ భాగమునందలి నుదురు, కన్ను, కనుబొమ్మ, చెవి యందు మిక్కిలి తీవ్రమైన నొప్పిని కలిగించును. ఇది రోజు రోజుకూ వృద్ధి చెందిన యెడల ఆ వైపున గల చెవి లేదా కన్నును చెడగొట్టును. (Hemicrania)
**అర్బుదము :** వాతాది దోషము వృద్ధిచెంది, శరీరము నందు ఒకచోట మాంసము గట్టిగా, గుండ్రముగా, పెద్దదిగా నుండు కాయవలె వృద్ధిచెందును. ఇది పెద్దదిగా ఉండి స్వల్పమైన బాధ కలిగి, లోతైన మూలము కలదై, దిన దినమునకూ వృద్ధినొందును. (Malignant Turmour)
**అర్మము :** కంటియొక్క తెల్లగ్రుడ్డుపై వ్యాపించెడు పలుచని మాంసపు పొర. (Pterygium)
**అర్శస్సు :** గుదస్థానమునందు ఏర్పడు వివిధ ఆకార ములు గల మాంసపు మొలకలు. (Piles)
**ఆలసకము :** ఉదరరోగ భేదము. దీనియందు మిక్కిలి కడుపుబ్బరము, మూర్ఛ, మూల్గులు కల్గును. మలము, అపాన వాయువు బయటకు వెడలక నిరోధింపబడును. అట్లు అడ్డగింపబడినవాయువు ఉదరమునందు పైకి వ్యాపించును. మిక్కిలి దప్పిక, త్రేన్పులు కల్గును. (Atonic dyspepsia)
**ఆలసకము :** చర్మరోగ భేదము మిక్కిలి వ్యాపించును. (Lichen ruber)
**అవాతల పదార్థములు :** వాయువును పెంచనవి.
**అశ్మరి :** మూత్రపిండమునందలి రాళ్లు (Calculus)
**అష్ఠీలావృద్ధి :** వాతప్రకోపము వలన మూత్రాశయము యొక్కయు, గుదము యొక్కయు మార్గమును అడ్డగించు అష్ఠీల అనుమూత్ర సంబంధ గ్రంధి వృద్ధి అగును. అది చలించుట వలన తీవ్రమైన బాధ కలుగును. ఇది మలమూత్ర విసర్జనను నిరోధించును. (Enlargement of Prostate gland)
**అసృగ్ధరసు :** రక్తప్రదరము చూడుము (Menohagia)
**అస్థిగత జ్వరము :** ఎముకలను ఆశ్రయించి కలుగు ఈ జ్వరమునందు ఎముకలు విరుగగొట్టినట్లు నొప్పి మూలుగు, అధికముగా శ్వాస,

వాంతులు, విరేచన ములు, పలు విధములుగా అవయవములు చలించుట కలుగును.

**అస్థిగత వ్రణము :** ఎముకలయందు కలుగు వ్రణములు (Bone abscess)

**అస్థివక్రత :** కాల్షియం లోపము మున్నగు కారణములచే ఎముకలు వంకరపోవుట (Rickets)

**అస్థివాతము :** ఎముకల యొక్క కీళ్లయందు తీవ్రమైన నొప్పి శరీరబలము నశించుట కలుగును.

**అస్థి శోషహరము :** ఎముకల బలహీనతను నశింప చేయునది.

## ఆ

**ఆంత్రవృద్ధి :** చిన్న ప్రేగు స్వస్థానమునుండి క్రిందకు జారి గజ్జల సంధియందు చేరి గ్రంధివలె నుండు వాపును కలుగజేయును. (Ignuinal Hermla)

**ఆగంతుక జ్వరము :** విరేచనములు, అన్న ద్వేషము, దప్పిక, దేహమంతటపోటు, మూర్ఛ మొదలగునవి విషము చేత కలిగిన జ్వర లక్షణములు తీక్ష ణ ఔషధ సేవన వలన వచ్చిన జ్వరమునందు మూర్ఛ, తలనొప్పి, వాంతి, తుమ్ములు కల్గును. మదన వికారముచే కలిగిన తాప జ్వరమునందు చిత్త భ్రమము, మైకము, అన్న ద్వేషము, హృదయవేదన, శరీర కృశత్వము కల్గును. భయముచే కల్గిన జ్వరమునందు అసంబద్ధ ప్రభావము, చిత్తభ్రమకల్గును. శోకముచేత, కోపముచేత కల్గిన జ్వరమున శరీరకంపము పుట్టును. అభిచారము చేతను, శాపాదులచేతను కల్గిన జ్వరమునందు చిత్త భ్రమ, దప్పికకల్గును. పిశాచాదుల ఆవేశముచే కలిగిన జ్వరము నందు ఉద్వేగము, శరీర భావము, అకారణముగా నవ్వుట, ఏడ్చుట కల్గును. ఇవన్నియు అగంతుక జ్వర లక్షణములు.

**ఆటోపము :** వాయువు వలన కలుగు కడుపుబ్బరము. (Fullness of stomach)

**ఆధ్మానము :** కడుపు ఉబ్బరము (Tympanites)

**ఆనాహము :** మలబద్ధకము (Constipation)

**ఆనెలు :** అరికాలునందు ఏర్పడు కఠినముగా,రేగు కాయవలె నుండు నిర్మాణము. (Corn)

**ఆమపాచనము :** జీర్ణముకాని ఆహారమును జీర్ణము చేయుట

**ఆమవాతము(కీళ్ళవాతం) :** ఇది అపక్వమగు అన్న రసము వలన పుట్టును. ఇందు ఒళ్లునొప్పులు, అరుచి, దప్పిక, పనులయందు ఉత్సాహము లేకపోవుట, శరీర మునందు బరువు, జ్వరము, అజీర్ణము, అవయవము లందు వాపు కల్గును. (Rheumatism)

**ఆమశూల :** అజీర్ణము వలన ఏర్పడు కడుపునొప్పి (Pain due to indigestion)

**ఆమాతిసారము :** భుజించిన ఆహారము జీర్ణమవ్వక, మలము మాటిమాటికి విసర్జింపబడుట. ఇందు పోటు, నొప్పి మొదలగు బాధలు నాభి, గుదము మున్నగు స్థానములందు కలుగును. (Mucous colitis)

**ఆమ్లపిత్తము :** ఆహారము జీర్ణము కాకుండుట, బడలిక, వాంతులు, చేదుగను, పుల్లగను త్రేన్పులు వచ్చుట. ఒళ్లు బరువుగా ఉండుట, ఛాతీనందు, గొంతునందు మంట, ఆరోచకము కలిగి ఉండును. (Hy-peracidity, Gastrics)

**ఆమ్ల రసము :** (పులుపు) భుజించిన తరువాత నోరు శుభ్రముగా కడిగినట్లుండును. దంతములు పులియును. వెంట్రుకలు నిక్కబొడుచుకొనును. నేత్రములు, కను బొమ్మలు సంకోచమునొందును. దీపనము, పాచనము చేయును. రుచిని కల్గించును. వాతానులోమనము చేయును.

**ఆమ్ల శూల :** ఆమ్లపిత్తమునందు ఏర్పడు కడుపునొప్పి (Pain due to acidity)

**ఆర్తవ జననము :** రజస్థాపనీయము చూడుము

**ఆర్తవ దోషములు :** ఋతుధర్మమునకు సంబంధించిన దోషములు (Menstrual Disorders)

**ఆక్షేపకము :** వాతము ప్రకోపించి శరీరమునందలి ధమనులందు వ్యాపించి, మాటిమాటికి శరీరమును ఏనుగునెక్కిన వానివలె కదలించును. (Convulsions)

## ఇ

**ఇస్నోఫీలియా :** శరీరమునందు విశిష్టమైన అలర్జీ లేదా పరాన్న జీవుల వలన కలుగు రక్తమునకు సంబంధించిన వ్యాధి.

## ఉ

**ఉదరవాతము :** మల మూత్రములు వెడలక బంధింప బడుట, అండవృద్ధి,

రొమ్ము నొప్పి, గుల్మము, మూల రోగము (అర్శస్సు) ప్రక్క నొప్పి కల్గును.
**ఉదర శూల :** కడుపునొప్పి (Stomach ache)
**ఉదావర్తము :** బద్ధోదరము చూడుము
**ఉద్గారము :** త్రేన్పు (Belching)
**ఉన్మాదము (పిచ్చి) :** చిత్తభ్రమము, చూపు చంచలమై వికృతముగా ఉండుట, మనోధైర్యము లేకపోవుట, భయము, సంబంధములేని మాటలను ఇష్టమొచ్చినట్లు మాట్లాడుట మొదలగు లక్షణములు కలది. (Insnatity)
**ఉపదంశ దంతవేష్టము :** ఉపదంశమునందు పండ్ల చిగుళ్లనుండి చీము, రక్తము స్రవించు ఉపద్రవము. (Pyorhoea due to Syphils)
**ఉపదంశము :** పురుషలైంగికావయవముపై జన్మించు కొరుకుడు వ్యాధి. ఇది 5 రకములు. వాతమువలన ఏర్పడిన ఉపదంశము నందు, శిశ్నమునందు నల్లని కురుపులు జనించిన సూదులతో గుచ్చినట్లు పోట్లు, నొప్పి కల్గును. పిత్తజ ఉపదంశము నందు మిక్కిలి చెమ్మ కలిగి, మంట పుట్టించు పచ్చని బొబ్బలు కల్గును. రక్తము వలన ఏర్పడిన ఉపదంశమునందు మాంసము వంటి, నల్లని రంగు గల బొబ్బలు ఏర్పడి, రక్తము స్రవించుట, మంట, పోటు కలిగి ఉండును. కఫజము నందు దురద, వాపు కలిగి, చీము స్రవించు తెల్లని బొబ్బలు ఏర్పడును. సన్నిపాతికోపదంశము నందు పలు రకముల స్రావములు, నానావిధ బాధలు కల్గును. (Soft chancre)
**ఉపదంశ వ్రణములు :** ఉపదంశ వ్యాధి వలన శరీరముపై ఏర్పడు పుండ్లు. (Syphilitic ulcers)
**ఉపశోషకము :** ఎండించు స్వభావము కలది.
**ఉరఃస్తోయము :** శ్వాసకోసములవాపు ఇందు ఊపిరి తీయునపుడు, దగ్గినపుడు నొప్పి మరింత తీవ్రమగును. (Pleurisy)
**ఉరఃక్షతము :** రొమ్మునందు అధికముగా నొప్పి కలుగును. ఇరుప్రక్కల గట్టిగా ఒత్తిపట్టినట్లు బాధ కలుగును. అవయవములు కృశించును. వీర్యము, శరీర వర్ణము, బలము, కాంతి, రుచి ఆకలి నానాటికి తగ్గి క్షీణిం చును. దగ్గినపుడు చిక్కని కఫముతో పాటు రక్తము కూడా పడును. (Pulmonary cavitation)
**ఉష్ణవీర్యము :** కఫవాతములను శమింపజేయును. భ్రమ, దప్పిక, బడలిక, స్వేదము, తాపము, త్వరగా పాకము చేయు గుణములను కలిగించును.

ఊ

**ఊపిరి నొప్పి :** ఊపిరిని లోనికి తీయునపుడు (ఉచ్ఛ్వాస) కలుగు నొప్పి (Pain due to inspiration)

**ఊరుస్తంభము :** వాతప్రకోపము వలన తొడలు స్పర్శ జ్ఞానము లేక, చల్లబడి, బరువుగానూ, నొప్పితో కూడి, కాళ్లుపైకెత్తవలెనన్న మిక్కిలి కష్టముగా ఉండును. చింత, ఒళ్లు నొప్పులు, శరీరము జడముగానుండుట, మైకము, వాంతి, ఆరోచకము, జ్వరము కలిగి, పాదములు కృశించియుండును. (Stiffness of the legs, Paraplegia)

ఎ

**ఎగ ఊపిరి :** ఊపిరిని లోపలికి తీయుట (ఉచ్ఛ్వాసము) నందు అసౌకర్యము (Difficulty in inspiration)

ఏ

**ఏకకుష్ఠము :** విశాలమైన ప్రదేశమును ఆక్రమించి, ఆ ప్రదేశమున చెమట పట్టక చేప పొలుసుల వంటి ఆకారము కలిగి వ్యాపించు చర్మవ్యాధి (Ictyosis) Psoriasis

**ఏకాంగ వాతము :** ఏకాంగ శోష చూడుము

**ఏకాంగ శోష :** ప్రకోపిత వాతము శరీరమున సగభాగమున వ్యాపించి కీళ్లను సడలించి, శరీరమున కుడి లేదా ఎడమ భాగమును కదుల్చుటకు వీలు లేకుండా చేయును. (Monoplegia)

**ఏకాహిక జ్వరము :** రోజు విడచి రోజు వచ్చు జ్వరము. ఇందు తాపము, మూర్ఛ, తలనొప్పి, అసంబద్ధ ప్రలాప ములు, త్రేన్పులు, వాంతులు, ఆయాసము, తల తిరుగుట, బలహీనత, దప్పిక, చలి లక్షణములుగా వుండును.

ఓ

**ఓజోక్షయము :** ఉత్సాహము, తేజస్సు నశించుట

క

**కంఠదాహము :** గొంతునందు మంట (Burning sensation in throat)

**కంఠశాలూకము :** కంఠమునందు రేగు గింజంత ప్రమా ణమున గట్టిగా, స్థిరముగా గ్రంథి రూపము కలిగి ముల్లువలె గొంతుకడ్డముపడును. (Tonsiltis)

**కచ్చు :** ఎర్రగా, నిగనిగలాడుచూ గట్టిగా, నల్లగా నుండు బొబ్బలు దురద

కలిగి, తొడలు, చంకలు, నడుము వీనియందు జనించును. (Scabies)
**కటిగ్రహ :** నడుముచుట్టూ పగులగొట్టినటుల నొప్పి, వికారము, కోపము, అపస్మారము మొదలగు లక్షణ ములు గలవాతము, (Lumbago)
**కటిశూల :** నడుము నొప్పి (Waist Pain)
**కటిస్తంభ :** కటిగ్రహ చూడుము
**కటురసము :** (కారము) కుష్ఠములు, వాపు, వ్రణము లను మాన్పును. దీపన, పాచనకారి, దోషములను శోధించును.
**కటు విపాకము :** కారముగా పరిణామము చెందును. శ్లేష్మమును హరించును. వాత, పిత్తములను వృద్ధిపరచును.
**కఫ నిస్సారకము :** కఫమును బయటకు వెడలించును. (Expectorant)
**కఫవాతము :** శరీరమునందు వాపు, జ్వరము, శరీరము చిక్కిపోవుట లేదా లావెక్కుట, దగ్గు, హీనస్వరము కలిగినది.
**కరపాద దాహము :** హస్తపాదాది దాహము చూడుము
**కర్ణస్రావము :** చెవినుండి చీము స్రవించుట (otorrhoea)
**కలాయఖంజము :** సంధి బంధములు సడలి, నడుచుట కారంభించినపుడు వణుకుచు, కుంటుచు నడచుట. (Lathyrism)
**కషాయ రసము :** (వగరు) నాలుకను మొద్దుబారునట్లు చేయును.కంఠద్వారమును బిగించును. కఫ పిత్తహరము, వ్రణములను మాన్పును. అగ్ని దీప్తికరము.
**కష్టార్తవము :** నొప్పితో కూడిన ఋతుక్రమము (Dysmenorrhea)
**కాచ :** శుక్లము అనే నేత్రరోగమునందు కంటియొక్క మూడవ పటలము (పొర) కు దోషము సంక్రమించుట వలన చూపు చాలా వరకు నశించును. (Cataract)
**కామల :** పచ్చ కామెర్లు (Jaundice)
**కాస :** దగ్గు (Cough)
**కిలాసము :** స్రావము లేని చర్మరోగము. వాత ప్రకోప మున కలిగిన ఎఱ్ఱగా గరగరలాడుచును, పిత్త ప్రకోప మున కలిగిన తెల్లగా దురద కలిగియు ఉండును. దీనినే శ్విత్రము అందురు. (Leucodema)
**కీటదంశోత్థవ్రణశోథ :** కీటకములు కుట్టుట వలన ఏర్పడిన గాయపు వాపు (Inflammation due to insect bite)

**కుంభ కామల :** కామల రోగమునకు తగిన చికిత్స చేయనిచో వచ్చు వ్యాధి. (Passive congestion of the liver)

**కుబ్జత :** వీపునందైనను, రొమ్మునందైనను గూనిని కలుగ జేయు వాతము. (Scollosis)

**కురండము :** గజ్జల యొక్క సందులయందు గ్రంధివలె వాపును కలిగియుండి, జ్వరము,శూల, శరీర తాపము కలిగి ఉండును.

**కుష్ఠము :** చర్మవ్యాధి (Skin disease)

**కుష్ఠహరము :** చర్మవ్యాధులను నశింపజేయునది

**కుసుమవ్యాధులు :** గర్భాశయమునకు సంబంధించిన స్రావయుక్త వ్యాధులు (Gynaecological diseases)

**కృష్ణత్వము :** శరీరముపై నల్లని మచ్చలు ఏర్పడుట (Formation of black patches on the skin)

**కేశ్యము :** వెంట్రుకలకు హితకరమైనది (Good for hair)

**కోష్ఠగత వాతము :** మలమూత్రములు బంధించుట, అండవృద్ధి, రొమ్మునొప్పి, గుల్మము, మూల రోగము, ప్రక్క నొప్పి కల్గును.

**కోష్ఠ బద్ధత :** మల బద్ధకము (Constipation)

**కోష్ఠము :** జీర్ణాశయము (Intestine)

**కౌమార దౌర్బల్యము :** పిల్లలందు పోషణ లేకపోవుట వలన కలుగు బలహీనత. (Malnutrition in children)

**క్రిమిఘ్న :** క్రిములను నశింపజేయునది. (Bacte riocide)

**క్రోష్ఠ శీర్షము :** మోకాళ్లయందు వాతము వలన రక్తము గడ్డకట్టి, వాపు, నొప్పి కలిగి ఉండును. (Synovitis of knee joint)

**క్లమము :** బడలిక, శ్రమ (Tiredness)

**క్లైబ్యం :** లైంగిక బలహీనత (Sexual debility)

**క్షత వ్రణము :** కత్తి మొదలగు ఆయుధముల వలన ఏర్పడిన పుండు. (contused wound)

### ఖ

**ఖల్లివాతము :** వాతము పాదములయందు, పిక్కల యందు, తొడలయందు, మణికట్టునందు వ్యాపించిన సిరలను బంధించి పనులయందు సామర్థ్యము లేకుండు నట్లు చేయును (Muscular spasm of the hand and feet)

**ఖాలిత్యము :** బట్టతల (Baldness)

## గ

**గండమాల :** కంఠమునందు, మెడకు వెనుక పక్కన, ముందువైపున, చంకలయందు, గజ్జలయందు రేగు, ఉసిరికాయంత గ్రంథులు మాలికవలె ఒకటివెంట ఒకటి పుట్టి మెలమెల్లగా పక్వమై పగులును. (Cervical lymph adentis)

**గతిభంగవాతము :** నడచుటకు అసమర్ధము చేయు వాతము

**గలగండ :** కంటమునందు క్రింది భాగమున వాపు కలిగి అది ఉండవలె వ్రేలాడుచుండును. ఇది చిన్నదిగా లేదా పెద్దదిగా ఉండును. (Goitre)

**గళగ్రహము :** స్వరము హీనమై, ఆహార పదార్థములను సులభముగా కంటమునందు దిగనివ్వని రోగము. (Pharynigitis)

**గళత్సుష్ఠువు :** నాలుక నల్లగా నుండుట, కాళ్లయందు తాపము, మూడు అంగుళముల ప్రమాణమున ముదు తలు కలిగి ఉండుట, ముక్కున రక్తము కారుట, హీన స్వరము మొదలగు లక్షణములు కలిగి ఉండు చర్మ రోగము

**గళశోధ :** గొంతు వాపు (Swelling of the throat)

**గర్భపాతము :** మొదటి నాలుగు నెలల తరువాత గర్భము నశించుట. (Mis carriage)

**గర్భ శూల :** గర్భావస్థనందు కలుగు నొప్పి (Pain during pregnancy)

**గర్భస్రావము :** మొదటి నాలుగు నెలలందు గర్భము నశించుట. (Abortion)

**గర్భాశయ వికృతులు :** గర్భాశయమునకు సంబంధించిన వ్యాధులు (Uterine disorders)

**గాత్ర భంగము :** స్వభావ సిద్ధముగానుండు కంఠ స్వర మునందు మార్పు కలిగి, ఆ స్వరము హీనముగా ఉండి, చెవుల కింపుగా ఉండకుండుట. (Hoarseness of Voice)

**గుద భ్రంశము :** గుదమునందలి లోపలి భాగము ఆసనమునకు బయట వెడలుట. (Prolapsus ani)

**గురు :** ఆలశ్యముగా జీర్ణమగు పదార్థము

**గుద శూకములు :** శూక రోగము చూడుము

**గుల్మము :** హృదయమునకు, నాభికి మధ్య గ్రంధి వలె పుట్టి, అది కదలక రాయివలెనైనను, లేదా ఒక చోటినుండి మరొక చోటికి మారుచునైనను

ఉండును. దీని పరిమాణము పెరుగుచూ, తగ్గుచూ ఉండును. (Abdominaltumour)

**గుహ్య వ్రణము :** స్త్రీ, పురుష జననాంగములందు ఏర్పడు వ్రణము

**గృధ్రసీ :** వాతము ప్రకోపించి, పిరుదులపై భాగము నను, నడుమునను, వీపునందు, తొడలయందు, మోకాటియందు పిక్కలయందు, పాదమునందు వరుసగా వ్యాపించి, కదిలించుటకు వీలుకాకుండా పట్టి, సూదులతో గుచ్చినట్టు పోటును, నొప్పిని కలిగించి కాలును మాటిమాటికి కదిలించును. (Sciatica)

**గ్రంథి :** త్రిదోషజ ప్రకోపము వలన ఏర్పడి, గుండ్ర ముగా, పెద్దదిగా, వాపును కలిగియుండు నిర్మాణము. (Enlarged lymphatic gland)

**గ్రంథిక సన్నిపాతము :** ప్లేగు (Plague)

**గ్రహణి :** జీర్ణ స్థితిలో లేదా అజీర్ణ స్థితిలో దుర్గంధ యుక్తముగా, ఒకప్పుడు గట్టిగా, అప్పుడప్పుడు పలుచగా మాటి మాటికి మలము వెడలుట. (Disease of the duodenum, Sprue)

**గ్రహణీ వికారము :** గ్రహణి (జీర్ణాశయమునందలి భాగము)కి సంబంధించిన వ్యాధి (Disease of the doudenum)

**గ్రాహి :** ఉష్ణవీర్యముగానుండి, దీపనము, పాచనమును కలిగించి ద్రవమును శోషింపచేయునది.

**గ్రీవా కంపము :** వాత ప్రకోపము వలన మెడ వణకుట (Tremors of the neck)

## చ

**చచ్చువాతము :** పాంగుల్యము చూడుము

**చర్మదల కుష్ఠము :** తీవ్రమైననొప్పి, దురద కలిగి, ఎరుపు రంగులో నుండు చిన్న బొబ్బలతోకూడి, బద్దలుగా శరీరము పగిలి నీరుకారుచు, తాకినచో భరింపరాని బాధ కల్గియుండు చర్మరోగము (Erythema Nodosum)

**చక్షుష్యము :** కండ్లకు హితకరమైనది (Good for eyes)

**చాతుర్థిక జ్వరము :** జ్వరము తగ్గిన నాల్గవ రోజు మరల వచ్చు జ్వరము. ఇందు మిక్కిలి చలి, తాపము, మూర్ఛ, ధాతుశోష, శరీరము శుష్కించుట, కపాలము పోటు, త్రేన్పులు, నోరెండిపోవుట, కాళ్ళు, చేతులు చల్లబడుట, అగ్నిమాంద్యము, అరుచి, అన్నద్వేషము, ఆయాసము, కఫము, తల

తిరుగుట మొదలగు లక్షణ ములు కల్గును. (Quaratn fever)

**ఛ**

**ఛేదము :** ఒకదానితో ఒకటి కలిసియుండెడి దోషముల యొక్క బంధమును బలాత్కారముగా విడదీసి స్వస్థాన మునకు చేర్చుట.

**జ**

**జంగమ విషము :** పాము, తేలు, ఎలుక మొదలగు వాని కాటుచే జనించు విషము. (Poison of animal origin)

**జంఘాగత వాతము :** మిక్కిలి భయపడుతూ నడచుట, పిక్కలయందు నొప్పి, శరీరము గగుర్పొడుచుట, రెప్ప వేయక చూచుట, కనుబొమ్మల నడుమ శూల, మూర్ఛ కలిగినది.

**జంతు వికారము :** క్రిమిరోగము

**జలోదరము :** ఉదరము నందు జలము వృద్ధి అగుట. అట్టి ఉదరము నూనె పూసినట్లు జిడ్డుగా ఉండును. రోజు రోజునకూ పెద్దదగుట, గుండ్రనైన బొడ్డును కలిగి ఉండుట, ఉదరమునందు నరములు వ్యాప్తి చెంది ఉండుట, జలముతో నిండిన తోలుతిత్తివలె కదిలినప్పు డల్లా కడుపులో గళబిళయను శబ్దమును కల్గించును. (Ascifes)

**జానువాతము :** మోకాళ్లు శుష్కించుట, నొప్పి, వణుకు, వాంతులు, మూర్ఛ, మాట తడబడుట, రొమ్ముయందు మంట కలిగినది.

**జిహ్వా స్తంభము :** వాత ప్రకోపము వలన నాలుక కదల కుండుట. ఇందు వలన అన్నపానములు లోనికి పోవుట, మాటలాడుట అసాధ్యమగును. (Paralysis of the tongue, Glossal Palsy)

**జీర్ణపూయ మేహము :** దీర్ఘకాలికముగా శరీరమున జీర్ణించిన మూత్రమునందు చీము స్రవించు రోగము. (Chronic Gonorrhoea)

**త**

**తంద్ర :** వినికిడి, స్పర్శ, చూపు, రుచి, వాసనలను ఎరుగక, శరీరము బరువై, ఆవలింతలు, బడలిక కలిగి, మేల్కొని ఉన్ననూ నిదురించువాని వలె ఉండుట. (Drowsiness)

**తనువేదన :** ఒళ్లు నొప్పులు (Bodily pains)

**తమక శ్వాస :** కఫముచే కంఠనాళములు, నాసా రంధ్ర ములు అడ్డగింపబడి గురగురమను ధ్వనితో అతివేగ ముగా ఊపిరి పీల్చుట (Asthma)

**తరుణ జ్వరము :** అప్పటికప్పుడు కలుగు జ్వరము. (Acute fever)
**తాపము :** మంట (Burning sensation)
**తిక్త రసము :** (చేదు) నోటిని నిర్మలముగా ఉంచును. అన్యరస గ్రహణశక్తిని తగ్గించును. అరుచి, క్రిములు, దప్పిక, విషము, కుష్ఠము, మూర్ఛ, జ్వరము, తాపము, కఫ పిత్తములను హరించును. తెలివితేటలను వృద్ధి చేయును. స్తన్య, కంట దోషహరము. (Bitter)
**తిమిర రోగము :** గ్రుడ్డితనము (Blindness)
**తీక్ష్ణము :** చురుకైనది
**తృష్ణ :** నాలుక ఎండి పలుమారులు నీరు త్రాగినను తీరని దాహము. (Inordinate thirst)
**తుండికేరి :** తాలు ప్రదేశమున (అంగిలి) ప్రత్తికాయవలె వాపు జనించి, పోటు, మంట కలిగి వుండును. (Tonsillits)
**తూని :** మలమూత్రాశయములందు తీవ్రమైన బాధ జనించి, క్రిందికి వ్యాపించి, గుదస్థానమునందు, స్త్రీ, పురుషుల గుహ్యస్థలమునందు పోటు కల్గుట.
**త్రిదోషజ జ్వరము :** సన్నిపాతము చూడుము
**త్వక్ దోషహరము :** చర్మదోషములను నివారించి, చర్మ వ్యాధులను హరించునది.
**త్వచ్యము :** చర్మమునకు హితకరము.
**త్ర్యాహిక జ్వరము :** మూడు రోజులకొకసారి వచ్చు జ్వరము. చలితో కూడిన జ్వరము, ఏడ్చుట, వణుకు, తాపము, తెలివి తప్పుట, శ్రమ, నిస్సత్తువ, అవయవ ముల శుష్కించుట, కళ్ళయందు నీరుకారుట, అరుచి, అగ్నిమాంద్యము,సర్వసంధులు కదలకయుండుట, అజీర్ణము, అన్నమునందిష్టము లేకుండుట,మలబద్ధకము ఆయాసము కఫము, ధాతుక్షీణత మొదలగు లక్షణములు కల్గును. (Tertian fever)

## ద

**దంతవేష్టము :** దంతములు పట్టు తప్పి కదులుతూ, చిగుళ్లనుండి చీము,నెత్తురు కారుచుండుట (Pyorrhoea)
**దండాపతానకము :** కాళ్లు,చేతులు, శిరస్సు, వీపు, పిరుదులను వాతము కట్టెవలె స్తంభింపజేయుట. (Orthotonos)
**దంతశూల :** పంటినొప్పి (Tooth ache)

**దంతహర్షము :** చల్లని లేదా వేడి పదార్థముల స్పర్శను సహించలేక పళ్ళు పులిసినట్లు ఉండుట. (Tingling sensation of the teeth)
**దగ్ధ వ్రణము :** అగ్ని దగ్ధవ్రణము చూడుము
**దద్రు :** మొదట దద్దువలె ఏర్పడి, పిమ్మట దురదతో కూడిన ఎర్రని చిన్న బొబ్బలు గుండ్రముగా శరీరమునంతటా ఏర్పడును. దీనినే 'తామరపొడ' అందురు. (Ring worm)
**దప్పి :** దాహము (Thirst)
**దాహము :** మంట (Burning sensation)
**దాహ నాశకము :** శరీరమునందలి మంటను శమింప చేయునది. (Refrigerant)
**దాహ ప్రశమనము :** శరీరమునందలి మంటను నశింప చేయునది. (Giving relief from burning sensation)
**దీపనము :** ఆహారమును జీర్ణము చేయక, జఠరాగ్నిని వృద్ధినొందించుట. (Camiantion)
**దుష్ట ప్రతిశ్యాయము :** ఇది ఒక నాసా రోగము. ఇందు ముక్కు ఒకప్పుడు తడిగా ఉండుట, మరొకప్పుడు ఎండి ఉండుట, నిశ్వాసము కష్టముగా వెడలుట, నిశ్వాసము వెడలినచో అది మిక్కిలి దుర్గంధముతో కూడి ఉండుట, వాసనను గ్రహించు శక్తి లేకుండుట మున్నగు లక్షణ ములు ఉండును. (Catarrah or cold in the nose)
**దుష్ట వ్రణము :** మిక్కిలి దుర్గంధము కలిగిన చీమును, మిక్కిలి రక్తమును స్రవించుట, వ్రణము మిక్కిలి ఉన్నతముగా ఉండుట, చిరకాలమునుండి మానకుండుట, మిక్కిలి బాధను కలిగించునది. (Infective wound)
**దృష్టి నైర్మల్యము :** దోషములేని దృష్టిని కలిగి ఉండుట (Good eye sight)
**దోషజ జ్వరము :** కామము, శోకము, భయము, కోప ముల వలన జన్మించు జ్వరము.
**ద్వంద్వ జ్వరము :** రెండు దోషాల వలన జనించెడు జ్వరము.
**ద్వాహిక జ్వరము :** రెండురోజులకు ఒకసారి వచ్చు జ్వరము. అధికముగా చలి, తాపము, మూర్ఛ, తల బరువు, దప్పిక, మిక్కిలిచెమట, త్రేన్పులు, వాంతులు, కళ్లు తిరుగుట, నొప్పి, కరములు,పాదముల యందు మంట, నిద్రలేమి, బలహీనత, నురుగుతో ఉమ్మివేయుట, కరపాదములు చల్లబడుట ఇందలి లక్షణములు.

## ధ

**ధనుర్వాతము :** గొంతుపట్టుకొనుట, హృదయశూల, పండ్లు బిగించుట, నోరు ఎండుట మొదలగు లక్షణ ములు కలిగి, శరీరము విల్లువలె వంగుట. (Tetanus)

**ధాతుకృత్ :** సప్తధాతువులగు రసము, రక్తము, మాంసము, మేధస్సు మధ్య, అస్తి, శుక్రములను పోషించునది (Tissue builder)

**ధాతుగత జ్వరము :** సప్తధాతువులగు రసము,రక్తము, మాంసము, మేధస్సు, మజ్జ, అస్తి, శుక్రములను ఆశ్ర యించి, దోష ప్రకోపముచే కలుగు జ్వరము.

**ధారణశక్తి :** రోగనిరోధక శక్తి (Resistance Power)

**దుర్నామము :** మూలవ్యాధి (Piles)

## న

**నంజుపొక్కులు :** నోటిపూత (Stomatitis, apthae)

**నవీన జ్వరము :** తరుణ జ్వరము చూడుము

**నష్ట శుక్ర :** శుక్ర మేహము చూడుము

**నష్టార్తవము :** మానసిక ధర్మములోపించుట (Amenonhoea)

**నాడీ వ్రణము :** బాగుగా చీముపట్టి పక్వమైన వ్రణ మును ఛేదింపకపోవుట వలన ఆ వ్రణమునందలి చీము బయటకు వెడలుటకు మార్గము లేక ఒక నాడి వలె శరీరములోనికి ప్రవేశించును. (Sinus, fistua)

**నాడీ సంజ్ఞాస్థాపకము :** నరములను ఉత్తేజపరచునది. (Nervine stimulant)

**నాభికుక్షులయందలి బల్లలు :** యకృత్(కాలేయము) ప్లీహము వృద్ధిచెంది ఉదరమునందు ఎడమ ప్రక్క, మిక్కిలి వృద్ధి చెందును. ఇందు అగ్నిమాంద్యము, బలహీనత, మందజ్వరము, పాండురోగము కల్గును. (Enlargment of liver and spleen)

**నాసార్బుదము :** గుండ్రముగా, గట్టిగా కాయవలెనుండు ఈ అర్బుదము ముక్కునందు ఏర్పడి, లోతైన మూలము కలదై రోజు రోజుకూ అభివృద్ధి చెందును. దీని వలన కష్టముగా ఊపిరి తీయుట, పీనసము, మిక్కిలి తుమ్ములు ముక్కుతో మాట్లాడుట, నాసికారంధ్రము లందు దుర్గం ధము మున్నగు లక్షణములు కల్గును. (Cancer of the nose)

**నిక్కాక :** మిక్కిలి వేడిమి (Excessive head)

**నిద్రలేమి :** నిద్రపట్టకుండుట (Insomnia)

**నిద్రాకరము :** నిద్రను కలిగించునది. (Induces sleep)

**నీలిక :** కోపము వలన, ఆయాసము కల్గించు పనుల వలన ముఖము నందుగాని, శరీరమునందుగానీ మిక్కిలి నలుపు రంగులో మచ్చ ఏర్పడుట. (Black Pigmented patches on the face or body)

**న్యూనాంశము :** తక్కువ ప్రమాణము (Less in quantity)

**ప**

**పంక్తిశూల :** పరిణామ శూల చూడుము

**పంచవిధకాసలు :** కాసము (దగ్గు) వాత,పిత్త, కఫ, క్షయముల వలన పుట్టుటచే అయిదు రకములు. ఇవి వరుసగా ఒకదానికన్న ఒకటి బలముగా ఉండును. వీనికి సకాలమున చికిత్స చేయనిచో క్షయను కల్గించును.

**పక్వాశయము :** పెద్దప్రేవు (Large Intestine)

**పథ్యము :** రోగావస్థలో తినుటకిచ్చు తేలికగా జీర్ణమగు ఆహారము (Diet)

**పరిణామశూల :** ఆహారము జీర్ణమగు సమయమున కడుపునందైనను, కడుపున కిరుప్రక్కలనైనను, బొడ్డు దగ్గరనైనను, పొత్తి కడుపునైనను, గుండెవద్దనైనను, వీపు క్రింది భాగమునైనను మిక్కిలి నొప్పిని కల్గించును. ఇది భుజించిన ఆహారము వాంతి అయినపుడుగాని, ఆహారము జీర్ణమయిన పిమ్మట గాని తనంటత తనే శమించును. (Gastral gokenesis Hunger pain)

**పరివర్తకము :** రోగగ్రస్తమైన శరీరమునందు జీవక్రియ లను మెరుగు పరచుట ద్వారా పూర్వపు ఆరోగ్యమును తిరిగి పొందునట్లు చేయునది. (Alterative)

**పక్ష్మశాతము :** కనురెప్పల యొక్క వెంట్రుకలు ఊడుట, ఇందు దురద,మంట విశేషముగా కల్గును. (Tinla Tarst)

**పాంగుల్యము :** వాతము ప్రకోపించి రెండు తొడల యందుచేరి, కండరములను కదలకుండా చేయుట వలన నడచుట అసాధ్యమగును. దీనినే పంగు అందురు. (Hemiplegia)

**పాండురోగము :** శరీరమునందు రక్తము తక్కువగా ఉండుట వలన స్వాభావికముగా నుండు రంగు మారి, పాలిపోయినట్లుండు తెలుపు వర్ణము కలుగును. (Anaemia)

**పాచకాగ్ని :** జీర్ణ రసములు. (Digestive juices)

**పాచనము :** ఆహార పదార్ధములను మాత్రమే జీర్ణము చేసి, అగ్నిని వృద్ధినొందింపకుండుట. (Digestion)

**పాచన సంస్థాన బల్యము :** జీర్ణ వ్యవస్థకు బలమును కలిగించునది. (Digestive tonic)

**పాదదారి :** కాలిపగుళ్లు (Cracks in the sole)

**పామ :** చిన్నచిన్న పొక్కులు అధికముగా నుండుట, వాని యందు తెల్లని ద్రవముకారుట, తాపము, దురద కలుగుట మున్నగు లక్షణములు కల చర్మరోగము. (Pruitis)

**పార్శ్వశూల :** ప్రక్కనొప్పి (Pieurisy)

**పాలుమాలిక :** సోమరితనము, బద్ధకము (Laziness)

**పాషాణ గర్ధభము :** దౌడలసంధియందు కఠినమైన వాపును కలిగి, నునుపుగా రాయివలె ఉండి బాధను కల్గించును. (Mumps)

**పిటిక :** పొక్కు, బొబ్బ,పుండు (Carbuncle)

**పిత్తజశ్లీపదము :** శ్లీపదమనగా బోదకాలు. తొలుత జ్వరము తీవ్రముగా ఆరంభించి, గజ్జలయందు మిక్కిలి బాధతో కూడిన వాపు మెల్లగా కాళ్లకు వ్యాపించును. ఇట్టి వాపు చేతులయందు, చెవులయందు, కనురెప్పల యందు, శిశ్నమునందు, పెదవులయందు, ముక్కు నందు కూడా కలుగును. పిత్తజశ్లీపదము పచ్చని రంగు కల్గియుండును. (Elephantiasis due to aggravate bile)

**పిత్తజ్వరము :** తీవ్రమైన జ్వరము, పలుమార్లు ద్రవరూప మున మలము వెడలుట, నిదుర స్వల్పముగా పట్టుట, పసరు వాంతులుఅగుట, గొంతు, పెదవులు, నోరు, నాసారంధ్రములందు పుండ్లు, చెమటపట్టుట, ప్రలా పము, నోరు చేదుగానుండుట, మూర్ఛ, శరీరము నందెల్ల మంట, దప్పిక, మత్తు, మలమూత్రములు, కండ్లు పచ్చగా అగుట, శరీరము తిరుగుట కలుగును. (Fever due to pitta)

**పిత్తజదాహము :** దాహమనగా మంట పిత్తప్రకోపజ దాహమునందు పిత్తజ్వర లక్షణములైన తీవ్ర జ్వరము, అతిసారము, నిద్రలేమి, పసరు వాంతులు, గొంతు, పెదవులు, నోరు, నాసారంధ్రములందు పుండ్లగుట, చెమట, సంబంధములేని మాటలు మాట్లాడుట, నోట చేదు, మూర్ఛ శరీరము నంతటా మంట, అధిక దప్పిక, మత్తు; మలమూత్రములు, నేత్రములు పచ్చబారుట, చక్రమువలె శరీరము తిరుగుచున్నట్లుండుట,

లేక ఇతర వస్తువులు తిరుగుతున్నట్లు కనబడుట కల్గును.

**పిత్తజ విద్రధి :** బలవత్తరమైన మూలమును కలిగి గుండ్రముగ మిక్కిలి బాధను కల్గించు ఈ విద్రధి (పుండు) మాగిన మేడిపండు రంగులో లేదా నల్లని రంగు కల్గి జ్వరమును, మంటను కలిగి ఉండును. (Absocess due to excited bile)

**పిత్త విరేచకము :** పిత్తసారకము చూడుము

**పిత్తశామకము :** పిత్తప్రకోపమును శమింపజేయునది. (Depressant of pitta)

**పిత్తసారము :** యకృత్ యొక్క చర్యలను ప్రేరేపించుట ద్వారా పిత్తమును స్రవింపజేసి విరేచనమును కలుగ జేయునది. (Cholagougue)

**పిష్టమేహము :** పిండివలె తెల్లని మూత్రమును అధిక ముగా విడచుట.

**పీనసము :** ముక్కులలో వాతము చేత కఫము శుష్కించునపుడు ఊపిరి వెడలక బంధించును. శ్లేష్మము ఎడతెగక స్రవించును. ముక్కునకు వాసన తెలియదు. నాలుకకు రుచి తెలియదు. అట్టి లక్షణములు కలది పీనసము. (Rhintis)

**పీడాయుక్త ప్రవాహిక :** బాధతో కూడిన ప్రవాహిక (Amoebic colitis)

**పీడార్తనము :** బాధతో కూడిన ఋతుధర్మము. (Painful or difficult menstration, Dysnemorhoea)

**పుండరీక కుష్ఠము :** తామరాకువలె గుండ్రముగా, మధ్యలో తెలుపు రంగులోను, అంచు రక్త వర్ణములో ఉండి, వ్రణములు పెద్దవిగా ఉండును.

**పుప్పుసగత వ్యాధులు :** శ్వాసకోశములకు సంబంధిం చిన రోగములు. (lungs)

**పుప్పుస వికృతులు :** శ్వాసకోశములకు సంబంధించిన వ్యాధులు. (Pulmonary diseases)

**పుప్పుస వ్రణము :** శ్వాసకోశములందు ఏర్పడు వ్రణము. (Lung abscess)

**పుప్పుసశోథ :** శ్వాసకోశములవాపు (Inflammation of lungs)

**పురాణ జ్వరము :** జ్వరము, చిక్కిపోవుట, బలహీనము, దగ్గు, ఆయాసము, కఫముపడుట, తల తిరుగుట, శూల, అగ్నిమాంద్యము, మలము ఎండినట్లుండుట, అన్న ద్వేషము, అజీర్ణము, అరుచి, వీర్య బలము తగ్గుట, సర్వాంగములయందువాపు, శరీరభారము, కఫ,వాతో ద్రేకములు

లక్షణములుగా గల జ్వరము. (Chronic fever)
**పురాణ రక్తదోషము :** చాలా కాలము నుండి రక్తములో జీర్ణించిన దోషము. (Chronic infection of blood)
**పురీష-మూత్రశోధకము :** మల,మూత్రములను బయటకు వెడలించునది. (Depurative)
**పూయమేహము :** ఒక సుఖవ్యాధి. మూత్రమునందు చీము, మూత్ర విసర్జనయందు మిక్కిలి బాధ కల్గును. (Gonorhoea)
**పూయవ్రణము :** చీముపట్టిన పుండు (Purulent wound)
**పూయ హరము :** చీముపట్టుటను నిరోధించునది. (Anto suppurative)
**ప్రతి తూని :** గుదస్థానమున తీవ్రమైన బాధ జనించి అదిపైకి సంచరించి, పక్వాశయమునకు, మూత్రాశయ మునకు చేరి బాధించును.
**ప్రతిదూషకము :** శరీరమునందలి సూక్ష్మజీవుల పెరుగుదలను నిరోధించునది. (Antiseptic)
**ప్రబలహిక్క :** అతితీవ్రముగా వచ్చు ఎక్కిళ్లు (Inordinate hiccoughs)
**ప్రమేహ పిటికలు :** ప్రమేహ వ్యాధికి తగిన చికిత్సను సకాలములో చేయనిచో సంధులయందు, మర్మముల యందు, మాంసము అధికముగా గల అవయవము లందు ఏర్పడు పుండ్లు (Carbundes)
**ప్రమేహము :** మూత్రగత వ్యాధులు (Anomalies of urinary secretion)
**ప్రలాపము :** జ్వరతీవ్ర అవస్థనందు అచేతన స్థితిలో అసంబద్ధముగా మాట్లాడుట (Delirium)
**ప్రస్వేదము :** చెమట పట్టుట. (Prespiration)
**ప్రవాహిక :** కఫముతో కూడిన మలము పెద్ద ప్రేవు వాపుచే అడ్డగింపబడి నపుడు రోగి బలాత్కారముగా ముక్కిన యెడల కొంచెముగనైనను, అధికముగానైనను అపాన ద్వారమునుండి బయటకు వెడలును. (Dynestery)
**ప్లీహ వ్యాధి :** ప్లీహము వృద్ధిచెంది, ఎడమ పక్క ఉదరము మిక్కిలి వృద్ధిచెందును. ఇందు అగ్నిమాంద్యము, మందజ్వరము, బలము నశించుట, పాండురోగము కలుగును. (Enlargement of spleen)
**ప్లీహోదరము :** ప్లీహవృద్ధిచూడుము.

## బ

**బధిరత్వము :** చెముడు (Deafiness)
**బద్ధోదరము :** ప్రేవుల యందు అడ్డంకి ఏర్పడుట (Intestinal obstuction)

**బహిర్వేగ జ్వరము :** శరీరము చర్మముపై వ్యాపించు జ్వరము. ఇందు శరీరపు పై భాగమున అధికముగా వేడి, సంతాపము కలుగును. దప్పిక, ప్రలాపము, ఆయా సము తక్కువగా ఉండును.

**బహు మూత్రము :** ఇందు మూత్రము అధికముగా వెడలును. ఇది నిర్మలముగా జలమువలె ఉండును. ఒక్కొక్క సమయమున కొంచెము కలకబారి జిడ్డుగా కూడా వెడలును. దీనినే ఉదకమేహము అందురు. (Diabetes insipidus)

**భాధిర్యము :** బధిరత్వము చూడుము

**బాహ్యాయామము :** వాత ప్రకోపము వలన శరీర మంతయు వెనుక ప్రక్కకు విల్లువలె వంగుట. పండ్లు ముఖము వివర్ధమై, శరీరమున చెమట, పుట్టి, అవయవ ములు శిధిలమగును.

**బీజకోశము :** ప్రత్యుత్పత్తికి కావలసిన బీజకణములైన అండములను, శుక్రమును ఉత్పత్తి చేయు నిర్మాణములు అవి అండాశయము, ముష్కము (Testes)

**బుద్ధి ప్రదము :** తెలివితేటలను కల్గించునది.

**బృంహణము :** బలమును కలిగించుట (Strength giving)

### భ

**భగందరము :** గుదమునకు రెండంగుళముల దూరమున బయట లేదా లోపలివైపున మూత్రనాళమునకు ప్రక్కన బొబ్బలేచి, అది పగులుట వలన స్రావయుక్తమైన వ్రణము ఏర్పడును. (Fistula)

**భగ్న :** ఎముక విరుగుట (Fracture)

**భస్మకరోగము :** భుజించిన ఆహారము వెనువెంటనే జీర్ణమగు రోగము. ఇందు రోగికి పలుమార్లు ఆహార మును ఇచ్చుచుండవలెను.

**భూతోన్మాదము :** మానవులకు అసాధారణమైన మాటలు, బలము, శౌర్యము, చేష్టలు కలిగి ఉండును. తత్త్వ జ్ఞానమును లేదా శిల్ప జ్ఞానమును కలిగి ఉ ండును. ఉన్మాదము జన్మించు కాలము నియమితముగా ఉండదు.

**భేదనము :** బంధించి ఉన్న మలమూత్రాదులను అధో మార్గమున వెడలించుట (Aperient)

**భ్రమ :** శరీరము చక్రమువలె తిరుగుచున్నట్లు భావించుచు, నేలపై చేష్టలనుడిగి పడి ఉండుట. (Giddiness)

మ

**మండల కుష్ఠము :** వ్రణములు తెల్లని లేదా ఎర్రని రంగును కలిగి, కఠినముగా, ఘనముగా, నునుపుగా, పెద్దవిగా, గుండ్రముగా పుట్టి, ఒకదానితో ఒకటి వరుసగా చేరి ఉండును. (Patchedleprosy)

**మందాగ్ని :** అగ్నిమాంద్యము చూడుము.

**మజ్జాగత జ్వరము :** ఇందు కళ్లు చీకట్లుక్రమ్ముట, ఎక్కిళ్ళు, దగ్గు, చలి,వాంతులు,శరీరములోపలి భాగమున మంట, ఊపిరి ఆడకపోవుట కల్గును.

**మదాత్యయము :** అతిగా మద్యపానము చేయుట వలన ఏర్పడు రోగము (Alcoholism)

**మధుమేహము :** మూత్రము నందు చక్కెర శాతము అధికమగుట (Diabetes Mellitus)

**మధుర రసము :** (తీపి) భుజించిన వెంటనే నోరు జిడ్డుగా నుండును. మనసునకు సంతోషము,ఇంద్రియ ములకు ప్రసన్నత్వము కలిగించును. సప్తధాతువులకు బలము నిచ్చును. శరీరపుష్టిని స్తన్యవృద్ధిని కల్గించును. విరివిగ శరీర భాగములను అతుకును. వాత, పిత్త దోషములను, విష దోషములను హరించును.

**మన్యాస్తంభము :** వాతప్రకోపము వలన మెడకు వెనుక ప్రక్క నుండు రెండు ప్రక్కల పెద్ద నరములను లాగిపెట్టి అటు ఇటు మెడను కదలనీయక స్తంభింపజేయును. (Stiff neck)

**మలశోధకము :** మలమును బయటకు వెడలించుట ద్వారా కోష్ఠశుద్ధి చేయునది. (Purgative)

**మలావరోధము :** మలబద్ధకము (Constipation)

**మస్తిష్క ఉష్ణత :** మెదడునందలి వేడిమి.

**మస్తిష్కదౌర్బల్యము :** మెదడునకు సంబంధించిన బలహీనత.

**మస్తిష్కము :** మెదడు (Brain)

**మాంసగత జ్వరము :** పిక్కలయందు నొప్పి, దప్పిక, మలమూత్రములు పలుమార్లు వెడలుట, శరీరము లోపల, బయట మిక్కిలి వేడిమి కలిగియుండుట, కాళ్లుచేతులు పలు విధములుగా కదిలించుచుండుట, అలసట కలిగియుండును.

**మానస విషాదము :** చింత, శోకములతో బాధపడుట (Melancholia)

**ముద్దతీతాపము :** టైఫాయిడ్ జ్వరము (Typhoid fever)

**మృత గర్భము :** శిశువు గర్భమునందే మరణించుట (Still born)

**మూకవాతము :** వాతప్రకోపము వలన సమాగతనము ఏర్పడుట. (Aphasia)

**మూత్ర కృచ్ఛ్రము :** మూత్ర విసర్జన అతి కష్టమున జరుగుట. (Dysuria, Strangrury)

**మూత్రలము :** మూత్ర విసర్జన అతి కష్టమున జరుగుట. (Diurestic)

**మూత్రాఘాతము :** మల,మూత్ర, శుక్ర వేగనిరోధము వలన మూత్రావరోధము కలిగి, మూత్రము అతికష్ట ముగ వెడలుట, (Obstructed micturition)

**మూత్రపిండ శోథ :** మూత్రపిండముల యందలి వాపు (Inflamation of Kidney)

**మూత్రమార్గ దాహము :** మూత్రవిసర్జనయందు మంట కల్గుట (Burning sensation in voiding)

**మూత్రవికారము :** మూత్రమునకు సంబంధించిన రోగము. (Renaldisorder)

**మూత్రాశయము :** మూత్రపు సంచి (Urinary bladder)

**మూత్ర శర్కర :** శర్కర చూడుము

**మూత్రసంగ్రహణీయము :** మూత్రాశయమునందలి అశ్మరి (రాళ్లు)ని కరిగించుట. (Antillthic)

**మేదోగతజ్వరము :** శరీరమున అధికముగా చెమట, దప్పిక, మూర్ఛ, అసంబద్ధముగ మాట్లాడుట, వాంతులు, శరీరదుర్గంధము అలసట, బాధలకు ఓర్వలేకపోవుట మున్నగు లక్షణములు కల జ్వరము.

**మేదోవినాశకరము :** క్రొవ్వును నశింపచేయునది

**మేదోహరము :** మేదో వినాశకరము చూడుము

**మేధావర్ధకము :** తెలివితేటలను వృద్ధి చేయునది. (Brain tonic)

**మేహపొడలు :** మధుమేహమునందు శరీరముపై పొడ లుగా కలుగు చర్మ రోగము. (Diabetic erethma tosis)

**మేహము :** ప్రమేహము చూడుము

**మేహవాతము :** మేహము వలన కలిగెడు వాతము

## య

**యకృత్వృద్ధి :** యకృత్ వృద్ధి నొందుట. ఇందు అగ్నిమాంద్యము, మందజ్వరము, బలము నశించుట, పాండురోగము కలుగును.
**యవాన పిటిక :** మొటిమలు (Acrne)
**యక్ష్మ :** భుజములు, శిరస్సు, ఇరుప్రక్కలు మరియు హస్త పాదములందు మంట పుట్టుట, శరీరమునందు జ్వరము వ్యాపించి ఉండుట కలుగును. కఫము, రక్త ముతో కూడిన దగ్గు, అతిసారము, అరుచి మున్నగు లక్షణములు ఉండును. దీనిని క్షయ లేదా రాజయక్ష్మ అందురు. (Pthisis)
**యోగవాహి :** ఔషధమును శరీరమంతటా త్వరితముగా వ్యాపింపజేసి, సత్వర ఫలితములను అందించునది. (Catalyst)
**యోషాపస్మారము :** స్త్రీలయందు కలిగెడి అపస్మారము (Hysteria)

## ర

**రక్తగుల్మము :** నానాటికి రక్తముగూడుకట్టి గుల్మ రూపము దాల్చును. స్త్రీలయందు కన్పించు ఈ వ్యాధినందు తీవ్రమైన నొప్పి, జ్వరము, దప్పిక, గర్భధారణ చిహ్నములైన వేవిళ్ల మున్నగు లక్షణములు కలిగి ఉండును. (Ulterine tumour)
**రక్తచాపము :** రక్తపోటు (Blood pressure)
**రక్తజ శ్లీపదము :** రక్తదోషమున ఏర్పడిన బోదకాలు
**రజోక్షయము :** ఋతు రక్తము తగ్గుట.
**రజఃస్థాపనీయము :** గర్భాశయముపై ప్రభావమును కలిగించి, ఋతుక్రమమును క్రమబద్ధీకరించునది. (Emmenagogue)
**రక్తపిత్తము :** పిత్తప్రకోపము వలన రక్తము ఊర్ధ్వముఖ మున గాని, (నాసిక,నేత్రములు, చెవులు మరియు నోటి నుండి స్రవించుట) (Haemorhage)
**రక్తపైత్యము :** రక్తపిత్తము చూడుము.
**రక్తప్రదరము :** స్త్రీయందు ఋతురక్తము పరిమితి కన్నా ఎక్కువ వెడలుట, ఋతుకాలమునందే కాక ఇతర కాలమునంఉ కూడా రక్తస్రావము జరుగుట. (Menorhagia)
**రక్తమేహము :** రక్తవర్ణములో దుర్గంధముతో కూడిన మూత్రము వేడిగా వెడలుట (Haematuria)
**రక్తలేమి :** శరీరమునందు రక్తము స్థాయికి తగ్గిఉండుట. (Anaemia)
**రక్తవర్ధకము :** శరీరమునందు రక్తమును వృద్ధిచేయునది. (Haematinic)

**రక్త శోధకము :** రక్తమును శుభ్రపరచు ఔషధము. (Blood purifier)

**రక్తసంగ్రాహకము :** రక్తనాశములను సంకోచింప జేయుట ద్వారా రక్తస్రావమును అరికట్టునది. (Haemostatic)

**రక్త స్తంభన :** రక్త స్రావమును ఆపుట

**రక్త క్షయము :** రక్తలేమి చూడుము.

**రక్తాతిసారము :** రక్తముతో కూడిన మలము అపాన వాయువుతో కలసి అధికముగ వెడలుట.

**రక్తార్శస్సు :** మూలవ్యాధినందు మలము ద్రవము లేక కఠినముగా వెడలుట వలన రాపిడిచే వేడిగానుండు రక్తము వెడలును. అందువలన రక్తక్షయము కల్గును. నల్లగా, గట్టిగా, ఎండినట్లుండిన మలమును విసర్జించును. అపాన వాయువు మిక్కిలి కష్టమున బయటకు వెడలును. (anaemia)

**రసకృశత వ్యాధులు :** రక్తమునందలి భాగమైన రసము క్షీణించుట వలన ఏర్పడు వ్యాధులు.

**రసజన్య మూర్ఛ :** సప్తధాతువులలో ఒకటైన రసము క్షీణించుట వలన ఏర్పడు మూర్ఛ.

**రస సంస్థానము :** రక్తమునందలి భాగమైన రస వ్యవస్థ (Lymphatic system)

**రస సంస్థానము :** రక్తమునందలి భాగమైన రస వ్యవస్థ

**రసక్షయము :** రసధాతువు నశించుట.

**రసాజీర్ణము :** అజీర్ణము, ఇందు అరుచి, ఒళ్లు బరువుగా నుండుట కల్గును.

**రసాదిధాతునాశనము :** రసము,రక్తము,మాంసము, మేధస్సు, అస్థి,మజ్జ,శుక్రము అను సప్తధాతువుల నాశనము.

**రసాయనము :** శరీరమునందలి రోగములను నశింప చేసి ముసలితనమును పోగొట్టు ఔషధము. (Rejuvenatory)

**రూక్షము :** కఠినమైనది, ఎండినది.

**రేచన :** విరేచనము చేయుట (Purgation)

**రోహిణి :** త్రిదోషప్రకోపము వలన కంఠబిలము (గొంతు) నందు మాంసపు మొలకలు ఏర్పడును ఇవి కంఠద్వారమును అడ్డగించును. (Diphtheria)

**ల**

**లఘువు :** తేలికగా జీర్ణమగును.

**వ**

**వంధ్యాదోషము :** స్త్రీలలో సంతానోత్పత్తి లేకపోవుట (Sterility)

**వమనము :** వాంతి (Vomiting)

**వయఃస్థాపకరము :** వృద్ధాప్యమును దూరము చేయు నది. (Rejuventor)

**వర్ణకరము :** శరీరవర్ణమును పెంపొందించునది. (Improves complexion)

**వర్త్మ :** కంటిరెప్పలకు వచ్చు వ్యాధులు (Diseases of the eyelids)

**వస్తి శోధనము :** మూత్రాశయమును శుభ్రపరచుట

**వస్థి శోధ :** మూత్రాశయమునందలి వాపు. (Inflammation of Urinary bladder)

**వాత కంటకము :** కాలిమడమనందు తీవ్రమైన నొప్పి (Sprain ankle)

**వాతకుండలి :** ఒక రకము మూత్రాఘాతము. ఇందు మూత్రము కొంచెము కొంచెముగా నొప్పితో కూడి బయటకు వెడలును. (Spasmodic stricture)

**వాతగుల్మము :** గుండెకు, నాభికి మధ్యభాగమున ఒక్కొక్కసారి చలించుచూ, ఒక్కొక్కప్పుడు నిశ్చలముగ నుండు నట్టి గుండ్రముగా నుండు గ్రంధియే గుల్మము. వాత గుల్మము నాభియందు, ఇరుప్రక్కల యందు, మూత్రాశయమునందు సంచరించుట, చిన్నది, పెద్దది అగుచుండుట, మలబద్ధకము, కడుపుబ్బరము, చలి జ్వరము గల్గుట, గుండె, ఇరుప్రక్కలు, భుజములు, శిరస్సు, ఉదరములందు నొప్పి అన్నము జీర్ణమగు నపుడు మిక్కిలి బాధ మొదలగు లక్షణములు కలిగి వుండును. (Abdominal tumour due to excited vata)

**వాజీకరము :** వీర్యవృద్ధిని కలిగించి, సంభోగ శక్తిని కలిగించుట. (Aphrodislac)

**వాతగ్రంథి :** గుండ్రముగా, పెద్దదిగా వాపును కలిగి యుండు ఈ గ్రంధియను నిర్మాణము పైకి లాగబడి నట్లు, కత్తిచే నరకబడినట్లు, సూదులతో గ్రుచ్చినట్లు, చీల్చినట్లు, పగులగొట్టబడినట్లు, నానావిధ బాధలు కల్గించుచూ, నల్లని మెత్తని, తిత్తివలె విశాలముగా ఉండి, పగిలినచో శు ద్ధమైన రక్తము స్రవించును. (Tumour due to excited vata)

**వాతజ పాదవిస్తృతి :** వాతము వలన కలిగిన కాళ్ళ వాపులు (Oedema in the legs)
**వాతనాడీశామకము :** నరములను స్థిమితపరచునది (Nerve depressant)
**వాతరక్తము :** రక్తము సహజముగా ప్రవహించక, పాదమునందు కూడి, వాపు, ఎరుపు, పోటు కలిగి యుండును. (Gout)
**వాతవహనాడీ సంస్థానము :** నాడీ వ్యవస్థ (Nervous system)
**వాతవస్తి :** నిర్బంధ కారణములచే మూత్రమున వేగ సమయమగు విసర్జింపక అడ్డుపరచినచో వాతము ప్రకోపించి వస్తి యొక్క ద్వారమును అడ్డగించును. అందువలన మూత్రము బయటకు రాక పొత్తికడుపు, ఉదరములందు మిక్కిలి బాధ కలుగును. (Reterntion of urine)
**వాతశూల :** వాతప్రకోపమున గుండె, ఇరుప్రక్కలు, వీపు, వెన్నెముక క్రింది భాగములందు శూలను (నొప్పి) కల్గించును. ఇది అన్నము జీర్ణమగు సమయమున, ఉదయమునందు, వర్షకాలమున, చలికాలమున అధిక ముగా ఉండును. ఇందు వాతముచే మలబద్ధకము కలిగి మిక్కిలి బాధ కలుగును. (Colic due to excited Vata)
**వాతసంగ్రహణి :** అన్నము అతికష్టముగా జీర్ణమగుట, పులిత్రేన్పులు, అగ్నిమాంద్యము, చెవులలో ధ్వని, ఇరు ప్రక్కలు, తొడలు, గజ్జలు, కంఠములందు నొప్పి, రొమ్ము నొప్పి, శరీరము కృశించుట, అరుచి, బలహీనత, గుదము నందు బాధ, కడుపుబ్బరము, భుజించిన పిమ్మట ఈ బాధ శమించుట, వాతగుల్మము, హృద్రోగము, పలుచగా లేక ఎండినటుల, అల్పముగా, నురుగుతో ఉండును. (Dysentery due to excited vata)
**వామకము :** పక్వముకాని పిత్తమును, శ్లేష్మమును వాంతి రూపములో వెడలించునది. (Emetic)
**వింశతి మేహములు :** 20 రకముల మేహములు
**విచర్చిక :** మిక్కిలి తీవ్రమైన మంట కలిగి, నల్లని రంగు కలిగి, అనేక రంధ్రములు కలిగి అధికముగా చీము, నెత్తురు కారుచుండు చర్మరోగము. ఇది హస్తములందైనను, పాదములందైనను ఏర్పడి మిక్కిలి మంట, దురద గల బొబ్బలను కలిగించును. హస్తమునందు పుట్టినచో విచర్చిక అనియు, పాదమునందు పుట్టినచో విపాదిక యని అందురు. (Permphigus)

**విద్రధి :** బలవత్తరమైన మూలమును కలిగి, శరీరము నందలి మాంసము వృద్ధి చెందిన ప్రదేశములలో గుండ్ర ముగా ఏర్పడి, మిక్కిలి బాధను కలిగించు వ్రణము. (Abscess)
**విబంధము :** మలబద్ధకము (Conbstipation)
**విశదము :** పొడిపొడిగా ఉండుట
**విశ్వాచీ :** చేతులయందలి కండరముల పటుత్వమును చెడగొట్టి చేతులను పైకెత్తనీయక నిరుపయోగముగా చేయు వాతము. (Raido Ulnar paralysis)
**విషఘ్న :** విషమును విరుచునది (Antidote)
**విషమజ్వరము :** సంతతము, సతతము, అన్యేద్యుష్కము, తృతీయకము, చతుర్ధకము అనునవి విషమ జ్వరములు. (Malarial fever)
**విష్టంభము :** మలబద్ధకము (Constipation)
**విసర్పి :** చర్మము, మాంసము, రక్తములను ఆశ్రయించి శరీరమునందు ఒక్కచోటైన నిలకడ లేక, సకల అవయవ ములను సంచరించు స్వభావము కలిగిన వాపును అతి శీఘ్రముగా కలిగించు చర్మరోగము. (Erysepalus)
**విసూచిక :** మూర్ఛ, అజీర్ణమలము, పలుమార్లు విరేచన ములగుట, వాంతులు, తీరని దాహము, కడుపులోను, సర్వావయువములందు సూదులతో గుచ్చినట్లుబాద, కాళ్లు చేతులు ఒంకరపోవుట, వణుకు, రొమ్ము నొప్పి, తలనొప్పి మొదలగు లక్షణములు కలది. (Cholera)
**విస్ఫోట కుష్ఠము :** ఇందు పలుచని చర్మముతో కూడిన నల్లని, ఎర్రని బొబ్బలు శరీరము ఏర్పడును. (Impetigo, veside)
**వీర్యదోషము :** శుక్రమునకు సంబంధించిన దోషము
**వీర్యవికారములు :** శుక్రగత వ్యాధులు (Seminal disorder)
**వృక్క :** మూత్రపిండము (Kidney)
**వృక్క శోధ :** మూత్రపిండ శోధ చూడుము (Nephotius)
**వృషణ శోధ :** వృషణముల వాపు (Swelling of the scrotum)
**వృష్యము :** శుక్రోత్పాదకము (Spematogenetic)
**వేదనావాతము :** శరీరమునంతటా బాధను కల్గించు వాతము
**వ్రణ రోపణము :** పుండును మాన్పుట (Wound healing)
**వ్రణ శోధనము :** వ్రణమును శుభ్రపరచుట
**వ్యంగు :** కోపము వలన గాని ఆయాసము కల్గించు పనుల వలన కానీ

ముఖమున వెంటనే చిన్నదిగా, బాదను కల్గించని నల్లని మచ్చ ఏర్పడును. దీనినే మంగు అందురు. (Black pigmented patch on the face)

**శ**

**శరీరపీడ :** ఒళ్లు నొప్పులు (Bodily pains)

**శర్కర :** చిన్న చిన్న ముక్కలుగా భేదింపబడిన అశ్మరి (Gravel)

**శాఖాశ్రిత వాతప్రకోపము :** కాళ్లు చేతులను ఆశ్రయించి, వానిని పనులు చేయుటకు అసమర్ధము చేయు వాతము.

**శామకము :** శమింపచేయునది. (Depressant)

**శిరోగ్రహము :** వాతము ప్రకోపించి శిరస్సునందలి సిరలను కఠినముగా, నల్లగా చేసి అధికముగా బాధిం చును.

**శిరోభ్రమణము :** శిరస్సు కంపించుట (Tremors in the head)

**శిరోరుజ :** శిరోరోగము (Disease of the head)

**శీతజ్వరము :** చలి, వణుకు, మిక్కిలి భ్రమ, గగుర్పాటు, ఆవలింతలు, శిరస్సు, నడుము, తొడలు, పక్కలు ఇవి నలిగయొట్టి నట్లుండుట, పిక్కలు పీకుట, బడలిక, కన్నులు, శరీరము, గోళ్ళు పచ్చగానుండుట, దప్పిక, నోరు చేదుగా ఉండుట, పొడి దగ్గు ఇట్టి లక్షణములు కలది. (Fever due to low temperature)

**శీతదంత వ్యాధులు :** చిగుళ్ళ నుండి రక్తము స్రవించుట, అవి నల్లగా, మెత్తగా ఉండుట కలిగి, కాలక్రమేణా పండ్లు ఊడిపోవుట.

**శీతపిత్తము :** కందిరీగలు కుట్టిన విధముగా శరీరము నందు దద్దులు, వాపును కలిగి మిక్కిలి దురద, సూదు లతో పొడిచినటుల పోటును కలిగి, మిక్కిలి మంట కలిగి, వాంతులు, జ్వరము కలుగును. (Urticaria)

**శీతలోపచారములు :** శరీర తాపమును శమింపచేసి చల్లదనము కల్గించుటకై చేయు ఉపచారములు. (Cooling measure)

**శీతాంగ సన్నిపాతము :** సన్నిపాతమునందు శరీరము చల్లబడుట.

**శీర్షశూల :** తలనొప్పి (Head ache)

**శీత వీర్యము :** రక్తపిత్త దోషహరము, మనస్సంతోషము, ఆయుర్వృద్ధి, స్తంభన గుణము కలిగి ఉండును.

**శుక్రమేహము :** శుక్రము వంటి మూత్రమునైనను, శుక్రముతో కూడిన మూత్రమునైనను విసర్జించుట. (Sprematorhoea)

**శుక్ర క్షయము :** శుక్రధాతువు(వీర్యము) నశించుట

**శుష్కకాస :** పొడి దగ్గు (Dry cough)
**శూక రోగము :** పురుషలైంగికావయవముపై పొక్కులు ఏర్పడుట.
**శైత్యము :** జలుబు (Cold)
**శోథ :** వాపు (Oedema, Anasarca)
**శోథఘ్నము :** వాపును నశింపజేయునది (Anti inflammatiory)
**శోఫ :** వాపు (Emarcation)
**శోష :** అతి మైథునము, దుఃఖము, శరీర వ్రణము శరీరాయాసము, మార్గాయాషము, వృద్ధాప్యముల వలన జన్మించును. (Emaciation)
**శ్లీపదము :** బోదకాలు (Elephantiasis)
**శ్వసనక జ్వరము :** సన్నిపాత జ్వర లక్షణములేకాక, నిస్త్రాణ, ఆకలి లేకుండుట, వణుకు, వాంతులు, రొమ్ము నొప్పి, తలనొప్పి, చిత్తభ్రమ, అనిద్ర, బంకగా ఇనుప తుప్పువంటి నల్లని శ్లేష్మము స్రవించుట, కొన్నిసార్లు అందు రక్తపు జీరలు ఉండుట కల్గును. ఏడవ ఏలక ఎనిమిదవ దినమున మూత్రము, చెమట అధికమగును. నిముషమునకు 96–120 సార్లు నాడి కొట్టుకొనును. శరీర ఉష్ణోగ్రత 103–104 డిగ్రీలకు పెరుగును. నోరిండి పోవును. శ్వాసకోశములు చెడుట ఈ వ్యాది ప్రధాన లక్షణము.
**శ్వాస :** ఊపిరి అతికష్టముగ, ఎక్కువ విడచుట (వగర్పు) (Dysproea)
**శ్విత్రము :** కిలాసము చూడుము
**శ్వేతకుష్ఠము :** కిలాసము చూడుము
**శ్వేతప్రదరము :** తెల్లగానగు యోని స్రావము. ఇది తరచుగా శిలీంధ్రము వలన కలుగును. (Leuconhoea)

**ష**

**షడ్రసయుక్తము :** అరుచులను కలిగినది.

**స**

**సంకోచనీయము :** శరీరమునందలి కణజాలములను, కండరములను సంకోచింపజేయును. దీని వలన రక్తస్రావము అగుట, శ్లేష్మస్తరపు స్రావము తగ్గుట జరు గును. (Astringent)
**సంగ్రహణి :** గ్రహణి చూడుము
**సంతత జ్వరము :** ఏడు, పది లేక పన్నెండు దినముల పాటు నిరంతరముగా ఒక్క క్షణమైనా విడువక రాత్రిం బవళ్లు బాధించు జ్వరము (Malarial Remittent fever)

**సంధిగత వాతము :** వాతము ప్రకోపించి గాలిచే నిండియున్న తోలుతిత్తివలె నుండు వాపును కల్గించును. కీళ్లయందు పోట్లు కలిగి కాళ్ళుచేతులు, చాచునపుడు, ముడుచునపుడు మిక్కిలి బాధ కలిగి కష్టముగ నుండును. (Arthristis)
**సతత జ్వరము :** ఒక దినమునకు రెండుసార్లు విడచి విడచి వచ్చు జ్వరము రాత్రినందైనను, పగటినందైనను రెండుమార్లు విడచి విడచి వచ్చును. లేక పగటి యందు జ్వరము తగిలి విడచి, మరల రాత్రి యందు జ్వరము తగిలి విడచును. (Double quotidain fever)
**సద్యోవ్రణము :** కత్తి మొదలగు ఆయుధములచే దెబ్బ తగిలి, అది పుండుగామారిన దానిని సద్యో వ్రణమం దురు. (Tranumatic wound)
**సన్నిపాతము :** ఈ జ్వరమునందు శరీరము ఒక సమయమున ఉష్ణముగాను, మరియొక సమయమున శీతలముగాను ఉండును. అస్థి సంధులయందు వేదన, తలనొప్పి, కళ్ళెర్రబడి నీరుకారుట చెవులలో ధ్వని, నాలుక, గొంతుల యందు ముళ్ళు గ్రుచ్చినట్లుండుట, కళ్లు మత్తుగా నుండుట, తరచుగా మాటలు, దగ్గు, ఉబ్బసము, భ్రమ కల్గుట, ఉమ్మి కఫ, రక్త పిత్త మిశ్రమముగా ఉండుట, తల తిరుగుట దాహము నిద్రాభంగము రొమ్ము నొప్పిహీన స్వరము, మూలుగు, మలమూత్ర బద్ధకము, శరీరము కృశించుట, దద్దులు, కడుపు బరువుగా నుండుట మొ॥ లక్షణములు ఉండును.
(Typhiod fever)
**సన్యాసము :** వాక్కు యొక్క, మనస్సు యొక్క దేహము యొక్క చేష్టలు లేక రోగి బలహీనుడై కొయ్యవలె ప్రాణము లేనటుల క్రిందపడియుండును. (Apoplex)
**సన్యాసి(సవా మేహము) :** ఉపదంశము చూడుము
**సర్పదంశ :** పాముకాటు (Snake bite)
**సర్వాంగ వాతము :** ప్రకోపిత వాతము శరీరము నంతట రెండు అర్థభాగములందును వ్యాపించి కీళ్లను సడలింప జేసి, పనిచేయు సామర్థ్యమును నశింప జేయును. (Diplegia)
**సిధ్మ :** కొంచెము రక్త వర్ణము కలిసిన తెలుపురంగు కలిగిన చిన్న చిన్న పొడలు శరీరముపై కలిగి చేతితో రుద్దినపుడు పిండివలె నుండు పొడి రాలును. ఇది శరీరముతో సమానముగా బిళ్లలుగా వ్యాపించును. ఇది సాధారణముగా ఛాతీనందు కల్గును. (Ptyriasis versicolor)

**సిరాగత వాతము :** సిరలయందు పోటు,సిరలు వ్యాకోచించుట, లేదా సంకోచించుట, కల్గును. బాహ్యా యామము అంతరాయామము, ఖల్లి, కుబ్జతత్వములను కల్గించును.
**సుప్తకుష్ఠువు :** నల్లని లేదా ఎర్రని వ్రణములు కుండ పెంకు వలె మిక్కిలి కఠినముగా నుండి, ఒక్క ప్రక్క ఎత్తుగా మరొక ప్రక్క పల్లముగా ఉండి, అధికమైన పోటును కల్గించును. దీనినే కపాల కుష్ఠము అందురు. (Anesthetic leprosy)
**సుప్తవాతము :** శరీరము ఏనుగు చర్మము వలెనుండి తాకిన తెలియకపోవుట, శరీరమున మంటగానుండుట, శరీరాంగములు శోషించుట కల్గును.
**సూతికా రోగములు :** బాలింతలకు కలుగు రోగములు ఉదా: జ్వరము, ఒళ్లునొప్పులు, కంపము, శరీర భారము దప్పిక, వాపు, శూల,అతిసారము, రక్తలేమి మొదలగు నవి (Puerperial diseas)
**సూర్యావర్తము :** సూర్యోదయ కాలమున కొంచెముగా ప్రారంభమైన తలనొప్పి మెల్లమెల్లగా పెరుగుచూ మధ్యా హ్నామునకు మిక్కిలి ఎక్కువై కొద్ది కొద్దిగా తగ్గి, సూర్యాస్త మయమునకు పూర్తిగా తగ్గును. రాత్రంతయు ప్రశాంతముగనే ఉండును. (Sinusitis)
**సూక్ష్మము :** శరీరమునందలి సూక్ష్మ రంధ్రములందు కూడా ప్రవేశించునది.
**సేంద్రియ విషశామకము :** సేంద్రియ విషములను విరుచునది. (De-toxifier of the organic toxins)
**సోమ రోగము :** స్త్రీల యందు మూత్ర మార్గము నుండి స్రావము వెడలుట, ఈ స్రావము నిర్మలముగా, చల్లగా ఎట్టి వాసన లేనిదిగా, తెల్లని రంగులో అపరిమితముగా స్రవించుచుండును. ఇందు నోరు ఎండుట, మూర్ఛ, ఒడలి విరుపులు, ఆవలింతలు, శరీరము ఎండిపోవుట కల్గును.
**స్తంభకము :** నిరోధించునది. ఉదా : లొద్దుగ రక్త స్తంభకము. అనగా రక్తస్రావమును నిరోధించును.
**స్తన్య జనకము :** స్తన్య వర్ధకము చూడుము.
**స్తన్య వర్ధకం :** తల్లిపాలను శుద్ధి చేయుట (Lactagogue)
**స్తన్య శోధనము :** తల్లిపాలను శుద్ధిచేయుట
**స్థావర విషనాశకము :** విషయుక్తమై దుంపలు, వ్రేళ్లు (ఉదా. వసనాభి) మొదలగు వాని విషములను నశింప జేయునది.
**స్థావర విషము :** దుంపలు, వ్రేళ్లు మొదలగు వాని విషము ఉదా .

వసనాభి (Posiono of plant origin)

**స్థౌల్య రోగము :** శరీరమునందు క్రొవ్వు అధికముగా వృద్ధి నొందుట. ఇందు ఆయాసము, దప్పిక, మూర్ఛ, అధిక నిద్ర, తుమ్ములు, బద్ధకము, మిక్కిలి ఆకలి, చెమట, శరీర దుర్గంధము. శరీర బలము క్షీణించుట సంభోగ శక్తి తగ్గు మున్నగు లక్షణములు కల్గును. (Obesity)

**స్నిగ్ధము :** నునుపైనది, చమురుగలది. (Smooth,Oily)

**స్నేహనము :** చర్మమును ఉపశమింపజేయుటకు పై పూతగాను, శరీర అంతర్భాగములో కలుగు వాపులు మున్నగు వానిని తగ్గించుటకు అంతర్గతముగనూ వాడు ద్రవ్యము. (Emollient)

**స్పర్శనాశము :** స్పర్శ జ్ఞానమును కోల్పోవుట. (Loss of sense of touch)

**స్ఫుటిత కుష్ఠము :** స్రావయుక్త చర్మవ్యాధి.

**స్రంసనము :** ఆహారమును జీర్ణము చేసి, మలములను బయటకు వెడలించుట.

**స్రోతశ్శోధనము :** శరీరమునందలి నాళములలో ఏర్పడు అడ్డంకిని తొలగించునది (Deobstruent)

**స్వరభేదము :** గాత్ర భంగము చూడుము

**స్వర్యము :** కంఠమునకు హితకరమైనది (Good for voice)

**స్వేదలము :** చెమటను అధికముగా ఉత్పత్తి చేయునది (Diaphoretic)

**స్మృతి :** తెలివి, స్పృహ (Consiciousness)

**స్మృతికరము :** స్పృహను కలిగించునది

**హ**

**హనుస్తంభము :** వాతప్రకోపము వలన నోరు తెరిచిన స్థితిలోగానీ, మూసిన స్థితిలో గానీ స్తంభించిపోవును. ఈ వ్యాధి యందు మాటలాడుట, నమలుట మిక్కిలి కష్టము. (Lock jaw)

**హలీమకము :** శరీరము తెలుపు, పసుపు, నలుపు, ఆకుపచ్చ ఇట్టి రంగులు కలిగి బలము, ఉత్సాహము క్షీణించును. మైకము, అగ్నిమాంద్యము, కొద్దిగా జ్వరము, ఒళ్లు నొప్పులు, దప్పిక, అరుచి కలుగును. (Chlorosis)

**హస్తపాద కంపవాతము :** కరములు, పాదములు వణుకుట, శరీరము తిరుగుట, నిద్రలేమి లక్షణములుగా కలది.

**హస్తపాదాది దాహము :** కరములు, పాదముల యందు మంట. (Burning sensation of the palms and feet)

**హిక్కా :** ఎక్కిళ్లు (Hiccough)

**హృదయశూల :** గుండె నొప్పి (Cardiac pain)

## క్ష

**క్షతము :** గాయము, దెబ్బ (Trauma)

**క్షతక్షీణ :** ఉరఃక్షతము నందు రొమ్ము నొప్పి రక్తపు వాంతులు, దగ్గు లక్షణములచే క్షీణించిన రోగికి మూత్రము రక్తముతో కూడి వెడలును. ఇరుప్రక్కల, వీపు, నడుము, లాగిపట్టిన విధముగా బాధ కల్గును. (Consumption)

**క్షమము :** వ్యాధిని తట్టుకొనగల శక్తి (Resistance)

**క్షుధా వర్ధనీయము :** జీర్ణ రసములను ఉత్పత్తి చేసి, ఆకలిని, జీర్ణశక్తిని పెంచుట. (Stomacic)

## క్షుద్రరోగములు – ఆధునిక వైద్యపుపేర్లు

1. అంతాల్రజీ, అంథాలజీ, అలజి (Simple boils)
2. అగ్నిరోహిణి (infection in the axillae (pustules)
3. అనుశయీా (Multiple cebacious cysts)
4. అరూంషిక (Eczmia face)
5. అరోచకం (Anorexia)
6. అలసక (అడుసుపుండ్లు) (Eczima face)
7. అవపాటిక (Prepucial ulcers & craks)
8. అహిపూతన –ముడ్డిఅనాస (Proctitis ano)
9. ఇంద్రలుప్తము (పేనుకొరుకు) (Aloepacia)
10. ఇంద్రవృద్ధ (Dermatitis)
11. కచ్ఛపీ / కచ్ఛపికా (Condiloma)
12. కటికచ్ఛూ (మొల దురద) (Itching in the waistiline)
13. కదర (ఆన) (Corns)
14. కునఖము (పుప్పిగోరు) (Onychogryphosis)
15. కక్షపిటికా (Herpes of intercostal nerves)
16. కేశదద్రు (Iching at the roots of the Hair)
17. ఖాలిత్వం (Baldness)
18. గంధనామ్ని (Similar to Kaksha pitika baove said)
19. గుదకండూ (Itching in the anus)

20. గుదభ్రంశ (గూద దిగుట) (Prolapse rectum)
21. చర్మకీల (పులిపిరికాయ) (Keloid)
22. చిప్యము–అంగుళివేష్టకము (గోరుచుట్టు) (Witlow)
23. జతుమణి, జంతుమణి (Mole)
24. జాలగర్దభ (Herpes simplex)
25. తిలకాలకం (పుట్టుమచ్చలు) (Phrynoderma)
26. దారుణ (చుండు) Pytiriasis capitis -Dandruff)
27. నిరుద్ధప్రకశ (Phymosis)
28. నీలిక (Black patches on the body other than the face)
29. న్యచ్ఛం (పుట్టుమచ్చ) (Expanded mole)
30. పద్మినీ కంటక (Papilloma)
31. పనసిక (Furunuculosis of the ear)
32. పరివర్తక (Para phymosis)
33. పలితము (తలనెరయుట) (Greying of hair)
34. పాదదారి (కాలి పగుళ్లు) (Rhagades)
35. పాదదాహ (Burning sesnation of the feet)
36. పాషాణ గర్దభ–గవదబిళ్లలు (Mumps or Paroitid tumour)
37. పుంస్తనవృద్ధి (Growth of breasts in Males)
38. మషక /మాష (Elevated mole)
39. ముఖమంగు / వ్యంగము (Black pathes on the face)
40. యవపత్ర్య (Karatosis)
41. యవానపిడిక (Acne, Pimples)
42. వదన దుర్గంధం (Bad odour in the mouth)
43. వరాహ దంత – శూకరదంష్ట్రం (Lupus vulgaris)
44. వల్మీకము (Actinomicosis or madura foot)
45. విదారిక – చంక, గజ్జలలోని బిళ్ల (Bubo)
46. వివృతా–పిటికా (Pustules)
47. వృషణకచ్ఛు (Pruritus scrotum)
48. శర్కరార్బుదము (Cebacious horn)
49. సన్నిరుద్ధగుద (Imperforate anus)
50. స్వరభంగము (Acromastitis)

51. శీతలిక–మసూరిక (Horseness of vioce)
52. చంకలలోని దుర్గంధం (Bad odour in the armpits)
53. బొట్టు పెట్టుకునే చోట పుండు (Ulceratin at the place of tilakam)
54. గుదములనొప్పి (Pain in the heel)
55. సొరియాసిస్ (కిటాభ కుష్ఠము) (Psoriasis)

**ఆయుర్వేదంలో వ్యాధులపేర్లు – అల్లోపతి – (వెస్ట్రన్ మెడిసన్ నందు) దాదాపు సమానమైన నామం**

1. అగ్నిదగ్ధ Fire borns
2. అగ్నిమాంద్య Digestive impairment
3. అజీర్ణ Indigestion
4. ఆమ్లపిత్తం Hyperacidity
5. అన్నద్రవ శూల Gastric Ulcer
6. అపస్మారము Epilepsy
7. అర్బుద Tumor
8. అర్ధావభేదక Hemicramia/migraine
9. ఆర్థితవాతం Facial palsy
10. అరుచి Testelessness
11. ఆర్శం Piles
12. అరుంశిఖ Dandruff
13. అసృగ్ధర Memorrhagia (or) metrorhagia (or) both
14. అతిసారము Diarrhoea
15. అవరోధజన్యకామల Obstructive Jaundice
16. అంగమర్ధన Body ache
17. అంకుశక్రిమి Hookuorm infestation
18. అశ్మరీ Calculus
19. ఆమాతిసార Diarrhoea due to indigestion
20. ఆమదోష Products of impaired digestion and metabolism
21. ఆమవాత Rheumatism
22. అనాహ(స) Distension of abdomen due to obstruction to passage of urine and stools

23. బాధిర్యము Deafness
24. బాలగ్రహ Psychotic syndrome of children
25. బాలరోగములు Disease of children
26. భగందరము Fistula in ano
27. భ్రమ Vertigo
28. చర్ది Emesis
29. దద్రు Taeriasis
30. దౌర్బల్యము Weakness
31. దాహ Buring sensation
32. ధాతుక్షయ Tissva wasting
33. దుష్టవ్రణము Non-healing ulcer
34. గర్భాశయశూల Uterine pain
35. గర్భిణిచర్ది Morning sickness
36. గ్రహణి (aditis / ulcerative colitis/irritable bowel syndrome)
37. గృధ్రశి Sciatica
38. గుల్మ Abdominal lump
39. హిక్కా Hiccup
40. హృద్రోగ Heart disease
41. హృదౌర్బల్యము weakness of the heart
42. హృల్లాసము Navsea
43. ఇంద్రలుప్త Alopecia
44. జలోదర Ascites
45. జ్వర Fever
46. జీర్ణ జ్వరము Chronic fever
47. కఫజశిరోరోగము catarrhal siroroga /simusitis
48. కర్ణశూల otalgia
49. కర్ణస్రావ Otorrhoea
50. కర్ణరోగము Disease of ear
51. కండూ Itching
52. కంఠరోగము Disease of throat
53. కష్టావర్తము Dysmenorrhoea

54. కటిశూల Lower backache
55. కుష్ఠ Leprosy/diseases of skin
56. కామల Jandice
57. కార్శ్య Emaciation
58. కాస Cough
59. క్రిమి Worm infestation
60. క్షతఃక్షీణ Debility due to chest injury
61. క్షయ Pthisis
62. మాద intoxication
63. మధుమేహ Diabetes mellitus
64. మదాత్యయ Alcoholism
65. మహాకుష్ఠ Group of major skin diseases
66. మేదోరోగము Obesity
67. మోహ delusion
68. ముఖశోష Dryness of mouth
69. ముఖరోగ Disease of mouth
70. మూర్ఛ Syncope
71. మూత్రాఘాత Urinary obstruction loleguria
72. మూత్రకృచ్ఛ Dysuria
73. మూత్రరోగము Urinary diseases
74. మూత్రవికార Urinary diseases
76. నేత్రరోగము Diseas of the eye
77. పామా Eczema
78. పాండు Anaemia
79. పార్శ్వశూల Intercostal neuraligia and pleurodynia
80. పీనస Chronic rhirutis / sinusitis
81. పృష్ఠశూల Lumbago
82. పక్షాఘాత Paralysis / Hemiplegia
83. పక్షవాతం Paralysis / Hemiplegia
84. పిడక Carbuncle
85. ప్లీహరోగము Splenic disease

86. ప్లీహ వృద్ధి Splenomegoly / Enlargement of speen
87. ప్రదర Excessive vaginal dischagrs
88. ప్రలాప Delirium
89. ప్రమేహ Metabolic disoroler
90. ప్రతిశ్యాయ Coryza
91. ప్రవాహిక Dysentery
92. పూయమేహము Urinary infection
93. రక్తార్శ Bleeding piles
94. రక్తాస్థిద్రవణ Haemoptysis
95. రక్తదోష Disorder of blood
96. రక్తగత వాతము Hypertension
97. రక్తపిత్తము Bleeding disorder
98. రక్తప్రదర Menorrhagia (or) metrorrhaiga
99. రక్తస్రావ Bleeding disorder
100. రాజయక్ష్మ Tuberculosis
101. సంధిశోధ Arthritis
102. సంధిశూల Joint pain
103. సంధివాత Arthritis due to vata dosa
104. సన్నిపాత జ్వరము High fever due to vilation of al dosa
105. సంతర్పణ జయ Disorders due to obesity
106. సంతాప Emotional stress
107. స్థౌల్య Obesity
108. స్త్రీ రోగము Gynaecological disorders
109. స్వరభేద Hoarseness of voice
110. సూతికాజ్వర puerperal fever
111. శిరఃశూల Headache
112. శిరోరోగము Disease of head
113. శీతపిత్తము Uricaria
114. శ్లీపదము Filariasis
115. శోష Emaciation
116. శోఫ Oedema

117. శోధ Inflammation
118. శ్రమ Fatigue / lethargy
119. శుక్రదౌర్బల్యము Seminal stress
120. శూల Pain / colic
121. శ్వాస Asthma
122. శ్వేతకుష్ఠ Leucoderma
123. శ్వేతప్రదర Leucorrhoea
124. శ్విత్రము Leucoderma/vitiligo
125. తమకశ్వాస Bronchial asthma
126. తంద్ర Drowsiness
127. తిమిర Cataract
128. తృష్ణ Thirst
129. త్వక్‌రోగము Skin diseases
130. ఉదర Disease of abdomen
131. ఉదర్ధ(శీతపిత్తం) Urticaria
132. ఉదరశూల Pain in the abdomen
133. ఉదావర్తము Partial intestinal obstruction
134. ఉన్మాదము Mania / psychosis
135. ఉరఃక్షతము Pulmonary Cavitalion
136. ఊరుస్తంభవాతం Stiffness in thigh muscles
137. వమనము Emesis
138. వస్థిరోగము Disease of urinary system
139. వస్తి వికారము Bladder disorders
140. వాతార్శ్మ Piles (dry)
141. వాతరక్త Gout
142. వాతరోగ Disease due to vata dosa
143. వాతవికార/వ్యాధి Disorders due to to vata dosa
144. విబంధ Constipation
145. విచర్చిక Eczema
146. విదాహ Burning sensation
147. విద్రధి Abscess

148. విసర్పి Erysipelas
149. విషమజ్వర Intermittent fever
150. విషవికార Disorders due to poison
151. వ్రణ Ulcer
152. వృక్కరోగము Renal disorder
153. యకృతోదర Enlargement of liver/hepatomegaly
154. యకృత్ప్లీహ వికారము Disease of liver and spleen
155. యకృత్ వికారము Disorder of liver
156. యక్ష్మ Tuberculosis
157. యవానపిడిక Pimples / Acne vulgaris
158. యోనిశూల Pain in female genital tract
159. యోనిరోగ Disease of female genital tract

## సంస్కృత-తెలుగు-ఇంగ్లీషు వ్యాధులపేర్లు

1. అగ్నిదగ్ధము (ఒళ్లుకాలుట) బర్న్స్, స్కాల్ట్స్
2. అగ్నిమాంద్యము (అజీర్ణము) డిస్పెప్సియా
3. జలవాయు అగ్నిమాంద్యము (నీరుగాలివల్ల అజీర్ణం) సీజనల్ డిస్‌పెప్సియ
4. అజీర్ణము – ఇన్‌డైజెషన్
5. అలసకము – (కడుపుబ్బరం) గ్యాస్
6. అతిసారము (విరేచనాలు) అక్యూట్ డయేరియా
7. రక్తాతిసారము (నెత్తురువిరేచనాలు) డిసెంట్రీ
8. అంత్రశోధజ అతిసారము – డయేరియా ద్యుటు కొలయిటీస్
9. జ్వరాతిసారము–డయారియా విత్ ఫీవర్
10. గుదభ్రంశము (మలద్వారం బయటకు వచ్చుట) ప్రొలాప్స్ ఏనాస్
11. ప్రవాహిక (బంకవిరేచనాలు) డీసెంట్రీ
12. అంతరిక విద్రది (కడుపులో పుండు) ఇంటీరియల్ ఏబ్సస్
13. అంత్రవిద్రది (బుడ్డ) హెర్నియా
14. ఆంద్రపృచ్ఛప్రదాహ (24గంటలనొప్పి) అపెండిసయిటిస్
15. అపస్మారము (సొమ్మరోగము) ఎపిలెప్సీ
16. ఆమ్లపిత్తము (పులిత్రేన్పులు) హాయిపర్ ఎసిడిటి

17. అరోచకము (అరుచి) ఎనోరెక్సియా
18. అర్బుదము (పుట్టకురుపు) ట్యూమర్
19. అర్మస్సు (మూలవ్యాధి) ఎన్‌లార్జ్‌డ్ ప్రొస్టైటిస్
20. అశ్మరీ మూత్రాశ్మరీ (మూత్రములోరాయి) స్టోన్ ఇన్ బ్లాడర్
21. అష్ఠీలా (మూత్రగ్రంధివాపు) ఎన్‌లార్జెడ్ ప్రొస్టైటెస్
22. అస్థిభంగ (ఎముకవిరుగుట) ఫ్రాక్చర్ ఆఫ్ బోన్
23. అస్థిక్షయము టుబర్‌కులేసిస్ ఆఫ్ బోన్, ఆస్టియో మైలైటిస్
24. ఆధ్మానము (కడుపుబ్బరం) టింపేనాయిటిస్
25. ఆనాహము (మలబద్ధకం) కాన్స్టిపేశన్
26. ఆమవాతము (కీళ్ళనొప్పులు,వాపులు) రుమాటాయిజం
27. ఆమాశయవ్రణము (పరిణామశూల)
పెప్టిక్ అల్సర్ గ్రాస్టిక్ అండ్ డుయోడినల్ అల్సర్స్
28. ఉదరరోగము– డిసీజ్ ఆఫ్ డియోడినమ్
29. యకృత్ప్లీహోదరము–కాలేయం,ప్లీహం పెరుగుదల
ఎన్‌లార్జ్‌మెంట్ ఆఫ్ లివర్ & స్ప్లీన్
30. జలోదరము– అసయిటిస్
31. ఉన్మాదము–పిచ్చి ఇన్‌సానిటీ
32. ఉపదంశము–సెగమేహం హార్డ్ సాఫ్ట్ చాంకర్ సిఫిలిస్
33. ఉరస్తోయము– ప్లూరసీ
34. కర్ణపాకము–చెవిలోపుండు సైప్పెల్ ఇన్ ది ఇయర్
35. కర్ణస్రావము–చెవిలో చీము ఒటేరియా
36. కర్ణక్ష్వేడము–చెవిదిబ్బడ టిన్నిటయిటీస్
37. కామలా–పసరికలు(కామెర్లు) జాండీస్
38. కాస–దగ్గు– కాఫ్
39. ఆర్ద్రకాస–కఫముదగ్గు– కాఫ్ విత్ ఎక్స్‌పెక్టొరేషన్
40. జీర్ణకాస క్రానిక్ కాఫ్
41. ఉరఃక్షతము బ్లీడింగ్ ఫ్రమ్‌లంగ్స్, హిమాప్లయిసిస్
42. కంఠ,గళరోగములు–గొంతురోగాలు డిసీజెస్ ఆఫ్ త్రోట్
43. స్వరభేదము–బొంగురుగొంతు హోర్స్‌నెస్
44. గలాయు–అంగటిముల్లు టాన్సిలయిటిస్
45. అధిజిహ్వక–యువ్వలయిటిస్ కొండనాలుకపెరగటం

| | |
|---|---|
| 46. గలౌఘ | ట్యుమర్ ఇన్ ది త్రీట్ |
| 47. కృమిరోగము-కడుపులోపురుగులు | వర్మ్ |
| 48. కుష్ఠము- కుష్ఠు- | లెప్రసీ |
| 49. గలగండ | గాయిటర్ |
| 50. గండమాల | స్రొఫులా |
| 51. అపచీ | క్రానిక్‌లింఫ్ అడినైటిస్ |
| 52. గుల్మము | లోకలైజ్డ్ అబ్డామినల్, ట్యూమర్ ఆర్ స్వెల్లింగ్ |
| 53. గ్రహణిరోగం | స్ప్రూ, మాల్ అబ్సార్ప్షల్ సిండ్రోమ్ |
| 54. ఆంత్రక్షయము | ఇంటెస్టై-నల్ ట్యుబర్క్యులోసిస్ |
| 55. పామా,కచ్ఛు-గజ్జి,దురద | స్కేబిస్ |
| 56. విచర్చికా-నసిమిరి | డ్రై అండ్ వీపింగ్ ఎగ్జిమా |
| 57. అరూంషికా | ఫరుంకులోసిస్ |
| 58. యవానపిడకా-మొటిమలు | ఎక్నే |
| 59. దద్రు | రింగ్‌వర్మ్ ఇన్‌ఫెష్టేషన్ |
| 60. పాదదారి-కాళ్ళుపగులుట | చాప్‌డ్ సోల్స్ |
| 61. అహిపూతనా-ముడ్డిఎరుపు | నేప్‌కిన్‌రాష్, సోర్‌బటర్స్ |
| 62. వృషణకచ్ఛూ | ఎగ్జిమా ఆఫ్ ది స్క్రోటమ్ |
| 63. చిప్ప,కునఖము | బనిఖయా |
| 64. ఛర్ది-వాంతులు | వామిటింగ్ |
| 65. జ్వరము | ఫీవర్ (పైరెక్సియా) |
| 66. వాతశ్లేష్మ జ్వరము | ఇన్‌ఫ్లూయెంజా |
| 67. పునరావర్తక జ్వరము | రిలాప్సింగ్ ఫీవర్ |
| 68. అన్యేదుష్క జ్వరము-విషజ్వరము | మిక్స్‌డ్ మలేరియా ఫీవర్ |
| 69. తృతీయకజ్వరము-వరుసజ్వరము | టెర్షియన్‌ఫీవర్ |
| 70. చతుర్థక జ్వరము | క్వార్టన్‌ఫీవర్ |
| 71. ప్రలేపక జ్వరము | హెక్టిక్ ఫీవర్ |
| 72. సన్నిపాత జ్వరము | టైఫాయిడ్ |
| 73. ఆంత్రిక జ్వరము | ఎంటరిక్ ఫీవర్ |
| 74. గ్రంథిక జ్వరము-మహామారీ | ప్లేగ్ |
| 75. పాషాణగర్ధభజ్వరము-గవదబిల్లలు | ముంప్స్,పారోటైటిస్ |
| 76. రాజయక్ష్మ-క్షయ | థాయిసిస్/ట్యూబర్‌కులోసిస్ |

77. తృష్ణ–దప్పికపోలీడెప్సియా, ఎక్ససీవ్ తర్ట్స్
78. దాహము–మంట డిహైడ్రేషన్,బర్నింగ్ సిండ్రోమ్
79. ధాతుక్షయము–ధాతునష్టము,నపుంసకము ఇంపొటెన్సీ,న్యూరస్థేనియా
80. ప్రతిశ్యాయము–జలుబు కోరాయిజా కామన్‌కోల్డ్
81. పీనసము ఓజెనాసైన సైటిస్
82. నేత్రాభిష్యందము–కండ్లకలక కంజంక్టైవయిటిస్
83. కుకూణకము–ఆవిరి కంజంక్టవయిటీస్
84. అర్మ టెరీజియమ్
85. ఫోథకీ–దుర్మాంసము ట్రాకోమా
86. అంజననామికా స్టాయియా
87. దివాంధ్యము–గ్రుడ్డి బ్లయిండ్‌నెస్
88. స్రవణ,అస్రవణశుక్లము ఎడరెంట్‌ట్యోకోమా
89. దృష్టి దౌర్బల్యము–సరిగాకనిపించకపోవుట వీక్ ఐ సయిట్
90. తిమిరము–శుక్లాలు పెరుగుట కాటరాక్ట్
91. ప్రమేహము–యూరినరీ డిసీజస్ లీడింగ్‌టు డయాబెటస్ మెలిటస్
92. ప్రమేహపిడకలు–రాచపుండు కార్బంకల్
93. పాండురోగము–రక్తహీనత,రక్తలేమి ఎనీమియా
94. బాలజ్వరము ఇన్‌సాటైల్ ఫీవర్
95. బాలాతిసారము–పిల్లలవిరేచనములు ఇన్‌ఫాంటైల్ డయోరియా
96. బాలరక్తాతిసారము–రక్తవిరేచనలు డీసెంట్రీ
97. మలావరోధము–మలబద్దకం కాన్‌ష్టిపేషన్
98. కుక్కురకాస–కోరింతదగ్గు ఊఫింగ్ కాఫ్
99. ఉదరశూల–కడుపునొప్పి పెయిన్ ఇన్ అబ్డామిన్
100. ఫక్క రోగము–పిత్తబారుట,పిట్టబారుట రికెట్స్
101. తాలుపాక–నోటిపూత మౌత్ అల్సర్స్
102. భగంధరము– పిస్టులా ఎనో
103. భ్రమ – తలతిరుగుట గిడ్డినెస్
104. మదాత్యయము–తప్పతాగుట ఆల్‌కహోలిజమ్
105. మసూరిక–అమ్మవారు స్మాల్‌ఫాక్స్
106. మూర్ఛ,సన్యాసము సింకోప్
107. ఖలివర్ధన–దంతరోగం విస్‌డమ్ టూత్

108. కృమిదంత–పిప్పిపన్ను కేరీస్ ఆఫ్ ది టీత్
109. దంతహర్ష–పంటిసలుపు సెన్సిటివ్ టూత్
110. మూత్రాఘాతము–మూత్రంఆగుట రిటింషన్ ఆఫ్ యూరిన్
111. మూత్రకృచ్ఛము–కష్టమూత్రము డైసూరియా
112. రక్తమేహము–మూత్రములోనెత్తురుపోవుట హెమటూరియా
113. మేదోవృద్ధి–స్థూలకాయం ఒబెసిటి
114. రక్తపిత్త హెమరేజిక్ డిసీజ్
115. ముక్కునుండి రక్తంకారుట(నాసాగతరక్తపిత్తం) ఎపిస్టాక్సిస్
116. రోమాంతిక–చిన్నమ్మవారు మీసిల్స్
117. వాతవ్యాధి – డిజీజెస్ ఆఫ్ నెర్వస్ సిస్టమ్
118. అర్థితవాతం –ముఖపక్షవాతం ఫేషియల్ పెరాల్‌సిస్
119. పక్షాఘాత–పక్షవాతము పెరాలసిస్
120. ఖంజవాత–కుంటితనము లేమ్‌నెస్
121. గృధ్రసీ–తుంటినొప్పి సయాటికా
122. విశ్వాచి–చేతినొప్పి,వ్యాధి బ్రెఖియల్‌న్యూరాల్జియా
123. సంధిగతవాత–కీళ్ళనొప్పులు ఆర్థ్రటిస్
124. క్రోష్టుకశీర్ష–నక్క తలవాపు ఆర్థ్రయిటిస్ ఆఫ్ నీ జాయింట్
125. మన్యాస్తంభ–మెడపట్టుట టోర్టికోలిస్
126. హనుస్తంభ – దవుడపట్టుకొనుట లాక్‌జా
127. వాతకంటక – చీలమండనొప్పి స్ప్రెయిన్ ఆఫ్ ద అంకిల్
128. కటిశూల–నడుమునొప్పి లంబాగో
129. కంపవాత–వణుకుట ట్రెమర్స్
130. ఆక్షేపక–కంపము కన్వల్షన్స్
131. వాతరక్త–వాతరక్తము గౌట్
132. విష–విషం పాయిజనింగ్
133. అలర్కవిష–పిచ్చికుక్కకాటు రాబిస్
134. విశూచిక–కలరా గాస్ట్రోఎంటిరైటిస్
135. విసర్పి,విస్ఫోట–సర్పి ఎరిసిపిల్స్
136. వృక్కరోగములు–మూత్రపిండరోగాలు కిడ్నీడిసీజ్
137. వ్రణశోథ–వ్రణం ఇన్ఫ్లమేషన్
138. వృషణవృద్ధి, శోథ ఎన్‌లార్జ్‌మెంట్ ఆఫ్ స్క్రోటం, ఆర్కైటిస్

139. అర్ధావభేదము–పార్శ్వనొప్పి,అరతలనొప్పి హెమిక్రేనియా
140. సూర్యావర్తము,ప్రొద్దుపొడుపునొప్పి క్రానిక్ సైనసైటిస్
141. పాలిత్య–నెరయుట గ్రేహెయిర్
142. ఖాలిత్యము–వెంట్రుకలూడుట ఎరోపిశియా
143. అరూంశిక–తలలో పుండ్లు బాయిల్స్ ఆన్‌స్కాల్ఫ్
144. శీతపిత్తము–దద్దుర్లు అర్టికేరియా
145. శూల–కడుపునొప్పి కొలిక్‌పెయిన్
146. శోఫ (శోధ) నంజు ఒడెమా
147. శ్లీపదము–బోదకాలు ఎలిఫెంటియాసిస్
148. శ్వాసరోగము–ఉబ్బసము బ్రాంకియల్ ఆస్తమా
149. స్నాయుకరోగము–నారికురుపు–గినియావర్మ్,డ్రాకాంన్‌టియాసిస్
150. శ్వేతప్రదరము–తెల్లకుసుమ లుకోరియా
151. రక్తప్రదరము–ఎర్రబట్ట మెట్రోరేజియా
152. కష్టార్తవ–ముట్టునొప్పి డిస్‌మెనోరియా
153. నష్టార్తవ–ముట్టుఆగుట,ఋతుస్రావంనిలచుట అమెనోరియా
154. భగశోధ–యోనివాపు వల్వైటిస్
155. యోనిదాహము, యోనికండు–యోనిమంట,దురద బర్నింగ్ సెన్సేషన్ & ప్రూరైటిస్ ఆఫ్ ది వల్వా
156. రక్తగుల్మ–రక్తగడ్డలు యుటెరైన్ ట్యూమర్
157. యోనిభ్రంశ–గర్భాశయపాతము ప్రొలాప్స్ ఆఫ్ యూటిరస్
158. గర్భస్రావము,గర్భపాతము–కడుపుపోవుట –అబార్షన్,మిస్‌క్యారేజ్
159. మక్కలశూల–బాలింతరోగము ఆఫ్టర్‌పేయిన్స్
160. సూతికాజ్వరము–బాలింతజ్వరము ప్యురిపిరల్ ఫీవర్
161. స్తన్యదోష లాక్టిక్ డిసార్డర్స్
162. స్తనవిద్రధి–చనుగడ్డ ఆబ్సెన్స్ ఆఫ్ ద బ్రెస్ట్
163. శ్విత్రము–బొల్లి ట్యూకోడెర్మా
164. హృద్రోగము–గుండెజబ్బులు డిసీజ్ ఆఫ్ హార్ట్
165. హిక్కా–ఎక్కిళ్లు హిక్కాఫ్

## సాధారణంగా ఆయుర్వేద ఆసుపత్రులలో, చికిత్సా కేంద్రాలలో ఉండే మందుల జాబితా

| క్ర. | మందు పేరు | ఉపయోగం | మోతాదు | జాగ్రత్తలు |
|---|---|---|---|---|
| | | **1. ఆసవాలు, అరిష్టాలు** | | |
| 1. | అభయారిష్టా | అర్శ,అగ్నిమాంద్యం ఉదరరోగం,విబంధము | 12-24మి.లీ భోజనం తర్వాత,నీళ్ళలోకలుపుకొని రోజుకు 2సార్లు | - |
| 2. | అమృతారిష్టా | సర్వజ్వరములు,జీర్ణజ్వరములు | పై వలె | - |
| 3. | అరగ్వదారిష్టా | కండూ,త్వక్ వికార్ | పైవలె | - |
| 4. | అరవిందాసవ | బాలరోగం,బాలక్షయ,అరుచి,అగ్నిమాంద్యము | పైవలె | - |
| 5. | అర్జునారిష్టా (పార్థాధ్యారిష్టా) | హృద్రోగం,హృదయదౌర్బల్యము, మోహ, మూర్ఛ | పైవలె | - |
| 6. | అశోకారిష్టా | అసృగ్ధరము,శ్వేతప్రదరం,యోనిరోగ | పైవలె | - |
| 7. | అశ్వగంధారిష్టా | మూర్ఛ,అపస్మార,శోష,ఉన్మాద,కార్శ్య | పైవలె | - |
| 8. | బలారిష్టా | దౌర్బల్యము,వాతరోగము,అగ్నిమాంద్యము,కార్శ్య | పైవలె | - |
| 9. | చందనాసవ | శుక్రమేహ,మూత్రకృచ్ఛ | పైవలె | - |
| 10. | దశమూలారిష్టా | వాతవ్యాధి,దౌర్బల్య,ప్రసవోత్తరరోగము | పైవలె | - |
| 11. | ద్రాక్షాసవ | అరుచి,హృద్రోగ,పాండుదౌర్బల్య,కార్శ్య | పైవలె | - |
| 12. | దంత్యాద్యారిష్టా | శోధ,గుల్మ,విబంధ,గ్రహణీరోగ | పైవలె | గర్భవతులువాడరాదు |
| 13. | ద్రాక్షారిష్టా | అగ్నిమాంద్యము,కాస,శ్వాస,ఉరఃక్షత క్షయ,మలావరోధము, దౌర్బల్యము | పైవలె | - |

| | | | | |
|---|---|---|---|---|
| 14. | జీరకాద్యారిష్టా | సూతికారోగ,అగ్నిమాంద్య,అతిసార,గ్రహణిరోగం | పైవలె | – |
| 15. | కనకాసవ | కాస,శ్వాస,రాజయక్ష్మ,క్షతక్షీణ | పైవలె | – |
| 16. | కుమార్యాసవ | రజోదుష్టి,కష్టావర్తం,పంక్తిశూల,పరిణామశూల | పైవలె | – |
| 17. | కుటజారిష్టా | గ్రహణీరోగ, ప్రవాహిక,రక్తాతిసార,అగ్నిమాంద్య | పైవలె | – |
| 18. | ఖదిరారిష్టా | త్వక్‌రోగం, కుష్టు,క్రిమి,అర్బుదము | పైవలె | – |
| 19. | లోధ్రాసవ(రోధ్రాసవ) | ప్రమేహం,ప్రదరము,ఆర్శ్య,గర్భాశయరోగాలు | పైవలె | – |
| 20. | లోహాసవ | పాండు,కామల,శోద,హృద్రోగ,దౌర్బల్యము | పైవలె | – |
| 21. | ముస్తకారిష్టా | అగ్నిమాంద్య,అజీర్ణ,గ్రహణీరోగం,విశూచికా | పైవలె | – |
| 22. | పిప్పల్యాద్యాసవ | గ్రహణీరోగం,అగ్నిమాంద్యం,గుల్మము,ఉదరరోగం | పైవలె | – |
| 23. | రోహితకారిష్టా | ప్లీహ,ఉదరరోగం,గుల్మ,కామిలా | పైవలె | – |
| 24. | సారస్వతారిష్టా | అపస్మార,మానసదోషములు,స్మృతిభృంశము,ఉద్వేగం | పైవలె | – |
| 25. | తక్రారిష్టా | అగ్నిమాంద్య ఆర్శ,శోధ,గుల్మము | పైవలె | – |
| 26. | ఉసీరాసవ | పిత్తజరోగ,దాహం,నేత్రవ్యాధి | పైవలె | – |
| 27. | వాసకావస | కాస,శ్వాస,రక్తపిత్త | పైవలె | – |
| 28. | పునర్నవాసవ | శోధ,ప్లీహయకృత్,రోగములు,మూత్రరోగాలు | పైవలె | – |
| 29. | కనకాసవ | కాస,శ్వాస | పైవలె | గర్భవతులు,గుండె జబ్బుగలవారువాడరాదు |
| 30. | కర్పూరాసవ | అతిసార,విశూచిక,ఉదరరోగం | పైవలె | ,, ,, |

## 2. అర్క కల్పములు

| క్ర. | మందుపేరు | ఉపయోగం | మోతాదు | జాగ్రత్తలు |
|---|---|---|---|---|
| 1. | అజువాన్-యవానీ (అర్కములు/వాముఅరఖు) | త్రికశూల,అగ్నిమాంద్యము,అనాహము | 10-25 మి.లీ. 2-3సార్లు ఒకరోజులో | - |
| 2. | శతపుష్పార్క్/ మిశ్రీయార్క్ | మందాగ్ని,అద్మానము,శూల,క్రిమి, | పైవలె | - |
| 3. | పుదీనాఅర్క్ | చర్ది,అజీర్ణము,ఉదరశూల,అగ్నిమాంద్యము | పైవలె | - |

## 3. అవలేహ, ఖండ్, పాకములు

| క్ర. | మందుపేరు | ఉపయోగం | మోతాదు | జాగ్రత్తలు |
|---|---|---|---|---|
| 1. | అగస్త్యహరీతకీ (అగస్త్యరసాయం) | హిక్కా,కాస,శ్వాస,రసాయనం | 5-15 గ్రా 2 లేదా 3సార్లు | - |
| 2. | బిల్వాదిలేహ్యం | జీర్ణప్రవాహిక, అరుచి, అగ్నిమాంద్యము,ప్రసేక, చర్ది | 10-50గ్రా. పాలు లేదా వేడినీరుతో | - |
| 3. | భల్లాతకాదిమోదక | అర్శ, సంధివాతము | 3-5గ్రా నీరు లేదా పాలు, 2సార్లు | - |
| 4. | బ్రహ్మీరసాయం | మనోదౌర్బల్యము,జరా,స్మృతిభ్రంశము | 10-15గ్రా.పాలులేదావేడినీరు | - |
| 5. | చిత్రకహరీతకి | పీనస, కాస, శ్వాస | 10-50గ్రా.పాలులేదా వేడినీరు | - |
| 6. | చ్యవనప్రాశ్యఅవలేహం | కాస, శ్వాస, రసాయనం | 12-24గ్రా.పాలులేదా నీరు | - |
| 7. | ద్రాక్షావలేహ | పాండు, కామలా, హలీమకము, దౌర్యబల్యం,క్షయ | 6-12గ్రా. వేడినీరు లేదా పాలు | - |
| 8. | హరిద్రాఖాండపాక | శీతపిత్తము,కండూ,విస్ఫోట,దద్రు,కోథ,ఉదర్థ | 6గ్రా.నీరు లేదా పాలు | - |
| 9. | కుటజావలేహ్యం | అతిసార,గ్రహణీరోగం, ప్రవాహిక | 6-12గ్రా.నీరు లేదా తక్రము | - |
| 10. | కళ్యాణవలేహ్యం | ఉదరరోగం,గుల్మం,భగంధరం,అర్శ | 6-12గ్రా. వేడినీరు | - |

| | | | | |
|---|---|---|---|---|
| 11. | కంటకార్యావలేహ్యం | హిక్కా,కాస,శ్వాస,జీర్ణప్రతిశ్యాయ,పార్శ్వశూల | 6–12గ్రా.వేడీనీరు,పాలు | – |
| 12. | కూష్మాండ రసాయన | కాస,శ్వాస, ఉరఃక్షయ,రక్తపిత్త,ఆమ్లపిత్త | 6–12గ్రా. వేడినీరు,పాలు | – |
| 13. | మణిభద్రయోగ/ మణిభద్రగుడము | కుష్ఠం,శ్విత్రం, శ్వాస,కాస, ఉదరరోగం ప్లీహరోగం, క్రిమి, ఆర్శ | 6–12 గ్రా.వేడినీరు లేదా పాలు | – |
| 14. | పుగఖాండ్/సుపరిపాక | వంధ్యారోగ,ప్రదర,సోమరోగం,గర్భదోషం,దౌర్బల్య | ,, ,, | – |
| 15. | సౌభాగ్యశౌంఠిపాకం | ప్రసవోత్తర లక్షణము,సూతికారోగ,అగ్నిమాంద్యం | 10–50 గ్రా.రాత్రి పడుకునేముందు పాలు లేదా వేడినీరు | – |
| 16. | శతావరిగుడ | రజోదోష, యోనిదోష,అసృగ్ధర,పాదదాహకార్శ | 6–12గ్రా. వేడినీరులేదాపాలు | – |
| 17. | సుకుమారరసాయన | వృద్ధి,గుల్మ,స్త్రీరోగ,ఆపానం | 1–2టీస్పూన్ వేడినీరుభోజనంతర్వాత | – |
| 18. | వాసావలేహ్యము | కాస,శ్వాస,జ్వర,పార్శ్వశూల | 6–12గ్రా.వేడినీరు లేదాపాలు | గర్భవతులువాడరాదు |
| 19. | వ్యాఘ్రిహరీతకీ | కాస,శ్వాస,స్వరక్షయ ప్రతిశ్యాయ పీనస | 6–12 గ్రా పాలు లేదా గోరువెచ్చని నీరు | గర్భవతులు వాడరాదు. |
| 20. | మధుస్నూహిరసాయనం మధుస్నూహివ్యాధిరసాయనం | ప్రమేహపిడిక, అర్బుద, గండమాల భగందరము, గుహ్యవ్రణ, జీర్ణ త్వక్‌రోగములు | 6–12గ్రా, వేడినీరుతో | – |

**4. క్వాథ చూర్ణములు / కషాయాలు**

| | | | | |
|---|---|---|---|---|
| 1. | అరగ్వధాది క్వాథ చూర్ణం | విషవికార, కఫవికార, ప్రమేహ దుష్టావర్తన, కుష్ఠ, రక్తదుష్టి | 25–50 మి.లీ.క్వాథ | – |

| | | | | |
|---|---|---|---|---|
| 2. | అమృతోత్తరక్వాధచూర్ణం | జీర్ణజ్వరం, సన్నిపాతజ్వరం నాగరాదిక్వాధచూర్ణం | 25-50 మి.లీ.క్వాధ | గ్యాస్టిక్,నీళ్ళవిరేచ నాలు అగువారు వాడరాదు |
| 3. | అమృతోత్తర కషాయచూర్ణం | సర్వజ్వరాలు | ,, ,, | - |
| 4. | భారంగాది క్వాధచూర్ణం | శ్వాస,కఫజకాస | 25-50 మి.లీ.క్వాధ | - |
| 5. | బృహత్త్రయాది కషాయచూర్ణం | మూత్ర కృచ్ఛ | ,, | - |
| 6. | బృహత్మాంజిష్టాది కషాయచూర్ణం | వాతరక్త ఉపదంశ,శ్లీపద మేదోరోగ | ,, | - |
| 7. | దశమూలక్వాధచూర్ణం | జ్వర,సూతికాదోష,శూల,శోధ,వాతవ్యాధి | ,, | - |
| 8. | దేవదార్యాదిక్వాధచూర్ణం | శూల,సూతికారోగము,శ్వాస,కాస,జ్వరం | ,, | - |
| 9. | దశమూలకటుత్రయ క్వాధ చూర్ణము | శ్వాస,కాస, పార్శ్వ శూల, వాతరోగము | ,, | - |
| 10. | దశమూలకటుత్రయాది కషాయచూర్ణం | వాతకకాస,శిరఃశూల | ,, | - |
| 11. | ధాన్య పంచక కషాయచూర్ణం | ఆమశూల, ఆమాతిసార అరుచి, అగ్నిమాంద్యము | ,, | - |
| 12. | ద్రాక్షాది కషాయచూర్ణం | పాండు,దాహదౌర్బల్యము | ,, | - |
| 13. | ఎలాకణాదికషాయచూర్ణం | క్షయ, దౌర్బల్య | ,, | - |
| 14. | గంధర్వాహస్త్యాది కషాయచూర్ణం | వాతరోగ, మలబంధ | ,, | - |

| | | | | |
|---|---|---|---|---|
| 15. | గోజిహ్వాదికషాయచూర్ణం | ప్రతిశ్యాయము,శ్లేష్మజ్వరం,కాస,శ్వాస | ,, | – |
| 16. | గుడుచ్యాదికషాయచూర్ణం | అగ్నిమాంద్య,జ్వర పిత్తదుష్టి | ,, | – |
| 17. | ఇందుకంఠం కషాయచూర్ణం | వాతరోగ, క్షయ | ,, | – |
| 18. | మంజిష్టాది కషాయచూర్ణం | కుష్ఠ,చక్షురోగము ముఖరోగము | ,, | – |
| 19. | మహా ఆత్మగుప్తాది కషాయచూర్ణం | పక్షవాతం | ,, | – |
| 20. | నయోపయం కషాయంచూర్ణం | వాతరోగ శ్వాసరోగ | ,, | – |
| 21. | పంచవల్కల కషాయచూర్ణం | వ్రణశోధ,ఉపదంశ, శ్వేతప్రదరము | 100మి.లీ.క్వాదంతో గాయము/యోనికడగాలి | – |
| 22. | పత్యాదిక్వాధ (షడంగ)చూర్ణం | శిరోరోగ,చెవిరోగ అర్ధావభేదం, సూర్యావర్తం | 25–50మి.లీ.క్వాధం బెల్లంతో/చెరకురసంతో కలిపివాడాలి. | చర్ది,అతిసారం వాతప్రకోపములు పెంచును. |
| 23. | ఫలాత్రికాది క్వాధచూర్ణము | కామల, పాండు | 25–50 మి.లీ క్వాధం మిశ్ర,తేనె,యష్టిమధు చూర్ణంతో వాడాలి. | పై వలెనే. |
| 24. | పునర్ణవాది క్వాధ చూర్ణము | సర్వాంగ శోధ | 25–50మి.లీ.క్వాధం | పైవలెనే |

| | | | | |
|---|---|---|---|---|
| 25. | పాషాణ భేది చూర్ణము | అశ్మరీ | ,, | – |
| 26. | రాస్నాపంచక కషాయచూర్ణం | ఆమవాతం | 25–50మి.లీక్వాధం చెరకురసంతోవాడాలి | – |
| 27. | రాస్నాసప్తక కషాయచూర్ణం | జంఘశూల,ఉరుఃశూల పార్శ్వశూల,త్రికశూల, పిష్టిశూల | 25–50మి.లీ.క్వాధం శొంఠిచూర్ణంతో | గర్భిణీస్త్రీలు వాడరాదు |
| 28. | సహచర్యాది కషాయచూర్ణం | వాతరోగం, సంధిగ్రహ | 25–50మి.లీ.క్వాధం | – |
| 29. | షడంగక్వాథ చూర్ణం | తీక్ష్ణజ్వరం | ,, | వాంతులుఅయ్యే భ్రమ కల్గును. |
| 30. | సుకుమార కషాయచూర్ణం | వృద్ధి,గుల్మము | .. | – |
| 31. | తృణపంచమూల క్వాధచూర్ణం | మూత్రకృచ్ఛ | ,, | – |
| 32. | వరుణాది క్వాథ చూర్ణం | అశ్మరీ, మూత్రాష్ఠిలా | 25–50 మి.లీక్వాధం యవాక్షారంతో కలిపి | – |
| 33. | వసగుడూచ్యాది చూర్ణం | పాండు,రక్తపిత్తం | 25–50మి.లీ. యవాక్షారంతో కలిపి | – |
| 34. | వ్యాఘ్ర్యాధి కషాయంచూర్ణం | శ్వాస,జ్వర,శూల | ,, | – |

| | | | | |
|---|---|---|---|---|
| 35. | వ్యోషాదికషాయచూర్ణం | పాండు,అగ్నిమాంద్యము | ,, | – |
| 36. | పటోలాది కషాయచూర్ణం | జ్వర,కామల,కుష్ఠ, విష | 25–50మి.లీ.క్వాధ పిప్పలిమరియుతేనెఅనుపానంతో | – |
| | | **గుగ్గులు** | | |
| 1. | అమృతాదిగుగ్గులు | వాతరక్తం,దుష్టవ్రణ చర్మ వికారాలు | 500మి.లీ.–1గ్రా. తిన్నతర్వాత వేడినీరుతో | గర్భిణీస్త్రీలు ఎక్కువకాలంవాడరాదు |
| 2. | గోక్షురాదిగుగ్గులు | ప్రమేహ,మూత్రకృచ్ఛ,మూత్రఘాత,అశ్మరీ,ప్రదర | ,, | ,, |
| 3. | కాంచనారగుగ్గులు | గలగండ,గండమాలఅపచి,అర్బుదం,గ్రంథి | 200మి.గ్రా1గ్రా.వేడి నీరుతో హరీతకీ క్వాధ | ,, ఖదిరసారం |
| 4. | కైశోరగుగ్గులు | వాతశోణిత,ప్రమేహపిడిక వ్రణ, కుష్ఠ | పాలు/యూషం/ముద్గ 3గ్రా. వేడినీరుతో | ,, |
| 5. | లాక్షణాదిగుగ్గులు | అస్థిభంగ,అస్థిచ్యుతి,అస్థిరుజ | వేడినీరుతో 3గ్రా.వరకు | ,, |
| 6. | నవకగుగ్గులు | స్థౌల్య,సంధిగతవాతం | 500గ్రా. వరకు వేడినీరు | ,, |
| 7. | రాస్నా గుగ్గులు | గృధ్రసీ, ఆమవాతం | 500గ్రా.–1గ్రా.వేడినీరుతో | ,, |
| 8. | సింహనాద గుగ్గులు | ఆమవాతం,వాతరక్తం,సంధిశూల,అగ్నిమాంద్యం | 3గ్రా. వరకు వేడినీరుతో | ,, |
| 9. | సప్తవింశాదిగుగ్గులు | పార్శ్వశూల,కాసశ్వాస,ప్రిష్ఠలా(భగందరము) | ,, | ,, |
| 10. | త్రిఫలాగుగ్గులు | భగందరము,ఆర్శ, నాడీవ్రణం,గుల్మ, శోధ | ,, | గర్భిణీలు,డయోరియాలో వాడరాదు. |

| | | | | |
|---|---|---|---|---|
| 11. | త్రయోదశాంగ గుగ్గులు | గృధ్రశి,సంధిగత,కటిగ్రహ | ,, | గర్భిణీలువాడరాదు |
| 12. | పునర్ణవాగుగ్గులు | వాతరక్తం,వృద్ధిరోగం,గృధ్రశి వస్తిగతశూల, ఆమవాతం | ,, | – |
| 13. | యోగరాజగుగ్గులు | ఆమవాతం,అగ్నిమాంద్యం సంధిగత వాతం | 3గ్రా.వరకు వేడినీరు రాస్నాసప్తకక్వాదం/తేనె వెల్లుల్లి రసంతో | – |

## ఘృతాలు

| క్ర. | మందుపేరు | ఉపయోగం | మోతాదు | జాగ్రత్తలు |
|---|---|---|---|---|
| 1. | బ్రాహ్మీఘృతం | అపస్మార,ఉన్మాద,స్మృతిక్షయ,బుద్ధిదౌర్బల్యం | 10–15 గ్రా.వేడినీరు,పాలుతో, | – |
| 2. | దాడిమాదిఘృతం | పాండు,పరిణామశూల,అగ్నిమాంద్యము | ,, | – |
| 3. | గుగ్గులుతిక్తక ఘృతం | వాతరోగాలు | .. | – |
| 4. | జాత్యాదిఘృతం | వ్రణదగ్ధ వ్రణ | పైపూతకుమాత్రం | – |
| 5. | జీవంత్యాదిఘృతం | తిమిర,నేత్రదోష | 10–15గ్రా.వేడిపాలతో/ నీటితోపరగడుపున | |
| 6. | కళ్యాణకఘృతం | భూతోన్మాదం,అపస్మారం,బాలగ్రహ,విషవికార గరవిష, స్మృతిదౌర్బర్య | ,, | – |
| 7. | క్షీరషట్పలఘృతం | గుల్మప్లీహ,గ్రహణీరోగము | 50గ్రా.వరకు వేడినీటితో | – |
| 8. | పంచతిక్త ఘృతం | దుష్టవ్రణ,త్వక్వికార | 10–15గ్రా. వేడినీటితో | – |
| 9. | పలాఘృతం | యోనివ్యాపత్తు | ,, | – |
| 10. | షట్పలవర్యాదిఘృతం | స్థౌల్యం, క్షయ | ,, | – |

